# శబ్దకౌముది

ఆంధ్ర నిఘంటువు

గ్రంథకర్త:
శిరోభూషణము వేంకటరంగాచార్యులు
పరిష్కర్త:
విద్వాన్, శతావధాని భమిడిపాటి అయ్యప్పశాస్త్రి

ప్రకాశకులు:
వేంకట్రామ అండ్ కో.
విజయవాడ-మద్రాసు

 1950 వెల రు. 5/-

శ్రీరస్తు.

# శబ్దకౌముది



## అ

అ. ఇది మొదటి అక్షరము.

అక్కఱ. ౧. ఏపనియొకగాని లేని తెలుపుగా. ౨. తప్పంతట కాను.

అంక. దే. వి. ప్రక్క. వై. పార్శ్వము.

అంకటాఁడు. దే. విశే. పట్టుదలగల వాఁడు. చలపాఁడు.

అంకణము. దే. వి. ౧. నలుపదరపు చోటు. ౨. తోట్టికట్టు. కక్ష్య.

అంకపాళి. సం. వి. ౧ ఒడ. తోడ. ౨. కౌఁగిలి.

అంకపొంకములు. దే. వి. బ. ౧. కోపము. ౨. పగ. రూ. అంకాపొంకములు. విశే. తీక్ష్ణము.

అంకము. త్స. వి. ౧. అంక. ౨. ఒడి. ౩. గుఱుతు. ౪. తావు. ౫. నాటకపరిచ్ఛేదము. ౬. సమీపము.

అంకించు. దే. క్రి. ౧. ఆడించు. ౨. త్రిప్పు. ౩. ఉల్లసిల్లు. ౪. అపహరించు. ౫. స్తుతించు.

అంకితము. త్స. విశే. గుఱుతు చేయఁబడినది. (ఆంగ్లమునందలి Dedicated అను దాని కీపదము సమానార్థకము గాఁగూడ వాడుచున్నారు.)

అంకిలి. దే. వి. ౧. కలఁత. ౨. అడ్డగింత. ౩. ఆపద. క్రి. అంకిలిపడు.

అంకెన్ను. దే. వి. ౧. దవుడక్రింది కన్ను. (వ్యవహారమున 'నీ పక్కెన్ను పడ' అను తిట్టుకలదు. ఈ 'అంకెన్ను' పదమే అట్లు మాఱియుండును.)

అంకురము. త్స. వి. ౧. మొలక. ౨. నీళ్ళు. ౩. రక్తము. క్రి. అంకురించు. (రూ) అంకూరము. అంకురి.

అంకురితము. త్స. విశే. మొలిచిన.

అంకుశము. } త్స. వి. ఏనుఁగుకుంభ
అంకుసము. } వై. వి. స్థలమునందుఁ బొడిచెడి యాయుధము.

అంకె. దే. వి. ఒకటి మొదలగు సంఖ్యలను దెలియఁజేయు రేఖ.

అంకెవన్నియ. ద్వ. వి. ఎక్కుటకు సాధనముగా గుఱ్ఱమున కిరుప్రక్కల వ్రేలాడు ఇనుపమెట్టు. (రూ) అంకవన్నె.

అంగ. దే. వి. కాలుచాఁచి పెట్టిన యడుగు.

అంగజుఁడు. త్స. విశే. ౧ మన్మథుఁడు. ౨ కొడుకు.

అంగడి. దే. వి. ౧. దుకాణము. ౨. కొలువుకూటము. ౩. రచ్చ.
అంగడికెక్కు. క్రి. రచ్చకెక్కు.
అంగణము. సం. వి. ఇంటిముంగిలి.
అంగద. దే. వి. ౧. ఆఁకలి. ౨. ఆపద. ౩. ఉత్సాహము. ౪. ఉపద్రవము. ౫. కోపము. ౬. దుఃఖము.
అంగదట్టము. దే. వి. పావడ. పరికిణీ.
అంగదుఁడు. త్స. వి. వాలికొడుకు.
అంగన. త్స. వి. ఆఁడుది.
అంగమచ్చెము. దే. వి. గుఱుతు.
అంగము. దే. వి. ౧ అందము. ౨
అంగరంగ భోగములు
త్స. దేవునికిఁజేయుభోగములవిధము.
త్స. వి. అవయవము.
అంగమొల. దే. వి. దిసమొల.
అంగరకా. దే. వి. చొక్కాయ. (అంగరక్షకశబ్దభవము.)
అంగలారుచు } దే. క్రి. ఏడ్చు. వి.
అంగలార్చు } అంగలాఁగపు.
అంగవస్త్రము. త్స. వి. ఉత్తరీయము.
అంగవేయు. దే. క్రి. బలముకొద్దికా లీడ్చిపెట్టు.
అంగారకుఁడు. త్స. వి. నవగ్రహములలో మూఁడవగ్రహము.
అంగారము. త్స. వి. ఇంగలము. బొగ్గు.
అంగి. దే. వి. చొక్కాయ. రూ. అంగీ. ఇది మీఁగాళ్లదాఁక జాఱును.

అంగిరసుఁడు. త్స. వి. అంగిరుఁడు
అంగిలి. దే. వి. లోకుత్తుక.
అంగీకరించు. త్స. క్రి. ఒప్పు. వి. అంగీకారము.
అంగుటము. దే. వి. బొటనవ్రేలు.
అంగుళము. } త్స. వి.౧ ఆఱుయవబీజ
అంగుష్ఠము. } ముల ప్రమాణము ౨. బొటనవ్రేలు.
అంగుళి. త్స. వి. వ్రేలు.
అంగుళీయకము. త్స. వి. ఉంగరము.
అంగూరు. దే. వి ద్రాక్షావిశేషము.
అంఘ్రి. త్స. వి. ౧. కాలు. ౨. వేరు.
అంచలము. త్స. వి. కొంగు (వస్త్రాంచలము.)
అంచితము. త్స. విణ. పూజితము.
అంచియ. } దే. వి. జాబులు లోనగు
అంచె. } వానిని మోసికొని పోవువారు త్రోవలో నిలుచుచోటు.
అంచె. వై. వి. హంస.
అంచెన. దే. వి. ఫలపరిమితిని ఊహించుట.(రూ)అంచెనా(Ostimation)
అంచెపదము. వై. వి. వ్రాఁతలో మఱచిన దానిని వ్రాయవలసినపుడు ఆ చోట నుంచు. పెట్టు ( X ) గుర్తు. దీనినే హంసపాదు, అందురు. సంస్కృతమున కాకపదమందురు.
అంచెయాన. వై. వి. హంసనడకవంటి నడకగల స్త్రీ.

అంచు. దే. వి. ౧. విధము. ౨. ఓర. 3. తుద. అంచుముట్టు=సమాప్తమగు.

అంజనము. త్స. వి. ౧. కాటుక. ౨. దీపపుఁగోడి.

అంజనాదేవి. త్స. వి. ౧. వాయుదేవుని భార్య. ఆంజనేయుని తల్లి. ౨. కాటుక.

అంజలి. త్స. వి. ౧. చేమోడ్పు. ౨. దోసిలి.

అంజె. దే. వి. అడుగు.

అంజు. క్రి. భయపడు.

అంట. దే. వి. ౧. అనుట. ౨. అడ. 3. కుట్టుడాకు. ౪. గుంపు; అంటఁగట్టు = కలిపికట్టు.

అంటగు. దే. క్రి. పైబడఁజేరు.

అంటరాని వేల్పు. వి. అగ్ని.

అంటి. దే. వి. అరఁటి. (రూ) అనఁటి.

అంటించు. దే. వి. ౧. కుట్టు. ౨. తగిలించు.

అంటు. దే. క్రి. ౧. తాఁకు. ౨. రాచు. వి. ౧. మైల. ౨. ముట్టు. 3. కూడిక. ౪. స్నేహము.

అంటుకత్తియ. / అంటుకత్తె. } దే. వి. ప్రియురాలు.

అంటుకాఁడు. దే. వి. ఇష్టుఁడు. ప్రియుఁడు.

అంటుకొనిపోవు. దే. వి. దొంగిలించుకొనిపోవు.

అంటుపడు. దే. క్రి. మైలపడు.

అంటుపోగులు. దే. వి. బ. చెవికి అంటియుండు భూషణములు.

అంటురాయి. దే. వి. సూదంటురాయి.

అంట్లు. దే. వి. బ. వంటి లోవని పాత్రములు.

అండ. దే. వి. ౧. దాపు. ౨. ఆశ్రయము, ఆసర. 3. వెనుక.

అండజము. త్స. వి. ౧. పక్షి. ౨. పాము. 3. చేప.

అండము. త్స. వి. ౧. గ్రుడ్డు. ౨. బుడ్డ.

అండా. దే. వి. నీళ్లకాగు.

అండి. / అండీ. } దే. వి. లోహపాత్రవిశేషము. నీళ్లకాగు.

అంత. దే. స. ౧. అన్ని. ౨. ఆ కొలఁది. వి. అప్పుడు. అవ్య. పిమ్మట.

అంతంత. వై. అ. కొంతదూరమున.

అంతఃకరణము. త్స. వి. లోపలి ఇంద్రియము.

అంతఃపురము. త్స. వి. ౧. మేడ. ౨. రాణులుండు తావు.

అంతఃపురి. త్స. వి. రాణులుండు తావు.

అంతకుఁడు. త్స. వి. యముఁడు.

అంతట. దే. అవ్య. అనంతరము.

అంతము. త్స. వి. ౧. కొన. ౨. నిజము. 3. చావు.

అంతరంగము. త్స. వి. మనస్సు.

అంతర్జ్ఞుఁడు. త్స. వి. తారతమ్యమెఱిఁగినవాఁడు.

అంతరము. త్స. వి. ౧. భేదము. ౨. తెఱపి. ౩. నడిమిచోటు. ౪. మఱుఁగు. ౫. మేర. ౬. వెలుపల. విణ. ౧. తనది. ౨. అన్యము.

అంతరాత్మను. త్స. వి. ౧. జీవాత్మ. ౨. పరమాత్మము.

అంతరాయము. త్స. వి. పనిచెఱుపు.

అంతరాళము. త్స. వి. మధ్యప్రదేశము.

అంతరించు. త్స. క్రి. ౧. చచ్చు. ౨. చెడు. ౩. కడచు.

అంతరిక్షము. త్స. వి. ఆకాశము. (రూ. అంతరీక్షము.)

అంతరీపము. త్స. వి. ద్వీపము.

అంతరీయము. త్స. వి. బట్ట.

అంతరువు. వి. ఎడము.

అంతర్గతము. త్స. విణ. మనస్సును బొందినది.

అంతర్ధానము. త్స. వి. మఱుఁగై పోవుట.

అంతర్ధి. త్స. వి. అంతర్ధానము.

అంతర్భావము. త్స.వి.లోపల ఇముడుట.

అంతర్భూతము. త్స. వి. లోపల ఇమిడినది.

అంతర్ముఖుఁడు. త్స. వి. వెలుపలి విషయములను వదలి పరమాత్మ వైపు తిరిగిన మొగముగలవాఁడు.

అంతర్యామి. త్స. వి. ౧. పరమాత్మ. ౨. జీవాత్మ.

అంతర్లాప. త్స. వి. ప్రశ్నోత్తరములు రెండును లోపలనే గూఢముగా నుండు పద్యము. లేక అట్టి సమస్య. (రూ) అంతర్లాపిక.

అంతర్వత్ని. త్స. వి. గర్భవతి.

అంతర్వాణి. త్స. వి. పండితుఁడు.

అంతర్హితము. త్స. వి. అంతర్ధానమైనది.

అంతల పొంతలవాఁడు. దే. వి. దూరపుచుట్టము.

అంతవట్టు. దే. స. ౧. అంతయు. ౨. అంతమాత్రము.

అంతస్తు. దే. వి. ౧. మఱుఁగుచోటు. ౨. తొట్టికట్టు. ౩. నిలువు. ౪. పరువు.

అంతిపురము. వై. వి. రాణివాసము.

అంతిమము. త్స. వి. కడపటిది.

అంతియ. వై. స. అంతమాత్రమే. రూ. అంతె. అంతే.

అంతు. దే. వి. ౧. లోతు. ౨. మొత్తము.

అంతె = అంతియ. (అంతమాత్రమే.)

అంతేవాసి. త్స. వి. శిష్యుఁడు.

అందంద. దే. అవ్య. అక్కడక్కడ.

అందకత్తియ. దే. వి. రూపవతి. రూ. అందకత్తె.

అందగాఁడు. దే. వి. చక్కనివాఁడు. క్రి. అందగించు.

అంబలి. దే. వి. పిండియును, నూకలును, చేర్చి అనుకగా వండినది.
అంబష్ఠుఁడు. త్స. వి. ౧. బ్రాహ్మణునికి వైశ్య స్త్రీ వలనఁ బుట్టినవాఁడు. ౨. మావటివాఁడు.
అంబారము. దే. వి. వడ్లరాశి. (రూ. అంబారు.)
అంబారి. దే. వి. ఏనుఁగుమీఁద వైచెడి పీట.
అంబాలిక. త్స. వి. ౧. తల్లి. ౨. కాశిరాజు చిన్నకూఁతురు.
అంబిక. త్స. వి. తల్లి. ౨. పార్వతి. 3. కాశిరాజు నడిమికూఁతురు.
అంబు. దే. వి. బాణము. (రూ. అమ్ము.)
అంబుజము. త్స. వి. ౧. కమలము. ౨. వాసకోయిల.
అంబుజాసనుఁడు. త్స. వి. బ్రహ్మ.
అంబుధి. త్స. వి. సముద్రము.
అంబునిధి. త్స. వి. ,,
అంబురాశి. ,, ,, ,,
అంబురుహము. త్స. వి. పద్మము.
అంబువాహము. త్స. వి. మేఘము.
అంబువు. త్స. వి. నీరు.
అంబే. దే. వి. ఆవుదూడకూఁత.
అంబేద. దే. విశ. దిట్టతనము లేనివాఁడు.
అంభస్సు. త్స. వి. నీరు.
అంభోజము. త్స. వి. పద్మము.
అంభోజయోని. త్స. వి. బ్రహ్మ.
అంభోదము. త్స. వి. మేఘము.
అంభోధి. త్స. వి. సముద్రము. (రూ) అంభోనిధి.
అంభోరాశి. త్స. వి. సముద్రము.
అంభోరుహము. త్స. వి. పద్మము.
అంశహరుఁడు. త్స. వి. అంశమును హరించువాఁడు.
అంశము. త్స. వి. ౧. భాగము. ౨. వంతు.
అంశుకము. త్స. వి. సన్నని బట్ట.
అంశుమాలి. త్స. వి. సూర్యుఁడు.
అంశువు. త్స. వి. ౧. కాంతి. ౨. కిరణము.
అంసము. త్స. వి. బుజము.
అంసలుఁడు. త్స. వి. మంచిమూఁపురము గలవాఁడు.
అఁట. దే. అవ్య. వార్తను జెప్పుటను దెలుపును.
అకట. } దే. అవ్య. అయ్యో.
అకటా. }
అకటకటము. } దే. విశ. తాఱుమాఱు.
అకటాకటము. }
అకరు. సం. కుంజరము. రూ. అకరువు.
అకర్మకము. త్స. వి. కర్మములేనిది.
అకస్మాత్తుగా. త్స. క్రి. విశ. ఉన్నట్టుండి.
అకాండము. త్స. విశ. ఆకస్మికమైనది.
అకాలము. త్స. విశ. అవర్షాకాలము.

అకించనుఁడు. త్స. విశే. కొంచెమైనను లేనివాఁడు. నిరుపేద.

అకించిత్కరము. త్స. విశే. పనికిరానివ. కొంచెమును జేయలేని.

అకుంఠితము. త్స. విశే. ౧. మొక్కవోని. ౨. అడ్డులేనిది.

అకుతోభయుఁడు. త్స. విశే. దేనివలనను భయములేనివాఁడు.

అకూపారము. త్స. వి. సముద్రము.

అకృతాత్ముఁడు. త్స. విశే. అశిక్షితబుద్ధికలవాఁడు.

అకృతాస్త్రుఁడు. త్స. విశే. అస్త్రము లభ్యసించనివాఁడు.

అక్క. దే. వి. తోఁబుట్టువులలోఁ బెద్ద.

అక్కజపడు. దే. క్రి. ఆశ్చర్యమొందు.

అక్కజము. దే. వి. ఆశ్చర్యము.

అక్కటిక. దే. వి. కనికరము.
అక్కటికము.

అక్కడ. దే. క్రి. ౧. ఆచోటు. ౨. అవల.

అక్కఱ. దే. వి. ౧. లోపము. ౨. శ్రద్ధ. ౩. ముఖ్యమైనపని. క్రి. అక్కఱపడు.

అక్కఱవాఁడు. దే. విశే. అక్కఱ కలవాఁడు.

అక్కఱపడు. క్రి. అవసరపడు.

అక్కలకర. దే. వి. జ్వరకోపాదులఁ బోఁగొట్టునట్టి మూలిక.

అక్కళించు. దే. క్రి. పొట్ట తగ్గించు. లేక ముడుచు.

అక్కసము. దే. వి. ౧. దయ. ౨. ఆగ్రహము.

అక్కసు. దే. వి. కోపము. రూ. అక్కస్సు. ఆగ్రహము.

అక్కు. దే. వి. రొమ్ము.

అక్రమము. త్స. వి. సరితప్పు.

అక్రోధనుఁడు. త్స. విశే. కోపములేనివాఁడు.

అక్షతలు. త్స. వి. సేసఁబాలు.

అక్షద్యూతము. త్స. వి. జూదము.

అక్షమాల. త్స. వి. ౧. అకారాదిక్షకారాంత వర్ణమాలిక. ౨. అరుంధతి. 3. తావళము.

అక్షము. త్స. వి. బండియిరుసు.

అక్షరము. త్స. వి. ౧. అకారాద్యక్షరము. ౨. బ్రహ్మము. 3. ముక్తి.

అక్షరాస్యుఁడు. త్స. విశే. అక్షరముఖుఁడు.

అక్షి. త్స. వి. కన్ను.

అక్షయము. త్స. విశే. క్షయములేని.

అక్షింతలు. వై. వి. బ. అక్షతలు.

అక్షౌహిణి. త్స. వి. సేనావిశేషము. (౨౧,౮౭౦ రథములు: ౨౧,౮౭౦ ఏనుగులు, ౬౫,౬౧౦ గుఱ్ఱములు, ౧,౦౯,3౫౦ కాల్బలము.) (రూ. అక్షోహిణి.)

అఖండము. త్స. విశ. పూర్ణమైనది.
అఖాతము. త్స. విశ. మనుష్యులచే త్రవ్వఁబడని సముద్రికము.
అఖిలము. త్స. విశ. అంతయు.
అగచాట్లు. దే. వి. బ. ఇడుము.
అగడిత. దే. వి. కోటచుట్టుత్రవ్వఁబడిన జలాధారము. రూ. అగడ్త.
అగడు. దే. వి. నింద. క్రి. అగడుపడు.
అగతికము. త్స. విశ. దిక్కుమాలినది.
అగత్యము. దే. విశ. అవశ్యము.
అగదంకారుఁడు. త్స. వి. వైద్యుఁడు.
అగదము. త్స. వి. మందు.
అగప. దే. వి. అబక.
అగపడు. దే. క్రి. కనఁబడు. వి. అగపాటు.
అగమ్యము. త్స. విశ. ౧. గ్రహింపరానిది. ౨. పోరానిది.
అగసాలె. దే. వి. బంగారు పనిని చేయువాఁడు.
అగస్త్యుఁడు. త్స. వి. ఒకానొకముని.
అగాదు. దే. వి. తుపాకిలోను వానికి నిప్పంటించుట.
అగాధము. త్స. వి. ౧. మిక్కిలి లోతుగలది. ౨. బొక్క.
అగారము. త్స. వి. ఇల్లు.
అగిని. వై. వి. నిప్పు.
అగు. దే. క్రి. ౧. అవు. ౨. కలుగు.
అగుఁగదే. దే. అవ్య. ౧. వింతను దెలుపును. ౨. ఔఁగదే.
అగుఁగా. ౧. అదియుక్తమే. ౨. సరేకాని.
అగుఁగాదను. దే. క్రి. ౧. ఇది యుక్తము ఇది అయుక్తము అని ఆలోచించు. ౨. ఆలోచించు.
అగుఁగాములు. వి. అగుట కాకపోవుటలు.
అగుఁబొమ్మ. దే. అవ్య. సరే.
అగుదెంచు. దే. క్రి. అగు.
అగుర.
అగురా. దే. అవ్య. అవుర.
అగోచరము. త్స. విశ. గోచరము కానిది.
అగ్గపడు. దే. క్రి. అగపడు. వి. అగ్గపాటు.
అగ్గము. విశ. అధీనము.
అగ్గలము. దే. విశ. అధికము. వి. అగ్గలిక.
అగ్గలించు. దే. క్రి. పూను.
అగ్గలిక. వి. ౧. అధికము. ౨. ఉత్సాహము. రూ. అగ్గలికము.
అగ్గి. వై. వి. నిప్పు.
అగ్గించు. దే. క్రి. పొగడు.
అగ్గికంటి. దే. వి. నిప్పు కన్నుకలవాఁడు. శివుఁడు.
అగ్గువ. దే. వి. చవుక.
అగ్ని. త్స. వి. ౧. నిప్పు. ౨. చిత్రమూలము.
అగ్నికణము. త్స. వి. నిప్పు.

అగ్నిచిత్తు. త్స. విశే. ఆహితాగ్ని.
అగ్నిసాక్షికము. త్స. విశే. అగ్ని యెదుట జరిగినది.
అగ్నిహోత్రము. త్స. వి. నిప్పు.
అగ్రగణ్యుఁడు. త్స. విశే. ముఖ్యుఁడు.
అగ్రగామి. త్స. విశే. ముందు నడుచువాఁడు.
అగ్రజన్ముడు. త్స. వి. ౧. బ్రాహ్మణుఁడు. ౨. తనకు ముందు పుట్టినవాఁడు. అన్న. 3. బ్రహ్మ.
అగ్రజుఁడు. త్స. వి. అన్న.
అగ్రణి. త్స. విశే. ముఖ్యుఁడు.
అగ్రము. త్స. వి. ౧. కొన. ౨. ఎదురు. 3. దగ్గఱ. ౪. గుంపు.
విశే. ౧. మొదటిది. ౨. ముఖ్యము. 3. అధికము.
అగ్రహారము. త్స. వి. బ్రాహ్మణుల పోషణార్థము రాజులిచ్చిన భూమి.
అగ్రాహ్యము. త్స. విశే. గ్రహింపరానిది.
అగ్రిముఁడు. త్స. విశే. ముందటివాఁడు.
అగ్రియుఁడు. త్స. విశే. ,,
అగ్రీయుఁడు. త్స. విశే. ,,
అగ్రేసరుఁడు. త్స. విశే. ,,
అఘమర్షణము. త్స. వి. పాపము నశించుటకై జపించు మంత్రము.
అఘము. త్స. వి. ౧. పాపము. ౨. శోకము.
అచరము. త్స. విశే. కదలనిది.
అచలము. త్స. వి. ౧. కొండ. ౨. మేకు. విశే. కదలనిది.
అచిరము. త్స. విశే. అల్పకాలముండునది.
అచేతనము. త్స. వి. అప్రాణి.
అచ్చిక బుచ్చిక. దే. వి. అభేదము; కలుపుకోలుతనము. రూ. అచ్చికలు బుచ్చికలు.
అచ్చివచ్చు. దే. క్రి. అయివచ్చు.
అచ్చెరువడు. దే. క్రి. ఆశ్చర్యపడు. వి. అచ్చెరుపాటు.
అచ్చెరువు. దే. వి. వింత.
అచ్చెరువుపడు. క్రి. అచ్చెరువడు.
అచ్యుతము. త్స. విశే. ౧. జారనిది. ౨. నాశములేనిది.
అచ్యుతుఁడు. త్స. వి. నాశము లేనివాఁడు. (విష్ణువుగాని శివుఁడుగాని.)
అచ్చోటు. దే. వి. ఏ. ఆస్థానము. రూ. అచోటు. అచ్చటు. అచ్చోటు.
అచ్చనగండ్లు. దే. వి. బ. బాలికలు ఆడుకొను నాటకు పేరు.
అచ్చము. { దే. వి. ౧. మైల లేనిది. ౨. దట్టము.
దీనికి వ్యుత్పత్తియందు అంత్యవర్ణలోపమగును. అచ్చె తెలుపు. సొ.
అచ్చెర. వై. వి. అప్సరస.
అచ్చు. దే. క్రి. ౧. అప్పగించు. ౨. ఇచ్చు. 3. దండుగను ఇచ్చు. వై. వి. ముద్ర. విశే. శుద్ధము.

అచ్చుకట్టు. దే. వి. ౧. ఏర్పఱచు. ౨. గనిమను జక్కఁజేయు.

అచ్చుకూటము. దే. వి. ముద్రవైచెడియిల్లు.

అచ్చుకోలు. దే. వి. తానియ్యనక్కఱలేనిసొమ్ము లోనగువానిని ఇచ్చుటకు ఇయ్యకోలు.

అచ్చుదల. దే. వి. ౧. అచ్చివచ్చుట. ౨. అప్పువడుట.

అచ్చొత్తు. దే. క్రి. ముద్రించు.

అచ్చోటు. వి. ఆచోటు.

అచ్ఛము. త్స. విణ. స్వచ్ఛము; తెల్లనిది.

అచ్ఛేద్యము. విణ. ఛేదింపరానిది.

అజ. త్స. వి. మేఁక (ఆఁడుది.)

అజగరము. త్స. వి. కొండచిలువ.

అజగవము. త్స. వి. శివునివిల్లు.

అజము. త్స. వి. మఁగమేఁక.

అజయ్యము. త్స. విణ. జయింపశక్యము గానిది.

అజరుఁడు. త్స. విణ. ముదిమిలేనివాఁడు.

అజర్యము. త్స. విణ. క్షీణింపనిది.

అజస్రము. త్స. విణ. ఎల్లప్పుడు.

అజాగళస్తనము. త్స. వి. మేఁకమెడచన్ను.

అజాగ్రత్త. త్స. వి. జాగరూకతలేమి.

అజాజీవుఁడు. త్స. విణ. మేఁకలవలన బ్రదుకువాఁడు.

అజాతశత్రువు. త్స. వి. పుట్టనివిరోధికలవాఁడు. ధర్మరాజు.

అజినము. త్స. విణ. లేడి మొదలగువాని తోలు.

అజిరము. త్స. వి. ముంగిలి.

అజీర్ణము. త్స. విణ. జీర్ణముగానిది. వి. అజీర్ణవ్యాధి.

అజుఁడు. త్స. వి. ౧. బ్రహ్మ. ౨. విష్ణువు. ౩. శివుఁడు, ౪. సూర్యవంశపు రాజులలో నొకఁడు.

అజేయము. త్స. విణ. గెలువఁదగనిది.

అజ్ఞాతము. త్స. విణ. తెలియఁబడనిది.

అజ్ఞాతవాసము. త్స. వి. పరులకుఁ దెలియకుండ వర్తించుట.

అజ్ఞానము. త్స. వి. మూఢత్వము.

అజ్ఞుఁడు. త్స. విణ. తెలియనివాఁడు.

అజ్ఞేయము. త్స. విణ. తెలియరానిది.

అజ్జారము. దే. వి. మొగసాల. రూ. హజారము.

అజ్జె. దే. వి. ౧. అడుగు. ౨. అదను. ౩. తగిన. ౪. బాగు.

అజ్జరే. / అజ్జిరే. / అజ్జారే. / అజ్జారె. — దే. అవ్య. శాబాసు

అట. దే. వి. ఏ. ౧. అక్కడ. ౨. ఆకాలము. ౩. అ. (అటమీఁద= ఆ తరువాత.)

అటమట. దే. వి ౧. మోసము. ౨. బాధ. ౩. శోకము. రూ. అట

మటము. క్రి. అటుమటించు. విణ. అటువటీఁడు; అటుమటుకాఁడు; అటుమటుకత్తె.

అటుమున్న. అవ్య. అంతకుమున్న.

అటుమొన్న. దే. వి. మొన్నటికిం బూర్వదినము. రూ. అటుమొన్న.

అటవి. త్స. వి. అడవి.

అటీక. దే. వి. మంటితోఁ జేసినపాత్ర. రూ. అట్టిక.

అటు. దే. అవ్య. ఆప్రకారము. (రూ. అట్లు.)

అటుండు. దే. క్రి. ఆలాగుననుండు.

అటుక. దే. వి. ఇంటిలోపల గోడలమీఁద అడ్డముగ పలకలు మెదలగువానిచే మంచెవలె ఏర్పాటైనది. రూ. అట్టుక.

అటుకులు. దే. వి. అడుకులు.

అటులు. దే.అవ్య. అట్లు. ఆప్రకారము.

అటువంటి. దే. విణ. అట్టి.

అటువలె. దే. వి. అట్లు.

అటె. దే. అవ్య. ౧. వింతను దెలుపెడి. ౨. దుఃఖమును దెల్పెడి.

అట్టు. దే. వి. ౧. మెండెము. ౨. కాగితపు అట్టు. తోలు అట్టు. మొ. 3. గుంపు (వెండ్రుకలు అట్టలుగట్టినవి.)

అట్టహాసము. త్స. వి. ౧. పెద్దనవ్వు. ౨. ఆడంబరము. రూ. అట్టట్టహాసము.

అట్టి. దే. విణ. అటువంటి.

అట్టిఁడు. దే. విణ. అటువంటివాఁడు.

అట్టుగ. దే. వి. అటుక.

అట్టె. అవ్య. ౧. అంటు, (౧. ఆక్షేపము, ౨. ఆశ్చర్యము. 3. ఉత్కర్షము. ౪. ప్రశ్నము వీనిని దెలుపును) ౨. వెంటనే.

అట్టెడ. దే. ౧. వంతెన. ౨. పూడికఎత్తుటకు ఉపయోగపడుతట్టు.

అట్టము. ప్రాకృతసమము. ఎనిమిది పన్నములుగల వేదభాగము.

అడ. దే. వి. ౧. ముద్ద. ౨. ఆకారము.

అడంకువ. దే. వి. అణంకువ.

అడఁగారు. క్రి. ఉపశమిల్లు.

అడఁగు. దే. క్రి. ౧. తగ్గు. ౨. శాంతించు. 3. వంగు. ౪. క్షీణించు.

అడఁచు. దే. క్రి. అడఁగించు.

అడకత్తెర. దే. వి. అడకొత్తు.

అడకము. దే. విణ. లోపల అణఁగినది.

అడకించు. దే. క్రి. ౧. గేలిసేయు. ౨. మోసము సేయు.

అడకొత్తు. దే. వి. అడకత్తెర. పోఁకలు గత్తిరించు కత్తెర.

అడగొను. దే. క్రి. ముద్దకట్టు.

అడగోలుగొను. దే. క్రి. అపహరించు.

అడజడి. దే. వి. ౧. ఆపద. ౨. దుఃఖము. క్రి. అడజడిపెట్టు. రూ. అలజడి.

అడప. దే. విణ. తాంబూలాలను చుట్టి

యిచ్చు సేవకుఁడు లేక సేవకురాలు.

**అడపకత్తియ.** } దే. వి. అడపము పెట్టు
**అడపకత్తె.** } కొనియుండునది.

**అడపట్టె.** దే. వి. ౧ విత్తనము చల్లిన పిమ్మట చేనిలో మిట్టపల్లము సమమగుటకై యెడ్లను కట్టి త్రోలెడు ద్రాసు. ౨. దిండు.

**అడపము.** దే. వి. వక్కలాకులతిత్తి. ౨. మంగలతిత్తి.

**అడపాడ.** దే. వి. జాడ.

**అడరు.** దే. క్రి. ౧. ప్రయత్నించు. ౨. కలుగు. 3. వేగపడు. ౪. అతిశయించు. వి. ఆధిక్యము.

**అడరుచు.** } దే. క్రి. ౧. అడరించు.
**అడర్చు.** } బాణమును ప్రయోగించు.

**అడలు.** దే. క్రి. ౧. ఏడ్చు. ౨. విలపించు. 3. శోకించు. వి. శోకము. క్రి. అడలుకొను.

**అడవి.** దే. వి. కాననము.

**అడవికుక్క.** దే. వి. తోడేలు.

**అడసాల.** దే. వి. వంటయిల్లు.

**అడావడి.** దే. వి. వేగిరపాటు. రూ. అడావుడి.

అడితి. దే. వి. ఒక వర్తకుడు మఱియొకఁడంపెడు సరకులను అమ్మి తిరిగి వానికి సరకులను కొని పంపుటకై వానియొద్ద నూటికి ఇంత అని తీసుకొనెడు తఱుఁగు.

**అడిత్రాగుడు.** దే. వి. క్షామము.

**అడిదము.** దే. వి. కత్తి. ఖడ్గము.

**అడియఁడు.** దే. వి. పాదసేవకుఁడు.

అడియరి. దే. వి. కింకరుఁడు.

అడియాలము. దే. వి. గుఱుతు.

అడియాస. దే. వి. వట్టియాస.

**అడుకు.** దే. క్రి. దొంతిగాఁ జేర్చు. వి. దొంతి.

అడుకులు. దే. వి. అటుకులు.

అడుగంటు. దే. క్రి. వట్టు.

**అడుగు.** దే. వి. ౧. పాదము. ౨. క్రిందు. క్రి. ౧. యాచించు. ౨. ప్రశ్నచేయు. విశ. అధమము. (రూ. అడుగు. అడ్గు)

అడుగుకొను. దే. క్రి. ౧. ప్రార్థించు. ౨. యాచించు. వి. అడుగుకోలు.

అడుచు. దే. క్రి. కొట్టు. వి. అడుపు.

అడువు. దే. వి. అడుగు.

అడువుఁబుట్టువు. దే. వి. కాఁపువాఁడు.

అడుసు. దే. వి. బురద.

అడ్డంకి. దే. వి. అడ్డి.

అడ్డకట్టు. దే. వి. ఆనకట్టు. క్రి. అడ్డకట్టు.

అడ్డకట్లు. దే. వి. అడ్డి. విఘ్నము.

అడ్డకొడమ. దే. వి. చేఁపలను బట్టుటకు ఉపయోగించు పనిముట్టు.

అడ్డగాలు. దే. వి. అడ్డముగా పెట్టిన కాలు.

అడ్డగించు. దే. వి. అడ్డకట్టు.

అడ్డగొడ్డము. దే. వి. వక్రోక్తి.

అడ్డగోలుగా. క్రి. విణ. ప్రసక్తిలేకుండ.
అడ్డదిడ్డము. దే. విణ. అక్రమము. రూ. అడ్డాదిడ్డము, అడ్డాదిడ్డ.
అడ్డపట్టియ. } దే. వి. ౧. చేనును పదును
అడ్డపట్టె. } పఱచెడి పలక. ౨. అడ్డముగానుండు పక్కె.
అడ్డపడు. దే. క్రి. అడ్డమువచ్చు. వి. అడ్డపాటు.
అడ్డపాప. దే. వి. చేతులలో నుంచుకొనఁదగిన శిశువు.
అడ్డము. దే. వి. అడ్డి. ఆటంకము.
అడ్డవాటు. దే. వి. అడ్డముగాఁగొట్టిన దెబ్బ.
అడ్డవాస. దే. వి. స్త్రీలు ముక్కున ధరించు నగ.
అడ్డసాళులు. } దే. వి. బ. పాచికలు.
అడ్డసాళ్లు. }
అడ్డాఁడ్డి. దే. విణ. అక్రమము.
అడ్డి. దే. వి. ఆటంకము.
అడ్డిగలు. దే.వి. బ. స్త్రీలు కంఠమున వైచికొను సొమ్ములలో నొకటి.
అడ్డిపడు. దే. క్రి. అడ్డుపడు.
అడ్డు. దే. క్రి. ఆటంకమగు. వి. అడ్డగింత.
అడ్డుగడ. దే. వి. ౧. గడియప్రమాను. ౨. అభ్యంతరము.
అణఁకువ. దే. వి. అడఁకువ. క్రి. అణఁగు.
అణఁగారు. దే. క్రి. శాంతించు.
అణఁగు. దే. క్రి. అడఁగు.
అణా. హిం. వి. రూపాయలో పదునారవభాగము.
అణిమ. త్స. వి. ఎనిమిది విధములగు నైశ్వర్యములలో ఒకటి. (సూక్ష్మతచేత పొందఁబడునది.) (మహిమము, గరిమము, లఘిమము, ప్రాప్తము, కామ్యము, ఈశత్వము, వశిత్వము. ఇవి తక్కినవి.)
అణువు. త్స. వి. ౧. పరువడ్లు, ౨. లేశము. విణ. అల్పము.
అతఁడు. దే. స. ఆ శబ్దమునకు మహద్దర్శక పుంలింగైకవచనము.
అతకరించు. దే. క్రి. క్రిందుపఱచు
అతనుఁడు. త్స. వి. దేహములేనివాఁడు. మన్మథుఁడు.
అతర్కితోపనతము. త్స. విణ. తలవని తలంపుగా సంభవించినది.
అతలకుతలము. దే.విణ.తాఱుమాఱైనది.
అతలము. త్స. వి. పాతాళము.
అతిక్రమము. త్స. వి. మీఱుట. క్రి. అతిక్రమించు.
అతిక్రాంతము. త్స. వి. ౧. దాటినది. ౨. దాటఁబడినది.
అతిగండము. త్స. వి. ఇరువదియేడు యోగములలో ఒకటి.
అతిగహనము. త్స. విణ. మిక్కిలి లోఁతైనది.

అతిథి. త్స. వి. ౧. విందు. ౨. కుశుని కొడుకు.

అతిమాత్రము. త్స. విశే. మితిమీఱినది.

అతిరథుఁడు. త్స. వి. పెక్కు విలుకాండ్రతోఁ బోరునట్టి యోధుఁడు; ఉత్తమరథికుఁడు.

అతిరసము. త్స. వి. ౧. అప్పచ్చి. ౨. తినుబండారములలో ఒకటి.

అతిరిక్తము. త్స. విశే. అతిశయించినది.

అతిరేకము. త్స. వి. హెచ్చు. అతిశయము.

అతివ. దే. వి. ౧. ఆఁడుది.

అతివాదము. త్స. వి. అధికవాదము. విశే. అతివాది.

అతివాసము. త్స. వి. శ్రాద్ధదినమునకు ముందటిదినము.

అతివృష్టి. త్స. వి. దేశమునకుఁ గీడు కలుగఁ జేయునట్టివాన. (మిక్కిలి వాన.)

అతివేలము. త్స. విశే. మేరమీఱినది.

అతిశయము. త్స. వి. ఆధిక్యము.

అతిశయితము. త్స. విశే. మీఱఁబడినది.

అతీంద్రియము. త్స. విశే. ఇంద్రియములకు గోచరింపనిది.

అతీతము. త్స. విశే. కడచినది.

అతుకు. దే. వి. అతుకుట. ౨. అతికిన చోటు. క్రి. అంటుకొను. రూ. అదుకు.

అతులము. / అతులితము. } త్స. విశే. సాటిలేనిది.

అత్త. దే. వి. ౧. మగనితల్లి. ౨. పెండ్లముతల్లి. త్స. వి. ౧. అక్క. ౨. తల్లి.

అత్తమిల్లు. దే. క్రి. ౧. పరుండు. ౨. ఒఱగు. ౩. అంటియుండు.

అత్తరము. దే. వి. వేగము. (రూ. ఆత్రము.)

అత్తరు. / అత్తరువు } దే. వి. మంచివాసన తైలము.

అత్తలము. దే. వి. ఈఁటె.

అత్తి. దే. వి. మేడిచెట్టు.

అత్తు. దే. క్రి. ౧. కలుగు. ౨. కూడు.

అత్తెము. దే. వి. హస్తకవచము.

అత్తెసరు. దే. వి. గంజివారకుండ అన్నముతో నీరు ఇమిడిపోవునట్లుడక పెట్టెడి యెసరు.

అత్యంతము. త్స. వి. విశే. అధికము.

అత్యయము. త్స. వి. ౧. నాశము, ౨. దుఃఖము.

అత్యాచారము. త్స. వి. అనుచితాచారముల ననుష్ఠించుట.

అత్యాహితము. త్స. వి. ౧. మహాభయము, ౨. సాహసకృత్యము.

అత్రి. త్స. వి. ఒకమహర్షి.

అథర్వము. త్స. వి. ఒకవేదము.

అదంత్రము. దే. విశే. స్వాతంత్ర్యము తప్పినది.

అదటు. దే. వి. గర్వము.

అదను. దే. వి. సమయము. రూ. హదను.

అదపు. దే. వి. భయము. (అదసాజ్ఞలు)
అదయుఁడు. త్స. వి. దయలేనివాఁడు.
అదరు. దే. క్రి. చలించు. వి. ౧. మర్మ స్థానము, ౨. నిష్పుకణములు.
అదలు. దే. క్రి. బెదరు.
అదలుచు. } దే. క్రి. కోపముతో గర్జించు. వి. అదలుపు. అదల్పు.
అదల్చు. }
అదవద. దే. వి. కలత. క్రి. అదవదపడు.
అదాటు. వై. అవ్య. ఉన్నట్టుండి.
అది. దే. స. ఆ శబ్దమునకు అమహ దర్థక ప్రథమైకవచనము.
అదిగొ. } దే. అవ్య. చూపుటను దెలుపును. రూ. అదుగో.
అదిగో. }
అదితి. త్స. వి. కశ్యపుని భార్య.
అదిర. } దే. అవ్య. ఔరా. రూ. అద్దిర, అద్దిరా.
అదిరా. }
అదిరిపడు. దే. క్రి. ఉలికిపడు. వి. అదిరిపాటు.
అదుకు. దే. క్రి. అతుకు.
అదుము. దే. క్రి. అణఁచు. వి. అదుముడు.
అదురు. దే. క్రి. కదలు. వి. అగురుగడ. రూ. అదురుచు, అదుర్చు, అద్రుచు.
అదురుగుండియ. దే. వి. పిటికి.
అదురువేటు. దే. వి. కొయ్యలో ఇనుపగొట్టములునాటించి అందు మందుగట్టించి బెదరులాగున వేయువట్టి ప్రేటు.

అదృశ్యకరణము. త్స. వి. కనఁబడకుండఁ జేయుట. (ఇది ఇంద్రజాలములలో నొకటి.)
అదృష్టము. త్స.వి. చూడఁబడనిది. (సుఖదుఃఖాదులు.)
అదె=అదిగో.
అదే= ,,
అద్ద. దే. వి. ౧. సగము. ౨. అరసోల. (అద్దమరేయి. ము. చోట 'మ' వర్ణముగూడ నుండును.)
అద్దకము. దే. వి. వస్త్రమునకు వేయు రంగు.
అద్దమరేయి. దే. వి. చెటిసగమురాత్రి.
అద్దము. దే. వి. మొగము చూచుకొనెడి గాజుపెంకు.
అద్ది. దే. వి. అది.
అద్దియ. } దే. వి. బాఁడుగ.
అద్దె. }
అద్దు. దే. క్రి. ౧. రంగువేయు. ౨. మేర. రూ. హద్దు.
అద్భుతము. త్స. వి. వింత. విశే. వింతయైనది.
అద్రి. త్స. వి. ౧. కొండ. ౨. చెట్టు. 3 సూర్యుడు.
అద్రుచు. దే. క్రి. అదురుచు. (ఇందలి 'అ' కారము లఘువు.)
అద్వయము. త్స. వి. అద్వైతము.
అద్వితీయము. త్స. విశే. సాటిలేనిది.

అద్వైతము. త్స. వి. ఆదిశంకరుల మతము. జీవాత్మలొక్కరే అని వాదించుమతము.
అద్వైతి. త్స. విణ. అద్వైత మవలంబించినవాఁడు.
అధమము. త్స. విణ. తక్కువైనది.
అధఃకరించు. త్స. క్రి. క్రిందుపఱచు. అవమానపఱచు.
అధమర్ణుఁడు. త్స. విణ. అప్పుకొన్నవాఁడు. (వ్యతిరేకపదము ఉత్తమర్ణుఁడు.)
అధరకాయము. త్స. వి. దేహము యొక్క క్రిందిభాగము.
అధరోత్తరము. త్స. విణ. తాఱుమాఱైనది. తలక్రిందైనది.
అధరము. త్స. వి. పెదవి. విణ. ౧. క్రిందిది. ౨. తక్కువైనది.
అధికము. త్స. వి. అర్థాలంకారములలో ఒకటి. విణ. మిక్కిలియైనది.
అధికరణము. త్స. వి. ౧. అధికారము. ౨. ఆధారము. 3. న్యాయవిచారణస్థలము.
అధికారము. త్స. వి. పరిపాలనము. అధ్యక్షత.
అధికారి. త్స. వి. అధికారముగలవాఁడు.
అధిక్షేపించు. త్స. క్రి. ౧. నిందించు. ౨. బెదరించు.
అధిగతము. త్స. విణ. పొందఁబడినది. ౨. చదువఁబడినది.
అధిగమించు. త్స. క్రి. పొందు.
అధిజ్యము. త్స. విణ. మోపెట్టినది.
అధిత్యక. త్స. వి. కొండమీఁది నేల. నెత్తము.
అధిదేవత. త్స. వి. అభిమానదేవత.
అధిపతి. త్స. వి. రాజు.
అధినాథుఁడు. త్స. విణ. సర్వాధికారి.
అధిభూతము. త్స. విణ. భూతములందెల్ల వర్తించునది. పరమాత్మ.
అధిరూఢము. త్స. విణ. ఎక్కినది.
అధిరోహణము. త్స. వి. ఎక్కుట.
అధిష్ఠాత. త్స. విణ. అధ్యక్షుఁడు.
అధిష్ఠానము. త్స. వి. ఉనికిపట్టు. వాసస్థానము.
అధీతము. త్స. విణ. చదువబడినది.
అధీతి. త్స. విణ. చక్కఁగాఁ జదివినవాఁడు.
అధీనము. త్స. విణ. అగ్గము. ఆయత్తము.
అధీశుఁడు. త్స. విణ. ప్రభువు.
అధీశ్వరుఁడు. త్స. వి. సామంతరాజులచే గొలువఁబడు ప్రభువు.
అధునాతనము. త్స. వి. ఆధునికము.
అధృష్టుఁడు. త్స. విణ. పెంకితనము లేనివాఁడు.
అధృష్యుఁడు. త్స. విణ. ఎదిరింపరానివాఁడు.
అధైర్యము. త్స. వి. ధైర్యవిహీనత.
అధోక్షజుఁడు. త్స. వి. విష్ణువు.

అధోగతి. త్స. వి. హీనస్థితి.
అధోభాగము. త్స. వి. క్రిందిభాగము.
అధోభువనము.త్స.వి. పాతాళలోకము.
అధ్యక్షుడు. త్స. వి. అధిపతి. క్రి. అధ్యక్షించు.
అధ్యయనము. త్స. వి. ౧. చదువుట. ౨. వేదముచదువుట.
అధ్యవసాయము. త్స. వి. నిశ్చయము.
అధ్యాత్మము. త్స. విశ. ఆత్మస్థస్వభావము.
అధ్యాపకుఁడు. త్స. విశ. చదువుచెప్పువాఁడు.
అధ్యాపనము. త్స. వి. ౧. చదువుచెప్పుట. ౨. వేదముచెప్పుట.
అధ్యాయము. త్స. వి. పుస్తకములోని భాగము.
అధ్యాయి. త్స. విశ. చదువువాఁడు.
అధ్యాసనము. త్స. వి. కూర్చుండుట.
అధ్యాసించు. త్స. క్రి. కూర్చుండు.
అధ్యాహారము. త్స. వి. లేనిపదములు కొన్నిటిని తెచ్చుకొనుట.
అధ్యుషితము. త్స. విశ. అధివసింపఁబడినది.
అధ్యేత. త్స. విశ. చదువువాఁడు.
అధ్వగ. త్స. వి. ఆకాశగంగ.
అధ్వగుఁడు. త్స. విశ. బాటసారి.
అధ్వనీనుఁడు. త్స. విశ. బాటసారి.
అధ్వము. త్స. వి. ౧. త్రోవ. ౨. కాలము.
అధ్వరము. త్స. వి. యజ్ఞము.
అధ్వర్యుఁడు. త్స. వి. యజ్ఞమునందు యజుర్వేదమంత్రము నడుపువాఁడు.
అన. దే. వి. ౧. అన్న, ౨. లేఁగొమ్మ. (అనలుగొనలు.)
అనంగలేఖము. త్స. విశ. మన్మథలేఖ. (Love letter.)
అనంగుఁడు. త్స. వి. మన్మథుఁడు.
అనంత. త్స. వి. భూమి.
అనంతము. త్స. విశ. మితిలేనిది.
అనంతరము. త్స. క్రి. విశ. పిమ్మట. విశ. వెనుకటిది.
అనంతరీయుఁడు. త్స. విశ. తనవాతి వానికి సంబంధించినవాఁడు.
అనంతవిజయము. త్స. వి. ధర్మరాజు శంఖము.
అనఁటి. దే. వి. అరఁటి.
అనఘుఁడు. త్స. విశ. పాపములేనివాఁడు. (పూజ్యుఁడు)
అనడ్వాహము. త్స. వి. ఎద్దు.
అనద. వై.విశ.౧.అనాథ,౨.అల్పుఁడు.
అనధ్యయనముత్స.వి.చదువఁదగనిదినము.
అనధ్యాయము.త్స.వి.చదువదగనిదినము.
అనన్వయము. త్స. వి. అర్థాలంకారములలో ఒకటి. విశ. అన్వయములేనిది.
అనయము. { దే. అవ్య. ౧. మిక్కిలి. ౨. అవశ్యము. 3. మఱిమఱి. ౪. ఎల్లప్పుడు. త్స. వి. ౧. ఆపద. ౨. దురదృష్టము. }

అనరు. దే. వి. ౧. కష్టము. బ. ౨. జీవస్థానము.

అనర్గళము. త్స. విశే. అడ్డులేనిది.

అనర్ఘము. త్స. వి. వెలలేనిది. (అమూల్యము.)

అనర్థము. త్స. వి. కీడు. విశే. అర్థము లేనిది.

అనర్హము. త్స. విశే. తగనిది.

అనలము. త్స. వి. నిప్పు.

అనవరతము. త్స. విశే. ఎడతెగనిది. రూ. అనారతము.

అనాకారము. త్స. విశే. రూపము లేనిది.

అనాచారము. త్స. వి. ఆచారములేమి.

అనాత్మజ్ఞుఁడు. త్స. విశే. తన్ను దానెఱుఁగనివాఁడు.

అనాదరము. త్స. వి. ఆదరములేమి.

అనాది. త్స. విశే. మొదలులేనిది.

అనాథ. త్స. విశే. భర్తలేనిది.

అనాయాసము. త్స. విశే. ఆయాసము లేమి.

అనావర్షము. త్స. వి. అనావృష్టి.

అనావృష్టి. త్స. వి. వఱపు.

అని. దే. వి. పోరు. స. అన్ని. అవ్య. ౧. విధమును తెలుపును. ౨. భావించుటను తెలుపును. 3. హేతువును తెలుపును.

అనికి. దే. వి. అల్లిక.

అనిత్యము. త్స. విశే. నిత్యముకానిది.

అనిదంపూర్వము. త్స. విశే. ఇంతకు మునుపులేనిది.

అనిమిషుఁడు. త్స. వి. దేవత.

అనిరుద్ధుఁడు. ప్రద్యుమ్నుని కుమారుఁడు, శ్రీకృష్ణుని మనుమఁడు, బాణాసురుని కుమార్త ఉషాభర్త.

అనిర్వచనీయము. త్స. విశే. వచియింపఁ గూడనిది.

అనిలుఁడు. త్స. వి. గాలి.

అనివార్యము. త్స. విశే. వారింప రానిది.

అనిశము. త్స. విశే. ఎల్లప్పుడు.

అనీకము. త్స. వి. గుంపు.

అనీకిని. త్స. వి. సేన. ౨౧౮౭౦ రథములు. ౨౧౮౭౦ ఏనుఁగులు. ౬౫౬౧౦ గుఱ్ఱములు. ౧౦౯౩౫౦ కాల్బలము కల సేన.

అను. దే. క్రి. ౧. పలుకు, ౨. చెప్పు.

అనుకంప. త్స. వి. దయ.

అనుకంపనీయుఁడు. త్స. విశే. దయ చూపఁదగినవాఁడు.

అనుకరణము. త్స. వి. అనుకరించుట. (ఇతరులు చేసినట్లు చేయుట.)

అనుకారము. త్స. వి. అనుకరించుట.

అనుకు. దే. విశే. ముద్దగాక పలుచనైనది.

అనుకూలము. త్స. విశే. ఒదవినది. క్రి. అనుకూలించు.

అనుకూలుఁడు. త్స. వి. నాయకులలో ఒకఁడు.

అనుక్రమణిక. త్స. వి. విషయసూచిక.

అనుక్షణము. త్స. వి. ప్రతిక్షణము.

అనుఁగు. దే. విణ. ౧. ప్రియుఁడు ౨. మిత్త్రుఁడు. ౩. ఇంపైనది.

అనుగమనము. త్స. వి. వెంబడించుట.

అనుగమించు. దే. క్రి. వెంబడించు.

అనుగలము. దే. విణ. అనుకూలము.

అనుగుణము. దే. విణ. తగినది.

అనుగ్రహము. త్స. వి. ఏలుకొనుట. క్రి. అనుగ్రహించు.

అనుగ్రహీత. త్స. విణ. అనుగ్రహించువాఁడు.

అనుచరుఁడు. త్స. విణ. తోడు.

అనుచితము. త్స. ఉచితముకానిది.

అనుచు. దే. ప్రే. ౧. ఆజ్ఞాపించు. ౨. పుచ్చు.

అనుజాతుఁడు. త్స. విణ. తమ్ముఁడు.

అనుజీవి. త్స. విణ. సేవకుఁడు.

అనుజుఁడు. త్స. వి. తమ్ముఁడు. కడఁగొట్టువాఁడు.

అనుజ్ఞ. త్స. వి. అనుమతి.

అనుజ్ఞప్తి. త్స. వి. అనుమతి.

అనుతాపము. త్స. వి. పశ్చాత్తాపము.

అనుదారుఁడు. త్స. వి. మిక్కిలిఉదారుఁడు.

అనుదినము. త్స. వి. నానాఁడు.

అనునయము. త్స. వి. ఊఱట. క్రి. అనునయించు.

అనునాసికము. త్స. విణ. ముక్కుతోనుచ్చరింపఁబడు వర్ణము.

అనుపదము. త్స. విణ. అడుగులననుసరించునది.

అనుపల్లవి. త్స. వి. పల్లవి వెనుక వచ్చుపాదము.

అనుపానము. త్స. వి. ౧. మందుతోఁజేర్చి పుచ్చుకొను వస్తువు. ౨. అన్నముతోఁజేర్చి తినువస్తువు.

అనుపాలనము. త్స. వి. రక్షణము.

అనుపు. { దే. క్రి. ౧. ఉత్తరువుచేయు. ౨. పుచ్చు. వి. ౧. పయనమైపోవువారికిఁ దోడుపంపుట. ౨. పన్ను. }

అనుప్రాసము. త్స. వి. ఒకశబ్దాలంకారము.

అనుబంధము. త్స. వి. ౧. సంబంధము. ౨. ప్రధానముననుసరించియుండెడి అప్రధానవిషయము. ౩. పరంపర.

అనుభవము. త్స. వి. ౧. కుడుపు. క్రి. అనుభవించు.

అనుభూతము. త్స. విణ. అనుభవింపఁబడినది.

అనుభూతి. త్స. వి. అనుభవము.

అనుభోగము. త్స. వి. అనుభవము.

అనుమఁడు. వై. వి. హనుమంతుఁడు.

అనుమతము. త్స. విణ. అనుమతింపఁబడినది.

అనుమతి. త్స. వి. అంగీకారము. క్రి. అనుమతించు.

అనుమరణము. త్స. వి. సహగమనము.
అనుమానము. త్స. వి. ౧. సందేహము. ౨. ఊహించుట. క్రి. అనుమానించు.
అనుము. దే. వి. ఒప్పు. ఒకవిధమైనపంట.
అనుములు. దే. వి. బ. ధాన్యవిశేషము.
అనుమోదించు. త్స. వి. ౧. సంతోషించు. ౨. సమ్మతించు.
అనుయాత్ర. త్స. వి. వెంటఁబోవుట.
అనుయాత్రికుఁడు. త్స. విశ. వెంటఁబోవువాఁడు.
అనుయాయి. త్స. విశ. వెంటఁబోవువాఁడు.
అనుయోగము. త్స. వి. ప్రశ్న.
అనురంజనము. త్స. వి. సంతోషపెట్టునది.
అనురక్తము. త్స. విశ. ప్రేమకలది. వి. అనురక్తి.
అనురణనము. త్స. వి. ప్రతిధ్వని.
అనురాగము. త్స. వి. ప్రీతి.
అనురాధ. త్స. వి. ఇరువదేడునక్షత్రములలో ఒకటి.
అనురూపము. త్స. విశ. తగినది.
అనురోధము. త్స. వి. అనుసరించుట.
అనులాపము. త్స. వి. మాటిమాటికిఁ జెప్పెడుపలుకు.
అనులేపనము త్స. వి. పూఁత.
అనులేపము. త్స. వి. పూఁత.
అనులోమము త్స. వి. క్రమము ననుసరించియున్నది.
అనువచనము. త్స. వి. చెప్పినదానిని మఱొకఁడట్లే అనుట.
అనువరి దే. వి. ౧. ఉపాయశాలి.
అనువర్తనము. త్స. వి. అనుసరించుట.
అనువాదము. త్స. వి. భాషాంతరీకరణము.
అనువు. దే. వి. ౧. ఉపాయము. ౨. విధము. విశ. యుక్తము.
అనువుచేయు. దే. వి. తయారుచేయు.
అనువుపడు. దే. క్రి. సరిపడు.
అనువృత్తి. త్స. వి. అనుసరించుట.
అనుశాసనము. త్స. వి. ఆజ్ఞ.
అనుశిష్టము. త్స. విశ. ఆజ్ఞాపింపఁబడినది.
అనుశ్రుతము. త్స. విశ. కులక్రమాగతము.
అనుషంగము. త్స. వి. సంబంధము.
అనుష్ఠాత. త్స. విశ. అనుష్ఠించువాఁడు.
అనుష్ఠానము. త్స. వి. ప్రవర్తనము. నడవడి. క్రి. అనుష్ఠించు.
అనుష్ణుఁడు. త్స. విశ. సోమరి.
అనుసంధానము. త్స. వి. ౧. చింతనము. ౨. అన్వేషణము. 3. పఠనము.
అనుసరణము. త్స. వి. అనుసరించుట. క్రి. అనుసరించు.
అనుసారము. త్స. వి. అనుసరణము.
అనుసృతి. త్స. వి. అనుసరణము.
అనుస్మరణము. త్స. వి. ధ్యానము.
అనుస్యూతము. త్స. విశ. ౧. ఎడతెగనిది. ౨. ఒకటిగాఁ గొట్టఁబడినది.

అనుస్వారము. త్స. వి. సున్న.

అనూచానుఁడు. త్స. విశే. ౧. వినయము గలవాఁడు. ౨. గురుముఖమున సాంగవేదము చదివినవాఁడు.

అనూనము. త్స. విశే. తక్కువకానిది.

అనూపము. త్స. విశే. జలసమృద్ధిగలది. (నేల)

అనూరుఁడు. త్స. వి. వినతకుఁదొలిచూలిఁ బుట్టినకొడుకు. గరుత్మంతుని యన్న. సూర్యుని సారథి. తొడలులేని వాఁడు.

అనృణుఁడు. త్స. విశే. అప్పుదీర్చినవాఁడు.

అనృతము. త్స. వి. అబద్ధము.

అనేకపము. త్స. వి. ఏనుఁగు.

అనేకమంది. మిశ్రి. వి. పెక్కురు.

అనేకము. త్స. స. పెక్కు.

అనోకహము. త్స. వి. చెట్టు.

అన్న. దే. వి. ౧. తండ్రి. ౨. సోదరుఁడు.

అన్నన్న. దే. అవ్య. అచ్చెరువు తెలుపునది.

అన్నపూర్ణ. త్స. వి. కాశీవిశ్వేశ్వరుని భార్య.

అన్నప్రాశనము. త్స. వి. పదునాఱు కర్మములలో ఒకటి. బిడ్డలకు మొదటితడవ అన్నముపెట్టు మంగళ కర్మము.

అన్నము. త్స. వి. వంటకము. (దీనినే వాడుకలో వణ్ణమని కొన్ని దేశములలో వాడుదురు.)

అన్ని. దే. వి. సర్వము.

అన్ను. దే. వి. ౧. ఒడుదు. ౨. దేహము శైలియమి. రూ. అన్నువు.

అన్నువ. దే. విశే. అల్పము.

అన్నెకాఁడు. దే. విశే. అన్యాయకారి

అన్నెము. దే. వి. అన్యాయము. స. ఇతరము.

అన్యదీయము. త్స. విశే. అన్యసంబంధమైనది.

అన్యథా. అవ్య. మరియొకవిధముగా.

అన్యపుష్టము. త్స. విశే. కోకిల.

అన్యము. త్స. వి. ౧. వేఱైనది. ౨. సరిలేనిది.

అన్యాయము. త్స. విశే. న్యాయము లేనిది.

అన్యూనాధికము. త్స. విశే. తక్కువయు ఎక్కువయు గానిది.

అన్యోన్యము. త్స. వి. ౧. అర్థాలంకారములలోఒకటి. ౨. పరస్పరము.

అన్వయము. త్స. వి. ౧. కులము. ౨. సంబంధము.

అన్వర్థము. త్స. విశే. సార్థకము.

అన్వవాయము. త్స. వి. వంశము.

అన్వహము. త్స. వి. ప్రతిదినము.

అన్వీక్షకి. త్స. వి. తర్కశాస్త్రము.

అన్వేషణము. త్స. వి. పిలుచుటకై వెదకుట. రూ. అన్వేషము.

అపకర్షము. త్స. వి. ౧. తగ్గుట. ౨. అవమానము.
అపకారము. త్స. వి. కీడు.
అపకీర్తి. త్స. వి. చెడ్డపేరు.
అపఖ్యాతి. త్స. వి. అపకీర్తి.
అపచయము. త్స. వి. ౧. తగ్గుట. ౨. పుష్పాదులనుగోయుట.
అపచారము. త్స. వి. గొప్పవారియెడఁ జేసినతప్పు.
అపజయము. త్స. వి. ఓటమి.
అపత్నీకుఁడు. త్స. వి. భార్యపోయినవాఁడు.
అపత్యము. త్స. వి. సంతానము.
అపథ్యము. త్స. విణ. పథ్యముకానిది.
అపదూఱు. మి. వి. అపనింద.
అపనమ్మిక. దే. వి. నమ్మికలేమి.
అపనింద. త్స. వి. అపదూఱు.
అపనెపము. దే. వి. నింద.
అపపాఁడి. మి. విణ. అన్యాయము.
అపభ్రంశము. త్స. వి. ౧. జాఱుట. ౨. అపశబ్దము. 3. ఒకభాష.
అపమార్గము. త్స. వి. తప్పుత్రోవ.
అపయశము. త్స. వి. అపకీర్తి.
అపరంజి. దే. వి. పదివన్నె బంగారు.
అపరక్రియ. త్స. వి. చచ్చినవానివెనుకఁ జేయఁబడు కర్మము.
అపరాతిరి. దే. వి. నడిరేయి.
అపరాధము. త్స. వి. తప్పు.
అపరాహ్ణము. త్స. వి. దినముయొక్క చివరిభాగము. (పగటిని రెండుగా విభజించినచో రెండవభాగము. మూఁడుగా విభజించినచో మూఁడవభాగము. నాలుగైనచో నాల్గవ భాగము. అయిదయినచో, అయిదవ భాగము.)
అపరిమితము. త్స. విణ. మితిలేనిది.
అపరూపము. త్స. విణ. వికృతరూపము గలది.
అపలాపము. త్స. వి. మఱుఁగుమాట.
అపవర్గము. త్స. వి. మోక్షము.
అపవాదము. త్స. వి. ౧. అపకీర్తి. ౨. నిందించుట.
అపవారణము. త్స. విణ. కప్పునది. వి. కప్పుట.
అపశకునము. త్స. వి. దుశ్శకునము.
అపశబ్దము. త్స. వి. అసాధుశబ్దము.
అపసదుఁడు. త్స. విణ. నీచుఁడు.
అపసవ్యము. త్స. విణ. ౧. దక్షిణము. ౨. ప్రతికూలము.
అపసరణము. త్స. వి. తొలఁగుట.
అపసారము. త్స. వి. తొలఁగుట.
అపస్మారము. త్స. వి. ౧. స్మృతి దప్పుట. ౨. ఒకరోగము.
అపహరించు. త్స. క్రి. వంచించికొనిపోవు. వి. అపహరణము.
అపహసించు. త్స. క్రి. గేలిసేయు.
అపహారము. త్స. వి. దొంగిలించుట.
అపహాసము. త్స. వి. పరిహసించుట.

అపహ్నవము. త్స. వి. అర్థాలంకారములలో ఒకటి.
అపాంక్తేయుఁడు. త్స. విణ. పంక్తిబాహ్యుఁడు.
అపాంగము. త్స. వి. కడకన్ను.
అపాంపది. త్స. వి. సముద్రము.
అపాయము. త్స. వి. కీడు.
అపారవారము. త్స. వి. సముద్రము.
అపార్థము. త్స. విణ. అర్థములేనిది.
అపాస్తము. త్స. విణ. నిరసింపఁబడినది.
అపిధానము. త్స. వి. తిరోధానము.
అపినద్ధము. త్స. విణ. కట్టఁబడినది.
అపిహితము. త్స. విణ. మూయఁబడినది.
అపుడు. దే. వి. కాలము. రూ. అప్పుడు. అప్పు.
అపురూపము. దే. వి. అపూర్వము.
అపూపము. త్స. వి. అప్పము.
అపూర్వము. త్స. విణ. క్రొత్తది.
అపేక్ష. త్స. వి. కోరిక. (క్రి. అపేక్షించు.)
అపోహము. త్స. వి. తప్పుటూహ.
అపౌరుషేయము. త్స. విణ. పురుషకృతముగానిది.
అప్ప. దే. వి. ౧. తల్లి. ౨. తండ్రి. 3. అక్క. (రూ. అప్పా.)
అప్పగించు. దే. క్రి. ఒప్పగించు. (వి. అప్పగింత.)
అప్పచి. } దే. క్రి. ఒకవిధమైన భక్ష్యము.
అప్పచ్చి. }

అప్పటము. దే. విణ. స్వచ్ఛమైనది.
అప్పటి. దే. అవ్య. మరల.
అప్పడము. దే. వి. ఉద్దిపిండితోఁ జేసినభక్ష్యవిశేషము. రూ. అప్పళము.
అప్పనము. దే. వి. ౧. అర్పణము. ౨. కానుక. (క్రి. అప్పనసేయు.)
అప్పము. దే. వి. అప్పచ్చి.
అప్పళించు. దే. క్రి. ౧. ఉద్యమించు. ౨. భుజమును దట్టు. 3. ఆక్రమించు. ౪. కప్పు. ౫. తాఁకు. (వి. అప్పళింత.)
అప్పు. దే. వి. బాకి.
అప్పులకాఁపు. } దే. వి. అప్పు పుచ్చుకొన్నవాఁడు.
అప్పులపోతు. }
అప్పులవాఁడు. దే. వి. అప్పిచ్చినవాఁడు.
అప్రతిష్ఠ. త్స. వి. అపఖ్యాతి.
అప్రమాణము. త్స. వి. తప్పుప్రమాణము.
అప్రయోజకుఁడు. త్స. విణ. పనికిరానివాఁడు.
అప్రశస్తము. } త్స. విణ. పేరు[illegible]ని.
అప్రసిద్ధము. }
అప్రియము. త్స. విణ. ప్రియముకానిది.
అబందర. దే. వి. [illegible].
అబక. దే. వి. అగప. పెద్ద [illegible].
అబద్ధము. త్స. విణ. ౧. అసత్యము. ౨. సత్యముకానిది.

అబల. త్స. వి. స్త్రీ. ఇంతి.
అబాసు. దే. వి. అల్లరి. దౌష్ట్యము.
అబ్జము. త్స. వి. ౧. తామర. ౨. ఉప్పు. ౩. శంఖము.
అబ్జిని. త్స. వి. తామరతీఁగ.
అబ్దము. త్స. వి. ౧. ఏఁడు. ౨. అద్దము.
అబ్ధి. త్స. వి. సముద్రము.
అబ్బ. దే. వి. తండ్రి. అవ్య. బాధను దెలుపునది. (ఆమ్రేడితమందు అబ్బబ్బ).
అబ్బరము. దే. విశే. తుదలేనిది.
అబ్బాయి. దే. వి. పిల్లవాఁడు.
అబ్బి. దే. వి. ,,
అబ్బు. దే. క్రి. చిక్కు. దొరకు.
అబ్బురపడు. దే. క్రి. ఆశ్చర్యపడు. వి. అబ్బురపాటు.
అబ్బురము. దే. వి. ఆశ్చర్యము.
అబ్బెసము. వై. వి. అలవాటు.
అబ్రపడు. వై. క్రి. ఆశ్చర్యపడు. వి. అబ్రము.
అభయము. త్స. విశే. భయములేనిది.
అభవుఁడు. త్స. వి. పుట్టుకలేనివాఁడు.
అభాగ్యము. త్స. వి. భాగ్యములేమి.
అభావము. త్స. వి. ౧. లేమి. ౨. మరణము.
అభిగమనము. త్స. వి. ౧. సంభోగము. ౨. ఎదురుపోవుట.
అభిఘారము. త్స. వి. అన్నముపై సంస్కారార్థము నేయివేయుట.
అభిచారము. త్స. వి. శత్రుహింసార్థము చేయుకర్మము.
అభిజనము. త్స. వి. ౧. జన్మస్థానము. ౨. కులము.
అభిజ్ఞుఁడు. త్స. వి. తెలివరి.
అభిధానము. త్స. వి. పేరు.
అభినందించు. త్స. క్రి. ౧. సంతోషించు. ౨. పొగడు. వి. అభినందనము.
అభినయించు. త్స. క్రి. అంగన్యాసాదులచే అర్థము తెలియఁజేయు. వి. అభినయము.
అభిని. దే. వి. నల్లమందు.
అభినివేశము. త్స. వి. పట్టుదల.
అభిప్రాయము. త్స. వి. ౧. తలఁపు. ౨. భావము.
అభిభవము. త్స. వి. పరాభవము.
అభిమతము. త్స. వి. అంగీకారము.
అభిమన్యుఁడు. త్స. వి. అర్జునపుత్త్రుఁడు.
అభిమానము. త్స. వి. ౧. గర్వము. ౨. అజ్ఞానము.
అభిమానించు. త్స. క్రి. గారవించు.
అభిముఖుఁడు. త్స. వి. సమ్ముఖుఁడు.
అభియోగము. త్స. వి. ౧. వ్యాజ్యము. ౨. పూనిక. ౩. ఉత్సాహము. ౪. పట్టుదల.
అభిరామము. త్స. విశే. మనోహరమైనది.
అభిరుచి. త్స. వి. అత్యంతాసక్తి.

అభిలషించు. త్స. క్రి. కోరు. వి. అభిలాష.

అభివాదనము. త్స. వి. గోత్రనామములు చెప్పి పాదములు సోఁకి మ్రొక్కుట. (రూ) అభివాదము.

అభివృద్ధి. త్స. వి. పెంపు.

అభివ్యక్తి. త్స. వి. బయలుపడుట. స్ఫుటమగుట.

అభిశంసనము. త్స. వి. దూషించుట.

అభిషేకించు. త్స. క్రి. మునుఁగఁజేయు. వి. అభిషేకము.

అభిసరణము. త్స. వి. నాయకుఁడు నాయికకై కాని, నాయిక నాయకునికై కాని సంకేతమునకుఁ బోవుట.

అభిసారము. త్స. వి. ,,

అభిసారిక. త్స. విశ. నాయకునికై సంకేతమునకుఁ బోవునది.

అభీష్టము. త్స. వి. ఇష్టమైనది.

అభేదము. త్స. వి. భేదములేనిది.

అభ్యంగము. త్స. వి. తలంటు.

అభ్యంజనము. త్స. వి. ,,

అభ్యంతరము. త్స. వి. నడిమితావు.

అభ్యనుజ్ఞ. త్స. వి. అనుమతి.

అభ్యసనము. త్స. వి. అభ్యాసము. క్రి. అభ్యసించు.

అభ్యాగతుఁడు. త్స. వి. భోజనమప్పుడు వచ్చిన యతిథి.

అభ్యాసము. త్స. వి. ఆవృత్తి.

అభ్యుదయము. త్స. వి. శుభోదయము.

అభ్రంలిహము. త్స. విశ. ఆకాశము తాకునది.

అభ్రకము. త్స. వి. బేగడ.

అమడలు. దే. వి. బ. కవబిడ్డలు.

అమరకము. దే. వి. భూమిని సిస్తున కిచ్చుట.

అమరావతి. త్స. వి. ఇంద్రుని పట్టణము.

అమరిక. దే. వి. ౧. అందము. ౨. రీతి.

అమరు. దే. క్రి. ౧. ఒప్పు. ౨. కుదురు.

అమరుఁడు. త్స. విశ. చావులేనివాఁడు. వేల్పు.

అమర్త్యుఁడు. త్స. విశ. ,,

అమర్యాద. త్స. క్రి. మర్యాదలేమి.

అమర్షణుఁడు. త్స. విశ. ఓర్వలేని వాఁడు.

అమర్షము. త్స. వి. కోపము.

అమల. త్స. వి. నేలయుసిరిక. విశ. నిర్మలమైనది.

అమవస. వై. వి. అమావాస్య. రూ. అమాస.

అమాంతము. దే. వి. ౧. చిల్లరబేరము. ౨. అకస్మాత్తు.

అమాత్యుఁడు. త్స. వి. మంత్రి.

అమానుషము. త్స. విశ. మనుష్యశక్తి మీఱినది.

అమాయికుఁడు త్స. విశ. మాయలేని వాఁడు; నిష్కపటి.

అమావాస్య. త్స. వి. అమవాస.

అమాస. దే. వి. ,,

అమిజి. దే. వి. వెట్టి.
అమీదృశుఁడు. త్స. వి. ఇట్టివాఁడు.
అమూల్యము. త్స. విణ. వెలలేనిది.
అమృతము. త్స. వి. ౧. సుధ. ౨. నీళ్లు. 3. నెయ్యి.
అమృతాంశుఁడు. త్స. వి. చంద్రుఁడు.
అమేధ్యము. త్స. విణ. పవిత్రముకానిది.
అమోఘము. త్స. విణ. వ్యర్థముగానిది.
అమ్మ. దే. వి. తల్లి. అవ్య. ఔర.
అమ్మకచెల్ల. దే. అవ్య. ఔర.
అమ్మకము. దే. వి. విక్రయము.
అమ్మక్క. దే. అవ్య. ఔర.
అమ్మచెల్ల. దే. అవ్య. ఔర.
అమ్మతల్లి. దే. వి. అమ్మవారు.
అమ్మవారు. దే. వి. ౧. స్త్రీ దేవత. ౨. పూజ్యురాలైన విప్రస్త్రీ.
అమ్మాయి. దే. వి. బాలిక.
అమ్మి. దే. వి. అమ్మాయి.
అమ్మిడు. దే. వి. విక్రయము. (క్రి. అమ్ము.
అమ్లము. త్స. విణ. పుల్లనిది. వి. పులుపు.
అమ్లానము. త్స. విణ. వాడనిది.
అయనము. త్స. వి. సూర్యుఁడు దక్షిణోత్తరదిశలకు పోవుదారి.
అయము. త్స. వి. ౧. శుభకర్మము. ౨. శుభము.
అయవారు. దే. వి. ఉపాధ్యాయుఁడు. రూ. అయ్యగారు.
అయస్కాంతము. త్స. వి. సూదంటురాయి.
అయస్సు. త్స. వి. ఇనుము.
అయారె. దే. అవ్య. ఔర.
అయిదువ. దే. వి. ముత్తైదువ.
అయిదువరాలు. దే. వి. ,,
అయో. దే. అవ్య. అయ్యో.
అయోగ్యుఁడు. త్స. విణ. యోగ్యుఁడు కానివాఁడు.
అయోనిజుఁడు. త్స. విణ. యోనినుండి పుట్టనివాఁడు.
అయోమయము. త్స. విణ. ఇనుముతోఁ జేయఁబడినది.
అయ్య. దే. వి. తండ్రి.
అయ్యరె. / అయ్యారె. } దే. అవ్య. ఔర.
అయ్యవారు. దే. వి. ఉపాధ్యాయుఁడు.
అయ్యో. దే. అవ్య. (సంతాపమును దెలుపుట.)
అర. దే. వి. ౧. సగము. ౨. కొట్టు.
అరఁగు. దే. వి. తిన్నె. రూ. అరుఁగు.
అరఁటి. దే. వి. అరఁటి.
అరక. దే. వి. ఎద్దులనుగాని దున్నలనుగాని గట్టి దున్నుటకు తయారు చేసిన నాగలి. రూ. అరకాఁడు.
అరగూఁడు. దే. వి. గోడయం దేర్పతిచినగూడు.
అరఘట్టము. త్స. వి. నూతిగిలక.

అరణము. వై. వి. పెండ్లికాలమున అల్లునకును ఆఁడుబిడ్డలకును ఇచ్చునట్టిధనము.
అరణి. త్స. వి. త్రచ్చి నిప్పు పుట్టించు కొయ్య.
అరణ్యాచంద్రిక. త్స. వి. అడవిని గాచిన వెన్నెల. (నిరర్థకము)
అరణ్యము. త్స. వి. వనము.
అరణ్యరుదితము. త్స. వి. అడవిలోని యేడ్పు. (నిరర్థకము).
అరణ్యరోదనము. త్స. వి. ,,
అరణ్యాని. త్స. వి. మహారణ్యము.
అరదండ. దే. వి. చేతులకుఁ దగిలించెడి సంకెల.
అరదము. వై. వి. తేరు.
అరపది. వై. వి. పదిటసగము. అయిదు.
అరమర. దే. వి. ౧. సందేహము. ౨. భేదము. రూ. అరమరము. అరమరిక.
అరయు. దే. క్రి. ౧. విచారించు. ౨. వెదకు. వి. అరయిక.
అరరము. త్స. వి. కవాటము.
అరవ. దే. వి. ద్రావిడుఁడు.
అరవత. దే. వి. అరవజాతిస్త్రీ
అరవరలు. దే. విణ. బ. ఎండినవి.
అరవాయి. వై. వి. ౧. ధైర్యములేమి. ౨. బిడియము. క్రి. అరవాయిగొను.
అరవిందము. త్స. వి. తామర.
అరవిరి. దే. వి. సగమువికసించినమొగ్గ.
అరసు. దే.వి.ప్రభువు.(తిమ్మరుసు. మొ)
అరాజకము. త్స. విణ. రాజులేనిది.
అరాతి. త్స. వి. శత్రువు.
అరాళము. త్స. వి. వంకరమైనది.
అరి. దే. వి. ౧. కప్పము. ౨. బాణమును ఈడ్చు స్థానమైన యల్లెనడుము. త్స. వి. ౧. చక్రము. ౨. శత్రువు. (అరిషడ్వర్గములు. కామము. క్రోధము. లోభము. మోహము. మదము. మాత్సర్యము.)
అరిందముఁడు. త్స. విణ. శత్రువుల నణఁచువాఁడు.
అరికట్టు. దే. క్రి. అడ్డగించు.
అరిగాఁపు. దే. వి. పన్నుచెల్లించురైతు.
అరిగాపు. దే. వి. పైవారురాకుండఁ బెట్టినకావలి.
అరిణె. దే. వి. బావినుండిగాని గుంట నుండిగాని బానతో నెత్తిపోయుటకై తొలిచి కాలువ మొదట ఉంచిన తాటిమ్రానులోనగునది.
అరిత్రము. త్స. వి. తెడ్డు.
అరిదళము. వై. వి. హరిదళము.
అరిది. దే. విణ. ౧. అశక్యము. ౨. దుస్సాధ్యము. 3. వింతయైనది.
అరిపడు. దే. క్రి. అడ్డపడు.
అరివోయు. దే. క్రి. ఎక్కువెట్టు.
అరిష్టతాతి. త్స. వి. మేలుచేయువాఁడు.
అరిష్టము. త్స. వి. ౧. కీడు. ౨. కాకి 3. వెల్లుల్లి. ౪. పురిటిల్లు.

అరిసె. దే. వి. మూలవ్యాధి.
అరుంతుదము. త్స. విశ. మర్మస్థానము ను బీడించునది.
అరుంధతి. త్స. వి. వసిష్ఠునిభార్య.
అరుఁగు. దే. వి. తిన్నె. అరఁగు.
అరుగు. దే. క్రి. పోవు. రూ. అర్గు.
అరుగుదెంచు. దే. క్రి. ౧. వచ్చు. ౨. పోవు.
అరుణము. త్స. విశ. కొంచెమెఱ్ఱనిది.
అరుణుఁడు. త్స. వి. ౧. అనూరుఁడు. ౨. సూర్యుఁడు.
అరుదు. దే. వి. ౧. ఆశ్చర్యము. ౨. అపూర్వము.
అరుదెంచు. దే. క్రి. అరుగుదెంచు.
అరులు. దే. వి. వాత్సల్యము.
అరువు. దే. వి. అప్పు. విశ. అరువరి.
అరులుమరులు. దే. వి. మసలితనమునఁ గలుగు తబ్బిబ్బు. వెఱ్ఱిప్రేమ. రూ. అర్లుమర్లు.
అరుసము. వై. వి. సంతోషము.
అరె. } దే. అవ్య. శాబాసు.
అరే. }
అర్కకాంతము. త్స. వి. సూర్యకాంత శిల.
అర్కము. త్స. వి. జిల్లేడు.
అర్కుఁడు. త్స. వి. సూర్యుఁడు.
అర్గళము. త్స. వి. తలుపుగడియ.
అర్ఘము. త్స. వి. ౧. వెల. ౨. పూజావిధి. రూ. అర్ఘువు.
అర్ఘ్యము. త్స. విశ. పూజకొఱకైన జలాదికము.
అర్చ. త్స. వి. పూజ. రూ. అర్చన.
అర్చకుఁడు. త్స. వి. పూజచేయు వాఁడు
అర్చన. త్స. వి. పూజ.
అర్చించు. త్స. వి. పూజించు.
అర్జనము. త్స. వి. సంపాదనము.
అర్జునుఁడు. త్స. వి. ౧. కృతవీర్యుని కొడుకు. కార్తవీర్యార్జునుఁడు. ౨. పాండురాజునకుఁ గుంతియందుఁ బుట్టినవాఁడు.
అర్ణవము. త్స. వి. సముద్రము.
అర్ణోరాశి. త్స. వి. సముద్రము.
అర్థము. త్స. వి. ౧. పదార్థము. ౨. ధనము. 3. నిమిత్తము.
అర్థశాస్త్రము. త్స. వి. రాజ్యము. బంగారు, మొదలుగాఁగలదానిని సంపాదించుట, పాలించుటయందు వెరవైనశాస్త్రము.
అర్థి. త్స. వి. ౧. ప్రార్థించువాఁడు. ౨. వాది. 3. కోరికి. (తెలుఁగు)
అర్ధము. త్స. వి. తునుక.
అర్ధరథుఁడు. త్స. వి. ఒక్కవిలుకానితో సమముగ నిలిచి పోరలేని యోధుఁడు.
అర్ధరాత్రము. త్స. వి. నడిరేయి.
అర్పణము. త్స. వి. అర్పించుట. క్రి. అర్పించు.

అర్బుదము. త్స. వి. పదికోట్లు.
అర్భకుఁడు. త్స. వి. బాలుఁడు.
అర్మిలి. దే. వి. ౧. అపేక్ష. ౨. ప్రీతి.
అర్య. త్స. వి. స్వామిని. ౨. కోమటిది.
అర్యముఁడు. త్స. వి. సూర్యుఁడు.
అర్యుఁడు. త్స. వి. ౧. స్వామి. ౨. కోమటి.
అర్వాచీనము. త్స. వి. ఇటీవలిది. (ప్రాచీనము. అర్వాచీనము.)
అర్శము. త్స. వి. మూలవ్యాధి.
అర్హత. త్స. వి. యోగ్యత.
అర్హము. త్స. విణ. తగినది.
అఱ. దే. వి. ౧. గది. ౨. సగము. 3. కొఱఁత.
అఱక. దే. వి. మూఁపు.
అఱకడ. దే. వి. మూఁపుప్రదేశము.
అఱకము. దే. వి. అజీర్తి.
అఱగొడ్డము. దే. వి. దుండగము. రూ. అఱగొడ్డెము.
అఱగొఱ. దే. వి. ౧. కపటము. ౨. ఛేదము.
అఱచు. దే. క్రి. ౧. కూయు. ౨. విలపించు. వి. అఱపు.
అఱపేద. దే. వి. మిక్కిలిదరిద్రము.
అరపొఱడు. దే. విణ. సగముగూను.
అఱమర. / అఱమరిక. } దే. వి. ౧. సందేహము. ౨. ఛేదము.
అఱవత. దే. వి. అరవజాతిస్త్రీ.

అఱవము. దే. వి. దక్షిణహిందూస్థానమున మాటలాడెడి ద్రావిడభాషలలో నొకటి.
అఱవఱలు. దే. వి. బ. చిన్నచిన్న ముక్కలు.
అఱసంజ. దే. వి. అర్ధసంధ్య.
అఱవలు. దే. వి. బ. అఱవవారు.
అఱిముఱి. దే. వి. సంభ్రమము. అనాలోచితముగా. తబ్బిబ్బుగా.
అఱిమెనకుండలు. దే. వి. బ. బచ్చెనపూసిన పెండ్లికడవలు.
అఱిసియ. / అఱిసె. } దే. వి. అతిరసము.
అఱు. దే. క్రి. నశించు. వి. కంఠము. రూ. అఱ్ఱు.
అఱుగు. దే. క్రి. జీర్ణించు. రూ. అఱుపు.
అఱువండ్రు. దే. స. అఱువదిమంది.
అఱువుఁదెవులు. దే. వి. క్షయరోగము.
అఱ్ఱి. దే. వి. ప్రయాసమునఁబిదుకఁదగిన ఆవు.
అఱ్ఱాఁకలి. దే. వి. మిక్కిలి ఆఁకలి.
అఱ్ఱాక. దే. వి. బాధ.
అఱ్ఱాడు. దే. వి. తిరుగు.
అఱ్ఱు. దే. వి. కంఠము.
అల. దే. వి. తరంగము. విణ. ప్రసిద్ధిని తెలుపును.
అలంకరించు. త్స. క్రి. సింగారించు.
అలంకారము. త్స. వి. ౧. సింగారము. ౨. సొమ్ము.

అలఁగు. దే. క్రి. ౧. వెనుఁదీయు. ౨. దుఃఖించు. 3. శ్రమపడు.

అలఁచు. దే. క్రి. శ్రమపఱచు.

అలఁత. దే. వి. ౧. బాధ. ౨. దుఃఖము.

అలఁతి. దే. వి. తేలిక. విణ. స్వల్పము.

అలఁదు. దే. క్రి. పూయు.

అలఁదురు. దే. క్రి. శోకించు. ఏడ్చు.

అలక. త్స. వి. ౧. కుబేరుని పట్టణము. రూ. అలకాపురి. ౨. వెంట్రుకలు. దే. విణ. సన్నము. వి. కోపము.

అలక్తకము. త్స. వి. లత్తుక. రూ. అలక్తము.

అలక్ష్యము. త్స. విణ. ౧. గుఱిలేనిది. ౨. చులకన. క్రి. అలక్ష్యముచేయు.

అలఘువు. త్స. విణ. ౧. రెండు మాత్రలకాలము. ౨. లఘువుకానిది.

అలజడి. దే. వి. ౧. కీడు. ౨. దుఃఖము.

అలపు. దే. వి. అలసట.

అలబలము. దే. వి. ౧. కలకలము. ౨. సందడి.

అలమట. దే. వి. చింత.

అలమటించు. దే. క్రి. చింతించు.

అలము. దే. క్రి. వ్యాపించు.

అలయిక. దే. వి. అలసట.

అలయు. దే. క్రి. ౧. శ్రమపడు. ౨. విసుగు.

అలరారు. దే. క్రి. ౧. ఒప్పు. ౨. ప్రకాశించు.

అలరు. దే. క్రి. ౧. పూచు. పుష్పించు. ౨. సంతసించు. వి. ౧. పూవు. ౨. సంతసము.

అలరుఁబోడి. దే. వి. స్త్రీ. రూ. అలరుఁబోణి.

అలరువిలుకాఁడు. } దే. వి. మన్మథుఁడు.
అలరువిలుతుఁడు. }

అలవడు. దే. క్రి. ౧. అభ్యాసమగు. ౨ సిద్ధించు.

అలవడుట. } దే. వి. ౧. వాడుక. ౨. సిద్ధి.
అలవాటు. }

అలవరించు. దే. క్రి. ౧. వాడుకపఱచు. ౨. సవరించు. 3. అలంకరించు. రూ. అల్వరించు.

అలవి. దే. వి. ౧. కొలది. ౨. శక్తి. విణ. శక్యము.

అలవు. దే. వి. ౧. బలము. ౨. పరిశ్రమము.

అలవోక. దే. వి. అవలీలగా.

అలసట. దే. వి. అలపు. అలయిక.

అలసత. త్స. వి. ఆలస్యము.

అలసుఁడు. త్స. విణ. సోమరి.

అలాతము. త్స. వి. కొఱవి.

అలికము. త్స. వి. నొసలు.

అలికిడి. దే. వి. అలుకుడు.

అలిందము. త్స. వి. తలవాఁకిటఁబ్రక్కనుండు గృహము.

అలుఁగు. దే. వి. ౧. కత్తి. ౨. బాణాగ్రము. రూ. అల్గు.

అలుక. దే. వి. ౧. కోపము. ౨. ద్రోహచింత. రూ. అల్క.

అలుకు. దే. క్రి. ౧. ఇల్లులోనగు వానిని అలుకు. ౨. భయపడు. వి. భయము.

అలుకుడు. దే. వి. చప్పుడు.

అలుగు. దే. క్రి. కోపించు. రూ. అల్గు.

అలుచే. దే. విశ. అల్పుఁడు.

అలుపము. వై. విశ. అల్పము.

అల్పము. త్స. విశ. సూక్ష్మము.

అల్ల. దే. విశ. ప్రసిద్ధినిదెలుపును.

అల్లకల్లోలము. దే. విశ. క్రిందుమీదు. తాఱుమాఱు.

అల్లన. దే. వి. ౧. తిన్నన. ౨. మెల్లన.

అల్లరి. దే. వి. తప్పులయొక్క ప్రకటనము.

అల్లలనాడు. దే. క్రి. చలించు. కదలు.

అల్లాటము. దే. వి. త్రిప్పట. శ్రమము.

అల్లాడు. దే. క్రి. చరించు.

అల్లారుచెల్లము. దే. విశ. మిక్కిలి ప్రియమైనది.

అల్లారుముద్దు. దే. విశ. మిక్కిలి మనోజ్ఞము.

అల్లిక. దే. వి. ౧. తామరవలె నుండు నొకవిధమైన నీటిలోఁ బూయు పూవు.

అల్లుట. ౨. క్రి. అల్లు.

అల్లిబిల్లి. దే. వి. ౧. పెనుఁకువ. ౨. ఒద్దిక. రూ. అల్లికబిల్లిక.

అల్లియ. దే. వి. వింటినారి. రూ. అల్లె.

అల్లుఁడు. దే. వి. కూఁతు పెనిమిటి. రూ. అల్లుఁగుఱ్ఱ.

అల్లుడు. దే. వి. అల్లిక.

అల్లెము. దే. వి. పెండ్లియైనవెంటనే అల్లునకు అత్తవారు పెట్టువిందు.

అవకాశము. త్స. వి. ౧. ఎడము. ౨. తెఱపి.

అవకుంఠనము. త్స. వి. మేలిముసుఁగు. రూ. అవగుంఠనము.

అవగుణము. త్స. వి. చెడ్డగుణము.

అవగ్రహము. త్స. వి. వఱపు.

అవఘళించు. దే. క్రి. ౧. అతిక్రమించు. ౨. వ్యాపించు.

అవతంసము. త్స. వి. ౧. పూఁగమ్మ. ౨. సిగబంతి.

అవతరణము. త్స. వి. దిగుట.

అవతరణిక. త్స. వి. పీఠిక.

అవతరించు. త్స. క్రి. ౧. పుట్టు. ౨. దిగు.

అవతల. దే. వి. ౧. పిమ్మట. ౨. ఆవలిప్రదేశము.

అవతారము. త్స. వి. ౧. దిగుట. ౨. పుట్టుక. ౩. పోలిక.

అవతారిక. త్స. వి. గ్రంథముఖమున వ్రాయఁబడుదాని పుట్టుకవిధము. పీఠిక. అవతరణిక.

అవదానము. త్స. విశ. ౧. దోషరహితము. ౨. మనోజ్ఞము.

అవదారణము. త్స. వి. చీల్చుట.
అవద్యము. త్స. వి. నిందింపఁదగినది.
అవధరించు. దే. క్రి. చిత్తగించు.
అవధానము. త్స. వి. ఏకాగ్రత.
అవధి. త్స. వి. మేర.
అవధీరణము. త్స. వి. అనాదరము.
అవధూతుఁడు త్స. వి. దిసమొల సన్న్యాసి.
అవధూననము. త్స. వి. కదలించుట.
అవనతము. త్స. విశ. వంగినది.
అవని. త్స. వి. నేల. భూమి.
అవభృథము= త్స. వి. యజ్ఞసమాప్తి నాఁడు చేయుస్నానము.
అవమర్యాద. త్స. వి. అమర్యాద.
అవమానము. త్స. వి. సిగ్గు. లజ్జ.
అవమానించు. త్స. వి. భంగపఱచు.
అవయవము. త్స. వి. తల. బొమ్మ. చేతులు. కాళ్లు. మొదలగునవి.
అవరజుఁడు. త్స. వి. తమ్ముఁడు.
అవరోధము. త్స. విశ. ౧. అడ్డగింత. ౨. అంతఃపుర స్త్రీజనము.
అవరోహణము. త్స. వి. దిగుట.
అవరోహము. త్స. వి. ,,
అవల. దే. వి. ౧. ఆ ప్రక్క. ౨. పిమ్మట. రూ. అవ్వల.
అవలంబనము. త్స. వి. ఊఁత.
అవలంబము. త్స. వి. ,,
అవలక్షణము. త్స. వి. దుర్లక్షణము.
అవలగ్నము. త్స. వి. నడుము.
అవలీల. త్స. వి. చులుకన.
అవలేపము. త్స. వి. పొంత.
అవలోకనము. త్స.వి. చూచుట,చూపు.
అవలోకించు. త్స. క్రి. చూచు.
అవశకునము. త్స. వి. దుశ్శకునము.
అవశేషము. త్స. వి. మిగులు.
అవశ్యము. త్స. క్రి. విశ. నిక్కముగ.
అవష్టంభము. త్స. వి. ఆలంబనము.
అవసరము. త్స. వి. ౧. వేళ. ౨. కురియుట.
అవసానము. త్స. వి. ౧. తుద. ౨. ముగియుక.
అవస్థ త్స. వి. ౧. కాలకృతమైన స్థితి విశేషము. ౨. సంకటము.
అవహిత్థ. త్స. వి. ఆకారగోపనము.
అవహేల. త్స. వి. అనాదరము.
అవాంతరము. త్స. విశ. లోపలిది.
అవారి. దే. విశ. అపరిమితము. రూ. అవ్వారి.
అవిధి. త్స. వి. కష్టము.
అవినీతుఁడు. త్స. విశ. అడఁకువలేని వాఁడు.
అవిభక్తము. త్స. విశ. విభజింపఁబడనిది.
అవియు. దే. క్రి. ౧. చెడు. ౨. పగులు.
అవిరతము. త్స. విశ. ఎడతెగనిది.
అవిరళము. త్స. విశ. విరళముకానిది.
అవిలంబితము. త్స. విశ. త్వరితము.
అవివక్షితము. త్స. విశ. చెప్పుటకుద్దేశింపఁబడనిది.

అవివేకము. త్స. వి. తెలివిలేమి.
అవివేకి. త్స. విణ. తెలివిలేనివాఁడు
అవిశేషము. త్స. విణ. భేదములేనిది.
అవు. దే. క్రి. అగు.
అవుడు. దే. వి. ౧. పెదవి. ౨. దంతము.
అవురుసవురు. దే. విణ. డస్సినది. క్షీణించినది.
అవుల. దే. వి. అవల.
అవుసు. దే. వి. సొగసు.
అవేక్షణము. త్స. వి. చూచుట.
అవ్యక్తరాగము. త్స. విణ. కొంచెము ఎఱుపు.
అవ్యయము. త్స. విణ. ౧. శాశ్వతము. ౨. పరబ్రహ్మము. 3. లింగ విభక్తి వచనములు లేనిపదము.
అవ్యాజము. త్స. వి. కపటములేమి. విణ. కపటములేనిది.
అవ్యుత్పన్నుఁడు. త్స. విణ. పండితుఁడుగానివాఁడు.
అవ్వ. వై. వి. ౧. తల్లి. ౨. తల్లితల్లి. 3. తండ్రితల్లి.
అవ్వల. దే. వి. అవల.
అవ్వారి. దే. విణ. నిరంకుశము. రూ. అవారి.
అశక్తము. త్స. విణ. శక్తముకానిది.
అశక్యము. త్స. విణ. తరముకానిది.
అశనము. త్స. వి. ౧. అన్నము. ౨. భోజనము.
అశనాయ. త్స. వి. ఆఁకలి.
అశని. త్స. వి. ౧. పిడుగు. ౨. వజ్రాయుధము.
అశీతి. త్స. వి. ఎనుబది.
అశుచి. త్స. విణ. నిర్మలముకానిది.
అశుద్ధము. త్స. విణ. అశుచి.
అశుభము. త్స. వి. ఆపద. చేటు.
అశోకము. త్స. వి. కంకేళిపువ్వు.
అశోకుఁడు. త్స. వి. ౧. దశరథుని మంత్రులలో ఒకఁడు. ౨. అశోకవర్ధనుఁడు. 3. శోకములేనివాఁడు.
అశౌచము. త్స. వి. ౧. పురుడు. ౨. మైల.
అశ్రద్ధ. త్స. వి. శ్రద్ధలేమి. అక్కఱలేమి.
అశ్రాంతము. త్స. విణ. ౧. అలయనిది. ౨. ఎడతెగనిది.
అశ్రువు. త్స. వి. కన్నీరు.
అశ్లీలము. త్స. వి. ౧. అర్థదోష విశేషము. ౨. శబ్దదోషవిశేషము. 3. బూతు.
అశ్వతరము. త్స. వి. కంచరగాడిద.
అశ్వత్థము. త్స. వి. రావిచెట్టు.
అశ్వత్థామ. త్స. వి. ద్రోణపుత్త్రుఁడు.
అశ్వము. త్స. వి. గుఱ్ఱము.
అశ్వమేధము. త్స. వి. ఒక యాగము.
అశ్విని. త్స. వి. ఇరువదేడు నక్షత్రములలో ఒకటి.
అషడక్షీణము. త్స. విణ. మూఁడవవానికిఁ దెలియని రహస్యము.

అష్టకము. త్స. విశే. ఎనిమిది పరిమితి గలది.
అష్టమి. త్స. వి. ఎనిమిదవదినము.
అష్టమూర్తి. త్స వి. శివుఁడు.
అసంగతము. త్స. విశే. ౧. కూడనిది. ౨. పొసఁగనిది.
అసడ్డ. వై. వి. అశ్రద్ధ.
అసత్యము. త్స. వి. బొంకుమాట.
అసదు. వై. విశే. అల్పము.
అసదృశము. త్స. విశే. సాటిలేనిది.
అసభ్యము. త్స. విశే. సభకుఁదగనిది.
అసమంజసము. త్స. విశే. బాగుకానిది.
అసమగ్రము. త్స. విశే. పూర్ణము కానిది.
అసమాధానము. త్స. వి. అసమ్మతి.
అసము. దే. వి. ౧. చనువు. ౨. దర్పము. 3. యశము.
అసలు. దే. వి. ౧. అడుసు. ౨. మూలధనము.
అసహనము. త్స. వి. ఓర్వలేమి.
అసహాయుఁడు. త్స. విశే. తోడులేని వాఁడు.
అసహిష్ణువు. త్స.విశే. ఓర్వలేనివాఁడు.
అసహ్యము. త్స. విశే. ఓర్వఁగూడనిది.
అసాధారణము. త్స. విశే. సాధారణముకానిది.
అసాధువు. త్స. విశే. సాధువుకానిది.
అసాధ్యము. త్స. విశే. సాధ్యము కానిది.

అసి. త్స. వి. కత్తి. దే. విశే. అల్పము. (అసికోత.)
అసితము. త్స. వి. నలుపు.
అసిపోవు. దే. క్రి. ౧. క్షీణించు. ౨. తప్పిపోవు.
అసిమి. దే. వి. ఒకవిధమైనసంచి.
అసియాడు. దే. క్రి. కదలు.
అసుర. త్స.వి.౧.రాత్రి.౨.రాక్షసుఁడు.
అసురుఁడు. త్స. వి. ౧. రాక్షసుఁడు. ౨. సూర్యుఁడు.
అసురుసురు. దే. వి. బడలికయందు విడుచు ఊపిరిధ్వన్యనుకరణము.
అసువులు. దే. వి. బ. ప్రాణములు.
అసూయ. దే. వి. ఓర్వలేనితనము.
అస్ఖలితుఁడు. త్స.విశే. చలింపనివాఁడు.
అస్తంగతుఁడు. త్స. విశే. అస్తమించిన వాఁడు. రూ. అస్తగతుఁడు.
అస్తమయము. త్స. వి. అస్తమించుట.
అస్తమించు. త్స. క్రి. ౧. అడఁగు. ౨. ఒఱఁగు.
అస్తవ్యస్తము. త్స. వి. తాఱుమాఱైనది.
అస్తాచలము. త్స. వి. పడమటికొండ.
అస్తేయము. త్స. వి. దొంగిలింపమి.
అస్త్రము. త్స. వి. ౧. బాణము. ౨. కత్తి.
అస్థి. త్స. వి. ఎముక.
అస్థిరము. త్స. విశే. స్థిరముకానిది.
అస్మదీయము. త్స. విశే. మా సంబంధమైనది.

అస్రువు. త్స. వి. కన్నీరు.
అహంకరించు. త్స. క్రి. గర్వించు.
అహంకారము. త్స. వి. గర్వము.
అహంభావము. త్స. వి. నేననుగర్వము.
అహంయువు. త్స. వి. గర్వి.
అహఃపతి. త్స. వి. సూర్యుఁడు.
అహమహమిక. త్స. వి. నేనుముందు నేనుముందు అనుకొనుట.
అహము. త్స. వి. దినము. పగలు.
అహహ. అహహా. అహో. } దే. అవ్య. ఔర.
అహోరే. అహోరే. } దే. అవ్య. అహా.
అహర్దినము. త్స. వి. ప్రతిరోజు.
అహార్యము. త్స. వి. కొండ.
అహి. త్స. వి. పాము.
అహింస. త్స. వి. హింసలేమి.
అహితుఁడు. త్స. వి. పగవాఁడు.
అహితుండికుఁడు. త్స. వి. పాములవాఁడు.
అహో. త్స. అవ్య. అహహా.
అహోరాత్రము. త్స. వి. పగలును రేయియు.
అళి. త్స. వి. ౧. తుమ్మెద. ౨. తేలు.
అళిని. త్స. వి. ఆడుతుమ్మెద.
అళియ. దే. వి. అల్లుఁడు.
అళీకము. త్స. వి. కల్ల.
అళుకు. దే. వి. భయము.

# ఆ

ఆంజనేయుఁడు. త్స. వి. హనుమంతుఁడు.
ఆంతర్యము. త్స. వి. తలఁపు. భావము.
ఆందోళన. త్స. వి. ఊఁగుట.
ఆందోళనము. త్స. వి. ,,
ఆందోళము. త్స. వి. పల్లకి.
ఆందోళించు. త్స. క్రి. ఊఁగు.
ఆందోళిక. త్స. వి. అందలము.
ఆంధ్యము. త్స. వి. గ్రుడ్డితనము.
ఆంధ్రుఁడు. త్స. వి. తెలుఁగుదేశస్థుఁడు.
ఆంబికేయుఁడు. త్స. వి. ౧. ధృతరాష్ట్రుఁడు. ౨. కుమారస్వామి.
ఆఁక. దే. వి. ౧. అడ్డగింత. ౨. చెఱ. 3. నిషేధము.
ఆఁకట్టు. దే. క్రి. అడ్డగించు.
ఆఁకరము. దే. వి. చలము. పట్టుదల.
ఆఁకలి. దే. వి. క్షుత్తు.
ఆఁగు. దే. క్రి. ౧. అణఁగు. ౨. అడ్డగించు. 3. మోచు.
ఆఁటుది. దే. వి. ఆఁడుది.
ఆఁటు. దే. క్రి. ౧. చాలు. ౨. తాళు.

ఆఁడది. దే. వి. స్త్రీ. ఆఁడుది.
ఆఁడుఁగట్టు. దే. వి. ఆఁడుదానికోఁక కట్టు.
ఆఁడుగూఁతురు. దే. వి. వనిత.
ఆఁడుఁదోడు. దే. వి. ౧. తోఁబుట్టు. ౨. స్త్రీసాహాయ్యము.
ఆఁడుఁబడుచు. దే. వి. ౧. కొమార్తె. ౨. మగనిసోదరి.
ఆఁడుఁబాప. దే. వి. కన్నియ.
ఆఁడుఁబుట్టువు. దే. వి. ౧. ఆఁడుది. ౨. స్త్రీ జన్మము.
ఆఁడుది. దే. వి. స్త్రీ.
ఆఁడుబిడ్డ. దే. వి. ౧. స్త్రీ శిశువు. ౨. కూఁతురు.
ఆఁదోఁకగా. దే. వి. ఆవుతోఁకయొక్క యాకారముగా.
ఆఁపు. దే. క్రి. ఆఁచు. వి. అడ్డగింత.
ఆఁబడ్డ. దే. వి. ఆవుపెయ్య.
ఆఁబెయ్య. దే. వి. ,,
ఆఁబోతు. దే. వి. ౧. అచ్చువేసిన యెద్దు. ౨. యెద్దు.
ఆకంపించు. దే. క్రి. వణఁకు.
ఆకట. దే. అవ్య. అక్కటా.
ఆకతాయి. దే. వి. పోకిరి. తుంటరి.
ఆకరము. త్స. వి. ౧. రత్నములుండు చోటు. గని. ౨. సమూహము.
ఆకర్ణనము. త్స. వి. వినుట.
ఆకర్ణించు. త్స. క్రి. విను.
ఆకర్షణము. త్స. వి. లాగుట.
ఆకర్షించు. త్స. క్రి. తివియు. లాగు.
ఆకసము. వై. వి. ఆకాశము.
ఆకస్మికము. త్స. విశ. ఉన్నట్టుండి కలిగినది.
ఆకళించు. దే. క్రి. జ్ఞప్తికి దెచ్చుకొను. (వి. ఆకళింత.)
ఆకాంక్ష. త్స. వి. కోరిక. అభిలాష. (క్రి. ఆకాంక్షించు.)
ఆకారము. త్స. వి. రూపము.
ఆకాలికము. త్స. విశ. అకాలమునందుఁ బుట్టినది.
ఆకాశము. త్స. వి. ఆకసము. పెదలు.
ఆకు. దే. వి. ౧. వృక్షమునందలి యాకు. దళము. ౨. విస్తరాకు. ౩. చెవికమ్మ. ౪. చీటి.
ఆకుటిల్లు. దే. వి. ఆకులతోఁ గట్టిన యిల్లు. పర్ణశాల.
ఆకుఁబచ్చ. దే. వి. ఆకుపసురరంగు.
ఆకుపోయు. దే. క్రి. నాఱుపోయు.
ఆకుఱాయి. దే. వి. ఇనుములోనగు వానిని తెగరాచెడి పనిముట్టు.
ఆకులత. దే. వి. వ్యాకులము. కలత.
ఆకులపడు. దే. క్రి. వ్యాకులమునొందు.
ఆకృతి. త్స. వి. ౧. రూపము. ౨. శరీరము.
ఆకొత్తు. దే. వి. అడకొత్తు.
ఆక్రందనము. త్స. వి. రోదనము.
ఆక్రందము. త్స. వి. ౧. ఏడ్పు. ౨. పిలుపు. క్రి. ఆక్రందించు.

ఆక్రమించు. త్స. క్రి. కప్పుకొను. (వి. ఆక్రమణము.)

ఆక్రీడము. త్స. వి. ఉద్యానము.

ఆక్రోశనము. త్స. వి. ౧. తిట్టు. ౨. రక్షణార్థము బిగ్గరగా అఱచుట.

ఆక్రోశము. త్స. వి. ,,

ఆక్షిప్తము. త్స. వి. ౧. ఈడ్వఁబడినది. ౨. చెదరినది. 3. దూషింపఁబడినది.

ఆక్షేపము. త్స. వి. ౧. అర్థాలంకారములలో ఒకటి. ౨. నింద. 3. కలఁత.

ఆక్షేపించు. త్స. క్రి. ౧. నిందించు. ౨. అడ్డగించు.

ఆఖండలుఁడు. త్స. వి. శత్రువులను ఖండించువాఁడు. ఇంద్రుఁడు.

ఆఖువు. త్స. వి. ఎలుక.

ఆఖేటకము. త్స. వి. వేఁట.

ఆఖ్య. త్స. వి. పేరు.

ఆఖ్యానకము. త్స. వి. చిన్నకథ.

ఆఖ్యానము. త్స. వి. చెప్పుట.

ఆఖ్యాయిక. త్స. వి. యథార్థమగు కథగల గ్రంథము.

ఆగంతుకము. త్స. విణ. కాలనియమము లేక వచ్చునది; అకస్మికముగా సంభవించునది.

ఆగడపలు. దే. వి. మేఘశకలముల దొంతులు.

ఆగడము. దే. వి. అకార్యము.

ఆగతము. త్స. విణ. ౧. వచ్చినది. ౨. పొందఁబడినది.

ఆగమనము. త్స. వి. రాక.

ఆగమము. త్స. వి. ౧. రాక. ౨. అధికముగావచ్చు నక్షరము. 3. దేవపూజలు సేయువిధానము, వానికి సంబంధించిన విషయములు దెలుపు గ్రంథము.

ఆగము. దే. వి. తొందర.

ఆగస్సు. త్స. వి. అపరాధము.

ఆగాత్యము. దే. వి. స్వల్పమును గొప్పగఁజేసి కావించెడు నఱపు, ఏడ్పు మొదలగునది. (ఇది వాడుకలో ఆగాయిత్యము. అగాత్యము. ఆకాత్యము. ఆగాయిత్తు. ఆఘాత్యము. ఓగాత్యము అని.)

ఆగుబ్బు. దే. వి. మిక్కుటము.

ఆగ్రహము. త్స. వి. ౧. కోపము. ౨. ఆసక్తి.

ఆగ్రహారికుఁడు. త్స. విణ. అగ్రహార మనుభవించువాఁడు.

ఆగ్రహించు. త్స. క్రి. కోపించు.

ఆఘాతము. త్స. వి. ౧. కొట్టుట. ౨. దెబ్బ.

ఆఘూర్ణనము. త్స. వి. తిరుగుట.

ఆఘోషణము. త్స. వి. చాటుట.

ఆఘ్రాణించు. త్స. క్రి. మూర్కొను. వి. ఆఘ్రాణము.

ఆచమించు. త్స. క్రి. చూపుడు వ్రేలు

పాదవుగా నిలిపి, పుడిసిటి జలము గ్రహించి మూఁడుతడవలు పుచ్చుకొను. వి. ఆచమనము.
ఆచరించు. త్స. క్రి. నడపు. వి. ఆచరణము. విశ. ఆచరణీయము.
ఆచారము.త్స.వి.౧.వాడుక. ౨. నడత.
ఆచార్య. త్స. వి. ఉపాధ్యాయురాలు.
ఆచార్యకార్యము. త్స. వి. ఉపాధ్యాయ ధర్మము.
ఆచార్యాని. త్స. వి. ఆచార్యునిభార్య.
ఆచార్యుఁడు. త్స. వి. ఉపాధ్యాయుఁడు.
ఆచ్ఛన్నము. త్స. వి. కప్పఁబడినది.
ఆచ్ఛాదనము. త్స. వి. ౧. వస్త్రము. ౨. తప్పును గప్పుట.
ఆచ్ఛాదము. త్స. వి. కప్పు.
ఆచ్ఛిన్నము. త్స. వి. పూర్తిగా ఛేదింపఁబడినది.
ఆజానేయము. త్స. వి. ఉత్తమాశ్వము.
ఆజి. ౧. యుద్ధము. ౨. సమరభూమి.
ఆజీవము. త్స. వి. బ్రదుకు.
ఆజ్ఞ. త్స. వి. ఉత్తరువు.
ఆజ్ఞప్తి. త్స. వి. ఆగతి.
ఆజ్ఞాపించు. త్స. క్రి. ఉత్తరువుసేయు.
ఆజ్యము. త్స. వి. నెయ్యి.
ఆట. దే. వి. క్రీడ.
ఆటంకము. త్స. వి. అడ్డంకము.
ఆటకత్తియ. } దే. వి. నాట్యము
ఆటకత్తె. } చేయు నాఁడుది.
ఆటకాఁడు. దే. వి. ౧. నాట్యము సలుపువాఁడు. దొమ్మరివాఁడు.
ఆటగొజ్జు. దే. వి. మూఁడు కజ్జిలు కలగొజ్జు.
ఆటతోఁట. దే. వి. ఉద్యానవనము.
ఆటది. దే. వి. నర్తకి. వేశ్య.
ఆటపట్టు. దే. వి. ౧. ఉనికిపట్టు. ౨. నర్తనశాల.
ఆటసాక. దే. వి. నాట్యశాల.
ఆటవిడుపు. దే. వి. చదువుకొను బాలుర ఆడుకొనుటకై వారిని వదలిపెట్టుట.
ఆటవెలఁది. దే. వి. ౧. నాట్యము సేయునట్టి స్త్రీ. ౨. సీసపద్యాంతమున వచ్చు రెండు పద్యములలో ఒకటి.
ఆటాడు. దే. క్రి. క్రీడించు.
ఆటీకనము. త్స. వి. గమనము.
ఆటీకము. త్స. వి. సంచరించునది.
ఆటు. దే. వి. ౧. కొట్టు. ౨. దెబ్బ.
ఆటోపము. త్స. వి. ౧. వేగిరపాటు. ౨. ఆడంబరము. 3. గర్వము. క్రి. ఆటోపించు.
ఆడ. దే. వి. ఏ. అక్కడ.
ఆడంబరము. త్స. వి. ౧. డంబము. ౨. వేగిరపాటు. 3. హర్షము.
ఆడిక. దే. వి. ౧. నింద. ౨. ప్రతిజ్ఞ. 3. బాస.
ఆడికపడు. దే. క్రి. నిందపడు.

ఆడికోలు. దే. వి. నింద.

ఆడిపోసికొను. దే. వి. నిందించు.

ఆడు. దే. క్రి. ౧. ఆటను ఆడు. నాట్యము చేయు. ౨. కదలు. ౩. స్నానము చేయు. ౪. నాటు. ౫. తిరుగు. ౬. నిందించు. ౭. చెప్పు. ౮. నడపు.

ఆడుకొను. దే. క్రి. ౧. నిందించు. ౨. పలుకు.

ఆఢ్యుఁడు. త్స. విశే. సంపదకలవాఁడు.

ఆణి. దే. వి. ౧. వర్తులత్వము. ౨. ఒకజాతిముత్యము.

ఆణిపూస. దే. వి. ముత్యము.

ఆణెము. దే. వి. దేశము. (తెలుంగాణెము. మొ.)

ఆతంకము. త్స. వి. ౧. రోగము. ౨. సంతాపము. ౩. సందేహము. ౪. భయము.

ఆతఁడు. దే. స. అతఁడు.

ఆతగాఁడు. దే. స. అతఁడు.

ఆతతము. త్స. విశే. విశాలము.

ఆతతాయి. త్స. విశే. చంపఁబూనినవాఁడు. "౧. ఇంట నిప్పిడువాఁడు. ౨. విషము పెట్టువాఁడు. ౩. కత్తితో నఱుకువాఁడు. ౪. ధనము దోఁచుకొనువాఁడు. ౫. చేలనప హరించువాఁడు. ౬. ఒకనిభార్యను చెఱపెట్టువాఁడు" అని వీ రార్గురు.

ఆతపత్త్రికము. త్స. వి. గొడుగు. రూ. ఆతపత్త్రము.

ఆతపము. త్స. వి. ఎండ.

ఆతపవారణము. త్స. వి. గొడుగు.

ఆతల. దే. వి. అవతల.

ఆతిథేయము. త్స. విశే. అతిథికి యోగ్యమైనది.

ఆతిథేయుఁడు. త్స. విశే. అతిథిసత్కారము చేయువాఁడు.

ఆతిథ్యము. త్స. వి. అతిథిసత్కారము.

ఆతిథ్యుఁడు. త్స. వి. అతిథి. పేరు.

ఆతురుఁడు. త్స. విశే. ౧. వ్యాధిగ్రస్తుఁడు. ౨. వేగిరపడువాఁడు.

ఆత్తము. త్స. విశే. ౧. గ్రహింపఁబడినది. ౨. హరింపఁబడినది. (ఆత్తగర్వుఁడు = గర్వముహరింపఁబడినవాఁడు)

ఆత్మ. త్స. వి. ౧. జీవుఁడు. ౨. బుద్ధి. రూ. ఆత్మము.

ఆత్మంభరి. త్స. విశే. కుక్షింభరి.

ఆత్మజ. త్స. వి. కూఁతురు.

ఆత్మజుఁడు. త్స. వి. కొడుకు.

ఆత్మారాముఁడు. త్స. విశే. యోగి.

ఆత్మీయము. త్స విశే. తనది.

ఆత్రగాఁడు. దే. విశే. త్వరపడువాఁడు.

ఆత్రేయుఁడు. త్స. విశే. ౧. అత్రివంశమునఁ బుట్టినవాఁడు. ౨. చంద్రుఁడు.

ఆద. దే. వి. మనస్సు. (ఆదమఱచు.)

ఆదట. దే. వి. ప్రీతి.

ఆదటపోవు. దే. క్రి. తృప్తిఁజెందు.

ఆదరబాదర. దే. విశే. మిక్కిలి తొందరగా.

ఆదరము. త్స. వి. ౧. మన్నన. ౨. పాటింపు.
ఆదరువు. దే. వి. ఆధారము.
ఆదర్శము. త్స. వి. ౧. అద్దము. ౨. దృష్టాంతము.
ఆదాయము. త్స. వి. ౧. లాభము. ౨. ధనము.
ఆది. త్స. విణ. ప్రథమము. దే. వి. కొలఁత.
ఆదికొను. దే. క్రి. ౧. సూటిగాఁబరుగెత్తు. ౨. ఎదుర్కొను.
ఆదితేయుఁడు త్స. విణ. అదితికొడుకు. వేల్పు.
ఆదిత్యవారము. త్స. వి. ఆదివారము.
ఆదిత్యుఁడు. త్స. వి. ౧. వేలుపు. ౨. సూర్యుఁడు.
ఆదిమము. త్స. విణ. మొదటిది.
ఆదివారము. త్స. వి. మొదటివారము.
ఆదుకొను. దే. క్రి. ౧. ఆగకయుగు. ౨. ఆదరించు. 3. రక్షించు.
ఆదేశము. త్స. వి. ౧. ఉత్తరువు. ౨. ఉపదేశము. 3. ఒకయక్షరమును బోఁగొట్టి దానిస్థానమున వచ్చునట్టి వేరొక యక్షరము.
ఆదేశించు. త్స. క్రి. ఉత్తరువుచేయు.
ఆద్యము. త్స. విణ. మొదటిది.
ఆధారము. త్స. వి. ౧. ఆదరువు. ౨. జలముండుచోటు (3) దారి.
ఆధి. త్స. వి. మనోవ్యాధి.
ఆధిక్యము. త్స. వి. గొప్పతనము.
ఆధిపత్యము. త్స. వి. దొరతనము.
ఆధునికము. త్స. వి. ౧. ఇప్పటిది. ౨. క్రొత్తది.
ఆధూతము. త్స. విణ. కంపితము.
ఆధోరణుఁడు. త్స. వి. మావటీఁడు.
ఆధ్మాతము. త్స. విణ. ఊఁదఁబడినది.
ఆన. వై. వి. ౧. ఆజ్ఞ. ౨. ఒట్టు. 3. ప్రమాణము.
ఆనంతర్యము. త్స. వి. అనంతరత్వము
ఆనందము. త్స. వి. సంతోషము. క్రి. ఆనందించు.
ఆనందవనము. త్స. వి. కాశి.
ఆనకట్ట. దే. వి. అడ్డకట్ట.
ఆనకదుందుభి. త్స. వి. వసుదేవుఁడు.
ఆనకము. త్స. వి. ౧. తప్పెట. ౨. భేరి. 3. మద్దెల.
ఆనతి. వై. వి. ౧. ఆజ్ఞ. ౨. మ్రొక్కు.
ఆనతిచ్చు. దే. క్రి. సెలవిచ్చు. చెప్పు.
ఆననము. త్స. వి. ౧. ముఖము. ౨. నోరు.
ఆనపెట్టు. దే. క్రి. ఆజ్ఞాపించు.
ఆనపాడుచు. దే. క్రి. ,,
ఆనమితము. త్స విణ. పంపఁబడినది.
ఆనయనము. త్స. వి. తెచ్చుట.
ఆనవాలు. } దే. వి. ౧. గుఱుతు. ౨.
ఆనాలు. } ఇగురఁగాచిన పాలు.
ఆనిక. దే. వి. ఆధారము. ప్రాపు. ఊఁత.

ఆనీతము. త్స. విణ. తేఁబడినది.
ఆను. దే. క్రి. ౧. ఆధారమగు. ౨. ఒఱగు. 3. అదుము. ౪. పట్టుకొను.
ఆనుకట్టు. దే. వి. ఊఁతకొయ్య. రూ. అనుగట్టు.
ఆనుకూల్యము. త్స. వి. అనుకూలత. ఒద్దిక.
ఆనుకొను. దే. క్రి. ఒఱగు.
ఆనుపూర్వ్యము. త్స. వి. అనుక్రమము.
ఆనుయాత్రికుఁడు. త్స. విణ. సహచరుఁడు.
ఆనులోమ్యము. త్స.వి. యుక్తక్రమము.
ఆనుషంగికము. త్స. విణ. అప్రధానము. (ప్రసంగవశమున వచ్చినది.)
ఆన్వీక్షకి. త్స. వి. తర్కవిద్య. రూ. ఆన్వీక్షికి.
ఆపగ. త్స. వి. నది.
ఆపణము. త్స. వి. అంగడి.
ఆపణికుఁడు. త్స. విణ. అంగడివాఁడు.
ఆపత్తి. త్స. వి. ఆపద. రూ. ఆపత్తు.
ఆపద. త్స. వి. కీడు. చేటు.
ఆపసోపాలుపడు. దే. క్రి. ఉస్సురస్సను.
ఆపాతము. త్స. వి. తత్కాలము. (ఆపాతరమణీయము)
ఆపాదిల్లు. త్స. క్రి. కలుగు.
ఆపీడము. త్స. వి. ౧. నలుగుడు. ౨. పిగదండ.
ఆపీతము. త్స. విణ. త్రాగఁబడినది.
ఆపె. దే. స. ఆమె.
ఆపోక. దే. వి. ౧. ఆపోవుట. ౨. తనివి.
ఆపోవు. దే. క్రి. తనియు.
ఆపోశనము. త్స. వి. భుజించుటకు ముందును తరువాతను నీరు త్రాగుట. రూ. ఆపోశానము. ఆపోసనము.
ఆప్తము. త్స. విణ. ౧. పొందఁబడినది. ౨. ముఖ్యమైనది.
ఆప్తుఁడు. త్స. వి. హితుఁడు.
ఆబ. దే. వి. అత్యాశ.
ఆబాధము. త్స. వి. పీడ. దుఃఖము.
ఆబిడ. దే. వి. ఆమె.
ఆబ్దికము. త్స. వి. ౧. ఏఁడుడి. ౨. సంవత్సరమునకు జేయవలసిన పన్నుము.
ఆభరణము. త్స. వి. సొమ్ము.
ఆభాణకము. త్స. వి. లోకోక్తి. జనప్రవాదము.
ఆభాసము. త్స. వి. ఒకటి మఱొకటిగా గనఁబడుట యను దోషము.
ఆభిచారికము. త్స. విణ. శత్రుమారణాదులకు సంబంధించిన మంత్రాది.
ఆభీరుఁడు. త్స. వి. గొల్లవాఁడు.
ఆభీలము. త్స. విణ. భయంకరము.
ఆమంత్రణము. త్స. వి. ౧. పిలుపు. ౨. వీడుకోలు.
ఆమడ. దే. వి. నాలుగుక్రోసుల దూరము. పదిమైళ్ల దూరము.

ఆమతించు. దే. క్రి. ౧. పిలుచు. ౨. పూజించు.

ఆమని. దే. వి. ౧. వసంతకాలము. ౨. మిక్కుటము.

ఆమము. సం. వి. ౧. పక్వముగానిది.

ఆమయము. త్స. వి. రోగము.

ఆమయావి. త్స. విణ. రోగి.

ఆమలకము. త్స. వి. ఉసిరికకాయ.

ఆమవడ. దే.వి. పొంగించిన పుల్లపెరుగులో నానవేసినవడ.

ఆమిషము. త్స వి. ౧. మాంసము. ౨. భోగ్యవస్తువు. 3. లోభనీయమగు వస్తువు.

ఆము. దే. వి. క్రొవ్వు. మదము.

ఆముకొను. దే. క్రి. క్రొవ్వు.

ఆముష్మికము. త్స. విణ. పరలోకమునం గలుగునది.

ఆముష్యాయణుండు త్స. విణ. ప్రఖ్యాతవంశోద్భవుడు.

ఆమూలము. త్స. అవ్య. మొదలంటు.

ఆమె. దే. స. ౧. ఆపె. ౨. ఆ పూజ్యురాలు.

ఆమెత దే. వి. విందు.

ఆమోదము. త్స. వి. ౧. దూరమునం గొట్టు మంచివాసన. ౨. సంతోషము.

ఆమ్నాతము. త్స. విణ. చక్కగా అభ్యసింపంబడినది.

ఆమ్నాయము. త్స. వి. వేదము.

ఆమ్రేడితము. త్స. వి. ద్విరుక్తము యొక్క పరరూపము. విణ. రెండు మూడు సారులు చెప్పంబడినది. (పదము.)

ఆమ్లము త్స. విణ. పుల్లనిది.

ఆయకట్టు. దే. వి. ౧. వచ్చుబడి. ౨. ఇంతవచ్చునని అంచన వేయుట.

ఆయకము. దే. వి. తాకట్టు. కుదువ.

ఆయతనము త్స. వి. ఇల్లు.

ఆయతము. త్స. విణ. దీర్ఘము.

ఆయతి. త్స. వి. ౧. నిడుపు. ౨. వచ్చుబడి.

ఆయత్తము. త్స. విణ. అధీనము.

ఆయన. దే. స. అతండు.

ఆయఱచు. దే. క్రి. సాగుచేయు.

ఆయమ. దే. స. ఆమె.

ఆయము. త్స. వి. ౧. వచ్చుబడి. ౨. జీవస్థానము.

ఆయలె. దే. అవ్య. అవులెమ్మా.

ఆయల్లకము. త్స. వి. విరహము. తహతహపాటు.

ఆయవడారము. దే. క్రి. విణ. ౧. బొత్తిగా. ౨. రమారమి.

ఆయవారము. దే. వి. బిచ్చమెత్తుట.

ఆయసము. త్స. విణ. లోహమయము.

ఆయస్తము. త్స. విణ. ఆయాసపడినది.

ఆయాతము. త్స. వి. రాక. (యాతాయాతములు = పోకరాకలు.)

ఆయామము. త్స. వి. దైర్ఘ్యము.

ఆయాసపడు. త్స. క్రి. శ్రమపడు.
ఆయాసము. త్స. వి. శ్రమ.
ఆయితపడు. దే. క్రి. సిద్ధమగు.
ఆయితము. / ఆయిత్తము. } దే. విణ. సిద్ధము.
ఆయుధకుఁడు. త్స. విణ. యోధుఁడు.
ఆయుధము. త్స. వి. శస్త్రము.
ఆయుధీయుఁడు. త్స. విణ. ఆయుధముచే బ్రతుకువాఁడు.
ఆయుర్వేదము. త్స. వి. వైద్యశాస్త్రము.
ఆయువు. త్స. వి. జీవితకాలము.
ఆయుష్కర్మము. త్స. వి. క్షౌరము. (వ్యవహారము.)
ఆయుష్మంతుఁడు. త్స. విణ. దీర్ఘకాలము బ్రదుకువాఁడు.
ఆయుష్యము. త్స. విణ. ఆయుస్సాధనము. వి. దీర్ఘాయువు.
ఆయోజనము. త్స. వి. కూర్పు.
ఆయోధనము. త్స. వి. యుద్ధము.
ఆరంభకుఁడు. త్స. విణ. మొదటఁజేయువాఁడు.
ఆరంభము. త్స. వి. ౧. యత్నము. ౨. గర్వము. 3. త్వర. క్రి. ఆరంభించు.
ఆరకూటము. త్స. వి. ఇత్తడి.
ఆరగించు. దే. క్రి. భుజించు. త్రాగు.
ఆరగింత. దే. వి. ఆహారము.
ఆరగింపు. దే. వి. ఆహారము.
ఆరజేము. దే. విణ. ౧. ఇంపైనది. ౨. కలధ్వని.
ఆరటపడు. దే. క్రి. పరితపించు. వి. ఆరటపాటు.
ఆరటము. దే. వి. పరితాపము. రూ. ఆరాటము.
ఆరటించు. దే. క్రి. పరితపించు.
ఆరడము. దే. వి. పూనిక.
ఆరణ్యకము. త్స. విణ. అరణ్యమునఁ బుట్టినది. రూ. ఆరణ్యము.
ఆరతి. దే. వి. హారతి.
ఆరభటి. త్స. వి. ౧. శూరత్వము. ౨. ప్రౌఢి 3. అతిశయము.
ఆరయు. దే. వి. విచారించు.
ఆరవము. త్స. వి. ధ్వని.
ఆరాటము. దే. వి. ఆరటము.
ఆరాత్రికము. త్స. వి. హారతి.
ఆరాధనము. త్స. వి. ౧. ఆరాధించుట. ౨. ప్రాప్తి.
ఆరాధించు. త్స. క్రి. సంతోషపఱుచు
ఆరామము. త్స. వి. తోఁట.
ఆరావము. త్స. వి. ధ్వని.
ఆరిదేఱు. దే. క్రి. సమర్థుఁడగు.
ఆరు. దే. క్రి. ౧. కలుగు. ౨. నిండు. 3. నిండ. వి. గోమావళి.
ఆరుక. / ఆరుగ. } దే. వి. ఒకవిధమైన ధాన్యము.
ఆరూఢము. త్స విణ. ఎక్కినది.
ఆరూఢి. త్స. వి. ఎక్కుట.

ఆరుదూఱు. దే. వి. అల్లరి.
ఆఱుపోరు. దే. వి. విడువని కలహము.
ఆరెకుఁడు. దే. వి. తలారి.
ఆరోగిణము. వై. వి. అన్నము.
ఆరోగ్యము. త్స. వి. రోగము లేకుండుట.
ఆరోపించు. త్స. క్రి. లేనిదానిని మోపు. వి. ఆరోపము. ఆరోపణము.
ఆరోహణము. త్స. వి. ౧. ఎక్కుట. ౨. నిచ్చెన.
ఆరోహము. త్స. వి. ౧. ఎక్కుట. ౨. ఉన్నతి. 3. పిఱుఁదు.
ఆర్చు. దే. క్రి. ౧. కూయు. ౨. బొబ్బరించు. 3. అడించు. ౪. ఆఱఁజేయు.
ఆర్జనము. త్స. వి. గడన.
ఆర్జించు. త్స. క్రి. సంపాదించు.
ఆర్తము. త్స. విశే. ౧. పీడితము. ౨. కష్టదశయందున్నది.
ఆర్తి. త్స. వి. ౧. దుఃఖము. ౨. వింటికొప్పు.
ఆర్త్విజము. త్స. వి. ఋత్విజునిభావము.
ఆర్థికము. త్స. విశే. అర్థమువలన వచ్చినది.
ఆర్దము. దే. వి. ఆఱుతూములు.
ఆర్ద్ర. త్స. వి. ఇరువదియేడు నక్షత్రములలో ఒకటి.
ఆర్భటము. త్స. వి. విజృంభణము.
ఆర్భటి. త్స. వి. ,,
ఆర్భాటము. త్స. వి. విజృంభణము.
ఆర్భాటించు. త్స. క్రి. ధ్వనించు.
ఆర్య. త్స. వి. ౧. పదునాలుగేండ్ల ప్రాయముకల యాఁడుది. ౨. పార్వతి.
ఆర్యపుత్త్రుఁడు. త్స. వి. (నాటకములలో) పెనిమిటి.
ఆర్యావర్తము. త్స. వి. హిమవత్పర్వతములకును, వింధ్యపర్వతములకును, నడుమనుండు భూమి.
ఆర్యుఁడు. త్స. వి. విశే. ౧. పూజ్యుఁడు. ౨ మంచివాఁడు.
ఆర్షము. త్స. విశే. ఋషిసంబంధమైనది.
ఆఱడి. దే. వి. నింద. విశే. వ్యర్థము. క్రి. ఆఱడిపడు.
ఆఱడిపోవు. దే. క్రి. నిష్ఫలమగు; చెడు.
ఆఱు. దే. క్రి. ౧. తడి తీసిపోవు. ౨. క్షీణించు. 3. నెమ్మదిపడు. స. అయిదును ఒకటియును.
ఆఱుగురు. దే. స. ఆఱుమంది. రూ. ఆఱువురు.
ఆఱుచు. దే. ప్రే. ౧. తడి తీసిపోవునట్లుచేయు. ౨. నశింపఁజేయు. 3. నెమ్మదిపడఁజేయు.
ఆఱుపు. దే. క్రి. ఆఱుచు. వి. ౧. కూఁత. ౨. బొబ్బరింత. రూ. ఆర్పు.

ఆలంబనము. త్స. వి. ౧. తోంత. ౨. ప్రేలాడుట.
ఆలంబము. త్స. వి. ,,
ఆలంభనము. త్స. వి. హింసనము.
ఆలంభము. త్స. వి. ,,
ఆలకాపరి. దే. వి. ఆవులఁ గాఁచు వాఁడు. కృష్ణుఁడు.
ఆలకించు. దే. క్రి. ౧. ఆదరించు. ౨. విను. రూ. ఆలించు.
ఆలన. దే. వి. మొఱ్ఱ వినుట.
ఆలపించు. దే. క్రి. రాగము దిన్నగా నీడ్చు. రూ. ఆలాపించు.
ఆలపోతు. దే. వి. వృషభము.
ఆలము. దే. వి. ౧. యుద్ధము. ౨. అలక్ష్యము. 3. అసత్యము.
ఆలయము. త్స. వి. ఇల్లు.
ఆలరి. దే. విశ. చెడ్డస్వభావము కల వాఁడు.
ఆలఱేఁడు. దే. వి. ఆపోతెద్దు.
ఆలవాలము. త్స. వి. పాదు.
ఆలసించు. దే. క్రి. తడయు.
ఆలస్యము. త్స. వి. ౧. సోమరితనము. ౨. జాగు. విశ. సోమరి.
ఆలాతము. త్స. వి. కొఱవి.
ఆలానము. త్స. వి. ఏనుగునొక్క కట్టు కంబము.
ఆలాపము. త్స. వి. ౧. ముచ్చట. ౨. రాగాలాపము.
ఆలి. దే. వి. పరిహాసము.
ఆలింగనము. త్స. వి. కవుఁగిలి, కౌఁగిలి.
ఆలించు. దే. క్రి. విను.
ఆలిసేయు. దే. క్రి. పరిహసించు.
ఆలీఢము. త్స. విశ. ౧. నాకఁబడినది. ౨. గాయపడినది.
ఆలు. దే. వి. ౧. భార్య. (అసమాసము) ౨. ఆఁడుది. 3. ముద్దరాలు. ౪. బాలింతరాలు.
ఆలూనము. త్స. వి. త్రెంచఁబడినది.
ఆలేఖ్యము. త్స. వి. చిత్తరువు.
ఆలేపనము. త్స. వి. పూఁత.
ఆలేపము. త్స. వి. ,,
ఆలోకనము. } త్స. వి. ౧. చూపు. ౨.
ఆలోకము. } ఎండ. క్రి. ఆలోకించు.
ఆలోచన. త్స. వి. యోజన. క్రి. ఆలోచించు.
ఆలోడనము. త్స. వి. కలఁత.
ఆవటించు. దే. క్రి. అనుకూలతపఱచు.
ఆవటిల్లు. దే. క్రి. అనుకూలపడు. వి. ఆవటము.
ఆవడి. దే. వి. చేటు. ఉపద్రవము.
ఆవము. దే. వి. కాల్చుటకై పేర్చిన కుండల కొఱవి.
ఆవరణము. త్స. వి. ౧. మూఁత. కప్పు. ౨. చోటు.
ఆవరించు. త్స. క్రి. చుట్టుకొను.
ఆవర్జనము. త్స. వి. ౧. వంచుట. ౨. వశీకరణము.
ఆవర్తము. త్స. వి. సుడి.

ఆవల. దే. వి. ౧. అప్రక్క. ౨. పిమ్మట.
ఆవలించు. దే. క్రి. ఆవులించు.
ఆవశ్యకము. త్స. వి. అక్కఱ. విశే. అక్కఱయైనది.
ఆవసథము. త్స. వి. ఇల్లు.
ఆవహిల్లు. త్స. క్రి. కలుగు.
ఆవాపము. త్స. వి. విత్తులు నాటుట.
ఆవాలము. త్స. వి. పాదు.
ఆవాసము. త్స. వి. ఇల్లు.
ఆవాహనము. త్స. వి. పిలుపు.
ఆవి. దే. వి. ౧. శ్వాసము. ఊపిరి. ౨. తాపము.
ఆవించు. దే. వి. వాసెనమీఁదఁబెట్టి ఆవిరితో నుడికించు.
ఆవిరి. దే. వి. ఉడుకునీటనుండి పైకి వచ్చు జలాంతర్భూతమైన నేఁడి గాలి.
ఆవిరిల్లు. దే. క్రి. చెమర్చు.
ఆవిర్భావము. త్స. వి. ౧. బయటపడుట. ౨. పుట్టుక.
ఆవిలము. త్స. విశే. కలఁగఁబడినది.
ఆవిష్కారము. త్స. వి. ప్రకటించుట.
ఆవు. దే. వి. గోవు.
ఆవురు. దే. ఏడ్పునందలి యనుకరణము.
ఆవులించు. దే. క్రి. ఆవులింత విడుచు. వి. ఆవులింత.
ఆవృత్తము. త్స. విశే. గుండ్రముగఁ ద్రిప్పఁబడినది.
ఆవృత్తి. త్స. వి. ౧. మాఱు. ౨. తిరిగి వచ్చుట.
ఆవేగము. త్స. వి. చిత్తసంభ్రమము.
ఆవేదనము. త్స. వి. ౧. విన్నవించుట. ౨. వ్యాజ్యము.
ఆవేశనము. త్స. వి. ౧. కమసాలి. కంచర. కుమ్మరి. వడ్లంగి. బైట కుమ్మరి. మున్నగువారు పనులు చేయు కర్మశాల. శిల్పశాల. ౨. ప్రవేశించుట.
ఆవేశము. త్స. వి. ౧. నివము. ౨. అభినివేశము. 3. కోపము.
ఆశ. త్స. వి. ౧. ఆస, కోరిక. ౨. దిక్కు. 3. అగ్ని.
ఆశంక. త్స. వి. ౧. భయము. ౨. సందేహము. 3. అనిష్టచింతనము.
ఆశంస. త్స. వి. కోరిక.
ఆశంసనము. త్స. వి. ,,
ఆశపడు. దే. క్రి. కోరు.
ఆశయము. త్స. వి. ౧. అభిప్రాయము. ౨. ఆధారము.
ఆశాసనము. త్స. వి. ఆశీర్వాదము.
ఆశీర్వదించు. త్స. క్రి. దీవించు. వి. ఆశీర్వాదము.
ఆశీవిషము. త్స. వి. పాము.
ఆశీస్సు. త్స. వి. దీవన.
ఆశుకవిత్వము. త్స. వి. వేగముగ కవిత్వము చెప్పుట.
ఆశుగము. త్స. వి. బాణము.

ఆశువు. త్స. విశ. వేగము కలది.
ఆశౌచము. త్స. వి. అంటు.సూతకము.
ఆశ్చర్యము. త్స. వి. అచ్చెరువు. విశ. అచ్చెరువైనది.
ఆశ్రమము. త్స. వి. ౧. మునిపల్లె. ౨. బ్రహ్మచర్యము. గార్హస్థ్యము. వానప్రస్థము. సన్న్యాసము — ఈ నాలుగు. 3. అడవి.
ఆశ్రయము. త్స. వి. ౧. ఉనికిపట్టు. ౨. ఇల్లు. క్రి. ఆశ్రయించు.
ఆశ్రయాశుఁడు. త్స. వి. అగ్ని.
ఆశ్రితుఁడు. త్స. వి. ఆశ్రయించిన వాఁడు.
ఆశ్లేషము. త్స. వి. ౧. ఇరువదేడు నక్షత్రములలో ఒకటి. ౨. ఆలింగనము.
ఆశ్వత్థము. త్స. వి. రావిచెట్టు.
ఆశ్వయుజము. త్స. వి. ఒకినెల.
ఆశ్వసించు. } త్స. క్రి. ఊఱడించు.
ఆశ్వాసించు. }
ఆశ్వాసము. త్స. వి. ౧. ఊపిరివిడుచుట. ౨. కావ్యముయొక్క పరిచ్ఛేదము.
ఆశ్వికుఁడు. త్స. వి. గుఱ్ఱపురౌతు.
ఆషాఢము. త్స. వి. ఒక నెల.
ఆస. వై. వి. అపేక్ష. ఇచ్ఛ.
ఆసంగము. త్స. వి. ౧. సంబంధము. ౨. పట్టుదల. [పట్టుదల
ఆసంజనము. త్స. వి. ౧ సంబంధము ౨.
ఆసందిక. త్స. వి. కుర్చీ.
ఆసక్తి. త్స. వి. శ్రద్ధ.
ఆసచేయు. వై. వై. క్రి. ఆశించు.
ఆసనము. త్స. వి. ౧. పీట. ౨. పద్మాసనాది.
ఆసన్నము. త్స. విశ. సమీపమైనది.
ఆసపడు. వై. క్రి. అపేక్షపడు. వి. ఆసపాటు.
ఆసరా. వై. వి. అండ.
ఆసవము. త్స. వి. ద్రాక్షాదుల కల్లు.
ఆసాదనము. త్స. వి. ౧. స్థాపనము. ౨. పొందించుట. 3. పొందుట.
ఆసార. దే. వి. మూరగ.
ఆసారము. త్స. వి. మహావృష్టి.
ఆసాస. దే. వి. అధికాశ.
ఆసించు. వై. క్రి. కోరు.
ఆసీనుఁడు.త్స. విశ. కూర్చున్నవాఁడు.
ఆసుఁగ్రోవి. దే. వి. ఆసుపోయునపుడు సాలెవాఁడు నూలు దూర్చెడి గొట్టము.
ఆసుపోయు. దే. క్రి. పోఁగువాటించు.
ఆసుమ్రాను. దే. వి. నేతపనిలో ఉపయోగించు నొక పనిముట్టు.
ఆస్కారము. దే. వి. ఆధారము.
ఆస్తరణము. త్స. వి. పఱచుచాప. కంబళి. మొ. ,,
ఆస్తరణి. త్స. వి. ,,
ఆస్తరము. త్స. వి. ,,

ఆస్తి. దే. వి. సొత్తు
ఆస్తికుఁడు. త్స. విణ. దేవుఁడు కలఁడని నమ్మువాఁడు.
ఆస్థ. త్స. వి. ౧. శ్రద్ధ. ౨. యత్నము.
ఆస్థానము. త్స. వి. ౧. సభ. ౨. కొలువుకూటము.
ఆస్పదము. త్స. వి. చోటు.
ఆస్పర్ధ. త్స. వి. పోటీ.
ఆస్ఫాలనము. త్స. వి. చఱచుట.
ఆస్ఫాలము. త్స. వి. ,,
ఆస్యందనము. త్స. వి. కాఱుట.
ఆస్యము. త్స. వి. మొగము.
ఆస్రము. త్స. వి. నెత్తురు.
ఆస్రావము. త్స. వి. కాఱుట.
ఆస్వాదించు, ఆస్వాదించు. త్స. వి. ౧. అనుభవించు. ౨. రుచిచూచు. వి. ఆస్వదనము. ఆస్వాదనము.
ఆహవము. త్స. వి. ౧. యుద్ధము. ౨. పిలుపు.
ఆహా. దే. అవ్య. ఔరా.
ఆహారము. త్స. వి. ౧. భోజనము. ౨. వంటకము.
ఆహికము. త్స. వి. విడిచి విడిచి వంతు ప్రకారము వచ్చు జ్వరము.
ఆహితము. త్స. వి. కొట్టఁబడినది.
ఆహితాగ్ని. త్స. వి. అగ్నిహోత్రము చేయువాఁడు.
ఆహుతము. త్స. వి. వేల్వఁబడినది.
ఆహూతుడు. త్స. విణ. పిలువఁబడినవాఁడు.
ఆహ్నికము. త్స. వి. పగలు చేయఁదగిన కర్మము.
ఆహ్లాదము. త్స. వి. సంతోషము.
ఆహ్వానము. త్స. వి. పిలుపు. రూ. ఆహ్లాదనము.
ఆహ్వా. త్స. వి. పేరు.
ఆహ్వాయము. త్స. వి.
ఆళి. త్స. వి ౧. సఖి. ౨. వరుస. 3. అడ్డకట్టు.
ఆళువారు. దే. వి. విష్ణుభక్తుఁడు. రూ. ఆళ్వారు.

## ఇ

ఇంకఁబాఱు, దే. క్రి. ఇంకు. వట్టిపోవు.
ఇంకు. దే. క్రి. వట్టు. ఎండు.
ఇంకుడు. దే. వి. ఇంకుట. విణ. ౧. ఇంకినది. ౨. ఎండినది.
ఇంగలము. దే. వి. నిప్పు.
ఇంగాలము. దే.వి. బొగ్గు.
ఇంగితము. త్స. వి. అభిప్రాయము.
ఇంగిలము. దే. వి. నిప్పు.
ఇంగిలీకము, ఇంగిలీకము. దే. వి. ఎఱ్ఱని రసపదార్థము.
ఇంగుదము. త్స.వి. గారచెట్టు.

ఇంగువ. దే. వి. కూరలు మున్నగు భోజ్యవస్తువులలో నుపయోగించుకొను వస్తువు.
ఇంచు. దే. క్రి. ౧. ఇంపగు. ౨. కోరు. వి. చెఱకు.
ఇంచుఁబడఁతి. దే. వి. ప్రియురాలు.
ఇంచుఁబోఁడి. దే. వి. ఆఁడుది.
ఇంచుక. దే. అవ్య. మిక్కిలి కొంచెము.
ఇంచుగీతము. మి. వి. ప్రణయగీతము.
ఇంచుటలుక. దే. వి. ప్రణయకోపము.
ఇంచుమించు. దే. అవ్య. రమారమి.
ఇంచువిలుకాఁడు. దే. వి. మన్మథుఁడు.
ఇంచువిలుతుఁడు. ఇంచువిల్తుఁడు. } దే. వి. మన్మథుఁడు.
ఇంటాతఁడు. దే. వి. ఇంటియతఁడు.
ఇంటికాఁపు. దే. వి. గృహస్థుఁడు.
ఇంటిపట్టు. దే. వి. గృహస్థధర్మము.
ఇంటిపాప. దే. వి. వెలకుఁగొన్న దాసి.
ఇంటియాతఁడు. దే. వి. మగఁడు. రూ. ఇంటాతఁడు.
ఇంటిల్లిపాది. దే. వి. ఇంటనుండు వారందఱు.
ఇంత. దే. స. ౧. ఈకొలఁది. ౨. ఇది యంతయు.
ఇంతదనుక. అవ్య. ఇంతవఱకు. రూ. ఇందాఁక.
ఇంతవట్టు. దే. స. ౧. ఇదియంతయు. ౨. ఇంతవఱకు. 3. ఈమాత్రము.
ఇంతి. దే. వి. స్త్రీ. ఆఁడుది.

ఇంతియ. ఇంతే. } దే. స. ఇంతమాత్రము.
ఇందనుక. దే. అవ్య. ఈవఱకు. రూ. ఇందాఁక.
ఇందము. దే. క్రి. ఇదిగో పుచ్చుకొమ్ము.
ఇందఱు. దే. స. ౧. వీరందఱు. ౨. ఇంతసంఖ్యకలవారు.
ఇందాఁక. దే. అవ్య. ఇందనుక.
ఇందిందిరము. త్స. వి. తుమ్మెద.
ఇందిర. త్స. వి. లక్ష్మి.
ఇందీవరము. త్స. వి. ౧. నల్లకలువ. ౨. తామర. రూ. ఇందివరము.
ఇందు. దే. క్రి. ౧. అడఁగు. ౨. రుచించు. అవ్య. ఈచోటు.
ఇందుఁడు. త్స. వి. చంద్రుఁడు.
ఇందుకాంతము. త్స. వి. చంద్రకాంతము.
ఇందుప్పు. దే. వి. సైంధవలవణము.
ఇందులకు. దే. అవ్య. ౧. ఇక్కడికి. ౨. దీనికి.
ఇందువారము. త్స. వి. సోమవారము.
ఇంద్రచాపము. త్స. వి. ఇంద్రధనుస్సు.
ఇంద్రజాలము. త్స. వి. కనుకట్టు విద్య. విణ. ఇంద్రజాలికుఁడు.
ఇంద్రజి. త్స. వి. ఇంద్రజిత్తు. రూ. ఇంద్రజితుఁడు; ఇంద్రజిత్తుఁడు.
ఇంద్రధనుస్సు. త్స. వి. శక్రచాపము.
ఇంద్రనీలము. త్స. వి. నీలమణి.
ఇంద్రాణి. త్స. వి. ఇంద్రుని పెండ్లము.

ఇంద్రాయుధము. త్స. వి. ౧. ఇంద్రధనుస్సు. ౨. వజ్రాయుధము.
ఇంద్రావరజుఁడు. త్స. వి. ఉపేంద్రుఁడు.
ఇంద్రియము. త్స. వి. ౧. రేతస్సు. ౨. త్వగింద్రియము చక్షురింద్రియము మొదలైనవి.
ఇంద్రుఁడు. త్స. వి. పరమైశ్వర్యయుక్తుఁడు. దేవతలకు రాజు.
ఇంధనము. త్స. వి. కట్టె.
ఇంపతము. దే. విశే. ఇంపైన.
ఇంపు. దే. వి. ౧. అందము. ౨. ఇచ్చ. 3. విలాసము. ౪. ప్రియము.
ఇంపెసలారు. దే. క్రి. శోభిల్లు.
ఇంబు. దే. వి. ఇంపు.
ఇఁక. / ఇఁగ. { దే. అవ్య. మఱియు.
ఇక్క. దే. వి. ౧. ఉనికిపట్టు. ౨. చోటు.
ఇక్కట్టు. దే. వి. సంకటము.
ఇక్కడ. దే. వి. ఏ. ఈతావు.
ఇక్కుపాటు. దే. వి. ఇక్కట్టు.
ఇక్కువ. దే. వి. ౧. ఉనికి. ౨. జాడ. 3. చోటు. ౪. కళాస్థానము.
ఇక్షువు. త్స. వి. చెఱకు.
ఇక్ష్వాకువు. త్స. వి. సూర్యవంశపు రాజులలో ఒకఁడు.
ఇగము. దే. వి. మంచు.
ఇగిరించు. దే. క్రి. ౧. చిగిరించు. ౨. ఎఱ్ఱనగు.
ఇగిలించు. దే. క్రి. పండ్లను వెలిపఱచు. వి. ఇగిలింత.
ఇగురు. దే. క్రి. ఇంకు. వి. ౧. చిగురు. ౨. పండ్లచుట్టునుండు కండ.
ఇగురుకొను. దే. క్రి. చిగిరించు.
ఇగురుచు. దే. క్రి. చిగిరించు. రూ. ఇగుర్చు. ఇగ్రుచు.
ఇగురొత్తు. దే. క్రి. ౧. చిగిరించు. ౨. ప్రియమగు.
ఇగో. అవ్య. ఇదిగో.
ఇగ్గ. దే. వి. వెనుకకొఱగు. వెనుకకు లాగు.
ఇగ్గులాట. దే. వి. వెనుకకులాగుట.
ఇగ్గులాడు. దే. క్రి. వెనుకకీడ్చు.
ఇచ్చ. వై. వి. ౧. ఇచ్చ. ౨. చిత్తము.
ఇచ్చకము. దే. వి. ౧. ముఖప్రీతి. ౨. వలపు. విశే. ప్రియము.
ఇచ్చగించు. దే. క్రి. ౧. ఇచ్చించు. ౨. అంగీకరించు. వి. ఇచ్చగింత.
ఇచ్చగొండి. వై. విశే. ఇచ్చకములాడు వాఁడు.
ఇచ్చటు. దే. వి. ఏ. ఇక్కడ. రూ. ఇచటు. ఇచ్చోటు.
ఇచ్చు. దే. క్రి. ౧. ఇడు. ౨. ఒసఁగు.
ఇచ్ఛ. త్స. వి. కోరిక.
ఇచ్ఛువు. త్స. విశే. కోరువాఁడు.
ఇజారు. దే. వి. ౧. శ్రమము. ౨. సంకటము.
ఇట. దే. వి. ఏ. ఇక్కడ. అవ్య. ఈవల.

ఇటుంబట్టి. దే. అవ్య. ఇది మొదలు కొని.
ఇటిక. వై. వి. బంకమట్టితోఁజేసి కాల్చినరాయి. రూ. ఇట్టిక.
ఇటు. దే. అవ్య. ఇట్లు. రూ. ఇటులు. ఇట్లు. ఇట్టులు.
ఇటువంటి. దే. విణ. ఇట్టి.
ఇటువలె. దే. అవ్య. ఇట్లు.
ఇట్టలము. దే. విణ. అధికము.
ఇట్టి. దే. విణ. ఇటువంటి.
ఇట్టిఁడు. దే. విణ. ఇట్టివాఁడు.
ఇట్టిక. దే. వి. ఇటిక
ఇట్టు. దే. అవ్య. ఇట్టులు, ఈవైపు. (ఇట్టట్టగు = తాఱుమాఱగు)
ఇట్టుక. దే. వి. ఇటుక.
ఇట్టులు. దే. అవ్య. ఇట్లు.
ఇడయు. దే. క్రి. చీలు. వి. ఇడుపు.
ఇడు. దే. క్రి. ౧. ఇచ్చు. ౨. ఉంచు. 3. మూయు.
ఇడుగడ. దే. వి. ౧. అసూయ. ౨. అవమానము. 3. కష్టము.
ఇడుమ. దే. వి. ౧. ఆపద. ౨. అలసట. క్రి. ఇడుమపడు.
ఇడుమపాటు. దే. వి. ఇడుమపడుట.
ఇడ్డెన. దే. వి. వానెపుకుడుము.
ఇతఁడు. దే. స. ఏ. ఈతఁడు.
ఇతము. వై. విణ. హితము.
ఇతరుఁడు. త్స. స. అన్యుఁడు.
ఇతరేతరము. త్స. విణ. అన్యోన్యము.
ఇతవు. వై. విణ. హితవు.
ఇతికర్తవ్యతా మూఢుఁడు. త్స. వి. ఏమిచేయుటకును దోఁపనివాఁడు.
ఇతివృత్తము. త్స. వి. చరితము. కథ.
ఇతిహాసము. త్స. వి. పురావృత్తము.
ఇత్తడి. దే. వి. ఒకవిధమైన లోహము. రూ. ఇత్తళి.
ఇత్థంభూతము. త్స. విణ. ఇట్టిది.
ఇది. దే. స. ఈ శబ్దమునకు అర్థము దర్శక ప్రథమైకవచనము. రూ. ఈయది. ఇద్ది.
ఇదిగో. దే. అవ్య. ఇదుగో.
ఇదెయో. దే. ,,
ఇద్దరి. దే. వి. ఈవలిగట్టు.
ఇద్దఱు. దే. స. ఇరువురు.
ఇద్దుము. దే. వి. రెండుకుఁచములు.
ఇద్ధము. త్స. విణ. ౧. దీప్తము. ౨. ఉగ్రము. 3. దగ్ధము. ౪. అప్రతిహతము.
ఇధ్మము. త్స. వి. కట్టె.
ఇనుఁడు. త్స. వి. సూర్యుఁడు.
ఇనుచు. దే. క్రి. ఇంచు.
ఇనుమడి. దే. వి. రెట్టింత. రూ. ఇమ్మడి. ఇన్మడి.
ఇనుమడించు. దే. క్రి. రెట్టించు.
ఇనుమనుమఁడు. దే. వి. మనుమని కొడుకు.
ఇనుమిక్కిలి. దే. విణ. అత్యధికము.
ఇనుము. దే. వి. కాలాయసము. రూ. ఇన్ము.

ఇన్ని. దే. స. ఇవన్నియు.
ఇన్నూఱు. దే. స. రెండు నూఱులు.
ఇపుడు. దే. వి. ఏ. ఈకాలము. రూ. ఇప్పుడు; ఇఫ్డు.
ఇబ్బంది. దే. వి. ౧. మిక్కిలి నిర్బంధము. ౨. సంకటము.
ఇబ్బడి. దే. వి. ఇమ్మడి.
ఇభము. త్స. వి. ఏనుఁగు.
ఇభ్యుఁడు. త్స. విశే. ౧. ధనవంతుఁడు. ౨. ప్రభువు. 3. మావటివాఁడు.
ఇమిడిక. దే. వి. ఇముడుట.
ఇముడు. దే. క్రి. ౧. అడఁగు. ౨. పొందుపడు.
ఇముడుకొను. దే.క్రి.౧. ఇముడ్చుకొను. ౨.చమురు మొదలగునవి అయిపోవు.
ఇమ్మడి. దే. వి. ౧. ఇనుమడి. ౨. రెండవవాఁడు.
ఇమ్ము. దే. వి. ౧. చోటు. ౨. అవకాశము. 3. అనుకూల్యము. ౪. మనోహరము. ౫. ఉపాయము. ౬. సుఖము. (ఈయర్థమున నిది ద్వితీయా బహు వచనాంతముగానే కనఁబడుచున్నది. ఇమ్ముల)
ఇమ్ముకొను. దే. క్రి. వసించు.
ఇమ్ముదప్పు. దే. వి. ఇక్కట్టు.
ఇయ్యకొను. దే. క్రి. ఈకొను. అంగీకరించు. వి. ఇయ్యకోలు.
ఇరవు. దే. వి. తావు. విశే. స్థిరము.
ఇరవుకొను. దే. క్రి. ౧. నెలకొను. ౨. స్థిరపడు.
ఇరాఱు. దే. స. రెండు ఆఱులు. రూ. ఈరాఱు.
ఇరు. దే. అవ్య. రెండునకు ఆదేశమగును. రెండు + కాలు. ఇరుగాలు. ఇరుదెగలు.ఇరుదెఱఁగు.మొ.
ఇరుగు. దే. వి. ప్రక్కయిల్లు. ప్రక్క. రూ. ఇరువు.
ఇరుగురు. దే. స. ఇద్దఱు.
ఇరులు. దే. వి. చీఁకటి. రూ. ఇర్లు.
ఇరులుకొను. దే. క్రి. చీఁకటిపడు.
ఇరులుగొంగ. దే. వి. సూర్యుఁడు.
ఇరువంద్రు. దే. స. ౧. ఇరువదికి మహన్మహాత్యర్థకరూపము. ౨. ఇరువదిమంది.
ఇరువయి. దే. వి. ఇరువదులు.
ఇరువు. దే. వి. ౧. ప్రక్కయిల్లు. ౨. ప్రక్క. 3. చోటు.
ఇరువురు. దే. స. ఇరుగురు. ఇద్దఱు.
ఇరుస. దే. వి. రెండు కుంచములు.
ఇరుసెవి. దే. వి. ౧. రెండవచెవి. ౨. రెండవ మనుష్యుఁడు.
ఇర్గళము. త్స. వి. అర్గళము.
ఇఱి. దే. విశే. ౧ ఇఱుకైనది. (ఇఱిగుబ్బము,ఇఱికౌఁగిలి.) ౨. సన్నని. ఇఱికొను.
ఇఱియు. దే. క్రి. ౧.బిగియు. ౨. దట్టము.

ఇఱుకటము. } దే. వి. ఇఱుకు
ఇఱుకాటము. } చోటు.

ఇఱుకు. దే. క్రి. ౧. కొంచెము తావున నడఁగు. ౨. రెంటిసందునఁ జిక్కు.

ఇఱుము. దే. వి. మూల.

ఇఱ్ఱి. దే. వి. జింక.

ఇఱ్ఱింకులింకు. దే. క్రి. మిక్కిలి శుష్కించు.

ఇఱ్ఱిగోఱజము. దే. వి. కస్తూరి.

ఇఱ్ఱిపోతు. దే. వి. ఇఱ్ఱి

ఇఱ్ఱియ. దే. వి. బ. ప్రక్క.

ఇల. త్స. వి. ౧. నేల. ౨. ఆవు.

ఇలకఱచు. దే. క్రి. దంతములు ఒగ్గఁబట్టు.

ఇలకోడి. దే. వి. ఈలపురుగు.

ఇలటము. దే. విణ. ఇల్లటము.

ఇలాయి. దే. వి. చుట్టువస్తువులు వైచెడి జవ్వాటి.

ఇలి. దే. వి. ఎంగిలి మెతుకు.

ఇలు. దే. వి. గృహము. రూ. ఇల్లు.

ఇలుగు. దే. క్రి. చచ్చు. రూ. ఈలుగు.

ఇలుఱేఁడు. దే. వి. గృహస్థుఁడు.

ఇలువరము. దే. వి. ౧. ఒకచోనుండి వేరొకచోటికిఁ గొంపోదగు గుడిసె. ౨. ఒకవిధమైన గూడు. రూ. ఇలువారము.

ఇలువరుస. దే. వి. వంశానుక్రమము.

ఇలువేల్పు. దే. వి. కులదేవత.

ఇల్లటము. దే. వి. అల్లుఁడు మామగారి యింటనే వాసముండుట. రూ. ఇల్లంట్రము.

ఇల్లడ. దే. వి. పదిలపఱచి పెట్టి అడిగినప్పుడు ఇమ్మని యేదేని ఒకవస్తువును ఒకరియొద్ద దాఁచుట. న్యాసము.

ఇల్లడము. దే. వి. ౧. అవకాశము. ౨. చోటు.

ఇల్లటికము. దే. వి. ఇల్లటము.

ఇల్లామల్లి. దే. వి. కొండెగాఁడు.

ఇల్లాలు. దే. వి. గృహిణి.

ఇల్లిగ్గులు. దే. వి. మిక్కిలి యొఱగుటలు.

ఇల్లు. దే. వి. గృహము.

ఇవతల. దే. వి. ౧. ఈ పిమ్మట. ౨. ఈవలిప్రదేశము.

ఇవతళించు. దే. క్రి. చల్లనగు. రూ. ఇవతాళించు.

ఇవము. వై. వి. మంచు.

ఇవముమేపరి. } దే. వి. సూర్యుఁడు.
ఇవమునూడు. }

ఇవల. దే. వి. ఈవల. రూ. ఇవ్వల.

ఇ[illegible]. దే. క్రి. ౧. [illegible]గిరించు. ౨. ఎఱ్ఱనగు.

ఇవురు. దే. క్రి. ఇ[illegible]ను.

ఇషీకము. త్స. వి. ముంజదర్భమొక్క లోని మొవ్వు.

ఇషుధి. త్స. వి. అమ్ములపొది.

ఇషువు. త్స. వి. బాణము.

ఇష్టక. త్స. వి. ఇటుక.

ఇష్టము. త్స. విశే. ౧. కోరఁబడినది. ౨. ప్రియమైనది.

ఇష్టి. త్స. వి. ౧. కోరిక. ౨. యాగము.

ఇష్టుఁడు. త్స. విశే. హితుఁడు. ప్రియుఁడు.

ఇష్వాసము. త్స. వి. విల్లు.

ఇసిరో. దే. అవ్య. ఇసీ. రూ. ఇస్సిరో.

ఇసిలింతలు. దే. వి. కదలు. చలనము.

ఇసిలింతలువాఱు. దే. క్రి. కదలు. అదరు.

ఇసీ. దే. అవ్య. నిందించుటను దెలిపెడి. రూ. ఇస్సీ.

ఇసుకతిన్నియ. దే. వి. ఇసుక[illegible].

ఇసుము. దే. వి. ఇసుక.

ఇసుళ్లు. దే. వి. బ. ఱెక్కచెదలు. రూ. ఉసుళ్లు.

ఇహము. త్స. అవ్య. ఈలోకము.

ఇహిహీ. దే. వి. నవ్వుటయందగు ధ్వన్యనుకరణము.

## ఈ

ఈండ్రము. దే. వి. పిడించుట. క్రి. ఈండ్రించు.

ఈఁక. దే. వి. పక్షియెఱక. రూ. ఈఁకె.

ఈఁకు. దే. క్రి. ఇంకు.

ఈఁగ. దే. వి. బెల్లము అన్నము మొదలైనవానిమీఁద వ్రాలెడిపురుగు.

ఈఁగపులి. దే. వి. సాలెపురుగు.

ఈఁగు. దే. క్రి. ౧. చొచ్చు. ౨. తొలఁగించు.

ఈఁచు. దే. వి. ఈఁచ.

ఈఁటియ. దే. వి. బల్లెము. రూ. ఈఁటె.

ఈఁటెకాఁడు. దే. వి. బల్లెముకలవాఁడు.

ఈఁత. దే. వి. ౧. ఈఁదుట. ౨. (పశువు మొదలగునవి) ఈనుట.

ఈఁతకాఁడు. దే. వి. ఈఁదువాఁడు.

ఈఁతకొట్టు. దే. క్రి. ఈఁదు.

ఈఁద. } దే. వి. చలిగాలి.
ఈఁదర. }

ఈఁదాడు. దే. వి. గిఱకతాటిచెట్టు. (ఈఁదాడన్నఁ గోదాడ నను = ఒకఁడొకటియన రెండవవాఁడు వ్యతిరేకముగా నను.)

ఈఁదు. దే. క్రి. ౧. ఈఁతకొట్టు. ౨. దాఁటు. వి. ౧. ఈఁతచెట్టు. ౨. వాయువు.

ఈకె. దే. వి. ఈమె.

ఈకోను. దే. క్రి. అంగీకరించు. వి. ఈకోలు.

ఈక్షణము. త్స. వి. ౧. కన్ను. ౨. చూపు. (వి) ఈక్షించు.

ఈగి. దే. వి. ఈవి.

ఈగికాఁడు. దే. వి. ఈవికాఁడు. దాత.

ఈగిమ్రాను. దే. వి. కల్పవృక్షము. రూ. ఈవిమ్రాను.

ఈఁచ. దే. విశ. ౧. శుష్కించిన. ౨. నిష్ఫలము.

ఈచవడు. దే. క్రి. నిస్సత్త్వమగు.

ఈచపోవు. దే. క్రి. ఎండిపోవు.

ఈచుకపోవు. దే. క్రి. నెలలు నిండక మునుపు గర్భముపోవు.

ఈచుకొనిపోవు. దే. క్రి. (ఆవు) "

ఈటార్చు. దే. క్రి. ఆఱఁబెట్టు.

ఈటాడు. దే. క్రి. ఎండు.

ఈటు. దే. విశ. వ్యర్థము. క్రి. ఈటవోవు.

ఈడ. దే. వి. ఏ. ఇక్కడ.

ఈడఁబోవు. దే. క్రి. వెనుకకుఁబోవు.

ఈడాడు. దే. క్రి. ఎదుర్కొను.

ఈడిగిలఁబడు. దే. క్రి. భయాదులచే రానని మొండికొనికూర్చుండు. రూ. ఈడ్గిలఁబడు.

ఈడిగిల్లు. దే. క్రి. ఈడిగిలఁబడు. రూ. ఈడిగిలు.

ఈడు. దే. క్రి. ౧. [illegible]. ౨. [illegible]. 3. పిదుకు. వి. వయస్సు. విశ. సమానము.

ఈడుచు. దే. క్రి. లాగు. రూ. ఈడ్చు. వి. ఈడ్పు.

ఈడుజోడు. దే. విశ. సమానము. క్రి. ఈడుజోడాడు. ప్రతిఘటించు.

ఈడుపడు. దే. క్రి. సాటియగు.

ఈడేఱు. దే. క్రి. ౧. కొనసాగు. ౨. వర్ధిల్లు; యౌవనమువచ్చియుండు.

ఈతఁడు. దే. స. ఇతఁడు.

ఈతగాఁడు. దే. స. ఈతఁడు.

ఈతల. దే. వి. ఈవలిప్రదేశము.

ఈతి. త్స. వి. ౧. అతివృష్టి. అనావృష్ట్యాది. (ఇవి ఆఱు:— వాన, [illegible]టుకము, ఎలుక, చిలుక, మిడుత, చేరువరాజు. ఇవి ఈతిబాధలు) ౨. ఉపద్రవము.

ఈదృశము. త్స. విశ. ఇటువంటిది.

ఈన. దే. వి. చీఁపురుపుల్ల.

ఈనిక. దే. వి. ఈఁత.

ఈనియ. దే. వి. ఆకులనరము. రూ. ఈనె.

ఈను. దే. క్రి. పసరములు మున్నగునవి దూడవేయు. కలిగించు.

ఈపె. దే. స. ఈమె.

ఈప్స. త్స. వి. కోరిక.

ఈప్సితము. త్స. వి. ౧. కోరఁబడినది. ౨. కోరిక.

ఈప్సువు. త్స. విశ. కోరువాఁడు.

ఈబిడ. దే. స. ఈమె.

ఈము. దే. వి. సెమ.

ఈమె. దే. వి. ఈపె.
ఈయకొను. దే. క్రి. అంగీకరించు. రూ. ఈకొను.
ఈయకోలు. దే. వి. అంగీకారము. రూ. ఈకోలు.
ఈయన. దే. స. ఈతఁడు.
ఈరణము. త్స. వి. ప్రేరణము.
ఈరము. దే. వి. పొదరిల్లు. రూ. ఈరమి.
ఈరస. వై. వి. ౧. ఈర్ష్య. ౨. కోపము. 3. ఈరసపడు. ఈరస మాడు.
ఈరసించు. వై. క్రి. ౧. కోపించు. ౨. ఈర్ష్యపడు.
ఈరాఱు. దే. స. పండ్రెండు.
ఈరిక. దే. వి. గుడ్డపేలిక.
ఈరికలెత్తు. దే. క్రి. అంకురించు.
ఈరితము. త్స. విణ. ప్రేరితము.
ఈరు. దే. వి. ఈపి. విణ. అల్పము. (ఈరెండ.)
ఈరుచు. దే. క్రి. (ఈర్పెనతో ఈళ్ళను) ఈడ్చు. రూ. ఈర్చు.
ఈరువెన. దే. వి. ఈళ్ళను ఈడ్చెడు దువ్వెన.
ఈరెండ. దే. వి. కొంచెముపాటి యెండ.
ఈరెలుఁగు. దే. వి. హీనస్వరము.
ఈరేడు. దే. స. పదునాల్గు.
ఈర్ష్య. త్స. వి. ఓర్వలేనితనము.
ఈర్ష్యాళువు. త్స. విణ. ఈర్ష్యపడు స్వభావము కలవాఁడు.
ఈలతాఱులు. దే. విణ. బ. ౧. వక్రము. (తలపు) ౨. కఠినము.
ఈలమి. దే. వి. తీగలు మున్నగువాని గుంపు.
ఈలము. దే. విణ. దట్టము. వి. పొద.
ఈల. దే. వి. పసులకాఁపరులసంకేతధ్వని.
ఈలకటుచు. దే. వి. ప్రాణములు బిగఁబట్టు.
ఈలుగు. దే. వి. చచ్చు. రూ. ఈల్గు.
ఈలువు. దే. వి. ౧. కులాచారము. ౨. మంచినడత. 3. పాతివ్రత్యము.
ఈలువుటాలు. దే. వి. పతివ్రత.
ఈవరి. దే. విణ. దాత.
ఈవల. దే. వి. ఇవతల.
ఈవి. దే. వి. ఈగి.
ఈవు. దే. వి. నీవు.
ఈశానుఁడు. త్స. వి. శివుఁడు.
ఈశుఁడు. త్స. వి. ౧. ప్రభువు. ౨. యజమానుఁడు. 3. మగఁడు. ౪. శివుఁడు.
ఈశ్వరుఁడు. త్స. విణ. ,,
ఈషత్కరము. త్స. విణ. కొంచెముగాఁ జేయునది.
ఈషిక. త్స. వి. ౧. అన్యవిశేషము. ౨. తూలిక.
ఈసడము. దే. వి. నింద.
ఈసడించు. దే. క్రి. ౧. రోఁతపడు. ౨. కోపించు. 3. నిందించు.

ఈసు. వై. వి. ౧. ఈర్ష్య. ౨. కోపము. 3. నింద.

ఈసుకాఁడు. వై. విశే. ఈర్ష్యాళువు.

ఈహీ. దే. అవ్య. ఇన్సీ.




ఉంకించు. దే. క్రి. ఉద్యమించు.

ఉంకువ. దే. వి. ౧. అల్లుఁడు కన్యక కొఱకై మామకిచ్చెడి ఓలి. ౨. కానుక. 3. వాసస్థానము.

ఉంగరము. దే. వి. చేతివ్రేలికిడు సొమ్ము. రూ. ఉంగ్రము.

ఉంగుటము. దే. వి. బొటనవ్రేలు.

ఉంచు. దే. క్రి. ఉనుచు.

ఉంఛవృత్తి. త్స. వి. రాలిన గింజల నేఱికొని బ్రదుకుట.

ఉంట. దే. వి. ౧. ఉండ. ౨. ఉండుట. విశే. గుండ్రము.

ఉండ. దే. వి. మన్ను. నూలు. మొదలగువానిచేఁ జేయఁబడినయుంట.

ఉండు. దే. క్రి. ౧. వసించు. ౨. నడచు. 3. మిగులు.

ఉండ్రకము. దే. వి. ఉండ్రము.

ఉండ్రము. దే. వి. గుండ్రము

ఉందురువు. త్స. వి. ఎలుక.

ఉంపుడుకత్తె. దే. వి. భోగస్త్రీ.

ఉక్క. దే. వి. ఉబ్బ.

ఉక్కఁబట్టు. దే. వి. ఊపిరాడకుండఁ బట్టు.

ఉక్కడఁగు. దే. క్రి. బలముడుఁగు.

ఉక్కడీఁడు. దే. విశే. బంటు.

ఉక్కరి. దే. వి. పరాక్రమవంతుడు.

ఉక్కఱు. దే. క్రి. ఉక్కుచెడు.

ఉక్కలుఁడు. దే. విశే. ధురంధరుఁడు.

ఉక్కాడు. దే. క్రి. బలముచూపు.

ఉక్కిరిబిక్కిరి. దే. విశే. ఊపిరితిరుగనిది.

ఉక్కివము. దే. వి. మోసము, కపటము.

ఉక్కివుఁడు. దే. విశే. కపటము గలవాఁడు. రూ. ఉక్కీఁడు.

ఉక్కు. దే. వి. ౧. అయస్సారము. ౨. ప్రతాపము. 3. స్థైర్యము. క్రి. ౧. చచ్చు. ౨. ఉడుకు.

ఉక్కుతునుక. దే. వి. బలశాలి. విశే. పరాక్రమవంతుఁడు.

ఉక్కెఱ. దే. వి. భక్ష్యవిశేషము.

ఉక్తము. త్స. విశే. చెప్పఁబడినది.

ఉక్తి. త్స. వి. మాట.

ఉక్షము. త్స. వి. ఎద్దు.

ఉగాది. దే. వి. సంవత్సరాది

ఉగ్గడించు. దే. వి. ౧. ప్రకటించు. ౨. చెప్పు. 3. ధ్వనించు.
ఉగ్గఁబట్టు. దే. క్రి. ౧. బిగఁబట్టు. ౨. నిరోధించు.
ఉగ్గము. దే. వి. మజ్జిగ చెంబు. పెరుగుదుత్త ఈ ముచ్చుగువానిఁ గొనిపోవుటకు వాని మెడకుఁగట్టు త్రాఁడు.
ఉగ్గు. దే. వి. ౧. చంటిబిడ్డలకుఁ బోసెడు చనుబాలును, ఆముదమును. ౨. ముడుత.
ఉగ్మలి. దే. వి. వనిత.
ఉగ్రంపశ్యము. త్స. విణ. క్రూరముగాఁ జూచునది.
ఉగ్రము. త్స. విణ. క్రూరమైనది.
ఉగ్రాణము. దే. వి. సరకులుంచెడి కొట్టు. విణ. ఉగ్రాణకాఁడు.
ఉగ్రుఁడు. త్స. వి. శివుఁడు.
ఉచితము. త్స. విణ. ౧. తగినది. ౨. ఉంచఁబడినది.
ఉచ్చనీచము. త్స. విణ. ౧. నిమ్నోన్నతము. ౨. గొప్పవి, గొలదివి కలసియున్నది.
ఉచ్చము. త్స. విణ. ఉన్నతము.
ఉచ్చరించు. త్స. క్రి. చెప్పు వి. ఉచ్చారణము. ఉచ్చరణము.
ఉచ్చాటనము. త్స. వి. ౧. పిశాచాదులను విడిపించుట. ౨. స్వస్థానము నుండి లేవఁగొట్టుట.
ఉచ్చి. దే. వి. నడినెత్తి, బ్రహ్మరంధ్రము.
ఉచ్చు. దే. వి. మూత్రము.
ఉచ్చుగిత్త. దే. వి. స్త్రీలోలుఁడు.
ఉచ్చుబుడ్డ. దే. వి. నీరుతిత్తి.
ఉచ్చు. దే. వి. బ. ౧. పాలు పిదుకునపుడు ఆవు వెనుక కాళ్ళకుఁ గట్టుత్రాఁడు. ౨. పక్షులు పట్టుటకు వలపన్నుటకు నుపయోగపడెడి త్రాళ్లు.
ఉచ్ఛిష్టము. త్స. విణ. ఎంగిలిది.
ఉచ్ఛూనము. త్స. విణ. ఉబ్బినది.
ఉచ్ఛృంఖలము. త్స. విణ. నిరంకుశము.
ఉచ్ఛ్రయము. త్స. వి. ఎత్తు.
ఉచ్ఛ్వసితము. త్స. వి. ఊపిరి విడుచుట.
ఉచ్ఛ్వాసము. త్స. వి. నిట్టూర్పు.
ఉజ్జగించు. దే. క్రి. విడుచు.
ఉజ్జనము. దే. వి. విడుచుట.
ఉజ్జీవించు. త్స. క్రి. బ్రదుకు.
ఉజ్జృంభించు. త్స. వి. చెలరేఁగు.
ఉజ్ఝితము. త్స. విణ. విడువఁబడినది.
ఉజ్జ్వలము. త్స. వి. శృంగారరసము. విణ. ౧. ప్రకాశించునది. ౨. తెల్లనిది.
ఉజ్జై. దే. వి. ఊహ. క్రి. ఉజ్జాయించు.
ఉజ్జైగొను. దే. క్రి. ఊహించు.
ఉటంకి. } దే. విణ. ౧. నీచుఁడు.
ఉటంకు. } ౨ చొరవ కలవాఁడు.

ఉటంకించు. దే. క్రి. సంగ్రహముగాఁజెప్పు

ఉటజము. త్స. వి. పర్ణశాల.

ఉట్టంకించు. దే. క్రి. పొగడు.

ఉట్టాడు. దే. క్రి. త్వరపడు.

ఉట్టి. దే. వి. నేతిదుత్తలు, పాలదుత్తలు, ఈ మొదలగువాని నుంచుకొనుట కుపయోగపడు త్రాళ్లతో నల్లి వ్రేలాడునట్టి యంత్రవిశేషము.

ఉట్టిపడు. దే. క్రి. పైకివచ్చు.

ఉట్టు. దే. క్రి. కాఱు.

ఉడాయించు. దే. క్రి. పాఱిపోవు.

ఉడిగపుఁగత్తె. దే. విణ. సేవకురాలు.

ఉడిగము. దే. వి. ఊడిగము.

ఉడిపోవు. దే. క్రి. ఉడిగిపోవు.

ఉడుకు. దే. క్రి. తపించు. వి. తాపము. విణ. ఉడుకుఁబోతు.

ఉడుగర. దే. వి. ౧. బహుమానము. ౨. కానుక.

ఉడుగు. దే. క్రి. మాను. తీఱు. శోషిల్లు. రూ. ఉడుపు.

ఉడుత. దే. వి. వీపున మూఁడు నిడుపాటి చాఱలుండు జంతువు.

ఉడుపతి. త్స. వి. చంద్రుఁడు.

ఉడుపము. త్స. వి. తెప్ప.

ఉడుము. దే. వి. బల్లివంటియాకారము కల పెద్ద జంతువు.

ఉడువు. త్స. వి. నక్షత్రము.

ఉడ్డ. } దే. వి. ౧. నాలుగు. ౨. నాల్గింటిరాశి.
ఉడ్డా. }

ఉద్దాడించు. దే. క్రి. కలఁగించు.

ఉద్దాడు. దే. క్రి. కలఁగు.

ఉడ్డీనము. త్స. విణ. పైకెగురుట.

ఉడ్డుగుడుచు. దే. క్రి. ఉక్కిరిబిక్కిరియగు.

ఉతక. దే. వి. ఉదుక.

ఉతుకు. దే. క్రి. గుంజు. వి. ఉదుకు.

ఉత్కంఠ. త్స. వి. తహతహపాటు.

ఉత్కటము. త్స. విణ. ౧. పెద్దది. ౨. తీవ్రము. 3. మదించినది.

ఉత్కము. త్స. వి. ఉవ్విళ్లూరునది.

ఉత్కరము. త్స. వి. సమూహము.

ఉత్కర్షము. త్స. వి. ౧. పైకిలాగుట. ౨. శ్రేష్ఠత్వము.

ఉత్కలిక. త్స. వి. ఉత్కంఠ.

ఉత్కారము. త్స. వి. తూర్పెత్తుట.

ఉత్కీర్ణము. త్స. విణ. చెక్కఁబడినది.

ఉత్కృష్టము. త్స. విణ. శ్రేష్ఠము.

ఉత్కోచము. త్స. వి. లంచము.

ఉత్క్రమణము. త్స. వి. అతిక్రమించుట. పైకిఁబోవుట.

ఉత్క్షేపము. త్స. వి. ఎగఁజిమ్ముట.

ఉత్ఖాతకేళి. త్స. వి. వప్రక్రీడ. కోరాడుట:

ఉత్త. దే. విణ. రిక్తము.

ఉత్తంసము. త్స. వి. సిగబంతి.

ఉత్తమము. త్స. విణ. ౧. ముఖ్యము. ౨. (వ్యాకరణమున) కడపటిది.

ఉత్తమర్ణుఁడు. త్స. విణ. అప్పిచ్చువాఁడు.

ఉత్తర. త్స. వి. ౨౭ నక్షత్రములలో ఒకటి.

ఉత్తరక్రియ. త్స. వి. చనిపోయినవారి కొనర్చెడి యపరకర్మము.

ఉత్తరభద్ర. త్స. వి. ౨౭ నక్షత్రములలో ఒకటి.

ఉత్తరము. త్స. విశే. ౧. మీఁదిది. ౨. ముఖ్యము. దే. వి. జాబు.

ఉత్తరాయణము. త్స. వి. సూర్యుఁడుత్తరము వైపునకుఁబోవుకాలము.

ఉత్తరాషాఢ. త్స. వి. ౨౭ నక్షత్రములలో నొకటి.

ఉత్తరాసంగము. త్స. వి. ఉత్తరీయము.

ఉత్తరించు. దే. క్రి. ఖండించు.

ఉత్తరీయము. త్స. వి. పైబట్ట.

ఉత్తరువు. దే. వి. ౧. ఆజ్ఞ. ౨. సెలవు.

ఉత్తరోత్తరము. త్స. అవ్య. పై పై.

ఉత్తలపడు. దే. క్రి. ౧. త్వరపడు. ౨. పరితాపపడు. 3. కలఁతపడు. వి. ఉత్తలపాటు.

ఉత్తలము. దే. వి. ౧. పరితాపము. ౨. త్వర. 3. కలఁత.

ఉత్తానము. త్స. విశే. ౧. నిమ్నపటము. ౨. వెలికిలఁ బరుండునది.

ఉత్తారము. త్స. వి. దాఁటుట.

ఉత్తాలము. త్స. విశే. ౧. పొడవైనది. ౨. మేలైనది. 3. భయంకరమైనది.

ఉత్తీర్ణము. త్స. విశే. దాఁటఁబడినది.

ఉత్తుంగము. త్స. విశే. మిక్కిలియెత్తైనది.

ఉత్తేజనము. త్స. వి. ౧. ఉద్దీపనము. ౨. సానఁబెట్టుట.

ఉత్థానము. త్స. వి. పైకిలేచుట.

ఉత్థితము. త్స. విశే. లేచినది.

ఉత్పతితము. త్స. విశే. ఊర్ధ్వగతము.

ఉత్పత్తి. త్స. వి. పుట్టుక.

ఉత్పథము. త్స. వి. తప్పుదారి.

ఉత్పన్నము. త్స. విశే. పుట్టినది.

ఉత్పలము. త్స. వి. కలువ.

ఉత్పాటనము. త్స. వి. పైకి పెఱుకుట.

ఉత్పాతము. త్స. వి ౧. దుముకుట. ౨. తోఁకచుక్క. కొఱవియు పిడుగును పడుట మొదలగు శుభాశుభ సూచకమగు మహాభూత వికారము.

ఉత్పాదనము. త్స. వి. కలిగించుట. పుట్టించుట.

ఉత్పాదము. త్స. వి. పుట్టుట.

ఉత్పీడనము. త్స. వి. ౧. పిడుచుట. ౨. రారాపు.

ఉత్ప్రేక్ష. త్స. వి. ఊహ.

ఉత్ఫుల్లము. త్స. విశే. పూచినది.

ఉత్సంగము. త్స. వి. తొడ.

ఉత్సన్నము. త్స. వి. నష్టము.

ఉత్సర్జనము. త్స. వి. విడుచుట.

ఉత్సవము. త్స. వి. ౧. పండుగ. ౨. కోరికలు ఈడేఱుట. 3. గర్వము. ౪. కోపము.

ఉత్సహించు. త్స. క్రి. ప్రయత్నించు.
ఉత్సాదనము. త్స. వి. తొలఁగించుట.
ఉత్సాదము. త్స. వి. నాశము.
ఉత్సారణము. త్స. వి. తొలఁగించుట.
ఉత్సాహము. త్స. వి. ౧. ప్రయత్నము. ౨. అభిలాష.
ఉత్సాహించు. త్స. వి. ప్రయత్నించు. అభిలషించు.
ఉత్సుకుఁడు. త్స. విణ. ఇష్టమైన పనిగూర్చి నుద్యోగించినవాఁడు.
ఉత్సేకము. త్స. వి. ఉద్రేకము.
ఉదంకము. త్స. వి. తోలుతిత్తి.
ఉదంచనము. త్స. వి. చేఁద.
ఉదంచితము. త్స. విణ. పూజితము.
ఉదంతము. త్స. వి. వార్త. సంగతి.
ఉదకము. త్స. వి. జలము. నీరు.
ఉదజము. త్స. విణ. పశువులను ద్రోలుట.
ఉదధి. త్స. వి. సముద్రము.
ఉదన్య. త్స. వి. దప్పి.
ఉదయము. త్స. వి. ౧. పుట్టుక. ౨. ఉన్నతి. 3. తూర్పుకొండ.
ఉదరంభరి. త్స. విణ. ఆత్మంభరి. తన పొట్ట నింపుకొనువాఁడు.
ఉదరపిశాచుఁడు. త్స. విణ. తిండిపోతు.
ఉదరము. త్స. వి. ౧. పొట్ట. ౨. యుద్ధము.
ఉదరిపడు. దే. క్రి. అదరిపడు. వి. ఉదరిపాటు.
ఉదరు. దే. వి. ౧. కంపించు. ౨. బెదరు 3. కోపించు.
ఉదర్కము. త్స. వి. రాఁగలఫలము.
ఉదశ్రువు. త్స.విణ. వెలికివచ్చిన కన్నీళ్లు గలవాఁడు.
ఉదస్తము. త్స. విణ. పైకెఁ జిమ్మఁబడినది.
ఉదాత్తః. త్స. వి. స్వరభేదము.
ఉదాత్తుఁడు. త్స. వి. గొప్పవాఁడు.
ఉదారుఁడు. త్స. విణ. ౧. ఇచ్చువాఁడు. ౨. గొప్పవాఁడు.
ఉదాసీనుఁడు. త్స. విణ. తటస్థుఁడు.
ఉదాహరణము. త్స. వి. దృష్టాంతము. క్రి. ఉదాహరించు.
ఉదిరి. దే. వి. అపరంజి. విణ. తప్తము.
ఉదితము. త్స. విణ. చెప్పఁబడినది.
ఉదిలకొను. దే. క్రి. చలించు.
ఉదీచీనము. త్స. విణ. ఉత్తరదిక్కున నున్నది.
ఉదీరణము. త్స. విణ. ఉచ్చారణము.
ఉదీర్ణము. త్స. విణ. ౧. గొప్పది. ౨. పుట్టినది.
ఉదుంబరము. త్స. వి. మేడి.
ఉదుక. దే. వి. ఉతక.
ఉదుకు. దే. క్రి. గుంజు.
ఉదుటు. దే. వి. ఉద్ధతి.
ఉద్గమంబు. త్స. వి. పైకిఁబోవుట.
ఉద్గమనీయము. త్స. వి. ఉతికినబట్ట.
ఉద్గారము. త్స. వి. త్రేనుపు.

ఉద్దండము. త్స. విశే. ప్రచండమైనది.

ఉద్దాముఁడు. త్స. విశే. కట్టులేని వాఁడు.

ఉద్ది. ౧. ఒకానొక కాయధాన్యము. ౨. జోడు. జత.

ఉద్దించు. దే. క్రి. ౧. పోటీచేయు. ౨. ప్రతిఘటించు.

ఉద్దికాఁడు. దే. వి. ౧. జతగాడైన వాఁడు. ౨. చెలికాఁడు.

ఉద్దీపకము. త్స. విశే. వెలిఁగించునది.

ఉద్దీపనము. త్స. వి. ౧. ప్రకాశము. ౨. పురికొలుపుట.

ఉద్దీపితము. త్స. విశే. ౧. వెలిఁగింపఁ బడినది. ౨. రేఁపఁబడినది.

ఉద్దేశము. త్స. వి. ౧. అభిప్రాయము. ౨. గురి.

ఉద్దేశించు. త్స. క్రి. గురిఁజేయు. విశే. ఉద్దేశ్యము.

ఉద్ధతము. త్స. విశే. ౧. నిష్ఠురము. ౨ అవినీతము.

ఉద్ధతి. త్స. వి. ౧. గర్వము. ౨. పైకెగురుట.

ఉద్ధతుఁడు. త్స. విశే. ౧. అవినీతుఁడు. ౨. నిష్ఠురుఁడు.

ఉద్ధరణి. త్స. వి. ఆచమించు సాధనము.

ఉద్ధరించు. త్స. క్రి. ౧. రక్షించు. ౨. పెల్లగించు. 3. మీఁదికెత్తు.

ఉద్ధారకుఁడు. త్స. విశే. రక్షించు వాఁడు. వి. ఉద్ధారణము.

ఉద్ధారము. త్స. వి. లేవనెత్తుట.

ఉద్ధురము. త్స. విశే. ౧. సమర్థము. ౨. దట్టమైనది.

ఉద్బంధనము. త్స. వి. ఉరి.

ఉద్భవము. త్స. వి. పుట్టుక.

ఉద్భవించు. త్స. క్రి. పుట్టు.

ఉద్భిజ్జము. త్స. విశే. భూమిని ఛేదించుకొని వచ్చినది.

ఉద్భిదము. త్స. విశే. ,,

ఉద్భ్రాంతము. త్స. విశే. భ్రాంతిని బొందినది.

ఉద్యతము. త్స. విశే. పూనినది.

ఉద్యమము. త్స. వి. యత్నము.

ఉద్యమించు. త్స. క్రి. యత్నించు.

ఉద్యానము. త్స. వి. రాజుయొక్క సాధారణమైన తోఁట.

ఉద్యాపనము. త్స. వి. వ్రతాదులను ముగించుట.

ఉద్యుక్తము. త్స. విశే. పూనినది.

ఉద్యోగము. త్స. వి. యత్నము.

ఉద్యోగించు. త్స. క్రి. యత్నించు.

ఉద్వర్తనము. త్స. వి. నలుగుపెట్టుట.

ఉద్వాహము. త్స. వి. పెండ్లి.

ఉద్వాసము. త్స. వి. ౧. తొలఁగించుట. ౨. వధించుట.

ఉద్విగ్నము. త్స. విశే. వ్యాకులము.

ఉద్వృత్తి. త్స. వి. ఉద్ధతి. కావరము.

ఉద్వేగము. త్స. వి. వ్యాకులచిత్తత.

ఉద్వేలము. త్స. విశే. మేరమీఱినది.

ఉనికి. దే. వి. ౧. ఉండుట. ౨. స్థితి. ౩. స్థానము.
ఉనుకువ. దే. వి. ఉనికి.
ఉనుచు. దే. క్రి. ఉంచు.
ఉన్నతము. త్స. విశే. పొడవైనది.
ఉన్నతి. త్స. విశే. పొడవు.
ఉన్నరూపు. దే. వి. వాస్తవము.
ఉన్నవాఁడు. దే. విశే. ౧. ఇతరుఁడు. ౨. ఉన్నట్టివాఁడు.
ఉన్ని. దే. వి. గొఱ్ఱెబొచ్చు.
ఉన్నె. } దే. అవ్య. ఉండునె.
ఉన్నే. }
ఉన్మజ్జనము. త్స. వి. నీటిపైఁదేలుట.
ఉన్మత్తము. త్స. విశే. పిచ్చిపట్టినది.
ఉన్మదితుఁడు. త్స. విశే. మతిభ్రమ చెందినవాఁడు.
ఉన్మాదనము. త్స. విశే. వెఱ్ఱిగొలుపునది.
ఉన్మాదము. త్స. వి. చిత్తవిభ్రమము.
ఉన్మార్గము. త్స. వి. తప్పుద్రోవ.
ఉన్మార్జనము. త్స. వి. తుడిచివైచుట.
ఉన్మీలనము. త్స. విశే. ౧. కన్ను తెఱచుట. ౨. వికాసము.
ఉన్మూలనము. త్స. వి. పెల్లగించుట.
ఉన్మేషము. త్స. వి. ౧. కన్ను తెఱచుట. ౨. వికాసము.
ఉపకంఠము. త్స. వి. దాపైనది.
ఉపకరణము. త్స. వి. పనిముట్టు.
ఉపకరించు. త్స. క్రి. పనికివచ్చు.
ఉపకారము. త్స. వి. మేలు.
ఉపకారి. త్స. విశే. మేలుచేయువాఁడు.
ఉపకారిక. త్స. వి. గుడారము.
ఉపకృతి. త్స. వి. ఉపకారము.
ఉపక్రమణము. త్స. వి. ప్రారంభము.
ఉపక్రమణిక. త్స. వి. పీఠిక.
ఉపక్రమము. త్స. వి. ఉపోద్ఘాతము.
ఉపక్రమించు. త్స. క్రి. ప్రారంభించు. వి. ఉపక్రమము.
ఉపగూహనము. త్స. వి. కౌఁగిలింత.
ఉపగ్రహము. త్స. వి. ౧. చెఱఁబెట్టుట. ౨. నిరోధము.
ఉపఘాతము. త్స. వి. దెబ్బ.
ఉపచయము. త్స. వి. వృద్ధి.
ఉపచరించు. త్స. క్రి. ౧. గౌరవించు. ౨. సేవించు.
ఉపచారము. త్స. వి. ౧. సత్కారము. ౨. ఊడిగము.
ఉపజ్ఞ. త్స. వి. ఆద్యజ్ఞానము. (పరోపదేశము లేకయే మొదటఁ గలుగు జ్ఞానము.)
ఉపఢౌకనము. త్స. వి. కానుక.
ఉపతాపము. త్స. వి. సంతాపము.
ఉపదేశము. త్స. వి. మంచిమాట.
ఉపదేశించు. త్స. క్రి. ఉపదేశ మొనర్చు.
ఉపదేష్ట. త్స. విశే. ఉపదేశించువాఁడు.

ఉపద్రవము. త్స. వి. హోవడి. కీడు.
ఉపధానము. త్స. వి. దిండు.
ఉపనయనము. త్స. వి. వడుగు.
ఉపనిషత్తు. త్స. వి. ౧. వేదాంతము. ౨. ధర్మము.
ఉపనీతుఁడు. త్స. విశే. వడుగుచేయఁబడినవాఁడు.
ఉపన్యసించు. త్స. క్రి. ఉపన్యాసమొనర్చు.
ఉపన్యాసము. త్స. వి. ఏదేని ఒక సంగతినిగూర్చి విరివిచేసి ప్రసంగించుట.
ఉపపతి. త్స. వి. అంకుమగఁడు.
ఉపపత్తి. త్స. వి. సిద్ధి.
ఉపపాదనము. త్స. వి. ఏదేని విషయమును వివరించి చెప్పుట.
ఉపప్లవము. త్స. వి. ఉపద్రవము.
ఉపబృంహణము. త్స. వి. చక్కఁగాఁ బెరుగుట.
ఉపభోగము. త్స. వి. అనుభవము.
ఉపమ. వై. వి. ౧. ఉపాయము. ౨. పోలిక.
ఉపమానము. త్స. వి. పోలిక.
ఉపమించు. త్స. క్రి. పోల్చు.
ఉపమేయము. త్స. వి. పోలికగుండలి విషయము.
ఉపయమము. త్స. వి. పెండ్లి.
ఉపయామము. త్స. వి. ,,
ఉపయోగము. త్స. వి. ఒదవుబడి.
ఉపయోగించు. త్స. క్రి. ఒదవు.
ఉపరతి. త్స. వి. పురుషాయితము.
ఉపరాగము. త్స. వి. గ్రహణము.
ఉపవనము. త్స. వి. తోఁట.
ఉపవసించు. త్స. క్రి. అన్నము లేక పస్తుండు.
ఉపవాసము. త్స. వి. పస్తు.
ఉపవీతము. త్స. వి. జందెము. విశే. ఉపరతి.
ఉపవేశము. త్స. వి. కూర్చుండుట.
ఉపశమము. త్స. వి. ౧. అడఁగుట. ౨. ఓర్పు.
ఉపశమించు. త్స. వి. ౧. అడఁగు. ౨. ఓర్పు. రూ. ఉపశమిల్లు.
ఉపశాంతి. త్స. వి. ౧. అడఁగుట. ౨. ఓర్పు.
ఉపశ్రుతి. త్స. వి. ప్రసంగవశమున దైవికముగాఁ వినఁబడు శుభాశుభ సూచకమగు వాక్యము.
ఉపసంవ్యానము. త్స. వి. ఉత్తరీయము.
ఉపసంహరించు. త్స. క్రి. మరలించు. వి. ఉపసంహారము.
ఉపస్థితము. త్స. వి. దరికి వచ్చినది.
ఉపహాసము. త్స. వి. వేళాకోళము.
ఉపాంగము. త్స. వి. మీమాంసము. మొదలగు శాస్త్రముల సమూహము. అవి. నాల్గు.—౧. మీమాంసము. ౨. న్యాయశాస్త్రము. 3. పురాణము. ౪. ధర్మశాస్త్రము.

ఉపాంశువు. త్స. అవ్య. ఏకాంతము.
ఉపాకరణము. త్స. వి. ఉపాకర్మము.
ఉపాఖ్యానము. త్స. వి. ౧. ఒక పెద్దకథలో వచ్చు నొకచిన్నకథ. ౨. ఇతిహాసము.
ఉపాత్తము. త్స. విశ. పొందఁబడినది.
ఉపాధి. త్స. వి. ౧. కపటము. ౨. జాడ. ౩. గుఱుతు.
ఉపాధ్యాయ. ఉపాధ్యాయి. త్స. వి. తనంతటనే చదువు చెప్పెడు నాఁడుది.
ఉపాధ్యాయాని. త్స. వి. ఉపాధ్యాయుని భార్య.
ఉపాధ్యాయుఁడు. త్స. వి. విద్య చెప్పువాఁడు.
ఉపానహము. త్స. వి. చెప్పు.
ఉపాయనము. త్స. వి. కానుక.
ఉపాయము. త్స. వి. ౧. యుక్తి. ఇవి నాల్గు:— ౧. సామము. ౨. దానము. ౩. భేదము. ౪. దండము. ౨. పొందు.
ఉపార్జనము. త్స. వి. సంపాదనము.
ఉపాలంభనము. త్స. వి. ౧. దెప్పుట. ౨. నిందించుట.
ఉపాలంభము. త్స. వి. ”
ఉపాశ్రయము. త్స. వి. ప్రాపు.
ఉపాసకుఁడు. త్స. వి. సేవకుఁడు.
ఉపాసన. త్స. వి. ౧. సేవ. ౨. పీఁట. క్రి. ఉపాసించు.
ఉపాసము. త్స. దే. వి. ఉపవాసము.
ఉపాహారము. త్స వి. చిఱుతిండి.
ఉపేంద్రుఁడు. త్స. వి. విష్ణువు.
ఉపేక్ష. త్స. వి. అశ్రద్ధ.
ఉపేక్షించు. త్స. క్రి. ఒప్పరికించు.
ఉపోద్ఘాతము. త్స. వి. పీఠిక.
ఉపోషణము. త్స వి. పస్తు.
ఉపోషము. త్స. వి. ,,
ఉపోషితుఁడు. త్స. వి. పస్తున్న వాఁడు.
ఉపోష్యము. త్స. విశ. పస్తుండఁదగినది. (అధ్యాది)
ఉప్తము. త్స. విశ. విత్తఁబడినది.
ఉప్పత. దే. వి. ఓర్వలేనితనముచేత ఆడిపోసికొనుట.
ఉప్పతించు. దే. క్రి. ఓర్వలేనితనము చేత ఆడిపోసికొను.
ఉప్పతిల్లు. వై. క్రి. పుట్టు.
ఉప్పర. దే. వి. ఉప్పరవాఁడు. రూ. ఉప్పరి.
ఉప్పరము. దే.వి.పైభాగము.ఆకాశము.
ఉప్పరిగ. వై. వి. మేడ.
ఉప్పళము. దే. వి. ఉప్పుపండెడినేల.
ఉప్పళించు. దే. క్రి. బట్టలుగుంజు.
ఉప్పిఁడి. దే. విశ. ఉప్పులేనిది.
ఉప్పిఁడి యుపవాసము. మి. వి. శుష్కోపవాసము.
ఉప్పు. దే. వి. లవణము. క్రి. ఉడికించు.

ఉప్పుఁగాయ. దే. వి. ఊరుఁగాయ.
ఉప్పువాము. దే. వి. ౧. ఉప్పుపండెడి చోటు. ౨. ఉప్పుకుప్ప.
ఉప్పెన. దే. వి. సముద్రమునీటివెల్లువ.
ఉప్పొంగు. దే. క్రి. ౧. మిక్కిలి యుబ్బు. ౨. మిక్కిలి సంతోషించు. 3. రేఁగు.
ఉబలాటము. త్స. వి. ఉత్కంఠ.
ఉబుకు. దే. క్రి. పొంగు. వి. పొంగుట.
ఉబుసు. దే. వి. ఊసు. (పనిలేని కాలము.)
ఉబ్బ. వై. ఉక్క.
ఉబ్బతిల్లు. వై. క్రి. పొంగు.
ఉబ్బరము. దే. వి. కడుపుబ్బుట. క్రి. ఉబ్బరించు.
ఉబ్బలి. దే. వి. బురద.
ఉబ్బసము. వై. వి. ఉబ్బసరోగము.
ఉబ్బు. వై. క్రి. పొంగు.
ఉబ్బెత్తు. దే. విణ. ఉబికినది. పైకి లేచినది.
ఉమ. త్స. వి. పార్వతి.
ఉమియు. దే. క్రి. ఉమ్మివేయు.
ఉముక. దే. క్రి. పొట్టు.
ఉమ్మ. దే. వి. ఉబ్బ.
ఉమ్మగిల్లు. వై. క్రి. ఆవిరిచే ఉడుకు.
ఉమ్మడి. దే. వి. ౧. పొత్తు. ౨. నిత్యపుఁగట్టడ. అవ్య. (ఒక్కుమ్మడి = ఏకకాలమున.)
ఉమ్మదము. వై. వి. ఉక్క.
ఉమ్మలము. దే. వి. దుఃఖము.
ఉమ్మలి. దే. వి. ఉబ్బలి.
ఉమ్మలించు. దే. క్రి. శోకించు.
ఉమ్మలికము. దే. వి. దుఃఖము. క్రి. ఉమ్మలికించు.
ఉమ్మాదము. వై. వి. చిత్తవిభ్రమము.
ఉమ్మి. దే. వి. ఉమిసెడి యెంగిలి.
ఉయాల. దే. వి. ఉయ్యాల.
ఉయెల. దే. వి. ,,
ఉయేల. దే. వి. ,,
ఉయ్యాల. దే. వి. ,,
ఉయ్యెల. దే. వి. ,,
ఉరక. దే. అవ్య. ఊరక.
ఉరగము. త్స. వి. పాము.
ఉరడించు. దే. క్రి. వేగిరపడు.
ఉరణము. త్స. వి. గొఱ్ఱెపోతు.
ఉరరీకారము. త్స. వి. అంగీకారము.
ఉరలఁబడు. దే. క్రి. దొర్లు. కూలు.
ఉరలు. దే. క్రి. ౧. దొర్లు. ౨. కాలు. 3. రాలు.
ఉరవడి. దే. వి. మిక్కిలి వేగము. క్రి. ఉరవడించు.
ఉరసిజము. త్స. వి. ఉరోజము. స్తనము.
ఉరి. దే. వి. ఉచ్చు. వాగుర.
ఉరిపోయు. దే. క్రి. ప్రాణముతీయు.
ఉరియాట. దే. వి. ౧. ఊగులాడుట. ౨. సందేహము. క్రి. ఉరియాడు.
ఉరియు దే. క్రి. చలించు.

ఉరువిడి. దే. వి. వస్తుసమూహము.

ఉరువు. వై. వి. స్వరూపము. దే. క్రి. పరిహరించు. త్స. పెద్దది.

ఉర్వి. త్స. వి. నేల.

ఉఱవడి. దే. వి. విజృంభణము.

ఉఱవు. దే. విణ. ౧. విశాలము. ౨. యుక్తము.

ఉఱీ. దే. వి. ౧. బలము. విణ. తీవ్రము.

ఉఱియు. దే. వి. ఇంటికప్పు చెడి గాని సందులనుండి నీరు పడు.

ఉఱుఁద్రాళ్లు. దే. వి. బ. పాలుపిదుకు నపుడు ఆవు వెనుక కాళ్లకుఁ గట్టు త్రాళ్లు. రూ. ఉఱ్ఱుఁద్రాళ్లు.

ఉఱుకు. దే. క్రి. ౧. దాఁటు. ౨. దుముకు.

ఉఱుపు. దే. వి. చెడినయింటికప్పుసందు నుండి వానపడుట.

ఉఱుము. దే. వి. ౧. మేఘధ్వని. ౨. శూరులు రణరంగమునఁ జేయునాదము. క్రి. ధ్వనించు.

ఉఱ్ఱటలూఁగు. దే. క్రి. ౧. మిక్కిలి యూఁగు. ౨. కదలు.

ఉఱ్ఱాడు. దే. క్రి. మిక్కిలి చలించు.

ఉఱ్ఱు. దే. వి. పాలుపిదుకుటకు ఆవు వెనుక కాళ్ళను ఉఱ్ఱుఁద్రాళ్ళతో కట్టుట.

ఉఱ్ఱూతలూఁగు. దే. క్రి. ౧. మిక్కిలి యూఁగు. ౨. కదలు.

ఉలవరించు. దే. క్రి. కావలసిన తేమ కంటె నెక్కువ తేమచేత నేల ఉబుకు.

ఉలి. దే. వి. వడ్లవాని కొఱముట్టు. విణ. అల్పము. (ఉలిపచ్చి = కొంచెము పచ్చి.)

ఉలికిపడు. దే. క్రి. ఉన్నట్టుండి కలుగు భయాదులచే వడఁకు. వి. ఉలికిపాటు.

ఉలిపి. దే. వి. ౧. తులువ. ౨. పోకిరి.

ఉలిపికట్టె. దే. విణ. ౧. పొగరుఁబోతు. ౨. చెడ్డవాఁడు.

ఉలిపిగొట్టు. దే. విణ. ,,

ఉలియు. దే. క్రి. ౧. మ్రోయు. ౨. చలించు.

ఉలివాడు. దే. క్రి. ౧. కొలఁదిగా వాడు. ౨. చలించు.

ఉలివు. దే. వి. ౧. మ్రోఁత. ౨. చలనము.

ఉలుకు. దే. క్రి. భయపడు. వి. భయము.

ఉలుప. దే. వి. కానుక. రూ. ఉలుపా.

ఉలుపాల్పెట్టు. దే. క్రి. కానుకలిచ్చు.

ఉలూకము. త్స. వి. గ్రుడ్లగూబ.

ఉలూఖలము. త్స. వి. రోలు.

ఉల్క. త్స. వి. ౧. ఉత్పాతములలో నొకటి. ౨. కొఱవి. 3. అగ్నికణము.

ఉల్బణము. త్స. విణ. ౧. అధికము. ౨. తెలుపయైనది. 3. డాబుగలది.

ఉల్ముకము. త్స. వి. కొఱవి.
ఉల్లంఘించు. త్స. క్రి. మేరమీఱు. వి. ఉల్లంఘనము.
ఉల్లడ. దే. వి. వితానము. మేలుకట్టు.
ఉల్లము. దే. వి. మనస్సు. చిత్తము.
ఉల్లసమాడు. దే. క్రి. రహస్యమెఱిఁగి గేలిచేయు. వి. ఉల్లసము.
ఉల్లసిల్లు. త్స. క్రి. ౧. సంతసించు. ౨. వెలుఁగు.
ఉల్లాఘుఁడు. త్స. విశే. రోగనిర్ముక్తుఁడు.
ఉల్లాసము. త్స. వి. ౧. సంతసము. ౨. వెలుఁగు.
ఉల్లి. దే. వి. ౧. వెల్లుల్లి. ౨. నీరుల్లి.
ఉల్లికట్టు. దే. వి. ఎత్తిపాడుపు.
ఉల్లుంఠనము. దే. వి. ,,
ఉల్లేఖము. త్స. వి. ౧. చెప్పుట. ౨. వ్రాయుట.
ఉవిద. దే. వి. స్త్రీ. ఆఁడుది.
ఉవ్విళులూరు. దే. క్రి. వేగిరపడు. రూ. ఉవ్విళ్ళూరు.
ఉవ్విళ్ళుగొను. దే. క్రి. వేగిరపడు.
ఉవ్వెత్తు. దే. అవ్య. ౧. శేషము లేకుండఁగా ౨. అవలీలగా.
ఉష. త్స. వి. ౧. బాణునికుమార్తె. ౨. రాతిరి.
ఉషస్సు. త్స. వి. తెల్లవారుటకుముందు నాలుగు గడియల కాలము.
ఉష్ట్రము. త్స. వి. ఒంటె.
ఉష్ణము. త్స. వి. ౧. ఎండ. ౨. ఎండ కాలము.
ఉష్ణాళువు. త్స. విశే. ఉష్ణమున కోర్వనివాఁడు.
ఉష్ణీషము. త్స. వి. తలపాగ.
ఉష్మము. త్స. వి. వేఁడి.
ఉసి. దే. వి. ౧. కుక్కకవియుట. ౨. పోఁడి.
ఉసికొను. దే. క్రి. ప్రోత్సాహమొందు.
ఉసుక. దే. వి. ఇసుక.
ఉసుము. దే. క్రి. ఉదుకు.
ఉసురసురు. దే. వి. తాపమునం దగు ధ్వన్యనుకరణము. రూ. ఉస్సురస్సురు.
ఉసుఱు. దే. వి. ప్రాణము
ఉసులు. దే. వి. అనుకూల్యము.
ఉస్సు. దే. వి. ఉస్సురు.
ఉహుహూ. దే. వి. చలిపట్టినపుడు అగు ధ్వని.
ఉహూ. దే. క్రి. నిప్పును ఊదు.

## ఊ

ఊఁక. దే. వి. ౧. ఊఁగులాట. ౨. ఉమక.
ఊఁకించు. దే. క్రి. ఉత్సహించు.
ఊఁకువ. దే. వి. పూనిక. క్రి. ఊఁకు.
ఊఁకొను. దే. క్రి. ఊఁకొట్టు.
ఊఁకొట్టు. దే. క్రి. "ఊ" "ఊఁ" అని కథలు అడుగు.

ఊఁగాడు. దే. క్రి. ఊఁగులాడు.
ఊఁగు. దే. క్రి. ఊఁగాడు.
ఊఁగులాడు. దే. క్రి. ఊఁగాడు. వి. ఊఁగులాట.
ఊఁచె. దే. వి. ౧. అరఁటిబొందె. ౨. జొన్న మొదలగువానికంకి, కాఁడ.
ఊఁచెపడు. దే. క్రి. కృశించు.
ఊఁచపోవు. దే. క్రి. కృశించు.
ఊఁచెముట్టు. దే. వి ణ. మూలముట్టుగా.
ఊఁచు. దే. క్రి. ఊఁగించు.
ఊఁటు. దే. క్రి. పాడుచు. (గు[illegible]).
ఊఁడుచు. దే. క్రి. వరియాకు మొదలగునవి నాటు.
ఊఁత. దే. వి. ఆధారము.
ఊఁదరపెట్టు. దే. క్రి. పొగవేయు.
ఊఁదు. దే. క్రి. ౧. నోటితో గాలిని విడుచు. ౨. గ్రహించు. 3. అను.
ఊఁపు. దే. క్రి. ఊఁచు.
ఊటాడించు. దే. క్రి. వడకించు.
ఊడనిఁబాడు. దే. క్రి. పరుగిడు.
ఊడిగము. దే. వి. కొలువు. సేవ.
ఊనము. త్స. విణ. తక్కువది.
ఊను. దే. క్రి. పట్టుకొను.
ఊపిరి. దే. వి. ఊర్పు.
ఊబి. దే. వి. బురద.
ఊయల. దే. వి. డోల. రూ. ఊయాల. ఉయేల. ఉయ్యాల.
ఊరఁబిచ్చుక. దే. వి. ఇండ్లపట్టునఁ దిరిగెడు నొక చిన్నపక్షి.
ఊరక. దే. అవ్య. కారణములేక. పనిలేక.
ఊరాఱుచు. } దే. క్రి. ఊఱడించు.
ఊరార్చు. }
ఊరించు. దే. క్రి. ఊరఁజేయు.
ఊరు. దే. క్రి. ౧. లోపలనుండి నీరు మొదలగునవి పైకిలేచు. ౨. నాను. 3. పుట్టు. వి. ౧. పల్లె. ౨. రాష్ట్రము.
ఊరుఁగాయ. దే. వి. ఉప్పులో నానిన మామిడి, నిమ్మ లోనగు కాయ.
ఊరుజుఁడు. త్స. వి. వైశ్యుఁడు.
ఊరుదఘ్నము. త్స. విణ. తొడ లోతుగలది.
ఊరుపు. దే. వి. ఊపరి. రూ. ఊర్పు.
ఊరుపోక. దే. వి. ఉబుసుపోక.
ఊరువు. త్స. వి. తొడ.
ఊరేఁగింపు. దే. వి. ఊరేఁగించుట.
ఊర్చు. దే. క్రి. ఊపిరివిడుచు.
ఊర్జస్వలుఁడు. త్స. వి. మిక్కిలి బలముగలవాఁడు.
ఊర్జస్వి త్స. విణ. ,,
ఊర్జితపఱచు. త్స. వి. గట్టిచేయు. దృఢపఱచు. వి. ఊర్జితము.
ఊర్ణనాభము. త్స. వి. సాలెపురుగు.
ఊర్ధ్వము. త్స. విణ. మీఁదిది.
ఊర్మి. త్స. వి. ౧. అల. ౨. పెద్దయల. 3. నొప్పి.
ఊర్మిక. త్స. వి. ఉంగరము.
ఊఱట. దే. వి. ౧. ఊఱడించుట. ౨. తెఱపి. విణ. సాహాయ్యము.

ఊఱడిల్లు. దే. క్రి. నెమ్మదియగు. ప్రే. ఊఱడించు.
ఊఱడు. దే. క్రి. విరమించు.
ఊషరము. త్స. వి. చవుటిది (నేల).
ఊష్మము. దే. త్స. వి. ౧. శషసహలలో నొకటి. ౨. ఉక్క. 3. వేఁడిమి.
ఊసరము. త్స. విశ. కృశించినది.
ఊసరవెల్లి. దే. వి. మూఁడువన్నెలుఁ గలతొండ.
ఊసరిల్లు. దే. క్రి. బక్కచిక్కు.
ఊసు. దే. వి. ఉబుసు.
ఊహము. త్స. వి. వితర్కము.
ఊళ. దే. వి. నక్కకూఁత.

## ఋ

ఋక్కు. త్స. వి. ౧. వేదము. ౨. ఒక వేదభాగము.
ఋక్షము. త్స. వి. ౧. ఎలుఁగు. ౨. నక్షత్రము.
ఋజువు. త్స. విశ. చక్కనైనది.
ఋణము. త్స. వి. అప్పు. (ఋణములు మూఁడు. ౧. దేవఋణము. ౨. ఋషిఋణము. 3. పితృఋణము.)
ఋతము. త్స. వి. సత్యము.
ఋతుమతి. త్స. వి. ముట్టుది.
ఋతువు. త్స. వి. వసంతము మొదలగునవి. (ఇవి ఆఱు-వసంతము. గ్రీష్మము. వర్షము. శరత్తు. హేమంతము. శిశిరము.)
ఋత్విజుఁడు. త్స. వి. యజ్ఞకర్తచే ధనము గైకొని యజ్ఞము నడపువాఁడు.
ఋషభము. త్స. వి. ఎద్దు.
ఋషి. త్స. వి. ౧. ముని. ౨. వేదము. 3. ప్రకాశము.

## ఎ

ఎంగిలి. దే. వి. ఉచ్ఛిష్టము.
ఎంగిలించు. దే. క్రి. ఎంగిలిచేయు.
ఎంచు. దే. క్రి. ౧. ఒకటి, రెండు మున్నగు నంకెలను వరుసక్రమమున ఎన్నికపెట్టు. ౨. తలఁచు. 3. ఆక్షేపించు. ౪. పొగడు.
ఎండ. దే. వి. సూర్యప్రకాశము.
ఎండఁగట్టు. దే. క్రి. తడిగుడ్డను ఆఱఁగట్టు.
ఎండఁగొట్టు. దే. క్రి. ఎండునట్లుచేయు.
ఎండఁబెట్టు. దే. క్రి. ఎండవైచు.
ఎండమావులు. దే. వి. బ. మృగతృష్ణ.
ఎండు. దే. క్రి. ౧. తడియాఱు. ౨. ఇంకు. 3. మాడు.

ఎండ్రకాయ. వై. వి. ఎండ్రి. రూ. ఎండ్రిక.

ఎంత. దే. స. ౧. ఏమట్టు. ౨. ఎంత కాలము.

ఎంతదనుక. దే. అవ్య. ఎందాఁక.

ఎంతయు. దే. అవ్య. మిక్కిలి.

ఎంతేని. దే. విణ. మిక్కిలి.

ఎందనుక. దే. అవ్య. ఎంతదాఁక. రూ. ఎందాఁక.

ఎందఱు. దే. స. ఎంతసంఖ్య కలవారు.

ఎందలి. దే. విణ. ఎందున్న.

ఎందు. దే. అవ్య. ఎక్కడ.

ఎందులకు. దే. అవ్య. ౧. ఎక్కడికి. ౨. దేనికి.

ఎంబన్న. దే. విణ. పనికిరానివాఁడు.

ఎకవొట్టు. దే. క్రి. ఎగఁగొట్టు.

ఎకరా. దే. వి. ౧. ఏనుఁగునుగట్టు వెలఁగసాల. ౨. నూఱుసెంట్లుకల కొలతనేల.

ఎకసక్కెము. దే. వి. ౧. కేళిమాట. ౨. అవమానము. 3. మోసము.

ఎకాయెకి. దే. విణ. ఒక్కమాఱుగా.

ఎకిమీఁడు. దే. వి. రాజు.

ఎక్కటి. వై. స. ఒకటి. విణ. అసహాయము. (పరాపేక్షలేనిది.)

ఎక్కడ. దే. వి. ఏచోటు.

ఎక్కము. దే. వి. సేతువిశేషము. గనిమ. ఒకటి. బ. గుణకారపథకము. ఎక్కాలు.

ఎక్కలి. దే. వి. ప్రవాహముచేఁ గొట్టుకొనివచ్చి కమ్ముకొనిన యిసుక.

ఎక్కిఁడు. దే. క్రి. సాధించు.

ఎక్కిరింత. దే. వి. వాహనము.

ఎక్కిలి. దే. వి. కొక్కు (వెక్కిళ్లు) అందురు.

ఎక్కు. దే. క్రి. ౧. అధికమగు. ౨. ఇష్టమగు. 3. సిద్ధించు. ౪. గుఱ్ఱము మొదలగు వాహనముల నెక్కు.

ఎక్కుడించు. దే. క్రి. ౧. హెచ్చించు. ౨. ఎక్కుదీయు.

ఎక్కుడు. దే. వి. ౧. ఆరోహణము. ౨. వాహనము. విణ. అధికము.

ఎక్కుడుపెట్టు. } దే. క్రి. నారిపెట్టు.
ఎక్కుపెట్టు. }

ఎక్కులుపెట్టు. దే. క్రి. ఉసిగొలుపు.

ఎక్కువ. దే. విణ. ఆధిక్యము.

ఎగతాళి. దే. వి. పరిహాసము. గేలి.

ఎగదిగ. దే. అవ్య. పైకిని క్రిందికిని; వెనుకకును, ముందునకును. రూ. ఎగాదిగ.

ఎగయు. దే. క్రి. ౧. ఎగురు. ౨. పైకిలేచు. 3. ఎగప్రాకు.

ఎగసన. దే. వి. పైంబోవునట్లు (వ్యతి- దిగసన)

ఎగసిపడు. దే. క్రి. ౧. గర్వించు. ౨. మండిపడు. 3. ఎగిరిపడు. వి. ఎగసిపాటు.

ఎగాదిగ. ఎగదిగ.

ఎగుడు. దే. విణ. ఉన్నతము.

ఎగుడుదిగుడు. దే. విణ. ౧. సమము గానిది. ౨. అసంగతము.

ఎగుదల. దే. వి. పైభాగము.

ఎగుబుజము. దే. వి. ఉన్నతభుజము.

ఎగుమతి. దే. వి. ఓడలో సరకులు ఎక్కించుట.

ఎగురు. దే. క్రి. ఎగయు.

ఎగురులాడు. దే. క్రి. దుముకులాడు.

ఎగువ. దే. వి. ౧. మీఁదు. ౨. ఆధిక్యము. విణ. మీఁదనున్నది.

ఎగ్గడి. దే. వి. అంతఃపురకావలివాఁడు. రూ. ఎగ్గడికాఁడు.

ఎగ్గడికత్తె. దే. విణ. అంతఃపురపుఁగావలికత్తె.

ఎగ్గాడు. దే. క్రి. దూషించు.

ఎగ్గు. దే. వి. ౧. కీడు. ౨. అపకారము. ౩. కీడుమాట. ౪. అపరాధము. ౫. దోషము. ౬. నింద.

ఎగ్గులాడు. దే. క్రి. నిందించు.

ఎచటు. దే. వి. ఏ. ఎక్కడ.

ఎచ్చరించు. దే. క్రి. ఎచ్చరికచేయు. రూ. హెచ్చరించు; ఎచరించు.

ఎచ్చరిక. దే. వి. ౧. జాగ్రత్త. ౨. సూచన. రూ. హెచ్చరిక.

ఎచ్చరికించు. దే. క్రి. ఎచ్చరించు.

ఎచ్చరిల్లు. దే. క్రి. వృద్ధినొందు.

ఎచ్చిలు. దే. క్రి. ౧. వృద్ధినొందు. ౨. ప్రబోధముచెందు.

ఎచ్చు. దే. క్రి. అధికమగు. వి. ఆధిక్యము. విణ. అధికము. రూ. హెచ్చు.

ఎటు. దే. అవ్య. ఎట్లు. ఎటులు.

ఎటువంటి. దే. విణ. ఎట్టి.

ఎట్టకునేని.
ఎట్టకేని.
ఎట్టకేలకు. } దే. అవ్య. మిక్కిలి ప్రయాసముచే.

ఎట్టయెదురు. దే. వి. చక్కనియెదురు.

ఎట్టి. దే. విణ. ఎటువంటి.

ఎట్టిఁడు. దే. వి. ఎట్టివాఁడు.

ఎట్టులు. దే. అవ్య. ఎట్లు.

ఎట్టూ. దే. అవ్య. ఏప్రకారము.

ఎట్లు. దే. అవ్య. ఏప్రకారము.

ఎడ. దే. వి. ౧. చోటు. ౨. అవకాశము. ౩. దూరము. ౪. గడువు. ౫. భేదము. ౬. హృదయము. ౭. స్వల్పము. (ఎడలాభము) ౮. వ్యర్థము. (ఎడమాట) ౯. వ్యవహారము.

ఎడఁద. వై. వి. హృదయము. రూ. ఎద.

ఎడబాటు. దే. వి. ఎడఁబాయుట.

ఎడఁబాపు. దే. ప్రే. పరివిడఁజేయు.

ఎడకాఁడు. దే. వి. కుంటెనకాఁడు.

ఎడకొను. దే. క్రి. అవకాశముచేసికొను.

ఎడతెగు. దే. క్రి. విచ్ఛిన్నమగు. వేఱుపడు.

ఎడతెఱపి. దే. వి. అవకాశము.

ఎడఁద్రెవ్వు. దే. క్రి. విచ్ఛిన్నమగు.
ఎడదవ్వు. దే. వి. మిక్కిలి దూరము.
ఎడనీరు. దే. వి. లేఁతటెంకాయలోని నీరు.
ఎడనెడ. దే. అవ్య. నడుమనడుమ.
ఎడపఁదడప. దే. అవ్య. అప్పుడప్పుడు.
ఎడపక. దే. అవ్య. ౧. తప్పక. ౨. ఆలస్యముచేయక.
ఎడపడు. దే. క్రి. వేఱుపడు.
ఎడమ. దే. విశే. సవ్యము. వామభాగము.
ఎడమదుగు. దే. విశే. ౧. వ్యత్యస్తము. ౨. విపరీతము.
ఎడము. దే. వి. ౧. అవకాశము. ౨. దూరము.
ఎడయాడు. దే. క్రి. సమీపమునఁ దిరుగాడు.
ఎడయిక. దే. వి. ఎడఁబాటు.
ఎడయు. దే. క్రి. తొలఁగు.
ఎడరు. దే. క్రి. భగ్నమగు. వి. ౧. కీడు. ౨. భంగము. 3. సందు.
ఎడలు. దే. వి. ౧. వికలమగు. ౨. విచ్ఛిన్నమగు.
ఎడవిడివడు. దే. క్రి. విశృంఖలమగు.
ఎడాటము. దే. వి. ౧. భేదము. ౨. విషయము. (వారి యెడాటమునఁ = వారి విషయమున.)
ఎడారి. దే. వి. చెట్టుచేమలేని విశాలమగు నిర్జన భూమి.
ఎడ్డ. దే. వి. ఎడఁద.
ఎడ్డము. దే. వి. అడ్డము.
ఎడ్డియ. } దే. వి. మూఢుఁడు.
ఎడ్డె. }
ఎడ్డెఁడు. }
ఎద్దు. దే. వి. బ. ఎద్దులు.
ఎతఁడు. దే. స. ఏ. పూజ్యుఁడు. రూ. ఏతఁడు.
ఎత్తరము. దే. విశే. ఉన్నతము.
ఎత్తరువు. దే. విశే. ,,
ఎత్తికొను. దే. క్రి. ౧. పూను. ౨. ఉద్యమించు. 3. అపహరించు. ౪. వహించు.
ఎత్తికోలు. దే. వి. ౧. ప్రయత్నము. ౨. సంకల్పము.
ఎత్తిపొడుచు. దే. క్రి. తప్పు లేటి యేటి మఱీ మఱీ చెప్పి మనసు నొచ్చునట్లు నిందించు.
ఎత్తిపోవు. దే. క్రి. చెడిపోవు.
ఎత్తిలి. దే. అవ్య. బిగ్గరగా.
ఎత్తివైచు. దే. క్రి. ౧. తీసివైచు. ౨. చులకనచేయు.
ఎత్తు. దే. క్రి. ౧. పుట్టు. ౨. పయనమగు. 3. దొంగిలించు. ౪. పైకి లేవనెత్తు. ౫. కైకొను. ౬. ప్రస్తావించు. ౭. పొందు. వి. ౧. చదరంగముయొక్క ఎత్తు. ౨. ఉన్నతి. 3. ఉపాయము. ౪. తూనిక. ౫. ఉద్యమము.

ఎత్తుగడ. దే. వి. ౧. యుక్తి. ౨. పూనిక.
ఎత్తుభారము. దే. విశే. పాడు.
ఎత్తులిడు. దే. క్రి. ప్రోత్సాహము సేయు.
ఎత్తువచ్చు. దే. క్రి. సరిపోలు.
ఎత్తువడు. దే. క్రి. ౧. నశించు. ౨. లేవలేకపోవు.
ఎత్తువోవు. దే. క్రి. ౧. చెడు. ౨. తగ్గు.
ఎత్తులువెట్టు. దే. క్రి. ప్రేరించు. ప్రోత్సాహించు.
ఎద. దే. వి. పశువుల ఋతువు. వై. ౧. హృదయము. ౨. భీతి. 3. వక్షస్స్థలము.
ఎదవడు. దే. క్రి. భయపడు.
ఎది. దే. స. ఏశబ్దముయొక్క ప్రథమైకవచనరూపము. రూ. ఏది.
ఎదిరి. దే. వి.౧. అన్యుఁడు.౨.శత్రువు.
ఎదిరించు. దే. క్రి. ఎదురు.
ఎదుగు. దే. క్రి. పెరుఁగు.
ఎదురాడు. దే. క్రి. ౧. బదులుచెప్పు. ౨. ఎదిరించు.
ఎదురు. దే. క్రి. ఎదిరించు. ౧. వి. ముందుచోటు. ౨. ప్రతివిరోధి.
ఎదురుకొను. దే. క్రి. ఎదురగవచ్చు. రూ. ఎదుర్కొను.
ఎదురుకోలు. దే. వి. ఎదుర్కొనుట. రూ. ఎదుర్కోలు.
ఎదురుచు. దే. క్రి. ఎదిరించు. రూ. ఎదుర్చు.
ఎదురుచుక్క. దే. విశే. ప్రతికూలము. రూ. ఎదుర్చుక్క.
ఎదురుచూచు. దే. క్రి. ప్రతీక్షించు.
ఎదురుపడు. దే. క్రి. ౧. ముందుగ వచ్చు. ౨. ఎదురుతిరుగు.
ఎదురేగు. దే. క్రి. ఎదురుగాఁ బోవు.
ఎదుగొమ్ము. దే. వి. ఎదురుకొమ్ము.
ఎద్దడి. దే. వి. ౧. పేదఱికము. ౨. అభావము.
ఎద్దడినేల. దే. వి. నిర్జలభూమి.
ఎద్దు. దే. వి. వృషభము.
ఎద్దురాసి. దే. వి. వృషభలగ్నము.
ఎన. దే. వి. జోడు. సరి.
ఎనమండ్రు. దే. స. ఎనిమిదికి మహత్ర్యర్థకరూపము. ఎనిమిదిమంది.
ఎనమందుము. దే. వి. ఎనిమిదితూములు.
ఎనమన్నూఱు. దే. వి. ఎనిమిదివందలు. రూ. ఎనుమన్నూఱు.
ఎనయు. దే. క్రి. ౧. సరిపోలు. ౨. పొందు. పోలు. వి. ఎనయిక.
ఎనవాయు. దే. వి. జోడుబీడు.
ఎనిమిది. దే. వి. ఏడును ఒకటియును. రూ. ఎన్మిది.
ఎనుచు. దే. వి. కలియు. (పప్పు బాగుగా ఎనిచెను).
ఎనుపసరము. } దే. వి. బఱ్ఱె.
ఎనుపెంటి. }

ఎనుపోతు. దే. వి. దున్నపోతు.
ఎనుబడి. దే. స. ఎనిమిదిపదులు.
ఎనుము. దే. వి. బఱ్ఱె.
ఎన్నఁడు. దే. వి. ఏ. ౧. ఏదినము. ౨. ఎప్పుడు. రూ. ఏనాఁడు.
ఎన్నాళ్లు. దే. వి. బ. ఎన్నిదినములు.
ఎన్నిక. దే. వి. గణనము.
ఎన్నికచేయు. / ఎన్నికపెట్టు. } దే. క్రి. ఎంచు.
ఎన్ను. దే. క్రి. ౧. ఆక్షేపించు. ౨. గణించు. వి. కంకి.
ఎప్డు. దే. వి. ఏ. ఏకాలము. రూ. ఎప్పుడు.
ఎబ్బె. దే. వి. రోఁతపడుటలో ఉపయోగించుమాట.
ఎబ్బెట్టు. దే. వి. విరసము. వికటము.
ఎబ్బెరాసి. దే. విశే. రోఁతపుట్టించునది. రోఁతపుట్టించువాఁడు. రూ. ఏబ్రాసి.
ఎబ్బెతికము. దే. విశే. రోఁత.
ఎముక. దే. వి. అస్థి.
ఎమ్మె. / ఎమ్మెక. } దే. వి. ఎముక.
ఎమ్మె. దే. వి. ౧. విలాసము. ౨. మనోజ్ఞత్వము.
ఎమ్మెకాఁడు. దే. విశే. చక్కనివాఁడు.
ఎమ్మెలాఁడి. దే. వి. చక్కని యాఁడుది.
ఎర. దే. వి. ౧. పక్షుల యాహారము. ౨. బలి. ౩. దుఃఖము.
ఎరఁగు. దే. క్రి. నమస్కరించు. రూ. ఎఱఁగు.
ఎరగలి. దే. వి. కార్చిచ్చు. (రూ. ఎరవలి.)
ఎరగొను. దే. క్రి. ౧. గ్రసించు. ౨. పరవశమగు.
ఎరవు. దే. వి. ౧. ఒకటి రెండు దినములకై వాడుకొనుటకు తెచ్చినసగ. ౨. భేదము. విశే. ఇతరము.
ఎరియు. దే. క్రి. ౧. కాలు. ౨. పరితపించు.
ఎరువు. దే. వి. పొలమునకు వైచునట్టి పశువుల పెంట, బూడిద, పండుటాకులు లోనగునవి.
ఎఱ్ఱు. దే. వి. ఎఱుకు. కిరాతుఁడు.
ఎఱ. దే. వి. ౧. వానసాము. ౨. రక్తిమ.
ఎఱఁగు. దే. క్రి. ౧. నమస్కరించు. ౨. దిగు.
ఎఱక. దే. వి. ౧. ఱెక్క. ౨. భుజము.
ఎఱగందు. దే. వి. లేఁతబిడ్డ.
ఎఱచి. దే. వి. మాంసము.
ఎఱబతికము. దే. వి. ౧. రోఁత. ౨. భేదము.
ఎఱసంజె. దే. వి. సంధ్య.
ఎఱుఁగు. దే. క్రి. తెలియు.
ఎఱుక. దే. వి. ౧. తెలివి. ౨. సోదె. ౩. పరిచయము. ౪. చిహ్నము. ౫. జోస్యము.

**ఎఱుకత.** దే. వి. సోదె చెప్పుసింగి.

**ఎఱుకపడు.** దే. క్రి. తెలియనగు.

**ఎఱుకు.** దే. వి. ౧. కిరాతుఁడు. ౨. బోయవాఁడు.

**ఎఱుకులసాని.** దే. వి. ఎఱుకత.

**ఎఱుకువ.** దే. వి. ౧. తెలివి. ౨. అనురాగము.

**ఎఱుపు.** దే. వి. ఎఱ్ఱన.

**ఎఱ్ఱ.** దే. వి. ౧. ఎఱుపు. ౨. నానపాము.

**ఎఱ్ఱన.** వై. వి. ఎఱుపు.

**ఎఱ్ఱవాఱు.** దే. క్రి. ౧. ఎఱ్ఱనగు. ౨. కోపగిల్లు.

**ఎల.** దే. విశే. ౧. అభినవము. (ఎల జవ్వనము.) ౨. స్వల్పము. (ఎల నవ్వు.)

**ఎలగోలు.** దే. వి. ౧. ప్రథమ కృత్యము. ౨. ముందటిసేన. 3. కోలాహలము.

**ఎలకోఁటు.** దే. వి. ఉపవనము.

**ఎలనాగ.** దే. వి. ఆఁడుది.

**ఎలప్రాయము.** దే. వి. క్రొత్తయౌవనము.

**ఎలమావి.** దే. వి. తియ్యమామిడి.

**ఎలమి.** దే. వి. ౧. సంతోషము. ౨. ఉత్సాహము. 3. ప్రేమ. ౪. దయ.

**ఎలయు.** దే. క్రి. ౧. చేరు. ౨. ప్రవేశించు. 3. కలుగు. ౪. లోనగు.

**ఎలరారు.** దే. క్రి. ఒప్పు.

**ఎలరుచు.** దే. క్రి. అతిశయించు. రూ. ఎలర్చు.

**ఎలరుపు.** దే. వి. అతిశయము. (రూ. ఎలర్పు.)

**ఎలుఁగు.** దే. వి. ౧. కంఠధ్వని. ౨. ఎలుఁగుబంటి. రూ. ఎలువు.

**ఎలుఁగుగొడ్డు.** దే. వి. ఎలుఁగు.

**ఎలుక.** దే. వి. మూషకము.

**ఎలువు.** దే. వి. ఎలుఁగునకు రూపాంతరము.

**ఎల్ల.** దే. వి. పొలిమేర. అవ్య. సమస్తము.

**ఎల్లరిబోటి.** దే. విశే. అందఱవంటి.

**ఎల్లి.** దే. వి. ౧. ఱేపు. ౨. రొదుగు.

**ఎల్లిదము.** దే. వి. చులుకదనము.

**ఎల్లిదుఁడు.** దే. వి. ౧. చులుకనివాఁడు. ౨. అసమర్థుఁడు.

**ఎల్లుండి.** దే. వి. ఱేపటికి అవలిదినము.

**ఎవఁడు.** దే. స. ఏమనుష్యుఁడు. రూ. ఎవ్వఁడు.

**ఎవ్వతె.** దే. స. ఏయాఁడుది. రూ. ఎవతె.

**ఎసఁగు.** దే. క్రి. అతిశయించు. వి. ఎసకము.

**ఎసకము.** దే. వి. ౧. అతిశయము. ౨. మనోహరము. 3. విధము.

**ఎసకమెసఁగు.** దే. వి. ౧. అతిశయించు. ౨. శోభిల్లు.

ఎసరు. దే. క్రి. మీఱు. వి. వంటకై కాఁగిన యుడుకునీరు.

ఎసరుపెట్టు. దే. క్రి. హానికలిగించు.

ఎసరేఁగు. దే. క్రి. విజృంభించు.

ఎసలారు. దే. క్రి. అతిశయించు.

ఎసలిక. దే. వి. తీఁజిక.

ఎసవెట్టు. దే. క్రి. పురికొల్పు.

# ఏ

ఏఁకట. దే. వి. ౧. మిక్కిలి యాపేక్ష. ౨. బోధ.

ఏఁకరు. దే. క్రి. ఉవ్విళ్ళూరు.

ఏఁకారు. దే. క్రి. ,,

ఏఁగు. దే. క్రి. వెళ్లు.

ఏఁగుబెండ్లి. దే. వి. ఊరేఁగింపు.

ఏఁచు. దే. క్రి. బాధపెట్టు.

ఏఁడాది. దే. వి. ఏఁడు. సంవత్సరము.

ఏఁడికోల. దే. వి. నాఁగటికొయ్య.

ఏఁడు. దే. వి. ౧. సంవత్సరము. ౨. ఎవఁడు.

ఏఁడుది. దే. వి. ఆబ్దికము.

ఏఁదర. దే. వి. ఒక సంసారములోఁ జేరని స్వతంత్రపు సొత్తు.

ఏఁదుము. దే. వి. అయిదుతూములు.

ఏఁపు. దే. వి. బాధ.

ఏఁబండ్రు. దే. వి. ఏఁబదిమంది.

ఏఁబది. దే. వి. అయిదుపదులు.

ఏకతమాడు. దే. క్రి. రహస్యమాడు.

ఏకతము. వై. వి. రహస్యాలోచనకుఁ దగినచోటు.

ఏకదంతుఁడు. త్స. వి. ఒంటికొమ్ము కలదేవుఁడు. వినాయకుఁడు.

ఏకన. దే. వి. అంచు.

ఏకపత్ని. త్స. వి. ఒకఁడే భర్తగాఁ గలది. పతివ్రత.

ఏకము. త్స. వి. ౧. ఇతరము. ౨. అసహాయము. 3. ఏ. ఒక్కటి.

ఏకరువు. త్స. వి. ఒకపల్లె.

ఏకలము. త్స. వి. ౧. అడవిపంది. ౨. విణ. అసహాయము.

ఏకలవ్యుఁడు. త్స. వి. బోయకుఱ్ఱవాఁడు. ద్రోణాచార్యునిశిష్యుఁడు.

ఏకలీఁడు. దే. వి. అడవిపంది.

ఏకాంగి. త్స. విణ. ఒంటివాఁడు.

ఏకాండము. దే. విణ. అతుకులు లేనిది. (అఖండము.)

ఏకాంతము. త్స. విణ. ౧. మిక్కిలి. ౨. ఇద్దఱకంటె నెక్కువజనము లేనితావు. 3. రహస్యము.

ఏకాకి. త్స. విణ. ఒకఁడు.

ఏకాదశము. త్స. వి. పదునొకండవది.

ఏకాదశి. త్స. వి. పదునొకండవతిథి.

ఏకావళి. త్స. వి. ఒంటిపేటహారము.

ఏకీభవించు. త్స. క్రి. ఒక్కటియగు.

ఏకీభావము. త్స. వి. ఐక్యము.
ఏకు. దే. క్రి. ౧. దూదినిఁ జక్కఁ జేయు. ౨. నిందించు. వి. ఏకిన దూదెచుట్ట.
ఏకుడు. దే. వి. దూదియేకుట.
ఏకైకము. త్స. విశ. ఒక్కొక్కటి.
ఏకోదరుఁడు. త్స. విశ. ఒకతల్లికడుపునఁ బుట్టినవాఁడు.
ఏగాని. దే. వి. కానిలో రెండువంతులు.
ఏగు. దే. క్రి. పోవు.
ఏగుదెంచు. దే. క్రి. ౧. వచ్చు. ౨. పోవు.
ఏచ. దే. విశ. వంకర.
ఏచు. దే. క్రి. అతిశయించు.
ఏఁటు. దే. వి. ౧. వేఁట.
ఏటవాలు. దే. వి. వంపుగా.
ఏటు. దే. వి. ౧. దెబ్బ. ౨. లాభము.
ఏటులాడు. దే. క్రి. బాణములతోఁ బోరు.
ఏట్రింత. దే. వి. భారద్వాజపక్షి. రూ. ఏటిరింత.
ఏడ. దే. వి. ఎక్కడ.
ఏడాగోడము. దే. విశ. విరుద్ధము.
ఏడాటలాడించు. దే. క్రి. మిక్కిలి శ్రమపెట్టు.
ఏడు. దే. స. ఆఱును ఒకటియును.
ఏడుగడ. దే. విశ. రక్షకము. గురువు. తల్లి. తండ్రి. పురుషుఁడు. విద్య. దైవము. దాత. రూ. ఏడ్గడ.
ఏడుగురు. దే. స. ఏడుమంది. రూ. ఏడ్వురు.
ఏడుచు. దే. క్రి. రోదనముచేయు. రూ. ఏడ్చు. వి. ఏడుపు. ఏడ్పు.
ఏడ్తెఱ. దే. వి. ౧. అతిశయము. ౨. పరాక్రమము. 3. ఏపు. ర. పూనిక.
ఏడ్దుము. దే. వి. ఏడుతూములు.
ఏణము. త్స. వి. జింక.
ఏతఁడు. దే. వి. ఎవడు.
ఏతము. ఏతాము. వై. వి. బావినుండిగాని గుంటనుండిగాని నీళ్లు ఎత్తుటకు నుపయోగపడెడి నీటియంత్రము.
ఏతరి. దే. వి. ౧. ఉద్ధతుఁడు ౨. నిరంకుశుఁడు.
ఏతాదృశము. త్స. విశ. ఇటువంటిది.
ఏతెంచు. దే. క్రి. ౧. వచ్చు. ౨. పోవు.
ఏది. దే. స. ఎది. అవ్య. ఎప్పు.
ఏదీ. దే. అవ్య. ౧. ఎప్పు. ౨. ఎక్కడ ఉన్నది.
ఏదు. దే. క్రి. నశించు. వి. ముండ్లపంది. (పెంపేదక = పెంపునశింపఁగా)
ఏనస్సు. త్స. వి. పాపము.
ఏనాది. దే. వి. అడవులలో వసించు నొకానొకజాతి.
ఏని. దే. అవ్య. నేని.
ఏనిక. దే. వి. ఏనుఁగ.
ఏను. దే. స. అయిదు.
ఏనుఁగుగొంగ. దే. వి. సింహము.

ఏనుఁగు. దే. వి. ఏనిక. విణ. పెద్దది.

ఏనుఁగుదాహము. మి. వి. అధికాశ.

ఏనుఁగుపాఁడి. దే వి. అమితమైనయీవి.

ఏనూఱు. దే. స. అయిదునూఱులు.

ఏన్నాళ్లు. దే. వి. ఏఁడుదినములు.

ఏపడఁచు. దే. క్రి. గర్వమడఁచు.

ఏపారు. దే. క్రి. ౧. అధికమగు. ౨. విజృంభించు.

ఏపు. దే. వి. ౧. అభివృద్ధి, ౨. ఉత్సాహము.

ఏపుమాపు. దే. క్రి. ఓడించు.

ఏపురేఁగు. దే. క్రి. చెలరేగు.

ఏపె. దే. వి. ఏ స్త్రీ.

ఏమఱపాటు. దే. వి. అకస్మాత్తుగా. వంచనగా.

ఏమఱిల్లు. దే. క్రి. ఏమఱు. జేలుపడు.

ఏమఱు. దే. క్రి. మోసపోవు.

ఏమఱుచు. దే. క్రి. ఏమఱించు.

ఏమాఱు. దే. క్రి. ఉపేక్షించు. అలక్ష్యముసేయు.

ఏమి. | ఏమో. దే. స. ప్రశ్నమునుదెలిపెడి.

ఏమె. దే. వి. ఎవతె.

ఏయు: దే. క్రి. ౧. విసరు. రువ్వు. ౨. ప్రయోగించు. 3. కొట్టు.

ఏరండము. త్స. వి. ఆముదపుచెట్టు.

ఏరాలు. దే. వి. తోడికోడలు.

ఏరాళము. దే. వి. ౧. అధికము. ౨. అసంఖ్యము.

ఏరు. దే. వి. ౧. ఎద్దులనుగట్టి దున్నుటకు తయారుచేసిననాఁగలి. ౨. తలనొప్పి. (తలయేరు.)

ఏరువాక. దే. వి. దుక్కియొక్క ప్రారంభము.

ఏర్చు. దే. క్రి. ౧. తలనొంచ్చు. ౨. ఏర్పఱచు. 3. ఒక్కుఁబఱచు.

ఏర్పడు. దే క్రి. ౧. తేటపడు. ౨. బయలుపడు. 3. రూపగు. ౪. నిర్ణయింపఁబడు. వి. ఏర్పాటు.

ఏఱు. దే. వి. నది. క్రి. నేలమీఁదనుండు వస్తువుల నొక్కొక్కటిగ నెత్తు.

ఏల. దే. అవ్య. ఎందుకు. రూ. ఏలా. త్స. వి. ఏలకి.

ఏలకికాయ. దే. వి. పరిమళద్రవ్యములలో నొకటి.

ఏలము. దే. వి. అమ్ముటలో నొకవిధము (వేలము.)

ఏలి. దే. వి. కపటయుక్తులు (ఏలిమ్మామాటలు.)

ఏలిక. దే. వి. రాజు. దొర.

ఏలికసాని. దే. వి. దొరసాని.

ఏలిదము. దే. వి. చులుకఁదనము.

ఏలినవాఁడు. దే. వి. రాజు.

ఏలు. దే. క్రి. ౧. కొను. ౨. పాలించు.

ఏలుకొను. దే. క్రి. ఏలు.

ఏలుబడి. దే. వి. దొరతనము.

ఏవ. దే. వి. రోఁత. రూ. ఏవము.

ఏవగించు. దే. క్రి. ౧. రోఁతపడు. ౨. నిందించు. 3. విడుచు.
ఏవపడు. దే. క్రి. రోఁతపడు.
ఏవురు. దే. స. అయిదుగురు. రూ. ఏగురు.
ఏస. దే. వి. ౧. వంకర. ౨. వికృత స్వరము. (కాని మాట ఏస.)
ఏసరు. దే. క్రి. మీఱు.
ఏసరేఁగు. దే. క్రి. విజృంభించు.
ఏహ్యము. విశే. రోఁత పుట్టించునది.

# ఐ

ఐకమత్యము. త్స. వి. ఒద్దిక.
ఐక్యము. త్స. వి. ౧. ఒరిమ. ౨. ఏకీభావము.
ఐక్ష్వాకము. త్స. విశే. ఇక్ష్వాకురాజునకు సంబంధించినది. [బడినది.
ఐచ్ఛికము. త్స. వి. ఇచ్చచొప్పునఁ జేయఁ
ఐణము. త్స. వి. జింక (ఏణము) యొక్క చర్మము మొదలైనవి.
ఐణేయము. త్స. వి. ఏణిక (ఆడుజింక) చర్మము.
ఐతిహాసకుఁడు. త్స. విశే. ఇతిహాసము తెలిసినవాఁడు.
ఐతిహ్యము. త్స. వి. పారంపర్యముచే నగు నుపదేశము.
ఐదు. దే. స. నాల్గును ఒకటి.
ఐదుగురు. దే. స. అయిదుమంది.
ఐదువ. } ఐదువరాలు } దే. వి. ముత్తైదువ. అయిదు చిహ్నములుకల యాఁడుది.—(తాలిబొట్టు. పసుపు. కుంకుమ. గాజులు. చెవ్వాకు.)
ఐన. దే. విశే. ౧. అయినయెడల. ౨. కాని. ఏని.
ఐపు. దే. వి. ౧. తప్పు. ౨. జాడ.
ఐపోవు. దే. క్రి. ౧. ఖర్చగు. ౨. ముగియు.
ఐమూల. దే. విశే. మూలవాటు.
ఐరావణము. } ఐరావతము. } త్స. వి. ఇంద్రు యేనుఁగు.
ఐరేవి. దే. వి. బచ్చెనపని చేసిన పెండ్లి కుండలు.
ఐవచ్చు. దే. క్రి. అచ్చివచ్చు.
ఐశ్వర్యము. త్స. వి. ౧. అణిమాది. ౨. సంపద. చూ. అణిమ.
ఐహికము. త్స. విశే. ఇహలోక సంబంధమైనది.

# ఒ

ఒంకియ } దే. వి. తలపాగ మొదలగునవి తగిలించెడి చిలుక
ఒంకె } కొయ్య.

ఒంటమి. దే. వి. పగ.

ఒంటరమింటరములు. దే. వి. ఎక్కువ తక్కువ మాటలు.

ఒంటరి. దే. వి. తోడులేనిబంటు. విణ. ఏకాకి.

ఒంటరికాఁడు. దే. వి. ౧. పంది. ౨. తోడులేనిబంటు. విణ. ఏకాకి.

ఒంటరిపాటు. దే. వి. ఒంటి.

ఒంటి. దే. వి. ౧. ఏకాకిత్వము. ౨. ఏకాకి.

ఒంటికాఁడు. దే. వి. ౧. పంది. ౨. ఏకాకి.

ఒంటిపాటు. దే. వి. ఏకాంతస్థితి.

ఒంటు. దే. క్రి. ౧. అనుకూలించు. ౨. గ్రామసమూహము. 3. కర్ణభూషావిశేషములు.

ఒంటుకొను. దే. క్రి. కవియు.

ఒంట్లు. దే. వి. బ. అంకెలు. (రూ. ఒంటులు.)

ఒండు. దే. స. ౧. అన్యము. ౨. ఏకము.

ఒండె. } దే. అవ్య. అటుకాదేని.
ఒండేని. }

ఒండొండ. దే. అవ్య. క్రమక్రమముగా.

ఒండొండు. దే. వి. పరస్పరము.

ఒండొక. దే. వి. ౧. మరియొక. ఇంచుక.

ఒందిక. దే. వి. ఒద్దిక.

ఒందు. దే. క్రి. ౧. కలుగు. ౨. చెందు.

ఒక. దే. స. ౧. ఒక్క. ౨. ఒకానొక.

ఒకఁడు. దే. స. ౧. అన్యుఁడు. ౨. ఒకమనుష్యుఁడు.

ఒకటు. దే. అవ్య. ౧. ఏకకాలమున. ౨. కూడ. (రూ. ఒక్కటు. ఒక్కొటు.)

ఒకటి. దే. వి. ఒక్కటి.

ఒకత.
ఒకతుక.
ఒకతె. } దే. స. ఏ. ౧. ఒకయాఁడుది. ౨. అవ్య.
ఒకరిత. } స్త్రీ.
ఒకరితి.
ఒకరితె.

ఒకరుఁడు. } దే. స. ఒకమనుష్యుఁడు.
ఒకరువుఁడు. }

ఒకర్తు. } దే. స. ఒకరిత. (వీనియన్నింటికి 'క్క' వర్ణరూపములును గలవు.)
ఒకర్తుక. }

ఒకానొక. దే. విణ. ౧. సూచింపఁబడని. ౨. అనుకొనని.

ఒకో. దే. అవ్య. సంశయముఁదెల్పును. రూ. ఒకొ, ఒక్కొ, ఒక్కో.

ఒగరు. దే. వి. చక్కఁగాఁ బండని దానిమ్మ మొదలగుకాయలరుచి. (కషాయ రసము.)

ఒగరుచు. దే. క్రి. ౧. ఒగరగు. రూ. ఒగర్చు.

ఒగి. దే. అవ్య. ౧. క్రమముగా. ౨. చక్కఁగా. ౩. లెస్సగా.

ఒగుడుకఱచు. దే. క్రి. కృశించు.

ఒగ్గు. దే. క్రి. ౧. పట్టు. ౨. ఒడ్డు. ౩. సిద్ధపడు. ౪. తోలు.

ఒచ్చెము. దే. వి. ౧. లోపము. ౨. అవమానము. ౩. దోషము.

ఒజ్జ. వై. వి. ౧. ఉపాధ్యాయుఁడు. ౨. పురోహితుఁడు.

ఒజ్జనము. వై. వి. ఉపాధ్యాయత్వము.

ఒజ్జబంతి. దే. వి. మేలుబంతి. వరవడి.

ఒజ్జలికము. దే. వి. ఒజ్జనము.

ఒజ్జసాని. వై. వి. ఉపాధ్యాయుని పెండ్లము.

ఒట్టు. దే. క్రి. ౧. కలుగు. ౨. ఉంచు. ౩. రగుల్చు. వి. శపథము.

ఒడఁగూడు. దే. క్రి. ౧. ఫలించు. ౨. కూఁడు. రూ. ఒనగూడు.

ఒడఁబడిక. దే. వి. ౧. అంగీకారము. ౨. ఒప్పివ్రాసియిచ్చినలిపి. రూ. ఒడంబడిక.

ఒడఁబడు. దే. క్రి. ౧. అంగీకరించు. ౨. అనుకూలించు. ౩. సంతోషించు.

ఒడఁబాటు. దే. వి. సమ్మతి.

ఒడమి. దే. వి. ధనము.

ఒడయఁడు. } దే. వి. ఏలిక. రాజు.
ఒడయుఁడు.

ఒడయురాలు. దే. వి. ఏలికసాని. దొరసాని.

ఒడలు. దే. వి. శరీరము.

ఒడి. దే. వి. ౧. తొడపైభాగము. ౨. ఒడుపు.

ఒడిఁబ్రాలు. దే. వి. ఒడిబియ్యము. (మంగళార్థము నూతన వధువునకు నొడిలోఁగట్టు బియ్యము.)

ఒడికట్టు. దే. క్రి. ఒడిపట్టు.

ఒడికము. దే. వి. నేర్పు. విణ. ౧. రమ్యమైన. ౨. యుక్తమైన.

ఒడియు. దే. క్రి. హఠాత్తుగాఁ బట్టుకొను.

ఒడిసెల. దే. వి. ఱాలు విసరి వేయుటకై త్రాళ్లతోఁ జేసిన చిన్న చిక్కము.

ఒడుచు. దే. క్రి. ౧. ఓడించు. ౨. అడఁచు. ౩. బాధించు.

ఒడుదొడుకు. దే. విణ. ౧. మిట్టుఁ బల్లమైన (నేల.)

ఒడుపు. దే. వి. ౧. వీలు.

ఒడ్డగిల్లు. దే. క్రి. ౧. ఒఱగు.

ఒడ్డగెడవు. దే. విణ. ఒకప్రక్క క్రింది కొఱిగి మరియొకప్రక్కపైకిలేచినది.

ఒడ్డణము. దే. వి. ఒడ్డాణము.

ఒడ్డనము. దే. వి. ౧. ఒడ్డినవస్తువు. ౨. వ్యూహము. 3. కేడెము.

ఒడ్డాణము. దే. వి. ౧. నడుమున బిగించుకొను తోలుపట్టి. ౨. స్త్రీలు నడుమున ధరించుకొను బంగారు వెండిచేఁ జేయఁబడినపట్టె.

ఒడ్డారము. దే. వి. ౧. పంతము. ౨. ఎదురాడుట. 3. ప్రతిఘటించుట.

ఒడ్డారించు. దే. క్రి. ౧. ప్రతిఘటించు. ౨. మాఱొడ్డు.

ఒడ్డు. దే. క్రి. ౧. పందెమిడు. ౨. (వల) పన్ను. 3. చేయి చాఁచు. ౪. అడ్డగించు. ౫. దాఁటు. వి. ౧. తీరము. ౨. పందెము. 3. సేనయొక్క పన్నాగము. ౪. అడ్డపాటు. విణ. ౧. పెద్ద. ౨. బలిసిన. 3. అధికము. వై. స. ౧. అన్యుఁడు. ౨. ఏ. ఏకవుఁడు.

ఒడ్డె. దే. వి. ఒడ్డెవాఁడు. (మట్టిపని చేయువాఁడు.)

ఒడ్డోలగము. దే. వి. పేరోలగము.

ఒత్తగిల్లు. దే. క్రి. ౧. ప్రక్కకొఱగు. ౨. చలించు.

ఒత్తడము. దే. వి. ఒత్తుట. రాపిడి.

ఒత్తడి. దే. వి. ౧. రాపిడి. రాయిడి. ౨. బాధ.

ఒత్తరము. దే. వి. ఉద్రేకము.

ఒత్తరించు. దే. క్రి. ౧. మీఱు. ౨. అతిక్రమించు.

ఒత్తి. అవ్య. గట్టిగా; నిర్బంధ పూర్వకముగా.

ఒత్తిలి.అవ్య.౧.బిగ్గరగా. ౨. మఱిమఱి.

ఒత్తిలు. దే. క్రి. ఒత్తగిల్లు.

ఒత్తు. దే. క్రి. ౧. పొడుచుకొను. ౨. ఒఱగు. 3. ఘనమగు. ౪. అదుము. ౫. ఊఁదు. ౬. నిర్బంధపఱుచు. ౭. పంటనొక్కు. ౮. తుడుచు. ౯. త్రోయు. ౧౦. చేర్చు. వి. ౧. అదుముడు. ౨. మెత్త. 3. ఆక్రమణము.

ఒత్తుడు. దే. వి. అదుముడు.

ఒత్తువడు. దే. క్రి. అదుముడుపడు.

ఒదలు. దే. క్రి. వెంపొందు.

ఒదవు. దే. క్రి. ౧. కలుగు. ౨. ఉపయోగించు. 3. యుక్తమగు.

ఒదవుబడి. దే. వి. ఉపయోగము. విణ. ఉపయుక్తము.

ఒదిఁకిలు. దే. క్రి. ప్రక్కకొఱగు.

ఒదుఁగు. దే. క్రి. తొలఁగు

ఒదుఁగువడు. దే. క్రి. తొలఁగు.

ఒదుఁగువాటు. దే. వి. తొలఁగుట.

ఒదుగు. దే. క్రి. సమృద్ధమగు. వి. సమృద్ధి. విణ. సమృద్ధము. రూ. ఒదువు.

ఒదుగుబడి. దే. వి. సమృద్ధి.

ఒద్ద. దే. వి. దాపు.

ఒద్దిక. దే. వి. ౧. ప్రేమ. ౨. మైత్రి, చెలిమి.

ఒనగూడు. దే. క్రి. సిద్ధించు.
ఒనరారు. దే. క్రి. ఒప్పు.
ఒనరించు. దే. క్రి. చేయు.
ఒనరిక. దే. వి. పొందిక.
ఒనరు. దే. క్రి. ౧. కలుగు. ౨. సరిపడు. 3. ఒప్పు. వి. ౧. పొందిక. ౨. ఇంపు.
ఒనరుచు. దే. క్రి. చేయు. రూ. ఒనర్చు.
ఒనరుపడు. దే. క్రి. వసతియగు.
ఒప్పందము. దే. వి. అమ్మెడువాఁడును, కొనువాఁడును, వస్తువును అమ్ము విషయమునఁ గాని తీసికొను విషయమునఁ గాని చేసికొనెడి యేర్పాటు.
ఒప్పగించు. దే. క్రి. అధీనము చేయు వి. ఒప్పగింత.
ఒప్పనము. దే. వి. అప్పనము.
ఒప్పనివాఁడు. దే. వి. శత్రువు.
ఒప్పమి. దే. వి. ౧. చేటు. వి. తప్పు.
ఒప్పరము. దే. జలదారి.
ఒప్పరికము. దే. వి. ఉపేక్ష. క్రి. ఒప్పరికించు.
ఒప్పారు. దే. క్రి. ఒప్పు.
ఒప్పించు. దే. క్రి. ఒప్పగించు.
ఒప్పిదము. దే. వి. ౧. చక్కఁదనము. ౨. అలంకారము. 3. రీతి.
ఒప్పు. దే. క్రి. ౧. ఒప్పారు. ౨. సరిపడు. 3. అంగీకరించు. వి. ౧. అందము. ౨. తప్పుకామి.
ఒప్పుకోలు. దే. వి. ఒప్పుకొనుట.
ఒప్పులకుప్ప. దే. వి. సౌందర్యరాశి (అందకత్తె).
ఒప్పులాడి. దే. వి. అందముగల స్త్రీ.
ఒబ్బట్లు. దే. వి. బ. పోళీలు.
ఒబ్బిడి. దే. వి. ౧. బాగు. ౨. పొదుపు.
ఒమ్మిక. దే. వి. పొందిక.
ఒమ్ము. దే. క్రి. ౧. సరిపడు. వి. బలుపు. విశే. పెద్ద.
ఒయారము. దే. వి. ౧. అందము. ౨. విలాసము.
ఒయారి. దే. వి. అందకత్తె.
ఒయ్య. దే. క్రి. విశే. ౧. తిన్నగా. ౨. మెల్లగా. (ఒయ్యొయ్య = మెల్ల మెల్లఁగా.)
ఒయ్యన. దే. వి. ౧. తిన్నన. ౨. మెల్లన.
ఒయ్యారము. దే. వి. అందము.
ఒయ్యారి. దే. విశే. ౧. సుందరుఁడు. ౨. సుందరి.
ఒరగల్లు. దే. వి. బంగారులోనగువానిని ఒరపెట్టెడుఱాయి.
ఒరగాలు. దే. వి. కుంటికాలు.
ఒరగు. దే. క్రి. ౧. వంగు. ౨. వ్రాలు. వి. ౧. ఒరుగుదిండు. ౨. వంపు. విశే. వంపైనది.
ఒరగొను. దే. క్రి. రాచు; పరీక్షించు.
ఒరపిడి. దే. వి. రాయిడి.
ఒరపు. దే. వి. రాపుడు.

ఒరపెట్టు. దే. వి. ౧. రాచు. ౨. విచారించు. ౩. వెదకు.

ఒరయిక. దే. వి. సంఘర్షణము.

ఒరయు దే. క్రి. ౧. రాఁచు. ౨. ఎదుర్కొను.

ఒరవడి. దే. వి. వరవడి.

ఒరిమ. / ఒరిమిక. దే. వి. ౧. ఒద్దిక. ౨. ఐకమత్యము.

ఒరుఁడు. వై. స. ఒకరుఁడు.

ఒరుదల. దే. వి. కొండెకానితనము.

ఒరుదలకాఁడు. దే. విణ. కొండెకాఁడు.

ఒఱ. దే. వి. ౧. గవుసెన. ౨. కత్తులు మొదలగువానిని పెట్టుటకుపయోగపడు ఒఱ్ఱ.

ఒఱకటము. / ఒఱకాటము. దే.వి. సంకటము. విణ. ఎగుడుదిగుడు.

ఒఱకము. దే. వి. ౧. పల్లము. ౨. సంకటము.

ఒఱగు. దే. క్రి. ౧. వంగు. ౨. వ్రాలు. వి. ౧. ఒఱగుదిండు. ౨. వంపు. విణ. వంపైనది.

ఒఱగుబిల్ల. దే. వి. ఒఱగుదిండు.

ఒఱగొడ్డెము. దే. వి. మర్యాదమీఱిన మాట.

ఒఱపరి. దే. విణ. అందగాఁడు.

ఒఱపు. దే. వి. ౧. అందము. ౨. యుక్తి. ౩. తాపము. ౪. పరితాపము. ౫. యోగ్యత.

ఒఱపులాఁడి. దే. వి. అందగత్తె.

ఒఱలు. దే. క్రి. ౧. ఱోలు. ౨. విలపించు.

ఒఱవ. దే. విణ. ౧. వక్రము. ౨. వ్యత్యస్తము.

ఒఱ్ఱ. దే. వి. కారము.

ఒఱ్ఱు. దే. విణ. గొప్పది. పెద్దది.

ఒలయు. దే. క్రి. ౧. వీచు. ౨. ప్రవేశించు. ౩. కలుగు. ౪. చుట్టుకొను. ౫. కరియు.

ఒలి. దే. వి. దోఁపుడు.

ఒలికి. దే. వి. సొద పేర్చెడు తావు.

ఒలికిమిట్ట. దే. వి. వల్లకాడు.

ఒలుకు. దే. క్రి. ౧. చిందు. ౨. కాఱు. ౩. చల్లు.

ఒలుచు. దే. క్రి. తోలుతీయు. వి. ఒలుపు.

ఒలె. దే. వి. చీర.

ఒల్లఁబాటు. దే. వి. ౧. ఉపేక్ష. ౨. అనపేక్షితము.

ఒల్లఁబోక. దే. వి. అనాదరము.

ఒల్లఁబోవు. దే. క్రి. ౧. మూర్ఛిల్లు. ౨. వాడు.

ఒల్లన. దే. వి. తిన్నఁదనము.

ఒల్లమి. దే. వి. వలవమి.

ఒల్లియ. / ఒల్లె. దే. వి. ౧. వస్త్రము. ౨. ఉత్తరీయము.

ఒల్లెవాటు. దే. వి. వల్లెవాటు.

ఒవ్వమి. దే. వి. ద్వేషము. గిట్టమి.
ఒసఁగు. } దే. క్రి. ఇచ్చు. వి. ౧.
ఒసవు. } ఈవి. ౨. బహుమానము.
ఒసపరి. దే. వి. అందగాఁడు.
ఒళవరి. దే. వి. మర్మజ్ఞుఁడు.
ఒళవు. దే. వి. మర్మము.
ఒళ్లు. దే. వి. దేహము.
ఒళ్లువెట్టు. దే. క్రి. బలియు.

## ఓ

ఓండ్ర. దే. వి. గాడిదకూఁత.
ఓండ్రించు. దే. వి. ఓండ్రపెట్టు.
ఓకర. వై. వి. రోఁతపడు. వి. ఓకరింత.
ఓకరించు. దే. క్రి. వమనముచేయు.
ఓకిలించు. దే. క్రి. డోఁకు.
ఓగాత్యము. దే. వి. అమంగళము.
ఓగిరము. దే. వి. అన్నము. రూ. ఓరెము.
ఓగు. దే. వి. కీడు. విణ. ౧. కీడైనది. ౨. మూర్ఖుఁడు.
ఓగులాడుచు. దే. క్రి. దూషించు.
ఓఘము. త్స. వి. సమూహము.
ఓచెల. } దే. అవ్య. సంతాపమును
ఓచెల్ల. } తెలియఁజేసెడిది.
ఓజ. దే. వి. ౧. యుక్తమార్గము. ౨. విధము. 3. ధర్మము. నేర్పు.
ఓజపడు. దే. క్రి. చక్కఁబడు.
ఓజబంతి. దే. వి. ఒజ్జబంతి.
ఓజము. త్స. వి. ఓజస్సు.
ఓజస్వంతుఁడు. త్స. వి. ఓజస్సుగలవాఁడు.
ఓజస్వి. త్స. విణ. ,,
ఓటు. దే. వి. ౧. భయము. ౨. సంకోచము.
ఓటమి. దే. వి. ౧. భయము. ౨. అవమానము.
ఓటము. దే. వి. అపజయము.
ఓటు. దే. వి. ౧. అపజయము. ౨. భంగము. 3. ఆక్షేపముతోఁ గూడిన ప్రశ్నము. వచ్చెనోటు? (వచ్చెనా? అనియర్థము) రారోటు? (రారా? ఏమి?యని యర్థము.)
ఓటుపడు. దే. క్రి. ౧. అపజయపడు. ౨. మోసపోవు. 3. కోలుపోవు.
ఓటుపాటు దే. వి. ఓటుపడుట.
ఓటుపోవు. దే. క్రి. ఓటుపడు.
ఓడ. దే. వి. కలము. నావ.
ఓడిక. దే. వి. ప్రవాహము.
ఓడిగిలు. దే. క్రి. ప్రవహించు.
ఓడు. దే. క్రి. ౧. అపజయమొందు. ౨. పణుగెత్తు. 3. భయమొందు. వి. కుండలోనగువానిపగులు. (ఓటికుండ.)
ఓడ్యాణము. త్స. వి. ఒడ్డాణము.
ఓఢ్రుఁడు. త్స. వి. ఒడ్డెవాఁడు.
ఓతప్రోతము. త్స. విణ. పడుగుపేకలుగా నేయఁబడినది.

ఓదనము. త్స. వి. అన్నము.
ఓదము. దే. వి. ఏనుఁగులు మొదలగు వానినిఁబట్టు కొనుటకై త్రవ్విన గొయ్యి.
ఓదారుచు.
ఓదార్చు. } దే. క్రి. ఊరార్చు.
ఓదియ.
ఓదె. } దే. వి. కోఁత కోసి చేనిలో నక్కడక్కడ వైచిన పోచలప్రోఁగు.
ఓపిక. దే. వి. ౧. శక్తి. ౨. ఓర్పు.
ఓపు. దే. క్రి. చాలు. వి. ఓపిక.
ఓము. దే. క్రి. కాఁచు.
ఓయారము. దే. వి. సవిలాసము.
ఓయారి. దే. విణ. అందగాఁడు.
ఓయి. దే. అవ్య. పురుష సంబోధనము నందు వచ్చునది.
ఓర. దే. వి. ౧. అంచు. ౨. ప్రక్క. 3. అపాంగవీక్షణము.
ఓరంతప్రొద్దు. దే. వి. దినమంతయు. ౨. ఎల్లకాలము.
ఓరగిల్లు. దే. క్రి. ౧. ఒఱగు. ౨. ఒదుఁగు.
ఓరచూపు. దే. వి. ప్రక్కచూపు.
ఓరవోవు. దే. క్రి. ఒరగు.
ఓరసిల్లు. దే. క్రి. తొలఁగు.
ఓరిమి. దే. వి. ఓర్పు.
ఓరు. దే. వి. ఇంటిగోడలపైన తీర్చెడు నెత్తిమట్టిపట్టు.
ఓరుగాలి. దే. వి. పెద్దగాలి.
ఓరుచు.
ఓర్చు. } దే. క్రి. ౧. క్షమించు. ౨. సహించు.
ఓరుపరి. దే. వి. ౧. క్షమించువాఁడు. ౨. సహించువాఁడు. రూ. ఓర్వరి.
ఓరుపు.
ఓర్పు. } దే. వి. ౧. క్షమ. ౨. జయము. 3. సహనము.
ఓలగము. దే. వి. ౧. కొలువు. ౨. కొలువుకూటము. క్రి. ఓలగించు.
ఓలమాసగొను. దే. క్రి. ౧. మఱుఁగుపడు. ౨. దాఁగు.
ఓలలాడు.
ఓలాడు. } దే. క్రి. ౧. మునుఁగు. ౨. తేలు.
ఓలి. దే. వి. ౧. ఉంకువ. ౨. వరుస. (ఒక్కొకచో వాక్యాలంకారము)
ఓవరి. దే. వి. ఇల్లు.
ఓషధి. త్స. వి. మందునకుపయోగించు మొక్క.
ఓష్ఠము. త్స. వి. పెదవి.
ఓష్ణము. త్స. విణ. నులివెచ్చనిది.
ఓసరిల్లు. దే. క్రి. తొలఁగు. వి. ఓసరింత.
ఓహటిల్లు. దే. క్రి. వెనుదీయు. రూ. ఓహటించు.
ఓహరిసాహరి. దే. అవ్య. ౧. గుంపులు గుంపులుగా. ౨.అహమహమికతో.
ఓహో. దే. అవ్య. సంబోధనమునందు వచ్చునది.
ఓహోరె. దే. అవ్య. బళీ. రూ. ఓహోరే.

# ఔ

ఔఁగదె. దే. అవ్య. ఔరా.
ఔఁగాక. దే. అవ్య. అట్లేకాని.
ఔఁగాదను. దే. క్రి. ఆలోచించు.
ఔఁగాములు. దే. వి. ౧. బ. సత్యాసత్యములు. ౨. మంచిచెడుగులు. 3. సుఖదుఃఖములు.
ఔచితి. త్స. వి. ఔచిత్యము.
ఔడు. దే. వి. పెదవి. రూ. అవుడు.
ఔత్తరాహుఁడు. త్స. విశ. ఉత్తరదేశస్థుఁడు.
ఔదల. దే. వి. ౧. నడితల. ౨. తల.
ఔదార్యము. త్స. వి. ఉదారత్వము.
ఔదాసీన్యము. త్స. వి. ౧. ఉపేక్ష. ౨. తాటస్థ్యము.
ఔపాసనము. త్స. వి. గృహస్థుఁడగు విప్రుఁ డుదయమునఁ జేయునట్టి యగ్నిహోత్రోపాసన.
ఔర. దే. అవ్య. అవుర. బళిర.
ఔరసుఁడు. త్స. వి. తనకు ధర్మపత్ని యందుఁ బుట్టినకొడుకు.
ఔలె. } దే. అవ్య. ఔనౌను.
ఔలెమ్మ. }
ఔషధము. త్స. వి. మందు.
ఔసు. దే.వి. సొగసు. విశ. ఔసుకాఁడు.

# క

కంకటము. త్స. వి. ౧. కవచము.
కంకటిక. త్స. వి. దువ్వెన.
కంకణము. త్స. వి. ౧. సరము. ౨. తోరము. (కంకణముకట్టు = దీక్ష వహించు.)
కంకపత్త్రిము. త్స. వి. బాణభేదము.
కంకము. త్స. వి. రాపులుఁగు.
కంకర. దే. వి. ఇటికబాయిపొడి సున్నము నీరు చేరిన పదార్థము.
కంకరగాడిద. దే. వి. కంచరగాడిద.
కంకాళము. త్స. వి. అస్థిపంజరము.
కంకి. దే. వి. వెన్ను.
కంకు. దే. క్రి. గద్దించు.
కంకేళి. త్స. వి. అశోకము.
కంఖాణము. త్స. వి. గుఱ్ఱము.
కంగారు దే. వి. కలవరము.
కంచియ. దే. వి. ౧. పసులు మేయునట్టి పచ్చికబీడు. ౨. సీమచింత చెట్టు మున్నగువానిచే ఏర్పడిన వెలుగు. రూ. కంచె.
కంచుకము. త్స. వి. ౧. అవిక. ౨. పాముకుబుసము.
కంచుకి. త్స. వి. ౧. అంతఃపురమున కావలియుండువాఁడు. ౨. విటుఁడు. 3. పాము.

కంచము. దే. వి. బంగారులోనగు వానిచే జేయఁబడినగిన్నె.

కంచర. దే. వి. కంచుపాత్రములు చేయుపని.

కంచరి. దే. వి. కంచుపని చేయువాఁడు.

కంచెల. దే. వి. రవికె.

కంజము. త్స. వి. తామరపువ్వు.

కంటకము. త్స. వి. ముల్లు.

కంటకుఁడు. త్స. వి. దుష్టుఁడగురాజు.

కంటగించు. దే. క్రి. ౧. విరోధించు. ౨. నొచ్చు.

కంటగిల్లు. దే. క్రి. నొచ్చు.

కంటసరము. దే. వి. మెడలోధరించు నొకనగ.

కంటెయ. దే. వి. మెడను తాల్చు నొకవిధమైన సొమ్ము. రూ. కంటె.

కంటు. దే. వి. పగ.

కంటె. దే. అవ్య. పంచమీ విభక్తి ప్రత్యయము.

కంఠము. త్స. వి. మెడ. ౨. గొంతుయొక్కధ్వని.

కంఠిక. త్స. వి. కంఠాలంకారము.

కంఠీరవము. త్స. వి. సింహము. వ్యు. కంఠమందు ధ్వనికలది.

కంఠేకాలుఁడు. త్స. వి. శివుఁడు.

కండ. వై. వి. ౧. కండచక్కెర. ౨. మాంసపుఁదునుక. ౩. మాంసము.

కండకావరము. దే. వి. ౧. క్రొవ్వు. ౨. గర్వము.

కండతుండములు. దే. వి. ముక్కముక్కలు.

కండతుండెములు. దే. వి. ,,

కండియ. } దే. వి. ౧. నాలుకండె.
కండె. } ౨. జొన్నకంకి.

కండుకము. త్స. వి. కందుకము. బంతి.

కండూతి. త్స. వి. దురద.

కండూయనము. త్స. వి. దురద.

కండ్రిక. దే. వి. ముక్క.

కంత. దే. వి. ౧. సందు. ౨. రంధ్రము.

కంతి. దే. వి. గడ్డవలెఁబుట్టునట్టివ్యాధి.

కంతుఁడు. దే. వి. మన్మథుఁడు.

కంథ. త్స. వి. బొంత.

కంద. దే. వి. కందదుంప.

కందకము. దే. వి. అగడిత.

కందనగాయ. దే. వి. గుండెకాయ.

కందము. దే. వి. పశువుయొక్క మూఁపు. త్స. వి. ౧. ఒకపద్యముపేరు. ౨. గడ్డ. 3. నుబ్బు.

కందరము. త్స. వి. గుహ.

కందర్పుఁడు. త్స. వి. మన్మథుఁడు. వ్యు. కుత్సితమైనదర్పముకలవాఁడు.

కందళము. త్స. వి. మొలక. రూ. కందళి.

కందళించు. త్స. క్రి. పుట్టు. మొలచు.

కందాయము. త్స. వి. ఏడాదిలో మూఁడవభాగము.

కంది. దే. వి. కాయధాన్యములలో ఒకటి.

కందు. దే. క్రి. ౧. తపించు. ౨. నలుపగు. వి. ౧. తాపము. ౨. నలుపు. ౩. శిశువు.
కందుఁడు. దే. వి. కుమారస్వామి.
కందుకము. త్స. వి. బంతి.
కందువ. దే. వి. ౧. జాడ. ౨. తావు. ౩. తెగ. ౪. సంకేతము.
కందువచుట్టము. దే. వి. ప్రియబంధువు.
కందువాఱు. దే. క్రి. మలినమగు.
కందువు. త్స. వి. వెనము.
కందెన. దే. వి. బండియిరుసునకుఁ బూసెడిమసి.
కంధరము. త్స. వి. మెడ.
కంధి. త్స. వి. సముద్రము.
కంప. దే. వి. ముండ్లమండ.
కంపనము. త్స. వి. వణఁకు.
కంపము. త్స. వి. వణఁకు.
కంపించు. త్స. క్రి. వణఁకు.
కంపు. దే. వి. చెడ్డవాసన. ౨. మంచి వాసన.
కంబడి. దే. వి. గొంగడి.
కంబము. వై. వి. స్తంభము.
కంబళము. త్స. వి. ౧. కంబళి. ౨. తివాచీ. ౩. జమకాణా.
కంబళి. దే. వి. కంబడి.
కంబు. త్స. వి. శంఖము.
కంసము. త్స. వి. కంచు.
కంసారి. త్స. వి. కృష్ణుఁడు.
కంసాలి. దే. వి. కమసాలి.
కంసుఁడు.త్స.వి.శ్రీకృష్ణుని మేనమామ.
కకపాల. వై. వి. సన్న్యాసుల కుప యోగపడు నొకవిధమగుసంచి. రూ. కక్కపాల.
కకవికలు. } వై. వి. బ. చెల్లాచెదరు.
కకావికలు. }
కకుదము. త్స. వి. ౧. మూపురము. ౨. ప్రధానము.
కకుప్పు. త్స. వి. దిక్కు.
కక్క. దే. వి. పినతండ్రి.
కక్కసపడు. వై. క్రి. ౧. కష్టపడు. ౨. బాధపడు.
కక్కసపెట్టు. దే. క్రి. ౧. బాధపెట్టు. ౨. తొందరపెట్టు. వి. కక్కసము. కఱకు; వాఁడి. కఠినము.
కక్కసించు. దే. క్రి. బాధించు.
కక్కిరిబిక్కిరి. దే. వి. తాఱుమాఱు.
కక్కు. దే. క్రి. ౧. కడుపులోనిది వెలిపుచ్చు. ౨. వెడలించు. వి. ౧. అంపము, కత్తిమొదలగు వానికికల గఁ జేసెడుకఱకు. (వి.కక్కుడు.)
కక్కుఱితి. దే. వి. ౧. లుబ్ధత్వము. విశ. కక్కుఱితికాఁడు.
కక్కూఱితి. దే. వి. లోభము.
కక్కూఱితికాఁడు. దే. విశ. లోభి.
కక్ష. త్స. వి. ౧. ఏనుగునడిమిమోకు. ౨. మొలనూలు. ౩. తొట్టికట్టు. ౪. చంక. ౫. స్పర్ధ. ౬. కచ్చ. ౭. రథమందలి అంతస్తు.

కక్షపాల. త్స. వి. కకపాల.
కక్షము. త్స. వి. వెనుక దోపుకొను దోవతికొంగు. (గోఁచీభాగము.)
కక్షాపటము. త్స. వి. గోఁచీ.
కక్ష్య. త్స. వి. ౧. తొట్టికట్టు. ౨. మొలనూలు. 3. ఏనుఁగు నడిమి మోకు. ౪. రథమందలి అంతస్తు.
కచపాశము. త్స. వి. కేశసమూహము.
కచము. త్స. వి. తలవెండ్రుక.
కచ్చ. దే. వి. వెనుకదోపుకొనుబట్టకొంగు.
కచ్చడము. దే. వి. ౧. గోఁచీ. ౨. బండి.
కచ్చించు. దే. క్రి. గోఁచికట్టుకొను.
కచ్చిక. వై. వి. కాలినపిడకతునక.
కచ్చితము. వై. విశ. ౧ కరారు. ౨. హెచ్చుతక్కువలు లేక సరియైనది.
కచ్చియ. } వై. వి. జగడము.
కచ్చె. }
కచ్చు. దే. వి. ౧. గర్వము. ౨. ఱేకు. 3. సిగబంతి.
కచ్చెపోతు. దే. వి. విశ. జగడము పెట్టు స్వభావము కలవాఁడు.
కచ్చేరి. వై. వి. ౧. రాచకార్యము నడచునట్టిచోటు. ౨. రచ్చమిట్ట.
కచ్ఛము. త్స. వి. తాఁబేలు.
కజ్జలము. త్స. వి. కాటుక.
కజ్జము. దే. వి. భోగ్యమగు భక్ష్యము. రూ. కజ్జాయము.
కట. దే. అవ్య. సంతాపమును దెలుపును. రూ. కటా.

కటకటపడు. దే. క్రి. ౧. కోపించు. ౨. సంకటపడు.
కటకము. త్స. వి. ౧. కడియము. ౨. కొండనడుము.
కటపెట. దే. వి. ఒరయుటలో నగు చప్పుడు.
కటము. త్స. వి. ౧. ఏనుఁగు చెక్కిలి. ౨. చెక్కిలి.
కటాక్షము. త్స. వి. ౧. కడకన్ను. ౨. కడకంటిచూపు.
కటాక్షించు. త్స. వి. ౧. కడగంటఁ జూచు. ౨. అనుగ్రహించు.
కటారి. } దే. వి. ౧. కత్తి. ౨. బాఁకు.
కటారు. } విశ. కటారికాఁడు; కటారికత్తె.
కటాహము. త్స. వి. బాణలి. పెనము.
కటి. త్స. వి. మొల.
కటిక. దే. వి. మాంసము నమ్మువాఁడు. రూ. కట్టిక.
కటికవాఁడు. ౧. మాంసవిక్రేత. ౨. వేత్రహస్తుఁడు.
కటికి. దే. విశ. ఎక్కువ. ౨. గట్టి. 3. దట్టము.
కటీరము. త్స. వి. కటి. మొల.
కటుకము. త్స. విశ. ౧. గాటుఅయినది. ౨. తీండ్రమైనది.
కటువు. త్స. వి. ౧. కారము. ౨. వాసన. విశ. ౧. వాసనకలది. ౨. కారముగలది. 3. మచ్చరముకలది.

కట్టు. దే. వి. ౧. మోపు. ౨. చెఱువు కట్ట. గుంటకట్ట. అవ్య. సంతాపమును దెలుపును.

కట్టకడ. దే. వి. తుట్టతుద.

కట్టడ. దే. వి. ౧. ఏర్పాటు. ౨. విధము. ౩. ఆజ్ఞ.

కట్టడచేయు. దే. క్రి. ఉత్తరువుచేయు.

కట్టడము. దే. వి. గృహాదికము.

కట్టడి. దే. వి. నియతి. భాగ్యము.

కట్టనము. దే. క్రి. ౧. కానుక. ౨. ముడి. రూ. కట్నము.

కట్టాణి. దే. వి. మిక్కిలి గుండ్రని ప్రశస్త మౌక్తికము.

కట్టాయితము. దే. విశే. సన్నద్ధము; సంసిద్ధము.

కట్టిండి. దే. విశే. క్రూరుఁడు.

కట్టియ. దే. వి. కఱ్ఱ. రూ. కట్టె.

కట్టు. దే. క్రి. ౧. చూలగు. (ఆవులు మున్నగునవి.) ౨. బంధించు. ౩. మోపు. ౪. సేకరించు. ౫. నిర్మించు. ౬. ధరించు. (వస్త్రమును) వి. ౧. ముడి. ౨. తొట్టికట్టు. ౩. వస్త్రమును ధరించుట. ౪. బలాత్కారము.

కట్టుఁబాటు. దే. వి. ౧. నియమము. కులకట్టుపాటు. ౨. లోఁబడుట. ౩. నిబంధనము.

కట్టుఁబోతు. దే. వి. మంత్రప్రయోగము చేయువాఁడు.

కట్టుపకాసి. దే. వి. ధీరుఁడు. శూరుఁడు.

కట్టువడు. దే. క్రి. లోఁబడు.

కట్టుబడి. దే. వి. చాకలి, మంగలి, కుమ్మరి లోనగు పనివాండ్రకు ఊరి యుమ్మడి పనిచేయుటకై నౌరతనమువారు విడిచిన మాన్యము. ౨. మిరాశి.

కట్టుమట్టు. దే. వి. ౧. పసులు మున్నగువానిని కట్టివేయుతావు. ౨. ఇల్లు. ౩. ఏర్పాటు.

కట్టెడ. దే. వి. ఎడనెడఁ గట్టుకల పాము.

కట్టెవిఱుపుమాట. దే. వి. పుల్లవిఱుపుమాట. పరుషవచనము.

కఠారము. త్స. వి. కత్తి.

కఠినము. త్స. విశే. గట్టి.

కఠిని. దే. వి. బలపము.

కఠిల్లు. దే. వి. కొయ్య మొదలగునవి విఱుగుటలో నగు చప్పుడు.

కఠోరము. త్స. విశే: ౧. కఠినము. పరుషము. ౨. తీక్ష్ణమైనది.

కడ. దే. వి. ౧. దిక్కు. ౨. కొన. ౩. దూరము. ౪. ప్రక్క. ౫. దగ్గఱ. ౬. చోటు.

కడఁక. దే. వి. యత్నము.

కడఁగు. దే. వి. యత్నించు.

కడకాలు. దే. వి. పాదము. పాదాగ్రము.

కడకుఁబోవు. దే. క్రి. బహిష్ఠయగు.
కడకొంగు. దే. వి. కొంగుచివర.
కడగండ్లమారి. దే. వి. కష్టశీలుఁడు.
కడగండ్లు. దే. వి. బ. కష్టము.
కడగన్ను. దే. వి. కటాక్షము.
కడగొట్టు. దే. క్రి. చచ్చు. విణ. కడపటి.
కడచను. దే. క్రి. ౧. చచ్చు. ౨. నశించు. 3. ముగియు. ४. దాఁటు.
కడచు. దే. క్రి. ౧. పోవు. ౨. చచ్చు. 3. నశించు. ४. దాఁటు.
కడతల. దే. వి. చివరిప్రదేశము.
కడతెంచు. దే. క్రి. దాఁటు.
కడతేఱు. దే. క్రి. ౧. చచ్చు. ౨. ముగియు.
కడప. దే. వి. ఇంటివాకిటపైచిన మెట్టు.
కడపల. దే. వి. చివర. దే. విణ. చివరి.
కడపు. దే. క్రి. ౧. పాఱఁద్రోలుట. ౨. చంపు. 3. మీఱు.
కడమ. దే. వి. ౧. కొఱఁత. ౨. శేషము.
కడముట్టు. దే. క్రి. ౧. ముగించు. ౨. ప్రాప్తమగు.
కడలి. దే. వి. సముద్రము.
కడలు. దే. వి. తరంగము.
కడలుకొను. దే. క్రి. ౧. అతిశయమగు. ౨. అల్లుకొను.
కడలెత్తు. దే. క్రి. ఉప్పొంగు.
కడలొత్తు. దే. క్రి. ,,
కడవ. దే. వి. కుండ.
కడవఁబడు. దే. క్రి. దాఁటు.
కడవన్నె. దే. వి. పదాఱవ వన్నె.
కడవాఁడు. దే. విణ. ౧. ఇతరుఁడు. ౨. కడగొట్టువాఁడు. 3. మాలవాఁడు.
కడవెళ్లు. దే. క్రి. ౧. ముగించు. ౨. దాఁటు.
కడాని. దే. వి. బంగారము.
కడి. దే. వి. ౧. ముద్ద. ౨. వాసన.
కడిఁది. దే. వి. శౌర్యము. విణ. ౧. అసాధ్యము. ౨. కఠినము. 3. అధికము.
కడికండలు. దే. వి. బ. కండలు కండలు.
కడిమి. దే. వి. ౧. పరాక్రమము. ౨. అతిశయము. 3. నీపవృక్షము.
కడియము. దే. వి. చేతికితొడిగెడినగ. రూ. కడెము.
కడివోవు. దే. క్రి. వాసనవోవు.
కడు. దే. అవ్య. మిక్కిలి.
కడుకొను. దే. క్రి. ౧. అతిశయించు. ౨. ఉత్సహించు. 3. యత్నించు.
కడుగు. దే. క్రి. బియ్యము మొదలగు వానిని కడిగిననీరు. క్రి. ప్రక్షాళనము సేయు.
కడుపు. దే. వి. ౧. డొక్క. ౨. చూలు.
కడుపుమంట. దే. వి. ఓర్వలేనితనము.
కడ్డి. దే. వి. ౧. కాడ. ౨. బలపపుఁగోపు. రూ. కడ్డీ.

కణము. త్స. వి. ౧. గింజ. ౨. లేశము.
కణిక. త్స. వి. ,,
కణిశము. త్స. వి. పైరువెన్ను.
కత. వై. వి. ౧. కథ. ౨. వార్త.
కతన. దే. అవ్య. హేతువుచేత.
కతపత్త్రిము. ఋ. వి. ప్రమాణపత్త్రిము.
కతము. దే. వి. ౧. హేతువు. ౨. గుఱుతు.
కతలకాచి. దే. వి. పెక్కు కతలెఱిఁగినది.
కతుకు. దే. వి. ౧. గతుకు. ౨. తిను.
కత్తరించు. దే. క్రి. ౧. ఆడించు. ౨. తొలగించు. 3. కత్తిరించు.
కత్తళిఁడు. దే. వి. గుఱ్ఱము.
కత్తళము. దే. వి. కవచము.
కత్తి. దే. వి. ఖడ్గము.
కత్తిమీదిసాము. దే. వి. మిక్కిలి జాగరూకతతోఁ జేయవలసినది. • (అపాయకృత్యము).
కత్తియము. దే. వి. సంఖ్యల యడ్డబంతి. రూ. కత్తెము.
కత్తిరించు. దే. వి. ౧. కత్తెరతో గుడ్డలనుచించు. రూ. కత్రించు.
కత్తులబోను. దే. వి. కత్తులమర్చినబోను.
కత్తెర. దే. వి. ౧. గుడ్డలను, కాగితములను, కత్తిరించుటకు ఉపయోగపడు నాయుధము. ౨. కత్తెరకాలము.
కథ. త్స. వి. ౧. కొంచెము నిజమైన సంగతితోఁగూడి కల్పితమైన కావ్యము. ౨. వృత్తాంతము.
కథకుఁడు. త్స. వి. కతను చెప్పువాఁడు.
కథనము. త్స. వి. చెప్పుట.
కథానకము. త్స. వి. పెక్కు చిన్న కథలుగల గ్రంథము.
కథానిక. త్స. వి. చిన్నకథ.
కథాముఖము. త్స. వి. ప్రస్తావన. పీఠిక.
కథాశేషుఁడు. త్స. వి. కీర్తిశేషుఁడు. మరణించినవాఁడు.
కద. దే. అవ్య. ప్రసిద్ధిని దెలిపెడి. వి. ౧. కథ. ౨. వార్త. రూ. కదా.
కదంబము. దే. వి. మిశ్రము. త్స. వి. సమూహము.
కదంబించు. దే. క్రి. ౧. కలుపు. ౨. అంటుకొను.
కదనము. త్స. వి. ౧. యుద్ధము. ౨. దోషము.
కదను. దే. వి. అశ్వగతి విశేషము. రూ. కదము.
కదరె / కదరే } దే. అవ్య. సంతాపార్థమును బోధించెడిది.
కదలాడు. దే. క్రి. చలించు.
కదలిక. దే. వి. ౧. చలనము. ౨. ఉద్యమము.
కదలు. దే. క్రి. ౧. చలించు. ౨. పయనమగు. 3. ఉద్యమించు. వి. ౧. కదలిక. ౨. పూనిక.
కదళి. త్స. వి. అరఁటిచెట్టు.
కదించు. దే. వి. ౧. బంధించు. ౨. ధరించు.

కదియు. దే. క్రి. ౧. దగ్గఱవచ్చు. ౨. పైఁబడు.
కదుపు. దే. వి. ౧. మృగములలోఁగాని, పక్షులలోఁగాని ఒకజాతి గుంపు.
కదుము. దే. క్రి. ఆక్రమించు. వి. మంచిదెబ్బ పడిన తావున గడ్డకట్టిన నెత్తురు కదుపు.
కదురు. దే. వి. నూలు వడికెడుకదురు. క్రి. ౧. హెచ్చు. ౨. కలుగు.
కదుష్ణము. త్స. విశే. నులివెచ్చనిది.
కద్రువ. త్స. వి. కశ్యపునిభార్య.
కనఁబడు దే. క్రి. కానఁబడు.
కనకనమను. } దే. క్రి. (అగ్ని) అతి
కనకనలాడు. } శయముగ వెలుఁగు.
కనకము. త్స. వి. బంగారు.
కనరు. దే. వి. వెగటు.
కనరువోవు. దే. క్రి. కాటువోవు.
కనలు. దే. క్రి. ౧. కోపగించు. ౨. మండు. వి. ౧. కోపము. ౨.మంట.
కనికరము. దే. వి. ౧. దయ.
కనికరించు. దే. క్రి. ౧. దయచూపు. ౨. ఏడ్చు.
కనిపట్టు. దే. క్రి. తెలిసికొను.
కనిపించు. దే. క్రి. కనఁబడఁజేయు.
కనిష్ఠ. త్స. వి. చిటికెనవ్రేలు.
కనిష్ఠుఁడు. త్స. విశే. ౧. అన్నదమ్ములలోఁ గడఁగొట్టువాఁడు. ౨. అతినీచుఁడు.
కనీనిక. త్స. వి. కంటినల్లగ్రుడ్డు.
కనీసము. దే. విశే. అధమము. మిక్కిలి హేయము.
కను. దే. క్రి. ౧. ప్రసవించు. ౨. చూచు, 3. ఎఱుఁగు. వి. నేత్రము.
కనుఁగట్టు. దే. క్రి. కన్నుమూయు. రూ. కనుకట్టు.
కనుఁగాఁపు. దే. వి. కనుసన్నకెకొని యున్న సేవకుఁడు.
కనుఁగొను. దే. క్రి. కాంచు. (రూ. కన్గొను.)
కనుఁబాటు. దే. వి. దృష్టిదోషము.
కనుఁబ్రామా. దే. క్రి. మోసగించు.
కనుక. దే. అవ్య. కారణమును దెలియఁజేయును. కాఁబట్టి.
కనుకలి. దే. వి. చూపు.
కనుగంటు. దే. విశే. ప్రత్యక్షముగా; కన్నారఁగా.
కనుకుట్టు. దే. వి. అసూయపడు.
కనుగిఱుపు. దే. క్రి. కనుసైఁగ సేయు.
కనుగిలుపు. దే. క్రి. ,,
కనుగీటు. దే. క్రి. ,,
కనుగీలుపు. దే. క్రి. ,,
కనుపట్టు. దే. క్రి. చూపట్టు.
కనుపడు. దే. క్రి. ,,
కనుపాప. దే. వి. కనుగ్రుడ్డులో ప్రతిఫలించు ప్రతిబింబము.
కనుపు. దే. వి. గనుపు.
కనుమఱుఁగు. దే. వి. గంత.

కనుపెట్టు. దే. క్రి. ఎదురుచూచు; ఆలోచించు.

కనుమ. దే. వి. ౧. రెండుకొండల నడుమనుండుదారి. ౨. సందు.

కనుమరి. దే. వి. కమ్మరి.

కనుమఱుఁగుసేయు. దే. క్రి. కనఁబడకుండఁజేయు.

కనుమాపు. దే. వి. కొంచెము మూయుట.

కనుమాయ. దే. వి. కనుకట్టు.

కనుము. దే. వి. ౧. పెద్దపండుగదినమునకు ముందు దినము. ౨. అల్లు.

కనుమూయు. } దే. వి. మోసగించు.
కనుమొఱఁగు. } రూ. కనూయు, కన్మొఱఁగు.

కనువిందు. దే. వి. నేత్రోత్సవము.

కనువెలుఁగు. దే. వి. కంటికి వెలుఁగు వంటిది. (మార్గదర్శకుఁడు)

కనువేఁదుఱు. దే. వి. కనుపిచ్చి; వెఱ్ఱివలపు.

కన్దెఱ. దే. విశే. కన్నులను దెఱచువాఁడు.

కన్నగాఁడు. దే. వి. గోడలో సొరంగమొనర్చి దానిమూలాన లోనికిఁ జని దొంగిలించువాఁడు.

కన్నడ. దే. వి. ౧. ఉపేక్ష. ౨. రాగముపేరు. క్రి. కన్నడచేయు=ఉపేక్షించు.

కన్నడము. దే. వి. కన్నడభాష.

కన్నడీఁడు. దే. వి. కన్నడదేశీయుఁడు

కన్నము. దే. వి. ఇంటిగోడలో దొంగిలించుటకు దొంగ చేసెడి పెద్ద రంధ్రము.

కన్నయ్య. దే. వి. ౧. తండ్రి. ౨. కృష్ణుఁడు.

కన్నారు. దే. వి. ముఖ్యుఁడు.

కన్నియ. } దే. వి. ౧. వివాహము
కన్నె. } కానిపడుచు. ౨. పండ్రెండు రాసులలో ఒకటి. ౩. కూఁతురు.

కన్నీరు. దే. వి. బాష్పము.

కన్ను. దే. వి. చూపు. నేత్రము.

కన్నులఁగప్పుకొను. దే. క్రి. కన్నుల కద్దుకొను. గౌరవముతోఁ జూచు.

కన్నెఱికము. దే. వి. ౧. కన్యాత్వము. ౨. వారకన్యల ప్రథమసంగమము.

కన్య. త్స. వి. కన్నియ.

కన్యక. త్స. వి. ,,

కన్యాకుమారి. త్స. వి. ౧. గౌరి. ౨. హిందూదేశము దక్షిణమున నుండు నగము.

కన్యాశుల్కము. త్స. వి. కన్యకు (వెలగానిచ్చు ధనము.)

కపటప్రబంధము. త్స. వి. కపటముతోఁ గూడిన పన్నుగడ.

కపటము. త్స. వి. కుత్సితము.

కపటి. త్స. విశే. కపటముగలవాఁడు.

కపర్ది. త్స. వి. శివుఁడు. (వ్యు. కపర్దమనెడి జటాజూటము గలవాఁడు.)

కపాటము. త్స. వి. కవాటము.
కపాలము. త్స. వి. ౧. తలపుఱ్ఱె. ౨. కుండపెంకు.
కపాలి. త్స. వి. శివుఁడు.
కపి. త్స. వి. ౧. వానరము. ౨. విష్ణువు.
కపింజలము. త్స. వి. ౧ ఒకానొక పక్షి; కముజు. ౨. చాతకము.
కపిత్థము. త్స. వి. వెలగపండు.
కపిలము. త్స. విశ. నీలపీతమిశ్రవర్ణము. (పింగళవర్ణము)
కపిలె. దే. వి. ఎద్దులను గట్టి బావి నుండి నీరుచల్లుట కుపయోగపడు నట్టి యంత్రము; మోట.
కపురబాగాలు. దే. వి. కర్పూరము తోడి వక్కపలుకులు. రూ. కపురపు బాగాలు.
కపురము. వై. వి. కర్పూరము.
కపోతము. త్స. వి. ౧. గువ్వ. ౨. పావురము.
కపోలము. త్స. వి. చెక్కిలి.
కప్ప. దే. వి. నీటియందుండు నొక జంతువు.
కప్పము. దే. వి. పన్ను. సిస్తు.
కప్పిపుచ్చు. దే. క్రి. మఱుఁగుపఱచు.
కప్పు. దే. వి. ౧. ముసుఁగుడు. ౨. ఇంటిపైనవైచునట్టికప్పు. ౩. నలుపు. ౪. చీఁకటి. క్రి. వ్యాపించు.
కప్పుకొను. దే. క్రి. ౧. క్రమ్ము. ౨. ఆచ్ఛాదించు.
కప్పురగంధి. మిశ్ర. విశ. కర్పూరము వలెఁ బరిమళించు శరీరము గలది.
కప్పురము. వై. వి. కర్పూరము. రూ. కప్రము.
కప్పెర. దే. వి. ౧. తలపుఱ్ఱె. ౨. బిచ్చపుగిన్నె. ౩. కుంపటి.
కఫము. త్స. వి. శ్లేష్మము.
కబంధము. త్స. వి. ౧. మొండెము. ౨. జలము.
కబంధుఁడు. త్స. వి. ఒకానొక రాక్షసుఁడు.
కబరి. త్స. వి. కొప్పు.
కబళనము. త్స. వి. మ్రింగుట.
కబళము. త్స. వి. అన్నపుముద్ద.
కబళించు. త్స. క్రి. మ్రింగు. వి. కబళనము.
కబాయి. (యీ) దే. వి. అంగీ.
కబ్బము. వై. వి. కావ్యము.
కమండులువు. త్స వి. సన్న్యాసు లుంచుకొనునట్టి మట్టిపాత్రము.
కమఠము. త్స. వి. తాఁబేలు.
కమతము. / కమ్మతము. } దే. వి. పెక్కండ్రు చేరి చేయు సేద్యము. విశ. కమదీఁడు. కమతగాఁడు.
కమనీయము. త్స. విశ. సొంపైనది.
కమరు. దే. క్రి. కాలు. మండిపోవు. వి. ౧. వెండ్రుకకాలిన వచ్చుకంపు. ౨. నడిమియొడ్డాణము.

కమల. త్స. వి. లక్ష్మి. (వ్యు. కమలము కలిగినది.)

కమలము. త్స. వి. ౧. తామర. ౨. జలము.

కమలాకరము. త్స. వి. తామరకొలను.

కమలాప్తుఁడు. త్స. వి. సూర్యుఁడు.

కమలాసనుఁడు. త్స. వి. బ్రహ్మ.

కమలిని. త్స. వి. తామరతీఁగ.

కమలు. దే. క్రి. ౧. కందు. ౨. కాలు.

కమసాలవాఁడు. దే. వి. బంగారు మున్నగు లోహములపని చేయువాఁడు.

కమికిలి. దే. వి. పిడికిలి. (వంపఁబడిన వ్రేళ్లుగల పుడిసిలి.)

కమియు. దే. క్రి. ౧. కలియు. ౨. మిగులఁబడు. 3. కొఱుకు. ౪. తోఁగు.

కముచు. దే. క్రి. ౧. గ్రహించు. ౨. మ్రింగు. 3. అధరపానముచేయు. ౪. నొక్కు.

కమ్మ. దే. వి. ౧. చెవిని ధరించుకొను నగ. ౨. జాబు. విణ. ౧. రుచి కలది. ౨. తియ్యనిది. 3. సువాసనకలది.

కమ్మచ్చు. దే. వి. అగసాలెవాని పనిముట్టు.

కమ్మటము. దే. వి. బంగారుపని సేయువాని కుంపటి.

కమ్మటీఁడు. దే. వి. అగసాలెవాఁడు.

కమ్మనీరు. దే. వి. ౧. పన్నీరు. ౨. మకరందము.

కమ్మరము. దే. వి. కమ్మరసానివృత్తి.

కమ్మరి. } కమ్మరీఁడు. } దే. వి. ౧. ఇనుముపని చేయువాఁడు. ౨. బాణములు లోనగువానిని చేయువాఁడు.

కమ్మి. దే. వి. ౧. కడ్డి. ౨. గుడ్డ యొక్క యంచు.

కమ్మిఁదీయు. దే. క్రి. కమ్మచ్చునఁదీయు.

కిమ్ము. దే. క్రి. కప్పు.

కమ్రము. త్స. విణ. మనోహరమైనది.

కయి. దే. వి. చేయి.

కయిత. దే. వి. కవిత. కైత.

కయిదండ. దే. వి. కైదండ.

కయిదువ. దే. వి. కైదువ. కత్తి.

కయివారము. దే. వి. స్తోత్రము. రూ. కైవారము.

కయివాలు. దే. క్రి. ఒదగు.

కయిసేఁత. దే. వి. అలంకరించుట.

కయ్య. దే. వి. ౧. కాలువ. ౨. పొలము. 3. చేను.

కయ్యపుఁగ్రచ్చ. దే. విణ. కలహాశీలుఁడు. రూ. కయ్యాలకచ్చ.

కయ్యము. దే. వి. కలహము.

కరండము. త్స. వి. ౧. బరణి. ౨. పూలబుట్ట

కరండిక. త్స. వి. ,,

కరంబము. త్స. విణ. మిశ్రితము.

కరఁగు. దే. క్రి. ద్రవమగు. వి. కరఁగుట.

కరఁచు. దే. ప్రే. కరఁగునట్లు. చేయు.
కరకంచు. దే. వి. కరక్కాయనీటితో వ్రాసిన యంచు.
కరకరి. దే. వి. ౧. ద్వేషము. ౨. ఈర్ష్య. ౩. పట్టుదల.
కరగ్రహణము. త్స. వి. పెండ్లి.
కరగ్రహము. త్స. వి. ,,
కరజము. త్స. వి. గోరు.
కరటి. త్స. వి. ఏనుఁగు.
కరడము. } దే. వి. అల.
కరడు. }
కరణము. త్స. వి. ౧. లెక్కను వ్రాయువాఁడు. ౨. పనిముట్టు. ౩. హేతువు. ౪. పని. ౫. పొలము. ౬. పూఁత.
కరణి. దే. వి. రీతి.
కరతలామలకము. త్స. వి. అఱచేతిలోని యుసిరికాయ. (స్పష్టము)
కరదివ్వె. }
కరదివ్వియ. } చే దివిటీ.
కరదీపక. }
కరబదరము. త్స. వి. (కరతలామలకము వంటిది.) ౨. చేతిలోని రేగుపండు.
కరభము. త్స. వి. మనికట్టు మొదలు చిటికెనవ్రేలి మొదటిదాఁకఁగల చేతి వెలుపలిభాగము.
కరము. దే. అవ్య. మిక్కిలి. త్స. వి. ౧. హస్తము. ౨. తొండము. ౩. కిరణము. ౪. పన్ను.

కరరుహము. త్స. వి. గోరు.
కరవాఁడి. దే. వి. మిక్కిలివాఁడి.
కరవాలము. త్స. వి. కత్తి. బాఁకు.
కరవాలు. హే. వి.—పై—
కరవేదన. దే. వి. అధికదుఃఖము.
కరాచురకత్తి. }
కరాచురి. } దే. వి. ఖడ్గము.
కరాచూరి. }
కరాటము. దే. వి. బరణి. రూ. కరవాటము.
కరాళము. త్స. విణ. భయంకరము.
కరాళించు. దే. వి. ౧. బొబ్బవెట్టు. ౨. సకిలించు. ౩. దూఱు.
కరి. దే. వి. ౧. దృష్టాంతము. ౨. మేర. ౩. నియమము. త్స. వి. ఏనుఁగు.
కరిణి. త్స. వి. ఆఁడేనుఁగు.
కరీషము. త్స. వి. ౧. పిడక. ౨. పెంట. పేడ.
కరుగు. దే. వి. ౧. వరిపోట్టుకత్తి. ౨. పోఁతపోసెడి యచ్చు. రూ. కరువు.
కరుడు. దే. వి. ముద్ద. గడ్డ.
కరుణ. త్స. ౧. దయ. ౨. నవరసములలో నొకటి.
కరువలి. దే. వి. గాలి. రూ. కర్వలి.
కరేణువు. త్స. వి. పిడియేనుఁగు.
కరోటము. త్స. వి. ౧. తలపుర్రె. ౨. బట్టలపెట్టె.
కర్కటము. త్స. వి. ౧. పండ్రెండు రాసులలో ఒకటి. ౨. ఎండ్రి.

కర్కశము. త్స. విశ. ౧. దయలేనిది. ౨. పరుసైనది.
కర్జము. వై. వి. పని.
కర్ణధారుఁడు. త్స. వి. నావనడుపు వాఁడు.
కర్ణము. త్స. వి. చెవి.
కర్ణాకర్ణి. త్స. అవ్య. శ్రవణపరంపర.
కర్ణాటము. త్స. వి. ఒకానొకదేశము.
కర్ణిక. త్స. వి. ౧. చెవిదుద్దు. ౨. తామరదుద్దు.
కర్ణేజపుఁడు. త్స. విశ. కొండెగాఁడు.
కర్త. త్స. వి. బ్రహ్మ. విశ: చేయు వాఁడు.
కర్తరి. త్స. వి. కత్తెర.
కర్తనము. త్స. వి. కత్తిరించుట.
కర్తవ్యము. త్స. విశ. చేయఁదగినది.
కర్దమము. త్స. వి. బురద.
కర్దరము. త్స. వి. కటాహము. (కాఁగు)
కర్పూరము. త్స. వి. కప్పురము.
కర్మకరుఁడు. త్స. వి. పనివాఁడు.
కర్మఠుఁడు. త్స. విశ. కర్మశూరుఁడు.
కర్మము. త్స. వి. కార్యము. పని.
కర్మశాల. త్స. వి. వ్యాపారము నకు వలయు సామగ్రులు చేయు నిల్లు. శిల్పిశాల.
కర్మసాక్షి. త్స. వి. సూర్యుఁడు.
కర్మిష్ఠుఁడు. త్స. విశ. కర్మనిపుణుఁడు.
కర్షకుఁడు. త్స. విశ. దున్నుకొని బ్రదుకువాఁడు.

కఱకంఠుఁడు. దే. వి. శివుఁడు.
కఱకరి. దే. వి. కఠినము.
కఱకఱ. దే. వి. ప్రొద్దుపొడుచుట, ఒరయుట మున్నగువానియందు నగుశబ్దము.
కఱకటి. దే. వి. ద్వేషము.
కఱకు. దే. వి. కాఠిన్యము. విశ. కఠినము.
కఱచు. దే. క్రి. ౧. నేర్చుకొను. ౨. కాటువేయు.
కఱద. దే. వి. బుద్ధి. (హితోపదేశము) విశ. కఱుదు, కఱత.
కఱపు. దే. క్రి. నేర్పు. వి. బోధ.
కఱవు. దే. వి. వఱపు. కాటకము.
కఱి. దే. విశ. నల్లనిది.
కఱ్ఱి. దే. వి. ౧. కొయ్య. ౨. మఱక.
కఱ్ఱి. దే. వి. అర్జునుఁడు. విశ. నల్లని వాఁడు.
కఱ్ఱు. దే. వి. నాఁగటియందుఁ బెట్టెడు నినుపపాళము.
కల. దే. వి. స్వప్నము.
కలంకము. త్స. వి. ౧. చిహ్నము. ౨. నింద.
కలఁక. దే. వి. ౧. కలఁగుట. ౨. కంటితెవులు.
కలఁకఁబాఱు. దే. వి. కలఁతపడు.
కలఁకువ. దే. వి. సంక్షోభము.
కలఁగు. దే. క్రి. కలఁగఁబాఱు.
కలఁత. దే. వి. క్షోభము.

కలఁబడు. దే. క్రి. కలియఁబడు.
కలకంఠము. త్స. వి. ౧. చెవికింపైన ధ్వని. ౨. కోకిలము. 3. పావురము. ౪. హంస.
కలకండ. దే. వి. కండచక్కెర.
కలకలము. త్స. వి. గుంపులోఁబుట్టిన పెద్దచప్పుడు.
కలకాలము. త్స. వి. ఎల్లప్పుడు.
కలగుండు. దే. వి. కలఁత. క్షోభము. క్రి. కలగుండుకొను, కలగుండుపడు.
కలగూర. దే. వి. కలిసియున్న పలురకముల ఆకుకూర.
కలగూరగంప. దే. వి. విషయ సాంకర్యము.
కలగొను. దే. క్రి. కలఁగు.
కలతెఱఁగు. దే. వి. నిజము.
కలధౌతము. త్స. వి. ౧. బంగారు. ౨. వెండి.
కలను. దే. వి. ౧. తావు. ౨. కళ్లము. 3. యుద్ధము. రూ. కలఁకు.
కలప. దే. వి. ౧. నాఁగటిదుంప. ౨. ఇల్లుకట్టుట కుపయోగపడు మ్రాను.
కలపము. దే. వి. ౧. వాసనవస్తువులు చేర్చికలిపినగందము. ౨. కలపుట. చేర్చుట.
కలపు. దే. క్రి. కలుపు.
కలభము. త్స. వి. ఏనుఁగుపిల్ల.
కలమము. త్స. వి. ౧. వరిపైరు. ౨. వ్రాయుకలము. 3. అంకురము.
కలము. దే. వి. ౧. ఓడ. ౨. పంద్రెండుతూములుకల కొలత. 3. లేఖిని. (పేనా.) త్స. విశే. అవ్యక్తమధురము.
కలయ. దే. అవ్య. అంతట. రూ. కలయఁగ.
కలయంపి. దే. వి. వీధులలో చిమ్ముటకై కస్తూరి చందనము లోనగువానితోఁ గలిపి చల్లెడు జలము.
కలయిక. దే. వి. కూడిక. క్రి. కలయు.
కలరవము. త్స. వి. పావురము.
కలవరము. దే. వి. కలఁత.
కలవరించు. దే. క్రి. మేనుమఱచి పలుకు.
కలవాఁడు. దే. విశే. ౧. ధనికుఁడు. ౨. ఆప్తుఁడు. 3. సామర్థ్యము కలవాఁడు.
కలశము. త్స. వి. ఘటము.
కలహంస. / కలహంసము. త్స. వి. ౧. హంస. (వ్యు. అవ్యక్త మధురధ్వనిగలది.) ౨. రాజవర్యుఁడు.
కలహము. దే. వి. జగడము.
కలహించు. త్స. వి. జగడమాడు.
కలాపము. త్స. వి. ౧. సమూహము. ౨. నెమలిపురి. 3. అమ్ములపొది.

కలి. దే. వి. పులియఁబెట్టిన కడుగునీరు. త్స. వి. ౧. ఒకయుగము. ౨. జగడము. 3. కలహము. ౪. యుద్ధము.

కలిక. త్స. వి. మొగ్గ.

కలికము. దే. వి. కంటికింగో వేయుమందు.

కలికి. దే. వి. ఆఁడుది. విణ. రమ్యమైనది. రూ. కల్కి.

కలికితనము. దే. వి. దిట్టతనము.

కలిమి. దే. వి. ౧. ఐశ్వర్యము. ౨. కలుగుట.

కలియు. దే. క్రి. పొందు

కలుఁగు. దే. వి. ౧. బొంద. ౨. గుహ.

కలుఁజు. దే. వి. ౧. చెఱువునందలి నీరుపోవుట కేర్పడిన ఱాతితోఁ గట్టిన త్రోవ. ౨. నూతిగోడ.

కలుగు. దే. క్రి. ౧. అగు. ౨. ఉండు. 3. ఓపు. ౪. పుట్టు. ౫. కూడు. ౬. పొందు. రూ. కల్గు.

కలుపు. దే. వి. ౧. వరిపైరుతోడ మొలచినగడి. ౨. పెరుఁగు. క్రి. కలసికొనునటు చేయు.

కలుపుకోలుతనము. దే. వి. ఐకమత్యము.

కలువ. దే. వి. కువలయము.

కలువడము. దే. వి. ౧. మేలుకట్టు. ౨. వ్రేలాడఁగట్టిన పూదండ.

కలువము. దే. వి. మందునూఱెడు ఱాయి. రూ. కల్వము.

కలుషము. త్స. వి. ౧. పాపము. ౨. దుష్టపోతు.

కల్పన. త్స. వి. కూర్పు. (రూ. కల్పనము.)

కల్పము. త్స. వి. ౧. వైదిక విధానమును దెలుపుశాస్త్రము. ౨. బ్రహ్మదినము.

కల్పవృక్షము. త్స. వి. కోరినవస్తువులనన్నింటిని ఇచ్చు దేవతావృక్షము. (ఇవి అయిదు) ౧. మందారము. ౨. పారిజాతము. 3. సంతానము. ౪. కల్పవృక్షము. ౫. హరిచందనము.

కల్పాంతము. త్స. వి. ప్రళయము.

కల్పించు. త్స. క్రి. ౧. కలుగఁజేయు. ౨. రచించు.

కల్మషము. త్స. వి. పాపము.

కల్యాణము. త్స. వి. ౧. మంచి బంగారు. ౨. మంగళము. 3. వివాహము.

కల్ల. దే. వి. ౧. పొరపాటు. ౨. అబద్ధము.

కల్లరి. దే. విణ. ౧. అబద్ధములు పలుకువాఁడు. ౨. తప్పొనర్చినవాఁడు.

కల్లరీఁడు. దే. విణ. ,,

కల్లు. దే. వి. ౧. బండికన్ను. ౨. కన్ను. 3. ఱాయి. ౪. మత్తుగలిగించు ద్రవపదార్థము, ఈఁతకల్లు, తాటికల్లు, లోనగునవి.

కల్లోలము. త్స. వి. తరంగము.

కల్లోలిని. త్స. వి. నది.

కవ. దే. వి. ౧. జత. ౨. యుగళము.

కవకవ. దే. వి. ౧. నవ్వునప్పు డగు చప్పుడు. ౨. పక్షులుకూయునపు డగు రొద.
కవగూడు. దే. క్రి. జతగాఁగూడు.
కవచము. త్స. వి. ౧. బొందలము. ౨. తప్పెట.
కవట. దే. వి. ౧. పెద్దకొమ్మ. ౨. లేఁత (కవటాకు.)
కవయు. దే. క్రి. కూడు. రమించు.
కవలు. దే. వి. వేదపాఠమున సామ్య ముచే నొకచో మఱొకవరుసవచ్చుట.
కవవాయు. దే. వి. జతవిడుచు.
కవాటము. త్స వి. తలుపు.
కవి. త్స. వి. ౧. శుక్రాచార్యుఁడు. వ్యు. కవి అను ఋషికొడుకు. ౨. కవిత్వము చెప్పువాఁడు. వ్యు. చాతుర్యముచే వర్ణించువాఁడు.
కవియు. దే. క్రి. పైఁబడు.
కవిల. దే. విణ. కపిల వర్ణముగలది.
కవిలె. దే. వి. లెక్క-పుస్తకము.
కవుఁగిలి. దే. వి. ఆలింగనము.
కవుడు దే. వి. కపటము. రూ. కాడు.
కవులు. దే. వి. నేలకలవాఁడు రైతు నకు వ్రాసి ఇచ్చెడి యొడంబడిక. రూ. కౌలు.
కవోష్ణము. త్స. విణ. నులివెచ్చనిది.
కవ్వడి. దే. వి. అర్జునుఁడు.
కవ్వము. దే. వి. పెరుఁగు చిలుకుట కుపయోగపడు పనిముట్టు.
కవ్వు. దే. క్రి. ౧. కబళించు. ౨. అప హరించు.
కవ్వుకొను. దే. క్రి. ఆక్రమించు.
కశ్మలము. త్స. విణ. మలినము.
కషణము. త్స. వి. ఒరయిక. గోఁకుట.
కషాయము. త్స. వి. ౧. చేఁదు. ౨. ఔషధరసము. విణ. ఎఱ్ఱనిది.
కష్టపడు. త్స. క్రి. దుఃఖపడు.
కష్టము. త్స. వి. ౧. వ్యసనము. ౨. పాపము. విణ. వ్యసనము కలది. కష్టములెనిమిది:— ౧. దేశాంతర ముపోవుట. ౨. ఆలిని గోల్పోవుట. 3. ఆపత్తునఁ జుట్టముయొక్క దర్శ నము. ౪. ఎంగిలియన్నమును దినుట. ౫. పగవారితో స్నేహము చేసి కొనుట. ౬. పరులయన్నము నెదురు చూచుట. ౭. భంగము. ౮. పేద తికము.
కసటు. దే. వి. ౧. దోషము. ౨. మలినము.
కసరు. దే. క్రి. ౧. కదలు. ౨. కోపించు. వి. ౧. కోపము. ౨. వానగాలి.
కసరుఁగాయ దే. వి. లేఁతకాయ.
కసవు. దే. వి. ౧. గడ్డి. ౨. ఇంటి కుప్ప, (గడ్డిగాదము, అన్నట్లు కసవుఁగాడ, అని వాడుక.)
కసి. దే. వి. ౧ కోపము, ౨. దుగద, 3. కోరిక. విణ. అల్పము (కసి కోఁత, కసిగాటు మొ.)

కసిమసంగు. దే. వి. ౧. రేగు. ౨. త్రెంచు.
కసు. దే. విణ. కసురుశబ్దమునకు వృత్తి యందు 'రు' వర్ణములోపించిన రూపము. కసుగాయ = లేతకాయ. కసుగాను = లేతనడుము.
కసుంగందు. దే. వి. ౧. మిక్కిలి లేత బిడ్డ. ౨. నలుపు.
కసుగందు. దే. క్రి. మిక్కిలివాడు.
కసుమాలము. వై. విణ. ౧. మలినము. ౨. పాపిష్ఠము. (కశ్మలము)
కసురు. దే. వి. పిందె. (కసరుగాయ = లేతకాయ.)
కస్తి. దే. వి. ౧. వ్యసనము. ౨. కష్టము.
కస్తురి. } వై. వి. మృగమదము.
కస్తూరి. }
కహకహ. దే. అవ్య. పెద్దనవ్వున కను కరణము.
కహ్లారము. త్స. వి. ఇంచుక యెఱుపు తెలుపు గలిగి పరిమళించు కలువ. సౌగంధికము.
కళ. దే. వి. త్స. వి. ౧. చంద్రునిలో పదునాఱవపాలు. ౨. శిల్పము.
కళకళపడు. దే. క్రి. ౧. కలంతపడు. ౨. తొట్రుపడు. వి. కళవళపాటు.
కళత్రము. త్స. వి. ౧. భార్య. ౨. పిఱుఁదు.
కళవళము. దే. వి. ౧. కలంత. ౨. తొట్రుపాటు. క్రి. కళవళించు.
కళామఁడు త్స. వి. కమసాలి.
కళాయి. దే. వి. ౧. గంగాళము. ౨. తగరపుపూఁత.
కళాసము. దే. వి. తోలు.
కళుకు. దే. విణ. ౧. ప్రకాశముగలది. ౨. కాంతి. 3. కిరణము.
కళేబరము. దే. వి. దేహము.
కళ్లము. } దే. వి. వడ్లను నూర్చెడి
కళ్లాము. } తావు.
కళ్యము. }
కళ్లియము. } దే. వి. గుఱ్ఱమునోటఁ దగిలించెడి యినుప
కళ్లెము. } కొలుసు.

# కా

కాంక్ష. త్స. వి. కోరిక. క్రి. కాంక్షించు.
కాంచనము. త్స. వి. బంగారము. ఉమ్మెత్త.
కాంచి. త్స. వి. ఆడుదాని మొలనూలు. కాంచీనగరము
కాంచు. దే. క్రి. ౧. చూచు. ౨. పొందు.
కాండము. త్స. వి. ౧. ఒకగ్రంథము యొక్కభాగము. ౨. బాణము. 3. నీరు.
కాంద్రించు. దే. వి. ఉమియుటకు ముందు చేయు కాండు అనుధ్వని.
కాంత. త్స. వి. కోరఁదగినస్త్రీ.
కాంతము. త్స. విణ. మనోహరము.

కాంతారము. త్స. వి. పెద్దయడవి.
కాంతి. త్స. వి. వెలుఁగు. ప్రకాశము.
కాంతిల్లు. త్స. క్రి. ప్రకాశించు.
కాంతుఁడు. త్స. వి. భర్త. మగఁడు.
కాందిశీకుఁడు. త్స. విశ. ఏదెక్కడకుఁ బోవుదును? అని యనుకొనువాఁడు; పలాయితుఁడు.
కాంస్యము. త్స. విశ. కంచుపాత్రము.
కాఁక. దే. వి. ౧. జ్వరము. ౨. తాపము.
కాఁకలనుదేఱు. దే. వి. ఆరితేఱు.
కాఁగడా. దే. వి. దివ్వటీ.
కాఁగా. దే. అవ్య. కాఁబట్టి.
కాఁగు. దే. క్రి. ౧. ఉడుకు. ౨. కోపపడు. వి. పెద్దబాన.
కాఁడ. దే. వి. ౧. కామ. ౨. కడ్డి. ౩. తొడిమ.
కాఁడి. దే. వి. ౧. దుక్కిటియెద్దుల మూపుమీఁదఁ బెట్టుకొయ్య.
కాఁడు. దే. క్రి. నాఁటుకొను.
కాఁదారిమాదారిప్రొద్దు. దే. వి. నిశీథము.
కాఁపు. దే. వి. ౧. కాఁపురము. ౨. గృహస్థుఁడు. ౩. పంట పెట్టువాఁడు. ౪. శూద్రుఁడు.
కాఁపుదు. దే. వి. కాఁచుట.
కాఁపురము. దే. వి. ౧. నివాసము. ౨. సంసారము.
కాఁబట్టి. దే. అవ్య. కనుక.
కాఁబడు. దే. క్రి. అగు.
కాఁబోలు. దే. అవ్య. అవునేమొ.
కాకణి. త్స. వి. కాణి. (కాకిణి.) ?
కాకతాళీయము. త్స. విశ. కాకి వ్రాలఁగా తాటిపండు పడిన విధము; ఆకస్మిక సంభవము. (ఇది యొక న్యాయము.)
కాకపదము. త్స. వి. హంసపాదు.
కాకము. త్స. వి. కాకి.
కాకలీరవము. త్స. వి. సన్నని అవ్యక్త మధురమగు ధ్వని.
కాకాక్షిన్యాయము. త్స. వి. కాకి చూపువలె నేదేని ఒకప్రక్కకొఱఁగుట. (ఒక న్యాయము.)
కాకి. దే. వి. వాయసము. విశ. నీచము. కాకిబంగారు.
కాకిచావు. దే. వి. దిక్కుమాలినచావు.
కాకితము. దే. వి. వ్రాయుపత్రము.
కాకు. దే. విశ. ౧. వ్యర్థము. ౨. కర్కశము. ౩. కళాహీనము. ౪. తిరస్కారము. ౫. శ్రమము.
కాకుసేయు. దే. క్రి. నిందించు.
కాకుదము. త్స. వి. దవుడ.
కాకుపడు. దే. క్రి. వ్యాకులపడు.
కాకోదరము. త్స. వి. పాము.
కాగతము. త్స. వి. కాగితము.
కాగితము. దే. వి. కాకితము. రూ కాగిదము.
కాచము. త్స. వి. ౧. గాజుపూస ౨. కాసు. (చిన్న నాణెము.)

కాచు. దే. క్రి. ౧. కాయకాచు. ౨. ఎండకాయు. 3. రక్షించు. ౪. ఎదురుచూచు.
కాటుకము. దే. వి. కఱవు.
కాటా. దే. వి. పెద్దత్రాసు.
కాటికిఁగాళ్లుసాఁచు. దే. వి. చచ్చుటకు సిద్ధముగానుండు.
కాటు. దే. వి. ౧. కఱచుట. ౨ కఱచిన గాయము. 3. మాడి యడుగంటుట.
కాటుక. దే. వి. స్త్రీలు కనులఁ బెట్టుకొను నల్లని మసి.
కాటుపోవు. దే. క్రి. మాడి యడుగంటు.
కాటులాడు. దే. క్రి. కలహించు. రూ. కాట్లాడు.
కాడు. దే. వి. ౧. శ్మశానము. ౨. అడవి. 3. నాశము.
కాడుచేయు. దే. వి. చీకాకుపఱచు.
కాణము. త్స. విణ. ౧. గ్రుడ్డిది. ౨. చిల్లివడినది.
కాణయాచి. } దే. వి. పెక్కుకాలము
కాణాచి. } వసించినతావు.
కాతరుఁడు. త్స. వి. పిఱికివాఁడు.
కాత్యాయని. త్స. వి. పార్వతి.
కాదంబరి. త్స. వి. ౧. మద్యము. ౨. ఒకగ్రంథము.
కాదా. } దే. అవ్య. కద. కదా.
కాదె. }

కాన. దే. వి. అడవి. అవ్య. కనుక.
కానగు. దే. క్రి. కనఁబడు.
కాననము. త్స. వి. ౧. అడవి. ౨. ఇల్లు.
కానఁబట్టు. దే. క్రి. కనఁబడు.
కానఁబడు. దే. క్రి. ,,
కాని. దే. అవ్య. ౧. తక్క. ౨. మార్పును దెలుపును. 3. వీసమున నాల్గవభాగము.
కానిక. దే. వి. బహుమానము.
కానీ. దే. అవ్య. సమ్మతిదెలుపును.
కానీనుఁడు. త్స. వి. ౧. కన్యకకుఁ బుట్టినవాఁడు. ౨. వ్యాసుఁడు. 3. కర్ణుఁడు.
కానుక. దే. వి. కానిక. రూ. కాన్క.
కానుపు. దే. వి.౧.ప్రసవము.౨.చూపు.
కానోపు. దే. అవ్య. కాఁబోలు.
కాపటికుఁడు. త్స. విణ. కపటి.
కాపట్యము. త్స. వి. మోసము.
కాపథము. త్స. వి. చెడుత్రోవ.
కాపరి. దే. వి. రక్షకుఁడు.
కాపాడు. దే. క్రి. రక్షించు.
కాఁపు= ౧.గృహస్థు౨ వ్యవసాయకుడు 3.నివాసము.౪.శూద్రుఁడు.
కాపు. దే. వి. కాయలుకాచుట. విణ. రక్షణము.
కాపుగడ. దే. వి. రక్షణ.
కాపురుషుఁడు. దే. వి. కుత్సితపురుషుఁడు.

కాపోతము. త్స. వి. పావురముల సమూహము.

కామ. దే. వి. ౧. కాఁడ. ౨. కఱ్ఱ. 3. మగగుఱి.

కామచారుఁడు. త్స. విశ. ఇచ్చవచ్చినట్లు తిరుగువాఁడు.

కామదుఘ. త్స. వి. కామధేనువు.

కామదేవుఁడు. త్స. వి. మన్మథుఁడు.

కామము. త్స. వి. వలపు.

కామరూపుఁడు. త్స. వి. ఇచ్చవచ్చిన రూపము దాల్చువాఁడు.

కామాటము. దే. వి. మోటపని. కూలి పని.

కామాటి. దే. విశ. మోటుపని చేయు వాఁడు.

కామారి. త్స వి. శివుఁడు.

కామి. త్స. వి. కాముకుఁడు.

కామిని. త్స. వి. (వ్యు. అతిశయమైన కామముగలది) ఆఁడుది.

కాముఁడు. త్స. వి. మన్మథుఁడు.

కాముకుఁడు. త్స. వి. మైథునేచ్ఛ గలవాఁడు.

కాముకి. త్స. వి. మైథునేచ్ఛగల స్త్రీ.

కామ్యము, త్స. విశ. కోరికతోఁ జేయుకర్మ.

కాయ. దే. వి. ౧. చెట్టునఁ గాచెడి కాయ. ౨. చెడిపోయిన ధాన్యము. (కాయలు పొల్లు మొ॥)

కాయకము. దే. వి. జీవనోపాయము.

కాయజుఁడు. త్స. వి. మన్మథుఁడు.

కాయమానము. త్స. విశ. పందిరి.

కాయము. దే. వి. బాలింత కిచ్చెడు మందు. త్స. వి. ౧. దేహము. ౨. సమూహము.

కాయస్థుఁడు. త్స. వి. కరణము.

కాయికము. త్స. విశ. శరీరమునకు సంబంధించినది.

కాయు. దే. క్రి. ౧. ఎండ, వెన్నెల ప్రసరించు. ౨. కాచు.

కార. త్స. వి. చెఱ (కారాగృహము.)

కారణము. త్స. వి. ౧. హేతువు. ౨. సాధనము.

కారపుమన్ను. దే. వి. చౌడు.

కారము. దే. వి. కటువు.

కారాకు. దే. వి. పండుటాకు.

కారాకూరము. దే. విశ. కలఁతపడినది.

కారాగారము. త్స. వి. చెఱసాల.

కారించు. దే. క్రి. బాధించు.

కారిజము. దే. వి. కడుపులోఁ గుడి ప్రక్కనుండు మాంసఖండము.

కారు. దే. వి. ౧. అడవి. ౨. ఎండ కాలమున చల్లెడి వరిధాన్యము. 3. నలుపు. ౪. కాలము. వయస్సు.

కారుకొను. దే. క్రి. ౧. అతిశయించు. ౨. విజృంభించు. 3. నల్లఁబాఱు.

కారుక్రమ్ము. దే. క్రి. నల్లనగు.

కారుచిచ్చు. దే. వి. దవానలము. రూ. కార్చిచ్చు.

కారుణికుఁడు.త్స.విణ.కరుణగలవాఁడు.
కారుణ్యము. త్స వి. దయ.
కారుపోతు. దే. వి. అడవిదున్న.
కార్తస్వరము. త్స వి. బంగారము.
కార్తాంతికుఁడు. త్స. వి. జ్యోతిషికుఁడు
కార్తికము. త్స. వి. ఒకానొకనెల.
కార్తికేయుఁడు. త్స. వి. కుమార స్వామి.
కార్తె. వై. వి. సూర్యుఁడుండు నక్షత్రము. చిత్తకార్తె, స్వాతికార్తె మొదలయినవి.
కార్పణ్యము. త్స. వి. కృపణత్వము.
కార్ముకము. త్స. వి. విల్లు.
కార్యకుఁడు. మి. విణ. కార్యము నెఱవేర్చువాఁడు.
కార్యదర్శి. త్స. విణ. పని నిర్వహించువాఁడు.
కార్యము. త్స. వి. ౧. పని. ౨. ప్రయోజనము.
కాఱియపెట్టు. దే. క్రి. బాధించు.
కాఱు. దే. క్రి. ౧. స్రవించు. ౨. రాలు. వి. ౧. అజ్ఞానము. ౨. పట్టుకాఱు. 3. పరుషవచనము. విణ. దట్టము. (కాఱడవి.)
కాలకంఠము. త్స. వి. నెమిలి.
కాలకంఠుఁడు. త్స. వి. శివుఁడు.
కాలకూటము. త్స. వి. హాలాహలము.
కాలక్షేపము. త్స. వి. ౧. విలంబము. ౨. ఉబుసుపోక.
కాలధర్మము. త్స.వి. మరణము.
కాలము. త్స. వి. ౧. సమయము. ౨. చావు. 3. నలుపు.
కాలరి. దే. వి. ౧. పదాతి. ౨. దూత.
కాలాఁగు. దే. క్రి. కాలునిలుపు.
కాలిత్రోవ. దే. వి. ఒకఁడు నడచిపోఁదగిన మార్గము.
కాలిబంటు. దే. వి. పదాతి.
కాలు. దే. క్రి. మండు. వి. ౧. అడుగు. ౨. పాతిక. 3. మంచపుఁగోడు.
కాలుఁడు. త్స. వి. ౧. యముఁడు. ౨. శివుఁడు.
కాలుతక్కువవాఁడు. దే. విణ. వడిగా నడువలేనివాఁడు.
కాలుద్రవ్వు. దే. క్రి. కారణము లేక యుద్ధమునకు సిద్ధపడు.
కాలుద్రొక్కు. దే. వి. ౧. పెండ్లాడు. ౨. నిలుచుండు.
కాలుబలము. దే. వి. పదాతిసేన. రూ. కాల్బలము.
కాలుమడుఁచు. దే. క్రి. మూత్రవిసర్జనముచేయు.
కాలువ. దే. వి. ౧. నీళ్లు పాఱుటకుఁ ద్రవ్విన మార్గము. ౨. వరుస. రూ. కాల్వ.
కాలూఁదు. దే. క్రి. కాలుపెట్టినిలు.
కాల్యము. దే. విణ. కాలమున సంభవించునది.

కావడి. దే. వి. నీళ్లు మొదలైదనవి మోసికొనివచ్చుటకై రెండుకొనలం దుట్లు అమర్చిన వెదురుబద్ద. క్రి. కావడించు.

కావరము. దే. వి. మదము. పొగరు. క్రి. కావరించు.

కావరి. దే. విణ. కావరముగలవాఁడు.

కావరుఁడు. దే. విణ. ,,

కావలము. దే. వి. ౧. దురాచారము. ౨. పాపము. విణ. మదించినది.

కావలి. దే. వి. రక్షణము.

కావలికాఁడు. దే. విణ. రక్షకుఁడు.

కావలుఁడు. దే. విణ. కావరుఁడు.

కావి. దే. వి. ౧. ఎఱుపు. ౨. కాషాయ వస్త్రము.

కావితాలుపు. దే. వి. సన్న్యాసి.

కావిరి. దే. వి. నలుపు. విణ. నల్లనిది.

కావు. దే. క్రి. ౧. ఏడ్పు లోనగు ధ్వని. ౨. పాఁతఱ లోనగువాని పైకప్పు. 3. తిలకము.

కావుట. దే. వి. అగుట.

కావుత. దే. అవ్య. అగుత.

కావున. దే. అవ్య. కాఁబట్టి.

కావేరి. త్స. వి. ఒకానొకనది.

కావ్యము. త్స. వి. ప్రబంధము.

కావ్యుఁడు. త్స. వి. శుక్రుఁడు.

కాశము. త్స. వి. రెల్లు.

కాశి. త్స. వి. ఒకానొక పట్టణము.

కాశ్మీరకుఁడు. త్స. విణ. కాశ్మీరదేశస్థుఁడు.

కాశ్మీరము. త్స. విణ. కాశ్మీరదేశము. ౨. కుంకుమపువ్వు.

కాష్ఠ. త్స. ఏ. ౧. దిక్కు. ౨. ఉత్కర్షము.

కాష్ఠము. త్స. వి. కట్టె.

కాషాయము. త్స. వి. కావిచీర.

కాసము. త్స. వి. దగ్గు.

కాసరము. త్స. వి. దున్నపోతు.

కాసారము. త్స. వి. కొలను.

కాసు. దే.వి.దుగ్గానిలోనాల్గవభాగము.

కాసె. దే. వి. ౧. తాయితొలుచుపని. ౨. దట్టి.

కాసెవోయు. దే. క్రి. కోకను గోఁచి వలె వెనుకకుఁ జెక్కు.

కాహళము. త్స. వి. బాకా.

కాళింజ. త్స. వి. తమ్మపడిగము.

# కి

కింక. దే. వి. కినుక; కోపము.

కింకరుఁడు. త్స. వి. సేవకుఁడు.

కింకిణి. త్స. వి. ౧. గజ్జె. ౨. చిఱుగంట.

కింకిరి. దే. వి. ౧. కోపము. ౨. రోఁత.

కించ. దే. వి. మనోవ్యథ.

కించిజ్జ్ఞుఁడు. త్స. వి. కొంచెముదెలిసినవాఁడు.

కించిత్కరము. త్స. విశ. కొంచెముప యోగించునది.
కించిత్తు. త్స. అవ్య. ఇంచుక.
కింరాజు. త్స. వి. కుత్సితరాజు.
కింవదంతి. త్స. వి. జనులాడుకొనుమాట.
కికకిక. } దే. వి. నవ్వునపు డప
కికాకిక. } చప్పుడు.
కిచురించు. దే. క్రి. ౧. వంచించు. ౨. హరించు. రూ. కిచ్చురించు.
కిక్కిస. దే. వి. బిగియున్నట్లు.
కిగ్గాడి. దే. విశ. నీచుఁడు.
కిచ్చుకొట్టు. దే. క్రి. కూయు
కిటి. త్స. వి. పంది.
కిటికీ. దే. వి. గవాక్షము.
కిటుకు. దే. వి. ౧. మోసము. ౨. రహస్యము.
కిట్టు. దే. క్రి. ౧. సమీపించు. ౨. చంపు. ౩. కవియు.
కిణము. త్స. వి. చేతులు మొ॥ వాని పై గాఁయు కాయ.
కితవుఁడు. త్స. వి. జూదరి.
కిత్తనార. దే. వి. చాఁగనార.
కినియు. దే. క్రి. కోపించు. వి. కినుక, కిన్క.
కిన్నెర. దే. వి. ఒకజాతి వీణ.
కిన్నరుఁడు. త్స. వి. నరుని మొగమును అశ్వశరీరమును గల దేవయోని విశేషము.
కిమ్మను. మి. క్రి. నోరెత్తు.
కిరణము. త్స. వి. వెలుఁగు.
కిరాటుఁడు. త్స. వి. ౧. కోమటి. ౨. మ్లేచ్ఛుఁడు.
కిరాతుఁడు. త్స. వి. బోయ.
కిరి. త్స. వి. పంది.
కిరీటము. త్స. వి. రాజులుధరించుతలపాగ.
కిరీటి. త్స. వి. అర్జునుఁడు.
కిరీటిపచ్చ. దే. వి. గరుడపచ్చ. మరకతము (ఒకరత్నము.)
కిఱకిఱ. దే. వి. రథమునడచుధ్వని.
కిలకిల. దే. వి. నవ్వుటలో నగు ధ్వని. రూ. కిలాకిల.
కిలకొట్టు. దే. క్రి. కిలకిల ధ్వనిచేయు.
కిలారించు. దే. క్రి. కిలకిలమని శబ్దించు.
కిలారుచు. దే. క్రి. ౧. బొబ్బరించు. ౨. కిలకిలమని మ్రోఁగు.
కిల్బిషము. త్స. వి. పాపము.
కిల్లాకు. దే. వి. చీటీ.
కిశోరుఁడు. త్స. వి. "౧౧-౧౫ ఏండ్లకు నడిమి వయస్సువాఁడు."
కిష్కువు. త్స. వి. ౧. జేన. ౨. మూంజేయి. ౩. మూర.
కిసమస. దే. వి. వ్యధ.
కిసరు. దే. వి. దృష్టిదోషము. (కన్కిసరు = ఒకరి కలిమిఁజూచి సహింపలేమి.)
కిసలము. } త్స. వి. చిగురు.
కిసలయము. }

# కీ

కీఁచు. దే. వి. "కీఁచు" అనుచప్పుడు.
కీఁచులాడు. దే. క్రి. కలహించు.
కీటకము. త్స. వి. ఒకానొకపురుగు.
కీటము. త్స. వి. పురుగు.
కీడాడు. దే. క్రి. నిందించు.
కీడు. దే. వి. ౧. చేటు. ౨. తప్పు. 3. దోషము. ౪. పాపము.
కీడుపడు. / కీడ్పడు. దే. క్రి. తక్కువపడు. వి. కీడ్పాటు. కీడుపాటు.
కీత. దే. విశ. తక్కువ. (కీతనేల.)
కీరము. త్స. వి. చిలుక.
కీఁతి. వై. వి. యశము. రూ. కీర్తి.
కీర్తనము. త్స. వి. ౧. స్తుతి. ౨. పాట.
కీర్తి. త్స. వి. యశస్సు.
కీర్తించు. దే. క్రి. పొగడు.
కీర్తిశేషుఁడు. త్స. విశ. మరణించినవాఁడు
కీలక. త్స. వి. ఒక సంవత్సరము.
కీలకము. దే. వి. మర్మము.
కీలము. త్స. వి. మాట.
కీలాలము. త్స. వి. జలము.
కీలించు. త్స. క్రి. పట్టుకొను.
కీలు. దే. వి. ౧. అతుకు. ౨. కొయ్యపైఁ బూసెడు నొకానొక ద్రవవస్తువు. 3. రహస్యము. ౪. ఉపాయము. ౫. సీల. వి. కీలుకాఁడు.
కీలుగంటు. దే. వి. జారుగా ముడిచిన వెండ్రుకలదూముడి. రూ. కీల్గంటు.
కీలుజడ. దే. వి. ,,
కీలుబొమ్మ. దే. వి. మరబొమ్మ.
కీలుముడి. దే. వి. మరముడి.
కీసర. దే. వి. తిత్తిలోనగు వానిలోపలి పొర. విశ. అల్పము. (కీసరపాలు.)

# కు

కుంక. దే. వి. బాలవిధవ.
కుంకుమ. దే. వి. ముత్తైదువలు నొసటఁ బెట్టుకొను నెఱ్ఱనిపొడి.
కుంకుమపువ్వు. దే. వి. ఒకానొకయంగడిదినుసు.
కుంకుమము. త్స. వి. కుంకుమపువ్వు.
కుంచిక. త్స. వి. తాళపుఁజెవి.
కుంచియ. / కుంచె. దే. వి. ౧. కుచ్చు. ౨. చిత్రము వ్రాసెడియాక. 3. చామరము. ౪. కుచ్చెపెట్టినవస్త్రము.
కుంచెము. దే. వి. నాలుగుముంతల కొలఁత.

కుంచు. దే. వి. క్రుంగఁ జేయు.
కుంజము. త్స. వి. పొదరిల్లు.
కుంజరము. త్స. వి. ఏనుఁగు.
కుంట. దే. వి. ౧. సరస్సు. ౨. పల్లము. 3. చెఱువు. ౪. భూమికొలఁతలో నుపయోగించెడి సంజ్ఞ.
కుంటి. దే. విణ. కాలులేనివాఁడు.
కుంటు. దే. క్రి. కాలు నేలపైఁ జక్కఁగ మోపలేక నడచు. విణ. కుంటివాఁడు.
కుంటుపడు. దే. క్రి. ౧. కుంటియగు. ౨. చెడు. 3. తగ్గు.
కుంటువాఱు. దే. క్రి. బలహీనమగు.
కుంటెన. వై. వి. తార్చెడువాఁడు.
కుంటెనకత్తె. వై. వి. తార్చునట్టి స్త్రీ.
కుంటెనకాఁడు. } వై. వి. చూ. కుంటెన.
కుంటెనీఁడు. }
కుంఠనము. త్స. వి. మొక్కవోవుట.
కుండ. దే. వి. ౧. పనఁటి. ౨. ఇరుసు తగిలించెడి బండికంటినడిమిగబ్బి.
కుండగోఁకరి. దే. వి. వంటవాఁడు.
కుండమార్పు. దే. వి. వినిమయము.
కుండము. త్స. వి. ౧. జలాశయము. (అగస్త్యకుండము.) ౨. నిప్పుల గుండము.
కుండలము. త్స. వి. ౧. పోఁగులు. ౨. త్రాడు. 3. గుండ్రని.
కుండలి. త్స. వి. ౧. పాము. ౨. కుండలాకారనృత్యము.
కుండలించు. త్స. క్రి. సున్నచుట్టు.
కుండు. దే. వి. మొక్కలువేయు మట్టిపాత్రము.
కుండుఁడు. త్స. వి. మగఁడు బ్రతికియుండగా అంకుమగనికిఁ బుట్టిన కొడుకు.
కుంతము. త్స. వి. బల్లెము.
కుంతలము. త్స. వి. ౧. నాఁగలి. ౨. వెండ్రుక.
కుంతి. త్స. వి. పాండురాజుపెండ్లాము. ధర్మజ భీమార్జునులతల్లి.
కుందనము. దే. వి. అపరంజి.
కుందము. త్స. వి. మొల్ల.
కుంది. దే. వి. ఱాయి మొదలగువానిచేఁ జేయఁబడినకుదురు. రూ. కుందెన.
కుందు. దే. క్రి. ౧. క్రుంగు. ౨. తగ్గు. 3. వ్యసనపడు. ౪. ఒంటికాలితో నడచు. వి. ౧. దుఃఖము. ౨. తక్కువ. 3. శోకము.
కుందెన. దే. వి. ౧. ఱోలుగుంట. ౨. కుంది.
కుందేలుఁ. } దే. వి. చెవులపోతు.
కుందేలు. }
కుందేటికొమ్ము. దే. విణ. (అసంభవమును దెలుపును.) శశవిషాణము.
కుంపటి. దే. వి. నిప్పులుంచుపాత్రము.
కుంభకారుఁడు. త్స. వి. కుమ్మరి.
కుంభము. త్స. వి. ౧. ఏనుఁగు కుంభస్థలము. ౨. కుండ.

కుంభసంభవుఁడు. త్స. వి. ౧. అగస్త్యుఁడు. ౨. ద్రోణుఁడు.
కుంభి. త్స. వి. ఏనుఁగు.
కుంభించు. త్స. క్రి. ఊపిరిబిగఁబట్టు.
కుంభిని. త్స. వి. భూమి.
కుక్క. దే. వి. శునకము.
కుక్కగొడుగు. దే. వి. పుట్టగొడుగు.
కుక్కి. దే. వి. ౧. లోఁతైనకుక్కినూయి. ౨. త్రాళ్ళు సళ్ళుపడి పల్లమైన మంచము.
కుక్కుటము. త్స. వి. ౧. కోడి. ౨. కుక్క.
కుక్షి. త్స. వి. కడుపు.
కుక్షింభరి. త్స. విశ. పొట్టనింపుకొనువాఁడు.
కుగ్రామము. త్స. వి. పల్లెటూరు.
కుచము. త్స. వి. స్తనము.
కుచ్చెల. దే. వి. అవికె.
కుచ్చితము. వై. విశ. కుత్సితము.
కుచ్చితుఁడు. వై. విశ. చెనఁటి.
కుచ్చెళ్ళు. వై. వి. బ. ఆఁడుదానికోకకుచ్చెలు.
కుచ్చు. వై. వి. ౧. పట్టులో నగువాని కుచ్చు. ౨. గుత్తి.
కుజనుఁడు. త్స. విశ. దుర్జనుఁడు.
కుజము. త్స. విశ. చెట్టు.
కుజుఁడు. త్స. వి. భూపుత్త్రుఁడు.
కుటజము. త్స. వి. కొండమల్లె.
కుటి. త్స. వి. గుడిసె.
కుటిలము. త్స. విశ. వంకరయైనది.
కుటీచకుడు. త్స. వి. గుడిసెలోనుండుట వలననే తృప్తుఁడగు సన్న్యాసి.
కుటీరము. త్స. వి. గుడిసె.
కుటుంబము. త్స. వి. భార్య శిశువులు లోనగువారు. (పోష్యవర్గము.)
కుటుంబిని. త్స. వి. మగఁడు, బిడ్డలును గలస్త్రీ.
కుట్టడము. దే. వి. కుట్టుపని.
కుట్టనము. త్స. వి. ఛేదనము.
కుట్టని. త్స. వి. ౧. కుంటెనకత్తె. ౨. కత్తిపీఁట.
కుట్టిమము. త్స. వి. నెలకట్టు (రాయి పఱచిన నేల.)
కుట్టు. దే. క్రి. ౧. ఆకులుకుట్టు. ౨. గుడ్డలుకుట్టు. 3. తేలు లోఁగునవి
కుట్టు. దే. వి. ౧. కడుపు నొప్పి. ౨. పొయిలోఁ గ్రిక్కిటిసి యుండు బూడిదలోనగునది. 3. కుట్టుడు.
కుట్మలము. త్స. వి. మొగ్గ. (పని.
కుట్ర. దే. విశ. (ద్రోహబుద్ధితోఁ జేసెడు
కుట్రపువాఁడు. దే. వి. దర్జి.
కుఠారము. త్స. వి. గండ్రగొడ్డలి.
కుడి. దే. వి. కుడుపు. విశ. అపసవ్యము. (కుడిచేయి. కుడివైపు.)
కుడినీరు. దే. వి. త్రావఁదగిన జలము.
కుడుచు. దే. క్రి. ౧. అనుభవించు. ౨. త్రాగు. 3. భుజించు. రూ. కుడ్చు.

కుడుపరి. దే. విశ. తినువాఁడు.
కుడుపు. దే. క్రి. కుడువఁజేయు. (కట్టి కుడుపు = తప్పకుండ అనుభవింపఁ జేయు.)
కుడుము. దే. వి. భక్ష్యవిశేషము.
కుడ్యము. త్స. వి. గోడ.
కుతపము. త్స. వి. ౧. దర్భ. ౨. కంబళి. 3. పగటఁ బదునేను భాగములలో నెనిమిదవ భాగము.
కుతి. దే. వి. శోకము.
కుతిక. దే. వి. చూ. కుత్తిక.
కుతిలగొను. దే. క్రి. దుఃఖపడు.
కుతుక. దే. వి. మెడ. (రూ. కుత్తుక.)
కుతుకము. / కుతూహలము. త్స. వి. అనుభవింపని కోరికయందలియాశ.
కుత్స. త్స. వి. నింద.
కుత్తిక. దే. వి. గొంతు. (రూ. కుతిక)
కుత్సితము. త్స. విశ. నిందితము.
కుథ. త్స. వి. ఏనుఁగుపై పఱచు చిత్రకంబళము.
కుదించు. దే. క్రి. కుదియించు.
కుదికిలఁబడు. / కుదికిలు. దే. క్రి. ముఖము పైకెత్తుకొని ముడ్డి నేల మోవ గొంతు గూర్చుండు.
కుదిమట్టము. దే. వి. పొట్టిగాఁ బుష్టిగా నున్నది.
కుదియు. దే. క్రి. ౧. అడఁగు. ౨. కుంగు. 3. తగ్గు.
కుదిరిక. దే. వి. ౧. అమరిక. ౨. నిలుకడ. 3. నెమ్మది.
కుదుపు. దే. క్రి. చలించు. వి. చలనము.
కుదురు. దే. క్రి. ౧. అనుకూల మగు. ౨. స్థిరమగు. 3. స్వస్థమగు. వి. ౧. అమరిక. ౨. అగసాలె వాని కుంపటి. 3. నిలుకడ. ४. నెమ్మది.
కుదురుకొను. దే. క్రి. నెలకొను. స్థిరపడు.
కుదులు. దే. క్రి. చలించు. అదరు.
కుదువ. దే. వి. తాకట్టు.
కుధరము. త్స. వి. కొండ.
కునుకు. దే. వి. తూఁగు.
కుపథము. త్స. వి. చెడుదారి.
కుపితుఁడు. త్స. విశ. కోపించినవాఁడు.
కుప్ప. దే. వి. ౧. వస్త్రకుప్ప. ౨. వెంటకుప్ప. (కుప్పతెప్పలుగా = ప్రోగులు ప్రోగులుగా.)
కుప్పగూలు. దే. క్రి. కుప్పగాఁబడు.
కుప్పసగూరలు. దే. విశ. కుప్పలు కుప్పలుగా. రూ. కుప్పఁగూరలు.
కుప్పసము. దే. వి. ౧. చొక్కా. ౨. అవిక. 3. పాముకుబుసము. ४. కవచము.
కుప్పిగంతుకొను. దే. క్రి. దుముకు.
కుబుసము. దే. వి. చూ. కుప్పసము.
కుబేరుఁడు. త్స. వి. అష్టదిక్పాలురలో నొకఁడు.
కుబ్జము. త్స. వి. గూనువాఁడు.

కుమారి. త్స. వి. ౧. కూఁతురు. ౨. కన్యక. 3. పార్వతి.
కుమారిల్లు. దే. క్రి. లోలోపలఁ దపించు.
కుముదము. త్స. వి. తెల్లకలువ.
కుముదిని. త్స. వి. తెల్లకలువదీగ.
కుముద్వతి. త్స. వి. ,,
కుమారుఁడు. త్స. వి. ౧. బాలుఁడు. ౨. కుమారస్వామి. 3. కొడుకు.
కుములు. దే. క్రి. లోలోపలఁ దపించు.
కుమ్మర. దే. వి. కుండలు చేయునట్టి జాతి. రూ. కుమ్మరి.
కుమ్మరపురుగు. దే. వి. ఒకానొక పురుగు.
కుమ్మరిలు. దే. క్రి. నీళ్లు మొదలగునవి కుండనుండి క్రిందికిదొరలు. ౨. రాలు.
కుమ్ము. దే. క్రి. ౧. నలియఁగొట్టు. ౨. పొడుచు. వి. పొట్టునిప్పు.
కుమ్ములాడు. దే. వి పోట్లాడు.
కుయి. } వి. ౧. మొఱ. ౨. రక్షణము.
కుయ్యి. }
కుయిపోవు. దే. క్రి. రక్షకముగాఁబోవు.
కురంగనాభి. త్స. వి. కస్తూరి.
కురంగము. త్స. వి. ౧. జింక. ౨. కోఁతి.
కురిచీ. దే. వి. కూర్చుండునట్టి యున్నత పీఠము.
కురిడి. (కురిడీ). దే. వి. లోపల నీరింకిన కొబ్బెర.

కురియు. దే. క్రి. వర్షించు.
కురులు. దే. వి. బ. ౧. ముంగురులు. ౨. వెండ్రుకలు.
కురువ. దే. వి. కొండమీఁద నేర్పడిన త్రోవ.
కురువర్షము. త్స. వి. ఉత్తరకురుభూమి.
కురువు. త్స. వి. ఒకానొక చంద్రవంశపురాజు.
కురువేరు. దే. వి. ఒకానొక వేరు.
కురూపము. త్స. వి. వికృతరూపము.
కుర్కురము. త్స. వి. కుక్క.
కుర్పరము. త్స. వి. ౧. మోఁచేయి. ౨. మోఁకాలు.
కుఱఁగలి. దే. వి. దగ్గఱ.
కుఱకుఱ. దే. విశ. అత్యల్పము (కుఱకుఱదాత.)
కుఱుచ. దే. వి. హ్రస్వస్వరము. విశ. హ్రస్వము.
కుఱుచకావించు. దే. క్రి. తక్కువపఱచు.
కుఱుచచేయు. దే. క్రి. ,,
కుఱుచపడు. దే. క్రి. తగ్గు.
కుఱుపు. దే. వి. పుండు.
కుఱుమట్టము. దే. వి. పొట్టిగాఁ బుష్టిగా నున్నది.
కుఱుమాడు. దే. వి. ఇంటిమూలకప్పు.
కుఱువు. దే. వి. తొడ.
కుఱ్ఱ. దే. వి. ౧. కొడుకు. విశ. ౨. చిన్న. (అల్లుఁగుఱ్ఱ; కొడుకుఁగుఱ్ఱ. మొ॥)

కుట్టుఁడు. దే. వి. ౧. కొడుకు. ౨. బాలుఁడు.
కుత్తి. దే. వి. ఆవు. (వలపులకుత్తి = కామధేనువు.)
కులట. త్స. వి. అంకుటాలు.
కులదేవత. త్స. వి. ఇలువేల్పు.
కులపర్వతము. త్స. వి. ముఖ్యమైన పర్వతము. (ఇవియేడు. ౧. మహేంద్రము. ౨. మలయము. ౩. సహ్యము. ౪. శుక్తిమంతము. ౫. గంధమాదనము. ౬. వింధ్యము. ౭. పారియాత్రము.)
కులపాలిక. త్స. విశే. మంచికులముగల స్త్రీ. కులస్త్రీ.
కులము. త్స. వి. ౧. వంశము. ౨. తెగ. ౩. ఇల్లు.
కులాయము. త్స. వి. గూడు.
కులాలుఁడు. త్స. వి. కుమ్మరివాఁడు.
కులిశము. త్స. వి. వజ్రాయుధము.
కులీనుఁడు. త్స. విశే. మంచివంశమునందుఁ బుట్టినవాఁడు.
కులుకు. దే. క్రి. ౧. అందముగఁ గదలు. ౨. ప్రూయు. ౩. పోయు. వి. అందము.
కులుకులాఁడి. దే. వి. కులుకుగల స్త్రీ.
కుల్య. త్స. వి. కాలువ.
కువ. దే. వి. కుప్ప.
కువలయము. త్స. వి. ౧. కలువ. ౨. భూమి.
కువాదము. దే. వి. కుత్సితపువాదము.
కువాళము. వై. వి. కపటచేష్ట; విశే. కపటి.
కువిందుఁడు. త్స. వి. సాలెవాఁడు.
కువ్వ. దే. వి. కుప్ప. రూ. కువ.
కువ్వాడము. వై. వి. కపటము. రూ. కువాడము.
కుశ. త్స. వి. దర్భ.
కుశలము. త్స. వి. ౧. క్షేమము. ౨. పర్యాప్తి. ౩. పుణ్యము.
కుశాగ్రబుద్ధి. త్స. విశే. చుఱుకైన బుద్ధిగలవాఁడు.
కుశాగ్రీయము. త్స. విశే. కుశాగ్రము వంటిది.
కుశాసనము. త్స. వి. దర్భాసనము.
కుశీలవుఁడు. త్స. వి. నటుఁడు.
కుశేశయము. త్స. వి. తామర.
కుష్ఠము. త్స. వి. ఒకవిధమైనరోగము.
కుసిగుంపు. దే. వి. శ్రమ. బాధ.
కుసిగుంపునడక. దే. వి. మందగమనము; అలసగమనము.
కుసిదము. దే. వి. వడ్డి. రూ. కుసీదము.
కుసీదకుఁడు. త్స. విశే. వడ్డివ్యాపారము చేయువాఁడు.
కుసుంబా. దే. వి. ఎఱుపుమించిన పసుపువన్నె.
కుసుమ. దే. వి. ,,
కుసుమము. త్స. వి. పువ్వు. దే. వి. కుసుమరంగు.

కుసుమించు. త్స. క్రి. పుష్పించు.
కుస్తరించు. దే. క్రి. ౧. ఊఱడించు. ౨. సమాధానపఱచు. 3. లాలించు.
కుస్తరింపు. దే. వి. ఉల్లాసము.
కుహకుఁడు. త్స. విశ. మాయగాఁడు.
కుహన. త్స. వి. మాయ. కపటము.
కుహరము. త్స. వి. గుహ.
కుహూవు. త్స. వి. చంద్రకళ గానరాని అమావాస్య.
కుళ్లాయ. దే. వి. టోపి. రూ. కుళాయ. కుళ్లా. కుల్లా.
కుళ్లు. దే. క్రి. ౧. ముఱుగు. ౨. దుఃఖించు.
కుళ్లుపోతు. దే. విశ. దుఃఖించు స్వభావము కలవాఁడు.

## కూ

కూఁక. దే. వి. ౧. అఱపు. ౨. ఆర్త ధ్వని.
కూఁకటి. దే. వి. ౧. జుట్టు. ౨. పిల్ల జుట్టు. విశ. ప్రధానము. (కూఁకటి వేరు, కూఁకటిప్రాయము, కూఁకటి రత్నము.)
కూఁకటులు గొలిచిచేయు. దే. క్రి. జుట్లు కొలిచి పెండ్లిచేయు.
కూఁకు. దే. క్రి. క్రుంకు.
కూఁత. దే. వి. ౧. అఱపు. ౨. ఆర్తధ్వని.
కూఁతనేల.
కూఁతపట్టు. } దే. వి. కోసునేల.
కూఁతవేటు.
కూఁతురు. దే. వి. కుమార్తె.
కూకులు వత్తులు. దే. విశ. చెల్లా చెదరైనది; కలతనొందినది.
కూచి. దే. విశ. వాఁడి. వి. శౌర్యము. వాఁడిమి.
కూచిచేయు దే క్రి. దండువెడలు. రూ. కూచీచేయు.
కూచిమారము. త్స. వి. పోకిరిపనులు.
కూచము. దే. వి. ౧. పట్టికాగ్రము. ౨. స్తంభము.
కూజితము. త్స. వి. అవ్యక్తధ్వని.
కూటమి. దే. వి. కూడిక.
కూటము. దే. వి. ౧. చావడి. ౨. కొలువుకూటము. త్స. వి. ౧. బాణము. ౨. కపటము. 3. కత్తి. ౪. ఇల్లు. రూ. కూటాము.
కూటముత్యము. మి. వి. కృత్రిమ మౌక్తికము.
కూటసాక్షి. త్స. వి. తప్పు సాక్ష్యము చెప్పువాఁడు.
కూటస్థుఁడు. త్స. విశ. వంశమునకు మూలపురుషుఁడు.
కూటువ. } దే. వి. ౧. గుంపు. ౨. ప్రోగు. 3. సేన.
కూటువు.
కూటువలుగొను. దే. క్రి. గుంపులుగొను.
కూడ. దే. అవ్య. సయితము. సైతము.
కూడఁబడు. దే. క్రి. కూడు.

కూడఁబాఱు. దే. క్రి. కలిసికొను.
కూడముట్టు. దే. క్రి. తఱుముకొనిపోవు.
కూడలి. దే. వి. నద్యాదులు కలిసినచోటు.
కూడిక. దే. వి. చేరిక.
కూడిమాడు. దే. క్రి. ౧. కలసి మెలసి యుండు. ౨. రమించు.
కూడివచ్చు. దే. వి. లాభించు.
కూడు. దే. క్రి. ౧. తగు ౨. పొందు. వి. అన్నము.
కూడుదల. దే. వి. లాభము.
కూన. దే. వి. ౧. పిల్ల. ౨. బిడ్డ. (నెల కూన; లతకూన.)
కూనరాగము. దే. వి. లోలోపల. మెల్లఁగాఁ బాడుకొనురాగము.
కూపకూర్మము. త్స. వి. నూతిలోని తాఁబేలు.
కూపమండూకము. త్స. వి. నూతిలోని కప్ప.
కూపము. త్స. వి. ౧. బావి. ౨. చెలమ.
కూపి. త్స. వి. చిన్నబావి.
కూపెట్టు. దే. క్రి. అఱచు. మొఱపెట్టు.
కూయి. దే. వి. ౧. మొఱ. ౨. రక్షణము.
కూయిడు. దే. క్రి. మొఱపెట్టు.
కూయు. దే. క్రి. అఱచు.
కూర. దే. వి. శాకము.
కూరాకుచేయు. దే. క్రి. వధించు.
కూరిమి. దే. వి. చెలిమి. (రూ. కూర్మి) విశ. చెలిమిగలది.
కూరు. దే. క్రి. ౧. కలుగు. ౨. పొందు.
కూరుకు. దే. క్రి. నిద్రించు. వి. నిద్ర. రూ. కూర్కు.
కూరుకుపాటు. దే. వి. కునికిపాటు.
కూరుకొను. దే. క్రి. దిగఁబడు. రూ. కూర్కొను.
కూరుచు. దే. క్రి. ౧. కూడఁబెట్టు. ౨. కలుపు. 3. సంధించు.
కూరుచుండు. దే. క్రి. కూలఁబడు. రూ. కూర్చుండు. కూర్చుండఁబడు.
కూర్చము. త్స. వి. ౧. కుశముష్టి. ౨. పెరిగిన గడ్డము. మీసము.
కూర్చిక. త్స. వి. కుంచె.
కూర్పరము. త్స. వి. ౧. మోచేయి. ౨. మోకాలు.
కూర్పరి. దే. విశ. కూర్చువాఁడు.
కూర్పాసము. త్స. వి. ౧. రవికె. ౨. కంచుకము.
కూర్మము. త్స. వి. తాఁబేలు.
కూలంకష. త్స. వి. నది. విశ. ఒడ్డు లోరయునది.
కూలము. త్స. వి. ౧. దరి. ౨. గుంట. 3. మట్టిదిబ్బ.
కూలముద్రుజము. త్స. విశ. ఒడ్డును భేదించునది.
కూలి. దే. వి. ౧. పనిచేసినవాని కిచ్చెడు ధనము. ౨. పన్ను.
కూలు. దే. క్రి. పడు. ౨. విఱుగు. 3. మరణించు.

కూలుచు. దే. క్రి. ౧. చంపు. ౨. పడఁజేయు. రూ. కూల్చు.
కూష్మాండము. త్స. వి. గుమ్మడి.
కూసము. దే. వి. కుబుసము. చొక్కా.
కూళ. దే. విణ. క్రూరుఁడు. రూ. కూళఁడు.
కూళుఁడు. దే. విణ. ౧. కుత్సితుఁడు. ౨. మూఢుఁడు.
కూళమారి. దే. వి. ,,

# కృ

కృకలాసము. త్స. వి. తొండ.
కృకవాకువు. త్స. వి. కోడి.
కృచ్ఛ్రము. త్స. విణ. కష్టమైనది.
కృతకము. త్స. విణ. కల్పితము.
కృతకృత్యుఁడు. త్స. విణ. కార్యమును సాధించినవాఁడు.
కృతఘ్నుఁడు. త్స. విణ. చేసినమేలు మఱచినవాఁడు.
కృతజ్ఞుఁడు. త్స. విణ. చేసినమేలు దలఁచువాఁడు
కృంగడు. మి. క్రి. కడచు.
కృతముఖుఁడు. త్స. వి. విద్వాంసుఁడు.
కృతము. త్స. విణ. చేయఁబడినది.
కృతయుగము. త్స. వి. నాలుగు యుగములలో నిందొకటి.
కృతవేది. త్స. విణ. కృతజ్ఞుఁడు
కృతాంతుఁడు. త్స. వి. యముఁడు.
కృతార్థుఁడు. త్స. విణ. కృతకృత్యుఁడు.
కృతి. త్స. వి. ౧. కావ్యము. ౨. చేయుట. 3. కుశలుఁడు. ౪. ధన్యుఁడు.
కృత్తము. త్స. విణ. ఛేదింపఁబడినది.
కృత్తి. త్స. వి. చర్మము.
కృత్తిక. త్స. వి. ఒకానొక నక్షత్రము.
కృత్తివాసుఁడు. త్స. వి. శివుఁడు.
కృత్యము. త్స. వి. పని.
కృత్రిమము. త్స. విణ. కల్పితము.
కృత్స్నము. త్స. విణ. సమస్తము.
కృప. త్స. వి. దయ.
కృపణుఁడు. త్స. వి. ౧. లోభి. ౨. కుత్సితుఁడు. 3. బీద.
కృపాణము. త్స. వి కత్తి. (రూ.) కృపాణి.
కృపాళువు. త్స. విణ. దయగలవాఁడు.
కృపీటము. త్స. వి. జలము.
కృమి. త్స. వి. పురుగు.
కృమిణము. త్స. విణ. పురుగులు గలది.
కృశము. త్స. విణ. చిక్కినది.
కృశానువు. త్స. వి. అగ్ని.
కృశింయించు. త్స. క్రి. క్షీణించు.
కృషకుఁడు. త్స. విణ. కర్షకుఁడు.
కృషాణుఁడు. త్స. విణ. ,,
కృషి. త్స. వి. సేద్యము.
కృషికుఁడు త్స. విణ. సేద్యగాఁడు.

కృషీవలుఁడు. త్స. విణ. సేద్యగాడు.
కృష్ణ. త్స. వి. ౧. ఒకనది. ౨. ద్రౌపది. విణ. నలుపు.
కృష్ణద్వైపాయనుఁడు.త్స.వి.వ్యాసుఁడు.
కృష్ణుఁడు. త్స. వి. ౧. విష్ణువు. ౨. అర్జునుఁడు. 3. వ్యాసుఁడు.

# కె

కెందమ్మి. దే. వి. ఎఱ్ఱదామర.
కెందామఱ. దే. వి. ,,
కెందొగ. } దే. వి. ఎఱ్ఱకలువ.
కెందొవ. }
కెంపు. దే. వి. ౧. నవరత్నములలో ఒకటి. ౨. ఎఱుపు.
కెడ. దే. వి. ప్రక్క. (కెడగూడు = ప్రక్కనుండు.)
కెడయు. దే. క్రి. ౧. పడు. ౨.చచ్చు.
కెడవు. దే. విణ. ప్రక్కకు ఒఱిగినది. (తలకెడవుగన్ = తలక్రిందుగా.)
కెరలియాడు. దే. క్రి. ఉత్సహించు.
కెరలు. దే. క్రి. ౧. రేఁగు. ౨. కోపగించు. 3. పొంగు. ౪. కూయు.
కెలఁకు. దే. క్రి. ౧. కలవెట్టు. ౨. పెల్లగించు. వి. పార్శ్వము.
కెలను. దే. వి. ౧. వైపు. ౨. దిక్కు. రూ. కెలఁకు.
కెలయు. దే. క్రి. చెలరేఁగు. ౨. ఉత్సహించు.
కెలవు. దే. వి. అనురాగము.
కెలసము. దే. వి. ౧. పని. ౨. సేవ. 3. నిమిత్తము.
కెల్లగించు. దే. క్రి. పెల్లగించు.
కెళవు. దే. వి. ౧. ప్రక్క. ౨. దూరము.

# కే

కేంద్రము. త్స. వి. వృత్తములోని మధ్య భాగము.
కేక. దే.వి.౧.పెద్దకూఁత.౨.నెమిలికూఁత.
కేకరాక్షుఁడు. త్స. విణ. మెల్లకంటి వాఁడు.
కేకరించు. దే. క్రి. ౧. కేకలువేయు. ౨. సకిలించునట్లు శబ్దించు. 3. కడగన్నువెట్టు.
కేకావలము. త్స. వి. నెమిలి.
కేకి. త్స. వి. నెమిలి.
కేకిసలాడు. దే. క్రి. చప్పట్లుగొట్టి నవ్వు.
కేకిసలు. దే. వి. బ. ౧. చప్పట్లు. ౨. అంజలులు.
కేకిసలుగొట్టు. దే. క్రి.చప్పట్లుగొట్టు.
కేటాయించు. దే. క్రి. వేఱుపఱచు.

కేడించు. దే. క్రి. ౧. తొలఁగించు. ౨. సరకుగొనకుండు.
కేడెము. దే. వి. డాలువాలు. రూ. కేవడము.
కేతకము. త్స. వి. మొగలిపువ్వు.
కేతకి. త్స. వి. గేదగిచెట్టు.
కేతనము. త్స. వి. ౧. ఇల్లు. ౨. ధ్వజము. 3. చాపము.
కేతువు. త్స. వి. ౧. నవగ్రహములలో ఒకటి. ౨. టెక్కెము.
కేదరము. } కేదారము. } త్స. వి. ౧. వరిమడి. ౨. పాదు.
కేనిపాతము. త్స. వి. ఓడతెడ్డు.
కేయూరము. త్స. వి. భుజకీర్తి.
కేరడము. దే. వి. ౧. పరిహాసము. ౨. తిరస్కారము. 3. చతురోక్తి.
కేరడించు. దే. క్రి. పరిహసించు.
కేరించు. దే. క్రి. చెలరేఁగు.
కేరింత. దే. వి. నవ్వు.
కేరింతలుగొట్టు. దే. క్రి. ఉత్సాహముతోఁ గేకలువేయు.
కేరికొను. దే. క్రి. ఉత్సాహముతోఁ జెప్పుకొను.
కేరు. దే. క్రి. ౧. ఉత్సహించు. ౨. కుతూహలపడు. 3. తిరస్కరించు. ౪. గేలిసేయు. ౫. రేఁగు. వి. కేరుపు.
కేలు. దే. వి. ౧. చేయి. ౨. తొండము.
కేలుదండ. దే. వి. కైదండ.
కేవలము. త్స. విణ. మరియొకదానితోఁ గలియనిది.
కేవు. దే. వి. ఓడ కిచ్చెడుకూలి.
కేశపాశము. త్స. వి. కేశపక్షము.
కేశబంధము. త్స వి. క్రొమ్ముడి.
కేశము. త్స. వి. వెండ్రుక.
కేశవుఁడు. త్స. వి. విష్ణువు. (వ్యు. కేశి యను రాక్షసునిఁ జంపినవాఁడు.)
కేశవేశము. త్స. వి. కేశబంధము.
కేశహస్తము. త్స. వి. ,,
కేశాకేశి. త్స. వి. ఒండొరుల వెండ్రుకలను బట్టుకొని చేయునది.
కేసరము. త్స. వి. ౧. సింహము, మొదలగు వానిజూలు. ౨. కింజల్కము.
కేసరి. త్స. వి. సింహము. వ్యు. కేసరములుకలది.
కేళాకూళి. దే. వి. క్రీడాసరస్సు. రూ. కెళకుళి. కెళాకుళి, కెళాకూళి, కేళకుళి.
కేళి. త్స. వి. ౧. ఆట. ౨. విహారక్రీడ.
కేళిక. దే. వి. ౧. కేళి. ౨. నృత్యము.

## కై

కైంకర్యము. త్స. వి. ౧. సేవ. ౨. దాస్యము.
కైక. దే. వి. భరతునితల్లి.
కైకట్టు. దే. వి. సందర్భము.

కైకొను. దే. క్రి. ౧. పూను. ౨. లక్ష్యపెట్టు. ౩. గ్రహించు.
కైకోలు. దే. వి. అంగీకారము.
కైచాఁపులు. దే. వి. నమస్కృతి.
కైటభారి. త్స. వి. విష్ణువు.
కైత. దే. వి. కయిత. కవిత్వము. విణ. కైతగాఁడు.
కైతవము. త్స. వి. ౧. కపటము. ౨. జూదము.
కైదండ. దే. వి. చేయూఁత.
కైదువు. దే. వి. ఆయుధము.
కైపు. దే. వి. ౧. ఒడలు తెలియమి. ౨. అందము.
కైరవము. త్స. వి. తెల్లగలువ.
కైరవిణి. త్స. వి. తెల్లగలువతీఁగె.
కైలాగు. దే. వి. చేయూఁత.
కైలాటము. దే. వి. మాయ. మోసము. వి. కైలాటకాఁడు.
కైలాసము. త్స. వి. ౧. శివునివాసస్థానము. ౨. మంచుకొండలలో నొకానొక శిఖరము.
కైవడి. దే. వి. ౧. చేతవడి. ౨. రీతి.
కైవర్తుఁడు. త్స. వి. జాలరి.
కైవల్యము. త్స. వి. ౧. కేవలత్వము. ౨. నిర్యాణము.
కైవసము. దే. విణ. హస్తగతము.
కైవారము. దే. వి. పొగడ్త.
కైవాలు. దే. క్రి. ఒఱగు.
కైసరుఁడు. దే. వి. కవీశ్వరుఁడు.
కైసేఁత. దే. వి. అలంకారము.

## కొ

కొంకనక్క. దే. వి. పిటికినక్క.
కొంకర. వి. వంపు. వంకరకొంకరమాటలు.
కొంకరలు వోవు. దే. క్రి. మిక్కిలి చలిచేఁ గాలుసేతులు మున్నగునవి నిగిడికొను.
కొంకి. దే. వి. వంపుచీల.
కొంకు. దే. క్రి. ౧. సంకోచించు. ౨. భయపడు. వి. ౧. భయము. ౨. వెనుదీయుట. ౩. సంకోచము. వి. కొంకుపాటు.
కొంకులువోవు. దే. క్రి. కొంకరలువోవు.
కొంగ. దే. వి. బకము.
కొంగు. దే. వి. గుడ్డయొక్క చెఱఁగు.
కొంగుపఱచు. దే. క్రి. రతికి సిద్ధమగు.
కొంగుపసిఁడి. దే. వి. కొంగునఁ గట్టిన పసిఁడి. (సులభసాధ్యము.)
కొంగుబంగారము. దే. వి. ,,
కొంగుమాయు. దే. క్రి. బైటఁజేరు.
కొంగొడ్డు. దే. క్రి. రతికి సిద్ధమగు.
కొంచియము. } వై. వి. తక్కువ. విణ.
కొంచెము. } అల్పము.
కొంచెపడు. దే. క్రి. సన్నగిల్లు.
కొంచు. దే. క్రి. సంకోచించు. వి. సంకోచము.

కొంటె. దే. వి. దుష్టుఁడు; ధూర్తుఁడు.
కొండ. దే. వి. పర్వతము.
కొండకాలువ. దే. వి. సెలయేఱు.
కొండగుఱుతు. దే. వి. సామాన్యలక్షణము.
కొండచిలువ. దే. వి. కొండపాము.
కొండనాలుక. దే. వి. చిఱునాలుక.
కొండపలుకు. దే. వి. పర్వతబిలమునందలి ప్రతిధ్వని.
కొండముచ్చు. దే. వి. నల్లనిమూఁతి గల కోఁతి.
కొండాటము. దే. వి. కలహము.
కొండాడు. దే. క్రి. పొగడు.
కొండి. దే. వి. ౧. తేలుతోఁక. ౨. ఇనుపగొళ్లెము.
కొండిక. దే. వి. బాలుఁడు.
కొండియము. దే. వి. చాడి. రూ. కొండెము.
కొండియుఁడు. } దే. విణ. కొండెము
కొండెకాఁడు. } చెప్పువాఁడు. రూ. కొండీఁడు.
కొండెలమారి. దే. వి. చాడీగొట్టు.
కొండొక. దే. విణ. ౧. కొంచెము. ౨. చిన్న. వి. బాలుఁడు.
కొంద్రె. దే. వి. పొలము.
కొంత. దే. స. ఇంచుకొలఁది.
కొంతము. దే. వి. ఈఁటె.
కొందలపడు. దే. క్రి. కలఁతపడు. వి. కొందలపాటు.
కొందలము. దే. వి. కలఁత.
కొందాఁక. దే. అవ్య. కొంతదాఁక.
కొంప. దే. వి. ఇల్లు.
కొంపోవు. దే. క్రి. తీసికొనిపోవు.
కొకిబికి. దే. విణ. సొగసులేని.
కొక్కరాయి. దే. వి. కొంగ.
కొక్కరించు. దే. క్రి. బెదిరించు; వెక్కరించు.
కొక్కి. దే. వి. విషమస్థితి.
కొక్కిరిబిక్కిరి. దే. వి. చీఁకిలి మాకిలి.
కొక్కు. దే. వి. పందికొక్కు.
కొక్కెర. దే. వి. కొంగ.
కొక్కొరొకో. } దే. వి. కోడికూఁత
కొక్కొరొకో. }
కొజ్జా. దే. వి. రాణివాసపు కావలివాఁడు.
కొటారము. దే. వి. ౧. కళ్లము ౨. కొట్టు.
కొట్టుకొన. దే. వి. అన్నిటికిఁ గొన
కొట్టుడి. దే. వి. సామగ్రి ... చెడగది.
కొట్టము. దే. వి. పసులు ... వానిని గట్టెడు తావు. రూ. కొట్టాము.
కొట్టాడు. దే. క్రి. ౧. జగడ మాడు. ౨. బాధపడు.
కొట్టు. దే. క్రి. దెబ్బవేయు. వి. ౧. దెబ్బ. ౨. సామగ్రి ... చెడగది.
కొట్టుమిట్టాడు. దే. క్రి. ... చు.

కొట్టులాడు. దే. క్రి. జగడమాడు. వి. కొట్టులాట, కొట్లాట.

కొడవలి. దే. వి. పండినపైరుగాని పచ్చిగడ్డిగాని కోయుటకుపయోగపడు సాధనము.

కొడి. దే. వి. దీపశిఖ.

కొడిమె. దే. వి. అపనింద.

కొడిమెలాఁడు. దే. విణ. పాపాత్ముఁడు.

కొడుకఁడు. దే. వి. బాలుఁడు.

కొడుకు. దే. వి. కొడుకు. రూ. కొడ్కు.

కొణిఁగె. దే. వి. కుప్ప. దిబ్బ.

కొణిగ. దే. వి. వాచూరు. చూరు.

కొతుకు. దే. క్రి. ౧. అక్షరము లోపించి మాట్లాడు. ౨. సంకోచించు. వి. ౧. అక్షరము లోపించినమాట. ౨. సంకోచము. క్రి. కొతుకుపడు. రూ. కొదుకు.

కొదమ. దే. వి. ౧. పశుపక్షిమృగాదులపిల్ల. ౨. పడుచుది. (కొదమపులి.)

కొదమపిడుగు. దే. వి. తీక్ష్ణమైన పిడుగు.

కొదవ. దే. వి. కొఱఁత.

కొదుకు. దే. క్రి. కొతుకు. వెనుదీయు.

కొద్ది. దే. వి. కొలఁది.

కొన. దే. వి. చివర. తుద.

కొనకొను. దే. క్రి. యత్నించు.

కొనలెత్తు. దే. క్రి. వర్ధిల్లు.

కొనసాగు. దే. క్రి. ౧. వర్ధిల్లు. ౨. ముగియు.

కొనిపోవు. దే. క్రి. తీసికొనిపోవు.

కొనియాడు. దే. క్రి. ౧. నుతించు. ౨. ఆదరించు. 3. కాపాడు. (వి. కొనియాట, కొనియాడుట.)

కొనివచ్చు. దే. క్రి. తెచ్చు.

కొను. దే. క్రి. ౧. అపహరించు. ౨. తీసికొను. 3. పట్టుకొను. ౪. వెలకుఁదీయు.

కొనుగోలు.<br>కొనుబడి. } దే. వి. క్రయము. వెల.

కొప్పరము. దే. వి. ౧. శిఖరము. ౨. మూఁపు.

కొప్పరించు. దే. క్రి ౧. అతిశయించు. ౨. విజృంభించు. వి. కొప్పరింత.

కొప్పు. దే. వి. ౧. వింటికొన. ౨. వెండ్రుకలముడి.

కొప్పెర. దే. వి. వెడల్పుమూతిగల పెద్దపాత్రము. కాఁగు.

కొప్రము. దే. వి. శిఖరము.

కొబ్బెర. దే. వి. చిప్పతీసిన టెంకాయ.

కొమ. దే. వి. ౧. కొమ్మ. ౨. స్త్రీ.

కొమరసామి. దే. వి. కుమారస్వామి.

కొమరారు. దే. క్రి. కొమరుమిగులు.

కొమరాలు. దే. వి. ౧. సొగసుకత్తె. ౨. తరుణి.

కొమరిత. దే. వి. కూఁతురు.

కొమరు. దే. వి. ౧. మనోజ్ఞత. ౨. విణ. మనోజ్ఞము.

కొమరుఁడు. దే. వి. ౧. కొడుకు. ౨. కుమారస్వామి.

కొమరుఁదనము. దే. వి. జవ్వనము.

కొమరునాఁడు. / కొమరుఁబాయము. / కొమరుఁబ్రాయము. } దే. వి. యౌవనము.

కొమరువిగులు. దే. క్రి. ఒప్పు; అందగించు.

కొమరుగొందు. దే. క్రి. ,,

కొమారి. / కొమారిత. / కొమార్త. } దే. వి. కూఁతురు.

కొమారుఁడు. దే. వి. పుత్త్రుఁడు.

కొమిరె. దే. వి. ౧. యువతి. ౨. కూఁతురు. 3. స్త్రీ.

కొమ్మ. దే. వి. ౧. శాఖ. ౨. ఆఁడుది. 3. శిఖరము. (కోటకొమ్మ.)

కొమ్ము. దే. వి. ఎద్దు మొదలగువాని కొమ్ము. ౨. చిమ్మగ్రోవి. 3. కోటకొమ్ము.

కొమ్ముటేనుఁగు. దే. వి. మగయేనుఁగు.

కొమ్ములుదిరుగు. దే. క్రి. పొగరెక్కు. (అతఁడు కొమ్ములుదిరిగిన పఁడితుఁడు)

కొమ్ములువచ్చు. దే. క్రి. పొగరెక్కు. (వానికిఁ గొమ్ములు వచ్చెను.)

కొమ్ములువోవు. దే. క్రి. అతిశయించు.

కొయ్య. దే. వి. ౧. మ్రాను. ౨. కఱ్ఱ. 3. మూర్ఖుఁడు.

కొయ్యగాలు. దే. వి. కోఁతకోసిన మ్రోడు.

కొయ్యదనము. దే. వి. దౌష్ట్యము.

కొయ్యనగాఁడు. దే. విశే. మూర్ఖుఁడు.

కొరడా. హిం. వి. చబుకు. కశ.

కొరవంజి. దే. వి. ౧ ఎఱుకవాఁడు. ౨. ఎఱుకది. 3. ఎఱుకుల నాట్యము.

కొఱ. దే. వి. ౧. కొఱఁత. ౨. పని. (కొఱగాని.) విశే. 3. తక్కువైన. (కొఱనోములు.)

కొఱఁత. దే. విశే. తక్కువ. వి. దోషము.

కొఱకచ్చు. దే. వి. కొఱవి.

కొఱకు. దే. అవ. చతుర్థీవిభక్తియందు వచ్చెడు నొక ప్రత్యయము.

కొఱకొఱ. దే. వి. కోపము. క్రి. కొఱకొఱలాడు.

కొఱగామి. దే. వి. ౧. అకార్యము. ౨. చెడ్డగుఱుతు. 3. దోషము.

కొఱడు. దే. వి. ౧. ఆయుధవిశేషము. ౨. మ్రానిమోడు. 3. విశే. మూర్ఖుఁడు.

కొఱడుపాఱు. దే. క్రి. కొయ్యవాఱు.

కొఱడువడు. దే. క్రి. మ్రాన్పడు.

కొఱనవ్వు. దే. వి. మందహాసము.

కొఱను. దే. వి. కీడు.

కొఱప్రాణము. త్స. వి. కొనయూపిరి.

కొఱమాలు. దే. క్రి. నిరుపయోగమగు.

కొఱముట్టు. దే. వి. పనిముట్టు.
కొఱవ. దే. వి. ఒక కొండజాతి.
కొఱవత. దే. వి. ఒకకొండజాతిస్త్రీ.
కొఱవి. దే. వి. కొఱకచ్చు.
కొఱవిదయ్యము. దే. వి. దయ్యములలో నొక జాతివిశేషము.
కొఱవోవు. దే. క్రి. మూర్ఛిల్లు.
కొఱుకరానికొయ్య. దే. విశే. కఠినహృదయుఁడు.
కొఱుకు. దే. క్రి. కఱచు. వి. వ్యాధివిశేషము. (కొఱుకు సవాయి) వి. మేఁత.
కొఱుతనుఱుకు. దే.వి.సాహసకృత్యము. విశే. సాహసికుఁడు.
కొఱ్ఱు. దే. వి. ౧. మేకు. ౨. శూలము.
కొల. దే. వి. ౧. పాపము. ౨. హింస. 3. పగ.
కొలఁకు. } దే. వి. గుంట.
కొలఁకువు. }
కొలఁది. దే. వి. పరిమితి. దే. వి. విశే. శక్యము.
కొలఁదికిడాయు. దే. క్రి. దగ్గఱికివచ్చు. (నోరికొలఁదులు = నోటికి వచ్చిన మాటలు. వేలకొలఁదులు = సమయానుకూలములు,) ఆకొలఁదులవాఁడు=అట్టివాఁడు, ఎడకొలఁది = అవకాశముకొలఁబట్టి. కొలఁదియిడు = గణించు. కొలఁదివెట్టు = ,,
కొలగాఁడు. దే. వి. ధాన్యముఁ గొలుచువాఁడు.
కొలగారము. దే. వి. ధాన్యముకొలఁత కిచ్చెడు కూలి.
కొలత. దే. వి. ౧. పరిమాణము. ౨. ధాన్యము లో నగువానిఁ గొలుచుట.
కొలనాడు. దే. క్రి. తీర్థమాడు.
కొలను. దే. వి. చెఱువు.
కొలము. వై. వి. వంశము.
కొలముసామి. దే. విశే. కులస్వామి.
కొలసామి. దే. విశే. ,,
కొలికి. దే. వి. ౧. ముక్కు నంటిన కంటిమూల. ౨. హారము లోనగు వాని దగిల్చెడు వంకకమ్మి.
కొలికిముడి. దే. వి. వదలుముడి.
కొలికివచ్చు. దే. క్రి. ౧. లొంగదీయు. ౨. ఫలోన్ముఖమగు.
కొలిమి. దే. వి. కమ్మరి నిప్పువెట్టెడి పల్లము.
కొలిమి తిత్తి. దే. వి. కొలిమి నూదెడు తిత్తి.
కొలుచు. దే. క్రి. ౧. ఉపాసించు. ౨. సేవించు. 3. ధాన్యములోనగు వానిఁ గొలుచు.
కొలుపు. దే. క్రి. ౧. సమ్మతించు. ౨ సరిపడు. 3. చెల్లు. ४. పురికొల్పు. దే. వి. గ్రామదేవతకు నొనర్చెడి యుత్సవము.
కొలువడి. దే. వి. కొలత.

కొలువిచ్చు. దే. క్రి. సభచేయు.

కొలువు. దే. వి. ౧. ఆస్థానము. ౨. సేవ. ౩. ఉత్సవవిశేషము.

కొలువుకాఁడు. దే. వి. సేవకుఁడు.

కొలువుకూటము. దే. వి. ఆస్థానమంటపము.

కొలువుదీర్చు. దే. క్రి. సభచేయు.

కొలువువిరియు. దే. క్రి. సభకావించు.

కొల్ల. దే. వి. దోఁపుడు.

కొల్లకాఁడు. దే. విణ. కొల్లపెట్టువాఁడు.

కొల్లకొట్టు. దే. క్రి. కొల్లపెట్టు.

కొల్లపఱచు. దే. క్రి. అపహరించు.

కొల్లపుచ్చు. దే. క్రి. అపహరించు.

కొల్లపెట్టు. దే. క్రి. అపహరించు.

కొల్లలాడు. దే. క్రి. దోఁచుకొను.

కొల్లలుగొమ్ములువోవు. దే. క్రి. అధికమగు.

కొల్లవట్టు. దే. క్రి. దోఁచు.

కొల్లవిడుచు. దే. క్రి. కొల్లగొన విడిచిపెట్టు.

కొల్లాడు. దే. క్రి. అపహరించు.

కొల్లారము. / కొల్లారు. } దే. వి. నడుమ బయలును నాలుగువైపులఁ గట్టడమును గల యిల్లు.

కొస. దే. వి. కొన. చివర.

కొసరు. దే. క్రి ౧. విజృంభించు. ౨. సంకోచించు. ౩. వేఁడు.

## కో

కోఁచె. దే. వి. పిటికి.

కోఁచెవాఱు. దే. వి. భయపడు.

కోఁత. దే. వి. కోయుట.

కోఁతపట్టు. దే. వి. కోఁతకోయనారంభించు.

కోఁతి. దే. వి. వానరము. రూ. క్రోఁతి.

కోఁదాడు. దే. వి. ఒకానొక తాఁడిచెట్టు. (ఈ దాఁడన్న గోదాఁడను= ఎదురెత్తుగాఁ బ్రవర్తించు)

కోక. దే. వి. వలువ, వస్త్రము.

కోకనదము. త్స. వి. ౧. చెంగలువ. ౨. చెందమ్మి.

కోకము. ధే. వి. ౧. జక్కవ. [illegible] కప్ప.

కోకిల. / కోకిలము. } త్స. వి. కోయిల.

కోట. దే. వి. ౧. దుర్గము. ౨. పట్టణముచుట్టును గల ప్రహరి. ([illegible] కోట = అయత్నముగా ల[illegible]చిన రక్షణసాధనము.

కోటఁడు. దే. వి. గ్రుడ్లగూబ.

కోటరము. త్స. వి. చెట్టుతొ[illegible]. దే. వి. కోడంట్రము. రూ. క[illegible]ట్రము.

కోటరించు. దే. క్రి. కోరాడు

కోటటికము. దే. వి. కోడం[illegible]కము.

కోటానఁగోటులు. దే. వి. బ. అసంఖ్యములు.

కోటి. దే. వి. చారుఁడు. త్స. వి. ౧. అంచు. ౨. అతిశయము. 3. చివర. ౪. నూఱులక్షలసంఖ్య. (కోటికిఁ బడిగెత్తు = కోటీశ్వరుఁడైనట్లు జెండాయెత్తు.)

కోటీరము. త్స. వి. కిరీటము.

కోటేరు. దే. వి. తలక్రిందుగాఁ గట్టిన నాఁగు.

కోడంట్రము. } దే. వి. కోటటికము.
కోడంట్రికము.
కోడటికము.

కోడలు. దే. వి. కొమారునిభార్య.

కోడాడు. దే. క్రి. కొమ్ములతోఁ బొడుచు.

కోడి. దే. వి. పుంజు.

కోడిగము. దే. వి. ౧. పరిహాసము. ౨. వంచన. రూ కోడిగించు.

కోడిగీఁడు. దే. విణ. కోడిగము చేయువాఁడు.

కోడు. దే. వి. ౧. మంచము లోనగువానికంబము. ౨. ఊరిదరినీటిపల్లము.

కోడె. దే. వి. ౧. కాడిమరపినదూడ. ౨. విటుఁడు. రూ. కోడియ. (కోడెప్రాయము = యౌవనము.)

కోడెకాఁడు. దే. వి. విటుఁడు.

కోడెదూడ. దే. వి. కోడె. గిత్త.

కోణంగి. దే. వి. హాస్యకాఁడు.

కోణము. త్స. వి. ౧. మూల. ౨. అంచు. 3. దుడ్డుఁగోల.

కోదండము. } త్స. వి. ౧. విల్లు. ౨. కనుబొమ. దే. వి. బాలురను శిక్షించుటకై పట్టుకొని వ్రేలాడునట్లు మీఁదఁ గట్టెడుత్రాడు.

కోన. దే. వి. ౧. అడవి. ౨. కొండసందు.

కోనెఱు. } దే. వి. పుష్కరిణి.
కోనేఱు.

కోపకత్తె. మి. విణ. కోపముగలస్త్రీ.

కోపగాడు. మి. విణ. కోపముగలవాఁడు.

కోపగించు. త్స. క్రి. కోపించు.

కోపగిల్లు. త్స. క్రి. కోపపడు.

కోపము. త్స. వి. కినుక.

కోపి. త్స. విణ. కోపముకలవాఁడు.

కోపించు. త్స. క్రి. కోపపడు.

కోపు. దే. వి. బలపము లోనగువాని కడ్డి. ౨. కమ్మి. 3. చక్కదనము.

కోమటి. దే. వి. వైశ్యుఁడు. రూ. కోమటీఁడు.

కోమలము. త్స. వి. నీళ్ళు. విణ. మృదువు.

కోమలి. దే. వి. ఆఁడుది.

కోమలికము. దే. వి. చక్కఁదనము.

కోయ. దే. విణ. కిరాతుఁడు.



కోయత. దే. విశే. కోయజాతిస్త్రీ.

కోయిల. దే. వి. ౧. గుడి. ౨. కోకి లము.

కోయు. దే. వి. పండినపైరు. పూవులు లోనగు వాని తలుగు. ఉ. (కోఁ తలుకోయు = బడాయిమాటలాడు; 'సొరకాయకోఁతలుకోయు)

కోర. దే. వి. ౧. గిన్నె. ౨. తట్టు. విశే. పెద్ద.

కోరకము. త్స. వి. ౧. మొగ్గ. ౨. తామరతూడు.

కోరగించు. దే. క్రి. ౧. మొగ్గదొడుగు. ౨. కోపముచే నెఱ్ఱవాఱు.

కోరవాఱు. దే. క్రి. కోపముచే నెఱ్ఱ వాఱు.

కోరవోవు. దే. క్రి. కొంకరలువోవు.

కోరసిగ. దే. వి. ముఖపార్శ్వమున వేసికొను జుట్టుముడి.

కోరా. విశే. సంస్కరింపనిది.

కోరాడు. దే. క్రి. ఏనుఁగు లోనగునవి కొమ్ములతో నేలఁ ద్రవ్వి దుమ్మెత్తి పైకిఁ జల్లు.

కోరిక. / కోరికి. / కోరికె. } దే. వి. ౧. ఇచ్ఛ. ౨. వరము.

కోరు. దే. క్రి. వాంఛించు. వి. భా గము. (సందోరు = సగపాలు.)

కోరువెట్టు. దే. క్రి. పన్నుగట్టు.

కోఱ. దే. వి. దంష్ట్ర, కోఱపల్లు.

కోలాడము. దే. వి. ౧. కోపము. ౨. క్రౌర్యము. ౩. ప్రతికూలవచనము.

కోల. దే. వి. ౧. కఱ్ఱ. ౨. బెత్తము. ౩. బాణము. ౪. గడ.

కోలకుఁదెచ్చు. దే. క్రి. బాణమునకు గుఱిసేయు.

కోలము. త్స. వి. ౧. తెప్ప. ౨. పంది.

కోలమూఁపు. దే. వి. ఎత్తయినమూఁపు.

కోలాటము. దే. వి. చేతులఁ గోల్కు లుంచుకొనియాడెడునాట.

కోలాస. దే. వి. పేరాస.

కోలాహలము. త్స. వి. సందడి. కలకలము.

కోలు. దే. వి. ౧. అనుప్రయుక్తమగు కొనుధాతువునకు భావార్థక రూ పము. ౨. కొల్ల. దే. విశే. పెద్ద (కోలుపులి.)

కోలుకాఁడు. దే. వి. ౧. నియా చెడియధికారి. ౨. కావలివాఁడు. 3. సుంకరి.

కోలుకొను. దే. క్రి. ౧. ఉత్సహించు. ౨. లేఱుకొను. 3. వర్ధిల్లు. రూ. కోల్కొను.

కోలుతల. దే. వి. ఎదుట నిలిచి చేయు యుద్ధము. రూ. కోల్తల. (కోల్తల సేయు = యుద్ధసన్నాహము సేయు.)

కోలుపడు. దే. క్రి. ౧. చెఱు. ౨. అగపడు. 3. పోఁగొట్టుకొను. రూ. కోల్పడు.

కోలుపాటు. దే. క్రి. ౧. భంగము. ౨. పోఁగొట్టుకొనుట.

కోలుపులి. దే. వి. బెబ్బులి. రూ. కోల్పులి.

కోలుపోక. దే. వి. పోఁగొట్టుకొనుట.

కోలుపోవు. దే. క్రి. ౧. పోఁగొట్టుకొను. ౨. చెడు.

కోలుమసఁగు. దే. క్రి. ౧. మిక్కిలి విజృంభించు. ౨. చంపు.

కోలుముందు. దే. వి. మునుముందు.

కోలె. దే. అవ్య. మొదలుకొని. రూ. కొలె. (పుట్టినకోలెను = పుట్టిననాఁటినుండి.)

కోలెమ్ము. దే. వి. వెన్నెముక. రూ. కోలెముక. కోలెమ్ముక.

కోవ. దే. వి. ౧. వంశానుక్రమము. ౨. సరము. (కోవలుపడ(వ్రాయు = పూసగ్రుచ్చినట్లు లిఖించు.)

కోవిదుఁడు. త్స. వి. చదువరి.

కోవెల. దే. వి. ౧. గుడి. ౨. కోకిలము.

కోశము. త్స. వి. ౧. కత్తియొఱ. ౨. గ్రుడ్డు. ౩. పుస్తకము. ౪. బొక్కసము. ౫. రాశి.

కోశాగారము. త్స. వి. ధనాగారము.

కోష్ఠము. త్స. వి. ౧. ఉదరమధ్యము. ౨. గృహమధ్యము. ౩. గాదె.

కోష్ణము. త్స. విణ. నులివెచ్చనిది.

కోసము. / కోసరము. దే. అవ్య. కారణముఁ దెలుపునది.

కోసు. దే. వి. క్రోశము. రెండుమైళ్లదూరము. విణ. దీర్ఘము. క్రోసుమొత్తము.

# కౌ

కౌంతేయుఁడు. త్స. వి. కుంతికొడుకు.

కౌఁగిలి. దే. వి. ఆలింగనము.

కౌఁగిలించు. దే. క్రి. ఆలింగనముచేయు.

కౌఁగిలింత. / కౌఁగిలింపు. దే. వి. ఆలింగనము.

కౌఁజు. దే. వి. కపింజలము.

కౌక్షేయకము. త్స. వి. ఖడ్గము.

కౌటిల్యము. త్స. వి. ౧. వంకరతనము. ౨. కుత్సితము.

కౌడు. వై. వి. కపటము.

కౌతుకము. / కౌతూహలము. త్స. వి. ౧. కోరిక. ౨. అనుభవము లేని కోరికయందలియాశ. ౩. పండుగ. ౪. సంతోషము.

కౌద్దాలికుఁడు. త్స. విణ. గొడ్డలితోఁ ద్రవ్వుకొని జీవించువాఁడు.

కౌను. దే. వి. ౧. నడుము. ౨. వింటినడుము.

కౌపీనము. త్స. వి. గోఁచి.

కౌమారము. త్స. వి. కుమారభావము. రూ. కౌమారకము.

కౌముది. త్స. వి. వెన్నెల.
కౌమోదకి. త్స. వి. విష్ణునిగద.
కౌంతేయుఁడు. త్స. విణ. కురువంశపు వాఁడు.
కౌరవ్యుఁడు. త్స. విణ. ,,
కౌలటేయుఁడు. త్స. వి. లంజెకొడుకు.
కౌలటేరుఁడు. త్స. వి. ,,
కౌలీనము. త్స. విణ. ౧. కులక్రమానుగతము. ౨. నింద.
కౌలు. దే. వి. చూ. కవులు.
కౌలేయకము. త్స. వి. కుక్క.
కౌశలము. } త్స. వి. గట్టితనము.
కౌశల్యము. }
కౌశికము. త్స. వి. ౧. గుడ్లగూబ. ౨. ముంగిస.
కౌశికుఁడు. త్స. వి. ౧. విశ్వామిత్రుఁడు. ౨. ఇంద్రుఁడు.
కౌశేయము. త్స. వి. పట్టుబట్ట.
కౌస్తుభము. త్స. వి. విష్ణువక్షస్స్థలమునందలి మణి.

# క్ర

క్రిందు. దే. వి. మ్రోఁగుటయందు నయ్యెడిచప్పుడు.
క్రంత. దే. వి. ౧. సందువీధి. ౨. రచ్చ.
క్రందనము. త్స. వి. ౧. ఏడ్పు. ౨. అఱ్ఱు. 3. పిలుపు.
క్రందిల్లు. దే. క్రి. మ్రోగు.
క్రందు. దే. క్రి. ౧. మ్రోఁగు. ౨. విలపించు. వి. ౧. మ్రోఁత. ౨. సందడి. 3. ఉపద్రవము.
క్రందుకయ్యము. దే. వి. దొమ్మియుద్ధము.
క్రందుకొను. దే. క్రి. ౧. గుమిగూడు. ౨. అతిశయించు. 3. నిండు.
క్రందుపఱచు. దే. క్రి. కప్పు.
క్రకచము. త్స. వి. అంపము.
క్రుక్కు. దే. వి. కడుపున వికారముచే నందలి వస్తువుల వెడల నుమియు.
క్రచ్చఱ. దే. విణ. ౧. శీఘ్రముగా. ౨. స్పష్టముగా. 3. ఎల్లప్పుడు. ౪. అనాలోచితముగా.
క్రతువు. త్స. వి. యజ్ఞము.
క్రన్న. } దే. విణ. ౧. శీఘ్రముగా. ౨. పిమ్మట. 3. మరల.
క్రన్నన. }
క్రమకము. త్స. విణ. క్రమముగా వచ్చిన-.
క్రమము. త్స. వి. ౧. వరుస. ౨. అడుగుట. 3. బలిమి. ౪. విధము.
క్రమించు. దే. క్రి. దాఁటు.
క్రముకము. త్స. వి. పోఁకకాయ.
క్రమేలకము. త్స. వి. ఒంటె.
క్రమ్మన. దే. అవ్య. శీఘ్రముగా.
క్రమ్మఱ. దే. అవ్య. మరల.
క్రమ్మఱఁబడు. దే. క్రి. క్రమ్మఱు.
క్రమ్మఱిలు. } దే. క్రి. క్రమ్మఱు.
క్రమ్మఱిల్లు. }

క్రమ్మఱు. దే. క్రి. మఱలు.

క్రమ్ము. దే. క్రి. ౧. కవియు. ౨. పైకుబ్బు. ౩. వ్యాపించు. ౪. వి. క్రమ్ముదల.

క్రయము. త్స. వి. ౧. వెల. ౨. (వెల ఇచ్చి కొనుట)

క్రయవిక్రయికుఁడు. త్స. వి. బేహారి.

క్రయించు. దే. క్రి. విలుచు, కొను.

క్రయికుఁడు. త్స. వి. కొనువాఁడు.

క్రయ్య. దే. వి. కాలువ.

క్రయ్యఁబాఱు. దే. క్రి. కలయఁబాఱు.

క్రవ్యము. త్స. వి. మాంసము.

క్రవ్యాదుఁడు. త్స. విణ. మాంసము తినువాఁడు.

## క్రా

క్రాఁగు. దే. క్రి. చూ. కాఁగు.

క్రాయు. దే. క్రి. కాండ్రించు. ఉమియు.

క్రాలు. దే. క్రి. ౧. అల్లలాడు. ౨. గిరగిరఁ దిరుగు. ౩. చెదరు. ౪. సంచరించు. ౫. చలించు.

క్రాలుఁగంటి. దే. వి. ౧. చలించునట్టి కన్నులు గలయాఁడుది. ౨. ఆఁడుది. రూ. క్రాల్గంటి.

## క్రి

క్రించుఁదనము. దే. వి. అల్పము. విణ. క్రించు.

క్రిందల. దే. వి. క్రిందగుదల.

క్రించు. దే. వి. ౧. అధోభాగము. ౨. పూర్వకాలము.

క్రిందువడు. దే. క్రి. తక్కువయగు.

క్రిక్కిఱించు. దే. క్రి. క్రిక్కిఱియఁజేయు.

క్రిక్కిఱియు. దే. క్రి. ఎడము లేకయల్లుకొను.

క్రిక్కొఱు. దే. క్రి. ౧. క్రిక్కిఱియు. ౨. నిండు.

క్రితము. దే. వి. మునుపు.

క్రిమి. త్స. వి. పురుగు.

క్రియ. త్స. వి. ౧. ధాత్వర్థము. ౨. చేష్ట. ౩. పని. ౪. శిక్ష. ౫. చికిత్స. ౬. ఉపాయము.

క్రియగొను. మి. క్రి. ౧. ఒనగూడు. ౨. పూను.

క్రియావంతుఁడు. త్స. విణ. పనియందుఁబూనిక కలవాఁడు.

క్రియ్యు. దే. క్రి. కృశించు.

క్రియ్యాట. దే. వి. క్రిందియాట.

## క్రీ

క్రీఁగడుపు. దే. వి. పొత్తికడుపు.

క్రీఁదొడ. దే. వి. క్రిందితొడ.

క్రీఁబడు. దే. క్రి. తక్కువయగు.

క్రీడ. దే. వి. ౧. ఆట. ౨. గెలి. క్రి. క్రీడించు.

క్రీడనకము. త్స. వి. ఆటబొమ్మ.

క్రీడనము. త్స. వి. ఆటబొమ్మ.

క్రీడనీయకము. త్స. వి. ఆటబొమ్మ.

క్రీడి. వై. వి. అర్జునుఁడు.

క్రీతదాసుఁడు. త్స. వి. తల్లిదండ్రుల నుండి కొనఁబడిన సేవకుఁడు.
క్రీనీడ. దే. వి. క్రిందినీడ.

క్రు

క్రుంకు. దే. క్రి. ౧. మునుఁగు. ౨. అస్తమించు. 3. చచ్చు. వి. మునుక.
క్రుంకుడు. దే. వి. అస్తమయము.
క్రుంకుడుగట్టు. } దే. వి. అస్తపర్వతము.
క్రుంకుమల. }
క్రుంగు. దే. క్రి. ౧. దిగఁబడు. ౨. నశించు.
క్రుక్కు. దే. క్రి. ౧. వేలు మున్నగు వానినిఁ జేతితోఁ జిదుము. ౨. అడఁచు. 3. తఱుగు.
క్రుమ్మరిలు. } దే. క్రి. అధికముగాఁ బ్రసరింపఁజేయు. (నీరు క్రుమ్మరించెను)
క్రుమ్మరిల్లు. }
క్రుమ్మరు. దే. క్రి. ౧. తిరుగు. ౨. విహరించు.
క్రుమ్ము. దే. క్రి. పొడుచు.
క్రుమ్మెసలాడు. దే. క్రి. కుమ్ములాడు.
క్రుయ్యు. దే. క్రి. కృశించు.
క్రుళ్లగించు. దే. క్రి. (హృదయముఁ) దుఃఖించు.)
క్రుళ్లు. దే. క్రి. ౧. దుఃఖించు. ౨. అవియు.
క్రుళ్లుపోతు. దే. విశే. క్రుళ్లగించు స్వభావము కలవాఁడు.

క్రూ

క్రూరము. త్స. విశే. ౧. నొప్పించునది. ౨. భయంకరమైనది. 3. కట్టిది.

క్రే

క్రేఁటు. } దే. క్రి ౧. [illegible]తు లోని గొల్లలోన గు వానిఁదొలఁగించుటకై సకిలించునట్లు శబ్దించు. ౨. తొట్రుపడు.
క్రేఁటుకొను. }
క్రేగన్ను. దే.వి.కడకన్ను, కటాక్షము.
క్రేడించు. దే. క్రి. తిరస్కరించు.
క్రేడిసేయు. దే. క్రి. [illegible]చేయు. రూ క్రేణిసేయు. వి. క్రేణి.
క్రేణించు. దే. క్రి. అలక్ష్యము చేయు.
క్రేదొట్టు. దే. క్రి. కట్టొరయు.
క్రేపు. దే. వి. ౧. దూడ. (ఆవు [illegible] గుఱ్ఱ) ౨. (కొండ) శిఖరము.
క్రేవ. దే. వి. ౧. ప్రక్క. ౨. [illegible]
క్రేళ్లుగీయు. దే. క్రి. ౧. ఎగిరిపడు ౨. గంతులిడు.
క్రేళ్లుదాఁటు. దే. క్రి. ౧. ఎ[illegible]పడు. ౨. గంతులిడు.
క్రేళ్లుబ్బు. దే. క్రి. అతిశయించు.
క్రేళ్లుఱుకు. దే. క్రి. ౧. [illegible] ౨. దూఁకు. 3. ఎగిరిప[illegible].
క్రేళ్లుసను. దే. క్రి. పరుగు[illegible].

క్రొ

క్రొంబాయ. దే. వి. క్రొ[illegible]

క్రొంజిగురు. దే. వి. క్రొత్తచిగురు.
క్రొంజీఁకటి. దే. వి. మునిచీఁకటి.
క్రొందావి. దే. వి. క్రొత్తపరిమళము.
క్రొంబట్టు. దే. వి. క్రొత్తపట్టు.
క్రొక్కారు. దే. వి. వర్షాకాలము.
క్రొత్త. దే. విశ. ౧. నూతనము. ౨. అపూర్వము.
క్రొత్తడి. దే. వి. పతివ్రత.
క్రొత్తమ్మి. దే. వి. క్రొత్తగావికసించు పద్మము.
క్రొత్తావి. దే. వి. క్రొత్తవాసన.
క్రొన్నన. దే. వి. క్రొత్తమొగ్గ.
క్రొన్నెల. దే. వి. నెలచంద్రుఁడు.
క్రొమ్మించు. దే. వి. నూతనకాంతి.
క్రొమ్ముడి. దే. వి. కేశబంధము.
క్రొమ్మెఱుఁగు. దే. వి. తొలకరి మెఱుపు.
క్రొవ్వాడి. దే. విశ. మిక్కిలి వాఁడి గలైనది.
క్రొవ్వారు. దే. క్రి. బలియు.
క్రొవ్విదము. దే. వి. బలియుట.
క్రొవ్విరి. దే. వి. క్రొత్తపువ్వు.
క్రొవ్వు. దే. క్రి. ౧. మదించు. వి. ౨. మదము. ౩. మెదడు.
క్రొవ్వెద. దే. వి. కొప్పు.

క్రో

క్రోడము. త్స. వి. ౧. పంది. ౨. ఒడి. ౩. చెట్టుతొఱ్ఱ. ౪. కొమ్మ.
క్రోడాడు. దే. క్రి. కోరాడు.
క్రోడించు. త్స. క్రి. మథించు.
క్రోడీకరించు. త్స. వి. ఒకటిగాఁజేర్చు.
క్రోధన. త్స. వి. ఒక సంవత్సరము.
క్రోధము. త్స. వి. కోపము. క్రి. క్రోధించు.
క్రోధి. త్స. వి. ఒక సంవత్సరము. విశ. కోపముకలవాఁడు.
క్రోయు. దే. క్రి. చాఁచు. (నాలుకలు క్రోయు.)
క్రోలు. దే. క్రి. ౧. అనుభవించు. ౨. తిను. ౩. త్రాగు. ౪. గ్రహించు. వి. క్రోవి.
క్రోవ. దే. వి. సరము.
క్రోవి. దే. వి. ౧. గొట్టము. ౨. తుపాకి. ౩. బుడ్డి. ౪. మూస.
క్రోశము. త్స. వి. చూ. కోసు.
క్రోష్టువు. త్స. వి. నక్క.
క్రోసు. దే. వి. కోసు.

క్రౌ

క్రౌర్యము. త్స. వి. క్రూరభావము.

క్ల

క్లమము. త్స. వి. బడలిక.

క్లా

క్లాంతము. త్స. విశ. బడలినది.
క్లాంతి. త్స. వి. బడలిక.

క్లి

క్లిన్నము. త్స. విశ. తడిపినది.
క్లిశితము. త్స. విశ. క్లిష్టము.

క్లిష్టము. త్స. వి. ఒకానొకశబ్దదోషము. విణ. ౧. దారిద్ర్యాదులచే క్లేశమొందునది. ౨. పూర్వోత్తర విరుద్ధమైనది.

## క్లీ

క్లీబము. త్స. వి. నపుంసకము.
క్లీబుఁడు. త్స. వి. నపుంసకుఁడు.

## క్లే

క్లేదనము. త్స. వి. తడి.
క్లేదము. త్స. వి. ”
క్లేశము. త్స. వి. దుఃఖము.

## క్వ

క్వణనము. / క్వణము. / క్వాణము. } త్స. వి. శబ్దము. ధ్వని.

# క్ష

క్షంతవ్యము. త్స. విణ. క్షమింపఁదగినది.
క్షణద. త్స. వి. రాత్రి.
క్షణప్రభ. త్స. వి. మెఱుపుఁదీగ.
క్షణము. త్స. వి. ౧. ఘటికయందాఱవపాలు. ౨. సమయము. 3. ఉత్సవము.
క్షణికము. త్స. విణ. నశ్వరము.
క్షతము. త్స. వి. దెబ్బ.
క్షతి. త్స. వి. ౧. గాయము. ౨. నాశము.
క్షత్త్రబంధువు. త్స. వి. నీచక్షత్త్రియుఁడు.
క్షత్త్రియుఁడు. / క్షత్త్రుఁడు. } త్స. వి. రాచవాఁడు.
క్షప. త్స. వి. రాత్రి.
క్షపణకుఁడు. త్స. వి. బౌద్ధసన్న్యాసి.
క్షపాకరుఁడు. త్స. వి. చంద్రుఁడు.
క్షమ. త్స. వి. ౧. ఓర్పు. ౨. నేల.
క్షమాపణము. త్స. వి. క్షమింపవేఁడికోలు.
క్షమించు. / క్షమియించు. } త్స. క్రి. ఓర్చు.
క్షయము. త్స. వి. ౧. అఱుఁదెవులు. ౨. తగ్గుదల. 3. ప్రళయము. ౪ ఇల్లు. ౫. క్షయరాశి.
క్షయించు. త్స. క్రి. తగ్గు.
క్షయిష్ణువు. త్స. విణ. నశించు స్వభావము గలది.
క్షరణము. త్స. వి. కాఱుట.
క్షవము. త్స. వి. తుమ్ము.

## క్షా

క్షాంతి. త్స. వి. ఓర్పు.
క్షాత్త్రము. త్స. వి. ౧. క్షత్త్రియుని ధర్మము.
క్షామము. త్స. వి. కఱవు.

క్షారము. త్స. వి. ౧. కారము. ౨. తిక్త లవణ రస మిశ్రిణము చేతఁ గలిగిన రసము గలది.
క్షాళనము. త్స. వి. కడుగుట.

క్షి

క్షితి. త్స. వి. ౧. నేల. ౨. ఉనికి.
క్షిప్తము. త్స. విణ. విసరఁబడిన.
క్షిప్రము త్స. వి. వేగము.

క్షీ

క్షీణము. త్స. విణ. క్షయించినది.
క్షీణించు. త్స. క్రి. క్షీణమగు.
క్షీబుఁడు. త్స. విణ. మత్తిల్లినవాఁడు.
క్షీరము. త్స. వి. ౧. పాలు. ౨. నీళ్లు.
క్షీరోదము. త్స. వి. పాలసంద్రము.

క్షు

క్షుణ్ణము. త్స. విణ. నలిగినది.
క్షుతము. త్స. వి. తుమ్ము.
క్షుత్తు. త్స. వి. ఆఁకలి.
క్షుద్రుఁడు. త్స. విణ. ౧. అధముఁడు. ౨. అల్పుఁడు. ౩. లోభి. ౪. హింసకుఁడు.
క్షుధ. త్స. వి. ఆఁకలి.
క్షుద్బము. త్స. విణ. క్షుధితము.
క్షురము. త్స. వి. మంగలికత్తి.

క్షే

క్షేత్రజ్ఞుఁడు. త్స. వి. ౧. జీవాత్మ. ౨. పరమాత్మ.
క్షేత్రము. త్స. వి. ౧. వరిమడి. ౨. గణితశాస్త్రము. ౩. పెండ్లాము.
క్షేత్రాజీవుఁడు. త్స. వి. సేద్యగాఁడు.
క్షేత్రియరోగము. త్స. వి. కుదరనిరోగము.
క్షేపము. త్స. వి. చిమ్ముట. త్రోయుట.
క్షేమంకరుఁడు. త్స. విణ. క్షేమకరుఁడు. రూ. క్షేమకారుఁడు.
క్షేమతండులము. త్స. వి. ప్రయాణ కాలమందు వట్టిచేతఁబోక యింటి నుండి కొలఁదిగాఁ గట్టికొని పోయెడు బియ్యము.
క్షేమము. త్స. వి. ౧. కలిగినది చెడకుండుట. ౨. శుభము.

క్షో

క్షోణి. త్స. వి. నేల.
క్షోదక్షమము. త్స. విణ. పొడిచేయఁ దగినది (సూక్ష్మపరీక్షకుఁ దగినది.)
క్షోభ. / క్షోభణము. / క్షోభము. } త్స. వి. ౧. కలఁత. ౨. దోఁపుడు.
క్షోభించు. త్స. క్రి. కలఁతపడు.

క్షౌ

క్షౌరము. త్స. వి. మంగలిపని.
క్షౌరకుడు త్స. వి. మంగలి.

క్ష్మా

క్ష్మా. త్స. వి. నేల.

క్ష్వే

క్ష్వేడ. త్స. వి. సింహనాదము. రూ. క్ష్వేళి.

# ఖ

ఖంజనము. త్స. వి. కాటుకపిట్ట.
ఖంజుఁడు. త్స. విణ. కుంటివాఁడు.
ఖండనము. త్స. వి. నఱకుట.
ఖండము. త్స. వి. ౧. తునుక. ౨. పులకండము.
ఖండశర్కర. త్స. వి. పులకండము.
ఖండించు. త్స. క్రి. నఱుకు.
ఖండిక. దే. వి. పన్ను లేకుండ గుత్త కిచ్చిన భూఖండము. రూ. ఖండ్రిక.
ఖండితము. త్స. విణ. ౧. నఱకఁబడినది. ౨. ఖరారు.
ఖండువా. దే. వి. పైన వైచుకొనెడు నంగవస్త్రము.
ఖగము. త్స. వి. ౧. పక్షి. ౨. బాణము.
ఖగోళము. త్స. వి. ఆకాశగోళము.
ఖచించు. త్స. క్రి. చెక్కు.
ఖచియించు. త్స. క్రి. ,,
ఖట్వ. త్స. వి. మంచము.
ఖట్వారూఢుఁడు. త్స. వి. పెద్దలు నిలఁబడఁగా మంచముపైఁ గూర్చున్నవాఁడు. (దురాచారుఁడు.)
ఖడ్గధనువు. త్స. వి. చిన్నకత్తి.
ఖడ్గము. త్స వి. ౧. కత్తి. ౨. ఖడ్గమనెడి మృగము.
ఖచితము. త్స. వి. ౧. చెక్కఁబడినది. ౨. ఖరారు.
ఖద్ది. దే. వి. బలము.
ఖద్యోతనుఁడు. త్స. వి. సూర్యుఁడు.
ఖద్యోతము.త్స.వి. మిడుఁగురుఁబురువు.
ఖద్యోతుఁడు. త్స. వి. సూర్యుఁడు.
ఖనకము. త్స. వి. ఎలుక.
ఖని. త్స. వి. రత్నములు పుట్టెడు తావు. గని.
ఖనిత్రము. త్స. వి. గడ్డపాఱ.
ఖర. త్స. వి. ౧. అఱువది సంవత్సరములలో ఒకటి.
ఖరము. త్స. వి. గాడిద. విణ. పరుసమైనది. తీక్ష్ణమైనది.
ఖర్జూరము. త్స. వి. ౧. వెండి. ౨. పేరీఁదు.
ఖర్వము. త్స. విణ. పొట్టిది.
ఖలము. త్స. వి. కల్లము.
ఖలీనము. త్స. వి. గుఱ్ఱపుఁగళ్లెము.
ఖలుఁడు. త్స. విణ. ౧. అధముఁడు. ౨. క్రూరుఁడు.
ఖల్వము. త్స. వి. కల్వము.
ఖల్వాటుఁడు. త్స. వి. బట్టతలవాఁడు.

## ఖా

ఖాణము. దే. వి. గుఱ్ఱము మొదలగు వానికిఁ బెట్టెడునులవలు మున్నగు భోజ్యవస్తువు. దాణా.
ఖాతా. దే. వి. లెక్క.
ఖాతాదారుఁడు. దే. విణ. వ్యాపార సంబంధ మగు చుట్టరికము కల వర్తకుఁడు.

ఖాదము. త్స. వి. తినుట.
ఖాద్యము. త్స. విణ. తినఁదగినది.
ఖాది. త్స. వి. పుట్టి.

ఖి

ఖిన్నము. త్స. విణ. దుఃఖము నొందినది.
ఖిలము. త్స. విణ. చెడినది. (దున్ననిది.)

ఖు

ఖురము. త్స. వి. గొరిజ. గిట్ట.

ఖే

ఖేచరుఁడు. త్స. విణ. ఆకాశసంచారి. వేల్పు.
ఖేదము. త్స. వి. శోకము.
ఖేయము. త్స. వి. ౧. అగడ్త. ౨. ఆనకట్ట.
ఖేల. త్స. వి. ఆట.
ఖేలనము. త్స. వి. ఆట.

ఖ్యా

ఖ్యాతి. త్స. వి. వాసి. కీర్తి.

# గ

గంగ. త్స. వి. ౧. భాగీరథి. ౨. నీరు. (ఇంతగంగ ద్రాగినాఁడు.) దే. విణ. 3. పెద్దది. (గంగరేగు; గంగడోలు.)
గంగగోవు. దే. విణ. సాధువైన గోవు.
గంగమ్మ. దే. వి. ఒకానొక గ్రామదేవత. రూ. గంగనమ్మ.
గంగాధరుఁడు. త్స. వి. శివుఁడు.
గంగాళము. దే. వి. నీళ్లకొప్పెర.
గంగిగోవు. దే. వి. పూజ్యమైనగోవు.
గంగిరెద్దు. } గంగెద్దు. } దే. వి. బిచ్చపుదాసరులు సింగారించి యాడించెడి యెద్దు.
గంజ. త్స. వి. గంజాయి.
గంజాయి. దే. వి. మైకపు పుట్టించునట్టి యొకానొక చెట్టువెన్ను.
గంజి. దే. వి. అన్నరసము.
గంట. దే. వి. ౧. గడ్డిదుబ్బు. (రెల్లుగడ్డి) ౨. వాద్యవిశేషము. 3. శాలవిశేషము.
గంటము. దే. వి. తాటాకుమీఁద వ్రాయుట కుపయోగించెడు నుక్కుకలము.
గంటి. దే. వి. ౧. గాయము.
గంటు. దే. క్రి. గాయముచేయు. వి. ౧. గనుపు. ౨. పగ. 3. ముడి.
గంటె. దే. వి. గరిటె.
గండ. దే. వి. మెుక్కుబడి. గండదీపము

గండఁడు. దే. వి. శూరుఁడు.
గండకత్తెర. దే. వి. మెడను గత్తిరించు కొనెడు నొకవిధమగుకత్తెర.
గండకము. త్స. వి. ౧. ఖడ్గమృగము. ౨. విఘ్నము.
గండగొడ్డలి. దే. వి. పరశువు.
గండతల. దే. వి. మ్రొక్కుబడికి ఇచ్చు తల.
గండదీపము. దే. వి. మ్రొక్కుబడి దీపము.
గండపెండరము. }
గండపెండారము. }
గండపెండెము. }
గండపెండేరము. } దే. వి. శూరులు బిరుదుగ కాల ధరించెడు నందియ.
గండము. త్స. వి. ౧. ఏనుఁగుచెక్కిలి. ౨. చెక్కిలి. దే. వి. అపాయము.
గండరగండఁడు. దే. వి. శూరులకెల్ల శూరుఁడు.
గండరించు. దే. క్రి. ౧. నిర్మించు. ౨. పుట్టు.
గండరువు. దే. వి. పడియచ్చు.
గండశిల. త్స. వి. పెద్దబండ.
గండాడు. దే. క్రి. రమించు.
గండారము. దే. వి. పడియచ్చు.
గండి. }
గండిక. } దే. వి. ౧. రంధ్రము. ౨. బిలము. ౩. సందు.
గండు. దే. వి. ౧. పౌరుషము. ౨. బలము.
గండుఁడు. దే. వి. చూ. గండఁడు.
గండుచీమ. దే. వి. పెద్దనల్లచీమ.
గండుమీఱు. దే. క్రి. శక్తిహెచ్చు.
గండుమెఱయు. దే. క్రి. ,,
గండూషము. త్స. వి. పుక్కిలింత.
గండూషించు. త్స. క్రి. పుక్కిలించు.
గండ్ర. దే. విశే. ౧. ధృష్టుఁడు. ౨. గట్టిది.
గంత. దే. వి. ౧. బొంత. ౨. ఎద్దు మీఁద వైచెడి గంత.
గంతలు. దే. వి. బ. కండ్లను మూసి కట్టెడికట్టు.
గంతు. దే. వి. ౧. దుముకు. ౨. గుంపు.
గంతుకొను. దే. క్రి. ౧. దుముకు. ౨. చచ్చు.
గందపట్టె. దే. వి. తలుపుమీఁద వను చ్చెడు నడ్డుకొయ్య.
గందపుమ్రాను. దే. వి. చందనవృక్షము
గందపొడి. దే. వి. వాసనద్రవ్యముల చూర్ణము. రూ. గందవొడి. బుక్కా.
గందము. దే. వి. చందనము.
గంధకము. త్స. వి. అంగడిమందు దినుసు.
గంధము. త్స. వి. ౧. వాసన. ౨. గర్వము.
గంధర్వనగరము. త్స. వి. భూమియందు నెండమావులవలె ఆకాశమునందుఁ దోఁచు మిథ్యానగరము.
గంధర్వము. త్స. వి. గుఱ్ఱము.

గంధర్వవిద్య. త్స. వి. సంగీతవిద్య.
గంధర్వుఁడు. త్స. వి. దేవయోని విశేషము. పాటపాడువాఁడు.
గంధవతి. త్స. వి. ౧. వ్యాసునితల్లి. ౨. నేల.
గంధవహుఁడు. } త్స. వి. వాయువు.
గంధవాహుఁడు. }
గంప. దే. వి. వెదురుబద్దలు లోనగువానితో నల్లినది.
గంబురము. దే. వి. కప్పురము.
గంబురా. దే. వి. ,,
గంబూరము. దే. వి. ,,
గంభీరము. త్స. విణ. లోఁతుగలది.
గగనము. త్స. వి. ఆకాశము. దే. విణ. దుర్లభము.
గగురు. } దే. వి. రోమాంచము.
గగురుపాటు. } రూ. గగుర్పు.
గగురుపు. } గగ్గురు.
గగురుపొడుచు. దే. క్రి. వెండ్రుకలు నిక్కపొడుచు.
గగురుపొడుపు. దే. వి. చూ. గగురుపాటు.
గగ్గోలు. దే. వి. కలఁత.
గగ్గోలుగ. దే. అవ్య. అధికముగా.
గగ్గోలుపడు. దే. క్రి. కలఁగు. క్షోభించు.
గచ్చకాయ. దే. వి. పిల్లలాడుకొను నాటకాయ.
గచ్చు. దే. వి. ౧. గారపూఁత. ౨. కాంతి. 3. పూఁత.
గచ్చువిచ్చగు. దే. క్రి. (కార్యము) చెడిపోవు.
గజదొంగ. త్స. వి. పెద్దదొంగ (ఏనుఁగును దొంగిలించినవాఁడు.)
గజనిమీలనము. త్స. వి. ఏనుఁగువలెఁ గన్నుమూయుట (చూచియుఁ జూడకుండుట.)
గజనిమీలిక. త్స. వి. ,,
గజము. త్స. వి. ౧. ఏనుఁగు. ౨. దే. వి. మూఁడడుగులకొలఁది.
గజయాన. త్స. వి. ఆఁడుది.
గజయీఁత. త్స. వి. పెద్దయీఁత. ఏనుఁగుయొక్క ఈఁత.
గజాననుఁడు. త్స. వి. వినాయకుఁడు
గజిబిజి. దే. వి. ౧. కలఁత. ౨. నలఁగుడు. క్రి. గజిబిజించు.
గజ్జ. దే. వి. తీఁటకురుపు.
గజ్జియ. } దే. వి. కింకిణి.
గజ్జె. }
గజెగజె. దే. వి. వడఁకుటలో నగు శబ్దము.
గజెగజెలాడు. దే. క్రి. గడగడవడఁకు.
గజ్జె. దే. వి. తొడసందు.
గట్టన. దే. వి. గట్టించుట.
గట్టము. దే. విణ. గట్టిది. పి. కణిక.
గట్టి. దే. విణ. ౧. కఠినము. ౨. దృఢము. 3. బిగ్గర.
గట్టించు. దే. క్రి. గట్టనచేయు.
గట్టిపాఱు. దే. క్రి. గట్టిపడు.

గట్టిల్లు. దే. క్రి. ఘటిల్లు. సంభవించు.
గట్టివాఁడు. దే. విణ. సమర్థుఁడు.
గట్టివా. దే. విణ. ౧. మాటకారి. ౨. గయ్యాళి.
గట్టివాయి. దే. విణ. గయ్యాళి.
గట్టు. దే. వి. ౧. తీరము. ౨. కొండ. గట్టుచాటునిక్షేపము = పర్వతము క్రిందినిధి. (వశముగానిది.)
గట్టువాలు. దే. వి. సైరంధ్రి. రూ. గట్టివాలు.
గడ. దే. వి. ౧. ఈటె. ౨. ఓడకంబము. 3. వెదురుగడ, చెఱకుగడ లోనగునవి.
గడగడ. దే. వి. వడఁకుటయం దనుకరణధ్వని.
గడగడలాడు. దే. క్రి. వడఁకు.
గడన. దే. వి. ౧. ఎన్నిక. ౨. స్తోత్రము. 3. సంపాదనము.
గడనకత్తె. } దే. వి. భోగముది.
గడనపడఁతి. }
గడప. దే. వి. కడప (వాకిటిక్రిందిభాగము.)
గడబడ. దే. వి. అల్లరి. రూ. గడిబిడి.
గడమంచె. దే. వి. ౧. మూటలుమున్నగునవి పెట్టుటకై కొల్లమర్చిన చట్టము. ౨. కట్టుబాటు. 3. గడిమిఁజు. ౪. దుర్గము. ౫. గిత్త.
గడసాదన. దే. వి. సాము.
గడి. దే. వి. ౧. ఎల్ల. ౨. చదరంగపు బల్లమొదలగువానిగడి. 3. సమీపము.
గడించు. దే. క్రి. ౧. సంపాదించు. ౨. కల్పించు.
గడికాళ్లువేయు. దే. క్రి. రెండు రెండు పశువులను, ఒక్కొక్క కాలు చేర్చి లంకెవేయు.
గడిదేఱు. దే. క్రి. సమర్థుఁడగు.
గడిమిఁజు. దే. క్రి. కట్టుబాటు దాఁటు.
గడిదొంగ. దే. క్రి. సమర్థుఁడగు దొంగ.
గడిపోతు. దే. వి. ఆఁబోతు.
గడియ. దే. వి. ౧. ఇరువదినాల్గు నిమిషముల కాలము. ౨. గడెమాత్రను. రూ. గడె.
గడియారము. దే. వి. కాలముఁ దెలుపునొకానొక యంత్రము.
గడీ. దే. వి. గడి (కోట)
గడుఁగాయ. దే. వి. రాలుగాయ, తుంటరి (గడుగ్గాయయని వాడుక.)
గడువు. దే. వి. నిర్ణయకాలము.
గడుసరి. దే. విణ. ౧. కఠినుఁడు. ౨. కూళ. 3. మాయలమారి. ౪. అసాధ్యుఁడు.
గడుసు. దే. వి. ౧. కాఠిన్యము. ౨. ధైర్యము. విణ. ౧. అసాధ్యము. ౨. కఠినము.
గడెకారి. దే. వి. ౧. పోకిరి (గడేకారి అనివాడుక.) ౨. బల్లెముగలవాఁడు.
గడ్డ. దే. వి. ౧. దుంప. ౨. వ్రణము. 3. మంటిపెల్ల. (నడుగడ్డ—లంక.)

గడ్డపాఱ. దే. వి. నేల పెల్లగించెడు సాధనవిశేషము.
గడ్డము. దే. వి. చుబుకము.
గడ్డి. దే. వి. కసవు. తృణము.
గడ్డిబొద్దు. దే. వి. చుట్టకుదురు.
గడ్డు. దే. విణ. అధికుఁడు.
గడ్డుకొను. దే. క్రి. అతిశయించు.
గడ్డుటుకు. దే. క్రి. ౧. కవియు. ౨. పాటిపోవు:
గణకుఁడు. త్స. వి. ౧. జోస్యుఁడు. ౨. కరణమువాఁడు.
గణగణ. దే. వి. ౧. గంటవాగునపు. డగు చప్పుడు.
గణన. త్స. వి. ఎన్నిక.
గణనము. త్స. వి. "
గణపతి. త్స. వి. వినాయకుఁడు.
గణము. త్స. వి. ౧. సమూహము. ౨. సేనావిశేషము. (౨౭ రథములు, ౨౭ ఏనుఁగులు, ౮౧ గుఱ్ఱములు, ౧౩౫ కాల్బలము గలది.)
గణరాత్రము. త్స. వి. పెక్కురాత్రుల సమూహము.
గణాచారి. త్స. వి. సివమెక్కి గంతులు వేయువాఁడు.
గణించు, త్స. క్రి. ఎంచు. ౨. లక్ష్యపెట్టు.
గణిక. త్స. వి. భోగముది.
గణితము. త్స. వి. గణితశాస్త్రము.
గణిల్లు. దే. వి. ఎద్దు ఱంకెవేయునపు డయ్యెడి ధ్వన్యనుకరణము.
గణుతి. దే. వి. ౧. ఎన్నిక. ౨. స్తోత్రము. 3. లక్ష్యము.
గణుతించు. దే. క్రి. ౧. ఎంచు. ౨. స్తుతించు.
గణేయము. త్స. విణ. గణింపఁదగినది. రూ. గాణేయము.
గణ్యము. త్స. విణ. లెక్కింపఁదగినది.
గతపడు. మి. క్రి. ౧. కడచు. ౨. చచ్చు.
గతము. త్స. వి. ౧. పోక. విణ. ౨. పోయినది. 3. తెలియఁబడినది.
గతాగతములు. త్స. వి. రాకపోకలు.
గతానుగతము. త్స. వి. ఒకరు ప్రవర్తించినట్లు ప్రవర్తించుట.
గతానుగతికుఁడు. త్స. విణ. ఒకరు ప్రవర్తించినట్లు ప్రవర్తించువాఁడు.
గతి. త్స. వి. పోక. ౨. త్రోవ. 3. యుక్తి. ४. విధము. ౫. శరణము.
గతించు. త్స. వి. ౧. కడచు. ౨. చచ్చు.
గతిపడు. మి. క్రి. లభించు.
గతుకు. దే. క్రి. ౧. తిను. ౨. నాలుకతో నాకు. రూ. కతుకు. 3. గొయ్యి.
గత్తర. దే. వి. ఉపద్రవము.
గద. త్స. వి. ౧. గుదియ. ౨. తెవులు.
గదమాయించు. దే. క్రి. గద్దించు.
గదాధరుఁడు. త్స. వి. విష్ణువు.
గది. దే. వి. కొట్టు.

గదితము. త్స. విణ. చెప్పఁబడినది.
గదుకు. దే. క్రి. ఎంగిలి తిను. రూ. కదుకు.
గదుము. } దే. క్రి. గద్దించు.
గదుముకొను. }
గద్గదస్వరము. త్స. వి. డగ్గుత్తిక పడిన గొంతు.
గద్గదిక. త్స. వి. డగ్గుత్తిక.
గద్ద. దే. వి. గృధ్రము.
గద్దన. దే. వి. గద్దింపు.
గద్దరి. దే. విణ. ౧. నేర్పరి. ౨. పొగరుగలవాఁడు. 3. దుష్టుఁడు.
గద్దరించు. దే. క్రి. గర్జించు.
గద్దరికాఁడు. దే. వి. గద్దరితనము గలవాఁడు.
గద్దించు. దే. క్రి. చూ. గదమాయించు.
గద్దింపు. దే. వి. అదలింపు.
గద్దియ. దే. వి. ౧. సింహాసనము. ౨. సోదె. రూ. గద్దె.
గద్దెపొంకములు. దే. వి. పరువునకుఁ దగిన గౌరవపు మాటలు.
గద్యము. త్స. వి. వచనము.
గనగన. దే. వి. ప్రకాశము.
గనప. దే. విణ. ఎత్తైనది (గనప కొండ.)
గనయము. దే. వి. ౧. పోకముడి. ౨. వింటికొప్పు.
గని. దే. వి. ౧. బంగారు మొదలగు లోహములును నవరత్నములును రాక్షసిబొగ్గు మున్నగునవియును పుట్టుచోటు. ౨. బిలము.
గనికట్టు. దే. క్రి. గడ్డకట్టు.
గనిమ. దే. వి. సేతువు.
గనుపు. దే. వి. చెఱకుగడయందు నెడ నెడ నేర్పడినముడి. రూ. కను పు.
గన్నేరు. దే. వి. గన్నేరు.
గప్పాలు. దే. వి. జంభాలు.
గప్పున. దే. అవ్య. శీఘ్రముగా.
గబగబ. దే. అవ్య. వడిగా.
గబీలు. దే. వి. మంటయందగు ధ్వన్యనుకరణము.
గబ్బి. దే. విణ. బలిసిన.
గబ్బిడా. } దే. వి. గబ్బిలము.
గబ్బిడాయి. }
గబ్బిలాయి. }
గబ్బు. దే. వి. ౧. కంపు. ౨. గర్వము.
గబ్బుచీఁకటి. దే. వి. కటికచీఁకటి.
గబ్బుదేఱు. దే. క్రి. అతిశయించు.
గబ్బెక్కు. దే. క్రి. సాంద్రమగు.
గభస్తి. త్స. వి. కిరణము.
గభస్తిమాలి. త్స. వి. సూర్యుఁడు.
గభీరము. త్స. విణ. గంభీరము.
గభీరిమము. త్స. వి. గాంభీర్యము.
గమకము. దే. వి. ౧. యత్నము. ౨. ఉత్సాహము. 3. నేర్పు. ర. పుష్టి.
గమకించు. దే. క్రి. ౧. యత్నించు. ౨. మనోజ్ఞమగు.

గమగమ. దే. వి. వాసనకొట్టుటలో నయ్యెడు చప్పుడు.
గమనము. దే. వి. ౧. పోక. ౨. ప్రయాణము. 3. రమించుట.
గమనించు. త్స. క్రి. అగమ్యాగమనము. ౧. తలచు ౨. ప్రయాణమగు.
గమనిక. త్స. వి. సూక్ష్మపద్ధతి.
గమము. త్స. వి. ౧. పోక. ౨. ప్రయాణము. 3. త్రోవ.
గమాగమములు. త్స. వి. రాకపోకలు.
గమాయించు. దే. క్రి. పరిమళించు.
గమి. దే. వి. ౧. సమూహము. ౨. సాంద్రము.
గమించు. త్స. క్రి. ౧. చేరు. ౨. రమించు. 3. వెళ్లు.
గమికత్తె. దే. వి. అంతఃపురపరిచారికలలో ముఖ్యురాలు.
గమికాఁడు. దే. వి. ౧. అధిపతి. ౨. సేనాధిపతి.
గమిగూడు. దే. క్రి. గుంపుగూడు.
గమిగొను. దే. క్రి. ప్రోగువడు.
గమ్మత్తు. దే. వి. చమత్కారము.
గమ్యము. త్స. వి. పొందఁదగినది.
గయాణము. దే. వి. గయ్యాళము.
గయాళి. } గయ్యాళి. } దే. విశే. ధిక్కరించి మాటాడునది. క్రి. గయాళించు. గయ్యాళించు.
గయ్యాళము. దే. వి. ధిక్కారపుమాట.
గరగట్టు. దే. క్రి. గడ్డకట్టు.
గరగ. దే. వి. ౧. ముంత. ౨. కుండ.
గరగర. దే. విశే. నిర్మలము. రూ. గరగరని.
గరగరిక. దే. వి. ౧. నైర్మల్యము. ౨. అందము. రూ. గరాగరిక.
గరళము. త్స. వి ౧. విషము.
గరాసు. దే. విశే. దుష్టుఁడు.
గరిగ. దే. వి. చిన్నికుండ. ముంత.
గరిగొను. దే. క్రి. అతిశయించు.
గరిటె. దే. వి. ఇనుముతోఁగాని ఇత్తడితోఁగాని చేసిన తెడ్డు.
గరిడి. దే. వి. ౧. సాము. ౨. సాముకూటము. రూ. గరిడీ.
గరిడికెక్కు. దే. క్రి. ఆరితేఱు.
గరిడిముచ్చు. దే. విశే. ఆరితేరినదొంగ.
గరిత. దే. వి. ౧. ఇల్లాలు. ౨. పతివ్రత.
గరిమము. త్స. వి. ౧. విధము. ౨. భారము. 3. గౌరవము.
గరిష్ఠము. త్స. విశే. మిక్కిలిబరువైనది. మిక్కిలిపెద్దది.
గరిసె. దే. వి. ౧. గాదె. ౨. కొలఁత.
గరు. దే. వి. గగ్గురుపాటు.
గరుటామంతుఁడు. } గరుటాలమంతుఁడు. } వై. వి. గరుత్మంతుఁడు.
గరుడకంబము. వై. వి. ౧. గరుడస్తంభము. ౨. నేరము చేసినవారిని బంధించుటకై కొత్వాలు చావడియెదుట పాఁతిన స్తంభము.

గరుడధ్వజుఁడు. త్స. వి. విష్ణువు.
గరుడపచ్చ. దే. వి. గరుత్మతము. (ఆకు పచ్చని మణి.)
గరుడి. దే. వి. గరుత్మంతుఁడు.
గరుడుఁడు. త్స. వి. గరుత్మంతుఁడు.
గరుత్మంతుఁడు. త్స. వి. గరుడుఁడు.
గరుదాల్చు. దే. క్రి. గగుర్పొడుచు.
గరుపాటు. దే. వి. రోమాంచము.
గరుపాఱు. దే. క్రి. రోమాంచమగు.
గరువము. వై. వి. ౧. గర్వము. ౨. గౌరవము. ౩. విరివి. ౪. అధికము. (గరువపు ఫలము.)
గరుసు. వై. విశ. గులకఱాలచే గట్టియైనది. వి. తోలు. మేర.
గరుసెక్కు. దే. క్రి. మేరమీఱు. పొంగు.
గర్జనము. త్స. వి. ౧. ధ్వని. ౨. కోపము.
గర్జించు. త్స. క్రి. ౧. ధ్వనించు. ౨. కోపించు.
గర్జితము. త్స. వి. మేఘధ్వని.
గర్జిల్లు. త్స. క్రి. ఉఱుము.
గర్తము. త్స. వి. పల్లము.
గర్దభము. త్స. వి. గాడిద.
గర్ధనము. త్స. వి. పేరాస.
గర్ధము. త్స. వి. ,,
గర్ధించు. త్స. క్రి. పేరాసపడు.
గర్భము. త్స. వి. కడుపు.
గర్భాధానము. త్స. వి. షోడశ కర్మములలో నొకటి.
గర్భిణి. త్స. వి. చూలాలు.
గర్వము. త్స. వి. ౧. అహంకారము. ౨. మదము.
గర్వించు. త్స. క్రి. గర్వపడు.
గర్వితుఁడు. దే. విశ. గర్వించినవాఁడు.
గర్హ. త్స. వి. నింద.
గర్హణము. త్స. వి. ,,
గర్హించు. త్స. క్రి. నిందించు.
గర్హ్యము. త్స. విశ. గర్హింపఁదగినది.
గఱగఱ. దే. వి. భక్ష్యములు నమలు నపుడయ్యెడి ధ్వన్యనుకరణము.
గఱగఱలాడు. దే. క్రి. గఱగఱయని శబ్దించు.
గఱి. దే. వి. ౧. ఱెక్కలి. ౨. గఱుకు. (గఱికమ్మ.)
గఱిక. దే. వి. ఒక దినుసుగడ్డి.
గఱుకు. దే. వి. కొడవలిలోనగువాని కక్కు.
గఱువ. దే. విశ. ౧. మర్యాదగలది. ౨. గంభీరము. ౩. పెద్దవాఁడు.
గలఁతియు. దే. వి. గిండిచెంబు.
గలగల. దే. వి. కదలుటయం దగు ధ్వన్యనుకరణము.
గలబ. దే. వి. అల్లరి.
గలబరించు. దే. క్రి. కలఁగు.
గలిబిలి. దే. వి. ౧. సందడి. ౨. కలఁత.
గలీబు. దే. వి. తలగడగౌసెన.
గల్భము. దే. విశ. దిట్టమైనది.
గల్లము. త్స. వి. చెక్కిలి.

గల్లు. దే. వి. భూషణములు మ్రోయుటయందయ్యెడి ధ్వన్యనుకరణము.
గవను. దే. వి. దుర్గపుర ద్వారము రూ. గవను.
గవరన. దే. విణ. కొంచెమెట్టునిది.
గవాక్షము. త్స. వి. కిటికి.
గవాశ్వము. త్స. వి. గోవులయు, గుఱ్ఱములయు సమూహము.
గవి. దే. వి. గుహ.
గవుండ్లవాఁడు. దే. వి. కల్లుగీచువాఁడు. రూ. గౌండ్లగాఁడు.
గవుఁడు. దే. వి. గౌఁడు.
గవుకున. దే. అవ్య. తొందరతో (గబుక్కున అనివాడుక.)
గవుద. దే. వి. గౌద. చిబుకము.
గవులు. దే. వి. కంపు. రూ. గౌలు.
గవుసెన. దే. వి. గలీబు.
గవేషణ. త్స. వి. వెదకుట.
గవేషణము. త్స. వి. ,,
గవ్యము. త్స. విణ. గోసంబంధమైన పంచగవ్యములు. పాలు, పెరుగు, నెయ్యి, పంచితము, పేడ.
గవ్వ. దే. వి. శంఖముదినుసు.
గసగసలు. దే. వి. బ. ఒకదినుసు విత్తులు. రూ. గసగసాలు.
గసిక. దే. వి. ౧. త్రవ్వుటకు ననుకూలమగుకొన చెక్కినకొయ్య. ౨. శలాక. 3. బాణము.
గసిబిసి. దే. విణ. ౧. గజిబిజి. ౨. తాఱుమాఱు.
గస్తీలు. దే. వి. బ. కావలివారు.
గస్తు. దే. వి. ఊరు తిరిగి కాఁచు కావలి.
గహనము. త్స. వి. అడవి. విణ. ౧. చొరరానిది. ౨. ఎఱుగరానిది.
గహ్వరము. త్స. వి. ౧. అడవి. ౨. గుహ.
గళంతిక. త్స. వి. ౧. జారీచెంబు. ౨. ధారాపాత్ర.
గళగళ. దే. వి. చెప్పుటయందగు ధ్వన్యనుకరణము.
గళగ్రహము. త్స. వి. మెడపట్టుట.
గళగ్రాహి. త్స. విణ. మెడపట్టువాఁడు.
గళనము. త్స. వి. జాఱుట.
గళము. త్స. వి. మెడ.
గళహస్తిక. త్స. వి. మెడను చేతితోఁ బిసుకుటకుఁ బట్టుట.
గళితము. త్స. విణ. జాఱినది.
గళ్లి. దే. వి. కళ్లి.

## గా

గాంగేయము. త్స. వి. బంగారము.
గాంగేయుఁడు. త్స. వి. ౧. భీష్ముఁడు. ౨. కుమారస్వామి.
గాండివము. } త్స. వి. అర్జునునివిల్లు.
గాండీవము. }
గాండీవి. త్స. వి. అర్జునునివిల్లు.

గాంఁడ్రించు. దే. క్రి. ఉబ్బు (ముఖము.)
గాంధర్వము. త్స. వి. ౧. సంగీతము. ౨. కన్యావరులు పరస్పరేచ్ఛచేతఁ జేసికొను వివాహము.
గాంధారి. త్స. వి. ధృతరాష్ట్రునిభార్య.
గాంధికుఁడు. విణ. గంధద్రవ్యము లమ్మువాఁడు.
గాంభీర్యము. త్స. వి. గంభీరభావము.
గాఁడి. దే. వి. త్రవ్వి కాని తొలిచి కాని నిడుపుగా నేర్పఱచిన పల్లము.
గాఁడిప్రొయ్యి. దే. వి. గాఁడిత్రవ్వి యేర్పఱచిన ప్రొయ్యి.
గాఁడు. దే. వి. దురద (నాకేమి గాఁడు పట్టెనా? అని వాడుక.)
గాగర. దే. వి. పరికిణీ రూ. గాగరా.
గాజు. దే. వి. ౧. ఒకదినుసుమన్ను. ౨. గాజుమట్టితోఁ జేసినకంకణములు.
గాజువాఱు. దే. క్రి. కాంతిహీనమగు.
గాజె. దే. వి. గాదె.
గాటము. దే. విణ. అధికము.
గాటు. దే. వి. ౧. కారము. ౨. తీవ్రమగు వాసన.
గాడి. దే. విణ. గాటము.
గాడిద. వై. వి. గార్దభము. రూ. గాడ్ద.
గాడీ. వి. బండి, రథము.
గాడుపు. దే. వి. గాలి.
గాఢము. త్స. విణ. ౧. అధికము. ౨. గుప్తము. (గాఢాలింగనము) ౩. మునిఁగినది.
గాణ. దే. వి. పాటకాఁడు. పాటకత్తె.
గాణపదము. త్స. వి. గాణాపత్యమని వాడుక (ఒకమతము.)
గాణిక్యము. త్స. వి. వేశ్యలసమూహము.
గాణీ. దే. వి. గాయకురాలు.
గాణుఁడు. దే. వి. గాయకుఁడు.
గాత. దే. వి. ౧. దెబ్బ. ౨. వ్రేటు. ౩. ద్రోహము.
గాత. త్స. విణ. గానముచేయువాఁడు.
గాతము. దే. వి. గొయ్యి. పల్లము.
గాత్రము. దే. విణ. ౧. స్థూలము; వి. ౨. కంఠస్వరము. త్స. వి. శరీరము.
గాథ. త్స. వి. ౧. చరిత్రము. ౨. పద్యము.
గాదము. దే. వి. గడ్డి.
గాదె. దే. వి. వడ్లగాదె. రూ. గాడియ.
గాధము. త్స. విణ. లోఁతులేనిది (మెరక).
గాధేయుఁడు. త్స. వి. విశ్వామిత్రుఁడు.
గాదిలి. దే. వి. ప్రేమము. విణ. ప్రేమపాత్రము.
గానము. త్స. వి. పాట.
గాబరా. వి. కలవరము.
గాబొగూబీ. దే. వి. అడావుడి. గడబిడ.
గాబు. దే. వి. మూతి వెడల్పుగల పెద్ద పాత్ర. (కొప్పెర.)

గానుఁగ. దే. వి. నూనె దీసెడి యంత్రము. రూ. గానుఁగు.

గామిడి. దే. విణ. ౧. శ్రేష్ఠుఁడు. ౨. బలిసిన. (గామిడి చన్నులు) 3. గయ్యాళి. ౪. దుష్టము.

గాము. వై. వి. ౧. సూర్యాది గ్రహము. ౨. దయ్యము.

గాయకము. దే. వి. ఎక్కువ వెల గలది.

గాయకుఁడు. త్స. వి. పాటపాడువాఁడు. దే. విణ. ప్రౌఢుఁడు.

గాయత్త్రి. త్స. వి. మంత్రవిశేషము. వ్యు. పలుకువానిని రక్షించునది.

గాయని. త్స. వి. పాటపాడు స్త్రీ.

గాయనుఁడు. త్స. విణ. పాటపాడువాఁడు.

గాయము. త్స. వి. కత్తిలోనగువాని దెబ్బ. నఱుకు.

గార. దే. వి. ౧. గోడలోనగువాని పూఁతకై యిసుకఁజేర్చి దంచిన సున్నము. ౨. మఱక.

గారడి. దే. వి. పాములవాఁడు.

గారడీఁడు. దే వి. ౧. ఐంద్రజాలికుఁడు. ౨. పాములవాఁడు.

గారము. } వై. వి. ౧.గొప్పతనము. ౨. ప్రేమము. రూ. గారాము.
గారవము. }

గారవించు. దే. క్రి. ౧. గౌరవపఱచు. ౨. ఆదరించు.

గారవిల్లు. దే. క్రి. గౌరవము పొందు.

గారాబము. } వై.వి. ౧. గొప్పతనము. ౨. ప్రేమము.
గారాబు. }

గారుడము. త్స. విణ. ౧. గరుడాకారము కల యుద్ధవ్యూహము. ౨. గరుడాస్త్రము. 3. గరుడపచ్చ. (ఒక రత్నము.)

గారుత్మతము. త్స. విణ. ,,

గారె. దే. వి. అచ్చము. ఉద్దిపప్పువడ.

గార్దభము. త్స. వి. గాడిద.

గార్హపత్యము. త్స. వి. గార్హస్థ్యము.

గార్హస్థ్యము. త్స. వి. గార్హపత్యము.

గాలము. } దే. వి. చేపలను బట్టుటకుపయోగమయ్యెడి సాధనము.
గాలాము. }

గాలి. దే. వి. ౧. వాయువు. ౨. దయ్యము.

గాలిజీవనము. = స్థిరజీవనము లేని బ్రతుకు.

గాలిబ్రదుకు. = స్థిరమైన జీవనము లేని బ్రదుకు.

గాలించు. దే. క్రి. ౧. వెదకు. ౨. బియ్యములోనగు వానిని నీళ్ళలోఁ బోసి రాళ్ళులేక శోధించు.

గాలిగుడి. దే. వి. సూర్యచంద్రులకుఁ జుట్టు నేర్పడెడు మండలము.

గాలిగుద్దు. దే. విణ. అవివేకి.

గాలితము. త్స. విణ. వడఁబోసినది. (వస్త్రగాలితము.)

గాలిపంట. దే. వి. నిర్ణయము లేనిపంట.

గాలిపటము. దే. వి. బాలు రాడుకొనెడి సాధనము.

గాలిమాట. దే. వి. జనశ్రుతి.

గాలివాన. దే. వి. గాలితోఁ గూడిన వాన.

గాలోడితము. త్స. వి. వాగ్విమర్శనము. (పరీక్షణము.)

గావు. దే. వి. బలి.

గావుకేక = బలియిచ్చునప్పు డఱచు అఱపు.

గావుపట్టు. దే. క్రి. ౧. చంపు. ౨. నాశముజేయు.

గాసట బీసట. దే. వి. సలక్షణము గాని చదువు.

గాసము. దే. వి. ఆహారము.

గాసి. దే. వి. శ్రమము., ఆయాసము. విణ. చెడినది. నశించినది. పనికి మాలినది.

గాసించు. దే. క్రి. బాధించు.

గాసిఁబడు. దే. క్రి. బాధనొందు.

గాసిఁబెట్టు. దే. క్రి. బాధించు.

గాసిచేయు. దే. క్రి. నాశముచేయు.

గాసియగు. దే. క్రి. నాశమగు.

గాసిలు. } దే. క్రి. బాధపడు.
గాసిల్లు. }

గాహనము. త్స. వి. స్నానము.

గాహము. త్స. వి. మునుక.

గాళుఁడు. దే. విణ. ప్రౌఢుఁడు.

గి

గింజ. దే. వి. ౧. విత్తు. ౨. ధాన్యము.

గింజు. దే. క్రి. విదిలించు. (కాలు)

గింజుకొను. దే. క్రి. కాళ్లు విదిలించుకొను.

గింటెము. దే. వి. ౧. జమిలిపోఁగు నేఁతబట్ట. ౨. సాంద్రము.

గిండి. దే. వి. సన్నపు మెడగల చెంబు. జారీ.

గిండుకము. త్స. వి. ఆటబంతి. (కందుకము.)

గిజగిజ. దే. వి. తన్నుకొనుటలో నయ్యెడి ధ్వన్యనుకరణము.

గిజగిజపడు చు. దే. క్రి. గిజగిజలాడు.

గిజగిజకొను. } దే. వి. తత్తఱపడు.
గిజగిజలాడు. }
గిజగిజవడు. }

గిజెరు. దే. వి. మామిడిపండులోనగు వానియందుండు బేసము. రూ. గింజురు.

గిజిగాడు. దే. వి. ఒకానొకపక్షి.

గిటక. ౧. విణ. పొట్టివాఁడు.

గిటగిట. దే. వి. ౧. పండ్లు కొఱుకు నపుడయ్యెడి ధ్వన్యనుకరణము. ౨. కృశము.

గిట్ట. దే. వి. ౧. పశువుల కాలిగోరు. ౨. బాణము.

గిట్టించు. దే. క్రి. ౧. చంపు. ౨. ఛేదించు. 3. గిట్టుబడియగు.

గిట్టింపు. దే. వి. ౧. గిట్టుబడి. ౨. చావు

గిట్టు. దే. క్రి. ౧. అనుకూలించు. ౨. చచ్చు. 3. నశించు.

గిట్టుబడి. దే. వి. అమ్మకమునందలి లాభము.

గిడ్డ. దే. విణ. పొట్టి.

గిడ్డంగి. దే. వి. సరకులుంచి యమ్మెడు నంగడి.

గిడ్డి. దే. వి. ఆవు.

గిత్త. దే. వి. ఎద్దుపట్టనికోడె.

గిన్నియ. } దే. వి. త్రాగెడుగిన్నె.
గిన్నె. }

గిబ్బ. దే. వి. అచ్చువేచినయెద్దు.

గిరక. దే. వి. నూతిరాట్నము.

గిరగిర. దే. వి. తిరుగుటలోనగుచప్పుడు.

గిరణము. త్స. వి. మ్రింగుట.

గిరద. } దే. వి. గుండ్రనిజుట్టును జుట్టియుండు వెండ్రుకలు.
గిరదా. }

గిరవు. దే. వి. ౧. తాకట్టు. ౨. కానుక.

గిరాకి. దే. విణ. ప్రియమైన (వస్తువు.)

గిరాటువేయు. దే. క్రి. ఱువ్వు.

గిరి. త్స. వి. కొండ.

గిరిజ. త్స. వి. ౧. పార్వతి. ౨. అభ్రకము.

గిరిమల్లిక. త్స. వి. కొండమల్లె.

గిరిశుఁడు. } త్స. వి. శివుఁడు.
గిరీశుఁడు. }

గిఱక. దే. విణ. పొట్టి.

గిఱి. దే. వి. గుండ్రమగుగీఁత.

గిఱికొను. దే. క్రి. ౧. చుట్టుకొను. ౨. వ్యాపించు.

గిఱుకు. దే. క్రి. అక్షరములు చక్కఁగా దెలియనివిధమున వంకర కొంకరగా గీచు.

గిఱుక్కు. దే. వి. మరలుటయందయ్యెడి ధ్వన్యనుకరణము.

గిఱుపు. దే. క్రి. ౧. కదిలించు. ౨. ఱువ్వు.

గిఱ్ఱు. దే. వి. తిరుగుటలో నగుచప్పుడు.

గిలక. దే. వి. బాలురాడు నాటసాధనము.

గిలకరించు. దే. క్రి. ౧. గిలకొట్టు ౨. చిలుకు.

గిలకొట్టు. దే. క్రి. చిలుకు.

గిలగిలలాడు. దే. క్రి. క్షోభించు.

గిలనము. త్స. వి. మ్రింగుట.

గిలి. దే. వి. భయము.

గిలిగించు. దే. క్రి. గిలిగింతపెట్టు. రూ. గిలిగిలించు.

గిలిగింత. దే. వి. చక్కలిగింత.

గిలిగింతవాఱు. దే. క్రి. గిలిగింతపెట్టినట్లగు.

గిలిగింతవోవు. దే. క్రి. గిలిగింత గలదగు.

గిలిగిలి. దే. వి. గిలిగింత.

గిలిగిలించు. దే. క్రి. గిలిగించు.

గిలిగిలింత. దే. వి. గిలిగింత.

గిలుకరించు. దే. క్రి. మ్రోఁగు.

గిలుపు. దే. క్రి. గిఱుపు.

గిలుబాడు. దే. క్రి. అపహరించు, వంచించు.

గిలుబు. దే. క్రి. అపహరించు.

గిలుబుకొను. దే. క్రి. దొంగిలించు.

గిలుబుచేయు. దే. క్రి. ,,

గిల్లకన్ను. దే. వి. మెల్లకన్ను.

గిల్లు. దే. క్రి. గోటితోఁ ద్రుంచు.

గిల్లుడు. దే. వి. గోటితోఁ ద్రుంచుట.

గీ

గీఃపతి. త్స. వి. ౧. బృహస్పతి. ౨. చదువరి.

గీఁక. దే. వి. ఏనుగు ఘీంకారము. (జంకారము.)

గీఁకు. దే. క్రి. కత్తిలోనగు వానిచే గీచు.

గీఁటు. దే. క్రి. ౧. కొఱుకు. (పండ్లు) ౨. చిమ్ము. 3. త్రిప్పు. (కన్ను)

గీఁత. దే. వి. గీటు.

గీచు. దే. క్రి. గీటు. గీచు.

గీటుడఁగు. దే. క్రి. చచ్చు.

గీటుడఁచు. దే. క్రి. గీటుడఁగించు.

గీటు. దే. వి. గీఁత.

గీటునఁబుచ్చు. దే. క్రి. అలక్ష్యము చేయు.

గీత. త్స. వి. ఆధ్యాత్మిక తత్త్వవిషయమై ప్రశ్నోత్తర రూపమున నుండు గ్రంథము. భగవద్గీత, శివగీత మొ॥

గీతము. త్స. వి. పాట.

గీతి. త్స. వి. పాట.

గీపెట్టు, దే. క్రి. ౧. మొఱపెట్టు, ౨. శబ్దించు. 3. ఘీంకారముసేయు.

గీము. వై. వి. ఇల్లు.

గీయు. దే. క్రి. గీఁతగీయు.

గీర్ణము. త్స. విణ. ౧. మ్రింగఁబడినది.

గీర్పతి. త్స. వి. బృహస్పతి.

గీర్వాణుఁడు. త్స. వి. దేవత.

గీఱ. దే. వి. గీఁత.

గీఱు. దే. క్రి. ౧. గోఁకు. ౨. ఛేదించు. 3. గోళ్లతోదువ్వు.

గీఱుడు. దే. వి. గోకుఁడు.

గీష్పతి. త్స. వి. బృహస్పతి. (వ్యా. వాక్కులకు పతి.)

గు

గుంజె. దే. వి. స్తంభము. త్స. వి. గురిగింజ.

గుంజిళ్ళు. దే. వి. బ. చేతులు కట్టుకొని రెండుకాళ్ళు చేర్చి పెట్టి కూర్చుండి లేచుట.

గుంజితము. త్స. వి. అవ్యక్తమధుధ్వని.

గుంజు. దే. క్రి. ౧. ఈడ్చు. ౨. ఊడుకు. వి. తాడు. ఈఁదు ...గువాని మోవు మొదలు.

గుంజుకొను. దే. క్రి. గుంజులాడు.

గుంజులాడు. దే. క్రి. లాగులాడు.

గుంట. దే. వి. ౧. దొరువు. ౨ పల్లము. 3. భూపరిమాణ విశేషము.

గుంటనక్క. దే. వి. చిన్నజాతినక్క.
గుంటమారి. దే. విణ. దుర్మార్గుఁడు.
గుంటి. దే. వి. ౧. చేనిభాగము. ౨. దున్నుట మొదలగువాని కేర్పఱచుకొన్న భాగము.
గుంఠనము. త్స. వి. కప్పుట.
గుంఠితము. త్స. విణ. కప్పఁబడినది.
గుండ. దే. వి. పొడి.
గుండఁడు. దే. విణ. బంటు.
గుండగొయ్య. దే. వి. దుష్టుఁడు.
గుండము. దే. వి. నిప్పులగుంట. రూ. గుండాము.
గుండా. దే. విణ. ధీరుఁడు.
గుండాడు. దే. క్రి. పొడిచేయు.
గుండిగ. దే. వి. వెడల్పు నోరుగల పెద్దపాత్రము.
గుండియ. దే. వి. హృదయము. రూ. గుండె.
గుండీ. దే. వి. బొత్తాము.
గుండు. దే. వి. ౧. గుండ్రపుఱాయి. ౨. తూనికగుండు. 3. ఫిరంగి గుండు. ౪. కొండ.
గుండుకొను. దే. క్రి. చుట్టుకొను.
గుండుగిలు. దే. క్రి. చుట్టచుట్టుకొని పడు.
గుండుగుత్త. దే. వి.సమస్త స్వాతంత్ర్యములతో నిచ్చుగుత్త. (గంపగుత్త అని వాడుక.) (గుండెఁగూడఁబెట్టు = మనస్సు దృఢపఱచుకొను. గుండెలునీరగు = ధైర్యముచెడు. గుండెపట్టుకొను = ధైర్యముఁదెచ్చుకొను. గుండెలుదీసినబంటు = మహాధీరుఁడు.)
గుండె. దే. వి. హృదయము.
గుండెకాయ. దే. వి. హృదయము.
గుండ్రము. విణ. వర్తులము. (గుండ్రకడుపు మొదలగుచోట 'ము' వర్ణము లోపించును.)
గుండ్రాయి. దే. వి. పొత్తరము.
గుండ్రించు. దే. క్రి. తిరుగఁబడు.
గుంత. దే. వి. పల్లము.
గుంపించు. దే. క్రి. ౧. కుప్పవేయు. ౨. అతిక్రమించు.
గుంపు. దే. వి. ప్రాణిసమూహము.
గుంఫనము. త్స. వి. కూర్చుట.
గుంఫము. త్స. వి. ,,
గుగ్గిలము. దే. వి. గుగ్గిలవృక్షపుబంక.
గుగ్గిళ్లు. దే. వి. బ. ఉడుకవేసిన సెనగలు లోనగునవి.
గుచ్ఛకము. } త్స. వి. ౧. పూగుత్తి.
గుచ్ఛము. } ౨. పొద.
గుజగుంపు. దే. వి. అడావుడి.
గుజగుంపువెట్టు. దే. క్రి. అల్లరివెట్టు.
గుజగుజలాడు. } దే.క్రి. ౧. త్రొక్కటపడు. ౨. సన్నని యెలుఁగున రహస్యముగఁ బలుకు.
గుజగుజవోవు. }
గుజరాతి. దే. వి. దేశభేదము.

గుజేరి. దే వి. గుజరాతి.
గుజ్జెరాతి. దే. వి. గుజరాతి.
గుజేరీ. } దే. వి. సంతచోటు.
గుజిరీ. }
గుజ్జెరివాఁడు. దే. వి. ఘూర్జర దేశస్థుఁడు.
గుజ్జు. దే. వి. ౧. అనుకగు రసద్రవ్యము. ౨. చిక్కనిది. 3. పొట్టివాడు. ౪. కోడిదూడ. ౫. క్రొవ్వు.
గుజ్జెనగూళ్లు. దే. వి. బ. బాలురాడుకొను నొక విధమగు నాట.
గుటక. దే. వి. ఒకతడవ నోటఁ బోసికొని మ్రింగెడు నీళ్లు లోనగువాని పరిమాణము.
గుటకలువేయు. దే. క్రి. ఉవ్విళ్లూరు.
గుటిక. త్స. వి. ఉండ. మాత్ర.
గుటగుట. దే. వి. అన్న ముడుకునపుడును, నీరు త్రాగునపుడును అయ్యెడు చప్పుడు.
గుటుక్కను. దే. క్రి. చచ్చు.
గుటుక్కు. దే. వి. మ్రింగుటలోనయ్యెడి ధ్వన్యనుకరణము. రూ. గుటుకు. గుడుక్కు.
గుట్ట. దే. వి. చిన్నకొండ.
గుట్టు. దే. వి. ౧. మర్మము. ౨. ధైర్యము. 3. మోసము. (గుట్టిచ్చు = మర్మము దెలియనిచ్చు. గుట్టుచెడు = ధైర్యముచెడు.)
గుడము. త్స. వి. బెల్లము.
గుడాకేశుఁడు. త్స. వి. అర్జునుఁడు.
గుడారము. దే. వి. వస్త్రముచే నేర్పఱిచెడు నిల్లు. రూ. గుడారము.
గుడారు. దే. వి. ,,
గుడి. దే. వి. ౧. పరివేషము. ౨. దేవాలయము.
గుడికట్టు. దే. వి. గ్రామము నాల్గు దిక్కుల యెల్లల యేర్పాటు.
గుడికొను. దే. క్రి. ౧. క్రమ్ము. ౨. గుండ్రముగాఁ దిరుగు.
గుడిగుడి. దే. విశ. ఉబుకునది. (గుడి గుడి కన్నీరు.)
గుడిచుట్టు. దే. వి. చంద్రసూర్యులకుఁ జుట్టు నేర్పడెడు మండలాకారము.
గుడిముద్రవేసికొను. దే. క్రి. బ్రహ్మచారిణిగానుండు. (గుడి=యోని.)
గుడిసాని. దే. వి. దేవదాసి.
గుడిసె. దే. వి. స్తంభములు గోడలు లేని చిన్నయిల్లు.
గుడిసెవేటు. దే. విశ. కులట గుడిసె వేటుది.
గుడుగుడు. దే. వి. ౧. చిన్న నాక్కా. ౨. పరుగెత్తునపు డయ్యెడు చప్పుడు.
గుడుసు. దే. వి. పరివేషము.
గుడుసుపడు. దే. క్రి. గుండ్రపడు.
గుడ్డ. దే. వి. ౧. వస్త్రము, క్షేత్రస్థానము, 3. బాలుఁడు.

గుడ్డము. దే. వి. చేను. (రూ) గుడ్డాము.
గుడ్లగూబ. దే. వి. ఒకానొక పక్షి. (పగటిపూట దీనికిఁ గన్నులగపడవు కావున రేలఁ దిరుగును.)
గుణకము. త్స. వి. పెంచెడులెక్క.
గుణనము. త్స. వి. లెక్కించుట.
గుణనిక. త్స. ఏ. నిరంతరాభ్యాసము.
గుణపడు. త్స. పి. చక్కఁబడు.
గుణము. త్స. వి. ౧. త్యాగశౌర్యాది. ౨. త్రాడు. 3. అల్లెత్రాడు. ౪. అలవాటు.
గుణావర్తము. త్స. వి. పునాది (గుణావర్థము అని వాడుక.)
గుణించు. త్స. క్రి. గుణకముచేయు.
గుణితము. త్స. వి. హల్లులతో అచ్చులనుచేర్చి చెప్పుట. (రూ) గుణింతము.
గుణ్యము. త్స. విణ. ౧. గుణింపఁదగినది. ౨. ప్రశస్తగుణములుగలది.
గుత్త. వై. వి. ఒకరిసొత్తును దాని యజమానునకు దానిఫలము అనుభవించుటకై తగిన సొమ్మిచ్చి తన యధీనమున నుంచుకొనుట. విణ. స్థిరము.
గుత్తకాఁడు. దే. విణ. గుత్త ఎత్తినవాఁడు.
గుత్తగొను. దే. క్రి. గుత్త యెత్తు.
గుత్తపట్టు. దే. క్రి. గుత్తగొను.
గుత్తము. దే. విణ. బిగువు.
గుత్తి. దే. వి. ౧. పూవు లోనగువాని గుచ్ఛము. ౨. చీలమండ.
గుదగుదలాడు. దే. క్రి. డగ్గుత్తికతో నేడ్చు.
గుదము. త్స. వి. ముడ్డి.
గుది. దే. వి. ౧. గుత్తి. ౨. ఆకులు లోనగువాని గ్రుచ్చిన సరము.
గుదికాలు. దే. వి. చీలమండకు దిగువనుండు పాదమువెనుకటిభాగము.
గుదికూర్పు. దే. వి. మాటలు లోనగువాని కూర్పు.
గుదిగఱ్ఱ. దే. వి. ఆవులమెడను గట్టెడు కొయ్య.
గుదిగుంపులు సేయు=గుదిగుచ్చు.
గుదిగొను. దే. క్రి. ౧. దట్టమగు. ౨. అతిశయించు. 3. మూటకట్టుగాఁ గూలపడు.
గుదిత్రాడు. దే. వి. దూడకాలికిఁ గట్టు త్రాడు.
గుదిత్రోయు. దే. క్రి. కాళ్లుకట్టిత్రోయు.
గుదియ. దే. వి. గుదికఱ్ఱ. (రూ. గుదె.)
గుదివడు. దే. క్రి. కట్టుపడు.
గుదులుపట్టు. దే. క్రి. కాళ్లు స్తంభించు.
గుద్ద. దే. వి. ౧. గుదము. ౨. యోని.
గుద్దలి. దే. వి. వేళ్లు మొదలగువానిఁ బెల్లగించెడు పనిముట్టు.
గుద్దలించు. దే. క్రి. ౧. గుద్దలితోఁ బెల్లగించు. ౨. వెదకు.
గుద్దలిగొను. దే. క్రి. గుద్దలిపెట్టిత్రవ్వు.
గునగున. దే. వి. వేగముగా నడచునప్పుడయ్యెడు ధ్వన్యనుకరణము.

గునపము. దే. వి. గడ్డపాఱ. (రూ) గునుపము.

గునియు. దే. క్రి. ౧. కులుకు. ౨. ఊగు. 3. చలించు.

గునిసాడు. దే. క్రి. గునియు.

గునుకునడ. దే. వి. మందగమనము.

గునుకెత్తు. దే. క్రి. పరుగెత్తు.

గునుపు. దే. వి. విలాసము.

గున్న. దే. వి. పిల్లకూన.

గుప్తము. త్స. విణ. ౧. దాచబడినది. ౨. కాపాడబడినది.

గుప్తి. త్స. వి. రక్షణము.

గుప్పళించు. దే. క్రి. ౧. గుడ్డలు మొదలగువానిని ఉదుకు. (ఉప్పళించు) ౨. పుక్కిలించు. 3. అడుగులు వేయు.

గుప్పించు. దే. క్రి. బాణమును ప్రయోగించు. ౨. కురియు.

గుప్పిలి. దే. వి. పిడికిలి.

గుప్పు. దే. క్రి. ౧. చల్లు. ౨. ఉంచు. 3. ప్రయోగించు.

గుప్పుతెప్పున. దే. అవ్య. అతిశీఘ్రముగా.

గుప్పున. దే. విణ. వేగముగా.

గుబగుబ. దే. వి. సందడి.

గుబాలున. దే. విణ. హటాత్తుగా.

గుబాళించు. దే. క్రి. వాసనకొట్టు.

గుబిలి. దే. వి. గులిమి (కర్ణమలము)

గుబుకు. దే. క్రి. గుముకు.

గుబురు. దే. వి. ౧. దట్టము. ౨. సమూహము. రూ. గుమురు.

గుబురులుకొను. దే. క్రి. గుంపులుకట్టు.

గుబులు. దే. వి. ౧. గుప్పని కొట్టు వాసన. ౨. భయము.

గుబులుకొను. దే. క్రి. గుప్పనివాసనకొట్టు.

గుబ్బ. దే. వి. ౧. స్తనము. ౨. గొడుగు మీది గుబ్బ. విణ. గుండ్రము. (గుబ్బచన్ను.)

గుబ్బటిలు.
గుబ్బటిల్లు.
గుబ్బతిలు.
గుబ్బతిల్లు. } దే. క్రి. ౧. అతిశయించు. ౨. ఉప్పొంగు.

గుబ్బన. దే. అవ్య. శీఘ్రముగా.

గుబ్బలాడి. దే. వి. యౌవనము కల యాడుది. (పెద్ద గుబ్బలుగలది)

గుబ్బలి. దే. వి. కొండ.

గుబ్బెత. దే. వి. గుబ్బలాడి.

గుభాలు, గుభేలు
గుభిల్లు, గుభుల్లు } ధ్వన్యనుకరణము.

గుమగుమ. దే. వి. గుమగుమ అను వాసన.

గుమి. దే.వి. ౧.గుంపు.౨.గుది. 3.పొద. గుమిగూడు = గుంపుగూడు.

గుములుగూడు = గుంపుగూడు.

గుముకు. దే. క్రి. సిడికిటితో పొడుచు. రూ. గుబుకు.

గుమురు. దే. వి. చూ. గుబురు.

గుమురుకొను. దే. క్రి. గుమురుగట్టు.

గుములుగూడు = గుంపుగూడు.

గుమ్మ. దే. వి. పాలు పిండునప్పుడు వచ్చు ధార.

గుమ్మఁడు. దే. విశే. ౧. అలంకరించుకొనువాఁడు. ౨. కృష్ణుఁడు.

గుమ్మటము. దే. వి. దీపముంచెడు కాకితపు గూడు.

గుమ్మడి. దే. వి. గుమ్మడిచెట్టు.

గుమ్మడి కాయలో నావగింజయుఁబోదు=కావలసిన దానిలోఁ గొంచెమైనను గాలేదు.

గుమ్మడిమూట. దే. వి. గుమ్మడిపండు వలెనుండు మూట.

గుమ్మము. దే. వి. వాకిలి.

గుమ్ము. దే. క్రి. చూ. గుముకు. వి. ౧. పిడికిటిపోటు. ౨. వాసన కొట్టునప్పుడయ్యెడి ధ్వని.

గుమ్మెట. } దే. వి. తుడుము.
గుమ్మెత. }

గుయ్యారము. దే. వి. గువ్వాగారము. (కారాగృహము)

గురగుర. దే. వి. పందికూఁత.

గురణము. త్స. వి. యత్నము. పూనిక.

గురస్తు. దే. వి. గృహస్థు.

గురిగి. దే. వి. చిన్న మట్టిపాత్ర.

గురిగింజె. దే. వి. గురిజపూస.

గురిజె. దే. వి. చిన్న మట్టిపాత్ర.

గురుజె. దే. వి. వజ్రము.

గురువు. త్స. వి. ౧. ఉపాధ్యాయుఁడు. ౨. బృహస్పతి. ౩. కులముపెద్ద. ౪. తండ్రి. ౫. తండ్రితోఁడఁ బుట్టినవాఁడు. ౬. తాత. ౭. అన్న. ౮. మేనమామ. విశే. ౧. అలఘువు. ౨. గొప్పది.

గురువులువాఱు. దే. క్రి. ౧. పసగెత్తు. (రూ) గురువువాఱు. ౨. అతిశయించు. ౩. హర్షించు.

గురుసు. దే. వి. మర్మము.

గుర్తించు. దే. క్రి. గుఱుతుపట్టు.

గుర్వాణఁగించు. దే. వి. ఆధిక్యమణచు.

గుర్వి. త్స. వి. గర్భిణి.

గుర్వు. దే. వి. ఆధిక్యము.

గుఱక. దే. వి. నిద్రలో కలుగునట్టి ధ్వని.

గుఱగుఱ. దే. వి. ఒకవిధమైన దురద.

గుఱి. దే. వి. ౧. లక్ష్యము. ౨. గుఱుతు. ౩. విశ్వాసము. ౪. సాక్షి.

గుఱికట్టు. దే. వి. అంచు. ౨. మితి. ౩. కట్టుపాటు.

గుఱికొను. దే. క్రి. లక్షించు.

గుఱిపడు. దే. క్రి. ప్రసిద్ధికెక్కు.

గుఱియగు. దే. క్రి. సమర్థుఁడగు.

గుఱుకొను. దే. క్రి. యత్నించు. (ఇది క్త్వార్థకముగానే ప్రయుక్తము. గుఱుకొని = బుద్ధిపూర్వకముగా.)

గుఱుతిడు. దే. క్రి. అపేక్షించు. కోరు.

గుఱుతు. దే. వి. ౧. చిహ్నము. ౨. మేర.
గుఱుతుపడు. దే. క్రి. తెలియు.
గుఱువెట్టు. దే. క్రి. గుఱికయిడు.
గుఱ్ఱము. దే. వి. అశ్వము.
గుఱ్ఱు. దే. వి. కోపమునం దనుకరణము. ౨. నిద్రలో నయ్యెడుచప్పుడు.
గుఒక. దే. వి. ఒకదినుసుతాయి.
గులకరించు. దే. క్రి. ౧. అంకురించు. ౨. శబ్దించు.
గులగుల. దే. వి పుట్టలను గోరాడుట యం దయ్యెడు ధ్వని. ౨. బ. చూర్ణము. ౩. నలఁగుడు.
గులామెత్తు. దే. క్రి. బిచ్చమెత్తు.
గులాము. దే. వి. దాసుఁడు. రూ. గుల్లాము.
గులాబి. దే. వి. పన్నీరుపువ్వు.
గులిబి. } దే. వి. కర్ణమలము.
గులిమి. }
గులిమికదురు. దే. వి. చెవిలోని గులిమిని దీయు నాయుధవిశేషము.
గుల్మము. త్స. వి. ౧. ఒకవిధమైన రోగము. ౨. సేనావిశేషము. (౯ రథములు, ౯ ఏనుఁగులు, ౨౭ గుఱ్ఱములు, ౪౫ కాల్బలము.) ౩. పొద. ౪. పల్లెయందలి ఠాణా.
గుల్ల. దే. వి. ౧. కప్పచిప్ప. ౨. బొబ్బ. విణ. బోలు.
గుల్లకాఁడు. దే. విణ. అంతస్సారము లేనివాఁడు.
గుల్లకాసు. దే. వి. బోలుగాఁ జేసిన కాసు (అల్పమైన నాణెము.)
గుల్లపఱచు. దే. క్రి. అవమానపఱచు.
గుళిక. త్స. వి. ఉండ.
గుళిగ. త్స. వి. ,,
గుళుచ్ఛము. త్స. వి. గుత్తి.
గువ్వ. దే. వి. ౧. పావురము. ౨. పక్షి.
గువ్వకుత్తుక. దే. వి. ఆఁకలిచేతఁ గలుగు హీనస్వరము.
గువ్వకుత్తుకపడు. దే. క్రి. ఆఁకలిచేతఁ గృశించు.
గుసగుస. దే. వి. రహస్యపుమాటల చప్పుడు. గుసగుసలఁబోవు; గుసగుసలుపోవు = గుసగుసలాడు.
గుసగుసలాడు. దే. వి. గుసగుస అని మాటలాడు.
గుహ. త్స. వి. ౧. కొండలోని బిలము. ౨. పల్లము.
గుహ్యము. త్స. వి. రహస్యమైనది.

## గూ

గూఁడు. దే. వి. ౧. పక్షిగృహము. ౨. గోడలయందు దీపము పెట్టుటకు నేర్పఱిచినచోటు.
గూటము. } దే. వి. గుంజె. ౨. డేరామేకు.
గూటాము. }
గూడ. దే. వి. ౧. వానకుఁ దలమీఁద వేసికొను జమ్ముగూడ. ౨. నీళ్ళు చల్లెడి వెదురుబుట్ట. ౩. పూలబుట్ట.
గూడారము. దే. వి. గుడారము.

గూడారు. దే. వి. గుడారు.

గూఢచారుఁడు. త్స. వి. వేగులవాఁడు.

గూఢమణి. త్స. వి. బాలికలు ఇసుకలో రత్నమును లేక రాయినిదాఁచి ఎదిరివారిని గనుగొమ్మని చెప్పుఆఁట.

గూడెము. దే. వి. కొండదొనయందుండెడి బోయపల్లియ.

గూరుగిలు. దే. క్రి. వంగు.

గూఢము. త్స. వి. రహస్యము.

గూనివాఁడు. దే. విణ. పొట్టివాఁడు.

గూను. దే. వి. నడుముమీఁదివంపు.

గూబ. దే. వి. కర్ణమూలము.

గూరువోవు. దే. క్రి. గూనుకలదగు.

గూహనము. త్స. వి. గోపనము.

గృ

గృధ్నువు. త్స. విణ. లోభి.

గృధ్రము. త్స. వి. గద్ద. (వ్యు. మాంసమును కాంక్షించునది.)

గృహము. త్స. వి. ౧. ఇల్లు. ౨. పెండ్లాము.

గృహమేధి. త్స. వి. గృహస్థుఁడు.

గృహయాళువు. త్స. విణ. గ్రహించువాఁడు.

గృహస్థుఁడు. త్స. వి. చూ. గృహమేధి.

గృహిణి. త్స. వి. ఇల్లాలు.

గృహీతము. త్స. విణ. గ్రహింపఁబడినది.

గృహీతి. త్స. విణ. ౧. గ్రహించువాఁడు. ౨. గ్రహించు సామర్థ్యము గలబుద్ధి.

గె

గెంటుము. దే. వి. జంటనేతవస్త్రము.

గెంటరి. దే. విణ. వీరుఁడు.

గెంటించు. దే. క్రి. చలించు.

గెంటు. దే. క్రి. ౧. చలించు. ౨. త్రోయు.

గెడ. దే. వి. ౧. జత. ౨. సమీపము.

గెడగూడు. దే. క్రి. జతగూడు; రతియందుఁ గలియు.

గెదుము. దే. క్రి. గదుము.

గెల. దే. వి. పండ్లయొక్కయు, కాయలయొక్కయు, గొల.

గెఱ. దే. వి. రేఖ.

గెఱకట్టు. దే. క్రి. ఏర్పడిన మండలరేఖ కలదగు.

గెలివి, గెలివిడి. దే. వి. సంతోషము.

గెలుచు. దే. క్రి. ౧. జయించు. ౨. పోవు.

గెలుపు. దే. వి. ౧. జయించుట. ౨. పోవుట.

గెలుపుకొను. దే. క్రి. జయించు.

గే

గేదఁగి. దే. వి. పచ్చపూమొగిలి.

గేందుకము. త్స. వి. బంతి.

గేడెకాళ్లవాఁడు. దే. విణ. కొంగకాళ్ల వాఁడు. (సన్నని పొడగైన కాళ్లవాఁడు.)
గేదె. దే. వి. బఱ్ఱె. రూ. గేదియ.
గేయము. త్స. వి. పాట.
గేలి. దే. వి. ఎగతాళి.
గేలించు. దే. క్రి. అపహసించు.
గేలికొట్టు. దే. క్రి. ,,
గేలికొను. దే. క్రి. ,,
గేలిపెట్టు. దే. క్రి. ,,
గేలిసేయు. దే. క్రి. ,,
గేస్తు. } వై. వి. గృహస్థుఁడు.
గేస్తుఁడు. }
గేస్తురాలు. వై. వి. ఇల్లాలు.
గేహము. త్స. వి. ఇల్లు.
గేహి. త్స. వి. గృహస్థు.
గేహిని. త్స. వి. గృహిణి.
గేహేనర్ది. త్స. వి. ఇంటిలో నఱచు వాఁడు.
గేహేశూరుఁడు. త్స. విణ. ఇంటనే వీరుఁడు. (పిఱికి.)

## గొ

గొంగ. దే. వి. శత్రువు.
గొంగడి. } దే. వి. కంబళి.
గొంగళి. }
గొంటు. దే. విణ. దుష్టుఁడు. వి. బంద లేని వక్క.
గొంటుకాఁడు. దే. విణ. కఠినుఁడు.
గొండిలి. దే. వి. ౧. ఆట (త్రుళ్లాట.) ౨. కుండలాకార నృత్యము.
గొండ్లివాఁడు. దే. విణ. నటుఁడు.
గొండెము. దే. వి. తలుపుచిలుకు. రూ. (గొండ్లెము.)
గొంతి. దే. వి. కుంతి.
గొంతు. దే. వి. ౧. కంఠము. ౨. కంఠధ్వని. (తడిగుడ్డల గొంతు గోయు = తెలియకుండ నపకారము సేయు.) గొంతుక.
గొంతెమకోరిక. దే. వి. కోరఁ దగని కోరికలుగోరుట.(అసాధ్యపుఁగోరిక.)
గొంది. దే. వి. మూల.
గొగ్గి. దే. విణ. హెచ్చుతక్కువైనది.
గొజ్జఁగినీరు. దే. వి. పన్నీరు.
గొజ్జఁగిమంచు. దే. వి. ,,
గొట్టము దే. వి. కోవి.
గొట్టు. దే. వి. ౧. దౌష్ట్యము. ౨. అల్లరి. విణ. కఠినము.
గొడఁగు. దే. క్రి. గొణఁగు.
గొడవ. దే. వి. ౧. ఆపద. ౨. తప్పు. 3. దుఃఖము.
గొడారి. దే. వి. మాదిగవాఁడు. రూ. గొడగరి.)
గొడుగు. దే. వి. ఛత్రము.
గొడ్డలి.దే.వి. చెట్టునఱికెడు పనిముట్టు.
గొడ్డు. దే. వి. ౧. గొడ్రాలితనము. ౨. ఈననియావు. 3. గొడ్రాలు. ౪. పశువు.

గొడ్డేఱు. దే. క్రి. ౧. గుత్తయెత్తు; విణ. ౨. వ్యర్థము. 3. నీరులేని కొలను.
గొడ్డాలు. దే. వి. గొడ్డురాలు.
గొణఁగు. దే. క్రి. చూ. గొడఁగు.
గొద. దే. వి. ఆఁకలి.
గొదకొను. దే. క్రి. ౧. అతిశయించు. ౨. త్వరపడు.
గొదగొద. దే. వి. పగ.
గొనకొను. దే. క్రి. యత్నించు.
గొనబారు. దే. క్రి. సొగసగు.
గొనబు. దే. వి. అందము. చక్కఁదనము. విణ. గొనలుకాడు.
గొనము. వై. వి. ౧. గుణము. ౨. అల్లెత్రాడు.
గొనయము. దే. వి. వింటినారి.
గొప్ప. దే. విణ. పెద్ద.
గొబ్బండు. దే. వి. ౧. గొప్పపండు. ౨. కొబ్బరికాయ.
గొబ్బి. దే. వి. ౧. ధనుర్మాస దినములలో సాయంకాలములందు ఆవు పేఁడముద్దకు బీఱ, కాఁకర, సొర పూవులు గ్రుచ్చి దానిచుట్టి బాలికలు చేతులు దట్టుచు నాడెడి యాట. 3. సమర్తాడినప్పుడు బాలికలు పాటలు పాడుచు చేతులు తట్టుచు నాడెడు నాట.
గొబ్బిళ్లు. దే. వి. బాల్యక్రీడావిశేషము.
గొబ్బున. దే. క్రి. విణ. త్వరగా.
గొమలిరేకు. దే. వి. మొగలిరేకు.
గొయి. దే. వి. గోయి.
గొయ్యి. దే. వి. పల్లము.
గొరక. దే. వి. ౧. ఇనుప బాణము, అమ్ము. విణ. ౨. చింపిరి. (గొరక వెంట్రుకలు.)
గొరవంక. దే. వి. గోరువంక.
గొరిజ. } గొరిసె. } దే. వి. పశువుల కాలిగిట్ట.
గొఱపము. దే. వి. అర్ధచంద్రాకార బాణము.
గొఱియ. దే. వి. చూ. గొఱ్ఱె.
గొఱియపోతు దే. వి. మగగొఱ్ఱె.
గొఱుగు. దే. క్రి. క్షౌరముసేయు.
గొఱుగులువడు. దే. క్రి. గొఱఁగఁబడినవగు.
గొఱ్ఱియ. దే. వి. మేషి. రూ. గొఱ్ఱె.
గొఱ్ఱు. దే. వి. ౧. మూఁడు ఎకరముల విస్తీర్ణము కల పొలము. ౨. మెత్తఁదున్నిన పొలములో విత్తనములు చల్లుటకు ఉపయోగించెడు సాధనము.
గొల. దే. వి. గెల.
గొలక. దే. వి. గెల.
గొలగొల. దే. వి. కలకలధ్వని.
గొలుసు. దే. వి. ౧. సంకెల. ౨. ఆభరణ విశేషము.
గొలుసుగొను. దే. క్రి. గొలుసువలెనగు.
గొలుసుమోడి. దే. వి. జిలుగువ్రాత.

గొల్ల. దే. వి. ౧. ద్వారపాలకుఁడు. ౨. పశువుల మేపియు, పాలు పెరుగు అమ్మియు జీవించు జాతి.
గొల్లఁడు. దే. వి. గొల్లవాఁడు.
గొల్లత. దే. వి. గొల్లది, గోపిక.
గొల్లు. దే. వి. కలకలధ్వని.
గొల్లెన, గొల్లియన. దే. వి. ఒకవిధమైన గుడారము.
గొల్లెత. దే. విణ. గొల్లత.
గొల్లెనబండి. దే. వి. గూడుకట్టినబండి.
గొహరు. దే. వి. బాధ.

గో

గోంగ్రడించు. } గోంగ్రడిలు. } గోంగ్రడిల్లు. } దే. క్రి. పులి మొదలగునవి అఱచు.
గోఁకు. దే. క్రి. ౧ గీకు. ౨. గీఱు.
గోఁకుడుపాఱ. దే. వి. దోఁకుడుపాఱ.
గోఁగు. దే. వి. గోను.
గోఁచి. దే. వి. కౌపీనము.
గోఁచికట్టు. } గోఁచికాఁడు. } గోఁచిబాపఁడు. } దే. వి. బ్రహ్మచారి.
గోఁజాఁడు. } దే. క్రి. పీడించి యడుగు.
గోఁజు. } వి. గోఁజాట.
గోఁటు. దే. వి. ఒయ్యారము.
గోఁటుకత్తె. దే. విణ. విలాసవతి.
గోఁటుకాఁడు. దే. విణ. విలాసి.
గోఁదు దే [illegible]
[illegible] ఉదన్న, బంతి.

గోఁదురు. దే. వి. పెద్దకప్ప.
గోకులము. త్స. వి. ౧. ఆలమంద. ౨. వ్రేపల్లె.
గోగృష్టి. త్స. వి. ఒకమారు ఈనిన ఆవు.
గోఘ్నుఁడు. త్స. వి. ౧. గోవును జంపినవాఁడు. ౨. అతిథి.
గోచరము. త్స. వి. ౧. ఇంద్రియార్థము. ౨. శాద్వలము.
గోచరించు. త్స. క్రి. అగపడు.
గోటాపన. దే. వి. పక్షి యీఁక.
గోటిచెనకు. దే. వి. నఖక్షతము.
గోటినాటు. దే. వి. ,,
గోడ. వై. వి. కుడ్యము.
గోడకాలు. దే. వి. కన్గోడ. (వెలుగు నాటుటకై పొడిమట్టితో నేర్పఱచిన గోడ.)
గోడగించు. దే. క్రి. శబ్దించు.
గోడా. దే. వి. గుఱ్ఱము. (రూ) గోడ.
గోడాడు దే. క్రి. దుఃఖించు.
గోడి. దే. విణ. ఒడ్డగెడవు.
గోడిగ. దే. వి. ఆడుగుఱ్ఱము.
గోడిగా. దే. అవ్య. జాగ్రత్తగా, మెలకువతో.
గోడివెట్టు. దే. క్రి. వంచు.
గోఁడు. దే. వి. దుఃఖము.
గోడెము. దే. వి. కొండవాన[illegible] బోయపల్లె[illegible]
[illegible] డెము.
గోణము, గోణాము. దే. వి. గోఁచి.

గోణి. దే. వి. ఎద్దు. త్స. వి. గోనె.
గోణిక. త్స. వి. గోనె.
గోతము. } దే. వి. జనుపనార
గోతాము. } సంచి.
గోతి. దే. వి. ఆఁడుది.
గోత్రము. త్స. వి. ౧. వంశము. ౨. పేరు. 3. కొండ.
గోద. దే. వి. ఎద్దు.
గోదావరి. త్స. వి. ఒక నది.
గోదావరిలోఁగలుపు = పాడుచేయు.
గోదుమ. దే. వి. ధాన్యవిశేషము.
గోదోహని. త్స. వి. ఆవుపాలు పిదుకుటకుపయోగించుపాత్ర.
గోధ. త్స. వి. తుడుము.
గోధనము. త్స. వి. ఆలమంద.
గోధూమము. త్స. వి. గోదుమలు.
గోధూళి. త్స. వి. సాయంకాలము.
గోధేనువు. త్స. వి. క్రొత్త యీనిన ఆవు.
గోనర్దీయము. త్స. వి. గోనర్ద దేశమునఁ బుట్టిన పదము.
గోనర్దీయుఁడు. త్స. వి. గోనర్ద దేశమునఁ బుట్టినవాఁడు.
గోనసము. త్స. వి. కొండచిలువ.
గోనియ. దే. వి. చూ. గోనె.
గోను. దే. వి. చూ. గోగు.
గోనె. దే. వి. గోతాము.
గోపనము. త్స. వి. ౧. దాచుట. ౨. కాపాడుట.

గోపాయనము. త్స. వి. ౧. రక్షణము. ౨. దాచుట.
గోపాలమెత్తు. దే. వి. బిచ్చమెత్తు.
గోపాలుఁడు. త్స. వి. గొల్లవాఁడు.
గోపి. } త్స. వి. గొల్లది.
గోపిక. }
గోపుఁడు. త్స. వి. ౧. గొల్లవాఁడు. ౨. ఆవులకధిపతి. 3. అనేక గ్రామములకు అధిపతి.
గోపురము. త్స. వి. ౧. గవను. ౨. గుడికి ముందుండెడి గోపురము.
గోమంతుఁడు. త్స. విణ. గోవులు గలవాఁడు.
గోమయము. త్స. వి. ౧. ఆవుపేడ. ౨. పిడుక.
గోమాయువు. త్స. వి. నక్క. (వ్యు. గోవులను పోవునట్టుగాఁ జేయునది.)
గోమి. త్స. వి. పూజ్యుఁడు. (చంద్రగోమి.)
గోమించు. దే. క్రి. గారాబము సేయు.
గోము. దే. వి. ౧. సౌకుమార్యము. ౨. గారాబము. 3. విధము. ౪. సుందరము.
గోమేదకము. త్స. వి. కొలఁది పసుపు వన్నెకల రత్న విశేషము.
గోమేదము. త్స. వి. కొలఁది పసుపు వన్నెకల రత్నము.
గోమేదికము. దే. వి. ,,

గోరంటు. / గోరఁటు. } దే. వి. ఒకచెట్టు.

గోరతనము. దే. వి. దౌష్ట్యము.

గోరము. దే. విణ. భయంకరమైనది.

గోరవంక. దే. వి. గోరువంక.

గోరసము. త్స. వి. ౧. మజ్జిగ. ౨. పాలు.

గోరింక. దే. వి. గోరువంక.

గోరు. దే. వి. నఖము. విణ. అల్పము.

గోరుగల్లు. దే. వి. గోళ్లు తీయు నినుప సలాక.

గోరుచుట్టు. దే. వి. ౧. గోటిచుట్టు లేచెడు పుండు. ౨. ఒకానొకదినుసు గడ్డ.

గోరువంక. దే. వి. ౧. ఒకానొకపక్షి. రూ. గోర్వంక. ౨. నఖ క్షతము.

గోరోచన. / గోరోజనము. } త్స. వి. ఆవుల కడుపు లోనుండి యెత్తెడి వస్తువు.

గోఱజము. దే. వి. కస్తూరి.

గోల. దే. విణ. తెలియనివాఁడు. తెలియనిది. వి. కలకలము.

గోలతనము. దే. వి. మౌగ్ధ్యము.

గోలాంగూలము. త్స. వి. కొండముచ్చు.

గోలించు. దే. క్రి. చమురుపోసి వేచు.

గోలీ. దే. వి. చిన్న ఱాతిగుండు.

గోలుగోలు. / గోలోలు. } దే. వి. ఏడ్పుటలో నగు శబ్దము.

గోలెము. దే. వి. ఖాన.

గోవ. దే. వి. యౌవనము. విణ. అసాధువు.

గోవణము. దే. వి. కౌపీనము.

గోవమీఱు. దే. క్రి. అడ్డములేక తిరుగు.

గోవతనము. దే. వి. పొగరుఁబోతుదనము.

గోవత్సము. త్స. వి. ఆవుదూడ.

గోవశ. త్స. వి. గొడ్డావు.

గోవాల్లు. దే. విణ. ౧. యౌవనవంతుఁడు. ౨. విటుఁడు.

గోవిందుఁడు. త్స. వి. విష్ణువు.

గోవు. త్స. వి. ౧. ఆవు. ౨. కన్ను. 3. దిక్కు.

గోవృషభము. త్స. వి. ఎద్దు.

గోవ్రజము. త్స. వి. పశుశాల.

గోష్ఠము. త్స. వి. ౧. పశుశాల. ౨. వ్రేపల్లె.

గోష్ఠశ్వము. త్స. వి. గోష్ఠమందలి కుక్క. (స్వస్థానమునందుండి పరులను ద్వేషించువాఁడు.)

గోష్ఠి. త్స. వి. ౧. సభ. ౨. సల్లాపము.

గోష్పదము. త్స. వి. ౧. గోవుయొక్క యడుగుకొలఁది. ౨. ఆవుయొక్క గొరిసెచే నేర్పడినగుంట.

గోసంగి. / గోసఁగి. } దే. వి. మాలవాఁడు.

గోసన. దే. వి. చాటించుట.

గోసనఁబుచ్చు. దే. క్రి. ౧. చాటించు. ౨. స్తుతించు.

గోసు. దే. వి. ౧. చాటింపు. ౨. నింద. (గోసడఁచు = నిందించు. గోసెక్కఁగఁజేయు = తప్పుగానెంచు. గోసెక్కించు = స్తుతించు.)

గోస్తని. త్స. వి. ద్రాక్ష.

గోళకము. త్స. వి. మండలము. (భూమ్యాది.)

గోళకుఁడు. త్స. వి. విధవకు అంకు మగనివలనఁ బుట్టినకొడుకు.

గోళము. త్స. వి. ౧. ఉండ. ౨. భూమ్యాది మండలము.

### గౌ

గౌండ్లవాఁడు = గవుండ్లవాఁడు.

గౌఁడు = గవుఁడు.

గౌణము. త్స. వి. అప్రధానము.

గౌతముఁడు. త్స. వి. ౧. సప్తర్షులలో నొకఁడు. ౨. బౌద్ధమతస్థాపకుఁడు.

గౌద. దే. వి. గవుద.

గౌరము. త్స. వి. ౧. తెల్లనిది. ౨. పసుపుపచ్చనిది.

గౌరవము. త్స. వి. గొప్పతనము.

గౌరవించు. త్స. క్రి. పెద్దచేయు.

గౌరి. త్స. వి. శివునిభార్య.

గౌఱు. దే. వి. ఏనుఁగు.

గౌలు. దే. వి. చూ. గవులు.

గౌళి. దే. వి. శకునములు చెప్పెడుబల్లి.

గౌష్మినము. త్స. వి. గ్రీష్మము.

గౌసెన. దే. వి. గవుసెన.

### గ్ర

గ్రంథనము. త్స. వి. ౧. కూర్పు. ౨. గ్రుచ్చుట.

గ్రంథము. త్స. వి. ౧. ధనము. ౨. పుస్తకము.

గ్రంథి. త్స. వి. కంతి.

గ్రంథితము. త్స. విణ. కూర్పఁబడినది.

గ్రంథిలము. త్స. విణ. కనుపులు గలది.

గ్రక్కతిల్లు. దే. క్రి. కంపించు.

గ్రక్కదలు. దే. క్రి. మిక్కిలిచలించు.

గ్రక్కన. / గ్రక్కున. } దే విణ. శీఘ్రముగ.

గ్రచ్చకాయ. దే. వి. గచ్చకాయ.

గ్రథనము. త్స. వి. కూర్పు.

గ్రథితము. త్స. విణ. కూర్పఁబడినది.

గ్రద్ద. వై. వి. గద్ద.

గ్రద్దన. దే. క్రి. విణ. శీఘ్రముగ.

గ్రమ్మన. దే. వి. శీఘ్రముగా.

గ్రసనము. త్స. వి. మ్రింగుట.

గ్రసిష్ణువు. త్స. విణ. తినువాఁడు.

గ్రస్తము. త్స. విణ. మ్రింగఁబడినది.

గ్రహణము. త్స. వి. భూచ్ఛాయ సూర్యుని మీఁదఁగాని చంద్రుని మీఁదఁగాని పడుట.

గ్రహపతి. త్స. వి. సూర్యుఁడు.

గ్రహము. త్స. వి. ౧. సూర్యాది నవగ్రహము. ౨. దయ్యము. 3. పట్టుదల.

గ్రహించు. త్స. క్రి. ౧. కైకొను. ౨. తెలిసికొను.

గ్రహీతుఁడు. త్స. విణ. పట్టుదలగలవాఁడు.

గ్రహీత. త్స. విణ. ౧. పట్టుకొనువాఁడు. ౨. తెలిసికొనువాఁడు.

## గ్రా

గ్రాంథికము. త్స. విణ. గ్రంథమునది.

గ్రామటిక. త్స. వి. పల్లెటూరు.

గ్రామణి. త్స. వి. గ్రామాధిపతి.

గ్రామత. త్స. వి. గ్రామసమూహము.

గ్రామము. త్స. వి. ౧. ఊరు. ౨. సమూహము.

గ్రామసింహము. త్స. వి. కుక్క.

గ్రామీణము. త్స. విణ. పల్లెటూరిది.

గ్రామేయము. త్స. విణ. ,,

గ్రామ్యకర్మము. త్స. వి. మైథునము.

గ్రామ్యము. త్స. వి. ౧. అర్థదోషములలో నొకటి. ౨. శబ్దదోషములలో నొకటి. ౩. అసభ్యమైన మాట. ౪. రతిబంధము. ౫. గ్రామమునఁ బుట్టినది.

గ్రామ్యసుఖము. త్స. వి. మైథునము.

గ్రామ్యాశ్వము. త్స. వి. గార్దభము.

గ్రావము. త్స. వి. కొండ.

గ్రాసము. త్స. వి. ౧. కబళము. ౨. మ్రింగుట.

గ్రాహము. త్స. వి. ౧. మొసలి. ౨. పట్టుదల.

గ్రాహి. త్స. విణ. గ్రహించునది.

గ్రాహ్యము. త్స. విణ. గ్రహింపఁదగినది.

## గ్రీ

గ్రైవ. త్స. వి. మెడ.

గ్రీవము. త్స. వి. మెడ.

గ్రీష్మము. త్స. వి. ౧. వేడిమి. ౨. ఎండ. ౩. వేసఁగికాలము.

## గ్రు

గ్రుక్క. దే. వి. ౧. మ్రింగుట. ౨. ఊపిరి.

గ్రుక్కకొను. దే. క్రి. గ్రుక్కగాఁ దాగు.

గ్రుక్కలు మ్రింగు. దే. క్రి. ౧. గుటకలువేయు. ౨. సంకోచించు.

గ్రుక్కలువెట్టు. దే. క్రి. గ్రుక్కగాఁ దాఁగు.

గ్రుక్కిళ్లుమ్రింగు.
గ్రుక్కిళ్ళుమ్రింగు. } నోరూరి గుటకలువేయు.

గ్రుక్కు. దే. క్రి. గుటకలువేయు.

గ్రుక్కుమిక్కనక.
గ్రుక్కుమిక్కుమనక.
గ్రుక్కుమిక్కురనక. } దే. క్రి. నిశ్శబ్దముగా.

గ్రుచ్చు. దే. క్రి. ౧. నాటు. ౨. తూర్చు. (గ్రుచ్చిగ్రుచ్చియడుగు = నొక్కి నొక్కి యడుగు. పూస గ్రుచ్చినట్లు = యథాక్రమముగా).

గుఱ్ఱచ్చెత్తు. దే. క్రి. కలయఁగలుపు.
గుఱ్ఱడ్డి. దే. విణ. కన్నులు లేనివాఁడు. కన్నులులేనిది.
గుఱ్ఱడ్డికాసు. దే. వి. చిల్లిగవ్వ.
గుఱ్ఱడ్డివాటు. దే. విణ. దైవికము.
గుఱ్ఱడ్డు. దే. వి. ౧. కనుగుఱ్ఱడ్డు. ౨. పక్షి, పాము మొదలగువాని యండము.
గ్రుడ్డెఱ్ఱ. దే. వి. కోపము.
గుఱ్ఱడ్లగూబ. దే. వి. చూ. గుడ్లగూబ.
గుఱ్ఱద్దు. దే. క్రి. పిడికిటితోఁ బొడుచు.
గుఱ్ఱద్దులాడు. దే. క్రి. ఒకరితోనొకరు, గ్రుద్దుచుఁ బోట్లాడు. వి. గుఱ్ఱద్దులాట.

## గ్రై

గ్రైవము. త్స. వి. కంఠభూషణము.
గ్రైవేయకము. ,,
గ్రైవేయము. ,,

## గ్రో

గ్రోచ్చు. దే. క్రి. ౧. త్రవ్వు. ౨. చీల్చు.

## గ్లా

గ్లానము. త్స. విణ. వాడినది.
గ్లాని త్స. వి. వాడుట. ౨. బడలిక.

## గ్లౌ

గ్లౌ. గ్లా. త్స. వి. చంద్రుఁడు.

# ఘ

ఘంట. త్స. వి. ౧. అఱువదినిమిష ముల కాలపరిమాణము. ౨. వాద్య విశేషము.
ఘంటాపథము. త్స. వి. రాజమార్గము.
ఘంటిక. త్స. వి. చిఱుగంట.
ఘట. త్స. వి. ౧. ఏనుఁగుల సమూ హము. ౨. సమూహము.
ఘటకుఁడు. త్స. వి. సుటిల్లఁజేయు వాఁడు.
ఘటజుఁడు. త్స. విణ. ౧. ద్రోణుఁడు. ౨. అగస్త్యుఁడు.
ఘటదాసి. త్స. వి. విటీవిటులను ధార్చెడి యింతి.
ఘటన. త్స. వి. కూర్పు.
ఘటనము. త్స. వి. ౧. ప్రయత్నము. ౨. కూర్పు.
ఘటము. త్స. వి. కుండ.
ఘటాఘటీలు. దే. వి. హేమాహే మీలు. (గొప్పవారు).
ఘటి. త్స. వి. చిన్నకుండ.
ఘటిందముఁడు. త్స. వి. ఘటవాయిద్య ము వాయించువాఁడు.
ఘటిక. త్స. వి. ౧. ఇరువదినాలుగు నిమిషముల కాలము. ౨. గడె మాత్రను.
ఘటితము. త్స. వి. కూర్పఁబడినది.

ఘుటిల్లు. త్స. క్రి. కలుగు. ప్రే. ఘటించు.
ఘట్టన. త్స. వి. గట్టించుట.
ఘట్టనము. ,,
ఘట్టము. త్స. వి. ౧. గట్టు. ౨ సుంకము మొదలగునవి తీయుచోటు.
ఘట్టితము. త్స. విణ. ౧. రాపిడిచేయఁబడినది. ౨. గట్టింపఁబడినది.
ఘణఘణ. త్స. వి. ధ్వన్యనుకరణము.
ఘణిల్లు. వి. ఖణిల్లు. (ధ్వన్యనుకరణము.)
ఘనము. త్స. వి. ౧. మబ్బు. ౨. విరివి. ౩. దిటవు.
ఘనసారము. త్స. వి. కర్పూరము.
ఘనాఘనము. త్స. వి. వర్షించు మేఘము.
ఘనాత్యయము. త్స. వి. శరత్కాలము.
ఘనీభవించు. త్స. క్రి. ముద్దకట్టు.
ఘనుఁడు. త్స. విణ. గొప్పవాఁడు. మేఘుఁడు.
ఘరట్టము. త్స. వి. తిరుగలి.
ఘర్మజలము. త్స. వి. చెమట.
ఘర్మము. త్స. వి. ౧. ఉక్క. ౨. ఎండ.
ఘర్షణము. త్స. వి. రాపిడి.
ఘర్షము. త్స. వి. ,,
ఘస్మరుఁడు. త్స. విణ. తిండిపోతు.
ఘస్రము. త్స. వి. దినము.

ఘా

ఘాంటికుఁడు. త్స. వి. ఘంటవాయించువాఁడు.
ఘాటించు. త్స. క్రి. విజృంభించు.
ఘాతకుఁడు. త్స. విణ. చంపువాఁడు.
ఘాతనుఁడు. త్స. విణ. చంపువాఁడు.
ఘాతము. త్స. వి. దెబ్బ.
ఘాతి. త్స. విణ. చంపినవాఁడు.
ఘాతించు. త్స. క్రి. చంపు.
ఘాతుకుఁడు. త్స. విణ. చంపువాఁడు.
ఘాసము. త్స. వి. గడ్డి.

ఘీ

ఘీంకారము. త్స. వి. ఏనుఁగునఱపు.

ఘు

ఘుటిక. త్స. వి. గుళిక.
ఘుణాక్షరన్యాయము. త్స. వి. ప్రాని యందు నుసిపురుగు తొలిచినయక్షరముయొక్క న్యాయ్యము.
ఘుసృణము. త్స. వి. కుంకుమపువ్వు.

ఘూ

ఘూకము. త్స. వి. గుడ్లగూబ.
ఘూర్జరము. త్స. వి. ఒకదేశము.
ఘూర్ణన. త్స. వి. తిరుగుడు.
ఘూర్ణనము. త్స. వి. ,,
ఘూర్ణము. త్స. విణ. తిరుగునది.
ఘూర్ణిల్లు. త్స. క్రి. తిరుగుడుపడు.

ఘృ

ఘృణ. త్స. వి. దయ.
ఘృణాళువు. త్స. విణ. దయగలవాఁడు.

ఘృణి. త్స. వి. కిరణము.
ఘృతము. త్స. వి. నెయ్యి.
ఘృతోదము. త్స. వి. నేతిసముద్రము.
ఘృష్టము. త్స. విశ. మర్దితము.
ఘృష్టి. త్స. వి. ౧. పంది. ౨. కిరణము.

ఘో

ఘోటకము. త్స. వి. గుఱ్ఱము.
ఘోటించు. త్స. క్రి. ౧. ఊఁచు. ౨. తిరుగు.
ఘోటిక. త్స. వి. గోడిగ. (ఆడు గుఱ్ఱము.)
ఘోణ. త్స. వి. నాసిక. ముట్టె.
ఘోరము. త్స. విశ. భయంకరము.
ఘోరుఁడు. త్స. విశ. భయంకరుఁడు.
ఘోషణ. త్స. వి. చాటుట.
ఘోషణము. త్స. వి. ,,
ఘోషము. త్స. వి. ౧. గొల్లపల్లియ. ౨. ఆవులమంద. 3. ఉఱుము. ౪. ధ్వని.
ఘోషించు. త్స. క్రి. మ్రోయు.

ఘ్రా

ఘ్రాణము. త్స. వి. ముక్కు.
ఘ్రాణించు. త్స. క్రి. మూఁర్కొను. వాసనచూచు.
ఘ్రాతము. త్స. విశ. మూఁర్కొనఁబడినది.
ఘ్రాతి. త్స. వి. మూఁర్కొనుట.

# చ

చంక్రమణము. త్స. వి. మిక్కిలి తిరుగుట. (శాఖాచంక్రమణము.)
చంక్రమము. త్స. వి. ,,
చంచరీకము. త్స. వి. తుమ్మెద.
చంచల. త్స. వి. ౧. మెఱపు. ౨. లక్ష్మి. 3. గాలి.
చంచలము త్స. వి. కదలునది.
చంచలించు. త్స. క్రి. కదలు.
చంచువు. త్స. వి. పక్షిముక్కు.
చండము. త్స. విశ. తీవ్రమైనది.
చండాంశువు. త్స. వి. సూర్యుఁడు.
చండాలుఁడు. త్స. వి. మాలవాఁడు.
చండి. త్స. వి. ౧. పార్వతి. వ్యు. కోపముకలది. చండాసురునిఁ జంపినది. ౨. చంపునట్టి యాఁడుది.
చండిమము. త్స. వి. వాడిమి.
చందనము. త్స. వి. గందము.
చందిరుఁడు. త్స. వి. చంద్రుఁడు.
చంద్రకము. త్స. వి. నెమిలిపురి.
చంద్రకాంతము. త్స. వి. ౧. చలువఱాయి. ౨. ఒకచెట్టు.
చంద్రచూడుఁడు. త్స. వి. శివుఁడు.
చంద్రశాల. త్స. వి. మైమేడ.

చంద్రశేఖరుఁడు. త్స. వి. శివుఁడు. వ్యు. చంద్రుఁడు శిరోభూషణము గాఁ గలవాఁడు.

చంద్రహాసము. త్స. వి. కత్తి.

చంద్రిక. త్స. వి. వెన్నెల. వ్యు. చంద్ర యుక్తమైనది.

చంద్రుఁడు. త్స. వి. చందమామ. విణ. శ్రేష్ఠుఁడు. (రాజచంద్రుఁడు.)

చంపకము. త్స. వి. సంపంగి.

చంపువు. త్స. వి. గద్య పద్య మయ కావ్యము.

చకితము.త్స.విణ. భీతము. వి. భయము.

చకోరకము. } త్స. వి. వెన్నెల పులుఁగు.
చకోరము. }

చక్రధరుఁడు. త్స. వి. విష్ణువు.

చక్రపాణి. ,,

చక్రము. త్స. వి. ౧. బండికల్లు. ౨. గుంపు. ౩. దండు. ౪. చక్రవాక పక్షి.

చక్రవర్తి. త్స. వి. రారాజు.

చక్రవర్తిని. త్స. వి. సార్వభౌమురాలు.

చక్రవాకము. త్స. వి. జక్కవపక్షి.

చక్రవాతము. త్స. వి. సుడిగాలి.

చక్రవాళము. త్స. వి. చుట్టుఁ గొండ.

చక్రవృద్ధి. త్స. వి. వడ్డీకి వడ్డీ.

చక్రాంగము. త్స. వి. ౧. జక్కవ. ౨. హంస.

చక్రి. త్స. వి. విష్ణువు.

చక్షువు. త్స. వి. కన్ను.

చక్షుశ్శ్రవము. త్స. వి. పాము.

చక్షుష్మంతుఁడు. త్స. వి. మంచికన్నులు గలవాఁడు.

చక్షుష్యము. త్స. విణ. కంటికి హితమైనది.

చక్షూరాగము. త్స. వి. చక్షుష్ప్రీతి.

చటక. త్స. వి. ఆడు పిచ్చుక.

చటకము. త్స. వి. మగ పిచ్చుక.

చటనము. త్స. వి. వ్రేలుట.

చటులము. త్స. విణ. ౧. చంచలము. ౨. మనోహరము.

చటువు. త్స. విణ. చంచలము. వి. ప్రియవాక్యము.

చతురంగము. త్స. వి. ౧. చదరంగము. ౨. సేన.

చతురము. త్స. విణ. నేర్పరి.

చతురుఁడు. త్స. వి. నేర్పరి.

చతుర్థి. త్స. వి. ౧. చవితి. విణ. ౨. నాలుగవది.

చతుర్దశి. త్స. విణ. పదునాలుగవది. వి. పక్షములోఁ బదునాలుగవ దినము.

చతుర్వర్గము. త్స వి. ధర్మము. అర్థము. కామము. మోక్షము అనునవి.

చతుష్కము. త్స. వి. నాలిగింటి సమూహము.

చతుష్టయము. త్స. వి. నాలుగు.

చతుష్పథము. త్స. వి. కూడలి.

చపల. త్స. వి. ౧. మెఱపు. ౨. లక్ష్మి.

చపలత. త్స. వి. తబ్బిబ్బు.

చపలము. త్స. విణ. నిలుకడలేనిది. (చలించునది.)
చపేట. త్స. వి. చెంపదెబ్బ.
చపేటము. త్స. వి. ,,
చపేటిక. త్స. వి. ,,
చమత్కారము. } త్స. వి. చిత్తమునకుఁ
చమత్కృతి. } గలుగు వికాసము.
చమువు. త్స. వి. సేన.
చమూపతి. త్స. వి. సేనాపతి.
చయము. త్స. వి. సమూహము.
చరణము. త్స. వి. ౧. పాదము. ౨. వేరు. 3. కులము.
చరణాయుధము. త్స. వి. కోడి.
చరమము. త్స. వి. కడపటిది.
చరమాద్రి. త్స. వి. అస్తపర్వతము.
చరము.త్స.వి. చరించునది. (జలచరము.)
చరాచరము. త్స. వి. స్థావర జంగమ రూపమగు జగత్తు.
చరించు. త్స. క్రి. తిరుగు.
చరితము. } త్స. వి. నడవడి.
చరిత్రము. }
చరితార్థము. త్స. విణ. కృతార్థము.
చరిష్ణువు. త్స. విణ. తిరుగునది.
చరుఁడు. త్స. విణ. తిరుగువాఁడు.
చర్చ. త్స. వి. ౧. విచారము. ౨. చింత. 3. చందనాదులపూఁత.
చర్చనము. త్స. వి. చర్చ.
చర్చించు. త్స. వి. విచారించు.
చర్మము. త్స.వి. ౧.తోలు. ౨. కేడెము.
చర్య. త్స. వి. నడవడి.
చర్వణము. త్స. వి. నమలుట.
చర్వితము. త్స. విణ. నమలఁబడినది. (చర్విత చర్వణము = నమలినదానినే నమలుట.)(చెప్పినదానినే చెప్పుట.)
చలనము. త్స. వి. ౧. కదలుట. ౨. తిరుగుట.
చలించు. త్స. క్రి. కదలు.
చషకము. త్స. వి. పాత్ర.

## చా

చాంచల్యము. త్స. వి. చపలత్వము.
చాంద్రమానము. త్స. వి. చంద్రుని పోకనుబట్టి యేర్పఱచునట్టి కాల పరిమాణము.
చాంద్రాయణము. త్స. వి. చంద్రుని యొక్క వృద్ధిక్షయముల ననుసరించి క్రమమున కృష్ణపక్షమందు భుజింపఁదగిన ముప్పదిరెండు కబళములలో ఒక్కొక్క కడిగా తగ్గించుచు; శుక్లపక్షమున ఒక్కొక్క కడిగా హెచ్చించుచు భుజించి ఆచరించెడి యొకానొక నోము.
చాంపేయము. త్స. వి. సంపెంగ.
చాకచక్యము. త్స. వి. నేర్పు.
చాటువు. త్స. వి. ౧. ఇష్టమైనపలుకు. ౨. మిథ్యాక్రియ. 3. వాక్యము.
చాతకము. త్స. వి. వానకోయిల. వ్యు. వర్షోదకమును యాచించునది.

తుపాకి. దే. వి. (సిపాయీలు మందు గుండు పెట్టి గట్టించి కాల్చెడు) ఇనుపగ్రోవి. రూ. తుపాకీ.

తుపాను. దే. వి. గాలివాన.

తుపుక్కు. దే. వి. ఉమియుటయందయ్యెడి ధ్వన్యనుకరణము.

తుప్ప. దే. వి. చిన్నపొద.

తుప్పటిల్లు. దే. క్రి. తనియు.

తుప్పదూలు. / తుప్పలుదూలు. దే. క్రి. ౧. నిస్సారమై యెక్కలి చలించు. ౨. క్షుద్రమగు.

తుప్పర. దే. వి. తుంపర.

తుప్పు. దే. వి. వాడుకలేని వస్తువునకు పట్టు మలిన పదార్థము.

తుమురు. దే. వి. సూక్ష్మఖండము.

తుములము. త్స. వి. దొమ్మియుద్ధము.

తుమ్ము. దే. క్రి. క్షుతముచేయు. వి. క్షుతము.

తుమ్మెద. దే. వి. పూఁదేనెఁ ద్రాగుడు నల్ల రెక్కలు కలపురుగు.

తురంగమము. త్స. వి. గుఱ్ఱము.

తురంగము. త్స. వి. ,,

తురక. దే. వి. తురకవాఁడు.

తురకరాయి. దే. వి. బొంతరాయి.

తురగము. త్స. వి. గుఱ్ఱము.

తురా. / తురాయి. దే. వి. ౧. నిడుపుకాఁడ పెట్టి కట్టిన పూబంతి. ౨. తలను బెట్టెడి యొకానొకనగ.

(కెంపు)తురా = కెంపులు చెక్కిన తురాయి.

(చిలుక)తురా = చిలుకవలె నున్న తురాయి.

తురితము. వై. విణ. శీఘ్రముగా.

తురీయము. త్స. విణ. నాలుగవది.

తురుష్కము. త్స. వి. ఒకానొక దేశము. (టర్కీ.)

తురుష్కుఁడు. త్స. వి. తురకవాఁడు.

తుర్యము. త్స. విణ. నాల్గవది.

తుఱఁగలి. దే. వి. కాంతి. క్రి. తుఱంగలించు.

తుఱుము. దే. క్రి. ౧. పుష్పాదులను జెరవు. ౨. వేనలి. 3. అల్పఖండము.

తుల. త్స. వి. ౧. త్రాసు. ౨. పోలిక. 3. ఒకానొకరాశి.

తులకరించు. దే. క్రి. ప్రకాశించు. ౨. ఆనందించు. 3. ఒప్పు.

తులకించు. దే. క్రి. ౧. ప్రకాశించు. ౨. కుతూహలపడు. వి. తులకింపు.

తులదూఁగు. / తులలుదూఁగు. దే. వి. క్రి. సాటి యగు.

తులన. త్స. వి. ౧. పోలిక. ౨. తూనిక.

తులము. దే. వి. పలములో మూఁడవ భాగము.

తులసి. త్స. వి. తొళసి.

తులాకూటము. త్స. వి. తప్పుతూనిక.

తులాకూటుఁడు. త్స. విణ. తప్పు తూనిక తూచువాఁడు.

తులాకోటి. త్స. వి. అందె.
తులామానము. త్స. వి. త్రాసున తూచు తూనిక.
తులితము. త్స. విణ. తూనిక వేయఁబడినది.
తులువ. దే. వి. కుత్సితుఁడు.
తుల్యము. త్స. విణ. సమము.
తుఱ.
తువ్వ. దే. వి. తూఱ.
తుషము. త్స వి. ఊఁక.
తుషారము. త్స. వి. మంచు.
తుష్టి. త్స. వి. సంతోషము.
తుష్టిలెక్కలు. దే. వి. అసత్యమైన వెచ్చులెక్కలు.
తుష్టుఁడు. త్స. విణ. సంతోషము పొందినవాఁడు.
తుస్సుపోవు. దే. క్రి. నీచతనొందు.
తుహినము. త్స. వి. మంచు.

తూ

తూఁగాడు. దే. క్రి. ౧. కదలు. ౨. ఊఁగు.
తూఁగు. దే. క్రి. ౧. నిద్రపోవు. ౨. ఊఁగు. వి. ౧. ఊఁగుట. ౨. నిద్ర.
తూఁగుటుయ్యాల. } దే. వి. ఉయ్యాల
తూఁగుమంచము. } మంచము.
తూఁచు. దే. క్రి. తూనిక వేయు.
తూఁట. దే. వి. ౧.తుంట. ౨.ఖండము.
తూఁటాడు. దే. క్రి. ఖండించు.
తూఁటు. దే. వి. చిల్లి.
తూఁటుకట్టు దే. క్రి. తూఁటుపడు.
తూఁటువోవు. దే. క్రి. చిల్లిపడు.
తూఁడు. దే. వి. తామరపువ్వు లోనగువానివేరు.
తూఁతకొమ్ము. దే. వి. పిల్లనగ్రోవి.
తూఁపర. దే. వి. తుంపర.
తూకము. దే. వి. పూనిక.
తూగు. దే. వి. ౧. తూఁకము. ౨. కొలఁది. 3 సమూహము. ౪. రెక్క.
తూకువ. దే. వి. ,,
తూకొను. దే. క్రి. ౧. చొచ్చు. ౨. కదఁగు. 3. గ్రహించు.
తూచాతప్పకుండు. దే. క్రి. సరిగా అనుసరించి వర్తించు.
తూణము. } త్స. వి. అమ్ములపొది.
తూణీరము. }
తూనిక. దే. వి. (త్రాసుతో) తూఁచుట.
తూఁకకోల. దే. వి. త్రాసుదండె.
తూనికవేయు. దే. క్రి. తూఁచు.
తూనిగ. దే. వి. తూనీఁగ.
తూనీఁగ. దే. వి. కీటవిశేషము.
తూనుకోల. దే. వి. త్రాసుదండె.
తూపరము. దే. వి. చిల్లి. విణ. చెడినది.
తూపరాణ. } దే. వి. ౧.జలదారి. ౨. తూము.
తూపరాణము. }
తూపరాణి. }

తూపు. దే. వి. బాణము.
తూపొడుచు. దే. క్రి. తూఁగూ యని యుమియు.
తూము. దే. వి. ౧. నూఁగుచెవి. ౨. నగలమోపునందలి రంధ్రము. 3. చెఱువులోని నీళ్లు బయటికిఁ బోవు టకుఁగాను ఏర్పఱిచిన కాలువ.
తూర. దే. వి. తువర వాసబొల్లు.
(అన్న) తూర = ముసురు.
తూరగోలలు = జల్లుగాఁబడు బాణములు.
తూరఁగోలలు. } దే. వి. బాల
తూరనతుంకములు. } క్రీడావిశే
తూర్న తుంకములు. } షములు.
తూరనెత్తు. దే. క్రి. తూరుపాఱఁబట్టు.
తూరి. దే. వి. తడవ.
తూరు. దే. వి. ధాన్యముతో కలిసి యున్నగల్ల పొట్టు మొదలైనది.
తూరుపాఱఁబట్టు. దే. క్రి. గల్ల పొట్టులోనగునవి ఎగిరిపోవునట్లుగా చేట లోనగువానితో ధాన్యము లోనగువానిని ఎత్తి గాలివంకగా క్రిందికి పోయుట.
తూరుపు. దే. వి. సూర్యుఁడుదయించు దిక్కు.
తూరుపువాఱఁబట్టు. దే. క్రి. తూర్పాఱఁబట్టు.
తూరుపెత్తు. దే. క్రి. ,,
తూర్ణము. త్స. వి. వడిగలది.
తూర్పాఱు. దే. వి. తూర్పెత్తుట.
తూర్పిడి. దే. వి. ,,
తూర్యము. త్స. వి. ౧. వాద్యము. ౨. వాద్యప్రమోగిత.
తూఱు. దే. క్రి. ౧. చొచ్చు. ౨. ప్రవేశించు.
తూలఁదోలు. దే. క్రి. పాఱఁద్రోలు.
తూలఁబాఱు. దే. క్రి. చలించు.
తూలగించు. దే. క్రి. తృణీకరించు.
తూలనాడు. దే. క్రి. ౧. దూఱు. ౨. నిందించు.
తూలపుచ్చు. దే. క్రి. తప్పుకొనఁజేయు.
తూలపోవు. దే. క్రి. ౧. చిన్నపోవు. ౨. భంగపడు. 3. సురుక్కు.
తూలిక. త్స. వి. ౧. వ్రాసెడికలము. ౨. చిన్నయొండిక. 3. చిత్రము వ్రాసెడువాగలి.
తూలు. దే. క్రి. ౧. కదలు. ౨. తొలఁగు. 3. అవమానముగాఁ బలుకు. విణ. దూష్యము.
తూష్ణీంభావము. త్స. వి. మౌనము.
తూష్ణీకుఁడు. త్స. విణ. మాటలాడ కుండువాఁడు.
తూష్ణీంశీలుఁడు. త్స. విణ. తూష్ణీ కుఁడు.

తృ

తృటి. త్స. వి. తప్పి.
తృణము. త్స. వి. గడ్డి.
తృణీకరించు. త్స. క్రి. అలక్ష్యము చేయు.

తృతీయము. త్స. స. మూఁడవది.
తృతీయాప్రకృతి. త్స. విశ. పేడి.
తృప్తము. త్స. వి. తృప్తిఁబొందినది.
తృప్తి. త్స. వి. తనివి.
తృప్తుఁడు. త్స. విశ. తృప్తి పొందినవాఁడు.
తృష. / తృష్ణ. త్స. వి. ౧. దప్పి. ౨. ఇచ్ఛ.
తృషితుఁడు. త్స. విశ. దప్పిగొన్నవాఁడు.

తె

తెంకాయ. దే. వి. టెంకాయ.
తెంకి. దే. వి. నిలయము.
తెంకిపట్టు. దే. వి. ఉనికిపట్టు.
తెంచు. దే. క్రి. తెగఁగోయు.
తెండు. దే. క్రి. శయనించు.
తెందెగ. దే. విశ. అతిశయముగా. ఎక్కుడు.
తెందెప్ప. దే.విశ. అపారము. అమితము.
తెంపరి. దే. విశ. ౧. సాహసికుఁడు. ౨. క్రూరుఁడు.
తెంపాఱు. దే. క్రి. నిందించు.
తెంప. దే. వి. ౧. విధవ. ౨. తెగువ. ౩. తెగుట.
తెంపు. దే. వి. ౧. తెగువ. ౨. తెగుట.
తెక్కలి. వై. వి. ౧. దొంగతనము. ౨. మోసము. విశ. దొంగ వంచకుఁడు. ౩. బాధకుఁడు.
తెక్కలికాఁడు. దే. వి. దొంగ.
తెక్కలీఁడు. దే. విశ. దొంగ.
తెగ. దే. వి. ౧. సమూహము. ౨. సజాతీయ సమూహము. ౩. విధము. అవ్య. ౧. నిశ్శేషముగా. ౨. ఖండితముగా.
తెగబారెడు = అతి దీర్ఘము.
తెగఁగొట్టు. దే. క్రి. నఱకు.
తెగఁదీయు. దే. క్రి. నాగలాగు.
తెగఁజూచు. దే. క్రి. చంపు.
తెగఁబడు. దే. క్రి. తెగించు. వి. తెగఁబాఱు.
తెగఁబాఱు. దే. క్రి. తెగించు. విజృంభించు.
తెగటాఱు. దే. క్రి. చచ్చు.
తెగడు. దే. క్రి. ౧. తిరస్కరించు. ౨. నిందించు. ౩. ఉపేక్షించు. వి. ౧. నింద. ౨. తెగడిక.
తెగనే. దే. విశ. ౧. మిక్కిలి అనాయాసముగా. ౨. వృథాగా, ౩. నిర్హేతుకముగా.
తెగనాడు. దే. క్రి. ఖండితముగాఁ బలుకు.
తెగవేయు. దే. క్రి. నఱకు.
తెగించు. దే. క్రి. సాహసించు.
తెగు. దే. క్రి. ౧. ఖండితమగు. ౨. చచ్చు. ౩. సాహసించు. (తెగన్ = నిశ్శేషముగా, తెగఁదావు. మొ.)
తెగుడు. దే. వి. ముగింపు. ౨. క్షయము.

తెగుదారి. దే. విణ. ౧. సాహసికుఁడు. ౨. దాత.
తెగుదెంపు. దే. వి. ౧. సాహసము, ౨. తెగువ. ౩. తీర్పు. ౪.నిర్ణయము.
తెగుబడి. దే. వి. ౧. అమ్మకము. ౨. తెగట.
తెగులు. దే. వి. ౧. చీడ. ౨. వ్యాధి.
తెగువ. దే. వి. ౧. దాతృత్వము. ౨. తెంపు.
తెగువరి. దే. విణ. ౧. వాఁడిగలది. ౨. దాత.
తెచ్చు. దే. క్రి. తీసికొనివచ్చు.
తెట్టగిలఁబడు. దే. క్రి. ౧. బడలు. ౨. మగు.
తెట్టగిల్లు. దే. క్రి. నిస్సారమగు.
తెట్టతెన్ను. } దే. వి. నడవీధి.
తెట్టతెరువు. }
తెట్టియ. } వై. వి. ౧. తేనెపెర. ౨. తెట్టువ.
తెట్టె. }
తెట్టువగట్టు. }
తెట్టువలుగట్టు. } దే. క్రి. తెట్టెకట్టు.
తెట్టువలుగొను. }
తెట్టెలుగట్టు. దే. క్రి. రాశిపడు.
తెడ్డు. వై. వి. ౧. పడవ త్రోసెడు పలక. ౨. కొయ్యగరిఁటె.
తెనిఁగించు. దే. క్రి. తెనుఁగుచేయు.
తెనుఁగు. దే. వి. ౧. మూఁడునగముల నడుమ వెలయుభాష. ౨. ఆంధ్ర భాష.
తెన్ను. దే. వి. దారి.
తెప్ప. దే. వి. ౧. ప్రోవు. ౨. తెప్ప మ్రాను.
తెప్పగట్టు. దే. క్రి. అతిశయించు.
తెప్పదెరలగా = ౧. బహుళముగా. ౨. అతివేగముగా.
తెప్పలఁదేలు. దే. క్రి. ఓలలాడు.
తెప్పిర్లు. } దే. క్రి. అపాయము
తెప్పిటిలు. } నుండి తేఱు. స్వస్థత
తెప్పిటిల్లు. } నొందు.
తెప్పఱు. దే. క్రి. తెప్పిటిలు.
తెప్పున. దే. అవ్య. వేగరముగా.
తెమలు. దే. క్రి. కదలు.
తెమలుచు. దే. క్రి. ౧. కదలుచు. ౨. ఊడఁదీయు. ౩. చీల్చు. ౪. లాగు.
తెమ్మ. దే. వి. తేమ.
తెమ్మలుగా = తెప్పలుగాఁగ.
తెమ్మెర. దే. వి. ౧. చల్లనిగాలి. ౨. గాలి.
తెర. వై. వి. ౧. మఱుఁగుచీర. ౨. అడ్డువల. 3. అల.
తెరతెరలు = అధికపరంపరలు.
తెరలుతేలుగా = తరంగములవలె ఆఁగి ఆఁగి వరుసగా.
తెరమాయమగు. దే. క్రి. అదృశ్యమగు.
తెరలన్ = నిండుగా, పూర్ణముగా.
తెరలు. దే. క్రి. ౧. బయలుదేఱు. ౨. ఉప్పొంగు. 3. పొరలు. ౪. పాఱు. ౫. అతిశయించు.

తెరలెత్తు. దే. క్రి. తరంగితమగు.

తెరవాఱు. దే. క్రి. తరంగితమగు.

తెరవేయు. దే. క్రి. ,,

తెరువరి. దే. విశే. బాటసారి.

తెరువాఁగు = దారులుకొట్టు.

తెరువాటు. దే. వి. (దొంగలు) దారి గట్టి కొట్టుట.

తెరువాటుకాఁడు. దే. వి. దారికట్టి కొట్టి దోఁచుకొనువాఁడు.

తెరువాటులుగొట్టు. దే. క్రి. దారులు గొట్టు.

తెరువు. దే. వి. దారి. రూ. తెర్వు.

తెర్లు. దే. వి. నీళ్లలోఁ గలవి కాఁగి సలసలపొంగు.

తెఱఁగు. దే. వి. ౧. విధము. ౨. ఉక్కు.

తెఱఁగుపడు. దే. క్రి. సంధియగు.

తెఱఁగుమాలు. దే. క్రి. న్యాయము దప్పు.

తెఱఁగువోలె = పోలిక, సాదృశ్యము.

తెఱకువ. దే. వి. ౧. తెలివి. ౨. యుక్తి.

తెఱగంటి. దే. వి. ౧. అనిమిషుఁడు. ౨. అనిమిషస్త్రీ.

తెఱచు. దే. క్రి. తెఱపఁజేయు.

తెఱప. దే. వి. ౧. తెఱచుట. ౨. ఉపశమనము. విశే. పలుఁగు లేనిది.

తెఱపి. దే. వి. ౧. సందు. ౨. ఎడము.

తెఱపుమఱపు. దే. వి. తెలివితోఁగూడిన తబ్బిబ్బు.

తెఱపులుసేయు. దే. క్రి. చీల్చు.

తెఱలు. దే. క్రి. వాసనబయలువెడలు.

తెఱవ. దే. వి. ఆఁడుది.

తెఱవు. దే. వి. ౧. మంచిమార్గము. ౨. ధర్మము.

తెఱ్ఱి. దే. వి. తెఱ. (తెఱ్ఱినోరు = తెఱచిననోరు.)

తెల. దే. విశే. చూ. తెల్ల.

తెలగాణము. దే. విశే. తెలుఁగు దేశ సంబంధమైనది. (శాసనములలో తెలుంగాణెము అనికలదు)

తెలచు. దే. క్రి. ౧. భజించు. ౨. ప్రసన్నత నొందించు.

తెలతెలఁబోవు.<br>తెలతెలఁవాఱు.<br>తెలవాఱు. } దే. క్రి. వెలవెలఁబోవు.

తెలనాకులు = తెల్లనిలేఁత తమలపాకులు.

తెలి. దే. విశే. ౧. నిర్మలము. ౨. తెల్ల.

తెలిక. దే. విశే. నూనెగానుగాడి జీవించువాఁడు. రూ. తెలికి.

తెలిగొను. దే. క్రి. ప్రమాణముచేయించు.

తెలిచక్కి. దే. వి. తెల్లఁదామర.

తెలియు. దే. క్రి. ౧. విశదమగు. ౨. మేలుకొను. 3. ఎఱుఁగు.

తెలివి. దే. వి. ౧. జ్ఞానము. ౨. ప్రకాశము. 3. వికాసము. ౪. తెలుపు.

తెలివితేటలు = జ్ఞానవికాసము.

తెవిడి. దే. వి. ౧. నిదర్శనము. ౨. తెలియఁజేయుట.

తెలుఁగు. దే. వి. ౧. కాళహస్తి, శ్రీశైలము, ద్రాక్షారామము, ఈ మూఁడు లింగముల నడుమ వాడబడు ఆంధ్రభాష. ౨. ఆదేశస్థుఁడు. 3. ఆంధ్రుఁడు.

తెలుపు. దే. వి. ౧. తెల్లఁదనము. ౨. మేలుకొలుపు. 3. ఊఱట. రూ. తెల్పు.

తెలుపారు. దే. క్రి. తెల్లనగు.

తెల్ల. దే. విశే. ౧.విశదము.౨.ధవళము.

తెల్లగిలు. దే. క్రి. చలించు.

తెల్లటి. దే. వి. బహుమానము.

తెల్లట్లు చెప్పు _ కట్నములు చదివించు.

తెల్లన. దే. విశే. ౧. విశదము. ౨. తెలుపు. విశే. తెల్లనిది.

తెల్లన తెల్లన= (తెలతెలన్ ఆమ్రేడిత రూపము.)

తెల్లనాకులు. దే. విశే. తెల్లని లేఁత తమలపాకులు.

తెల్లమి. } దే. విశే. స్పష్టము.
తెల్లము.

తెల్లవాఱు. దే. క్రి. ౧. ఉదయమగు. ౨. దీనస్థితికివచ్చు.

తెవులు. దే. విశే. రోగము. రూ. తెగులు.

తెవులుగొంటు. దే. వి. వ్యాధిగ్రస్తుఁడు.

తెవులుగొట్టు. దే. వి. ,,

తే

తేఁకువ. దే. వి. ౧. ధైర్యము. ౨. భయము. 3. గర్వము. ४. ఉత్సాహము. ౫. వివేకము. ౬. హద్దు.

తేఁజెట్టు. దే. వి. టెంకాయచెట్టు.

తేఁటి. దే. వి. తుమ్మెద.

తేఁడు. దే. క్రి. సందుకొను. రూ. తెండు.

తేగ. దే. వి. తాటిమొలక.

తేగడ. దే. వి. ౧. నరకముగలది. ౨. దారణము.

తేగము. వై. వి.౧.ఈవి.౨.దాతృత్వము.

తేజనము. త్స. వి. సానబట్టుట.

తేజము. } త్స. వి. ౧. పరిభావము. ౨. కాంతి. 3. శౌర్యము.
తేజస్సు.

తేజరిలు. } వై. క్రి. ప్రకాశించు.
తేజరిల్లు.

తేజస్వంతుఁడు. త్స. విశే. తేజస్సు గలవాఁడు.

తేజస్వి. త్స. విశే. ,,

తేజి. } దే. వి. గుఱ్ఱము.
తేజీ.

తేజో. దే. వి. ౧. ప్రకాశము. ౨. ప్రతాపము. 3. ప్రభావము.

తేట. దే. వి. ౧. నైర్మల్యము. ౨. ప్రసన్నత. విశే. ౧. నిర్మలము. ౨. విశదము. 3. ప్రసన్నము.

తేటగీతి. దే. వి. పద్యముయొక్క పేరు.

తేటతెల్ల. దే. విశే. మిక్కిలి స్పష్టము.

తేటతెల్లమ } దే. విణ. మిక్కిలి
తేటతెల్లము. } స్పష్టము.
తేటపడు. దే. క్రి. విశదపడు.
తేడా. దే. వి. వెచ్చు.
తేతెయ్యలు. దే. వి. నాట్యము.
తేదీ. దే. వి. దినము. రూ. తేది.
తేనుపు. దే. వి. ఉద్గారము.
తేనె. } దే. వి. మధువు.
తేనియ. }
తేనెటీఁగ. దే. వి. తేనెకూర్చు ఈఁగ.
తేనెపూసినకత్తి = పైకిఁదియ్యని మాట లాడుచు లోపల ద్రోహచింతగల కపటి.
(మీసాలపై) తేనియలు=క్షణభంగురములైన అల్పసుఖములు.
తేప. దే. వి. ౧. తెప్ప. ౨. తడవ.
తేపదేప. దే. విణ. అపారముగా, అమితముగా.
తేమ. దే. వి. తడి. విణ. చెమ్మకలది.
తేమగిల్లు. దే. క్రి. చెమ్మగిల్లు.
తేమానము. దే. వి. జాగు.
తేయాకు. దే. క్రి. "తే" అనునొక ధనుసు ఆకు.
తేయు. దే. క్రి. అఱుగు.
తేర. దే. విణ. అనాయాసముగ లభించినది. (తేరకాఁడు. తేరకత్తె మొ.)
తేరకు. దే. అవ్య. ౧. అనాయాసముగా. ౨. వ్యర్థముగా.
తేరకుఁదేర. దే. అవ్య. నిష్ప్రయోజనముగా.
తేరకొను. దే. క్రి. అప్పవేళకు తదేకదృష్టి గలిగియుండు.
తేరతిండి. దే. వి. అశ్రమముగా లభించిన తిండి.
తేరమగఁడు. దే. వి. ఉపపతి.
తేరసొమ్ము. తీరసీఁచే = అశ్రమముగా వచ్చిన సొమ్మును నిర్లక్ష్యముగాఁ జూచుట.
తేరు. దే. వి. ౧. రథము. ౨. బండి. క్రి. కలుగు.
తేరు కిందిప్రతిమ=రథమును మోయుచున్నట్లున్న దాని క్రింది చెక్కిన బొమ్మ. (సంసారకార్యభారము వహించియు గాని నంటుకుండువానికి దీనిను పమానముగాఁ జెప్పుదురు.)
తేటి. దే. వి. కాఁచి తేటిన నేయి.
తేటిచూచు. దే. క్రి. తదేకదృష్టితోఁ జూచు.
తేలు. దే. క్రి. ౧. తేటపడు. ౨. తెప్పేలు. 3. కలుగు. ౪. పొసఁగు.
(నిదురి) తేలు = నైకముతోను డు.
తేలుకొను! దే. క్రి. నెమ్మదినొందు.
తేలుగడ. దే. వి. ౧. తెలివిడి. ౨. ముగియిక. 3. నేర్పు.
తేలుచు. దే. క్రి. ౧. చంపు. ౨. ప్రసన్నత నొందించు. రూ. తేర్చు.

తేలఁజూచు. దే. క్రి. ౧. పాఱఁజూచు. ౨. ఉపేక్షాభావముతోఁజూచు.

తేలఁబలుకు. దే. క్రి. నిర్దోషియని పలుకు.

తేలగిల్లు. దే. క్రి. ౧. పరవశమగు. ౨. పైకి తేలు.

తేలనాడు. దే. క్రి. నిర్దోషుఁడనిచెప్పు.

తేలవేయు. దే. క్రి. తెలగిలఁ జేయు.

తేలాడు. దే. క్రి. తేలు. రూ. తేలియాడు.

తేలిక. దే. విశే. లఘువు. వి. లఘుత్వము.

తేలిపోవు. దే. క్రి. ౧. హాని చేయక తొలఁగిపోవు. ౨. తొలఁగు.

తేలు. దే. క్రి. ౧. నీళ్లలో నాడు. ౨. పొడచూపు. ౩. నీళ్లమీఁద మునుఁగక తిరుగు. వి. వృశ్చికము.

తై

తైర్థికుఁడు. త్స. విశే. తీర్థసేవ చేయువాఁడు.

తైలము. త్స. వి. నూనె.

తొ

తొంగలి. దే. విశే. ౧. దట్టము. (తొంగలిఱెప్పలు.) ౨. వ్రేలాడునది.

తొంగలించు. దే. క్రి. ౧. ప్రకాశించు. ౨. అతిశయించు. ౩. వికసించు. ౪. చెలరేఁగు. ౫. వర్ధిల్లు.

తొంగు. దే. క్రి. ౧. వాలు. ౨. పండుకొను.

తొంగుడు. దే. క్రి. శయనించు.

తొంటచేయి. దే. వి. ఈవపోయిన చేయి.

తొండ. దే. వి. సరటము.

తొండలు విడిపించు = తొందర పెట్టు.

తొండము. వై. వి. ఏనుఁగుయొక్క చేయి.

తొండాడు. దే. క్రి. వేగరపడు.

తొందర. వై. వి. ౧. బాధ. ౨. మిక్కిలి సంభ్రమము.

తొందరచేయు. వై. క్రి. బాధపెట్టు.

తొందరపడు. వై. క్రి. అవసరపడు.

తొందరపాటు. వై. క్రి. అవసరపడుట.

తొంబ. దే. వి. గుంపు.

తొంబండ్రు. దే.స. బ. తొంబదుగురు.

తొంబది. దే. స. తొమ్మిదిపదులు.

తొకతొక. దే. వి. స్పష్టము కానిది. (తొకతొకమాటలు.)

తొక్క. వై. వి. బరడు. పట్ట.

తొక్కటు. దే. వి. సంకటము. రూ. తొక్కటము.

తొక్కటుపడు. దే. క్రి. సంకటపడు.

తొక్కిసలాడు. దే. క్రి. ఇటు నటు సంచరించు.

తొక్కు. దే. వి. ఉప్పును కారమును చేర్చి ఱోటిలో వైచి చిదియఁగొట్టిన మామిడికాయ లోనగువాని ముద్ద. చూ. త్రొక్కు.

తొక్కఁడు. దే. విణ. చూ. త్రొక్కఁడు.

తొగ. దే. వి. ౧. కలువ. ౨. బాధ. ౩. విధము.

తొగర. దే. వి. వగరు.

తొగరు. దే. వి. ౧. ఎఱుపు. ౨. ఎఱ్ఱతామర.

తొగఱకొను. దే. క్రి. ఎఱ్ఱనగు.

తొచ్చెము. దే. విణ. తుచ్ఛము.

తొటతొట. దే. వి. పదునుటయం దయ్యెడి ధ్వన్యనుకరణము.

తొటదొప్ప. దే. విణ. అధికము.

తొట్ట. దే. విణ. స్థూలము. (తొట్ట వాతెఱ.)

తొట్టగిలఁబడు. దే. క్రి. తత్తఱపడు.

తొట్టగిల్లు. దే. క్రి. అతిశయించు.

తొట్టి. దే. వి. బాన.

తొట్టికట్టు. దే. విణ. లోఁగిలి.

తొట్టియల. దే. వి. బిడ్డలఁ బరుండఁ బెట్టు తొట్టె.

తొట్టిలు. దే. క్రి. వెలికిలు.

తొట్టు. దే. క్రి. ౧. ప్రవహించు. ౨. కాఱు. ౩. ఎగదట్టు. వి. ౧. చెఱువు క్రింది పొలము. ౨. సంబంధము.

తొట్టున. దే. అవ్య. ఆకస్మికముగా.

తొట్టె. దే. వి. ఉయ్యాల.

తొట్టెల. దే. వి. ,,

తొట్రిలఁబడు. దే. క్రి. తొట్రుపడు.

తొట్రిల్లు. దే. క్రి. ౧. తడఁబడు. ౨. భేదిల్లు.

తొట్రుపడు. దే. క్రి. సంభ్రమించు.

తొట్రుపాటు. దే. వి. తడఁబాటు.

తొట్టు.
తొట్టియ.
తొట్టె.
దే. వి. బిడ్డలు పండు కొను నుయ్యాల.

తొడ. దే. వి. గజ్జయును మోకాలికిని నడుమను ఉన్నట్టి ప్రదేశము.

తొడఁగు. దే. క్రి. తొనఁగు.

తొడఁగు. దే. క్రి. ౧. యత్నించు. ౨. ప్రారంభించు.

తొడత్రొక్కుఁడు. దే. వి. సమ్మర్దము.

తొడపాయసము. దే. వి. తొడ

తొడపెల్లము. గిల్లుట.

తొడయు. దే. క్రి. ౧. నిమురు. ౨. కడుగు. ౩. తుడుచు. ౪. తోము. ౫. నశింపఁజేయు.

తొడరు. దే. క్రి. ౧. యత్నించు. ౨. కలుగు. ౩. ఎదిరించు. ౪. ధిక్కరించు.

తొడవు. దే. వి. యత్నము.

తొడవు. దే. వి. సొమ్ము. నగ.

తొడి. దే. వి. ౧. ఆతురము. ౨. సంభ్రమము. (తొడితొడి ఆమ్రేడితము.)

తొడిఁబడు. దే. క్రి. ౧. తొట్రుపడు. ౨. తొందరపడు.

తొడికిపట్టు. దే. క్రి. ఒడిసిపట్టు.

తొడితెచ్చు. దే. క్రి. తోడితెచ్చు.

తొడిమ. దే. వి. ఆకు, పూవు, మొదలగువాని తలనుండెడి కాఁడ.

తొడియు. దే. క్రి. బాణాదులునాఁటు.

తొడు. దే. క్రి. తొడుగు.

తొడుకు. దే. వి. పశువు.

తొడుకొను. దే. క్రి. ౧. తోడుకొను. ౨. వెంటఁగొను.

తొడుగఱ. } దే. వి. ముండ్లకంపమోపు.
తొడుగట్టు. }

తొడుగు. దే. క్రి. ౧. (భూషణాదులను) ధరించు. ౨. (బాణము) సంధించు. వి. ౧. సొమ్ము. ౨. కవచము. ౩. బాణము. ౪. ముండ్లకంపమోపు. రూ. తొడువు. తొడ్గు.

తొడుపు. దే. వి. కవచము.

తొడువు. దే. క్రి. తొడుగు.

తొడుసు. దే. వి. ౧. సంబంధము. ౨. బాధ. ౩. విసుగు.

తొత్తతికము. దే. వి. తొత్తుఁదనము.

తొత్తు. దే. వి. ౧. దాసి. ౨. లంజె.

తొత్తుకుబడితొత్తు = దాసికిదాసి.

తొత్తులమారి. దే. విణ. లంజెల యిండ్లకుఁబోవు స్వభావముగలవాఁడు.

తొన. దే. వి. ౧. తొల. ౨. రక్షకము.

(తోడు)వొన= సహాయుఁడు, రక్షకుఁడుఅగువాఁడు.

తొనఁకు. దే. క్రి.తొలఁకు. వి. తొట్రుపాటు.

తొనికిసలాడు. దే. క్రి. చలించు.

తొప్పదొరుగు. దే. క్రి. మిక్కిలి దొరుగు.

తొప్పదోఁగు. దే. క్రి. మిక్కిలి మునుఁగు.

తొప్పదోఁచు. దే. క్రి. మిక్కిలి దోఁగఁజేయు.

తొప్పఁదోఁగు. దే. క్రి. తొప్పదోఁగు.

తొప్పఱ. దే. వి. సంక్షోభము.

(తో)తొప్పఱలఁబెట్టు = తటిమి బాధించు. (మిక్కిలి బాధించు.)

(తోలి)తొప్పఱలాడు = తటిమి బాధించు.

తొప్పలుగోరలు. దే. విణ. కోటానకోట్లు.

తొప్ప. దే. వి. చేతులతో నోరు బాదుకొనుటయం దగు ధ్వన్యనుకరణము.

(ఆమ్రేడితము. తొప్పతొప్ప)

తొబక. దే. విణ. విత్తులు రాలినది.

తొమ్మండ్రు. } దే.స.బ. తొమ్మిది మంది.
తొమ్మండ్రుగురు. }

తొమ్మందుము. దే. వి. తొమ్మిది తూములు.

తొమ్మాఁడు. దే. వి. నాశము. (తొక్కి తొమ్మాఁడు చేసినారు.)

తొమ్మిది. దే. స. ఎనిమిదియును నొకటియును.

తోఁకచుక్క. దే. వి. ధూమకేతువు.

తోఁకదొ్రక్కు = పరాభవించు.

తోఁకపీఁకుడుగాఁడు. దే. వి వ్యవహారమును దెమలనీయక చిక్కులు పెట్టువాఁడు.

తోఁకమిరియము. దే. వి. చలువమిరియము.

తోఁకముడుచు = వెనుకకుఁదగ్గు.

తోఁగు. దే. క్రి. ౧. మునుఁగు. ౨. తడియు. 3. స్రవించు.

తోఁచు. దే. క్రి. ౧. ఆలోచనపుట్టు. ౨. ప్రత్యక్షమగు. 3. ఉదయించు.

తోఁట. దే. వి. ౧. మిరపకాయలు, వంకాయలు మున్నగునవి పండించు చోటు. ౨. ఫలవృక్షములు, పూలచెట్లు, ఛాయాతరువులు, ఈమొదలగునవి ఉన్నట్టిచోటు.

తోఁటకాఁపు.
తోఁటవాఁడు.
తోఁటీఁడు. } దే. వి. తోటను కావలి కాచు వాఁడు.

తోఁడు. దే. క్రి. ౧. చేదు. ౨. నూలి పోగు తీసి చుట్టు.

తోఁడుఁబోతు. దె. వి. దయ్యాల పోతు.

తోఁడేలు.
తోఁడేలు. } దే. వి. అడవికుక్క.

తోఁపు. దే. వి. ౧. పెంపుడువనము. ౨. ఎఱుపు. 3. బూరెలపై మూఁతపిండి.

తోఁబుట్టు.
తోఁబుట్టుగు.
తోఁబుట్టువు. } దే. వి. తోడఁబుట్టువు.

తోకొను. దే. క్రి. తోడుకొను.

తోడంటు. దే. వి. చేమిరి.

తోడఁబుట్టు.
తోడఁబుట్టుగు.
తోడఁబుట్టువు. } దే. వి. చూ. తోఁబుట్టు.

తోడా. దే. వి. చేతిలోఁ బెట్టుకొనెడు సొమ్ము.

తోడికోడలు. దే. వి. మగనితోడఁ బుట్టినవాని పెండ్లాము.

తోడిచూలు. దే. వి. సోదరుఁడుఁ లేక సోదరి.

తోడితెచ్చు. దే. క్రి. పిలుచుకొనివచ్చు. రూ. తోడ్తెచ్చు.

తోడిదొంగ దే. వి. సహాతస్కరుఁడు.

తోడివాఁడు. దే. వి. తోడనున్న వాఁడు.

తోడు. దే. వి. ౧. ఒట్టు. ౨. తోడఁబుట్టువు. 3. చేమిరి. వి౹౨. సాహాయ్యము.

తోడుకొనితెచ్చు. = పిలుచుకొనివచ్చు.

తోడుకొనిపోవు. దే. క్రి. పిలుచుకొని పోవు.

తోడుకొను. దే. క్రి. ౧. (పాలు) పేరు. ౨. పిలుచుకొను. రూ. తోడ్కొను.

తోడుతో. } దే.అవ్య.వెంబడిని. రూ.
తోడుతోడ. } తోడ్తో, తోడ్తోడ.
తోడుతోడుత. దే.అవ్య.అంశీఘ్రముగా.
తోడుదొంగ. దే. విశే. సహాయుఁడు.
తోడునీడ. దే. విశే. సాహాయ్యుఁడు.
తోడుపడు దే. క్రి. సాహాయ్యపడు.
తోడుపాటు. దే. వి. సాహాయ్యము.
తోడెము. దే. విశే. అల్పము.
తోతెంచు. దే. క్రి. ౧.వెడలివచ్చు.
౨. పొడచు. 3. ఉదయించు.
తోత్త్రము. త్స. వి. మునికోల.
తోదోపలాడు } దే. క్రి మిక్కిలిగా
తోదోపలాడు } నొకరినొకరు దోసి
కొను.
తోపాటు. దే. అవ్య. తోడుత.
తోప. దే. వి. టోపి రూ. తొప్ప
తోపు. దే. వి. త్రోపు.
తోపకెము. దే. వి. రుద్దుట.
తోమరము. త్స. వి. చిల్లకోల.
తోమాలియ. తోమాలిక. దే. వి. ,,
తోమాలె. దే. వి. పూలదండ.
తోము. దే. క్రి. రుద్దు. వి. తోముడు.
తోయజము. త్స. వి. కమలము. వ్యు.
నీటియందుఁ బుట్టినది.
తోయము. దే. వి. ౧. తెగ. ౨. రీతి.
త్స. వి. జలము.
తోయలి. దే. వి. చూ. తొయ్యలి.
తోయు. దే. క్రి. త్రోయు.
తోసిరాజను = తిరస్కరించు.

తోరణకట్టుకొను. దే. క్రి. పాదుకొను.
తోరణము. త్స. వి. ౧. మామిడాకుల
సరము. ౨. పూలదండలు లోనగు
నవి కట్టుటకై యింటివెలుపల
రెండు కూచములకు నడుమఁగల
దారి.
తోరము. దే. వి. వ్రతసూత్రము. విశే.
౧. అధికము. ౨. స్థూలము.
తోలాడు దే. క్రి. తొయ్యాడు.
తోలు. దే. వి. చర్మము. క్రి. (బండిని)
నడపించు.
తోషణము. త్స. వి. సంతోషము.
విశే. సంతోషపెట్టునది.
తోషించు. త్స. క్రి. సంతసించు.

తౌ

తౌర్యత్రికము. త్స. వి. నృత్త గీత
వాద్యము.
తౌలు. దే. క్రి. తప్పలు. తగులు.

త్య

త్యజించు. త్స. క్రి. విడుచు.

త్యా

త్యాగము. త్స. వి. ఈవి.
త్యాజ్యము. త్స. విశే. విడువఁదగినది.
వి. దోషయుక్తమగు కొంత
కాలము.

త్ర

త్రంపి. దే. వి. దాలి.
త్రప్పెన. దే. వి. చిలుకుట.

త్రచ్చు. దే. క్రి. చిలుకు.
త్రప. త్స. వి. సిగ్గు.
త్రపువు. త్స. వి. తగరము.
త్రయము. త్స. వి. మూఁటిసమూహము.
త్రయి. త్స. వి. ౧. మూఁడువేదములు. ౨. మూఁటిగుంపు.
త్రయోదశి. త్స. వి. ఏపక్షమందైనను పదుమూఁడవదినము.
త్రవ్వటించు. దే. క్రి. త్రవ్వు. వి. త్రవ్వటము.
త్రవ్వితండము. దే. విశే. అసంఖ్యాకము.
త్రవ్వుకోల. దే. వి. గుద్దలి.
త్రసరేణువు. త్స. వి. కిటికీలోనిఎండలోఁ గనఁబడు రేణువు.
త్రస్తరించు. దే. క్రి. ౧. పరిహసించు. ౨. అధకరించు.
త్రస్తము. త్స. విశే. భయపడినది.
త్రవ్వు. దే. క్రి. ౧. బయటికి లేవనెత్తు. ౨. గుద్దలించు.

త్రా

త్రాఁచు. దే. వి. పాము.
త్రాగు. దే. క్రి. పానముచేయు. వి. త్రాగుడు.
త్రాగుబోతు. దే. విశే. కల్లు, సారాయి మున్నగువానిఁద్రాగెడివాఁడు.
త్రాడు. దే. వి. పేనినదారము.
త్రాడువడు. దే. క్రి. నిస్సత్త్వమగు.
త్రాణ. దే. వి. ౧. బలము. ౨. జాగరూకత.
త్రాణము. త్స. విశే. రక్షింపఁబడినది.
త్రాత. త్స. వి. కాచువాఁడు.
త్రాతము. త్స. విశే. రక్షింపఁబడినది.
త్రాసము. త్స. వి. భయము.
త్రాసు. దే. వి. చూ. తరాసు.

త్రి

త్రికటుకము. త్స. వి. శొంఠి పిప్పలి మిరియాలు.
త్రికము. త్స. వి. ౧. మూఁటి సమూహము. ౨. శొంఠి పిప్పలి మిరియాలు. 3. ముడ్డిపూస.
త్రికరణశుద్ధి. త్స. వి. మనోవాక్కాయముల స్వచ్ఛత.
త్రికోణము. త్స. వి. మూఁడు మొనలు కలసిన రూపము.
త్రిక్క. దే. వి. తిక్క.
త్రిచతురములు. త్స. విశే. మూఁడుగాని నాలుగుగాని.
త్రితయము. త్స. వి. మూఁడింటి సముదాయము.
త్రిదండము. త్స. వి. వైష్ణవ సన్న్యాసాశ్రమము.
త్రిదండి. త్స. వి. వైష్ణవసన్న్యాసి.
త్రిదశుఁడు. త్స. వి. వేలుపు.
త్రిదివము. త్స. వి. స్వర్గము.
త్రిపథగ. త్స. వి. గంగానది. (వ్యు. స్వర్గ మర్త్య పాతాళ మార్గములందుఁ బోవునది.)

త్రిపుండ్రము. త్స. వి. నొసట బూది లోనగువానితో అడ్డముగాఁ బెట్టిన మూఁడు రేఖలు.
త్రిప్పట. దే. వి. తిరుగుట.
త్రిప్పటము. దే. వి. ,,
త్రిప్పు. దే. ప్రే. క్రి. తిరుగఁ జేయు.
త్రిప్పుడు. దే. వి. ,,
త్రిప్పులాఁడి. దే. వి. ౧. తిరుగు స్వభావము గలది. ౨. అంకుటాలు.
త్రిప్పులాఁడు. దే. విశే. తిరుగు స్వభావముగలవాఁడు.
త్రిముని. త్స. అవ్య. ముగ్గురు మునులు. (పాణిని, కాత్యాయన, పతంజలులు.)
త్రిమూర్తి. త్స. వి. బ్రహ్మ విష్ణు మహేశ్వరుల రూపములతో నొప్పువాఁడు.
త్రిమ్మట. దే.వి.౧.త్రిప్పట. ౨.ఆపద.
త్రిమ్మరి. / దే. విశే. ఇచ్చవచ్చినట్లు తిరుగువాఁడు.
త్రిమ్మరీఁడు.
త్రిమ్మరు. దే. క్రి. ౧. తిరుగు. ౨. చుట్టివచ్చు.
త్రియామ. త్స. వి. రాత్రి.
త్రిలింగము. త్స. వి. శ్రీశైలము, ద్రాక్షారామము, కాళహస్తి, ఈ మూఁడుతావులలో నుండు లింగములకు నడుమనుండు దేశము. విశే. మూఁడు లింగములు కలది.
త్రిలోకములు. త్స. వి. స్వర్గ మర్త్య పాతాళములు.
త్రిలోచనుఁడు. త్స. వి. శివుఁడు.
త్రివటించు. దే. క్రి. మూఁడు సమభాగములుగాఁ జేయు.
త్రివర్గము. త్స. వి. ౧. ధర్మార్థకామములు. ౨. క్షయ స్థాన వృద్ధులు.
త్రివిక్రముఁడు. త్స. వి. మూఁడులోకములను మూఁడడుగులచే నాక్రమించిన విష్ణువు.
త్రివిష్టపము. త్స. వి. స్వర్గము.
త్రివేణి. త్స. వి. ప్రయాగవద్దనున్న యొక పుణ్యక్షేత్రము. (ఇట గంగ యమునతోను, అంతర్వాహినియగు సరస్వతితోను కలియుచున్నది.
త్రిశూలము. త్స. వి. మూఁడు మొనల ఆయుధము.
త్రిషవణము. త్స. వి. ప్రాతర్మధ్యాహ్న సాయాహ్నములు.
త్రిసూత్రము. త్స. వి. యజ్ఞోపవీతము.

త్రు

త్రుంగు. దే. క్రి. ౧. నశించు. ౨. తునకలగు.
త్రుంగుడు. దే. వి. నాశము.
త్రుంగుడుపడు. దే. క్రి. నశించు.
త్రుంచు. దే. క్రి. ౧. తునకలు చేయు. ౨. చంపు. వి. ౧. త్రుంపు. ౨. త్రుంపుడు.
త్రుంపు. దే. వి. ముక్క. విశే. శ్రేష్ఠమైన వస్తువు.

తుఱుక్కు. దే. వి. ౧. గర్వము. ౨. బిలుము.
తుఱుటనము. త్స. వి. తెగుట.
తుఱుటితము. త్స. విశే. తెగినది.
తుఱుట్టె. దే. వి. సమూహము.
తుఱుట్టెలుగట్టు. దే. క్రి. గుమిగూడు.
తుఱ్ఱప్పు. దే. వి. ఇనుము మీఁది ముఱికి.
తుఱుప్పుడు. దే. వి. ,,
తుఱుళ్ళింత. దే. వి. మిడిసిపాటు.
తుఱుళ్ళగించు. దే. క్రి. ఎగిరిపడు.
తుఱుళ్ళగింత. దే. వి. మిడిసిపాటు.
తుఱుళ్ళు. దే. క్రి. ౧. గర్వించు. ౨. ఎగిరిపడు. వి. ౧. గర్వము. ౨. ఎగిరిపాటు.
తుఱుళ్ళుకుండ. దే. వి. తుఱుళ్ళింత.
తుఱుళ్ళుబోతు. దే. విశే. తుఱుళ్ళునట్టి స్వభావము కలవాఁడు.

## తెఱ

తెఱించు. } దే. ప్రే. తెగఁజేయు.
తెఱుఁపు. }
తెఱుకొట్టు. దే. క్రి. ఎగదట్టు.
తెఱుకొక్కను. దే. క్రి. కలఁచు.
తెఱుగు. దే. క్రి. తెగు.
తెఱుడ్డు. దే. వి తెడ్డు.
త్రెయ్యు. దే. క్రి. ఖండితమగు.
తెఱువ్వ. క్రి. విశే. పూర్ణముగా. (గడి) తెఱువ్వ = మేఱమీఱి.
తెఱువ్వు. దే. క్రి. తెగు.
తెఱుళ్ళు. దే. క్రి. ౧. పడు. ౨. రాలు.

## తేఱ

తేఱుచు. దే. క్రి. తేఱును.
తేఱుపు. దే. వి. ఉద్గారము.
తేఱుగుడు. దే. వి. జిగటపాటిననెంగిలి లోనగునది. రూ. తేఱువుడు.
త్రేత. } త్స. వి. నాలుగు యుగములలో
త్రేతాయుగము. } నొకటి.
తేఱువుడు. దే. వి. చూ. తేఱుగుడు.

## త్రై

త్రైమాతురుఁడు. త్స. వి. లక్ష్మణుఁడు.
త్రైలోక్యము. త్స. వి. త్రిలోకములు.
త్రైవిద్యుఁడు. త్స. వి. మూఁడు వేదములు చదివినవాఁడు.

## తొఱ

తొఱుక్కటు. }
తొఱుక్కటము. } దే. వి. సమ్మర్దము. ఒత్తిడి.
తొఱుక్కడ. }
తొఱుక్కటుపడు. దే. క్రి. చూ తొక్కటుపడు.
తొఱుక్కు. దే. క్రి. పాదముతో నదుము. వి. త్రొక్కుడు.
తొఱుక్కుడు. దే. వి. తొఱుక్కటు.

తో్రి

తో్రిచు. దే. క్రి. ౧. తో్రియు. ౨. ఉపేక్షించు. ౩. నడచు.

(పక్కన)(దో్రిచు = సరిచేయు, సవరించు.

(పాయ)దో్రిచు = తొలఁగించు.

తో్రిటనము. త్స. వి. తు్రించుట.

తో్రిటి. త్స. వి. పక్షిముక్కు.

తో్రిదో్రిపు. దే. వి. ౧. సమ్మర్దము. ౨. రారాపు.

తో్రిదో్రిపులాడు. దే. క్రి. మిక్కిలి తో్రియు.

తో్రిపడు. దే. క్రి. గెంటఁబడు.

తో్రిపనంగొఅవి. దే. వి. ఉభయభ్రిష్టరాలు.

తో్రిపాడు. దే. క్రి. తో్రియు.

తో్రిపు. దే. వి. తో్రియుట.

తో్రిపుతో్రిపాడు. దే. క్రి. పరస్పరము దో్రిసికొను.

తో్రియు. దే. క్రి. తొలఁగనూకు.

తో్రిలు. దే. వి. ౧. తోలు. ౨. చంపు.

తో్రివ. దే. వి. దారి.

తో్రివరి. దే. విణ. మార్గము నెఱిఁగినవాఁడు.

త్వ

త్వక్కు. త్స. వి. ౧. తోలు. ౨. చెట్టుపట్ట.

త్వర. త్స. వి. వేగిరపాటు.

త్వరగా. త్స. అవ్య. వేగిరముగా.

త్వరపడు. త్స. క్రి. వేగిరపడు.

త్వరితము. త్స. విణ. వడిగలది.

త్వా

త్వాదృక్కు. } త్స. విణ. నీవంటివాఁడు.
త్వాదృశుఁడు. }
త్వాదృక్షుఁడు. }

త్వి

త్విషాంపతి. త్స. వి. సూర్యుఁడు.

త్స

త్సరువు. త్స. వి. ఖడ్గముష్టి.

# ద

దంగు. } దే. విణ. దంపఁబడినది.
దంగుడు. }

దంగుళ్లు. దే. వి. చేబియ్యము.

దంచు. దే. క్రి. దంపు.

దంట. దే. వి. జత. విణ. ౧. దిట్టతనము కలవాఁడు. ౨. నేర్పరి.

దంటమాటలు = ప్రౌఢవాక్యములు, వక్రోక్తులు.

దంటు. దే. వి. జొన్న, రాగి మున్నగు వానికాఁడ.
దండ. దే. వి. ౧. హారము. ౨. దగ్గఱ.
దండకము. త్స. వి. ౧. ఒకానొక వృత్తము. ౨. దండకారణ్యము.
దండగోల. దే. వి. ఊఁత.
దండదాసుఁడు. త్స. వి. జుల్మానా చెల్లింపలేక దాస్యమున కంగీకరించిన దాసుఁడు.
దండధరుఁడు. త్స. వి. యముఁడు.
దండనము. త్స. వి. శిక్ష.
దండనాయకుఁడు. త్స. వి. సేనానాయకుఁడు.
దండనీతి. త్స. వి. శిక్షాస్మృతి.
దండపడు. దే. క్రి. సమీపించు.
దండపాణి. త్స. వి. యముఁడు.
దండము. దే. వి. నమస్కారము. త్స. వి. ౧. దుడ్డుకఱ్ఱ. ౨. రాజశిక్ష.
దండయాత్ర. త్స. వి. ౧. యుద్ధయాత్ర. ౨. దిగ్విజయము.
దండసిల్లు. దే. వి. ఇఱుకుకొను.
దండాట. దే. వి. దేగాట.
దండాడింపు. దే. వి. దండాట.
దండాహతము. త్స. వి. కవ్వముతో తఱచిన మజ్జిగ.
దండి. దే. వి. ౧. ప్రతాపము. ౨. శౌర్యము. విణ. ౧. గొప్ప. ౨. సమృద్ధి.
దండించు. త్స. క్రి. దండనము చేయు.
దండియ. దే. వి. ౧. తంబుఱ. ౨. పల్లకిబొంగు. రూ. దండె.
దండియము. దే. వి. వస్త్రములు ఎండవైచుటకుగాను, అడ్డముగ నేర్పఱిచిన దామముగాని, కొయ్యగాని. రూ. దండెము.
దండు. దే. వి. ౧. సేన. ౨. సమూహము. 3. దండయాత్ర.
దండుకదలు. దే. క్రి. దండెత్తు.
దండుగ. } దే. వి. ౧. నష్టము. ౨. రాజు ధనవంతుని బలాత్కారముచేసి తీసికొనెడు ధనము.
దండుగు.
దండువ.
దండువు.
దండులంజె. దే. వి. గుత్తలంజె. దండుతోఁబోవులంజె.
దండుసేయు. దే. క్రి. దండెత్తు.
దండెత్తు. దే. క్రి. యుద్ధమునకుఁ బోవు.
దండ్యుఁడు. త్స. విణ. దండింపఁదగినవాఁడు.
దంతక్షతము. త్స. వి. పల్లొత్తు.
దంతక్షతి. త్స. వి. ,,
దంతచ్ఛదము. త్స. వి. పెదవి.
దంతధావనము. త్స. వి. పలుదోముట.
దంతము. త్స.వి.౧.పల్లు. ౨. పొదరిల్లు.
దంతావళము. త్స. వి. ఏనుఁగు. వ్యు. దంతములు కలది.
దంతి. త్స. వి. ఏనుఁగు.
దంతె. } దే.వి. మిద్దెంటికి అడ్డముగా వేయు పట్టె.
దంతియ.

దందడి. దే. వి. ౧. సంకులము. ౨. సాంద్రము.
దందడించు. దే. క్రి. అధికమగు.
దందడిపడు. దే. క్రి. కలఁతనొందు.
దందన. దే. వి. మాయ.
దందనకత్తె. దే. విణ. మాయకత్తె.
దందనకాఁడు. దే. విణ. మాయకాఁడు.
దందనసేయు. దే. క్రి. ౧. మాయసేయు. ౨. మోసగించు.
దందశూకము. త్స. వి. పాము.
దందురుఁడు. త్స. విణ. మిట్టపండ్లు గలవాడు.
దంధనము. త్స. విణ. శాశ్వతముగానిది.
దంపతులు. త్స. వి. బ. ఆలుమగలు.
దంపు. దే. క్రి. దంచు. వి. దంపుడు.
దంభకుఁడు. త్స. విణ. వంచకుఁడు.
దంభనము. త్స. వి. మోసము.
దంభము. త్స. వి. ౧. డంబము. ౨. బడాయి.
దంభోళి. త్స. వి. వజ్రాయుధము.
దంశకము. త్స. విణ. ౧. కఱచునది. ౨. ఒక జాతియీఁగ.
దంశనము. త్స. వి. ౧. కాటు. ౨. పల్లు.
దంశము. త్స. విణ. కఱచునది. వి. ౧. కఱచుట. ౨. దంతము. 3. ఒక జాతిదోమ.
దంశిక. త్స. వి. పటుకాఱు.
దంష్ట. త్స. విణ. కఱచువాఁడు
దంష్ట్ర. త్స. వి. ౧. కోఱ. ౨. పల్లు.
దంష్ట్రిలము. త్స. విణ. పెద్దకోఱలుగలది.
దంష్ట్రి. త్స. వి. అడవిపంది.
దకము. త్స. వి. జలము.
దక్కఁగొను. దే. క్రి. ౧. దక్కించుకొను. ౨. వశముచేసికొను.
దక్కించు. దే. క్రి. ౧. దక్కఁజేయు. ౨. నిలుపు. 3. నిలఁబెట్టు.
దక్కిణము. వై. వి. దక్షిణము.
దక్కు. దే. క్రి. ౧. అనుభవయోగ్యమగు. ౨. నిలుచు.
దక్కోలు. దే. వి. వశము.
దక్షాయ్యము. త్స. వి. గ్రద్ద.
దక్షిణ. త్స. వి. ౧. యజ్ఞము మున్నగువానిలో బుత్విజులు లోనగు వారికి ఇచ్చు ధనము. ౨. కుడివైపు.
దక్షిణము. త్స. విణ. కుడిదిక్కది.
దక్షిణాపథము. త్స. వి. వింధ్యపర్వతమునకు దక్షిణమునఁగలభూమి.
దక్షిణాయనము. త్స. వి. సూర్యుఁడు దక్షిణదిక్కున వసించు ఆఱుమాసముల కాలము.
దక్షిణావర్తము. దే. వి. కుడివైపుగాఁ దిరిగిన వంకగల శంఖము.
దక్షిణుఁడు. త్స. వి. అనేక నాయికలందు సమముగా వర్తించు నాయకుఁడు. విణ. ౧. నేర్పుగలవాఁడు. ౨. ఉదారుఁడు.
దక్షుఁడు. త్స. విణ. నేర్పరి.
దగ. దే. వి. ౧. దాహము. ౨. తాపము. 3. ఆయాసము.

దగదగ. దే. వి. మెఱయుట లోనగు వానియందు దయ్యెడు ధ్వన్యనుకరణము.

దగర. దే. వి. పిశాచము. విణ. ౧.మగడి. ౨. గండు. (దగరకోయిల కోయిల= గండు కోయిల.)

దగలుగొట్టు. దే. క్రి. దప్పిగలుగు.

దగాకోరు. దే. విణ. మోసగాడు.

దగులుబాజీ దే. వి. మోసగాడు.

దగ్గఱ. దే. వి. సమీపము. రూ. డగ్గఱ. డగఱ.

దగ్గఱించు. } దే. క్రి. సమీపించు.
దగ్గఱు. }

దగ్గఱిల్లు. దే. క్రి సమీపించు.

దగ్గు. దే. క్రి. ౧. కాసముచేయు. ౨. వి. కాసము.

దగ్గుత్తిక. దే. వి. గద్గదస్వరము.

దగ్ధ. త్స. విణ. కాల్చువాఁడు.

దగ్ధము. త్స. విణ. ౧. కాల్పఁబడినది. ౨. పాడు. (దగ్ధోదరము = పాడు పొట్ట.)

దఘ్నము. త్స. ప్రమాణార్థమున వచ్చు తద్ధిత ప్రత్యయము.

(జాను)దఘ్నము=మోకాలిబంటి.

(కంఠ)దఘ్నము=గొంతులోతుమె.

దచ్చవుక. } దే. స. ఎనిమిది.
దచ్చి. }

దట్టకెంపు. దే. వి. ఎక్కువ యెఱుపు.

దిట్టన. దే. వి. అదలుపు. క్రి. దట్టించు.

దట్టము. దే. విణ. ౧. తఱచు. ౨. విరళము. వి.౧. పావడ. ౨. కాసె.

దట్టి. } దే. వి. ౧.దిండు. ౨. కాసె.
దట్టె. }

దట్టించు. దే. క్రి. ౧. తర్జించు. ౨. గట్టిగఁ గూరు. 3. పోఁగొట్టు. ౪. జయించు. ౫. పూను.

దట్టుఁడు. దే. విణ. ధీరుఁడు.

దడ. దే. వి. ౧. వణఁకు. ౨. దాళా.

దడకట్టు. దే. క్రి. దాళాకట్టు.

దడదడ. దే. అవ్య. వడిగా.

దడదడమను. దే. క్రి. దడదడ కొట్టుకొను.

దడబడ. దే. వి. ఆటోపము.

దడము. దే. విణ. దట్టము. వి. సేన. రూ. దళము.

దడవట. దే. వి. కపటువ్యాపారము.

దడి. దే. వి. తాటాకులు మున్నగు వానితో కట్టిన మఱుఁగు.

దడిపము. దే. విణ. సన్ననిది. వి. మేలి వస్త్రము.

దడిమము. దే. విణ. ,,
వి. పఱపు.

దణా. దే. వి. సేన.

దణాపెద్ద. దే. వి. సేనాపతి.

దత్తకుఁడు. త్స. వి. దత్తపుత్త్రుఁడు.

దత్తము. త్స. విణ. ఇయ్యఁబడినది.

దత్తి. దే. వి. చెప్పినట్లు నడుచుకొను బంటు.

దత్తు. వై. వి. ౧. విధము. ౨. రీతి. 3. స్వీకారము.
దత్తుఁడు. త్స. వి. దత్తపుత్త్రుఁడు.
దద్దరిల్లు. దద్దఱు. } దే. క్రి. ౧. తబ్బిబ్బుపడు. ౨. కంగారుపడు. 3. భయపడు.
దద్దిర్లు. దే. క్రి. చూ. దద్దరిల్లు.
దద్దు. దద్దురు. } వై. వి. ౧. చీమ కుట్టుట లోనగువానిచేఁ గలిగెడు బుడిపి. ౨ రోగ విశేషము.
దధి. త్స. వి. పెరుగు.
దధ్యోదనము. త్స. వి. పెరుగు కలిపిన యన్నము.
దనియాలు. వై. వి. కొత్తిమిరి విత్తులు.
దనియాలు జాతి=చెప్పుతో రాయఁదగిన జాతి (అణఁచిపెట్టవలసిన జాతి)
దనుక. దే. అవ్య. వఱకు.
దనుకు. దే. క్రి. ౧. పొందు. ౨. సహించు. 3. అనుభవించు.
దనుజుఁడు. త్స. వి. రాక్షసుఁడు.
దప్పళము. దే. వి. ౧. పులుసు.
దప్పి. దప్పిక. } దే. వి. ౧. దాహము. ౨. కష్టము.
దప్పికిచ్చు = దప్పికఁబోవుటకునిచ్చు.
దప్పిగొను. దే. క్రి. పిపాసితుఁడగు.
దబదబ. దే. వి. తలుపు గొట్టునపు డయ్యెడి ధ్వన్యనుకరణము.
దబ్బ. దే. వి. ౧. బద్ద. ౨. వెదురు బద్ద. 3. నారంగవిశేషము.
దబ్బడించు. దే. క్రి. ౧. చేతులతో చఱచు. ౨. మాటుకటితో మాయు.
దబ్బనము. దే.వి.గోనెను కుట్టెడుసూది.
దబ్బఱ. దే. వి. ౧. మోసము. ౨. బొంకు. 3 తప్పు.
దబ్బాటు. దే. వి. చూ. డబ్బాటు.
దబ్బున. దే. అవ్య. శీఘ్రముగా.
దబ్బర. దే. వి. చూ. డబ్బర.
దబ్బువెట్టు. దే. క్రి. మాయు.
దభ్రము. త్స. విశ. సూక్ష్మము.
దమనము. త్స. వి. ౧. అణఁచుట. ౨. దవనము. 3. బాహ్యేంద్రియ నిగ్రహము.
దమము. త్స. వి. ౧. దండోపాయము. ౨. బాహ్యేంద్రియ నిగ్రహము.
దమి. త్స. విశ. ౧. అణఁచువాఁడు. ౨ దండించువాడు. 3. బాహ్యేంద్రియ నిగ్రహము గలవాఁడు.
దమించు. త్స. క్రి. ౧. అణఁచు. ౨. దండించు.
దమితము. త్స. విశ. ౧. అణఁపఁబడినది. ౨. దండింపఁబడినది.
దమ్మిడి. దే. వి. అయిదు కానుల నాణెము.
దమ్ము. దే. వి. బురద.
దమ్ముఁడు. దే. విశ. ౧. కపటములేనివాఁడు. ౨. ధార్మికుఁడు.

దయ. త్స. వి. ౧. కరుణ. ౨. కనికరము.
దయచేయు. } దే. క్రి. ౧. కరుణించు.
దయసేయు. } ౨. ఇచ్చు.
దయాళువు. త్స. విణ. కనికరము కల వాఁడు.
దయిత. త్స. వి. ప్రియురాలు.
దయితుఁడు. త్స. విణ. ప్రియుఁడు.
దయివాఱు. దే. క్రి. అతిశయించు.
దయ్యము. వై. వి. ౧. దేవుఁడు. ౨. పిశాచము.
దయ్యు. దే. క్రి. డయ్యు.
దర. వై. వి. వెల.
దరదరకలు. దే. వి. నిగ్గులు.
దరవీడు. దే. క్రి. చరింపఁజేయు.
దరహాసము. త్స. వి. చిఱునవ్వు.
దరి. వై. వి. ౧. మేర. ౨. గట్టు. ౩. చేరువ. త్స. గుహ.
దరిగొను. దే. క్రి. ౧. మండు.
దరిదాఁపు. దే. వి. ౧. ఆశ్రయము. ౨. సమీపము. ౩. మేర.
దరిద్రాణము. త్స. వి. దారిద్ర్యము.
దరిద్రుఁడు. త్స. విణ. బీదవాఁడు.
దరిచేసి. దే. వి. ౧. దీనుఁడు. ౨. పిసినిగొట్టు.
దరిసించు. వై. క్రి. దర్శించు.
దరిసెనము. దే. వి. దర్శనము.
దరువు. దే. వి. ౧. పాట. ౨. తాళము.
దరువులువెట్టు. దే. క్రి. గీతికలుపాడుకొను.
దర్దురము. త్స. వి. కప్ప.
దర్పణము. త్స. వి. అద్దము.
దర్పము. త్స. వి. ౧. గాంభీర్యము. ౨. గర్వము.
దర్పించు. త్స. క్రి. గర్వించు.
దర్పితుఁడు. త్స. విణ. గర్వించినవాఁడు.
దర్భ. త్స. వి. కుశము.
దర్వి. త్స. వి. ౧. గరిటె. ౨. తెడ్డు.
దర్వీకరము. త్స. వి. పాము.
దర్శనము. త్స. వి. ౧. కన్ను. ౨. అద్దము. ౩. చూపు ౪. శాస్త్రము.
దర్శనీయము. త్స. వి. చూడఁదగినది.
దర్శించు. త్స. క్రి. చూచు.
దవనము. వై. వి. వాసనగల మూలికావిశేషము.
దవళము. దే. వి. గీతివిశేషము.
దవు=దవ్వు. దీని ఆమ్రేడితము. దవుదవు. దౌదవు. దౌదౌ. దౌదవ్వు.
దవుడ. దే. వి. ఢాలువు.
దవ్వగు. దే. క్రి. దూరమగు.
దవ్వు. వై. విణ. దూరము. (దీనిఆమ్రేడము దవ్వ దవ్వు. దౌదౌ. దవుదవ్వు.)
దవ్వులగు= దూరమగు.
దవ్వులది= దూరమందున్నది.
దవ్వులవాఁడు= దూరమందున్నవాఁడు.
దశ. త్స. వి. ౧. వృత్తి. ౨. అవస్థ.
దశకంఠుఁడు. త్స. వి. రావణుఁడు.
దశకము. త్స. వి. పదింటి సమూహము.

దశనచ్ఛదము. త్స. వి. వాతెఱ.
దశనము. త్స. వి. దంతము.
దశమి. త్స. వి. ఏపక్షమందైనను పదియవతిథి.
దశమీస్థుఁడు. త్స. విణ. పడకగదిలో నున్నవాఁడు. శతవృద్ధు.
దశరథుఁడు. త్స. వి. రామునితండ్రి.
దశరాత్రము. త్స. వి. పదిరాత్రుల సమూహము.
దశాహము. త్స. వి. చచ్చినవారికి పదియవదినమున చేయుపితృకర్మము.
దష్టము. త్స. విణ. కొఱుకఁబడినది.
దసరా. వై. వి. నవరాత్రిపండుగ.
దసిలీ. దే. వి. ఒకవిధమగు పట్టుతో నేసినబట్ట.
దస్తరము. దే. వి. కాగితములమూట.
దస్తూరి. దే. వి. ౧. వ్రాత. ౨. చేవ్రాలు.
దస్యుఁడు. త్స. వి. దొంగ.
దస్రుఁడు. త్స. వి. ౧. దొంగ. ౨. అశ్వినీకుమారులు.
దహనము. త్స. వి. కాల్చుట. క్రి. దహించు.
దహరము. త్స. విణ. సూక్ష్మము.
దహరాకాశము. త్స. వి. చిదాకాశము.
దళకొను. దే. క్రి. అధికమగు.
దళగించు. దే. క్రి. దట్టమగు.
దళనము. త్స. వి. ౧. ఖండించుట. ౨. ఛేదించుట.
దళము. దే. వి. ఆధిక్యము. విణ. ౧. అధికము. ౨. దట్టము. త్స. వి. ౧. ఆకు. ౨. దండు.
దళముగొను. దే. క్రి. అధికమగు. రూ. దళగొను. గుంపుగూడు.
దళవరి. / దళవాయి. } దే. వి. సేనాధిపతి.
దళసరి. దే. వి. ఘనత. విణ. ౧. మందము. ౨. తఱచు.
దళించు. త్స. క్రి. విఱుచు.
దళితము. త్స. విణ. ౧. ఖండింపఁబడినది. ౨. ఇటునటు చిమ్మఁబడినది.
దళియించు. త్స. క్రి. విడుచు.

దా

దాంతము. త్స. విణ. ౧. అణఁపఁబడినది. ౨. శిక్షింపఁబడినది.
దాంతి. త్స. వి. బ్రహ్మచర్యాది తపఃక్లేశమును ఓర్పుతనము.
దాంపత్యము. త్స. వి. దంపతిభావము.
దాంభికుఁడు. త్స. విణ. దంభముగలవాఁడు.
దాఁక. దే. అవ్య. చూ. దనుక.
దాఁకొను. దే. క్రి. మఱుఁగుపడు.
దాఁగనమ్రుచ్చిళ్ళు. / దాఁగనమ్రుచ్చులు. } దే. వి. దాగిలిమూఁతలు.
దాఁగిలిమూఁతలు. దే. వి. బ. బాలురాడుకొను నొకవిధమగునాట.
దాఁగిలిమ్రుచ్చులు. దే. వి. ,,

దాఁగు. దే. క్రి. మఱుఁగు.

దాఁగుడుమూఁతలు. దే. వి. దాఁగిలి మూఁతలు.

దాఁగురించు. దే. క్రి. ౧. దాఁచు. ౨. వంచించు. వి. దాఁగురింత.

దాఁగురుమూఁతలు. దే. వి. ఓ. చూ. దాఁగిలి మూఁతలు.

దాఁగురుముచ్చులు. దే. వి. దాగిలి మూఁతలు.

దాఁచు. దే. ప్రే. దాఁగఁ జేయు.

దాఁటు. దే. క్రి. ౧. లంఘించు. ౨. తరించు. 3. ఉల్లంఘించు వి. ౧. లంఘనము. ౨. సమూహము.

దాఁటుకొను. దే. క్రి. లంఘించు.

దాఁటువడు. దే. క్రి. గుంపుగూడు.

దాఁట్లమారి. దే. వి. వ్యభిచారిణి.

దాఁపన. దే. వి. దాఁచుట.

దాఁపరము. దే. వి. దొంగిలించుట.

దాఁపరించు. దే. క్రి. దొంగిలించు.

దాఁపరీఁడు. దే. వి. దొంగ.

దాఁపటీకము. దే. వి. ౧. దాఁపురము. ౨. గోపనము.

దాఁపు దే. క్రి. దాఁచు. వి. దాఁపుడు.

దాఁపురము. దే. వి. మఱుఁగుపుచ్చుట.

దాక. దే. వి. ౧. మూతివెడల్పుగల చిన్నకుండ. ౨. ద్రాక్ష.

దాకలి. దే. వి. కమ్మరివాని యినుప దిమ్మె.

దాకొను. దే. క్రి. సమీపించు.

దాక్షాయణి. త్స. వి. పార్వతి.

దాక్షిణాత్యుఁడు. త్స. విణ. దక్షిణ దేశపువాఁడు.

దాక్షిణ్యము. త్స. వి. ౧. కనికరము. ౨. అనుకూల్యము. 3. నైపుణ్యము.

దాగలి. దే. వి. కమ్మరివాని యినుప దిమ్మె.

దాడి. వై. వి. ౧. గడ్డము. ౨. శత్రుని జయార్థము దండెత్తిపోవుట. 3. దండయాత్ర.

దాడిచేయు. వై. క్రి. దండెత్తు.

దాడినిమ్మ. } వై. వి. దానిమ్మ.
దాడిమము.
దాడిమ్మ.

దాణ. వై. వి. గుఱ్ఱము నాహారము.

దాత. త్స. విణ. ఇచ్చువాఁడు.

దాతృత్వము. త్స. వి. ఈవి.

దాత్యూహము. త్స. వి. ౧. చాతకము. ౨. నీరుకాకి.

దాత్రము. త్స. వి. కొడవలి.

దాదాపు. దే. వి. మిక్కిలిసమీపము.

దాది. } వై. వి. పాలిచ్చి పెంచు తల్లి.
దాదిలి.

దానకము. త్స. వి. ౧. కుత్సితదానము. ౨. అల్పదానము.

దానము. త్స. వి. ౧. ఏనుఁగు చెక్కిళ్లఁ గలిగెడు నీరు. ౨. ఈవి.

దానవుఁడు. త్స. వి. రాక్షసుఁడు.

దానవురాలు. త్స. వి. రాక్షసస్త్రీ.

దానవేయుఁడు. త్స. వి. రాక్షసుఁడు.
దానశూరుఁడు. త్స. వి. గొప్పదాత.
దానశౌండుఁడు. త్స. వి. ,,
దానిమ్మ. దే. వి. చూ. దాడిమ్మ.
దాపరము. దే. వి. ప్రాప్తి.
దాపరించు. దే. క్రి. ప్రాప్తించు.
దాపల. దే. వి. ఎడమభాగము.
దాపలించు. దే. క్రి. ఎడమవైపుగా నుంచు.
దాపించు. దే. క్రి. సమీపించు.
దాపు. దే. వి. ౧. సమీపము. ౨. శరణము. ౩. ఆధారము.
దాపుర మగు. దే. క్రి. ప్రాప్తించు.
దాపురము. దే. వి. ప్రాప్తి.
దాపులకుఁదెచ్చు. దే. క్రి. తిరస్కరించు.
దాపులువోవు. దే. క్రి. వ్రేలాడు.
దామ. } త్స. వి. పూలదండ.
దామము. }
దామని. త్స. వి. పలుపు.
దామెన. దే. వి. పలుపు.
దామెనత్రాడు = దామెనపగ్గము.
దామెనమోసు = దామెన.
దామోదరుఁడు. త్స. వి. కృష్ణుఁడు.
దాయ. దే. వి. ౧. శత్రువు. ౨. జ్ఞాతి.
దాయఁగట్టు. దే. క్రి. బందము వేయు.
దాయభాగము. త్స. వి. పిత్రాది ధనమును బంచుకొనుట.
దాయము. దే. వి. పందెము. (దాయమాడు = పందెమువేయు) త్స. వి. ౧. పిత్రాది ధనము. ౨. అరణము.
దాయాది. త్స. విణ. దాయాదుఁడు.
దాయాదుఁడు. త్స. వి. ౧. పుత్త్రుఁడు. ౨. జ్ఞాతి.
దాయాద్యము. త్స. వి. జ్ఞాతిత్వము.
దాయి. దే. వి. ౧. సమీపము. (ఆమ్రేడిత రూపము. దాదాయి) ౨. దాకలి.
దాయు. దే. క్రి. డాయు.
దార. వై. వి. ౧. (ధారాపూర్వకమైన) దానము. ౨. నీటిజాలు. ౩. కవితాధార. ౪. కావాళి. త్స. వి. పెండ్లాము.
దారణ. దే. వి. ౧. వెల. ౨. క్రయము.
దారణము. దే. వి. చీల్చుట.
దారబందము. వై. వి. ద్వారబంధము.
దారము. దే. వి. ౧. నూలిత్రాడు. ౨. ద్వారము.
దారవోయు. దే. క్రి. దానముచేయు.
దారి. దే. వి. ౧. త్రోవ. ౨. సూత్రధారుఁడు.
దారించు. త్స. వి. భేదించు.
దారికట్టు. దే. వి. మార్గము నిరోధించు ఓషధి.
దారిద్ర్యము. త్స. వి. బీదతనము.
దారుణము. త్స. విణ. భయంకరము.
దారున. దే. అవ్య. శీఘ్రముగా.

దార్ఢ్యము. త్స. వి. దిటువు.
దాలి. దే. వి. అగ్నికుండము.
దాలిగుంట. దే. వి. నీళ్లు కాఁచుటకు త్రవ్విన పల్లము.
దాలిమము. త్స. వి. దాడిమము.
దావలచేయి. దే. వి. ఎడమచేయి.
దావళి. దే. వి. మడికి ధరించుకొను కంజళవస్త్రము.
దావాగ్ని. త్స. వి. కారుచిచ్చు.
దాశరథి. త్స. విణ. దశరథుని పుత్రుఁడు.
దాశరథుఁడు. త్స. విణ. దశరథుని పుత్త్రిఁడు.
దాశార్హుఁడు. త్స. వి. శ్రీకృష్ణుఁడు.
దాశుఁడు. త్స. వి. బెస్తవాఁడు.
దాశేరుఁడు. త్స. విణ. బెస్తదాని కొడుకు.
దాసనము. దే. వి. జపాపుష్పము.
దాసమయ్య. దే. వి. దాసుఁడు.
దాసము. దే. వి. దాస్యము.
దాసరయ్య. } వై. వి. విష్ణుసేవకుఁ
దాసరి. } డైనశూద్రుఁడు.
(తన్నీరు)దాసల్లు = దేవళమున నీరుదెచ్చు భృత్తులగు సేవకులు.
దాసానము. దే. వి. దాసనము.
దాసి. త్స. వి. వెలకుఁగొన్న పనికత్తె.
దాసుఁడు. త్స. వి. ౧. శూద్రుఁడు ౨. వెలకుఁగొన్న పనివాఁడు.
దాసేయుఁడు. } త్స. విణ. దాసీ
దాసేరుఁడు. } పుత్త్రిఁడు.
దాస్యము. త్స. వి. సేవ.
దాహము. త్స. వి. ౧. దప్పి. ౨. కాలుట.
దాహముగొను = దప్పిగొను.
దాహరి. దే. వి. దాసరి.
దాళా. దే. వి. పడియొక్క హెచ్చు తక్కువ.
దాళి. త్స. వి. పప్పు.
దాళిమ్మ. వై. వి. చూ. దాడిమ్మ.
దాళీకుఁడు. } దే. వి. ౧. కార్యకర్త.
దాళీకత. } ౨. పనినిర్వహించు వాఁడు.
దాళు. దే. వి. వర్ణలేశము.
పసుపుదాళు = లేఁతపసుపురంగు.
దాళువాళించు. దే. క్రి. ౧. ప్రకాశించు. ౨. ఒప్పు.

ది

దించు. దే. ప్రే. దిగఁజేయు.
దింటెన. దే. వి. ఒకానొక చెట్టు.
దిండు. దే. వి. ౧. నిడుపాటి గుండ్రపు తలగడ. ౨. దట్టి. 3. గోడ. ౪. దీపము.
దింపు. దే. వి. ౧. పోఁగొట్టు.
దింపుడుకళ్ళము. దే. వి. పీనుఁగను పాడెమీఁదపెట్టి శ్మశానమునకు మోసికొని పోవునపుడు నడుమ అచ్చటచ్చట దానిని దింపుడు తావు.

దిక్కుమెుకము. } దే. వి. భయాదులచే
దిక్కామెుకము. } పోంచిన దిక్కు
మెుగమై పాఱి
పోవు వాఁడు.

దిక్కు. త్స. వి. దిశ. దే. వి. ౧. రక్ష. ౨. ఎడ. 3. పక్షము.

దిక్కుమాలు. దే. క్రి. గతిలేకుండు.

దిక్పతి. త్స. వి. దిక్పాలుఁడు.

దిగంబరుఁడు. విణ. దిసమొలవాఁడు.

దిగఁగాఱు. } దే. క్రి. క్రమముగాఁ
దిగనాఱు. } కృశించు.

దిగఁదన్ను. దే. క్రి. దిగవిడుచు.

దిగఁదీయు. దే. క్రి. దిగఁదుడుచు.

దిగఁదుడుచు. దే. క్రి. దిగదీయు.

దిగఁద్రోచు. దే. క్రి. విడుచు.

దిగఁద్రోవు. దే. క్రి. విడుచు.

దిగఁబడు. దే. క్రి. ౧. దిగు. ౨. అడఁగు. 3. జాఱు.

దిగఁబాఱమింగు. దే. క్రి. దిగమ్రింగు.

దిగఁబాఱు. దే. క్రి. క్షీణించు.

దిగఁబోఁత. దే. వి. దిగువకు వ్యాపించుట. (వ్యతిరేకము. ఎగఁబోఁత.)

దిగనాడు. } దే. క్రి. విడుచు. రూ.
దిగవిడుచు. } దిగ్గనాడు.

దిగసన. దే. విణ. తక్కువ. క్రి. విణ. దిగువగా. (వ్యతిరేకము. ఎగసన.)

దిగాలుపడు. దే. క్రి. దిగులుపడు.

దిగు. దే. క్రి. ౧. దిగుమతియగు. ౨. మీఁదనుండి క్రిందికి వచ్చు. రూ. దిగ్గు.
(గుండెఁగూడు దిగు = అన్నము వంటఁబట్టు. సుఖముగా నుండు.)

దిగుచు. దే. ప్రే. దించు.

దిగుజాతి. దే. వి. నిమ్నజాతి.

దిగుడు. దే. విణ. ౧. తక్కువ. ౨. వంగినది.
దిగుడుబావి = కేశాకూళి.

దిగుదల. దే. వి. క్రిందిభాగము.

దిగుమతి. దే. వి. (ఓడలోనున్న సామానులను క్రిందికి దించుట.)

దిగులు. దే. వి. గుండెయదరు.
గుండెదిగులు = భయము.

దిగులుపడు. దే. క్రి. దిగులొందు.

దిగువ. దే. వి. క్రిందు.

దిగువాటు. దే. క్రి. క్రిందివైపు.

దిగువాయి. దే. విణ. తక్కువది.

దిగువాఱు. దే. క్రి. ౧. జాఱు. ౨. ప్రవహించు.

దిగ్గన. దే. అవ్య. తటాలున. రూ. దిగ్గున.

దిగ్గనాడు. దే. క్రి. విడుచు.

దిగ్గాడు. దే. క్రి. కృశించు.

దిగ్గియ. } దే. వి. నడబావి.
దిగియ. }

దిగ్గు. దే. క్రి. దిగు.

దిగ్గున. దే. అవ్య. దిగ్గన.

దిగ్గురను. దే. క్రి. భయముచే హృదయము దిగ్గుమను.

దిగ్ధము. త్స. విశ. పూయఁబడినది.

దిగ్బంధము. త్స. వి. మంత్రముచేఁ గట్టెడు దిక్కుల కట్టు.

దిగ్భ్రమము. త్స. వి. ౧. తబ్బిబ్బు, ౨. భ్రమ.

దిగ్విజయము. త్స. వి. దిక్కుల నుండు రాజ్యమును గెలుచుట.

దిచ్చరి. దే. వి. వ్యభిచారిణి.

దిచ్చరించు. దే. క్రి. వ్యాపించు.

దిచ్చమొగము. దే. విశ. అదృశ్యము.

దిటఁదేలు. దే. క్రి. గడితేలు.

దిటము. దే. వి. ధైర్యము. రూ. దిట. (దిటచెడి)

దిటవు. దే. వి. దార్ఢ్యము. విశ. దృఢము.

దిట్ట. దే. వి. శక్తి. విశ. ధైర్యముకలవాఁడు. ౨. దార్ఢ్యము కలవాఁడు.

దిట్టఁడు. దే. విశ. „

దిట్టము. దే. విశ. ౧. దృఢము ౨. గట్టిది. ౩. నిర్ణీతము. ౪. ధైర్యము.

దిట్టాడు. దే. క్రి. ౧. అతిశయించు ౨. ఏనుఁగు నెక్కించు.

దిడ్డి. దే. వి. ౧. చిన్నవాకిలి. ౨. ఇఱుకుకంత.

దిడ్డిగంత. దే. వి. దిడ్డికన్నము.

దిడ్డిదూఱు= తనగొప్పతనమునరుఁ దగని పనిచేయు.

దితి. త్స. వి. రాక్షసులతల్లి.

దితిజుఁడు. త్స. వి. రాక్షసుఁడు.

దిద్దు. దే. క్రి. ౧. సవరించు. ౨. శిక్షించు. ౩. రాచు.

దిద్దుగడ. / దిద్దుడు. / దిద్దుబడి. } దే. వి. దిద్దుపాటు.

దినకరుఁడు. త్స. వి. సూర్యుఁడు.

దినగోరు. మి. వి. దినమునకొక్కవంతు.

దినచల్వలు. మి. వి. దినమునకొక్కటి చొప్పున ఉపయోగించు చలువ చేసిన వస్త్రములు.

దినబత్తెము. దే. వి. దినమున ఇచ్చుకూలి.

దినము. త్స. వి. పగలు.

దినరోజు. మి. వి. ఏరోజునఁ జేసినపనికి ఆరోజున ఇచ్చుకూలి.

దినవహి. దే. వి. జమాఖర్చు.

దినవెచ్చము. దే. వి. దినమున ఇచ్చు కూలి.

దినసరులు. దే. వి. ప్రతిదిన కార్య క్రమము.

దినారి. దే. వి. బంగారునాణెము. (దీనారము.)

దినుసు. / దినుసు. } దే. వి. ౧. ప్రకారము. ౨. వస్తువు.

దినుసుమీఱు=సాటిలేనిదగు.

దినుసువచ్చు=సాటికివచ్చు.

దిప్పకాయ. దే. విశ. అల్లరివాఁడు.

(రణ)దిప్పకాయ=పెద్దఅల్లరివాఁడు.

దిబ్బ. దే. వి. ౧. కుప్ప. ౨. ఉన్నత భూమి.

దిబ్బడ. దే. వి. శైత్యాదికములచే ముక్కు చెవులందుఁ గల్గు బాధా విశేషము.

దిబ్బియము. } దే. వి. దీపము.
దిబ్బెము. }

దిబ్బెమెత్తు. దే. వి. దీపమెత్తి ప్రమాణము చేయు.

దిమ్మ. దే. వి. ౧. దిబ్బ. ౨. వికారము.

దిమ్మదుచు. దే. క్రి. ౧. దిమ్ముకట్టు. ౨. దిబ్బడవేయు.

దిమ్మపడు. దే. క్రి. మొద్దువాఱు.

దిమ్మరి. దే. విణ. ౧. మత్తుకలవాఁడు. ౨. భ్రమకలది. 3. భ్రమకలవాఁడు.

దిమ్మస. దే. వి. నేలచదును.

దిమ్ము. దే. వి. ౧. మదము. ౨ మాంద్యము. 3. సమూహము.

దిమ్ముపట్టు. దే. క్రి. ౧. మత్తుగొను. ౨. భ్రమగొను.

దిరదిర. } దే. వి. తిరుగుటలోనగు
దర్దిర. } ధ్వన్యనుకరణము.

దిరిసెనము. దే. వి. శిరీషము.

దిరిసెము. దే. వి. ,,

దిల్లవడు. దే. క్రి. బలహీనమగు.

దివటి. } దే. వి. ఇనుపకాఁడకు గుడ్డలు
దివటీ. } చుట్టిముట్టించు దీపము.

దివము. త్స. వి. ౧. పగలు. ౨. స్వర్గము. 3. ఆకాశము.

దివసము. త్స. వి. ౧. పగలు. ౨. రోజు.

దివసపడి = నిత్యపడి (ప్రతిదినమును ఈయవలసిన పరిమాణ విశేషము.)

దివస్పతి. త్స. వి. ఇంద్రుఁడు.

దివాంధము. త్స. వి. గుడ్లగూబ.

దివాకరుఁడు. త్స. వి. సూర్యుఁడు.

దివాకీర్తి. త్స. వి. చండాలుఁడు.

దివాణము. వై. వి. ౧. రాజుకొలువు కూటము. ౨. కొలువు కూటము.

దివానిశము. త్స. వి. రేయింబవలు.

దివి. త్స. వి. ౧. ఆకాశము. ౨. స్వర్గము.

దివిజుఁడు. త్స. వి. దేవత.

దివియ. దే. వి. ౧. దీపము. ౨. దివటీ. రూ. దివె.

దివిషదుఁడు. త్స. వి. దేవత.

దివె. దే వి. దివియ.

దివెల. } దే. వి. దీపావళ్యమావాస్య.
దివ్వెల. }

దివౌకసుఁడు. త్స. వి. దేవత.

దివ్యము. త్స. విణ. ౧. మనోహరమైనది. ౨. స్వప్నమునఁ బుట్టినది. 3. అమానుషము.

దివ్వటి. దివ్వటీ. } దే. వి. కరదీపిక.
దివటి. దివటీ. }

దివ్వియ. } దే. వి. చూ. దీవియ.
దివ్వె. }

దిశ. త్స. వి. దిక్కు.
దిశాపట్టము. క్రి. విణ. చెల్లాచెదరగు నట్లుగా.
దిష్టము. త్స. విణ. నిర్దిష్టము.
దిసంతులడఁచు. దే. క్రి. నిందించు.
దిసంతులుగొట్టు. దే. క్రి. నిందించు.
దిసమొల. } దే. వి. దిగంబరము.
దిస్సమొల. }
దిస్టి. దే. వి. దృష్టిదోషము.

దీ

దీకొను. దే. క్రి. చూ. డీకొను.
దీక్ష. త్స. వి. వ్రతము. విణ. దీక్షితుఁడు. క్రి. దీక్షించు.
దీటు. దే. క్రి. సరిచేయు. విణ. సరి.
దీటుకట్టు. దే. క్రి. నిండు.
దీటుకొను. దే. క్రి. ౧. నిండుకొను. ౨. సవరించు. 3. సరిపోలు.
దీటువచ్చు. దే. క్రి. పోలు.
దీధితి. త్స. వి. కిరణము.
దీనారము. త్స. వి. బంగారు నాణెము.
దీనుఁడు. త్స. విణ. ౧. దరిద్రుఁడు. ౨. గర్వ ముడిగినవాఁడు. 3. భయపడినవాఁడు.
దీపము. త్స. వి. ౧. దీపిక. ౨. తీఁగ.
దీపావళి. త్స. వి. ౧. దీపములసమూహము. ౨. నరక చతుర్దశి మఱునాఁటి పండుగ.
దీపించు. త్స. క్రి. ౧. ప్రకాశించు. ౨. ప్రజ్వలించు.
దీపిక. త్స వి. దీపము.
దీపిలు. త్స. క్రి. ప్రకాశించు.
దీపురము. దే. విణ. ప్రకాశించునది.
దీప్తము. త్స. విణ. ౧. వెలిఁగినది. ౨. ప్రకాశించినది.
దీప్తి. త్స. వి. కాంతి.
దీప్రము. త్స. విణ. ప్రకాశించునది.
దీమము. దే. వి ౧. దీము. పశుపక్ష్యాదులను వశముచేసికొనుటకై యేర్పఱచిన పశుపక్ష్యాదికము. ౨. గృహము.
దీమసము. దే. వి. ౧. ఉపాయము. ౨. ధైర్యము. 3. ఉత్సాహము. ४. పూనిక.
దీము. దే. వి. దీమము.
దీముకొను. దే. క్రి. నెలకొను.
దీర్ఘదర్శి. త్స. విణ. దూరపుయోచన కలవాఁడు.
దీర్ఘనిద్ర. త్స. వి. చావు.
దీర్ఘము. త్స. విణ. నిడుద.
దీర్ఘాయువు. త్స. వి. కాకి. విణ. పెక్కేండ్లు బ్రదుకువాఁడు.
దీర్ఘిక. త్స. వి. దిగుడుబావి.
దీర్ణము. త్స. విణ. విచారితము.
దీలపోవు. దే. క్రి. డీల్లపడు.
దీలు. దే. క్రి. డీలపడు.
దీలుపడు. దే. క్రి. ౧. డీలపడు. ౨. బలహీనమగు.
దీవన. దే. వి. ఆశీర్వాదము.

దీవనఁబ్రాలు. దే. వి. ఆశీర్వాదాక్షతలు.
దీవసము. దే. వి. ధైర్యము.
దీవి. దే. వి. నీటినడిమిదిబ్బ.
దీవించు. దే. క్రి. ఆశీర్వదించు.
దీవిటి. దీవిటీ. దే. వి. దివ్విటి.
దీనియ. / దీవె. } దే. వి. దీపము.
దీవెన దే. వి. చూ. దీవన.

దు

దుంగ. దే. వి. మ్రాని మొద్దు.
దుండగము. దే. వి. ౧. దౌష్ట్యము. ౨. కీడు.
దుండగీఁడు. వై. విశే. దుష్టుఁడు.
దుంత. దే. వి. దున్నపోతు.
దుందుడుకు. దే. వి. ౧. గర్వము. ౨. మిక్కిలి తొందర. 3. మిక్కిలి దుడుకు. ౪. ఆపద.
దుందుభి. త్స. వి. ౧. భేరి. ౨. అఱువది సంవత్సరములలో ఒకటి.
దుందుము. దే. వి. కాష్ఠదీపిక.
దుందుఱు. దే. వి. జుంజుఱుకట్టు.
దుంప. దే. వి. గెనుసు లోనగువాని గడ్డ.
దుఃఖము. త్స. విశే. దుఃఖకరమైనది.
దుఃఖించు. త్స. క్రి. దుఃఖపడు.
దుకాణము. దే. వి. అంగడి.
దుకూలము. త్స. వి. ౧. తెల్లవస్త్రము. ౨. పట్టుబట్ట .
దుక్కి. దే. వి. దున్నుట.
దుక్కివాలు. దే. వి. నాగలి.
దుక్కెద్దు. దే. వి. దుక్కియెద్దు.
దుగ. దే. స. రెండు. రూ. దుగా.
దుగులము. దే. వి. వరహాలో పదియారవభాగము.
దుగ్గ. వై. వి. ౧. కాళి. ౨. పార్వతి. రూ. దుగ్గి.
దుగ్గాని. వై. వి. రెండుదమ్మిడ్లు.
దుగ్గి. వై. వి. దుగ్గ.
దుగ్గు. దే. వి. చెత్త.
దుగ్ధ. త్స. వి. ౧. లేనిపోనిపని. ౨. బాధ.
దుగ్ధము. త్స. వి. పాలు.
దుడుకడచు. దే. క్రి. ముసుఁగు.
దుడుకడు. దే. వి. దుష్టుఁడు.
దుడుకు. దే. వి. దుష్టతనము. విశే. దుష్టుఁడు.
దుడ్డు. దే. వి. ౧. డబ్బు. ౨. లావు కఱ్ఱ. 3. గద.
దుడ్డుఁగఱ్ఱ. / దుడ్డుఁగోల. } దే. వి. లావుకఱ్ఱ.
దుడ్డె. దే. వి. బాలకుఁడు.
దుడ్డెగాఁడు. దే. వి. విటుఁడు.
దుత్త. దే. వి. ౧. చిన్నకుండ. ౨. పాడిదేశము.
దుత్తూరము. త్స. వి. ఉమ్మెత్త.
దుద్దు దే. వి. ౧. తామరపువ్వులోని కర్ణిక. ౨. చెవికమ్మ. 3. మోసము.
దునీఁడు. దే. వి. ప్రభువు.

దునేదారి. దే. వి. ప్రభువు. రూ. దునెదారి.

దున్న.
దున్నపోతు. } దే. వి. మహిషము.

దున్ను. దే. క్రి. దుక్కిచేయు. రూ. దును.

దుపటము. దే. వి. దుప్పటి.

దుప్పటము. దే. వి. వెలగలసన్నపాటి వెడల్పు వస్త్రము.

దుప్పటి.
దుప్పటీ. } వై. వి. ౧. దుప్పటము. ౨. కప్పుకొనెడివస్త్రము. 3. ఉత్తరీయము.

దుప్పి. దే. వి. ౧ ఒకానొకమృగము. ౨. జింక.

దుబాసి.
దుబాసికుఁడు.
దుబాసీ. } దే. విణ. ద్విభాషి.

దుబ్బ. దే. వి. ౧. కూజా. ౨. స్త్రీయోని.

దుబ్బు. దే. వి. తృణమూలము.

దుమదుమ. దే. విణ. తడియుండునప్పుడగు ధ్వని కనుకరణము.

దుమదుమలాడు. దే. క్రి. ౧. నిప్పులు రేఁగు. ౨. కోపపడు. రూ. దుముదుములాడు.

దుమాదూళి. దే. వి. అధికమగుదుమ్ము.

దుమారము. దే. వి. ౧. దుమ్ము. ౨. పెంధూళి.

దుముకు. దే. క్రి. ౧. గంతులువైచు. ౨. ఉఱుకు. వి. గంతు.

దుముదారు. దే. వి. దండు.

దుమ్మాడు. దే. క్రి. ధూళిచల్లుకొను.

దుమ్ము. దే. వి. ధూళి. రూ. దుము.

దుమ్ముదూళి. దే. వి. పిండిపిండి.

దుయుముడి. దే. వి. దూముడి.

దుయ్యు. దే. క్రి. దూయు.

దుయ్యుఁబట్టుకొను = సమాధానము చెప్పుమని నిర్బంధించు.

దురంతము. త్స. విణ. అంతములేనిది.

దురటిల్లు. దే. క్రి. దురపిల్లు.

దురద. దే. వి. ౧. జిల. ౨. కసరు.

దురదుర. దే. అవ్య. శీఘ్రముగా.

దురదృష్టము. త్స. వి. దౌర్భాగ్యము.

దురపిల్లు. దే. క్రి. ౧. శోకించు. ౨. తపించు.

దురభిమానము. త్స. వి. గర్వము.

దురభిమాని. త్స. విణ. గర్వము కలవాఁడు.

దురభ్యాసము. త్స. వి. చెడ్డయలవాటు.

దురము. దే. వి. ౧. యుద్ధము ౨. (నృత్తగీత వాద్యములందలి వేగము.)

దురవస్థ. దే. వి. మిక్కిలి హీనస్థితి.

దురహంకారము. త్స. వి. దురభిమానము.

దురా = దురాయి. ఆజ్ఞ. (దురావెట్టు.)

దురాగ్రహము. త్స. వి. చెడ్డకోపము.

దురాచారము. త్స. వి. చెడ్డవాడుక.

దు[రా]త్ముఁడు. త్స. విణ. చెడ్డమనస్సు కలవాఁడు.

దురాయి. దే. వి. ఆజ్ఞ. రూ. దురా.

దురాలోచన. త్స. వి. చెడ్డయోచన.

దురావెట్టు. దే. క్రి. శాసించు.

దురాశ. త్స. వి. నిష్ఫలమైన కోరిక.

దురితము. త్స. వి. పాపము.

దురుసు. దే. వి. ౧. కఠినము. ౨. బిరుసు.

దురోదరము. త్స. వి. ౧. పందెము. ౨. జూదము.

దురోదరుఁడు. త్స. వి. జూదరి.

దుర్గ. త్స. వి. పార్వతి. దే. వి. కోట.

దుర్గంధము. త్స. వి. గబ్బు.

దుర్గతి. త్స. వి. ౧. నరకము. ౨. బీదతనము.

దుర్గతుఁడు. త్స. విణ. ౧. దీనుఁడు. ౨. దరిద్రుఁడు.

దుర్గమము. త్స. వి. ౧. పొందఁగూడనిది. ౨. పోఁగూడనిది.

దుర్గము. త్స. వి. ౧. కోట. విణ. ౨. చొరరానిది.

దుర్ఘటము. త్స. విణ. ఘటింపనిది.

దుర్జనుఁడు. } త్స. విణ. దుష్టుఁడు.
దుర్జాత. }

దుర్దమము. త్స. విణ. అణఁపరానిది.

దుర్దశ. త్స. వి. ౧. దురదృష్టము. ౨. చెడ్డకాలము.

దుర్దినము. త్స. వి. మబ్బుక్రమ్మిన దినము.

దుర్నయము. త్స. వి. దుర్నీతి. రూ. దుర్ణ్ణయము.

దుర్బలుఁడు. త్స. విణ. బలము లేనివాఁడు.

దుర్భరము. త్స. వి. భరింపఁ గూడనిది.

దుర్భాగ్యుఁడు. త్స. విణ. దురదృష్టుఁడు.

దుర్భిక్షము. త్స. వి. కఱవు.

దుర్మతి. త్స. విణ. దుర్బుద్ధికలవాఁడు. వి. అఱువది సంవత్సరములలో ఒకటి.

దుర్మరణము. త్స. వి. చెడ్డచావు.

దుర్ముఖి త్స. వి. అఱువది సంవత్సరములలో ఒకటి.

దుర్యోధనుఁడు. త్స. వి. ధృతరాష్ట్రుని పుత్త్రుఁడు.

దుర్లభము. త్స. విణ. పొందశక్యముగానిది.

దుర్లలితము. త్స. విణ. ౧. అతిమాత్రము బుజ్జగింపఁబడినది. ౨. మిక్కిలి గారాబముగాఁ బెరిగినది. 3. దుశ్చేష్టలు గలది.

దుర్వ్యాపారము. } త్స. వి. చెడ్డ
దుర్వృత్తి. } నడత.

దుర్విదగ్ధుఁడు. త్స. విణ. విజ్ఞానీఁగువాఁడు.

దుర్వినీతుఁడు. త్స. విణ. వినయము లేనివాఁడు.

దులదుల. దే. వి. సంభ్రమమునందగు ధ్వని కనుకరణము.

దులుపు. దే. క్రి. ౧. రాల్చు. ౨. విదలించు.
దువారము. దే. వి. ద్వారము.
దువాళము. దే. వి. గుఱ్ఱపుగంతు.
దువాళి. ,,
దువాళించు. దే. క్రి. ఏకధాటిని బరుగెత్తించు.
దువాళిఁదోలు. దే. క్రి. ,,
దువాళిసేయు. దే. క్రి. ,,
దువ్వ. దే. వి. ధూళి.
దువ్వటము. దే. వి. దుప్పటము.
దువ్వలువ. దే. వి. ౧. దుప్పటము. ౨. కట్టుకోక.
దువ్వాది. దే. క్రి. దువాళి.
దువ్వు. దే. క్రి. (దువ్వెనతో) చిక్కుదీయు.
దువ్వెన. దే. వి. దువ్వుట కుపయోగించుపనిముట్టు.
దుష్కరము. త్స. విణ. చేయఁగూడనిది.
దుష్కృతము. త్స. వి. పాపము.
దుష్టము. త్స. విణ. చెడ్డది.
దుసికిలఁబడు. దే. క్రి. జాఱు.
దుసికిలు. } దే. క్రి. ౧. జాఱు. ౨.
దుసికిల్లు. } తప్పించుకొను.
దుసుకు. దే. క్రి. జాఱు.
దుస్తరము. త్స. విణ. తరింపఁ గూడనిది.
దుస్తు. దే. వి. ౧. వస్త్రము. ౨. అందము. విణ. అధికము.
దుస్త్యజము. త్స. విణ. విడువఁగూడనిది.
దుస్సహము. త్స. విణ. సహింపఁగూడనిది.
దుస్స్వప్నము. త్స. వి. చెడ్డకల.
దుహిత. త్స. వి. కూఁతురు.

దూ

దూఁకలి. దే. వి. ౧. బాధ. ౨. వేగము. 3. త్వర. ౪. మృతము.
దూఁకు. దే. క్రి. దుముకు.
దూఁకుడు. దే. విణ. ఎగుడుదిగుడు.
దూఁకొను. దే. క్రి. ౧. పొందు. ౨. స్వీకరించు. 3, అతిశయించు. ౪. ఆస్వాదించు.
దూఁట. దే. వి. అరఁటియూఁచ.
దూఁటిపుచ్చు. దే. క్రి. తిరస్కరించు.
దూఁటు. దే. క్రి. ౧. పొడుచు. ౨. కుమ్ము. 3. లంఘించు. ౪. పాటిపోవు. ౫. చొచ్చు. వి. ౧. పొడుపు.
దూఁబఱదిండి. దే. విణ. ౧. ఎంత వచ్చిన అంతయుఁ దినువాఁడు. ౨. తేరతిండికాఁడు.
దూడ. దే. వి. పశుశిశువు.
దూత. త్స. వి. ౧. రాయబారి ౨. కుంటెనకాఁడు.
దూతి. } త్స. వి. కుంటెనకత్తె
దూతిక. }
దూత్యము. త్స. వి. దూతకృత్యము.
దూది. దే. వి. విత్తుతీసినప్రత్తి.

దూప. దే. వి. ౧. దప్పి. ౨. శ్రమము.
దూపటిలు. దే. క్రి. దప్పిగొను.
దూపట్టు. దే. క్రి. శ్రమపడు.
దూపము. దే. వి. వాసన గలపొగ.
దూపార్తి. దే. దూపము పైచు పాదము కల యొకవిధముగు చిన్న గరిటె.
దూపించు. దే. క్రి. దూపము వేయు.
దూపిడు. దే. క్రి. శ్రమపెట్టు.
దూపిల్లు. దే. క్రి. దప్పిగొను.
దూబ. దే. వి. ౧. నపుంసకుఁడు. ౨. భగము. 3. డబ్బి. ౪. అధముఁడు. అధమురాలు. ౫. లజ్జితుఁడు.లజ్జితురాలు.
దూబఱ. దే. విణ. నిష్ఫలము. (దూబఱఖర్చు.)
దూబూచి. దే. వి. దోబూచి.
దూముడి. దే. వి. జాఱుముడి.
దూయు. దే. క్రి. ౧ బలవంతముగాఁగొను. ౨. బాణము నాటి వెడలు. 3. గుప్పిటితో నొక్కసారిగాఁగోయు.
దూయుముడి. దే. వి. సులభముగా నూడఁదీయునట్లు కొనముడిచి వేసిన ముడి.
దూరదర్శి. త్స. విణ. దూరపుయోజన కలవాఁడు.
దూరము. త్స. వి. దవ్వు.
దూరించు. త్స.క్రి. దూరముగాఁజేయు.
దూరేత్యుఁడు. త్స. విణ. దూరమందున్నవాఁడు.
దూఱగు. దే. క్రి. నింద్యమగు.
దూఱనాడు. దే. క్రి. నిందించు.
దూఱు. దే. వి. నింద. క్రి. నిందించు. బెడదూఱు=వట్టినింద. అపదూఱు.
దూఱుదుంకములు. } దే. వి.బాలక్రీడావిశేషము.
దూఱుదుంకెనలు. }
దూల. దే. వి. దురద.
దూలపోతు. దే. విణ. దూలగలవాఁడు.
దూలము. దే. వి. ఇంటికప్పుజుల కాధరవుగా నమర్చు మ్రాను.
దూలాలు. దే. వి. వ్యభిచారిణి.
దూళి. దే. వి. దుమ్ము.
పెందూళి=పెద్దధూళి.
దూషణము. త్స. వి. నింద. క్రి. దూషించు.
దూషితుఁడు. త్స. వి. దూషింపఁబడిన వాఁడు.
దూష్యము. త్స. వి. ణ. దూషింపఁదగినది.
దూసరికాఁడు. దే. వి. అపవాదము వేయువాఁడు.

## దృ

దృక్కు. త్స. వి. ౧. కన్ను. ౨. చూపు. 3. బుద్ధి.
దృఢము. త్స. విణ. ౧. అధికము. ౨. గట్టిది.
దృఢముష్టి. త్స. విణ. పిసినిగొట్టు.

దృఢీకరించు. త్స. క్రి. దృఢపఱచు.
దృతి. త్స. వి. తిత్తి.
దృప్తుఁడు. త్స. విణ. దర్పించినవాఁడు.
దృశ. త్స. వి. దృష్టి.
దృశ్యము. త్స. వి. చూడఁదగినది.
దృషత్తు. త్స. వి. సన్నెకల్లు.
దృష్టము. త్స. విణ. చూడఁబడినది.
దృష్టాంతము. త్స. వి. ౧. ఉదాహరణము. ౨. శాస్త్రము.
దృష్టాంతీకరించు. త్స. క్రి. ఉదాహరించు.
దృష్టి. త్స. వి. ౧. చూపు. ౨. కన్ను. 3. దృష్టిదోషము. (బహు-దృష్టులు, దృష్ఠు.)
దృష్టించు. త్స. క్రి. చూచు.
దృష్టిదండ. మి. వి. దృష్టిదోషము దగులకుండుటకు వేయుదండ.

దె

దెప్పము. దే. వి. ౧. బాణాదులకెదుట నిలిపిన కృత్రిమలక్ష్యము. ౨. కూటలక్ష్యము.
దెప్పరము. దే. వి. ౧. ఆపద. ౨. దుస్సహవచనము. విణ. ౧. అశక్యము. ౨. దుస్సహము.
దెప్పరించు. దే. క్రి. ఆపదనొందించు.
దెప్పరిల్లు. దే. క్రి. ఆపదచెందు.
దెప్పలికము. దే. వి. ౧. కష్టము. ౨. బాధ.
దెప్పు. దే. క్రి. (తాను చేసిన మేలును ఒకఁడు చేసిన కీడును) ఎదుటచెప్పు.
దెప్పుడు. దే. వి. దెప్పుట.
దెబ్బ. దే. వి. కొట్టు.
దెబ్బు. దే. వి. శీఘ్రము.
దెస. వై. వి. ౧. దిక్కు. ౨. స్థితి. 3. పక్షము. ౪. గతి. ౫. చోటు.
దెసచెడు. దే. క్రి. దిక్కుమాలు.
దెసపడు. దే. క్రి. దురవస్థనొందు.
దెసమొల. దే. వి. దిసమొల.

దే

దేఁకు. దే. క్రి. ముడ్డితో రాచు.
దేనము. దే. వి. ధ్యానము.
దేబె. దే. విణ. ౧. దీనుఁడు. ౨. మూఢుఁడు.
దేవకి. త్స. వి. వసుదేవునిభార్య.
దేవకులము. త్స. వి. దేవళము.
దేవఖాతము. త్స. వి. గుడియెదుటి కోనేఱు.
దేవత. త్స. వి. వేలుపు.
దేవతలపుట్టము. మి. వి. పట్టుబట్ట.
దేవదత్తము. త్స. వి. అర్జునుని శంఖము.
దేవదాసి. త్స. వి. వేశ్య.
దేవదూత. త్స. వి. దేవతలరాయబారి.
దేవనము. త్స. వి. ౧. జూదము. ౨. పాచిక. 3. ఆటతోఁట.

దేవమాతృకము. త్స. విణ వాననీళ్ళ చేత పండెడు భూమిగల దేశము. (వ్యతిరేకము-నదీమాతృకము)

దేవయజ్ఞము. త్స వి. గృహస్థులు నిత్యమును చేయవలసిన హోమరూపమగుయజ్ఞము.

దేవర. వై. వి. ౧. ప్రభువు. ౨. దేవుఁడు. (బహు-దేవళ్ళు.)

దేవరథము. త్స. వి. విమానము.

దేవరాయఁడు. మి. వి. ఉత్తమదేవుఁడు.

దేవరుఁడు. త్స. వి. మగనితోఁబుట్టినవాఁడు.

దేవలుఁడు. త్స. వి. ౧. మగనితోఁ బుట్టినవాఁడు. ౨. పూజారి.

దేవళము. వై. వి. దేవాలయము.

దేవవ్రతుఁడు. త్స. వి. భీష్ముఁడు.

దేవాంగులు. త్స. వి. బ. జేంద్రవారు.

దేవానాం ప్రియుఁడు. త్స. విణ మూర్ఖుఁడు.

దేవాలయము. త్స. వి. గుడి.

దేవి. త్స. వి. ౧. రాణి. ౨. పార్వతి.

దేవు. దే. క్రి. ౧. నీళ్ళు లోనగువాని యందుండి తడవి ఎత్తు. ౨. వెదకు.

దేవుఁడు. త్స. వి. వేల్పు.

దేవుకొను. దే. క్రి. ౧. చేర్చు, ౨. ప్రోగు చేయు.

దేవురించు. దే. క్రి. ౧. దైన్యము నొందు. ౨. యాచించు.

దేవురింపు. దే. వి. దేవురించుట.

దేవురు. దే. వి. ౧. దైన్యము. ౨. యాచన.

దేవురుగొట్టు. దే. వి. దేబె.

దేవులాడు. దే. క్రి. ౧. వెదకులాడు. ౨. విచారించు.

దేవెరి. } దే. వి. దొరసాని.
దేవేరి. }

దేవేరి పట్టము= పట్టమహిషిత్వము. (చందమామ) దేవేరి=నక్షత్రము.

దేశము. త్స. వి. అనేక పట్టణములు గల భూభాగము.

దేశి. త్స. వి. ౧. ఆయా దేశస్థులకు రంజకముగానుండు సంగీతము. ౨. నాట్యభేదము. 3. దేశభాషాకవిత్వము. (వ్యతి-మార్గకవిత్వము.)

దేశికుఁడు. త్స. వి. ౧. గురువు. ౨. దేశము తిరుగువాఁడు.

దేశీయము. త్స. విణ. దేశమునఁబుట్టినది.

దేశ్యము. త్స. విణ. ౧. దేశమునఁదగినది. ౨. దేశమునఁబుట్టినది.

దేసి. దే. విణ. మనోహరము.

దేహము. త్స. వి. శరీరము.

దేహళి. త్స. వి. గడప.

దేహళీదీపము. త్స. వి. గడపపైనుంచిన దీపము. (రెండు ప్రయోజనముల నెరవేర్చు ఏకకార్యమున కుపమానము ఉపయుక్తము.)

దేహి. త్స. విణ. దేహముగలవాఁడు.

## దై

దైతేయుఁడు. త్స. వి. రాక్షసుఁడు.
దైత్యారి. త్స. వి. విష్ణువు.
దైత్యుఁడు. త్స. వి. రాక్షసుఁడు.
దైనందినము. త్స. విణ. ప్రతిదినము కలుగునది.
దైనము. త్స. విణ. దినసంబంధమైనది.
దైనిక. త్స. వి. రోజుకూలి.(దినబత్తెము)
దైనికము. త్స. విణ. దినసంబంధమైనది.
దైన్యపడు. త్స. క్రి. దీనత్వము నొందు.
దైన్యపాటు. దే. దైన్యపడుట.
దైన్యము. త్స. వి. దీనత్వము.
దైలువాఱు. దే. క్రి. ౧. దైవాఱు. ౨. అతిశయించు.
దైవజ్ఞుఁడు. త్స. వి. ౧. గణకుఁడు ౨. జోస్యుఁడు.
దైవతము. త్స. వి. దేవత.
దైవము. త్స. వి. ౧. అదృష్టము. ౨. దేవుఁడు. 3. దయ్యము. విణ. దేవునినుండి వచ్చినది.
దైవాఱించు. దే. క్రి. పొంగిపొరలునట్లు చేయు.
దైవాఱు. దే. క్రి. ౧. దయివాఱు ౨. దైలువాఱు.
దైవికము. త్స. విణ. దైవమువలన కలిగినది.
దైశికుఁడు. త్స. వి. దేశికుఁడు.
దైహికము. త్స. విణ. దేహమువలనఁ బుట్టినది.

## దొ

దొంగ. దే. వి. ౧. చోరుఁడు. ౨. అరఁటిపువ్వులోని గట్టికాఁడ.
దొంగపని. } దే. వి. దొంగతనము.
దొంగతికము. }
దొంగిలించు. } దే. క్రి. ఒకరిసొమ్మును
దొంగిలు. } అపహరించు.
దొండపండు. దే. వి. బింబఫలము.
దొండి. దే. వి. ౧. రంధ్రము. ౨. భగము.
దొంతర. దే. వి. ౧. దొంతి. ౨. వరుస.
దొంతరగొను. దే. క్రి. ౧. దట్టముగా వ్యాపించు. ౨. దొంతులుగొను.
దొంతరముద్దు. దే. వి. చుంబనభేదము.
దొంతి. దే. వి. ౧. ఒకటిమీఁద నొక టిగా నుంచిన కుండలు లోనగు వానివరుస. ౨. వరుస.
(సింగారపు) దొంతి = శృంగారముల పరంపరలకు స్థానము.
(సొగసుల) దొంతి = సొగసులగని.
దొంద. దే. వి. స్థూలకాయుఁడు.
దొందడి. దే. వి. ౧. సంఘర్షము. ౨. రాయిడి. 3. వేగము. విణ. సంకులము.
దొందడించు. దే. క్రి. కలియు.
దొందు. దే. వి. ౧. జత. ౨. దొంద.
దొందుమేను. దే. వి. స్థూలశరీరము.
దొంపు. దే. వి. మళ్ళవరుస.

దొంబర. } దే. వి. దొమ్మరి.
దొంబరి. }

దొడదొడ. దే. వి. కాఱుట లోనగు వానియందగు ధ్వన్యనుకరణము.

దొడిదొడి. దే. వి. దుడిదుడి. (జనులు వేగముగా నడచుటయందగు ననుకరణము.)

దొడ్డ. దే. విశే. గొప్ప.
దొడ్డకొంచెము = ఎక్కువ తక్కువలు.
దొడ్డవయస్సు = ప్రౌఢవయస్సు.
(నడుమ బయలు, చుట్టును కట్టడములుగల యిల్లు).

దొడ్డి. వై. వి. ౧. పసులకొట్టము. ౨. పసులు మేయు బీడు.

దొడ్డికట్టు. దే. వి. చుట్టుకొల్లారు.

దొడ్డికాళ్ళవాఁడు. దే. విశే. పంగటి కాళ్ళవాఁడు.

దొడ్డికొను. దే. క్రి. నిండు.

దొడ్డిపట్టు దే. వి. గోష్ఠము.

దొడ్డివేల్పు. దే. వి. ఇలువేల్పు.

దొడ్డు. దే. విశే. ౧. దొడ్డ. ౨. దుష్కరము. 3. అసాధ్యము. ౪. ముటికి.
దొడ్డుకొంచెములు = హెచ్చు లొచ్చులు.

దొత్త. దే. విశే. ౧. వ్రేలాడునది. ౨. బలములేనిది. 3. బలములేనివాఁడు.

దొద్ద. దే. వి. కొల్లగొనుట.

దొద్దగొను. దే. క్రి. కొల్లపోవు.

దొద్దయిచ్చు. దే. క్రి. కొల్లగానిచ్చు.

దొద్దలాడు. దే. క్రి. కొల్లలాడు.

దొన. వై. వి. ౧. కొండమీఁది నీటిగుంట. ౨. అమ్ములపొది. 3. చెఱువు.

దొనదొన. దే. వి. ఈఁగలు ముసురుటయందగు ధ్వనికనుకరణము.

దొన్నియ. } వై. వి. త్రాగుట కుపయోగమైన యాకులతోఁ గుట్టిన పాత్ర.
దొన్నె. }
దొప్ప. }
దొప్పలుగట్టు = మడుఁగులుగట్టు.

దొప్పు దొప్పు. దే. వి. నోరు అడిచికొనుటయందగు ధ్వనికనుకరణము.

దొబ్బ. దే. వి. ౧. మాంసఖండము. ౨. నెత్తురు ముద్ద.

దొబ్బు. దే. క్రి. ౧. అపహరించు. ౨. రమించు.
దొబ్బులువెట్టు = నిందించి బుద్ధి చెప్పు.

దొమ్మ. దే. వి. ౧. పసరముల యొక్క ఱొమ్మడుపు వ్యాధి. ౨. అవయవ విశేషము.

దొమ్మగ. దే. వి. గడకట్టి యాడి జీవనము చేసెడి యొకానొకజాతి.

దొమ్మరి. దే. వి. దొమ్మరవాఁడు.

దొమ్మరీఁడు. దే. విశే. ,,

దొమ్మి. వై. వి. ౧. అందఱు చేరి చేయు యుద్ధము. ౨. గుంపు. 3. సమ్మర్దము.

దొమ్మిగూడు. దే. క్రి. గుంపుగూడు.
దొమ్మిరేఁగు. దే. క్రి. అందఱును నొక్కసారి పైఁబడు.
దొమ్ములాడు. దే. క్రి. ౧. దొమ్మి యుద్ధము చేయు. ౨. పెనఁగు లాడు.
దొయి. దే. వి. ౧. దోయి. ౨. జంట.
దొర. దే. వి. ౧. సేనానాయకుఁడు. ౨. ప్రభువు. ౩. యోధవరుఁడు. ౪. సాదృశ్యము. ౫. విణ. సమానుఁడు. ౬. ఉత్తముఁడు.
దొరవాఁడు = రాజసంబంధి.
(పెండిలి)దొర = పెండ్లిపెద్ద.
దొరఁకొను. దే. క్రి. ౧. యత్నించు. ౨. మొదలుకొను.
దొరకించు. దే. క్రి. లభించునట్లు చేయు.
దొరకు. దే. క్రి. ౧. లభించు. ౨. చిక్కు.
దొరకువడు. దే. క్రి. ౧. చిక్కు. ౨. లభించు.
దొరకుసన్నాసి. దే. విణ. నమ్మించిమోస పుచ్చి దొంగిలించుకొని పోయెడు దొంగ.
దొరకొను. దే. క్రి. ౧. చిక్కు. ౨. లభించు. ౩. కలుగు.
దొరకోలు. దే. వి. ౧. లభించుట. ౨. చిక్కుట.
దొరకోలుసన్నాసి. దే. వి. నమ్మించి మోసపుచ్చు దొంగ.
దొరయించు. దే. క్రి. ౧. కలిగించు. ౨. ఉంచు.
దొరయు. దే. క్రి. ౧. పోలు. ౨. సమీపించు. ౩. తాఁకు, ౪. తగులు. ౫. చిక్కుకొను.
దొరలంగనాడు. } దే. క్రి. తిరస్కరించు.
దొరలనాడు. }
దొరలు. దే. క్రి. ౧. దొర్లు. ౨. పడు. ౩. కలయు. ౪ అతిశయించు.
దొరవి. దొరవు. దే వి. కొలను.
దొరసాని. దే. వి. రాజుభార్య.
దొరువు. దే. వి. ౧. కొలను. ౨. నడబావి.
దొర్లు. దే. క్రి. పొర్లు.
దొఱయు. దే. క్రి. ౧. పొందు. ౨. రమించు.
దొలుక. దే. వి. అంతస్సారము లేని వస్తువు.
దొలుచు. దే. క్రి. ౧. దొరలించు. ౨. రంధ్రము చేయు.
దొల్లుపుచ్చకాయ. దే. వి. ౧. పిల్లల ఆట లలో కొంతసే పాకపక్షమునను మరి కొంతసే పాకపక్షమునను ఉండు వాఁడు. ౨. పుచ్చకాయ డొల్లునట్లు డొల్లువాఁడు.
దొసఁగు. దే. వి. ౧. ఆపద. ౨. కీడు. ౩. విఘ్నము. ౪. పాపము. ౫. సంబంధము.
దొసగులఁబెట్టు. దే. క్రి. పీడించు.

దో

దోఁకిస. దే. వి. దోఁకుట.

దోఁకు. దే. క్రి. ౧. నేలను ఎడురుగ చెక్కు. ౨. ఇంకు. ౩. అడఁగు.

దోఁకుడు. దే. వి. దోఁకుట.

దోఁకుడుపాఱ. దే. వి. దోఁకునట్టిపాఱ.

దోఁగాడు. } దే. క్రి. బిడ్డ నేలఁ జేతుఁ
దోఁగియాడు. } లూఁది మోకాళ్ళతో నడచు.

దోఁగు. దే. క్రి. ౧. చూ. దోఁగాడు. ౨. మేనితోలు ఒలియు.

దోఁచు. దే. క్రి. ౧. దొంగిలించు. ౨. బలాత్కారముగా లాగుకొను.

దోఁటి. దే.వి. అందనిపండ్లను మొదలగువానిని కోయుట కుపయోగించెడు వంకరచిల్ల దోఁపినకోల.

దోఁటు. దే. క్రి. ఇచ్చు.

దోఁపరి. దే. వి. ౧. దొంగ. ౨. కొల్లవాఁడు.

దోఁపిడి. దే. వి. అపహరించుట.

దోఁపిడికాఁడు. దే. విశ. అపహరించువాఁడు.

దోఁపు. దే. క్రి. చొప్పించు. వి ౧. కొల్ల. ౨. అలుకలదోఁపు. (నిలువు) దోఁపు= సంతోషముతో దేవునికిచ్చు దేహమునందలి సర్వాభరణముల మొత్తము.

దోఁపుకాఁడు. దే. వి. ౧. దొంగ ౨. కొల్లకాఁడు.

దోఁపుడు. దే. వి. కొల్ల.

దోగ్ధ. త్స. విశ. పాలుపిదుకువాఁడు.

దోతి. దే. వి. దోవతి.

దోదుముదారి. దే. వి. ఖడ్గము.

దోదూయమానము. త్స. విశ. మిక్కిలి తపింపఁజేయుచున్నది.

దోని. వై. వి. ౧. దొన. ౨. అరిణ. ౩. కాలువతూము.

దోనివిల్లు. దే. వి. అరిణెవలెనుండు విల్లు.

దోనె. వై. వి. ౧. అరిణె. ౨. చిన్నయోడ.

దోనెడొగ్గు. దే. వి. క్రిందికి మోకరించుకొను.

దోమ. దే. వి. మశకము.

దోమతెర. దే. వి. దోమలు ప్రవేశింపకుండఁ జేయు వలవంటిగుడ్డ.

దోయి. వై. వి. ౧. జత. విశ. ౨. తోడు. ౩. సహాయము.

దోయిడి. దే. వి. శూన్యము.

దోయిలి. వై. వి. అంజలి.

దోయిలించు. దే. క్రి. ౧. వంపఁబడిన రెండుచేతులను చేర్చు. ౨. దోసిలితో గ్రహించు.

దోర. దే. వి. రాశి. విశ. ౧. ఎఱ్ఱ పాటినది. ౨. ఒఱఁగినది. (దోరగిల్లు.)

దోరగల్లు. దే. విశ. ఒడ్డగెడవైనది.

దోరగలువడు. దే. క్రి. ఒడ్డగెడవగు.

దోరగిలు. ) దే. క్రి. ౧. ఎట్టిపాఱు.
దోరగిల్లు. } ౨. ప్రాలు.

దోరణము. దే. వి. తోరణము.

దోరము. దే. వి. ద్వారము. త్స. వి. తోరము.(వ్రతాదులలోఁ గట్టుకొను కంకణము.)

దోరవాఱు. దే. క్రి. ఎట్టిపడు.

దోరు. దే. క్రి. చచ్చు.

దోరుచు. దే. క్రి. ౧. తలత్రిప్పు. ౨. పడద్రోయు.

దోల. త్స. వి. ౧. డోల. ౨. ఉయ్యాల.

దోలము. త్స. వి. ౧. ఊఁగుట. ౨. పల్లకి 3. తొట్టి.

దోలి. త్స. వి. ఉయ్యాల.

దోలిక. త్స. వి. ,,

దోవతి. దే. వి. మగవాని కట్టు వస్త్రము.

దోష. త్స. వి. ౧. రాత్రి ౨. భుజము.

దోషజ్ఞుఁడు. త్స. విశ. పండితుఁడు.

దోషము. త్స. వి. ౧ తప్పు. ౨. పాపము.

దోషలుఁడు. త్స. విశ. దోషయుక్తుఁడు.

దోషాకరుఁడు. త్స. వి. ౧. చంద్రుఁడు. ౨. దుష్టుఁడు.

దోషాచరుఁడు. త్స. వి. ౧. చంద్రుఁడు. ౨. రాక్షసుఁడు.

దోషి. త్స. విశ. దోషము కలవాఁడు.

దోషించు. త్స. క్రి. దోషమును పుట్టించు.

దోషైకదృక్కు. ) త్స. విశ. దోషము
దోషైకదృశుఁడు. } లనే వెదకువాఁడు.

దోసకారి. వై. విశ. ౧. కుత్సితుఁడు. ౨. దుష్టుఁడు. 3. దుష్టురాలు.

దోసము. వై. వి. ౧. పాపము. ౨. తప్పు.

దోసి. దే. విశ. దోసకారి.

దోసియ. ) వై. వి. ఒకదిసును పిండి
దోసె. } వంట.

దోసిలి. వై. వి. దోయిలి.

దోసిలించు. వై. క్రి. దోయిలించు.

దోహదము. త్స. వి. ౧. కోరిక. ౨. గర్భిణికిఁగల వేవిళ్లు. 3. ఎరువు. ౪. తరుగుల్మలతాదులకు అకాలమున పూవులు ముస్సగు వానిని పుట్టించు స్త్రీల పాదతాడనాది క్రియ.

దోహనము. త్స. వి. పిదుకుట.

దోహని. త్స. వి. పాలుపితుకుపాత్ర.

దోహరి. దే. వి. చండాలుఁడు.

దోహలము. త్స. వి. ౧. ఇచ్ఛ. ౨. దోహదము. 3. ఉత్సాహము.

## దౌ

దౌడ. దే. వి. దవుడ.

దౌడు. దే. వి. ౧. అశ్వప్లుతి. ౨. పరుగు.

దౌత్యము. త్స. వి. ౧. దూతకర్మము. ౨. దూతస్వభావము.

దౌర్జన్యము. త్స. వి. చెడుతనము.

దౌర్భాగ్యము. త్స. వి. దురదృష్టము.

దౌర్భ్రాత్రము. త్స. వి. సోదరుల అన్యోన్యకలహము. (వ్యతి-సౌభ్రాత్రము.

దౌవారికుఁడు. త్స. వి. ద్వారపాలకుఁడు.

దౌహిత్రుఁడు. త్స. వి. కూఁతురి కొడుకు.

దౌహృదము. త్స. వి. ౧. గర్భిణీలక్షణము. ౨ వేవిళ్లు.

దౌహృదిని. త్స. వి. నిండుచూలాలు.

## ద్యు

ద్యుతి. త్స. వి. ౧. కాంతి. ౨. వెలుఁగు.

ద్యుమణి. త్స. వి. సూర్యుఁడు.

ద్యుమ్నము. త్స. వి. ధనము.

## ద్యూ

ద్యూతము. త్స. వి. జూదము.

## ద్యో

ద్యోతకము. త్స. విణ. ప్రకాశించునది.

ద్యోతనము. త్స. విణ. ప్రకాశించునది. వి. ప్రకాశించుట.

ద్యోతమానము.త్స.విణ. ప్రకాశించునది.

ద్యోతము. త్స. వి. ౧. ప్రకాశము. ౨. ఎండ.

ద్యోతించు. త్స. క్రి. ప్రకాశించు.

ద్యోతిరింగణము. త్స. వి. మిడుఁగురు.

## ద్ర

ద్రవము. త్స. వి. ౧. పరిహాసము. ౨ తడి.

ద్రవించు. త్స. క్రి. కారు.

ద్రవిడము. త్స. వి. ఒకానొక దేశము.

ద్రవిణము. త్స. వి. ధనము.

ద్రవ్యము. త్స. వి. ౧. ధనము. ౨. మందు. 3. వస్తువు.

ద్రష్ట. త్స. విణ. చూచువాఁడు.

## ద్రా

ద్రాక్ష. త్స. వి. ఒకానొకతీఁగ.

ద్రాఘిమము. త్స. వి. దైర్ఘ్యము.

ద్రాఘిష్ఠము. త్స. విణ. మిక్కిలి దీర్ఘము.

ద్రాణము. త్స. విణ. పాఱిపోయినది.

ద్రాబ. దే. విణ. ౧. అధమము. ౨. అధముఁడు. 3. అసారుఁడు. ౪. అసారము. ౫. అసారోక్తి.

ద్రామిళుఁడు. త్స. విణ. ద్రమిళదేశపువాఁడు.

ద్రావకము. త్స. వి. ౧. సూదంటిరాయి. ౨. రస గంధక పాషాణాదులనుండి తీసెడు రసవిశేషము.

ద్రావిడము. త్స. వి. ద్రవిడభాష.
ద్రావిడుఁడు. త్స. విశే. ద్రవిడదేశ స్థుఁడు.

## ద్రి

ద్రిమ్మరించు. దే. క్రి. కడవలతోఁ గ్రుమ్మరించు. రూ. డిమ్మరించు.

## ద్రు

ద్రుఘణము. త్స. వి. ౧. ఇనుపగుదియ. ౨. గండ్రగొడ్డలి.
ద్రుతము. త్స. విశే. ౧. త్వరితము. ౨. కరఁగినది. వి. నకారము. (ఆంధ్రము.)
ద్రుపదుఁడు. త్స. వి. ఒకరాజు.
ద్రుమము. త్స. వి. చెట్టు.
ద్రుహిణుఁడు. త్స. వి. బ్రహ్మ.

## ద్రొ

ద్రొబ్బించు. దే. క్రి. పడఁద్రోయించు.
ద్రొబ్బిలు. దే. క్రి. పగులఁగొట్టు.
ద్రొబ్బు. దే. క్రి. పడఁద్రోయు. రూ. దొబ్బు.
(పో) ద్రొబ్బు = పోఁగొట్టు.
ద్రొబ్బులాడు. దే. క్రి. ద్రోపులాడు.

## ద్రో

ద్రోణకాకము. త్స. వి. మాలకాకి.
ద్రోణము. } దే. వి. భుజబలమునకై
ద్రోణాము. } త్రిప్పు జెట్లసాధనము.
ద్రోణము. త్స. ౧. తూము. ౨. కలశము. ౩. బొక్కెన. ౪. కత్తి తొట్టి.
ద్రోణి. త్స. వి. దోనె.
ద్రోణుఁడు. త్స. వి. ద్రోణాచార్యుఁడు.
ద్రోవది. దే. వి. ద్రౌపది.
ద్రోహము. త్స. వి. ౧. కీడుతలఁపు. ౨. చంపనిచ్ఛ.
ద్రోహి. త్స. విశే. ద్రోహము కలవాఁడు.

## ద్రౌ

ద్రౌణి. త్స. వి. అశ్వత్థామ.
ద్రౌపది. త్స. వి. ద్రుపదుని కూఁతురు.

## ద్వ

ద్వంద్వము. త్స. వి. ౧. ఇద్దఱొకరితోనొకరు చేయుయుద్ధము. ౨. స్త్రీ పురుషులజత. ౩. రెండు.
ద్వయము. త్స. వి. జత.
ద్వయవాది. త్స. విశే. రెండు మాటలాడువాఁడు.
ద్వయి. త్స. వి. జత.

## ద్వా

ద్వాదశము. త్స. విశే. పండ్రెండవది.
ద్వాదశి. త్స. వి. పక్షమున వచ్చెడి పండ్రెండవ దినము.

ద్వాపరము. త్స. వి. నాలుగు యుగములలో మూఁడవది. (వేదపాత్రమాణ్యాదులందు సంశయముగలిగించునది.)
ద్వారక. త్స. వి. శ్రీకృష్ణుని నగరము.
ద్వారపాలకుఁడు. త్స. వి. వాకిటి కావలివాఁడు.
ద్వారబంధము. త్స. వి. వాకిటి నిరువైపుల (క్రిందను మీఁదను, అమర్చిన మ్రాను.
ద్వారము. త్స. వి. ౧. వాకిలి. ౨. ఉపాయము.
ద్వారావతి. త్స. వి. శ్రీకృష్ణునినగరము.

## ద్వి

ద్వికము. త్స. వి. రెంటియొక్క సమూహము.
ద్విజన్మము. త్స. వి. ౧.పక్షి. ౨. పల్లు.
ద్విజన్ముఁడు. త్స. వి. ౧. బ్రాహ్మణుఁడు. ౨. క్షత్త్రియుఁడు. 3. వైశ్యుఁడు.
ద్విజము. త్స. విణ. ౧. పక్షి. ౨.పాము. 3. చేప.
ద్విజరాజు. త్స. వి. చంద్రుఁడు.
ద్విజాతి. త్స. వి. ౧. బ్రాహ్మణుఁడు. ౨. పక్షి, పాము లోనగునది.
ద్విజాతీయము. త్స. విణ. రెండుజాతులకు సంబంధించినది.
ద్విజిహ్వము.త్స. విణ.౧. రెండునాలుకలుగలది. ౨. పాము.
ద్విజుఁడు. త్స. వి. చూ. ద్విజన్ముఁడు.
ద్వితయి.త్స.వి ౧. జోడు. ౨.ద్వయము.
ద్వితీయ. త్స. విణ. రెండవది. వి. ౧. భార్య. ౨. విదియ.
ద్వితీయము.త్స.వి.౧జోడు. ౨ద్వయము.
ద్వితీయుఁడు. త్స. విణ. సహాయుఁడు. (కృష్ణ) ద్వితీయుఁడు = కృష్ణుఁడు సహాయముగాఁ గలుగువాఁడు)
ద్విపటి. త్స. వి. దుప్పటి.
ద్విపద. త్స. వి. పద్యభేదము.
ద్విపము. త్స. వి. ఏనుఁగు. (వ్యు. తొండము, నోరు, అను నీ రెంటిచే పానము చేయునది.
ద్విరదము. త్స.వి. ఏనుఁగు. (వ్యు. రెండు కొమ్ములు కలది.)

## ద్వీ

ద్వీపము. త్స. వి. లంక.
ద్వీపవతి. త్స. వి. నది.
ద్వీపి. త్స. వి. పులి.

## ద్వే

ద్వేషము. త్స. వి. పగ. క్రి. ద్వేషించు.
ద్వేషి. త్స. విణ. ద్వేషము కలవాఁడు.

## ద్వై

ద్వైతము. త్స. వి. జీవాత్మ వేఱనియును, పరమాత్మ వేఱనియును, చెప్పెడి యొకానొక మతము.
ద్వైధము. త్స. వి. రెండుప్రకారములు గలది.

ద్వైపాయనుఁడు. త్స. వి. వ్యాసుఁడు. (కృష్ణ)ద్వైపాయనుఁడు=వ్యాసుఁడు.

## ద్వ్య

ద్వ్యర్థము. } త్స. విణ. రెండర్థములు
ద్వ్యర్థి. } కలది.

ద్వ్యహము. త్స. వి. రెండు దినములు.

## ద్వ్యా

ద్వ్యాముష్యాయణుఁడు. త్స. విణ. కన్నతండ్రికిని బెంచుకొన్న తండ్రికిని ఇద్దఱకును బుత్త్రుఁడై యున్న వాఁడు.

# ధ

ధగధగ. త్స. వి. మండునపుడు కలిగెడి ధ్వన్యను కరణము.

ధగధగాయమానము. త్స. విణ. మిక్కిలి ప్రకాశించునది.

ధగిడి. } దే. విణ. ౧. నీచపురుషుఁడు.
ధగిడీ. } ౨.నీచస్త్రీ.

ధటము. త్స. వి. తాను. రూ. ధట.

ధటి. త్స. వి. ౧. దట్టి. ౨. గోఁచి.

ధట్టము. త్స. వి. సమూహము.

ధనంజయుఁడు. త్స. వి. అర్జునుఁడు.

ధనదుఁడు. త్స. వి. కుబేరుఁడు. (వ్యు. ధనము నిచ్చువాఁడు.) విణ. దాత.

ధనపిశాచి. త్స. వి. పిశాచివలె విడువ కుండు ధనాశ.

ధనము. త్స. వి. విత్తము.

ధనవంతుఁడు. } త్స. విణ. ధనము కల
ధని. } వాఁడు.
ధనికుఁడు. }

ధనిష్ఠ. త్స. వి. ఒకానొక నక్షత్రము.

ధనుర్వేదము. త్స. వి. విలువిద్యను బోధించు నొకానొక యుపదేశము.

ధనువు. } త్స. వి. ౧. విల్లు. ౨. ఒక
ధనుస్సు. } రాశి.

ధన్య. త్స. విణ. ధన్యురాలు.

ధన్యవాదము. త్స. వి.౧. ఉపకారము చేసినవారితో "ధన్యోస్మి" అని పలుకుట. ౨ కృతజ్ఞతను సూచించుట.

ధన్యుఁడు. త్స. వి. పుణ్యవంతుఁడు.

ధన్వంతరి. త్స. వి. దేవవైద్యుఁడు.

ధన్వము. త్స. వి. ౧. నిర్మలభూమి. ౨. విల్లు.

ధన్వి. త్స. విణ. ధనుర్ధరుఁడు.

ధమని. త్స. వి. ౧.నాడి. ౨. అగసాలె వానిగొట్టము.

ధమ్మిల్లము. త్స. వి. కీలుగంటు. వ్యు. కట్టఁబడిన వెండ్రుకలుకలది.

ధర. త్స. వి. ౧. భూమి.

ధరణి. త్స. వి. నేల. వ్యు. విశ్వమును ధరించునది.

ధరము. త్స. వి. కొండ.

ధరించు. త్స. క్రి. తాల్చు. (రూ) ధరియించు.

ధరిత్రి. త్స. వి. భూమి. వ్యు. విశ్వమును ధరించునది.

ధర్మకవిలె. త్స. వి. ధర్మముల పుస్తకములలోని దానముల ననుభవించువాఁడు.

ధర్మజుఁడు. త్స. వి. యమధర్మరాజు కొడుకు.

ధర్మజ్ఞుఁడు. త్స విణ. ధర్మముఁ దెలిసినవాఁడు.

ధర్మదార. మి. వి. యుద్ధముపూర్తియైనదని సూచించుటకు ఊఁదు బాకా.

ధర్మధ్వజుఁడు. త్స. వి. కపటధార్మికుఁడు.

ధర్మము. త్స. వి. ౧. న్యాయము. ౨. పుణ్యము. ౩. సామ్యము. ౪. స్వభావము. ౫. ఆచారము.

ధర్మరాజు. త్స. వి. ౧. యముఁడు ౨. యుధిష్ఠిరుఁడు.

ధర్మశాల. త్స. వి. ధర్మసత్రము.

ధర్మశాస్త్రము. త్స. వి. న్యాయశాస్త్రము.

ధర్మాత్ముఁడు. త్స. విణ. పుణ్యాత్ముఁడు.

ధర్మాసనము. త్స. వి. ధర్మాధికారి కూర్చుండు స్థలము.

ధర్మిష్ఠుఁడు. త్స. విణ. మిక్కిలిధర్మాత్ముఁడు

ధర్ముఁడు. త్స. వి. యముఁడు.

ధర్మువు. త్స. వి. ధర్మము.

ధర్మ్యము. త్స. విణ. ధర్మమునుండి తొలఁగనిది.

ధర్షణము. త్స. వి. ౧. ప్రాగల్భ్యము. ౨. తిరస్కారము. ౩. చెఱచుట. (నాసీ) ధర్షణము.

ధవళ. త్స. వి. ౧. తెల్లనిఆవు.

ధవళము. విణ. తెల్లనిది. ౨. చక్కనిది. ౩. శ్రేష్ఠమైన వృషభము.

ధవళిమ. త్స. వి. తెలుపు.

ధవిత్రము. త్స. వి. ఇఱ్ఱి తోలుతోఁ జేసిన వీవన.

ధవుఁడు. త్స. వి. ౧. రాజు. ౨. పెనిమిటి.

## ధా

ధాటి. త్స. వి. దండయాత్ర.

ధాణకము. త్స. వి. ౧. ఒకానొక నాణెము. ౨. దీనారములోని నొకభాగము.

ధాత. త్స. వి. ౧. ఒక సంవత్సరము. ౨. బ్రహ్మ.

ధాతువాది. త్స. విణ. రసవాది. (రసాయనాదులచేత బంగారము, వెండి లోఁగునవి చేయువాఁడు.)

ధాతువు. త్స. వి. ౧. గైరికాది ధాతువు. ౨. క్రియావాచకము. ౩. పృథివి లోనగునది. ౪. బంగారు, వెండి మొదలగు టంకము. ౫. రేతస్సు.

ధాత్రి. త్స. వి. ౧. భూమి. ౨. తల్లి. 3. దాది.

ధాత్రేయి. త్స. వి. ౧. దాదికూఁతురు. ౨. భూమి.

ధాన్యము. త్స. వి. వడ్లు మొదలగు నవధాన్యములు.

ధామము. త్స. వి. ౧. ఇల్లు. ౨. చోటు. 3. కాంతి.

ధార. త్స. వి. ౧. వానచాలు. ౨. వానకాలు. 3. కత్తివాదర.

ధారణ. త్స. వి. ౧. మర్యాద. ౨. అప్పుపడుట.

ధారణి. త్స. వి. ౧. భూమి. ౨. వరుస.

ధారపోయు. త్స. వి. చేత నీళ్లు పోసి కొని ఇచ్చు.

ధారాదత్తము. త్స. విణ. ధారాపూర్వకముగా నీయఁబడినది.

ధారాధరము. త్స. వి. మేఘము.

ధారాయంత్రము. త్స. వి. నీళ్లధారలు పడు గొట్టముల యంత్రము.

ధారాళము. త్స. విణ. అడ్డుపాటు లేనిది.

ధారావాహికము. త్స. విణ. ఎడతెగక ప్రవహించునది.

ధారిణి. త్స. వి. భూమి.

ధారుణి. త్స. వి. భూమి.

ధారోష్ణము. త్స. వి. గుమ్మపాలు.

ధార్తరాష్ట్రము. త్స. వి. నల్లనిముక్కుకాళ్ళు గలహంస.

ధార్తరాష్ట్రుఁడు. త్స. వి. ధృతరాష్ట్రుని కొడుకు.

ధార్మికుఁడు. త్స. వి. పుణ్యాత్ముఁడు.

ధాళధళ్యము. త్స. వి. ధళధళమను కాంతి.

ధావళ్యము. త్స. వి. తెలుపు.

ధి

ధిక్కరించు. త్స. వి. తిరస్కరించు.

ధిక్కారము. త్స. వి. తిరస్కారము.

ధిక్కారించు. త్స. క్రి. తిరస్కరించు.

ధీ

ధీ. త్స. వి. బుద్ధి.

ధీమంతుఁడు. త్స. విణ. బుద్ధిగల వాఁడు.

ధీరత్వము. త్స. వి. ధైర్యము.

ధీరము. త్స. విణ. ౧. గంభీరము. ౨. మందము. (ధీరసమీరే.)

ధీరుఁడు. త్స. విణ. ౧. ధైర్యము కల వాఁడు. ౨. స్వాతంత్ర్యము కల వాఁడు.

ధీవరుఁడు త్స. వి బెస్తవాఁడు.

ధీసచివుఁడు. త్స. వి. మంచి ఆలోచన చెప్పు మంత్రి.

కర్మసచివుఁడు = కార్యము చేయు మంత్రి.

ధు

ధురంధరము. త్స. విణ. బరువు మోయునది.

ధురంధరుఁడు. త్స. విణ. భారము వహించువాఁడు.
ధురీణము. త్స. వి. బరువుమోయునది.
ధురీణుఁడు. త్స. విణ. బరువుమోయువాఁడు.
ధుర్యుఁడు. ,,

ధూ

ధూతము. త్స. విణ. కంపితము.
ధూపము. త్స. వి. దూపము.
ధూమకేతువు. త్స. వి. ౧. అగ్ని. ౨. ఉత్పాతము. (తోఁకచుక్క.)
ధూమము. త్స. వి. పొగ.
ధూమ్రిము. త్స. వి. పొగవన్నెగలది.
ధూర్జటి. త్స. వి. శివుఁడు.
ధూర్తుఁడు. త్స. వి. జూదరి. విణ. మోసకాఁడు. (ధూ. ధూర్తు.)
ధూర్వహము. త్స. విణ. ధురంధరము.
ధూర్వహుఁడు. త్స. విణ. ధురంధరుఁడు.
ధూళి. త్స. వి. దుమ్ము.
ధూసరము. త్స. వి. బూడిదవర్ణము. విణ. బూడిదవర్ణము గలది.

ధృ

ధృతము. త్స. విణ. ధరింపఁబడినది.
ధృతరాష్ట్రుఁడు. త్స. వి. పాండురాజు అన్న.
ధృతి. త్స. వి. ౧. ధైర్యము. ౨. సౌఖ్యము. ౩. ధరించుట.
ధృష్టుఁడు. త్స. విణ. దిట్టుఁడు.

ధే

ధేనువు. త్స. వి. ఆవు. (వ్యు. దూడచేని చేన్ను గుడుచును.)

ధై

ధైర్యము. త్స. వి. దిమసము.

ధో

ధోరణి. త్స. వి. ౧. పద్ధతి. ౨. పఙ్క్తి.

ధౌ

ధౌతము. త్స. విణ. ప్రక్షాళితము.
ధౌరంధర్యము. త్స. వి. ధురంధరత్వము.
ధౌరేయము. త్స. విణ. బరువుమోయునది.
ధౌరేయుఁడు. త్స. విణ. భారము వహించువాఁడు.
ధౌర్తికము. త్స. వి. ధూర్తత్వము.
ధౌర్త్యము. త్స. వి. ధూర్తత్వము.

ధ్మా

ధ్మాత. త్స. విణ. ఊదువాఁడు.
ధ్మాతము. త్స. విణ. ఊదఁబడినది.
ధ్మానము. త్స. వి. ఊదుట.

ధ్యా

ధ్యాత. త్స. విణ. ధ్యానముచేయువాఁడు.
ధ్యాతము. త్స. విణ. ధ్యానముచేయఁబడినది.
ధ్యానము. త్స. వి. చాంచల్యము లేక భగవంతుని తలఁచుట.
ధ్యానించు. త్స. క్రి. ధ్యానముచేయు.

## ధ్రు

ధ్రువము. త్స. విశ. ౧. కదలనిది. ౨. ఎడతెగనిది. వి. ౧. నిశ్చయము. ౨. ఊహ.

ధ్రువుఁడు. త్స. వి. ఉత్తానపాదుని కొడుకు.

## ధ్వం

ధ్వంసకుఁడు. త్స. విశ. ౧. ధ్వంసమగువాఁడు. ౨. ధ్వంసముచేయువాఁడు.

ధ్వంసనము. త్స. వి. నాశము.

ధ్వంసము. త్స. వి. ,,

ధ్వజము. త్స. వి. ౧. పతాక. ౨. శిశ్నము.

ధ్వజిని. త్స. వి. సేన.

ధ్వనము. త్స. వి. శబ్దము.

ధ్వనితము. త్స. వి. ౧. శబ్దము. ౨. ఊటము.

ధ్వస్తము. త్స. వి. ధ్వంసము చేయఁబడినది.

## ధ్వా

ధ్వాంక్షము. త్స. వి. కాకి.

ధ్వాంతము. త్స. వి. చీకటి.

ధ్వానము. త్స. వి. ధ్వని.

# న

నంగ. నంగనాచి. } దే. విశ. ౧. దిట్టతనము కలిగియు నేమియు నెఱుఁగనివాని పగిదిఁ గన్పడువాఁడుది. ౨. చతురురాలు.

నంగి. దే. విశ. ముక్కుతో మాటలాడునది. (నంగి నంగి మాటలు.)

నంజె. దే. వి. ౧. ఉపదంశము. ౨. మాగాణిభూమి.

నంజెలిపడు. దే. క్రి. సంకోచపడు.

నంజు. దే. క్రి. తిను. వి. ౧. విషము. ౨. నెత్తురుచచ్చి తెల్లపాఱుట.

నంజేడు. దే. వి. మాంసము.

నంటు. దే. వి. ౧. స్నేహము. ౨. సంపర్కము.

నంటుకత్తె. దే. వి. వలపుకత్తె.

నంటుకాఁడు. దే. వి. వలపుకాఁడు.

నందన. త్స. వి. ౧. కూఁతురు. ౨. ఒక సంవత్సరము.

నందనము. త్స. వి. ౧. ఇంద్రుని ఉద్యానవనము. ౨. ఆనందము.

నందనుఁడు. త్స. వి. కొడుకు.

నందము. త్స. వి. ఆనందము.

నంది. త్స. వి. ౧. శివుని వాహనము. ౨. ఎద్దు.

నందించు. త్స. క్రి. ఆనందించు.

నందిని. త్స. వి. ౧. కూఁతురు. ౨. కామధేనువుబిడ్డ.

నందివర్ధనము. త్స. వి. ఒకానొక పూఁజెట్టు.

నంబి. దే. వి. ౧. విష్ణుపూజకుఁడు. ౨. శివార్చకుఁడు. 3. దాసుఁడు.

నంబెరుమాళ్లు. దే. వి. శ్రీరంగనాయకులు.

నకనకఁబడు. }
నకనకలాడు. } దే. క్రి. కృశించు.

నకనకలు. దే. వి. కార్శ్యము.

నకనకలుగుడుచు. దే. వి. ౧. నలుగు. ౨. అలయు.

నకాసి. }
నకాసీ. } దే. విశే. నకిషీపనిచేసినది.

నకులము. త్స. వి. ముంగి.

నకులుఁడు. త్స. వి. పాండవులలో నాలగవవాఁడు.

నక్క. వై. వి. జంబుకము.

(కొంక)నక్క = క్షుద్రజంబుకము.

(కలని)నక్క = యుద్ధరంగమున నున్న నక్క (అది యెల్లప్పుడును మనుష్యులచావే కోరును. (అట్లే) యెల్లప్పుడును; అశుభమునే కోరువాఁడు.)

(ముడిదిన్న)నక్క = తుదివఱకు విడువక బాధించువాఁడు.

నక్కను దొ్రక్కివచ్చినవాఁడు = అప్రయత్నముగ నెక్కువ లాభమును బొందినవాఁడు.

నక్కజిత్తులు = మోసములు.

నక్కిళ్ళు. దే. వి. బ. ప్రక్కపండ్లకీళ్లు.

నక్కిళ్లువడు. దే. క్రి. నిరుత్తరుఁడగు.

నక్కు. దే. క్రి. ౧. ఒదుఁగు. వి. ౨. చిన్న.

నక్తంచరుఁడు. త్స. విశే. రాక్షసుఁడు.

నక్తందివము. త్స. అవ్య. రేయుంబవలు.

నక్తము. త్స. వి. రాత్రి.

నక్రము. త్స. వి. మొసలి.

నక్షత్రము. త్స. వి. అశ్విని మొదలగు.

నఖంపచము. త్స. విశే. గోరువెచ్చని.

నఖక్షతము. త్స. వి. గోగాత్తు.

నఖన్యాసము. త్స. వి. ,,

నఖపదము. త్స. వి. ,,

నఖము. నఖరము. త్స. వి. గోరు.

నఖానఖి. త్స. వి. పరస్పరము గోళ్ళతో గిల్లికొనుచుఁ బోరాడుట.

నగ. దే. వి. ౧. సొమ్ము ౨. గిల్లికొనుచుఁ బోరాడుట.

నగము. త్స. వి. కొండ.

నగరము. }
నగరి. } త్స. వి. పట్టణము. వ్యు. ౧. విహారార్థమై చెట్లుగాని పర్వతములుగాని యిందుఁగలవు. ౨. పర్వతసమానములైన గృహములు మున్నగునవి ఇందుండును.

నగరు. దే. వి. ౧. రాజగృహము ౨. దేవగృహము.

నగరివారు = ప్రభువారు.

నగవు. దే. వి. నవ్వు.

నగు. దే. క్రి. ౧. హసించు. ౨. అపహసించు. వి. నవ్వు.

నగుఁబాటు. దే. వి. పరిహాసము.
నగ్న. త్స. వి. దిసమొల ఆఁడుది.
నగ్నిక. } త్స. విణ. దిసమొల
నగ్నుఁడు. } వాఁడు.
నచ్చిక. దే. వి. నమ్మిక. రూ. నచ్చిగ.
నచ్చికము. దే. వి. ౧. కోఁత ౨. లోపము.
నచ్చు. దే. క్రి. ౧. నమ్ము. ౨. రుచించు. 3. వాదించు.
నచ్చుకాఁడు. దే. విణ. అలసుఁడు.
నచ్చుగొట్టు. దే. విణ. బాధపెట్టువాఁడు.
నజ్జు. దే. వి. ౧. నలి ౨. చిన్నముక్క. (ఆ(మేడితమునజ్జునజ్జు.)
నటనము. త్స. వి. ౧. కపట ప్రవర్తనము. ౨. నాట్యము. రూ. నటన.
నటి. త్స. వి. ౧. వేశ్య. ౨. నట్టువుని పెండ్లాము.
నటించు. త్స. వి. ౧. నర్తించు. ౨. వర్తించు.
నటుఁడు. త్స. వి. నట్టువుఁడు.
నట్టకనడుము. దే. వి. నట్టనడుము.
నట్టడవి. దే. వి. అరణ్యమధ్యము.
నట్టనడుము. దే. వి. సరియైనమధ్యము.
నట్టాడు. దే. క్రి. ౧. చలించు. ౨. నర్తించు.
నట్టించు. దే. క్రి. ౧. నటించు. ౨. క్రీడించు.
నట్టింటిశత్రువు = సమీపశత్రువు. (గృహమధ్యమందలి శత్రువు.)
నట్టిల్లు. దే. వి. ౧. ఇంటినడుము. ౨. గర్భగృహము.
నట్టు. దే. వి. ౧. స్థానము. ౨. ఆటంకము. 3. విదేశము. ౪. నటుఁడు. ౫. నాట్యము.
నట్టుకొను. దే. క్రి. కుదురుకొను.
నట్టుగుఁడు. దే. వి. నటకుఁడు.
నట్టువ. దే. వి. ౧. నటుఁడు. ౨. నాట్యోపాధ్యాయుఁడు. 3. నాట్యము.
నట్టువకాఁడు. } దే. వి. నట్టువుఁడు.
నట్టువాఁడు. }
నట్టువము. దే. వి. నాట్యము.
నట్టువలుద్రొక్కు = నాట్యము చేయు.
నట్టువుఁడు. దే. వి. నటుఁడు.
నడ. } దే. వి. ౧. ప్రవర్తనము. ౨.
నడక. } గమనము.
నడకోలఁకు. దే. వి. దిగుడుబావి.
నడకొండ. దే. వి. నడవగలకొండ.
నడగోలు. దే. వి. నడకగలకోట.
నడచు. దే. క్రి. ౧. గమనించు. ౨. ప్రవర్తించు.
నడజోడు. దే. వి. కాలిబంటు.
నడత. దే. వి. నడవడి.
నడతెంచు. దే. క్రి. వచ్చు.
నడతెగు. దే. క్రి. దయ్యు.
నడత్రోవ. దే. వి. నడచుట కనుకూలమగుత్రోవ.
నడదీఁగె. దే. వి. నడకగలదీఁగె.
నడదీవియ. దే. వి. కాగడా.

నడపాడు. దే. క్రి. సంచరించు.
నడపు. దే. ప్రే. నడఁజేయు. వి. ౧. గమనము. ౨. ప్రివర్తనము.
నడబావి. దే. వి. నడచిపోవుటకు మెట్లు ఏర్పఱచిన దిగుడుబావి.
నడమామిడి. దే. వి. నడకగలమామిడిచెట్టు.
నడయాడు. దే. క్రి. ౧. సంచరించు. ౨. చలించు.
నడవ. దే. వి. ౧. తలవాకిటికిని నడిమి వాకిటికిని నడుమ నున్నచోటు. ౨. మార్గము. 3. సేతువు.
నడవడి. } దే. వి. నడత.
నడవడిక. }
నడికట్టు. దే. వి. ౧ కాసె. ౨. దట్టీ.
నడికిరేయి. దే. వి. అర్ధరాత్రము.
నడిగండి. దే. వి. భగము.
నడితల. దే. వి. శిరోమధ్యము.
నడిరాతిరి. దే. వి. అర్ధరాత్రిము.
నడిరేయి. దే. వి. ,,
నడివీథి. త్స. వి. వీథిమధ్యము.
నడిప్రేలు. దే. వి. మధ్యమవేలు.
నడుఁకు. దే. క్రి. వడఁకు. వి. కంపము.
నడుగడ్డ. దే. వి. ద్వీపము.
నడుగుంట. దే. వి. తలనడిమిపల్లము.
నడుచు. దే. క్రి. నడచు.
నడుజాము. దే. వి. అర్ధరాత్రిము.
నడుతల. దే. వి. నడునెత్తి.
నడునడునడంకు. దే. క్రి. 'గడుగడు' మని వణఁకు.
నడునెత్తి. దే. వి. శిరోమధ్యము.
నడుమంతరము. దే. విణ. ౧. మధ్యకాలమునఁ గలిగినది. వి. ౧. నడుము ౨. మధ్యకాలము. రూ. నడుమంత్రము.
నడుము. దే. వి. ౧. కౌను. ౨. మధ్యభాగము.
నడుముకట్టుకొను. దే. క్రి. సిద్ధపడు.
నడుముగాఁచు. దే. క్రి. ఎదిరించు.
నడురాతిరి. దే. వి. నడిరేయి.
నడురేయి. దే. వి. అర్ధరాత్రము.
నడులేఁత. దే. విణ. మిక్కిలి లేత మిక్కిలి ముదురుకానిది.
నడువడి. దే. వి. చూ. నడవడి.
నడుసొచ్చు. దే. క్రి. నడుమఁబ్రవేశించు.
నడ్డి. దే. వి. ౧. గూను. ౨. నడుము. విణ. 3. చప్పట. (నడ్డిముక్కు.)
నతము. త్స. విణ. వంగినది.
నతి. దే. వి. నమస్కారము.
నతోన్నతము. త్స. విణ. నిమ్నోన్నతము.
నత్త. దే. వి. గుల్లయందుండు పురుగు.
నత్తగుల్ల. దే. వి. క్షుద్రశంఖము.
నత్తి. దే. వి. తడఁబడుచు మాటలాడుట.
నత్తివాఁడు. దే. విణ. ౧. నత్తికలవాఁడు. ౨. లోహాలుఁడు.
నత్తు. దే. వి. ముక్కుపోఁగు.
నదము. త్స. వి. ౧. మ్రోఁత. ౨. పడమరగాఁ బాఱెడినది.
నదరు. దే. వి. కానుక.

నది. త్స. వి. ౧. ఏఱు. ౨. ఆమడకు మీఁటి పాఱెడి యేఱు.

నదీమాతృకము. త్స. విశ. నదీజలము లచేఁ బండు నేలగల దేశము.

నదీష్ణుఁడు. త్స. విశ. నదీస్నానమునఁ గుశలుఁడు.

నద్ధము. త్స. విశ. కట్టఁబడినది.

నన. దే. వి. ౧. మొగ్గ. ౨. చిగురు. ౩. పువ్వు.

ననంద. } త్స. వి. మగని తోఁబుట్టువు.
ననాంద. }

ననయు. దే. క్రి. ౧. పూచు. ౨. చిగిరించు.

ననుచు. దే. క్రి. ౧. పూచు. ౨. అనురాగమొందు.

ననుపు. దే. వి. ౧. అనురాగము. ౨. అతిశయము.

ననుపుకత్తె. దే. వి. విటురాలు.

ననుపుకాఁడు. దే. వి. విటుఁడు.

నన్నడుము. దే. వి. మిక్కిలి మధ్యభాగము.

నన్నూఱు. దే. స. నాలుగునూర్లు.

నపుంసకుఁడు. త్స. వి. పేడి.

నప్త. త్స. వి. ౧. మనుమఁడు. ౨. మునిమనుమఁడు.

నభము. త్స. వి. ౧. ఆకాశము. ౨. మేఘము.

నభస్యము. త్స. వి. భాద్రపదమాసము.

నభస్వంతుఁడు. త్స. వి. గాలి.

నభోమణి. త్స. వి. సూర్యుఁడు.

నమలి. దే. వి. నెమిలి.

నములు. దే. క్రి. తిను.

నమస్కరించు. త్స. క్రి. చేమోడ్చు.

నమస్కారము. } త్స. వి. చేమోడ్పు.
నమస్కృతి. }

నమస్సు. త్స. వి. నమస్కారము.

నమించు. త్స. క్రి. నమస్కరించు.

నమితము. త్స. విశ. నమ్రమైనది.

నమోవాకము. త్స. వి. నమస్కారము.

నమ్మకము. దే. వి. విశ్వాసము. రూ. నమ్మిక.

నమ్మి. దే. వి. నెమిలి.

నమ్ము. దే. క్రి. విశ్వసించు.

నమ్రము. త్స. విశ. వంగినది.

నయ. దే. వి. అందము.

నయగారము. దే. వి. ౧. మెత్తని పలుకు. ౨. మెత్తఁదనము ౩. విలాసము. ౪. అలంకారము. విశ. కపటమైనది.

నయగారి. దే. విశ. మృదుత్వముకలవాఁడు

నయనము. త్స. వి. ౧. కన్ను. ౨. పొందించుట.

నయము. దే. వి. ౧. నునుపు. ౨. మృదుత్వము. ౩. అందము. విశ. ౧. నునుపైనది. ౨. చౌక. ౩. మృదువైనది. ౪. మేలైనది. త్స. వి. ౧. నీతి. ౨. అనునయము.
నయముచూపు=వృద్ధిపొందు.
నయమెక్కు=వృద్ధిపొందు.

నర. దే. వి. ౧. ముసలితనముచే వెండ్రుకలయందుఁ గలుగు తెలుపు. ౨. తెల్లఁబాఱిన వెండ్రుక.

నరవెండ్రుక=నరసిన వెండ్రుక.

నరకఁడు. దే. విణ. ౧. మోటువాఁడు. ౨. క్రూరుఁడు. 3. దుష్టుఁడు.

నరకము. త్స. వి. ౧. దుర్గతి. ౨. నిరయము.

నరపాలుఁడు. త్స. వి. రాజు.

నరపు. దే. వి. ౧ నర. ౨. పలితము.

నరపమీసము=నరపుగల లేక నరసిన మీసము.

నరపవెండ్రుక=నరసిన వెండ్రుక.

నరము. దే. వి. నాడి.

నరయు. } దే. క్రి. వెండ్రుకలు తెల్లనగు.
నరియు. }

నరవ. దే. వి. కొండత్రోవ.

నరాజీ. } దే. వి. కత్తి.
నరాజు. }

నరి. దే. వి. మర్యాద.

నరుఁడు. త్స. వి. మనుష్యుఁడు.

నరుపు. దే. వి. ౧. నరపు. ౨. పలితము.

నరేంద్రుఁడు. త్స. వి. రాజు.

నర్కు. దే. క్రి. ౧. చంపు. ౨. ఖండించు.

నర్తకి. త్స. వి. ఆటకత్తె.

నర్తకుఁడు. త్స. విణ. ఆటకాఁడు.

నర్తనము. త్స. వి. ఆట.

నర్తనుఁడు. త్స. విణ. ఆటకాఁడు.

నర్తించు. }
నర్తిలు. } త్స. వి. ఆడు.
నర్తిల్లు. }

నర్దనము. త్స. వి. ౧. రంకె. ౨. ధ్వని.

నర్దితము. త్స. వి. ౧. రంకె. ౨. ధ్వని.

నర్మద. త్స. వి. ఒకయేఱు.

నర్మము. త్స. వి. ౧. స్త్రీపురుషుల పరిహాసము. ౨. విలాసము. 3. క్రీడ.

నర్మసచివుఁడు. త్స. విణ. కేళీసఖుఁడు.

నర్మిలి. దే. వి. అర్మిలి.

నఱకు. దే. క్రి. ౧. ఖండించు. వి. ౨. నఱుకుడు.

నఱకాడు. దే. క్రి. సంహరించు.

నఱుకు. దే. క్రి. ౧. నఱకు. వి. ౨. నఱుకుడు.

నఱుకులాడు. దే. క్రి. ,,

నఱుజు. దే. విణ. ౧. అణువు ౨. చిన్నది.

నఱుమాడు. దే. క్రి. పొడిచేయు.

నఱుము. దే. క్రి. ౧. పొడిచేయు. ౨. పొడి.

నఱ్ఱి. దే. వి. ౧. వెంకె బండియెద్దు. రూ. అఱ్ఱి ౨. పాలుపితుకనీయని ఆవు.

నలఁక. దే. వి. రేణువు.

నలఁకన. దే. విణ. సూక్ష్మము.

నలఁకువ. దే. వి. ౧. ఆపద. ౨. శ్రమ.

నలఁగు. దే. క్రి. ౧. చెడు. ౨. శ్రమపడు.

నలఁగుడు. దే. వి. బాధ.

నలఁచు. దే. ప్రే. నలఁగఁ జేయు.
నలఁత. దే. వి. అలఁత.
నలఁపు. దే. క్రి. నలఁగించు.
నలకూబరుఁడు. త్స. వి. కుబేరుని కొడుకు.
నలవడు. దే. క్రి. నలఁగుటనుబొందు.
నలి. దే. వి. ౧. బాధ. ౨. పాడి. 3. చిఱుతాడి. ౪. ప్రేమము. విశ. ౧. క్రమముగా. ౨. అర్థ్మముగా. 3. నిశ్చలముగా.
నలిగులి. దే. విశ. మిక్కిలినలిఁగినది.
నలిగొట్టు. దే. విశ. హీనస్వరమైనది.
నలితిండి. దే. వి. చిఱుదిండి.
నలినము. త్స. వి. తామరపువ్వు.
నలిని. త్స. వి. ౧. తామరతీఁగె. ౨. తామరకొలను.
నలిపెట్టు. దే. క్రి. బాధపెట్టు.
నలిబిలి. దే. విశ. కొఱకఁబడినది.
నలియు. దే. క్రి నలఁగు.
నలిరేఁగు. దే. క్రి. విజృంభించు.
నలుఁగు. దే. క్రి. నలఁగు. వి.స్నానము చేయుటకుఁ బూర్వము దేహమున రాచుకొనుట కుపయోగపడుపిండి.
నలుఁగుడు. దే. వి. నలఁగుడు.
నలుకువ. దే. వి. ౧. బాధ. ౨. రోగము.
నలుగడలు. దే. వి. నాలుగుదిక్కులు. రూ. నల్గడ.
నలుగాలి. దే.వి. నాలుగుకాళ్ళజంతువు.
నలుగాలు. దే. వి. నాలుగుకాళ్ళు.
నలుచు. దే. ప్రే. ౧. నలియఁజేయు. ౨. నలుపు.
నలుతుము. దే. వి. నాలుగుతూములు. రూ. నల్తుము.
నలుదిక్కు. } మి. వి. నాల్గుదిక్కు.
నలుదిక్కులు. } లు. రూ. నల్దిక్కు.
నలుదెస. } దే. వి. నాల్గు దిక్కులు.
నలుదెసలు. } రూ. నల్దెస.
నలుపు. దే. క్రి. చూ. ౧. నలుచు. వి ౨.నీలవర్ణము. విశ. 3. నల్లనిది.
నలుమడి. దే. వి. నాలుగురెట్లు. రూ. నల్మడి.
నలుమడించు. దే. క్రి. నాలుగురెట్లగు.
నలువ. దే. వి. బ్రహ్మ. రూ. నల్వ.
నలువచూలి=నారదుఁడు.
నలువతూఁపు=బ్రహ్మాస్త్రము.
నలువంక, } దే.వి. నాలుగుదిక్కులు.
నలువంకలు. }
నలువందు. దే. క్రి. ఒప్పు.
నలువది. దే. స. నాలుగుపదులు.
నలుసాల. దే. వి.౧. చుట్టుకొల్లారు. ౨. నాలుగిండ్ల భవంతి.
నలుసు. దే. వి. తృణాదిలేశము.
నల్ల. దే. వి. ౧.నెత్తురు. రూ. నల.విశ. ౨. నలుపైనది.
నల్లఁబాఱు. దే. క్రి. నల్లపడు.
నల్లగుడ్డు. దే. వి. కంటిలోని నల్లని గ్రుడ్డు.

నల్లద్రావుడు. దే. వి. రాక్షసుడు.
నల్లన. దే. వి. నలుపు.
నల్లమందు. దే. వి. అభిని.
నల్లమేఁకదప్పు. దే. వి. జారత్వము.
నల్లమేఁక=చింబోతు. (దీనికిఁ గామ మెక్కువ.)
నల్లలుదీయు. దే. క్రి. దిగదుడుచు.
నల్లవడు. దే. క్రి. నల్లనగు.
నల్లవో. దే. అవ్య. ప్రశంసార్థకము.
నల్లసేనము. దే. వి. ఒకజాతిపాయి.
నల్లి. దే. వి. పడకలయందుండి నెత్తురు త్రాగెడి పురుగు.
నల్లిల్లు. దే. వి. అగ్రహారము.
నల్లెరు. } దే. వి. ఒకదినుసు తీగ.
నల్లేరు. }
నవ. దే. వి. దురద.
నవఁత. దే. వి. కష్టము.
నవకము. దే. వి. ౧. ఒకిక్కిలిమ్పదు త్వము. విణ. కోమలమైనది.
నవనవలాడు. దే. క్రి. నవనవమను
నవనీతము. దే. వి. వెన్న.
నవనీతపుఘుటికలు= భక్ష్యవిశేషము.
నవమల్లిక, } త్స. వి. విరజాజి.
నవమాలిక. }
నవమి. త్స. వి. పక్షమునందు వచ్చెడి తిథి. విణ. తొమ్మిదియవది.
నవము. త్స. విణ. క్రొత్తది.
నవయించు. దే.క్రి. ౧. నవయఁజేయు. ౨. బాధపెట్టు.
నవయు. దే. క్రి. ౧. కృశించు. ౨. శుష్కించు.
నవరసు. దే. వి. నవరసు అనుబంగారు నాణెము. (శ్రేష్ఠము.)
నవరు. దే. వి. నగరు.
నవలా. } దే. వి. ఆఁడుది.
నవ. }
నవీనము. త్స. విణ. క్రొత్తది.
నవురు. దే. విణ. మృదువు.
నవ్యము. త్స. విణ. క్రొత్తది.
నవ్వారు. దే. క్రి. నవ్వుతోఁ బొప్పు.
నవ్వు. దే. క్రి. ౧. వికసించు. ౨. గేలి చేయు. 3. హసించు. వి. ౧. హాసము. ౨. గేలి.
నవ్వుఁబాటు. దే. వి. చూ. నగుఁబాటు.
నవ్వుటాల. } దే. వి. గేలి.
నవ్వులాట. }
నవ్వుదేఱు=నవ్వు తేటపడు.
నవ్వులఁబెట్టు=పరిహసించు.
నవ్వులబండి. దే. వి. నవ్వుస్వభావము గలది.
నశించు. త్స. వి. నాశమగు.
నశ్వరము. త్స. వి. నశించునది.
నష్టము. త్స. విణ. నాశము నొందినది.
నష్టి. త్స. వి. ౧. ద్రవ్యనాశము. ౨. నాశము.
నస. దే. వి. ౧. దురద. ౨. ఉపద్రవము. 3. కామము.
నసకించు. దే. క్రి. మోహింపఁజేయు.

నసగూఁటి. దే. విణ. కామోద్రేకముగలది.
నసగూఁడు. దే. వి. కామోద్రేకము.
నసగొంటు. దే. విణ. విటుఁడు.
నసగొట్టు. దే. విణ. ,,
నసగు. దే. వి. అస్పష్టముగాఁ జెప్పు.
నస్యము. త్స. విణ. ౧. నాసికకు హిత మైనది. వి. ౨. ముక్కుపొడి.
నహి. త్స. అవ్య. లేదు. లేఁడు.
నళ. త్స. వి. సంవత్సర విశేషము.

నా

నాంచారు. దే. వి. ౧. అమ్మవారు. ౨. స్త్రీ.
నాంది. త్స. వి. ౧. నాటకారంభమున జరపెడు మంగళము. ౨. భేరి.
నాఁగలి. దే. వి. దున్నెడు సాధనము. రూ. నాఁగెలు. నాఁగేలు.
నాఁగు. దే. వి. ధాన్యమునకు వడ్డిగా నిచ్చు ధాన్యము. రూ. నాము.
నాఁగెలునాఁగేలు. దే. వి. నాఁగలి.
నాఁచికొను. దే. క్రి. ౧. అపహరించు. వి. ౨. నాఁచికోలు.
నాఁచే. దే. క్రి. ౧. అపహరించు. వి. ౨. తీఁగ పాఁచి.
నాఁటు. దే. క్రి. ౧. నాఁటించు. ౨. పాఁతు. వి. ౧. క్షతి. ౨. పాఁతుట.
(నో)నాఁటు = నొవ్వ (నాఁటు.)
నాఁటుదీయు. దే. క్రి. మొక్క పాఁతు కొని ఒక్కగా వ్యాపించు.
నాఁటువడు. దే. క్రి. ౧ నలుగుడువడు. ౨. తెగు.
నాఁడిక. దే. వి. దేశము.
నాఁడు. దే. వి. ౧. ఆకాలము. ౨. ఆదినము. ౩. దేశము. ౪. గ్రామము.
(ఆ)నాఁడున్కి = ఆనాఁడు మొదలుకొని.
(తల)నాఁడు = నాఁటఁగోలె.
నాఁటఁగోలె = నాఁటినుండి.
నాఁటఁబట్టి = నాఁటినుండి.
నాఁటిగుంత = నాఁటినుండి.
నానాఁడు = క్రమక్రమముగా. కాఁక్రమమున.
నాఁడు నాఁడు = క్రమక్రమముగా. కాలక్రమమున.
పిన్ననాఁడు = బాల్యము.
నాకబలి. దే. వి. చూ. నాగవల్లి. రూ. నాగబలి.
నాకము. త్స. వి. ౧. ఆకాశము. ౨. స్వర్గము.
నాకు. దే. క్రి. ౧. లేహనముచేయు. ౨. తాఁకు.
(పులి) నాకి విడిచినట్లు = గొప్ప యాపద దప్పినట్లు.
నాకువు. త్స. వి. పుట్ట.
నాగ. దే. విణ. ౧. పూర్వము. (నాగ బెత్తము). ౨. పెద్దది.
నాగఁడు. త్స. వి. శేషుఁడు.
నాగదంతము. త్స. వి. చిలుకకొయ్య.

నాగపసాని. దే. వి. నాగవల్లిముత్తైదువ.

నాగపాశము. త్స. వి. వరుణుని ఆయుధము.

నాగప్పసాని. దే. వి. నాగవల్లి ముత్తైదువ.

నాగమల్లె. దే. వి. ఒకజాతిమల్లె.

నాగము. త్స. వి. ౧. పాము. ౨. ఏనుఁగు.

నాగరకుఁడు. త్స. విణ. ౧. నగరమునఁ బుట్టినవాఁడు. ౨. ప్రవీణుఁడు. 3. దొంగ. ౪. శిల్పి.

నాగరికము. త్స. విణ. నాణెమైనది.

నాగరికుఁడు. త్స. విణ. నగర రక్షణమున నియుక్తుఁడు.

నాగరుఁడు. త్స. వి. బ. ౧. పౌరుఁడు. ౨. నగరవాసి.

నాగవలి. } దే. వి. పెండ్లిలో నాల్గవ నాఁడు జరుగు శుభ కార్యము.
నాగవల్లి }

త్స. వి. తాంబూలపుఁదీగె.

నాగవాసము. దే. వి. ౧. గొండ్లెము తగిలించు రెండుకొనలు వంచిన యినుపకమ్మి. ౨. భోగమువారి గుంపు. 3. ఆట మేళము.

నాగవేల్లిమి. దే. వి. నాగవల్లి.

నాగసరము. దే. వి. ౧. సన్నాయి. ౨. పాములవాఁడు ఊఁదెడిబుఱ్ఱ.

నాగస్వరము. త్స. వి. ,,

నాగు. } దే. వి. నాగము.
నాగుఁబాము. }

నాటకము. దే. వి. ౧. నర్తనము. ౨. నడవడి. 3. నాట్యప్రధానమై గద్య పద్యాత్మక సంబంధమైన గ్రంథము. ౪. కపటోపాయము.

నాటకశాల. దే. వి. నాట్యశాల.

నాటిక. త్స వి. ఒకానొకఉపరూపకము.

నాటు. దే. క్రి. ౧. గ్రుచ్చుకొను. ౨. (నేలను) నాటుకొనఁగు వానిఁ గ్రుచ్చు. వి. ౧. నాట్నము. ౨. నాటుట.

నాట్యము. త్స. వి. నృత్యము.

నాడి. త్స. వి. ౧. నాళము. ౨. ఈనె. 3. వాత పిత్త శ్లేష్మ నాడులలో నొకటి.

నాడింధముఁడు. త్స. విణ. గొట్టమును ఊఁదువాఁడు. (కమసాలి.)

నాడు. దే. క్రి. నాటు.

నాణకము. త్స. వి. నాణెము.

నాణెకత్తె. దే. విణ. నాణెము కలది.

నాణెకాఁడు. దే. విణ. నాణెము కలవాఁడు.

నాణెము. దే. వి. ౧. అచ్చు వేసిన రాగి వెండి బంగారముల బిల్ల. ౨. నాగరికత. 3. ఇచ్చి పుచ్చుకొనుటలోఁ గలుగు మంచి నడవడి.

నాణ్యము. } దే. వి. నాణెము.
నాణియము. }

నాతి. } దే. వి. ఆఁడుది.
నాతుక. }
నాదము. త్స. వి. ధ్వని. క్రి. వాదించు.
నాదారు. దే. వి. ౧. బీద. ౨. చిక్కిన వాఁడు.
నాదించు. త్స. క్రి. మ్రోఁగు.
నాదు. దే. వి. చప్పుడు.
నాదుఁడు. త్స. వి. ౧. స్వామి. ౨. యజమానుఁడు. 3. పెనిమిటి.
నాన. దే. వి. సిగ్గు.
నానబియ్యము. దే. వి. ,, నానఁబెట్టిన క్రొత్త చేరుడు బియ్యము.
ననఁబ్రాలు. దే. వి. ,, ,,
నాను. దే. క్రి. తడియు. వి. స్త్రీలు మెడనుదాలుచు బంగారు తీఁగ వంటి సొమ్ము.
నానుచు. దే. క్రి. నానవైచు.
నానుడి. దే. వి. ౧. సామెత. ౨. పుకారు. 3. కింవదంతి. రూ. నానొడి.
నానుడు. దే. విణ. తడిసినది.
నాపసాని. దే. వి. నాగవల్లినడుపు ముత్తైదువ.
నాభి. త్స. వి. ౧. కస్తూరి. ౨. బొడ్డు. 3. వసనాభి. ౪. తిలకము.
నాభిఁదీర్చు = తిలకము రచియించు.
నామకరణము. త్స. వి. బిడ్డలకు పేరు పెట్టుట.
నామధేయము. త్స. వి. పేరు.
నామ మడఁచు. త్స. క్రి. చంపు.
నామము. దే. వి. నొసటఁ బెట్టు కొనెడి బొట్టు. త్స. వి. పేరు.
నామశేషము. త్స. విణ. చచ్చినది.
నాము. దే. వి. జొన్న మొదలగు పైరు కోసిన పిమ్మట వాని మోళ్లలో మొలకెత్తు మొలక. (దీనినిఁ బశు వులు తిన్నచో మరణించును.)
నాముదిన్నట్లు = నాముమేసినట్లు.
నాయకుఁడు. త్స. వి. ౧. అధిపతి. ౨. శృంగారరసావలంబన పురుషుఁడు. విణ. శ్రేష్ఠుఁడు. దే. వి. ౧. అధిపతి. ౨. పన్నిద్దఱు భటులకధిపతి.
నాయఁకురాలు. దే. విణ. శ్రేష్ఠురాలు.
నాయఁడు. దే. వి. ప్రభువు.
నాయన. దే. వి. తండ్రి.
నాయము. వై. వి. న్యాయయుక్తము.
నాయి. దే. వి. కుక్క.
నాయికత్స.విశృంగారరసావలంబన స్త్రీ
నాయుఁడు. దే. విణ. నాయఁడు.
నార. దే. వి. ౧. చీల్చిన తాటిమట్ట లోనగునది. ౨. చెట్టుమీఁదిపట్ట.
నారంగము. త్స. వి. నారింజపండు.
నారంగుఁడు. త్స. విణ. విటుఁడు.
నారకము. త్స. వి. నరకము.
నారచీర. దే. వి. నారతో నేసినబట్ట.
నారదుఁడు. త్స. వి. ఒకానొక దేవ ముని. (వ్యు. "నారమ్" అనఁగా జ్ఞానము: దానిని ఇచ్చువాఁడు)

నారమడి. దే. వి. నారబట్ట.

నారసము. దే. విణ. ౧. బాణము. ౨. ఇనుపయూచ.

నారసింహుఁడు. త్స. వి. నరసింహావతారమును ధరించిన విష్ణువు.

నారాచము. త్స. వి. ౧. బాణము. ౨. గంటము.

నారాజి. దే. వి. కత్తి.

నారాయణుఁడు. త్స. వి. ౧. బ్రహ్మ. ౨. శివుఁడు. 3. విష్ణువు. (వ్యు. నారమనఁగాజలము. అధిష్ఠానముగాఁ గలవాఁడు.)

నారి. దే. వి. ౧. వింటియల్లెత్రాడు. ౨. నరము. 3 నారికుసుపు. త్స. వి. స్త్రీ. (వ్యు. పురుషుని స్వవశము పొందించుకొనునది.

నారికడము. } దే. వి. కొబ్బరిచెట్టు.
నారికేడము.
నాల్కడము.

నారికేళము. త్స. వి. టెంకాయ.

నారుచు. దే. క్రి. నాడఁజేయు.

నారు. దే. వి. చేలలోఁగాని మిరెపవంగ మున్నగు తోఁటలలోఁగాని నాటుటకై విత్తులు పోసి మొలచిన మొలకలు.

నాలి. దే. వి. ౧. కుత్సితపుఁబని. (కూలి నాలి) ౨. వేళాకోళము. విణ. 3. కుత్సితము. ౪. తేలికగా.

నాలిక. దే. వి. చూ. నాలుక.

నాలిగాలి. దే. వి. మందమారుతము.

నాలిబూతము. దే. విణ. ౧. కుత్సితుఁడు. ౨. కుత్సితురాలు.

నాలిముచ్చు. దే. వి. ౧. కుత్సితుఁడు. ౨. కుత్సితురాలు. 3. మందము.

నాలుక. దే. వి. ౧. జ్వాల. ౨. జిహ్వ.

నాలుకముల్లువిఱుగు = మాటలాడలేకపోవు. (అవమానము కలుగు.)

నాలుగు. దే. ౧. మూఁడును నొకటియును ౨. అల్పములగు మాటలు (నేను వానిని నాలుఁగుపెట్టితిని.)

నాల్నాఁడు. దే. వి. నాల్గవదినము.

నావ. త్స. వి. ఓడ.

నావికుఁడు. త్స. వి. ఓడనడపువాఁడు.

నావుడు. దే. వి. అనిన పిమ్మట.

నాశకుఁడు త్స. విణ. నాశముచేయువాఁడు.

నాశనము. త్స. వి. నాశము.

నాశము. త్స. వి. చేటు.

నాస. } త్స. వి. ముక్కు.
నాసికము.

నాసాపుటము. త్స. వి. ముకుపుటము.

నాసామణి. త్స. వి. ముక్కుఱ.

నాసి. దే. వి. నికృష్టము. (నాసి రకపు బట్ట.)

నాసిల్లు. దే. క్రి. నశించు.

నాసిలు. దే. క్రి. నశించు.

నాసీరము. త్స. వి. సేనాముఖము.

నాస్తికత. త్స. వి. పరలోకము లేద నెడి బుద్ధి.

నాస్తికుఁడు. త్స. వి. పరలోకము లేద నెడివాఁడు.

నాస్తిక్యము. త్స. వి. చూ. నాస్తికత.

నాళము. త్స. వి. ౧. తామరతూఁడు. ౨. క్రోవి. 3. తూముకాలువ.

నాళి. త్స. వి. ,,

నాళిక. త్స. వి. ,,

నాళీకము. త్స. వి. ౧. బాణము. ౨. తామర.

నాళీకాసనుఁడు. త్స. వి. బ్రహ్మ.

## ని

నింగి. దే. వి. ఆకాశము.

నింగివడు. దే. క్రి. అస్తమించు.

నించు. దే. క్రి. నిండఁజేయు.

నింట. దే. వి. ౧. జలపూరము. ౨. అతిశయము.

(సురతమునకు) నింట = సురతమున కుద్దీపన హేతువు.

నిండ. దే. అవ్య. అధికముగా.

నిండఁబడు. } దే. క్రి. నిండు.
నిండారు. }

నిండు. దే. క్రి. పూర్ణమగు. వి. పూర్ణత. విశ. పూర్ణము.

నిండుమనము = నెమ్మనము.

(మ్రాను)నిండన్ = హృదయపూర్వకముగా.

నిండుకొను. దే. క్రి. నిండు.

నింద. త్స. వి. దూఱు. క్రి. నిందించు.

నిందకుఁడు. త్స. విశ. నిందించువాఁడు.

నిందనము. త్స. వి. నిందించుట.

నిందించు. త్స. క్రి. దూషించు.

నింపాది. విశ. ౧. సమృద్ధము. ౨. సుఖితము.

నింపారు. దే. క్రి. చూ. నినుపారు.

నింపు. దే. క్రి. చూ. నినుచు. వి. సమృద్ధి. విశ. సమృద్ధము.

నింబము. త్స. వి. వేఁపచెట్టు.

నికటము. త్స. వి. సమీపము. దే. విశ. ఎడతెగకుండ.

నికగము. దే. విశ. ౧. త్రోపుడు పోగా మిగిలినది. ౨. సారభూతము. త్స. వి. ౧. సమూహము. ౨. నిధి.

నికర్తనము. త్స. వి. కత్తిరించుట.

నికషము. త్స. వి. ఒరగల్లు.

నికషోపలము. త్స. వి. ,,

నికామము. త్స. విశ. ౧. చాలినంత. ౨. మిక్కిలి.

నికాయము. త్స. వి. ౧. తెగ. ౨. సమూహము.

నికాశము. త్స. విశ. నీకాశము(తుల్యము).

నికాషము. త్స. వి. ఒరగల్లు.

నికుంజము. త్స. వి. పొదరిల్లు.

నికురుంబము. త్స. వి. సమూహము.

నికృంతనము. త్స. వి. కత్తెర.

నికృతము. త్స. విశ. అవమానింపఁబడినది.

నికృష్టము. త్స. విశే. అధమము.
నికేతనము. త్స. వి. ఇల్లు.
నికేతము. త్స. వి. ,,
నిక్కచ్చి. దే. వి. నిర్బంధము.
నిక్కము. దే. వి. ౧. నిశ్చయము. ౨. యథార్థము.
నిక్కల. దే. వి. సత్యమైన స్వప్నము.
నిక్కవొడుచు. దే. క్రి. నిక్కన నిలుచు.
నిక్కాఁక. దే. వి. మిక్కిలికాఁక.
నిక్కు. దే. వి. ౧. గర్వము. ౨. ఉన్నతి. క్రి. ౧. గర్వించు. ౨. ఉన్నతమగు.
నిక్కుఁబోతు. దే. విశే. గర్వస్వభావము కలవాఁడు.
నిక్కుడు. దే. వి. ఉన్నతి.
నిక్కువము. దే. వి. నిక్కము.
నిక్వణము. త్స. వి. శబ్దము.
నిక్వాణము. త్స. వి. ,,
నిక్షిప్తము. త్స. విశే. ఇల్లడఁబెట్టఁబడినది.
నిక్షేపము. త్స. వి. ౧. నిధి. ౨. తాకట్టు. 3. ఇల్లడ. ౪. వైచుట. ౫. (కొఁగాఁడు) నిక్షేపము.
నిక్షేపించు. త్స. క్రి. పూడ్చు.
నిఖిలము. త్స. విశే. సర్వము.
నిగదము. త్స. విశే. స్పష్టముగాఁజెప్పుట.
నిగనిగ. దే. వి. మెఱయుటయందయ్యెడు ధ్వన్యనుకరణము.

నిగమము. త్స. వి. ౧. మార్గము. ౨. వేదము.
నిగరణము. త్స. వి. ౧. కబళించుట. ౨. తినుట. 3. పూర్తిగా లోఁగొనుట.
నిగరము. దే. వి. ౧. కాంతి విశేషము. ౨. బల్ల. విశే. ౧. శ్రేష్ఠము. ౨. సారభూతము. 3. పెద్దది. ౪. అల్పము.
నిగళము. త్స. వి. సంకెల. చూ. నిగడము.
నిగారము. దే. వి. ౧. మెఱుఁగు. (కాంతి.) విశే. శ్రేష్ఠము.
నిగీర్ణము. త్స విశే. కబళితము.
నిగుడారు. దే. క్రి. వ్యాపించు.
నిగుడు. దే. క్రి. ౧. వ్యాపించు. ౨. పఱుఁగు.
నిగుడుదెంచు. దే. క్రి. నిక్కు.
నిగుఱు. దే. వి. కట్టెనిప్పుమీఁది భస్మము.
నిగుఱుగప్పిన నిప్పు = డాంబికము లేని ధీరుఁడు.
నిగూఢము. త్స. విశే. రహస్యమైనది.
నిగూహనము. త్స. వి. దాఁచుట.
నిగృహీతుఁడు. త్స. విశే. నిగ్రహింపఁబడినవాఁడు.
నిగ్గఁడి. దే. విశే. కఠినమైన.
నిగ్గారు. దే. క్రి. ఉత్కృష్ట కాంతితో నిండు.

నిగ్గు. దే. వి. కాంతి.

నిగ్గుగాఁడి. దే. విణ. కాంతిగల స్త్రీ.

నిగ్రహము. త్స. వి. ౧. చెఱ. ౨. మేర. 3. బెదరుమాట.

నిగ్రహించు. త్స. క్రి. ౧. నిరోధించు. ౨. నిరసించు.

నిఘంటువు. త్స. వి. పద పదార్థములను దెలియఁజేసెడు గ్రంథము.

నిఘృష్టము. త్స. విణ. రాపిడి పెట్టఁబడినది.

నిఘ్నము. త్స. విణ. లోఁకువైనది. (పరశేవ్యనిఘ్నము.)

నిచయము. త్స. వి. సమూహము.

నిచితము. త్స. విణ. వ్యాప్తము.

నిచోళకము. } త్స. వి. ౧. బురకా. ౨. పరుపుదుప్పటి. 3. మేలిముసుఁగు.
నిచోళము.

నిచ్చెన. వై. వి. పైకెక్కఁదగిన మెట్లు కల సాధనము.

నిచ్చ. వై. అవ్య. ౧. సదా. ౨. ప్రత్యహము. రూ. నిచ్చలు.

నిచ్చెయము. } వై. వి. నిశ్చయము.
నిచ్చలము.

నిజము. త్స. విణ. ౧. తనది. ౨. శాశ్వతమైనది.

నిజేము. దే. వి. ౧. సత్యవచనము. ౨. విధము. విణ. సత్యము.

నిజేముచేయు = ఒట్టుపెట్టుకొను.

నిజేపట్టు. దే. క్రి. నిజముగాఁ దలఁచు.

నిజేమరి. దే. విణ. సత్యవంతుఁడు.

నిటునిటనగు. దే. క్రి. కన్నులు తేలగిలు.

నిటలము. త్స. వి. నుదురు.

నిటాలము. త్స. వి. ,,

నిట్ట. దే. వి. ౧. స్తంభము. ౨. స్థానము. 3. ప్రవాహము. విణ. ౧ నిక్కినది. ౨. సరియైనది.

నిట్టకనిలుచు.
నిట్టక్కనిలుచు. } దే. క్రి. సరిగా నిలుచు.
నిట్టనిలుచు.
నిట్టనిలుచుఁడు.

నిట్టనొట్టు. దే. క్రి. ఉప్పొంగు.

నిట్టద్రోచు. } దే. క్రి. ౧. ఉప్పొంగు. ౨. పైకుబుకు.
నిట్టలుద్రోచు.

నిట్టరాడు. దే. వి. దూలములేని యింటి నడిమి పొడవు కంబము.

నిట్టలము. దే. విణ. అధికము.

నిట్టలువొడుచు. దే. క్రి. ౧.ఉప్పొంగు. ౨. వెల్లివిరియు.

నిట్టవొడుచు. దే. వి. ఉప్పొంగు.

నిట్టు. దే. వి. ఉపవాసము.

నిట్టుపవాసము. త్స. మి. వి. శుష్కోపవాసము.

నిట్టుపోసము. ,,

నిట్టూరుచు. దే. క్రి. నిట్టూర్పువిడుచు.

నిట్టూరుపు. దే. వి. దీర్ఘనిశ్వాసము. రూ. నిట్టూర్పు.

నిట్రుపాటు. దే. వి. ౧ నిలుచుట. ౨. నిక్కుట.

నిట్రము. దే. వి. నిలువు.
నిట్రాడు. దే. వి. చూ. నిట్టరాడు.
నిట్రాయి. దే. వి. పొడవైనరాయి.
నిట్రించు. దే. క్రి. నిక్కించు.
నిట్రెల్లు. దే. క్రి. ఉపవాసముండు.
నిట్రు. దే. వి. ఉపవాసము.
నిటుపాసము. దే. వి. శుష్కోపవాసము.
నిడివి. దే. వి. ౧. నిడుపు. విణ. ౨. దీర్ఘము.
నిడుచను. దే. క్రి. చాఁగు
నిడుద. దే. వి. నిడుపు.
నిడుదనిదుర = మరణము.
నిడుపడు. దే. విణ. పాము.
నిడుపు. దే. వి. నిడివి.
నిడుబాట. దే. వి. పెద్దత్రోవ.
నిడూర్పు. దే. వి. నిట్టూర్పు.
నితంబము. త్స. వి. ౧. మొల. ౨. పిఱుదు.
నితంబిని. త్స. వి. గొప్పపిఱుఁదులు కలయాఁడుది.
నితాంతము. త్స. విణ. అధికము.
నిత్తెము. దే. విణ. శాశ్వతము.
నిత్యకళ్యాణము. త్స. వి. ఎడతెగని శుభము.
నిత్యపడి. త్స. వి. దినసపడి (నిత్యము నియమముగాఁ జేయవలసినది.)(ఇట్లే నిత్యనిబంధము.)
నిత్యము. త్స. విణ. ౧. ఎడతెగనిది. ౨. ఎల్లప్పుడు. 3. శాశ్వతముగా.

నిదర్శనము. త్స. వి. దృష్టాంతము.
నిదాఘము. త్స. వి. ౧. వేసఁగి. ౨. వేఁడిమి.
నిదానము. వై. వి. ౧. ఆత్రపడక విచారించుట. త్స. వి. ౨. మూలకారణము.
నిదానించు. వై. క్రి. ఆత్రపడక విచారించు.
నిదిధ్యాసనము. త్స. వి. పునః పునస్స్మరణము.
నిదుర. వై. వి. నిద్ర. రూ. నిద్దుర.
నిదురకుఁబడు = నిద్రించుటకు మొదలుపెట్టు.
నిదురతెలియు = మేలుకాంచు.
నిదురపుట్టు = నిదురవచ్చు.
నిదురపోతు. దే. విణ. నిదురపోవు స్వభావము కలవాఁడు.
నిదురించు. వై. క్రి. నిద్రించు.
నిదేశకుఁడు. త్స. విణ. చూపువాఁడు.
నిదేశము. త్స. వి. ౧. శాసనము. ౨. ఆజ్ఞ.
నిద్దము. వై. విణ. ౧. నునుపు కలది. ౨. సాంద్రము. 3. మనోహరము. ౪. క్షేమగలది.
నిద్దా. దే. విణ. నిద్దము.
నిద్దుర. దే. వి. నిదుర.
నిద్దురలేని ప్రోడలు = దేవతలు.
నిద్ర. త్స. వి. నిదుర.
నిద్రపోవు. త్స. క్రి. నిద్రించు.

నిద్రాణము. త్స. విణ. ౧. నిదురించునది. ౨. ముకుళించునది.

నిద్రాళువు. త్స. విణ. నిద్రాశీలుఁడు.

నిద్రించు. త్స. క్రి. నిద్రపోవు.

నిద్రిలు. / నిద్రిల్లు. } త్స. క్రి. నిద్రించు.

నిధనము. త్స. వి. మరణము.

నిధనుఁడు. త్స. వి. నిర్ధనుఁడు.

నిధానము. / నిధి. } త్స. వి. పాఁతఱ.

నిధువనము. త్స. వి. మైథునము.

నిధ్యానము. త్స. వి. చూపు.

నిధ్యానించు. త్స. క్రి. చూచు.

నిధ్యాసము. త్స. వి. శబ్దము.

నినదము. / నినాదము. } త్స. వి. మ్రోఁత.

నినుచు. దే. క్రి. ౧. నిండించు. ౨. చిప్పిలఁజేయు.

నినుపాఱు. దే. క్రి. ౧. పూర్ణమగు. ౨. అతిశయించు.

నినుపు. దే. వి. నింపు.

నిన్న. దే. వి. కడచినదినము.

నిపఠము. త్స. వి. పాఠముచదువుట.

నిపతనము. త్స. వి. క్రిందికిఁబడుట.

నిపాఠము. త్స. వి. పాఠముచదువుట.

నిపాతన. / నిపాతనము. / నిపాతము. } త్స. వి. ౧. పడుట. ౨. పడఁద్రోయుట.

నిపానము. త్స. వి. పశువులు నీరుత్రాగు రాతితొట్టె.

నిపీడనము. త్స. వి. ౧. గట్టిగాఁబిడుచుట. ౨. మిక్కిలిబాధించుట.

నిపుణుఁడు. త్స. విణ. నేర్పరి.

నిప్పచ్చు. / నిప్పచ్చరము. } దే. వి. ౧. దారిద్ర్యము. విణ. ౨. శూన్యము.

నిప్పట్టి. / నిప్పట్టు. } దే. వి. ఆకులుగప్పి నిప్పులలోఁ గాల్చు అట్టు.

నిప్పస్తు. దే. వి. పూర్ణమైనఉపవాసము.

నిప్పు. / నిప్పుక. } దే. వి. అగ్ని.

నిప్పుఁ జెదలంటునా=మంచివానికిఁ జెడుగుణము గలుగునా?

నిప్పువడిఁగట్టుట = స్వయముగాఁగీడు దెచ్చుకొనుట.

నిబంధనము. త్స. వి. ౧. ఏర్పాటు. ౨. కట్టుబాటు. ౩. బంధము. ౪. స్థానము.

నిబంధము. త్స. వి. ౧. బంధము. ౨. వర్ణాశ్రమము మొదలగు కట్టుబాటు. నివురుగప్పిన నిప్పు = నిగురుగప్పిన నిప్పు.

నిబంధించు. త్స. క్రి. ౧. ఏర్పఱచు. ౨. బంధించు.

నిబద్ది. వై. విణ. నిజము. రూ. నిబ్బద్ది.

నిబద్దించు. / నిబద్దిలించు. } దే. క్రి. నిజపఱచు.

పఱచు. దే. క్రి. ౧. పాఱు. ౨. చూఁప లోనగువానిఁ బఱచు.
పఱతెంచు. దే. క్రి. పాఱివచ్చు.
పఱపఱ. దే. వి. చించుట లోనగు చప్పుడు.
పఱపు. దే. క్రి. ౧. పఱవఁజేయు. ౨. తోలు. 3. ప్రయోగించు. ౪. పూయు. వి. ౫. పడక.
పఱి. దే. వి. విధము.
పఱిగ. దే. వి. కోయునప్పుడు చేని యందు రాలిన యెన్ను.
పఱికొను. దే. క్రి. అపహరించు.
పఱిపఱి. దే. విశే. పీడితము.
పఱియ. దే. వి. ౧. బ్రద్ద. ౨. చీలిక.
పఱియవాయు. దే. క్రి. చీలు.
పఱివోవు. దే. క్రి. ౧. కొల్లవోవు. ౨. నశించు.
పఱుచు. దే. క్రి. ౧. పాటుపడఁజేయు. ౨. దుప్పటి లోనగువానిఁ బఱచు. రూ. పరుచు.
పఱుపు. దే. వి. పడక.
పఱ్ఱు. దే. వి. చూ. పఱ.
పఱ్ఱు. దే. వి. చినుఁగుటయం దయ్యెడి ధ్వన్యనుకరణము.
పలక. దే. వి. ౧. వ్రాయఁదగిన సాధనము. ౨. బల్ల.
పలపల. దే. వి. ౧ తొరఁగుటయం దయ్యెడి ధ్వన్యనుకరణము. ౨. వేగుటయం దయ్యెడి చప్పుడు. విశే. 3. విరళము. ౪. కృశము.
పలపలన. దే. వి. వైరళ్యము. విశే. విరళము.
పలము. దే. వి. ౧. మూఁడు తులముల యెత్తుబరువు. త్స. వి. ౨. మాంసము.
పలలము. త్స. వి. మాంసము.
పలవ. దే. వి. రెండుకొమ్మల మొదల. (చిలువలు పలువలు.)
పలవరము. దే. వి. ప్రలాపము.
పలవరించు. } దే. క్రి. ప్రలాపించు.
పలవించు. }
పలాండువు. త్స. వి. నీరుల్లి.
పలాములుచేయు. దే. క్రి. పాడు చేయు.
పలాయనము. త్స. వి. పాఱిపోవుట.
పలాయితుఁడు. త్స. విశే. పాఱిపోయినవాఁడు.
పలాలము. దే. వి. ౧. గింజలేనిపొట్టు, ౨. తాలు.
పలాశము. త్స. వి. ౧. ఆకు. ౨. మోదుగు.
పలాశి. త్స. విశే. రాక్షసుఁడు.
పలాశుఁడు. త్స. విశే. ,,
పలితము. త్స. విశే. నరసినది.
పలు. దే వి. ౧. పల్లు. విశే. ౨. అనేకము, ఇది పల్తునియలు ఇత్యాదులలో పల్ అగును.
పలుఁగు. దే. వి. స్ఫటికము.
పలుకఁబాఱు. దే. క్రి. వివర్ణమగు.

పలుకరించు. దే. క్రి. ౧. మాటాడు. ౨. హెచ్చరించు. 3. జాగ్రత్త అని చెప్పు.

పలుకరింత. / పలుకరింపు. దే. వి. ౧. మాటాడుట. ౨. హెచ్చరించుట.

పలుకు. దే. వి. ౧. తునుక. ౨. మాట. 3. నింద. ౪. విద్య. క్రి. ౧. మాటాడు. ౨. నిందించు.

పలుకుఁదోడు. దే. వి. పలుకరించు తోడు.

పలుకుబడి. దే. వి. ౧. మాటసాగుదల. ౨. ఉచ్చారణము.

పలుకుఱాయి. దే. వి. ప్రతిధ్వని ఇచ్చు శిల.

పలుకెంపు. దే. వి. దంతక్షతము.

పలుగఱ. దే. వి. పండ్లపొడి.

పలుగాకి. దే. విశే. దుష్టుఁడు. రూ. పల్గాకి.

పలుగుంపుఁడు. దే. స. బ. చూ. పలుగురు.

పలుగురు. దే. స. బ. అనేకులు. రూ. పలువురు.

పలుచ. దే. విశే. ౧. దళసరికానిది. ౨. చిక్కనకానిది. 3. చులుకన.

పలుచన. దే. వి. ౧. చులుకఁదనము. ౨. అనుకుఁదనము.

పలుచపడు. దే. క్రి. పలుచనగు.

పలుపు. దే. వి. పసులను గట్టుట కుపయోగపడెడితాఁడు.

పలుమరు. / పలుమారు. / పలుమఱు. / పలుమాఱు. దే. అవ్య. మాటికి మాటికి.

పలువ. దే. విశే. పోకిరి.

పల్మరు. దే. వి. పలుమారు.

పల్మఱు. ,,

పల్యంకము. త్స. వి. మంచము.

పల్యంకిక. త్స. వి. పల్లకి.

పల్యాణము. త్స. వి. ౧. అంబారి. ౨. గుఱ్ఱపుపల్లము.

పల్లకి. / పల్లకీ. దే. వి. మనుష్యులు మోసికొని పోయెడియందలము.

పల్లటము. దే. వి. ౧. చలనము. ౨. వ్యత్యాసము.

పల్లటిల్లు. దే. క్రి. ౧. చలించు. ౨. వ్యత్యస్తమగు. 3. తెల్లఁబోవు.

పల్లటీ. దే. వి. ౧. పారావత విశేషము. ౨. ఎగురు.

పల్లటీగ్గొను. దే. క్రి. ఎగురు.

పల్లటీల్దాఁటు. దే. క్రి. ఎగురు.

పల్లటీల్వైచు. దే. క్రి. ఎగురు.

పల్లన. దే. వి. ౧. అంబారి. ౨. గుఱ్ఱపు పల్లము.

పల్లము. దే. వి. ౧. పల్లపునేల. ౨. గుఱ్ఱము మొదలగువాని నెక్కునపుడు క్రిందమెత్తగానుండుటకై వైచుగంత.

పల్లఱపులు. దే. వి. ౧. వ్యర్థములైన పెక్కు అదపులు. ౨. ఆడరానిమాటలు.
పల్లవము. త్స. వి. ౧. చిగురు. ౨. చిగిరించినకొమ్మ.
పల్లవించు. త్స. క్రి. చిగిరించు.
పల్లవితము. త్స. విశ. చిగిరించినది.
పల్లవుఁడు. త్స. విశ. విటుఁడు.
పల్లాటునమువాఁడు. త్స. విశ. ఆప్తుఁడు.
పల్లి. త్స. వి. చిన్నగ్రామము.
పల్లియ. దే. వి. గ్రామము.
పల్లు. దే. వి. దంతము.
పల్లుడు. దే. విశ. పల్లము.
పల్లెకూటము. దే. వి. ౧పాఠశాల౨బడి.
పల్లెత. దే. వి. బెస్తది.
పల్లొత్తు. దే. వి. దంతక్షతము.
పల్వలము. త్స. వి. నీళ్లుగల పల్లము.
పవడము. దే. వి. చూ. పగడము.
పవనము. త్స. వి. గాలి.
పవమానుఁడు. త్స. వి. వాయువు.
పవము. త్స. వి. తూర్పాఱఁబట్టుట.
పవలు. దే. వి. పగలు.
పవళించు. దే. క్రి. పండుకొను. వి. పవళింత.
పవి. త్స. పే. వజ్రాయుధము.
పవిత్రము. త్స. వి. ౧. జందెము. ౨. దర్భ. విశ. 3 పూజ్యము.
పవ్వడించు. / పవ్వళించు. { దే. క్రి. శయనించు.
పశువు. త్స. వి. నాలుగుకాళ్లజంతువు.
పశ్చాత్తాపము. త్స. వి. వగపు
పశ్చిమము. త్స. వి. ౧. పడమటిది. ౨. వెనుకటిది.
పశ్యతోహరుఁడు. త్స. విశ. ౧. కమసాలివాఁడు. ౨ పచ్చెకాఁడు.
పస. దే. వి. ౧. సమృద్ధి. ౨. సారము. 3. నేర్పు.
పసదనము. దే. వి. బహుమానము.
పసను. దే. విశ. ౧. ఎఱుపుమించిన పసుపువన్నెగలది. ౨. బాగైనది. వి. ౧. ఎఱుపుమించిన పసుపువన్నె. ౨. బాగు.
పసరము. దే. వి. ఆవు, దున్నపోతు మున్నగు వానిజాతి.
పసరించు. దే. క్రి. వ్యాపించు.
పసరు. దే. వి. ౧. ఆకురసము. ౨. ఆకుపచ్చన.
పసాదము. వై. వి. అన్నము.
పసాపడు. దే. క్రి. భుజించు.
పసారము. దే. వి. అంగడి.
పసారు. దే. వి. ,,
పసి. దే. విశ. ౧. లేఁత. (పసిబిడ్డ) వి. ౨. గోగణము.
పసిఁడి. దే. వి. ౧. బంగారు. ౨. ధనము.
పసిఁడికాయ. దే. వి. పొత్తినూలికాయ.
పసిఁడిపురుగు. దే. వి. పొత్తినూలికాయలోని పురుగు.
పసిగొను. దే. క్రి. గాలివట్టు.

పసిమి. దే. విణ. ౧. ఆకుపచ్చని. ౨. ఎఱుపుమించిన పసుపురంగు.
పసిమిడి. దే. విణ. పసిమిగలది.
పసిరిక. దే. వి.౧. పసరువన్నె. బ. ౨. రోగవిశేషము.
పసిరికపాము. దే. వి. పచ్చనిపాము.
పసివట్టు. దే. క్రి. పశ్వాదుల గాలి చూచు.
పసుపాడు. దే. క్రి. పసుపుపూసికొని జలమాడు.
పసుపు. దే. వి. హరిద్ర.
పసులవాఁడు. దే. వి. గొల్లవాఁడు.
పస్తాయించు. దే. క్రి. పశ్చాత్తాపపడు.
పస్తు. దే. వి. ఉపవాసము.
పళపళ. దే. వి. ప్రకాశించుటలో నగు ధ్వన్యను కరణము.
పళ్లెము. } పళ్లెము. } పళ్లెరము. } దే. వి. ౧. తాంబాళము. ౨. భోజనపుగిన్నె.

పా

పాంచజన్యము. త్స. వి. విష్ణువుయొక్క శంఖము.
పాంచాలి. త్స. వి. ౧. ద్రౌపది. ౨. బొమ్మ.
పాంచాలిక. త్స. వి. బొమ్మ.
పాంచాలుఁడు. త్స. విణ. ౧. ఒక జాతిపురుషుఁడు. ౨. పాంచాల దేశీయుఁడు.
పాండవబీడు. త్స. వి. బహుకాలము నుండి దున్నని నేల.
పాండితి. } పాండిత్యము. } త్స. వి. పండిత భావము.
పాండిమము. త్స. వి. తెలుపు.
పాండురము. త్స. విణ. ౧. తెల్లనిది. ౨. తెలుపుమించిన పచ్చనిది.
పాండువు. త్స. వి. ౧. ఒకరోగము. ౨. తెలుపు. విణ.౩. తెల్లనిది.
పాండ్యము. త్స. వి. ఒకానొకదేశము.
పాంథుఁడు. త్స. వి. బాటసారి.
పాంశువు. త్స. వి. దుమ్ము.
పాంసనుఁడు. త్స. విణ. దూషకుఁడు. (కులపాంసనుఁడు.)
పాంసుల. త్స. వి. ఱంకుటాలు.
పాంసువు. త్స. వి. దుమ్ము.
పాఁకుడు. దే. వి. పాఁచి.
పాఁగెము. దే. వి. సంబంధము.
పాఁచి. దే. వి. ౧. నీటియందు కలిగెడు పచ్చని మురికి. ౨. పండ్ల మురికి. విణ. ౩. పాఁచిగలది.
పాఁడి. దే. వి. పాలు.
పాఁత. దే. వి. ౧. గుడ్డ. ౨. చినిగిన వస్త్రము. విణ. ౩. బహుదినముల నాఁటిది.
పాఁతగిల్లు. దే. క్రి. పాతఁబడియగు.
పాఁతఱ. దే. వి. ధాన్యముంచుటకై నేలలోఁ ద్రవ్వినగుంట.
పాఁతు. దే. క్రి.౧. పూడ్చు. వి. ౨. పాఁతఱ.

పాక. దే. వి. దూలములు లేనియిల్లు.

పాకము. త్స. వి. ౧. పంట. ౨. పరిపాకము.

పాకశాసనుఁడు. త్స. వి. ఇంద్రుఁడు.

పాకారి. త్స. వి. ,,

పాకి. / దే. వి. మఱుఁగు పెరటికుప్ప
పాకీ. \ నెత్తెడువాఁడు.

పాకెన. / దే. వి. పెండ్లి మూఁడవ
పాకెన్న. \ నాఁటి తంతు.

పాగ. / దే. వి. ౧. తలకట్టు. బ.
పాగా. \ ౨. పావుకోళ్ళు.

పాగు. దే. వి. చక్కెర లోనగునవి కాఁచగా నగు ద్రవత్వము.

పాచిక. త్స. వి. జూదమాడెడి యడ్డపాళ్లు.

పాచితము. దే. వి. ప్రాయశ్చిత్తము.

పాచు. దే. క్రి. ౧. తొలఁగించు. ౨. చిక్కుచు ఎడలించు.

పాట. దే. వి. ౧. సంగీతము. ౨. విధము.

పాటచ్చరుఁడు. త్స. వి. దొంగ.

పాటన. దే. వి. ౧. అలంకారము. ౨. సంస్కారము.

పాటనము. త్స. వి. చీల్చుట.

పాటపాట. దే. విశ. కొంచెము కొంచెముగా.

పాటలము. త్స. వి. విశ. తెలుపు మించిన యెఱుపుగలది.

పాటవము. త్స. వి. ౧. ఆరోగ్యము. ౨. నేర్పు.

పాటి. దే. వి. ౧. సామ్యము. ౨. ప్రమాణము. వి. విశ. ౧. సమము. ౨. సామాన్యము. 3. న్యాయ్యము. ౪. కొలఁది. (ఏపాటిది.)

పాటించు. దే. క్రి. ౧. ఆదరించు. ౨. విచారించు. 3. ధరించు. ౪. పొందు.

పాటినేల. దే. వి. ఊరు రిత్తపడిపోయి పాడుపడిననేల.

పాటిరేవు. దే. వి. దిగి నడిచి దాఁటిపోదగినరేవు.

పాటిల్లు. దే. క్రి. కలుగు. రూ. పాటిలు.

పాటీరము. త్స. వి. చందనము.

పాటీలు. దే వి. బ. స్త్రీలు చేతిలోని వాల్చునగ.

పాటు. దే. వి. ౧. పడుట. ౨. కష్టము. 3. ఆపద.

పాటునఁబడు. దే. క్రి. యథాస్థితికి వచ్చు.

పాటుపడు. దే. క్రి. కష్టపడు.

పాఠకుఁడు. త్స. వి. వేదపాఠము చదువువాఁడు.

పాఠశాల. త్స. వి. బడి.

పాఠి. త్స. వి. పాఠకుఁడు.

పాడఱు. దే. క్రి. పాడుపడు.

పాడి. దే. వి. ౧. ధర్మము. ౨. వ్యవహారము. 3. న్యాయము.

పాడు. దే. క్రి. ౧. పాటపాడు. వి. ౨. పాటినేల. 3. విశ. శూన్యము.

**పాడునుయ్యి.** దే. వి. పాడుపడిన బావి.

**పాడుపడు.** } దే. క్రి. శూన్యమగు.
**పాడువాఱు.** }

**పాడె.** దే. వి. పీనుఁగును మోసికొని పోవుటకై కట్టినకట్టెవాహనము.

**పాడ్యమి.** దే. వి. ప్రతిపక్షమునందు వచ్చు మొదటి దినము.

**పాణసి.** దే. వి. మాల. (పాణసి పువ్వుఁబోఁడి.)

**పాణి.** త్స. వి. ౧. హస్తము. దే. వి. ౨. ముత్తెపునీరు.

**పాణింధమము.** త్స. వి. తిత్తి.

**పాణిగృహీత.** త్స. వి. ఉంపుడుకత్తె.

**పాణిగృహీతి.** త్స. వి. భార్య.

**పాణిగ్రహణము.** త్స. వి. పెండ్లి.

**పాణిపీడనము.** త్స. వి. పెండ్లి.

**పాణీకృతి.** త్స. వి. ,,

**పాతకము.** త్స. వి. మహాపాపము.

**పాతరలాడు.** దే. క్రి. నాట్యముచేయు.

**పాతాళము.** త్స. వి. క్రిందిలోకము.

**పాతిక.** దే.వి. ఒకటిలో నాల్గవభాగము.

**పాతివ్రత్యము.** త్స. వి. పతివ్రతాత్వము.

**పాత్రము.** త్స. వి. ౧. మంత్రి. ౨. యోగ్యము.

**పాథస్సు.** త్స. వి. జలము.

**పాథేయము.** త్స. వి. దారిబత్తెము. (అన్నము మొదలైనవి)

**పాథోధి.** త్స. వి. సముద్రము.

**పాదచారి.** త్స. వి. కాలిబంటు.

**పాదజుఁడు.** త్స. వి. శూద్రుఁడు.

**పాదపము.** త్స. వి. చెట్టు.

**పాదము.** త్స. వి. ౧. అడుగు. ౨. పద్యమునందలి యొక చరణము.

**పాదరసము.** దే. వి. పారదము.

**పాదాతము.** త్స. వి. కాలిబంటుల గుంపు.

**పాదాతికుఁడు.** త్స. వి. కాలిబంటు.

**పాదు.** దే. వి. ౧. చెట్టులోనగువానికి నీళ్లు పోయుటకు క్రింద కుదురుగాఁ జేసినపల్లము. ౨. నిలుకడ.

**పాదుక.** త్స. వి. పావకోళ్లు.

**పాదుకొను.** దే. క్రి. నెలకొను.

**పాదుసా.** దే. వి. రాజు.

**పాదుసాహి.** దే. వి. ,,

**పాద్యము.** త్స. విణ. పాదముకొఱకైనది. (జలము.)

**పానకము.** త్స. వి. ౧. బెల్లము నీరు.

**పానము.** త్స. వి. త్రాగుడుగిన్నియ.

**పానవట్టము.** దే. వి. లింగపీఠము.

**పానీయము.** త్స. వి. ౧. జలము. విణ. ౨. త్రాగఁదగినది.

**పానుపు.** దే. వి. ౧. పఱపు. ౨. మంచము.

**పాప.** దే. వి. ౧. శిశువు. ౨. కంటి నల్లగుడ్డులోని ప్రతిఫలనము

**పాపఁడు.** దే. వి. ౧. బాలుఁడు. ౨. మగబిడ్డ.

పాపట. దే. వి. ముత్తయిదువలు ముక్కునకు సూటిగ పైభాగమున వెండ్రుకల నడుమ చేసికొనుదారి.

పాపటబొట్టు. దే. వి. పాపట మొన లోఁ బెట్టు చేర్చుక్క.

పాపము. త్స. వి. దుష్కృతము.

పాపాత్ముఁడు. త్స. వి. పాపచిత్తుఁడు.

పాపి. త్స. వి.. పాపము కలవాఁడు.

పాపిష్ఠుఁడు. త్స. విణ. మిక్కిలిపాపి.

పాపు. దే. క్రి. పాయఁజేయు. (ఎడఁబాపు.)

పాపుఁడు. త్స. విణ. ౧. పాపి. ౨. అధముఁడు.

పాపోసు. దే. వి. ముచ్చె.

పామ, పామము. త్స. వి. గజ్జి.

పామనుఁడు. త్స. విణ. గజ్జిగలవాఁడు.

పామరుఁడు. త్స. వి. ౧. అజ్ఞుఁడు. ౨. నీచుఁడు.

పాము. దే. వి. ౧. సర్పము. క్రి. ౨. రుద్దు.

పాములవాఁడు. దే. వి. పామునుపట్టి ఆడించి దానివలన జీవించువాఁడు.

పాయ. దే. వి. ౧. చీలిక. ౨. ఒక నదిలోనుండి చీలి పారినది.

పాయకట్టు. దే. వి. ఒకపెద్దగ్రామము తోఁజేరిన పాళెములసమూహము.

పాయకారి. దే. వి. భాగప్రకారము భూస్వాతంత్ర్యము లేనిరైతు.

పాయకొమ్మ. దే. వి. పంగలకొమ్మ.

పాయగిల్లు. దే. క్రి. దొలఁగు.

పాయపోగు. దే. వి. పాపోసు.

పాయము. వై. వి. వయస్సు.

పాయవట్టము. దే. వి. కాలియందె.

పాయవాఱు. దే. క్రి. తొఱఁగు.

పాయసము. త్స. వి. పరమాన్నము.

పాయి. దే. వి. 'పాలు' నకు ఏకవచనము. (వాడుకలో "భాయి" అందురు.)

పాయు. దే. క్రి. ౧. తొలఁగు. ౨. చిక్కుడలు. 3. విడుచు.

పారంగతుఁడు. త్స. విణ. దరిఁజేరినవాఁడు.

పారంపరి. త్స. వి. పరంపర.

పారంపర్యము. త్స. వి. ౧. కులక్రమము. ౨. పరంపర.

పారగుఁడు. త్స. విణ. పారంగతుఁడు.

పారణ. / పారణము. } త్స. విణ. ఉపవాసముండి మఱునాఁడు చేయు భోజనము.

పారతంత్ర్యము. త్స. వి. పరాధీనత.

పారత్రికము. త్స. విణ. పరలోకమునకు సంబంధించిన.

పారదము. త్స. వి. పాదరసము.

పారదారికుఁడు. త్స. విణ. పరదారలనుగూర్చి పోవువాఁడు.

పారమార్థికుఁడు. త్స. విణ. పరమార్థబుద్ధిగలవాఁడు.

పారము. త్స. వి. ౧. ఆవలిదరి. ౨. సమీపము.

పారలౌకికము. త్స. విణ. పరలోక సంబంధమైనది.
పారవశ్యము. త్స. వి. పరవశత్వము.
పారశీకము. త్స. వి. ౧. ఒకానొక దేశము. ౨. ఆదేశమునందుఁ బుట్టిన గుఱ్ఱము. రూ. పారసీకము, పారసీకము.
పారసి. దే. వి. పారసీకదేశభాష.
పారాణి. దే. వి. సున్నము, పసుపు గలిసిన వస్తువు.
పారాణించు. దే. క్రి. సున్నము, పసుపులు గలుపుటవలన వచ్చు వస్తువుతో పాదముల నలంకరించు. రూ. పారాడించు.
పారాయణము. త్స. వి. ౧ అంతయు చదువుట. ౨. తుదనుపొందుట.
పారావతము. త్స. వి. పావురము.
పారావారము. త్స. వి. సముద్రము.
పారాశరి. త్స. వి. వ్యాసముని.
పారి. దే. వి. ౧. తడవ. ౨. మన్ను.
పారికాంక్షి. త్స. వి. సన్న్యాసి.
పారికాఁపు. దే. వి. పరిచరుఁడు.
పారిజాతము. త్స. వి. కల్పవృక్షము.
పారితోషికము. త్స.వి. బహుమానము.
పారు.
పారుకాఁడు. } దే. క్రి. పరుగెత్తు.
పారుపత్తెకాఁడు. దే. విణ. ౧. అధికారి. ౨. దొరతనమువారికి అచ్చవలసిన శిస్తుప వసూలుచేసెడు నధికారి.
పారుపత్తెము. దే. వి. ౧. దొరతనము వారికి అచ్చవలసిన సిస్తు వసూలు చేసెడి యధికారము. ౨. అధికారము.
పారువము. త్స. వి. పావురము.
పారుష్యము. త్స. వి. ౧. కఠినపుమాట. ౨. పరుసఁదనము.
పార్థక్యము. త్స. వి. పృథగ్భావము.
పార్థివ. త్స. వి. అఱువది సంవత్సరములలో ఒకటి.
పార్థుఁడు. త్స. వి. ౧. రాజు. ౨. అర్జునుఁడు.
పార్పత్తెము. త్స. వి. పారుపత్తెము.
పార్వణము. త్స. విణ. పర్వసంబంధమైనది.
పార్వతి. త్స. వి. గౌరి. వ్యు. పర్వతమునకు కూఁతురు.
పార్శ్వము. త్స. వి. ౧. ప్రక్క. ౨. సమీపము.
పాఱ. దే. వి. త్రవ్వట కుపయోగపడెడి పనిముట్టు.
పాఱఁజూచు. దే. క్రి. దృష్టించి చూచు.
పాఱఁదోలు. దే. క్రి. తఱుము.
పాఱఁబోయు. దే. క్రి. కుమ్మరించు.
పాఱవేయు. దే. క్రి. ౧. విసరవేయు. ౨. వదలవిడుచు.
పాఱవైచు. దే. క్రి. విసరవేయు.
పాఱాడు. దే. క్రి. దోఁగాడు.

పాఱు. దే. క్రి. ౧. పరుగెత్తు. ౨. ప్రవహించు.
పాఱుఁడు. దే. వి. బ్రాహ్మణుఁడు.
పాఱుఁబోతు. దే. విణ. పిఱికి.
పాఱుటక్క. దే. వి. బ్రాహ్మణ స్త్రీ.
పాఱుడు. దే. వి. ప్రవాహము.
పాఱుత. దే. వి. బ్రాహ్మణి.
పాఱుతెంచు. దే. క్రి. ౧. పరుగెత్తి వచ్చు. ౨. ప్రవహించు.
పాఱువేఁట. దే. వి. దేవోత్సవము.
పాలకాయ. దే. వి. భక్ష్యవిశేషము.
పాలకి.
పాలకీ. } దే. వి. చూ. పల్లకి.
పాలకుఁడు. త్స. విణ. రక్షించువాఁడు.
పాలగచ్చు. } దే. వి. సన్నసున్నపుఁ
పాలగారర. } బూఁత.
పాలడ. దే. వి. బిడ్డలకు పాలుపోసెడి చిన్న శంఖము.
పాలనము. త్స. వి. రక్షణము.
పాలపండ్లు. దే. వి. పుట్టుదంతములు.
పాలవాఁగు. దే. వి. పాలసముద్రము.
పాలసుఁడు. దే. వి. ౧. మూర్ఖుఁడు. ౨. దుర్జనుఁడు.
పాలసున్నము. దే. వి. చూ. పాలగచ్చు.
పాలాడు. దే. క్రి. ఖండించు.
పాలార్చు. దే. క్రి. ఉపేక్షించు.
పాలించు. త్స. క్రి. కాపాడు.
పాలిండ్లు. దే. వి. బ. స్తనములు.
పాలిక. త్స. వి. పెండ్లిండ్లలో తొమ్మిది ధాన్యములు పోసెడి శరావ విశేషము.
పాలికాపు. దే. వి. భాగస్థుఁడు.
పాలిచుట్టము. దే. వి. పాలివాఁడు.
పాలివాఁడు. దే. వి. ౧. జ్ఞాతి. విణ. ౨. భాగస్థుఁడు.
పాలు. దే. వి. ౧. క్షీరము. ౨. భాగము. 3. వంతు. ४. క్రి. తెల్లనగు. (వాని మొగము పాలినది.)
పాలుగొను. దే. క్రి. పంచుకొను. రూ. పాల్గొను.
పాలుపడు. దే. క్రి. ౧. స్వాధీనమగు. ౨. పూనుకొను. రూ. పాల్పడు.
పాలుపోవు. దే. వి. నిర్ణీతసుగు.
పాలుమాలిక. దే. వి. చూ. ప్రాలుమాలిక. పాల్మాలిక.
పాలుమాలు. దే. క్రి. చూ. ప్రాలుమాలు. పాల్మాలు.
పాలుపెట్టు. దే. క్రి. ౧. భాగించు. ౨. నిర్ణయించు.
పాలేరు. దే. వి. మేడిపాలికి దున్నడు-మడక.
పాలేఱు. దే. వి. సముద్రము.
పావంచ. దే. వి. మెట్టు.
పావకుఁడు. త్స. వి. అగ్ని.
పావకోళ్లు. దే. వి. బ. కొయ్యతో చేసిన పాదరక్షలు.

పావటీలు. దే. వి. మెట్లు.
పావడ. దే. వి. ౧. స్త్రీలు మొలఁ గట్టుకొనెడి వస్త్రవిశేషము. ౨. ధౌతవస్త్రము.
పావనము. త్స. విణ. ౧. పవిత్రము. వి. ౨. జలము.
పావని. త్స. వి. ౧. భీముఁడు. ౨. హనుమంతుఁడు.
పావలు. దే. వి. పావుకోళ్ళు.
పావి. దే. వి. పాపి.
పావు. దే. వి. నాల్గవభాగము.
పావురము. } దే. వి. పారావతము.
పావురాయి. }
పావులా. దే. వి. రూపాయిలో నాల్గవ భాగము.
పాశము. త్స. వి. త్రాడు.
పాశి. త్స. వి. వరుణుఁడు. విణ. పాశధరుఁడు.
పాశుపతము. త్స. వి. ౧. పశుపతి దైవతముగల అస్త్రము. ౨. పశుపతి మతము.
పాశుపాల్యము. త్స. వి. గోమహిష్యాది పోషణవృత్తి.
పాశ్చాత్యుఁడు. త్స. విణ. ౧. పడమటివాఁడు. ౨. వెనుకటివాఁడు.
పాషండము. త్స. వి. ఒక మతము.
పాషండుఁడు. త్స. వి. వేదబాహ్యుఁడు.
పాషాణము. త్స. వి. రాయి.
పాసనము. దే. వి. విరేచనము.
పాసిక. దే. వి. పాచిక.
పాసెము. త్స. వి. పాయసము.
పాళెము. దే. వి. ౧. సమయము. ౨. బంగారులోనగు వానికడ్డి. 3. కొలది.
పాళి. త్స. వి. ౧. గురుతు. ౨. వరుస. 3. (సమూహము.)
పాళియ. దే. వి. పాళె.
పాళియము. దే. వి. పాళెము.
పాళెగాఁడు. దే. వి. పాళెముపట్టుదొర.
పాళెము. దే. వి. ౧. పాళెగానిపట్టణము. ౨. చిన్నపల్లియ. 3. దండు విడియుచోటు.

## పి

పింగటించు. దే. వి. అతిశయముగ మాటలాడు. రూ. పింగళించు.
పింగళము. త్స. విణ. గోరోజనమువంటి వర్ణముగలది.
పింగాణి. దే. వి. ఒకదనుసు తెల్ల మట్టి పాత్రము.
పించియము. } వై. వి. నెమిలిపురి.
పించెము. }
పింఛము. త్స. వి. „
పింజించు. దే. క్రి. ౧. పింజెపోయు. ౨. నీళ్లుచిమ్ము.
పింజె. దే. వి. ౧. ముందు చెక్కుకొనెడు వస్త్రపురుచ్చు. ౨. వెనుక చెక్కుకొను దోవతికొంగు.

పింజే. దే. వి. ౧. దూదేకువిల్లు. ౨. పుంఖము.

పింజినగోవి. దే. వి. చిమ్మనగ్రోవి.

పింజారి. దే. వి. దూదేకులవాఁడు.

పింఠ. త్స. వి. విటజనాశ్రయము.

పిండము. త్స. వి. ౧. బ్రతుకుతెరువు. ౨. అన్నపు పిడుచ.

పిండి. దే. వి. ఓయ్యము, గోధుమ లోనగువాని పొడి.

పిండిమిరియము. దే. వి. పులుసు చేర్పక పలుచగా వండిన వ్యంజన విశేషము.

పిండిలి. దే. వి. ముద్ద.

పిండివంట. దే. వి. ౧. భక్ష్యము. ౨. అప్పము లోనగు నపూపము.

పిండు. దే. వి. ౧. సమూహము. క్రి. ౨. పాలుపితుకు. 3. రసము పిడుచు.

పిండుగట్టు. దే. క్రి. గుంపుగట్టు.

పిందియ. ) దే. వి. కాయ అగుటకు
పిందె. ) ముందటిది.

పింపిసలాడు. దే. క్రి. నర్తించు.

పింపిళ్లాడు. దే. క్రి. నర్తించు.

పింపిళ్లుగూయు. దే. క్రి. నర్తించు.

పికపికలు. దే. విశ. చెల్లాచెదరు.

పికము. త్స. వి. కోయిల.

పిక్క. దే. వి. తొడ.

పిక్కటిల్లు. దే. క్రి. ౧. నిండు. ౨. అతిశయించు. 3. పిగులు.

పిక్కు. దే. క్రి. ౧. వెనుదీయు. ౨. వంచించు. వి. ౧. మర్మము. ౨ వంచన.

పిగులు. దే. క్రి. వస్త్రము లోనగునది బిగువుచే చినుగు.

పిచండిలుఁడు. త్స. విశ. పెద్దపొట్ట వాఁడు.

పిచ్చి. దే. వి. వెఱ్ఱి.

పిచ్చిక. దే. వి. ఊరఁబిచ్చిక. (చూ పిచ్చుక.)

పిచ్చికకుంటు. దే. వి. ౧. అనూరుఁడు. విశ. కాళ్ళులేనివాఁడు. (చూ) పిచ్చుకకుంటు.

పిచ్చిల్లు. దే. క్రి. చిప్పిల్లు అనువాని రూపాంతరము.

పిచ్చివాఁడు. దే. విశ. పిచ్చిపట్టిన వాఁడు.

పిచ్చె. దే. విశ. హీనము. వి. పిచ్చి.

పిచ్చలించు. దే. క్రి. ౧. అతిశయించు. ౨. ప్రకాశించు.

పిచ్చె. దే. వి. జంతువులకడుపు లోని పిత్తకోశము.

పిచ్చుక. దే. వి. చూ. పిచ్చిక.

పిచ్చుకకుంటు. దే. వి. ౧. అనూరుఁడు. ౨. కాళ్ళులేనివాఁడు.

పిచ్చుకుంటు దే. వి. ,,

పిచ్ఛము. త్స. వి. నెమిలిపింఛము.

పిచ్ఛిలము. త్స. విశ. ౧. పేఁడి. ౨. మీఁగడగట్టినది.

పిటకము. త్స. వి. ౧. కురుపు. ౨ చిన్నపెట్టె. 3. గంప.

పిట్ట. దే. వి. పక్షి.

పిట్టపిడుగు. దే. అవ్య. అనివార్యము.

పిడ. దే.వి. ౧. కత్తి పరుజు లోనగుదాని. ౨. పిడికిలి.

పిడికిలి. దే. వి. ముష్టి.

పిడికిలించు. దే. క్రి. పిడికటఁ బట్టు.

పిడికోల. దే. వి. నాగేలి లోనగువాని మేడి.

పిడికంట. దే. వి. నిడుపుపిడిగల[illegible].

పిడెయము. దే. వి. బాఁకు.

పిడివాటు. దే. వి. ౧. పనకట్లలను చేఁకోలంది నెత్తి గింజలు రాల కొట్టుట. ౨. ఒడ్డా[illegible].

పిడివాదము. దే. వి. మొండివాదము.

పిడిసాన. దే. వి. వడ్లవాఁడును, జాళ్లపనివాఁడును; కొయ్యలకును, జాళ్లకును, బెజ్జము త్రొల్చెడి సాధనము.

పిడుఁచు. } దే. వి. పశువుల దేహమందుఁ జేరి రక్తము పీల్చెడిజంతువు.
పిడుఁదు. }

పిడుక. దే. వి. పిసికి పిడుచుగా చేసి తట్టి యెండఁ బెట్టిన పేడ.

పిడుగు. దే. వి. అశని. రూ. పిడ్గు.

పిడుచ. దే. వి. అన్నము లోనగువాని ముద్ద.

పిడుచు. దే. క్రి. రసము లోనగువాని పిండు.

పిడుత. దే. వి. చిన్నదుత్త.

పిడెము. దే. వి. బాఁకు.

పిణ్యాకము. త్స. వి. తెలికపిండి.

పిత. } త్స. వి. తండ్రి.
పితర. }
పితరుఁడు. }

పితలాటకము. } దే. వి. మోసము.
పితలాటము. }

పితామహుఁడు. త్స. వి. ౧. తండ్రి తండ్రి. ౨. బ్రహ్మ. (స్త్రీ. పితామహి.)

పిత్రాళ్లు. దే. వి. పితరులు.

పితుకు. దే. క్రి. పాలుపిండు. రూ. పిదుకు.

పితూరి. దే. వి. రాజద్రోహము.

పితృపతి. త్స. వి. యముఁడు.

పితృవనము. త్స. వి. శ్మశానము.

పితృవ్యుఁడు. త్స. వి. తండ్రితోడఁ బుట్టినవాఁడు.

పిత్తము. త్స. వి. ధాతువిశేషము.

పిత్తు. దే. వి. ౧. అపానవాయువు. క్రి. ౨. అపానవాయువు విడుచు.

పిత్ర్యము. త్స. విణ. తండ్రిది.

పిదప. దే. వి. వెనుక: విణ. వెనుకటిది.

పిదపిద. దే. విణ. ౧. అనువు. ౨. మృదువు.

పిదిపిదన. దే. వి. ౧. అనువుఁదనము. ౨. మృదుత్వము.

పిదుకు. దే. క్రి. చూ. పితుకు.

పిధానము. త్స. వి. మఱుఁగు.

పిన. దే. విణ. చూ. పిన్న.

పినద్ధము. త్స. విణ. కట్టఁబడినది.

పినాకము. త్స. వి. శివునివిల్లు.

పినాకి. త్స. వి. శివుఁడు.

పినుఁగు. దే. వి. ౧. పేటుకాఁడు. ౨. లుబ్ధుఁడు.

పిన్న. దే. విణ. చిన్న. రూ. పిన.

పిన్నటివాఁడు. } దే. వి. చిన్నవాఁడు.
పిన్నవాఁడు. }

పిన్నపాప. దే. వి. కన్యక.

పిన్నతికము. దే. వి. చిన్నతనము.

పిపాస. త్స. వి. దప్పి.

పిపాసితుఁడు. త్స. విణ. దప్పిగొన్నవాఁడు.

పిపాసువు. త్స. విణ. నీరు త్రాగఁ గోరినవాఁడు.

పిపీలిక. త్స. వి. చీమ. రూ. పిపీలి.

పిప్పలము. త్స. వి. రావి.

పిప్పి. దే. వి. ఆకు మొదలగువానిని నలిపి రసము పోఁగా పోయిన శేషము.

పిప్పిక. దే. వి. పన్నుపాచి.

పిప్పిరి. దే. వి. పిప్పి.

పిమ్మట. దే. వి. ౧. మనోవ్యథ. అవ్య. ౨. అనంతరము. 3. పరోక్షమందు.

పిర. దే. వి. కానిలో నాల్గవభాగము.

పిరంగి. } దే. వి. సిపాయీలు యుద్ధము చేయునపుడు మందు గుండు వేసి గొట్టించు కాల్చెడి యినుపక్రోవి.
పిరంగీ. }

తుపాకికిడుపునఁ బిరంగి పుట్టు = వీరుఁడైన తండ్రికి వీరాధివీరుఁడు గలుగు.

పిరి. దే. వి. ౧. మెలి. ౨. వెంటి.

పిరిగొను. దే. క్రి. ౧. మెలిపెట్టు. ౨. పెనఁగొను.

పిరువీఁకు. దే. వి. పీఁకులాట.

పిరువీఁకులాడు. దే. క్రి. పెనఁగులాడు.

పిరువీఁకుసేయు. దే. క్రి. పీఁకులాడు.

పిర్వీఁకు. దే. వి. పిరువీఁకు.

పిఱికి. దే. విణ. భయశీలుఁడు.

పిఱికితనము. దే. వి. అధైర్యము.

పిఱుఁదు. దే. వి. ౧. మొలకు వెనుకటి భాగము. ౨. వెనుక.

పిఱుఁదుకొను. దే. క్రి. వెంబడించు.

పిఱుతివియు. } దే. క్రి. వెనుదీయు.
పిఱుతివుచు. }
పిఱుదీయు. }

పిఱువడు. దే. క్రి. వెనుదీయు.

పిఱువెట్టు. దే. క్రి. అనాదరించు.

పిఱువోవు. దే. క్రి. వెనుదీయు.

పిఱుసను. దే. క్రి. వెనుదీయు.

పిఱ్ఱ. దే. వి. పిఱుఁదు.

పిలపిల. దే. వి. వచ్చుటలోను, పోవుటలోను, వెక్కిరించుటలోను, అయ్యెడి ధ్వన్యనుకరణము.

పిలుకుమారు. దే. క్రి. పెచ్చు.

పిలుకుమార్చు. దే. క్రి. పెంచు. రూ. పిల్కుమార్చు.

పిలుకునగాలు. దే. క్రి. పెచ్చు.

పిలుకునాల్చు. దే. క్రి. పెంచు.

పిలుచు. దే. క్రి. ఆహ్వానించు.

పిలుపు. } దే. వి. ఆహ్వానము.
పిలుపుడు. }

పిల్ల. దే. వి. ౧. ఆఁడుపడుచు. ౨. పక్షి లోనగువాని సంతతి. 3. విణ. చిన్న.

పిల్లఁగ్రోలు. } దే. వి. ౧. పిల్లనగ్రోవి.
పిల్లఁగ్రోవి. } ౨. మురళి.

పిల్లకాయ. } దే. వి. బాలుఁడు.
పిల్లగాఁడు. }

పిల్లజుట్టు. దే. వి. బాలురముందటిసిగ.

పిల్లనగ్రోలు. } దే. వి. చూ. పిల్లగ్రోవి.
పిల్లనగ్రోవి. }

పిల్లపిరియము. దే. విణ. బాలుఁడయ్యు మేధావంతుఁడు.

పిల్లమెఱము. దే. వి. తలక్రిందుగా వేసెడులాఁగు.

పిల్లాఁడి. } దే.వి. ఆఁడుదాని కాలి నాలుగవవ్రేలియందలియాభరణము.
పిల్లాణి. }

పిల్లి. దే. వి. మార్జాలము.

పిల్లిగడ్డ. దే. వి. పునుగుచట్టము.

పిల్లేరుగంతు. దే. వి. తల్లక్రిందుగా వేసెడిలాఁగు.

పిశాచము. త్స. వి. ౧. దయ్యము ౨. పిల్లి.

పిశాచి. త్స వి. స్త్రీ పిశాచము.

పిశితము. త్స. వి. మాంసము.

పిశునుఁడు. త్స. విణ. ౧. కొండెగాఁడు. ౨. దుష్టుఁడు.

పిష్టకము. త్స. వి. పిండి.

పిష్టపచనము. త్స. వి. బాణలి.

పిష్టము. త్స. వి. పిండి.

పిష్టాతకము. త్స. వి. బుక్కాము.

పిసక. దే. తలవెండ్రుకలయందు చెమటచే బందన గొనుముతిక.

పిసరు. దే. వి. ౧. లేశము. ౨. మలము.

పిసాసి. వై. వి. పిశాచము.

పిసాళము. దే. వి. ౧. కాంతి. ౨. గాలి.

పిసాళి. దే. విణ. ౧. ప్రకాశముగలది. ౨. వ్యసనముగలది. 3. దొంగయెత్తుగలది.

పిసాళించు. దే. క్రి. ౧. పరిమళించు. ౨. వ్యాపించు. 3. ప్రకాశించు.

పిసికిళ్ళు. దే. వి. పసుకుటులు.

పిసికిడి. దే. విణ. పిసిని.

పిసినారి. దే. విణ. లోభి.

పిసిని. దే. విణ. పసినివాఁడు.

పిసినిగొట్టు. దే. వి. పిసినారి.

పిసుకు. దే. క్రి. మర్దించు.

పిహితము. త్స. విణ. మూయఁబడినది.

పిళ్ళారి. దే. వి. వినాయకుఁడు.

పీ

పీఁకు. దే. క్రి. ౧. పెఱుకు. ౨. తీసివేయు.

పీఁకులాఁడు. దే. క్రి. మిక్కిలి వెనుకాడు.

పీఁకులాట. దే. వి. పీకులాడుట.

పీకులాఁడు. దే. క్రి. వెనుగులాఁడు.

పీఁక. దే. వి. ౧. నాగసరము లోనగువాని మూతిలో చొనిపెడు క్రోవి పుల్ల. ౨. త్రాగిమిగిలిన పొగచుట.

పీఁచెము. దే. వి. పింఛము.
పీఁచెమడంచు. దే. క్రి. చంపు.
పీఁచు. దే. వి. గూఁడువలెఁ బెరిఁగిన నార.
పీఁట. దే. వి. కూర్చుండెడు పలక.
పీఁటవెట్టు. దే. క్రి. ఒకచోటనే పొరుకొనియుండు.
పీఠము. త్స. వి. పీఁట.
పీఠి. త్స. వి. ,,
పీఠిక. త్స. వి. గ్రంథముపుట్టు పూర్వోత్తరము తెలుపువ్రాఁత.
పీడ. త్స. వి. ౧. బాధ. ౨. కరుణ. 3. సిగ.
పీడనము. త్స. వి. పరులచేఁ గలుగు రాయిడి.
పీడించు. త్స. క్రి. బాధించు.
పీడితము. త్స. విణ. బాధింపఁబడినది.
పీతము. త్స. విణ. పసుపువర్ణము కలది.
పీతాంబరుఁడు. త్స. వి. ౧. విష్ణువు. విణ. ౨. పీతవస్త్రము కలవాఁడు.
పీతరిగుంట. దే. వి. మురికిగుంట.
పీనము. త్స. వి. బలిసినది.
పీనసము. త్స. వి. పడిసెము.
పీనాహము. త్స. వి. తాగాడి.
పీనుఁగు. దే. వి. ప్రాణము పోయిన బొందు.
నడపీనుఁగు = నడచునట్టి పీనుఁగు (జీవచ్ఛవము.)
పీయి. దే. వి. మలము.
పీయూషము. త్స. వి. అమృతము.
పీల. దే. వి. బక్క.
పీలి. దే. వి. ౧. పక్షి విశేషము. ౨. ఓడముక్కాను.
పీలిక. దే. వి. గుడ్డయొక్క తునుక.
పీలుచు. దే. క్రి. ౧. జుఱ్ఱు. ౨. ఊపిరి బిగబట్టి ముక్కుపొడిని ముక్కులోనికి గైకొను.
పీవరము. త్స. విణ. ౧. బలిసినది. ౨. క్రొవ్వినది.

ఉ

పుంఖము. త్స. వి. ౧. బాణముక్రింద చివర. ౨. పింజ.
పుంఖితము. త్స. విణ. పుంఖాను పుంఖముగాఁ జేయఁబడినది.
పుంగవము. త్స. వి. ఎద్దు.
పుంగవుఁడు. త్స. వి. శ్రేష్ఠుఁడు.
పుంజము. త్స. వి. రాశి.
పుంజీభవించు. త్స. క్రి. రాశిపడు.
పుంజు. దే. వి. మగకోడి.
పుంజుకొను. దే. క్రి. కోలుకొను.
పుండరీకము. త్స. వి. ౧. తెల్లఁదామర. ౨. బెబ్బులి.
పుండు. దే. వి. వ్రణము.
పుండ్రము. త్స. వి. నలుపుగలిసిన ఎఱ్ఱ చెఱకు.
పుంత. దే. వి. పసుల రాకపోకలచే ఊరిముందఱ ఏర్పడినదారి.
పుంభావము. త్స. వి. పౌరుషము.

పుంశ్చలి. త్స. వి. ఱంకుటాలు.
పుకిలించు. దే. క్రి. చూ. పుక్కిలించు.
పుకిలింత. దే. వి. చూ. పుక్కిలింత.
పుక్కిలి. దే. వి. బుగ్గలోపలిభాగము.
పుక్కిలించు. దే. క్రి. నీళ్లు లోనగు వాని నుమియు.
పుక్కిలింత. దే. వి. పుక్కిలించుట.
పుచ్చె. దే. వి. తలపుర్రె.
పుచ్చడీక. దే. విణ. సిగ్గరి.
పుచ్చు. దే. క్రి. ౧. పుచ్చిపట్టు. ౨. పంపు. 3. గ్రహించు.
పుచ్చుకొను. దే. క్రి. ౧. గ్రహించు. వి. ౨. పుచ్చుకోలు.
పుచ్ఛము. త్స. వి. తోక.
పుటపుట. దే. వి. అదురుటయందగు ధ్వనికనుకరణము.
పుటపుటన. దే. విణ. అధికము.
పుటపుటగు. దే. క్రి. పరివృద్ధమగు.
పుటభేదనము. త్స. వి. ౧. ఏటి వంపు. ౨. పట్టణము. వ్యు. పుటము లనఁగా ఘటాదులు;అవి వీనియందు ఒరయుటవలన వ్రక్కలగును.
పుటము.త్స. వి. ౧. దొప్ప. ౨.గుఱ్ఱపు కాలిగొరిజ.
పుటముబ్బు. దే. క్రి. మీఁదికుబ్బు.
పుటమెగయు. దే. క్రి. మీఁదికెగయు.
పుటి. త్స. వి. ౧. పూలబుట్ట. ౨. దొప్ప.
పుటిక. దే. వి. గంప. రూ. పుట్టిక.

పుటుక్కు. దే. వి. తెగుటలో నయ్యెడి ధ్వన్యనుకరణము.
పుట్ట. దే. వి.౧.చిన్నపొద.౨.వల్మీకము.
పుట్టగొడుగు. దే. వి. పుట్టయందు తెల్లగా గొడుగువలె మొలచునది.
పుట్టగోచి. దే. వి. పెద్దకౌపీనము.
పుట్టచెండు. దే. వి. ఎగురవేయు గుడ్డ బంతి.
పుట్టతేనె. దే. వి. పుట్టలో పెట్టిన పెరతేనె.
పుట్టతేలు. దే. వి. మండ్రగబ్బ.
పుట్టము. దే. వి. వస్త్రము.
పుట్టి. దే. వి. ౧. మానవిశేషము. ౨. పేములతో పెద్దగంటవలె అల్లి మీఁద తోలు కప్ప కుట్టఁబడిన యేఱుదాటెడు సాధనము.
పుట్టిక. దే. వి చూ. పుటిక.
పుట్టినిల్లు. దే. వి. మాతృగృహము.
పుట్టిల్లు. దే. వి. పుట్టినిల్లు.
పుట్టు. దే. క్రి. ౧. జన్మించు, వి. ౨. జన్మము.
పుట్టుక. } దే. వి. జన్మము.
పుట్టుగు. }
పుట్టుమచ్చ. దే. వి. పుట్టుక మొదలు దేహమునందుండెడి నల్లబొట్టు.
పుట్టువు. దే. వి. పుట్టుక.
పుట్టెల్లు. దే. వి. పుట్టిల్లు
పుడమి. దే. వి. నేల.
పుడమిఱేఁడు. త్స. వి. రాజు.

పుడికిరించు. దే. క్రి. చూ. పుణికిరించు. వి. పుడికిరింత.
పుడిసిలి. దే. వి. కుడియఁ బట్టినచేరలో సగము.
పుడిసిలించు. దే. క్రి. ౧. పుడిసిటఁ బట్టు. ౨. వి. పుడిసిలింత.
పుడుక. దే. వి. ౧. పుల్ల. ౨. కట్టె పుల్ల.
పుడుకు. దే. క్రి. ౧. కొంచెముగా నిచ్చు. ౨. ఇచ్చు.
పుడుకుఁగల్లు. దే. వి. చింతామణి.
పుడుకుకోడుకు. దే. వి. కామధేనువు.
పుడుకుమ్రాను. దే. వి. కల్పవృక్షము.
పుణికిరించు. దే. క్రి. ౧. కొంచెముగా నిచ్చు. ౨. (సన్నిపాత దోషముచే) గహించు.
పుణికిరింత. దే. వి. పుణికిరించుట.
పుణుఁకులు. దే. వి. భక్ష్యవిశేషము.
పుణ్యభూమి. త్స. వి. హిమవత్పర్వతమునకును, వింధ్యపర్వతమునకును నడుమనుండు నేల.
పుణ్యము. త్స. వి. ౧. సుకృతము. ౨. ధర్మము విణ. 3. మనోజ్ఞము. ౪. పవిత్రము.
పుణ్యవంతుఁడు. త్స. విణ. ౧. సుకృతి. ౨. ధార్మికుఁడు.
పుణ్యాత్ముఁడు. త్స. విణ. పుణ్యస్వభావుఁడు.
పుణ్యాహము. త్స. వి. పుణ్యదినము.
పుణ్యాహవాచనము. త్స. వి. ఒకానొక శుభకర్మము.
పుతిప్రతిపోవు. దే. క్రి. వివశమగు.
పుత్తడి. } దే. వి. అపరంజి.
పుత్తళి. }
పుత్తళిక. త్స. వి. బొమ్మ.
పుత్తెంచు. దే. క్రి. పంచు.
పుత్రిక. త్స. వి. ౧. కూఁతురు. ౨. పుత్తళిక.
పుత్త్రుఁడు. త్స. వి. కొడుకు.
పుదియబొట్టు. దే. వి. ఊర్ధ్వపుండ్రము.
పునర్నవము. త్స. వి. గోరు.
పునర్భవు. త్స. విణ. మాఱుమనువు.
పునర్వసు. త్స. వి. ఒకానొక నక్షత్రము.
పునశ్చరణము. త్స. వి. మంత్రముయొక్క పునః పునః పఠనము.
పునాది. దే. వి. ఇల్లుకట్టుటకై పెట్టు గోడ నడుగున భూమిలో లోతుగా త్రవ్వి పెట్టుగోడ.
పునీతుఁడు. త్స. వి. పవిత్రుఁడు.
పునుఁగు. దే. వి. గంధ ద్రవ్యము.
పునుఁగుపిల్లి. దే. వి. పునుఁగు తీసెడిపిల్లి.
పునుక. దే. వి. కపాలము.
పునెము. వై. వి. చూ. పున్నెము.
పున్నమ. వై. వి. పౌర్ణమి.
పున్నాగము. త్స. వి. సురపొన్న.
పున్నియము. } వై. వి. సుకృతము.
పున్నెము. } రూ. పునెము.

పుష్పము. వై. వి. పుష్పము.
పుప్పించు. దే. క్రి. పుచ్చు.
పుప్పొడి. దే. వి. పుష్పములయందలి ధూళి.
పుబ్బ. త్స. వి. ఒకానొక నక్షత్రము.
పుమాంసుఁడు. త్స. వి. మానిసి.
పుయిలోటు. దే. వి. సంకోచము. రూ. పుయిలోటము.
పుయిలోడు. దే. క్రి. సంకోచించు.
పురందరుఁడు. త్స. వి. ఇంద్రుఁడు. వ్యు. శత్రు పురముల వ్రక్కలించినవాఁడు.
పురంధ్రి. త్స. వి. సాధ్వియగు స్త్రీ.
పురడించు. / పురణించు. దే. క్రి. ౧. విజృంభించు. ౨. వర్ధిల్లు.
పురపుర. దే. వి. పొక్కుటయందయ్యెడి ధ్వన్యనుకరణము.
పురపురలాడు. దే. క్రి. మిక్కిలికోరు.
పురము. త్స. వి. ౧. పట్టణము. ౨. ఇల్లు.
పురస్కరించు. త్స. క్రి. ౧. ముందిడుకొను. ౨. పూజించు.
పురస్కారము. త్స. వి. ౧. పూజనము. ౨. ముందిడుట.
పురస్సరుఁడు. త్స. విశే. ముందు నడచువాఁడు.
పురాకృతము. త్స. విశే. పూర్వజన్మమునందుఁ జేయఁబడినది.
పురాణము. త్స. వి. ౧. సర్గము. ప్రతిసర్గము. వంశము. మన్వంతరము. వంశానుచరితము ఈ యైదులక్షణములతోఁ గూడిన గ్రంథము. ౨. విశే. పురాతనమైనది.
పురాణించు. త్స. క్రి. ౧. పురాణము చెప్పు. ౨. వర్ధిల్లు. ౩. విజృంభించు.
పురాతనము. త్స. వి. బహుదినముల నాఁటిది.
పురాయించు. దే. క్రి. ౧. వర్ధిల్లు. ౨. విజృంభించు.
పురి. దే. వి. ౧. మెలి. త్స. వి. ౨. పట్టణము.
పురికొను. దే. క్రి. కవియు.
పురివిచ్చు. దే. క్రి. ౧. వేఱుపడు ౨. సాయు.
పురీషము. త్స. వి. మలము.
పురుగు. దే. వి. కీటకము. రూ. పురువు.
పురిటిరాలు. / పురుటాలు } దే. వి. బాలెంతరాలు.
పురుటిల్లు. దే. వి. ప్రసవించిన యిల్లు.
పురుడించు. దే. క్రి. ౧. పోలికయగు. ౨. పోలు.
పురుడు. దే. వి. ౧. జాతాశౌచము. ౨. జాతాశౌచసమయము. ౩. సమూహము.
పురువు. దే. వి. చూ. పురుగు. రూ. పుర్వు.
పురుషకారము. త్స. వి. పురుష ప్రయత్నము.

పురుషము. త్స. వి. ౧. క్రియలమీఁది విధకర్తల సంజ్ఞ. ౨. శాస్త్రము.
పురుషాయితము. త్స. వి. ఉపరతి.
పురుషార్థము. త్స. వి. పురుషప్రయోజనము.
పురుషుఁడు. త్స. వి. ౧. పరమాత్మ. ౨. మనుష్యుఁడు.
పురుషోత్తముఁడు. త్స. వి. విష్ణువు.
పురుహూతుఁడు. త్స. వి. ఇంద్రుఁడు.
పురె. } దే. అవ్య. ప్రశంసార్థకము.
పురే. }
పురోగముఁడు. త్స. విణ. పురస్సరుఁడు.
పురోగామి. త్స. వి. ,,
పురోడాశము. త్స. వి. యజ్ఞార్థమైన అపూపము.
పురోధసుఁడు. త్స. వి. పురోహితుఁడు.
పురోభాగి. త్స. విణ. ఎప్పుడును (గ్రంథములలోఁ) దప్పులు పట్టువాఁడు.
పురోహితుఁడు. త్స. వి. శుభాశుభకర్మములు చేయించు నాచార్యుఁడు.
పుఱియ. } దే. వి. పుచ్చె.
పుఱ్ఱియ. }
పుఱ్ఱి. దే. వి. ఎడమ. (పుఱ్ఱిచెయ్యి.)
పుఱ్ఱు. దే. వి. పలుచనిమలము.
పుఱ్ఱె. దే. వి. పుఱుక.
పులకండము. దే. వి. కండచక్కెర.
పులకరము. దే వి. ౧. గగుర్పాటు. ౨. జ్వరము.
పులకరించు. దే. క్రి. గగుర్పొడుచు.
పులకలు. త్స. వి. గగుర్పాటు.
పులకించు. త్స. క్రి. గగుర్పాటు కలదియగు.
పులగము. దే. వి. పెసరపప్పుచేర్చి వండినయన్నము.
పులపాడుచు. దే. క్రి. రెప్పవేయక చూచు.
పులసరము. దే. వి. పాకము చెడుటచేఁ గలిగిన పులుసు.
పులసరి. దే. విణ. గర్విష్ఠుఁడు.
పులాకము. త్స. వి. మెదుకు (స్థాలీపులాక న్యాయము.)
పులి. దే. వి. వ్యాఘ్రము.
పులికడుగు. దే. వి. పులిసిన కడుగు నీరు.
పులికూడు. దే. వి. పులిసినఅన్నము.
పులిగోరు. దే. వి. వ్యాఘ్రమునఖము.
పులిజూదము. దే. వి. ఒకానొక జూదము.
పులిత్రేఁపు. దే. వి. అజీర్ణమైనపుడు వచ్చుత్రేఁపు.
పులినము. త్స. వి. ఇసుకతిన్నె.
పులినీరు. దే. వి. రక్తము విఱిగి గాయములోఁ గాఱెడు నీరు.
పులిపిరి. } దే. వి. దేహమునందు మిరియమువలె పొటమరించు దుర్మాంసవిశేషము.
పులిపిరికాయ. }
పులిపులి. }
పులిపులికాయ. }

పులిమిపుచ్చు. దే. క్రి. నేర్పుకగాఁ బోనిచ్చు.

పులియ. దే. వి. విస్తరాకు.

పులియఁబాఱు. } దే. క్రి. పుల్లఁగు.
పులియు. }

పులియోర. దే. వి. పులుసును మంచి నూనెయును గలిపిన యన్నము. రూ. పులిహోర.

పులు. దే.వి..౧ముటికి.విణ. .౨అల్పము. (పులుమానిసి.)

పులుఁగు. దే. వి. పక్షి.

పులుఁగురాయి. దే. వి. గారుత్మతము.

పులుకాసిపులుఁగు దే. వి. చిలుక.

పులుకు పులుకు. దే.వి. రెప్పలు మూసి మూసి తెఱచుచు చూచుటయందగు ధ్వనికనుకరణము.

పులుగాకు. దే. వి. ఉపద్రవము.

పులుగు. దే. వి. జాడ.

పులుము. దే. క్రి. ౧. నలుపు. ౨. కొట్టు. 3. రుద్దు.

పులుముడు. దే. వి. రుద్దుడు.

పులుసు. దే. వి. ౧. వ్యంజనవిశేషము. ౨. ఒక రసము.

పుల్ల. దే. వి. ౧. ప్రడక. ౨. పాయి నిడుకట్టె. విణ. 3. పుల్లనిది.

పుల్లగిల్లు. దే క్రి. భయపడు. (రూ) పుల్లసిలు.

పుల్లగూర. దే. వి. పులుసుఁగూర.

పుల్లతీఁగ. దే. వి. సోమలత.

పుల్లదానిమ్మ. దే. వి. అమ్లదాడిమము.

పుల్లన. దే. వి. ౧. పులుసు. విణ. ౨. పులుసుకలది.

పుల్లనీళ్లు. దే. వి. బ. కూటినీళ్లు.

పుల్లరి. దే. వి. పసులు కసవు మేయుటకై ఇచ్చుపన్ను.

పుల్లవడు. దే. క్రి. స్తంభించు.

పుల్లసిల్లు. దే. క్రి. ౧. వివర్ణమగు. ౨. కలగు. రూ. పులసిల్లు.

పుల్లావు. దే. వి. కపిలధేనువు.

పుల్లియ. దే.వి. విస్తరాకు. రూ. పుల్లె.

పుల్లు. దే. వి. ౧. కసవు. రూ. పులు. విణ. ౨. అల్పము.

పువు. దే. వి. చూ. పువ్వు.

పువుఁబోఁడి. దే. వి. పువ్వుఁబోఁడి యొక్క రూపాంతరము.

పువ్వారుఁబోఁడి. దే. వి. పుష్పమువలె మనోజ్ఞాంగములగు ఆఁడుది.

పువ్విలుకాఁడు. } దే. వి. మన్మథుఁడు.
పువ్విలుతుఁడు. }

పువ్వు. దే. వి. పుష్పము. రూ. పువు.

పుషితము. త్స. విణ. పోషింపఁబడినది.

పుష్కరము. త్స. వి. ౧. తామర. ౨. ఒకద్వీపము. (పుష్కరద్వీపము)

పుష్కరిణి. త్స. వి. తామరకొలను.

పుష్టము. త్స. వి. ౧. పోషింపఁబడినది. ౨. బలిసినది.

పుష్టి. త్స. వి. ౧. పోషణము. ౨. సమృద్ధి.

పుష్పంధయము. త్స. వి. తుమ్మెద.
పుష్పకము. త్స. వి. ౧. కుబేరుని విమానము. ౨. కుసుమాంజనము.
పుష్పధన్వుఁడు. త్స. వి. మన్మథుఁడు.
పుష్పము. త్స. వి. పూవు.
పుష్పరథము. } త్స. వి. క్రీడాయోగ్య
పుష్యరథము. } మగు రథము.
పుష్పరసము. త్స. వి. పూఁదేనె.
పుష్పలావిక. త్స. వి. పూలమ్మునాఁడుది.
పుష్పలిహము. త్స. వి. తుమ్మెద.
పుష్పవంతులు. త్స. వి. సూర్యచంద్రులు.
పుష్పవతి. త్స. వి. రజస్వల.
పుష్పించు. త్స. వి. పూచు.
పుష్పిణి. త్స. వి. పుష్పవతి.
పుష్యమాసము. త్స. వి. ఒకానొక నెల. వ్యా. పుష్యనక్షత్రయుక్తమైనపున్నమతోఁ గూడినది.
పుష్యమి. త్స.వి. ఒకానొక నక్షత్రము.
పుష్యరాగము. త్స. వి. తెల్లనిరత్నము.
పుసలాయించు. దే. క్రి. ఊఱడించు.
పుసి. దే. వి. నేత్రమలము.
పుస్తకము. త్స. వి. వ్రాసిన గ్రంథము.
పుస్తె. దే. వి. మంగళసూత్రము.
పుళిందుఁడు. త్స. వి. కిరాతుఁడు.

పూ

పూఁచు. దే. క్రి. ప్రయత్నించు.
పూఁట. దే. వి. ౧. దినము. ౨. కాలము. ౩. సంధ్య.
పూఁటకాపు. దే. విశే. ౧. ఒకఁడు చేయవలసిన పనిని నేను చేసెదనని పూనెడి మఱి యొకఁడు. ౨. ప్రతిభువు.
పూఁటకూళ్ళమ్మ. దే. వి. సొమ్ము పుచ్చుకొని పూఁటపూఁటకు అన్నము పెట్టెడి వంటలక్క.
పూఁటకూళ్లయిల్లు. దే. వి. పూఁటకూళ్లు వండిపెట్టెడియిల్లు.
పూఁటకూళ్లు. దే. వి. వెలకైకొని పెట్టెడియన్నము.
పూఁటపడు. త్స. క్రి. ఒకఁడు చేయవలసిన పనిని నేను చేసెదనని మఱియొకఁడు పూనుకొను.
పూఁటవెట్టు దే. క్రి. ,,
పూఁడులు. దే. విశే. బ. అనేకములు. (ఏఁడులుపూఁడులు.)
పూఁత. దే.వి. ౧. వర్ప. ౨.చాదము.
పూఁదేనియ. దే. వి. పుష్పరసము.
పూఁపు. దే. వి. పూనిక.
పూఁబెంచె. దే. వి. మిక్కిలి లేఁతపెంచె.
పూఁబోఁడి. దే. వి. చూ. పువుఁబోఁడి.
పూచి. } దే. వి. బాధ్యత.
పూచిక. }
పూచు. దే. క్రి. పుష్పించు.
పూజ. త్స. వి. ౧. అర్చన. క్రి. ౨. పూజించు.
పూజకుఁడు. త్స. వి. అర్చకుఁడు.
పూజనీయుఁడు. త్స. విశే. పూజింపఁదగినవాఁడు.

పూజ్యుఁడు. త్స. వి. విశ. పూజింపఁదగినవాఁడు.
పూజె. దే. వి. అర్చన.
పూజె.
పూజారి. } దే. వి. అర్చకుఁడు.
పూజె. దే. వి. ఘటాదులమీఁది చిత్రము:
పూజెకుండలు. దే. వి. ఐరేనికుండలు.
పూటము. దే. వి. బరువు.
పూడ. దే. వి. గుదము.
పూడిక. దే. వి. బావి మున్నగువానిలో నడుగు భాగమునఁ దీసెడి మన్ను.
పూడు. దే. క్రి. ౧. పల్లము. ౨. మట్టిలోనగువానిచే నిండు. 3. నిండు.
పూడుచు. దే. క్రి. ౧. పుడజేయు. ౨. పాఁతు.
పూడుపు. దే. వి. పూడ్చుట.
పూత. దే. వి. ౧. పూచుట. ౨. వికసనము.
పూతన. త్స. వి. ఒకానొకరాక్షసి.
పూతము. త్స. విశ. పరిశుద్ధమైనది.
పూతిగంధి. త్స. విశ. దుర్గంధము గలది.
పూదియ.
పూదె. } దే. వి. బంగారుపూస.
పూనిక.
పూనికి. } దే. వి. ప్రయత్నము.రూ. పూన్కి.
పూనీరు. త్స. వి. పన్నీరు.
పూను. దే. క్రి. ౧. కడఁగు. ౨. ధరించు.
పూనుచు. దే. క్రి. పూనఁజేయు. రూ. పూన్చు.
పూనూక. దే.వి. మిక్కిలి సన్ననినూక.
పూప. దే. వి. ౧. పూఁబిందె. ౨. శిశువు. 3. కంటిపాప.
పూపము. త్స. వి. భక్ష్యము.
పూయము. త్స. వి. చీము.
పూయు. దే. క్రి. ౧. మన్ను లోనగువానిని మెత్తు. ౨. చందనము లోనగువానిని అలఁదు.
పూరణము. త్స. వి. ౧. నించుట. విశ. ౨. నించునది.
పూరణించు. దే. వి. ౧. నెరవేర్చు. ౨. గడపు.
పూరము. త్స. వి. ౧. జలప్రవాహము. ౨. భక్ష్యము.
పూరి. దే. వి. గడ్డి.
పూరిక. త్స. వి. ౧. పూర్తి. ౨. పూరీ.
పూరించు. దే. క్రి. నించు.
పూరీ. దే. వి. గోధుమపిండితోఁ జేసిన పిండివంట.
పూరుషుఁడు. త్స. వి. పురుషుఁడు.
పూరేకు. దే. వి. పుష్పదళము.
పూరేడు. దే. వి. పక్షివిశేషము.
పూర్ణపాత్రము. త్స.వి. ౧.ఉత్సవకాలమందు సంతోషముచే వస్త్రాభరణాదికమునుదోఁచుకొనుట. ౨. దోఁపు.

పూర్ణము. త్స. విశే. ౧. నిండినది. ౨. శక్తికలది.
పూర్ణానకము. త్స. వి. ౧. ఉత్సవకాలమందు సంతోషముచే వస్త్రాభరణాదికమును దోఁచుకొనుట.
పూర్ణిమ. త్స. వి. పున్నమ.
పూర్ణీభవించు. త్స. క్రి. నిండు.
పూర్తి. త్స. వి. ౧. నింపు. ౨. పూరణము.
పూర్ణము. దే. వి. కుడుములు మొదలగువాని కడుపులోపలఁ బెట్టెడి బెల్లము కలిపి నూరిన పప్పుముద్ద.
పూర్వగంగ. త్స. వి. నర్మదానది.
పూర్వజుఁడు. త్స. విశే. అన్న.
పూర్వదేవుఁడు. త్స. వి. రాక్షసుఁడు.
పూర్వపక్షము. త్స. వి. ౧. వాదము. ౨. శుక్లపక్షము.
పూర్వము. త్స. విశే. ౧. మొదటిది. ౨. ముందటి కాలముది.
పూర్వరాగము. త్స. వి. శ్రవణమువలనఁ గానీ దర్శనమువలనఁ గానీ పరస్పరము వృద్ధిబొందిన అనురాగముగల నాయికానాయకుల వియోగ దశావిశేషము.
పూర్వరాత్రము. త్స. వి. ముందటి దినమురాత్రి.
పూర్వాషాఢ. త్స. వి. ౨౦ వనొక నక్షత్రము.
పూర్వాహ్ణము. త్స. వి. దినపూర్వభాగము.
పూర్వులు. త్స. వి. ముందటివారు.
పూలము. త్స. వి. గడ్డికట్ట.
పూలముడుపు. దే. వి. గర్భిణికిఁ జేయించు పుష్పధారణము.
పూవింటి. దే. వి. మన్మథుఁడు.
పూవింటివాఁడు. ,,
పూవిలుకాఁడు. ,,
పూవిలుతుఁడు ,,
పూవు. దే. వి. పుష్పము.
పూవుఁబోఁడి. దే వి. చూ. పువుఁబోఁడి.
పూవుగట్టు. దే. క్రి. పూవులగు.
పూస. దే. వి. ౧. పూదె. ౨. మణి. 3. వ్రేలు లోనగువానికీలు.
పూసయెముక. దే. వి. వెన్నుపూస.
పూసలవాఁడు. దే. వి. గన్నములు సాఁబెట్టువాఁడు.

పృ

పృచ్ఛ. త్స. వి. ప్రశ్న.
పృచ్ఛించు. త్స. క్రి. అడుగు.
పృతన. త్స. వి. ౧. సేన. ౨. సేనాభాగము. (౨౪3 రథములు; ౨౪3 యేనుఁగులు, ౭౨౯ గుఱ్ఱములు, ౧౨౧౫ కాల్బురు.
పృథగ్జనుఁడు. త్స. వి. ౧. నీచుఁడు. ౨. మూర్ఖుఁడు. 3. పాపి.
పృథివి. త్స. వి. భూమి. రూ. పృథ్వి.
పృథుకము. త్స. వి. అడుకులు.
పృథులము. త్స. విశే. విరివియైనది.

పృథువు. త్స. విశ. ౧. గొప్పది. ౨. విరివియైనది.
పృషత్కము. త్స. వి. బాణము.
పృషత్తు. త్స. వి. ౧. నీటిబొట్టు. ౨. దుప్పి.
పృషదశ్వుఁడు. త్స. వి. గాలి.
పృష్టము. త్స. విశ. అడుగఁబడినది.
పృష్ఠము. త్స. వి. ౧. వీఁపు. ౨. వెనుకప్రక్క.

## పె

పెంకు. దే. వి. ౧. ఇంటిమీఁదఁ గప్పుట కుపయోగించెడి యోడు బిల్ల. ౨. కుండ లోనగువాని పెంచిక.
పెంకె. దే. వి. ౧. మొండికట్టె. ౨. మూర్ఖుఁడు.
పెంచిక. దే. వి. కుండ లోనగువాని పెంకు.
పెంచు. దే. క్రి. చూ. పెనుచు.
పెంచుకొను. దే. క్రి. దత్తు తీసికొను.
పెంట. దే. వి. ౧. ఎరువుకుప్ప. ౨. చీఁపురుకట్టచేత ఊడ్చి యెత్తిన చెత్త లోనగునది.
పెంటి. దే. వి. పశుపక్ష్యాదులలోని స్త్రీ జాతి. (చిలుకపెంటి: వ్యతిరేకము పోతు.)
పెంటిక. దే. వి. ఉండ ఉండగా నైచెడి మేఁక లోనగువాని పెంట.
పెంటవడు. దే. క్రి. కివగూడు.
పెంట్రిక. దే. వి. చూ. పెంటిక.
పెండరము. / పెండారము. } దే. వి. కాలికిఁ దగిలించుకొను భూషణము.
పెండియము. దే. వి. ౧. కాలధరించు పెండెము. ౨. దొడ్డి మొదలగువాని వాకిటికిఁ బెట్టెడు పెండెము. రూ. పెండెము.
పెండిలి. దే.వి. వివాహము. రూ. పెండ్లి.
పెండిలియగు. / పెండిలియాడు. } దే. క్రి. వివాహమగు. రూ. పెండ్లియగు, పెండ్లియాడు.
పెండె. దే. వి. ఇంటి వాసములమీఁద అడ్డముగా వేసి కట్టెడుకొయ్య.
పెండెకట్లు. దే. వి. బ. పెండెలవలె పట్టెలుగాఁ దీర్చిన విభూతి రేఖలు.
పెండెము. దే. వి. గండపెండారము.
పెండెరము. దే. వి. ,,
పెండేరము. దే. వి. ,,
పెండ్లము. దే. వి. భార్య. (రూ. పెండ్లాము).
పెండ్లాడు. దే. వి. చూ. పెండ్లియాడు.
పెండ్లాము. దే. వి. చూ. పెండ్లము.
పెండ్లి. దే. వి. చూ. పెండిలి.
పెండ్లికుండలు. దే. వి. బ. అయిరేని కుండలు.
పెండ్లికూఁతురు. దే. వి. ౧. వధువు. ౨. కోడలు.

పెండ్లికొడుకు. దే. వి. ౧. వరుఁడు. ౨. అల్లుఁడు.

పెండ్లినడక. దే. వి. పెండ్లియందువలెఁ దిన్నగా నడచునడక.

పెండ్లియరుగు. దే. వి. పెండ్లియందు వధూవరులు కూర్చుండుటకై వైచు ఎత్తుగా చౌకము తీర్చి ఏర్పఱిచిన తిన్నెగా.

పెందలకడ. దే. అవ్య. పొద్దుపోక ముందు. రూ. పెందలాడ.

పెందెరువు. దే. వి. రాజమార్గము.

పెందోడ. దే. వి. ఊరుమూలము.

పెంపోవ. దే. వి. ముక్తి.

పెంపగు. దే. వి. వర్ధిల్లు.

పెంపారు. దే. క్రి. గొప్పయగు.

పెంపు. దే. వి. ౧. సమృద్ధి. ౨. అతిశయము. ౩. గౌరవము. ౪. నాశము. క్రి. ౫. నాశముచేయు.

పెంపుడు. దే. విశే. పెంపఁబడిన.

పెంపుమీఱు. దే. క్రి. అతిశయించు.

పెకలు. దే. క్రి. ౧. పెల్లగిల్లు. ౨. ప్రయాణమగు.

పెకలుచు. దే. ప్రే. పెకలించు. రూ. పెగలుచు.

పెక్కండ్రు. దే. వి. బ. అనేకులు.

పెక్కణము. దే. వి. అభినయముతోడి నృత్యము.

పెక్కు. దే. స. అనేకము.

పెక్కురు. దే. స. చూ. పెక్కండ్రు.

పెక్కువ. దే. వి. ౧. వర్ధనము. ౨. ఆధిక్యము.

పెగడ. దే. వి. చూ. ప్రెగడ.

పెగలు. దే. క్రి. పెకలు.

పెచ్చు. దే. వి. ౧. అక్కఱ అనుపట్టిగా జెముల్లో నగువానినిమార్చునఫుడు అధికముగా ఇచ్చు సొమ్ము. ౨. పందెము లోనగువానిపోఁత తోలు.

పెటపెట. దే. వి. పండ్లుకొఱుకునపుడయ్యెడి ధ్వన్యనుకరణము.

పెటపెటమను. దే. క్రి. పెటపెట అను ధ్వనికలుగు.

పెటపెటలాడు. దే. క్రి. పెటపెటమను.

పెటిలు. దే. క్రి పెట్లు.

పెటులు. దే. విశే. విసము.

పెట్ట. దే. వి. ౧. పశుపక్షి స్త్రీజాతి. ౨. ఆఁడు కోడి.

(పెట్టకుక్క = ఆఁడుకుక్క).

పెట్టు. దే. క్రి. ౧. కలుగు. ౨. ఉంచు. ౩. ఇచ్చు. వి. ౧. ఈవి. ౨. దెబ్బ.

పెట్టుకొను. దే. క్రి.౧.ఉంచుకొను. వి. పెట్టుకోలు.

పెట్టుబడి. దే. వి. దేనికేని వెచ్చమునకై మొదట పెట్టిన ధనము.

పెట్టుమందు. దే. వి. వశ్యౌషధము.

పెట్టువడు. దే. క్రి. దెబ్బతిను.

పెట్టె. దే. వి. ధనమును, సొమ్మును మున్నగువానిని దాఁచిపెట్టుటకుపయోగించు పేటిక.

పెట్టెపెట్టు. దే. క్రి. చుట్టుకొను.

పెట్లఁ మ్మె. దే. వి. అదురువేసెలు గొట్టము.

పెట్లమారి. దే. విణ. దెబ్బలుదిను స్వభావము గలవాఁడు.

పెట్లుప్పు. దే. వి. ఒకదినుసు ఉప్పు.

పెఠిల్లు. దే. వి. ౧. పడుటలో నయ్యెడి ధ్వన్యనుకరణము. ౨. పిడుగుపడుటలో నయ్యెడి ధ్వన్యనుకరణము.

పెడ. విణ. ౧. పెద్ద. ౨. విపరీతము. (పెడబుద్ధి.)

పెడకట్టు. దే. వి. బ. చేతులను వెనుకకు విఱిచి కట్టుట.

పెడకట్టె. దే. విణ. చూ. పెడసరకట్టె.

పెడకేలు. దే. వి. వెనుకకు త్రిప్పిన భుజము.

పెడగాలు. దే. వి. వెనుకకు మడిచిన కాలు.

పెడచెవి. దే. వి. చెవివెనుకటి భాగము.

పెడచేయి. దే. వి. మీఁజేయి.

పెడతల. దే. వి. తలవెనుకటి భాగము.

పెడదారి. దే. వి. తప్పుత్రోవ.

పెడమరలు. దే. క్రి. వెనుకకుఁదిరుగు. రూ. పెడమర్లు.

పెడమఱు. దే. క్రి. ,,

పెడమోము. దే. వి. వెనుకకుఁ దిరిగిన మొగము.

పెడమోమువడు. దే. క్రి. వెనుకకుఁ దిరిగిన మొగమగు.

పెడసరకట్టె. దే. విణ. ౧. మూర్ఖుఁడు. ౨. మూర్ఖురాలు. రూ. పెడకట్టె.

పెడసరము. దే. వి. మూర్ఖము.

పెడులు. దే. క్రి. పెట్టుట.

పెడ్డ. దే. వి. మంటిపెల్ల.

పెత్తనకాఁడు. దే. విణ. అధికారి.

పెత్తనము. దే. వి. అధికారము.

పెద. దే. విణ. చూ. పెద్ద.

పెదవి. దే. వి. మోవి.

పెద్ద. దే. విణ. ౧. పెద్దవాఁడు. ౨. ముసలివాఁడు. 3. దొడ్డవాఁడు. ౪. అధికము. ౫. శ్రేష్ఠము.

పెద్దకాఁపు. దే. విణ. గ్రామములో దొరతనము వారికిఁ జెల్లింప వలసిన సొమ్మును వసూలు చేయుటకై నియమితుఁడైన నౌకరి.

పెద్దతల. దే. విణ. ఒకానొక కుటుంబమునందుఁ గాని గ్రామమునందుఁ గాని కార్యభారము వహించి నడపువాఁడు.

పెద్దనిదుర. దే. వి. చూ. పెద్దనిద్దుర.

పెద్దనిదురపోవు. దే. క్రి. చచ్చు.

పెద్దనిద్దుర. దే. వి. దీర్ఘనిద్ర. రూ. పెద్దనిదుర.

పెద్దపులి. దే. వి. బెబ్బులి.

పెద్దమ్మ. దే. వి. ౧. పెదతల్లి. ౨. జ్యేష్ఠాదేవి.
పెద్దరోగము. దే. వి. శరీరమును మొద లంటు తెగతినెడి వ్యాధివిశేషము.
పెద్దజీకము. దే. వి. పెద్దతనము.
పెద్దలు. దే. వి. బ. తెలిసినవారు.
పెద్దవాకిలి. దే. వి. గోపురద్వారము.
పెద్దవిన్నపము. దే. వి. చెవుడు.
పెద్దవిన్నపమువాఁడు. దే. విశే. చెవిటి వాఁడు.
పెద్దవీధి. దే. వి. రాజమార్గము.
పెద్దవేళ్లు. దే. వి. బోటనవేళ్లు.
పెన. దే. వి. ౧. ముడి. ౨. మెలిక. ౩. రెండు పశువులను చేర్చి కట్టి వైచునట్టికట్టు.
పెనఁకువ. దే. వి. ౧. జగడము. ౨. మేళనము. ౩. కలయిక.
పెనఁగఁబడు. దే. క్రి. పెనవైచి కొను.
పెనఁగాడు. దే. క్రి. పెనఁగొను.
పెనఁగు. దే. ౧. పెనఁగొను. ౨. చుట్టుకొను. ౩. కలయు. ౪. జగడముచేయు.
పెనఁగులాట. దే. వి. పెనఁగొనుట. రూ. (పెనఁగులాటము.)
పెనఁగులాడు. దే. క్రి. మల్లాడు.
పెనఁగొను. దే. క్రి. ౧. మెలిఁగొను. ౨. చేరు.
పెనఁచు. దే. క్రి. పెనఁగఁజేయు.
పెనపరి. దే. విశే. ౧. వివాదశీలుఁడు. ౨. ఖేదశీలుఁడు.
పెనము. దే. వి. దోసెలు లోనగు వానిని కాల్చు గుండ్రని యినుప తగడు.
పెనయు. దే. క్రి. ౧. కలయు. ౨. పెనఁగు.
పెనవెట్టు. / పెనవేయు. } దే. క్రి. మెలిపెట్టు.
పెనిమిటి. దే. వి. మగడు. రూ. పెన్మిటి.
పెనుచు. దే. ప్రే. పెరుఁగఁజేయు.
పెనుపడు. దే. క్రి. ౧. అతిశయిల్లు. ౨. వర్ధిల్లు.
పెనుపరి. దే. విశే. వృద్ధిఁబొందించు వాఁడు.
పెనుపారు. దే. క్రి. పెంపారు.
పెనుపు. దే. వి. ౧. వృద్ధి. ౨. ఆధిక్యము.
పెనుమసనము. దే. వి. కాళి.
పెనుమెనుకులు. దే. వి. వేదము.
పెనువెల్లి. దే. వి. ప్రళయకాలమందలి యేకార్ణవము.
పెన్న. దే. వి. పినాకినీనది.
పెన్నేరు. / పెన్నెరు. } దే. వి. అశ్వగంధము.
పెన్మిటి. దే. వి. పెనిమిటి. రూ. సాంతరము పెనిమిటి.
పెయ్య. దే. వి. ౧. పాలు విడిచిన యావుయొక్క యాఁడుదూడ. ౨. దూడ.

పెర. దే.వి. ౧.అన్యము ౨.తేనెతెట్టె.
పెరచే. దే. వి. ప్రేమ. రూ. ప్రేమ్మి.
పెరడు. దే.వి. ఇంటివెనుకదొడ్డి.
పెరరేచు. దే. క్రి. ప్రేరేపణచేయు.
పెరవణి. దే. వి. పేరణియాట.
పెరిమ. దే. వి. ప్రేమ. రూ. ప్మేరి.
పెరిమె. దే. వి. పెద్దతికము.
పెరుగు. దే. క్రి. ౧. ఎదుగు. ౨. వి.3. దధి. విశ. ౪. ఏండ్లు చెల్లినవాడు. ౫. ఏండ్లు చెల్లినది. ౬. వృద్ధిపొందినది. రూ. పెరువు. పెర్గు.
పెరుగుడు. దే. వి. ౧. వృద్ధి. ౨. వర్ధనము.
పెరుగు. దే. క్రి. తెగు.
పెరుమాళ్లు. దే. వి. ౧. భగవంతుఁడు. ౨. విష్ణువు.
పెఱ. దే. స. అన్యము.
పెఱగాయ. దే. విశ. కుత్సితుఁడు.
పెఱనుగఁడు దే. విశ. జాఱుఁడు.
పెఱుకు. దే.క్రి. ౧.పెల్లగించు. ౨.పీకు.
పెఱుగు. దే వి. ౧. ఉద్యమించు. ౨. విజృంభించు.
పెలుకుఱు. దే. క్రి భయాదులచే అంగములు విలవిలపోవు.
పెలుచ. పెలువన. పెల్చన. } దే. వి. ౧. ఆగ్రహము. ౨. కాఠిన్యము.విశ. 3. అధికము.అవ్య. ౪. గట్టిగా.
పెల్ల. దే. వి. పట్టెగడ్డ.
పెల్లగించు. దే. ప్రే. పెల్లగిల్లఁ జేయు.
పెల్లగిలు. పెల్లగిల్లు. } దే. క్రి. పాదు ఊడిలేచు.
పెల్లిదము. దే. వి. పెల్లు.
పెల్లు. దే. వి. ౧. అతిశయము. ౨. ఆధిక్యము. విశ. 3. అత్యంతము.
పెల్లుకొను. దే. క్రి. అతిశయించు.
పెసలు. దే. వి. బ. పెసర్లు ధాన్యము.
పెళపెళ. దే. వి. ౧. పిడుగువడునప్పుడగుధ్వన్యనుకరణము. ౨. ఊఱుముటయందయ్యెడు చప్పుడు.
పెళుచే. దే. విశ. ౧. మూర్ఖుఁడు. ౨. విరసము.

పే

పేఁట. దే. వి. శాఖానగరము.
పేఁటు. దే. వి. బీఁటిక.
పేఁడ. దే. వి గోమయము.
పేఁడు. దే. క్రి. దారము పేను.
పేక. దే. వి. వస్త్రములయందలి యొండునూలు. (పడుగు పేకలు.)
పేగు. దే.వి. చూ. ప్రేగు. రూ. పేవు.
పేట దే. వి. హారములో నొకసరము.
పేటునఁబెట్టు. దే. క్రి. యత్నించు.
పేటాడు. దే. క్రి. ఛేదించు.
పేటి. పేటిక. } త్స. వి. పెట్టె.
పేటు. దే వి. సరిగ లోఁగుపానితో నేసినపట్టె.

పేడి. దే. వి. నపుంసకుఁడు.

పేడు. దే. వి. ౧. సన్ననిచెక్క. ౨. (వక్క) బద్ద.

పేడె. దే. విణ. గడ్డము మీసము లేని వాఁడు. (పేడెమూఁతి.)

పేడ్చు. దే. క్రి. ౧. విచ్చు. ౨. తొలఁగు.

పేణి. దే. వి. భక్ష్యవిశేషము.

పేద. దే. వి. ౧ భిక్షుఁడు. విణ. ౨. పేదికి. 3. దరిద్రుఁడు. ౪. అశక్తుఁడు.

పేదర్మి. దే. వి. పేదఱికము.

పేదఱికము. దే. వి. దారిద్ర్యము.

పేదఱిము. దే. వి. పేదఱికము.

పేదవడు. దే. క్రి. ౧. దారిద్ర్యమును పొందు ౨. దైన్యమును పొందు

పేను. దే. క్రి ౧. దారము పేను. వి. ౨. తలలో పుట్టెడు జంతువిశేషము.

పేన్నీళ్లు. దే. వి. బ. పేఁడ కలిపిన నీళ్లు.

పేము. దే. వి. వేత్రము.

పేయము. త్స. విణ. త్రాఁగఁదగినది.

పేరంటము. పేరంట్రము. పేరఁటము. } దే. వి. ౧. వివాహాది శుభకార్యములకు ముత్తయిదువలు రమ్మని పిలుచుట. ౨. వివాహాది కాలములలో ముత్తయిదువలు చేయు తత్సంబంధమగు కార్యము.

పేరఁటాలు. దే. వి. ౧. మృతసువాసిని. ౨. పేరంటమునకు వచ్చిన ముత్తయిదువ.

పేరడవి. దే. వి. మహారణ్యము.

పేరణము. దే. వి. పేరణి.

పేరణి. దే. వి. ౧. అంగీ. ౨. భాండీరో [illegible] నృత్యము.

పేరము. దే. వి. చూ. పేరెము.

పేరిమి. దే. వి. ౧. అతిశయము. ౨. గౌరవము.

పేరీఁదు. దే. వి. ఖర్జూరము.

పేరు. దే. క్రి. ౧. దట్టమగు. ౨. గడ్డకట్టు. వి. ౧. నామము. ౨. కీర్తి. 3. గ.డ. విణ. ౧. పెద్ద. ౨. అనేకము.

పేరుంగరము. దే. వి. ౧. పేరు చెక్కిన యుంగరము. ౨. ముద్రిక.

పేరుకొను. దే. క్రి. ౧. పేరుపెట్టిపిలుచు. ౨. పిలుచు. రూ. పేర్కొను.

పేరుకోలు. దే. వి. పేరుకొనుట.

పేరుగ్రుచ్చు. దే.వి. పేరుపెట్టి పిలుచు.

పేరుము. దే. క్రి. ౧. అతిశయించు. ౨. ఒకటిమీఁద నొకటిగాఁ బేర్చి యొప్పియుంచు.

పేరుడు. దే. వి గడ్డకట్టుట.

పేరుపు. దే. వి. ఒకటిమీఁద నొకట పెట్టుట.

పేరెము. దే. వి. ౧. పరుగు. ౨. గుఱ్ఱపు పరుగు.

పేర్మి. దే. వి. చూ. పేరిమి.
పేలుండి. దే. వి. పేలాలు విసిరిచేసి పిండి.
పేలలు. / పేలాలు. ( దే. వి. బ. పేలగింజలు.
పేలవము. త్స. విణ. సారములేనిది.
పేలిక. దే. వి. చింపిగుడ్డ.
పేలు. దే. క్రి. చూ. ప్రేలు.
పేవు. దే వి. చూ. పేగు.
పేశలము. త్స. విణ. ౧. చక్కనిది ౨. మృదువైనది.
పేషణము. త్స. వి. నూఱుట.
పేషణి. త్స. వి. సన్నికల్లు.
పేసెము. దే. వి. పేసము.

## పై

పైఁట. దే. వి. పయిఁట.
పైఁడి. దే. వి. ౧. బంగారు. ౨. ధనము.
పైకము. దే. వి. ధనము.
పైకూటమి. దే. వి. ఉపరతి.
పైకొను. దే. క్రి. ౧. కవియు. ౨. మీఱు.
పైజోఱు. దే. వి. ముచ్చె.
పైఠ. త్స. వి. పైఁట.
పైతృకము. త్స. విణ. పితృసంబంధమైనది.
పైతృష్వసేయుఁడు. త్స. విణ. మేనత్త కొడుకు.
పైతృష్వస్రీయుఁడు. త్స. విణ. ,,
పైత్రము. త్స. విణ. పితృసంబంధమైనది.
పైథ. దే. వి. పిల్లకాయ.
పైదలి. దే. వి. ఆఁడుది.
పైనము. వై. వి. పయనము.
పైపడు. దే. క్రి. ౧. పైకొను ౨. మీఱు.
పైపాటు. దే. వి. కవియుట.
పైపైగ. దే. విణ. సులభముగా.
పైరు. దే. వి. సస్యము. చూ. పయిరు.
పైశాచము. త్స. విణ. ౧. అష్టవిధ వివాహములలో నొకటి. ౨. పిశాచ సంబంధమైనది.
పైశున్యము. త్స. వి. కొండెకానితనము.
పైసరము. దే. వి. రతి.

## పొ

పొంకపడు. దే. క్రి. పొందికపడు.
పొంకము. దే. వి. పొందిక.
పొంకించు. దే. క్రి. పొందికపఱచు.
పొంగటిపండుగ. దే. వి. మకర సంక్రాంతి.
పొంగట్టు. దే. వి. మేరుపర్వతము.
పొంగలి. దే. వి. పాలుచేర్చి పొంగించిన యన్నము.
పొంగలించు. దే. క్రి. నిక్కు.
పొంగారు. దే. క్రి. ౧. ఉబుకు. ౨. సంతోషించు. 3. విజృంభించు.
పొంగు. దే. క్రి. ౧. గర్వించు. ౨. సంతోషించు. వి. ౧. గర్వము. ౨. సంతోషము.

పొంచు. దే. క్రి. ౧. ఏదేని ఉద్దేశించి మఱుఁగున నిలిచి యుండు. వి. ౨. ఏదేని ఉద్దేశించి మఱుఁగున నిలిచి యుండుట.

పొంత. దే. వి. ౧. దగ్గఱ. ౨. తీరము.

పొంతకత్తె. దే. వి. కుంటెనకత్తె.

పొంతనము. దే.వి. గ్రహముల పొందిక.

పొంతము. దే. వి. స్నేహము.

పొందిక. దే. వి. ౧. పొంకము. ౨. చేరిక.

పొందు. దే. క్రి. ౧. కలయు. ౨. పేరు. వి.౧. పొందిక. ౨. స్నేహము. 3. సంధి.

పొందుకాఁడు. దే. విణ. స్నేహితుఁడు.

పొందుకొను. దే. క్రి. నెలకొను.

పొందుపడు. దే. క్రి. ౧. సరిపడు. వి. ౨. పొందుపాటు.

పొంపిరి. దే. వి. ౧. సాంద్రత. విణ. ౨. సాంద్రము.

పొంపిరివోవు. దే. క్రి. ౧. అతిశయించు. ౨. వర్ధిల్లు. 3. వ్యాపించు. ౪. సంతోషించు ౫. విజృంభించు.

పొంపు. దే. వి. ఒప్పు. (పొంపుదక్కఁగి)

పొంపెసలారు. దే. క్రి. ఒప్పగు.

పొకారు. దే. క్రి. నాశమగు రూ. పోకారు.

పొకారుచు. దే. క్రి. నాశముఁజేయు.

పొకాలు. దే. క్రి. ౧. కదలు. ౨. పోవు. రూ. పోకాలు.

పొక్కు. దే. వి. ౧. గుఱుతు. ౨. ఉపాయము.

పొక్కిలి. దే. వి. ౧. బొడ్డు. ౨. గుంట.

పొక్కు. దే. క్రి. ౧. శోకించు. ౨. బొబ్బలేచు. వి. ౧. శోకము. ౨. బొబ్బ. 3. ఎండలేచిన పెల్ల.

పొగ. దే. వి. ధూమము. రూ. పొవ.

పొగగూడు. దే. వి. ఇంటికప్పున పొగపోవుట కేర్పఱిచిన కన్ను.

పొగచు. దే. క్రి. ౧. సాతాళించు. ౨. పొగయించు.

పొగచుట్ట. దే. వి. పొగాకుచుట్ట.

పొగచూరు. దే. క్రి. పొగపట్టు.

పొగడిక. దే. వి. స్తోత్రము.

పొగడత. దే. వి. ౧. స్తుతి. ౨. కీర్తి.

పొగడు. దే.క్రి. ౧. స్తుతించు. వి. ౨. స్తుతి.

పొగడ్త. దే. వి. ౧. స్తుతించుట. ౨. స్తుతి.

పొగపు. దే. వి. సాతాళింపు.

పొగయు. దే. క్రి. ౧. పొగగలదగు. ౨. కుములు.

పొగరు. దే. వి. కావరము. రూ. పొవరు.

పొగరుఁబోతు. దే. విణ. గర్వశీలుఁడు.

పొగులు. దే. క్రి. పరితపించు.

పొచ్చెము. దే. విణ. ౧. న్యూనత. ౨. కపటము. విణ. 3. న్యూనము.
పొటకరించు. దే. క్రి. అతిశయించు. ౨. వర్ధిల్లు.
పొటపొట. దే. వి. రాలుటలో నగు ధ్వన్యనుకరణము.
పొటమరించు. దే. క్రి. ౧. బొబ్బ లోనగునది లేచు. ౨. చిగురు లోనగునది పుట్టు. (రూ. పొటమరిల్లు, పొటమరలు.)
పొటి. దే. విణ. చూ. పొట్టి.
పొటిపొటి. దే. విణ. అల్పము.
పొటుకు. } దే. వి. ౧. చెట్టుమీఁదనుండి వానచినుకులు పడునపుడయ్యెడి ధ్వన్యనుకరణము. విణ. ౨. అడ్డము.
పొటుక్కు. }
పొకేలు. దే. వి. చూ. పొట్కేలు.
పొట్ట. దే. వి. ౧. వరిపొట్ట. ౨. కడుపు.
పొట్టకూటివాఁడు. దే. విణ. కడుపు కూటికై పనిచేయువాఁడు.
పొట్టకూడు. దే. వి. జీతము మాఱుగా పెట్టెడి యన్నము.
పొట్టక్రొవ్వు. దే. వి. ఆహారము వలనఁ గలిగిన మదము.
పొట్టి. దే. విణ. వామనుఁడు. రూ. పొటి.
పొట్టియ. దే. వి. తేలు.
పొట్టు. దే. వి. ౧. కాయధాన్యము మీఁది తోలు. ౨. వడ్లపొట్టు.
పొట్టుపొరలగు. దే. క్రి. పీడితమగు.
పొట్టేలు. } దే. వి. గొఱ్ఱెపోతు.
పొట్కేలు. }
పొట్ల. దే. వి. పొట్లచెట్టు.
పొట్లము. దే. వి. ౧. గుంపు. ౨. పువ్వులుగాని మఱేదైనను గాని ఆకులో పెట్టి ముడిచిన మడుపు.
పొడ. దే. వి. ౧. జాడ. ౨. రూపు. 3. చూపు. ౪. వ్యాధివిశేషము.
పొడక. దే. వి. చూ. పొణక.
పొడకట్టు. దే. క్రి. ౧. కనఁబడు. ౨. ప్రత్యక్షమగు.
పొడగను. } దే. క్రి. చూచు.
పొడగాంచు. }
పొడగానుపు. దే. వి. ౧. పొడగనుట ౨. దర్శనము.
పొడచూపు. దే. క్రి. ౧. కనఁబడు. ౨. ప్రత్యక్షమగు.
పొడతెంచు. దే. క్రి. ౧. ఉదయించు. ౨. పుట్టు.
పొడము. దే. క్రి. పుట్టు.
పొడయెండ. దే. వి. సందులగుండ తోఁచిపొడపొడగా ఏర్పడు నెండ.
పొడవడఁగు. దే. క్రి. ౧ చెడు. ౨. చచ్చు.
పొడవడఁచు. దే. క్రి. ౧. చంపు. ౨. చెఱుచు.
పొడవు. దే. వి. ఆకారము.

పొడవునూపు. దే. క్రి. ౧. ప్రత్యక్షమగు. ౨. కనఁబడు.

పొడి. దే. వి. ౧. చూర్ణము. విణ. ౨. ఎండినది.

పొడిసేయు. దే. క్రి. చూర్ణము సేయు.

పొడుగు. దే. క్రి. ౧. ఉన్నత మగు. ౨. వర్ధిల్లు. వి. ౧. మీఁదు. ౨. ఉన్నతి. ౩. ఎత్తు. విణ. ౧. ఉన్నతము. ౨. ఉత్కృష్టము. రూ. పొడుపు.

పొడుగుమడుఁగు. దే. వి. ఆకాశగంగ.

పొడుచు. దే. క్రి. ౧. ఉదయించు. ౨. పిడికిలి మొదలగు వానితోఁ గ్రుమ్ము. ౩. పోట్లాడు. ౪. గ్రుచ్చు. వి.గే. పొడుపు.

పొడుపు. దే. వి. ౧. పొడుచుట. (పొడుపుమాట) ౨. ఉదయము. ౩. పోటు.

పొడుము. దే. వి. చూర్ణము.

పొడువడు. దే. విణ. దుర్జనుఁడు.

పొడువు. దే. వి. ౧. ఉన్నతి. ౨. ఎత్తు. ౩. మీఁదు.

పొణక. దే. వి. ఈఁతబ్రద్దలు లోనగు వానితో నల్లినబుట్ట. రూ. పొడక.

పొతక. దే. వి. పొత్తిక.

పొతము. దే. వి. ౧. పోట్లము. ౨. గుంపు.

పొత్తము. వై. వి. ౧. పుస్తకము. ౨. కావ్యము.

పొత్తర. దే.వి. ఆకులులోనగువానికట్ట.

పొత్తరము. దే. వి. నూఱెడు గుండ్రాయి.

పొత్తి. / పొత్తిక. } దే. వి. ౧. చెట్టుమీఁది నార. ౨. మెత్తని సన్నని పాఁతవస్త్రము(పొత్తిచీర)

పొత్తికడుపు. దే. వి. క్రిఁగడుపు.

పొత్తు. దే. వి. ౧. స్నేహము. ౨. ఉమ్మడి విణ ౧. స్నేహము. ౨. సంగతము.

పొత్తుకత్తె. దే. విణ. స్నేహితురాలు.

పొత్తుకాఁడు. దే. విణ. స్నేహితుఁడు.

పొత్తుగుడుపు. దే. వి. సహభోజనము.

పొత్తుసేయు. దే. క్రి స్నేహము చేయు.

పొత్రము దే. వి. చూ. పొత్తరము.

పొద. దే. వి. ఒకటితో నొకటి పెనఁగొన్న బోదె లేని చిన్నచెట్లగుంపు.

పొదడు. దే. విణ. పొట్టివాఁడు.

పొదరిల్లు. దే. వి. ఇంటివలెనుండు పొద. రూ. పొదరుటిల్లు.

పొదరు. దే. వి చూ. పొద.

పొదలాడు. దే క్రి వర్ధిల్లు

పొదలిక. దే. వి.౧. పెంపు. ౨. వృద్ధి.

పొదలు. దే. క్రి. ౧. పెరుగు. ౨. వర్ధిల్లు.

పొదలుకొను. దే. క్రి. ౧ పెరుఁగు ౨. బలియు.

పొదవెట్టు. దే. క్రి. ౧. సూచించు. ౨. ఆరోపించు.

పొడి. దే. వి. ౧. అమ్ములపొది. ౨. మంగలవాని యడపము. 3. పొదుగు. ౪. సమూహము.
పొదిగిలి. దే. వి. ప్రక్కలను, కండటి కిని, నడుమనున్న ప్రదేశము.
పొదిగొను. దే. క్రి. ౧. గుంపుగూడు. ౨. పరివేష్టించు.
పొదుగు. దే. వి. ఆవు లోనగువానికి పాలుండెడిచోటు.
పొదుగు. దే. క్రి. ౧. పక్షులు గ్రుడ్లను ఱెక్కలతోఁ గప్పు. ౨. కప్పు. 3. చెక్కు. ౪. క్రమ్ము. వి. ౫. పొత్తిగుడ్డ. రూ. పొదువు.
పొదుపు. దే. వి. వృద్ధి.
పొదువు. దే. క్రి. ౧. కవియు. ౨. క్రమ్ము. 3. చెక్కు.
పొద్దు. వై. వి. చూ. ప్రొద్దు.
పొన. దే. విణ. దృగ్గోచరమైనది.
పొనరారు. దే. క్రి. ఒప్పు.
పొనరు. దే. క్రి. ౧.అగు. ౨.పొసఁగు. వి. ౧. పొందిక. ౨. ఇంపు.
పొనరుచు. దే. క్రి. ౧. కావించు. ౨. పొసగించు.
పొనరువడు. దే. క్రి. పొందువడు.
పొనలు. దే. క్రి. మండు (కనలుచుఁ బొనలుచు)
పొనుఁగు. దే. వి. నిస్తేజము.
పొనుఁగువడు దే.క్రి. ౧. నిస్తేజమగు. ౨. నశించు. 3. శూన్యమగు.
పొనుపడు. దే.క్రి. నిస్తేజమగు.
పొన్న. దే. వి. దృగ్గోచరమైనది.
పొన్నరి. } దే. వి. మనోజ్ఞము.
పొన్నారి. }
పొన్ను. దే. వి. ౧. రోఁకలి మొదలగువానికొలందును వైచు నినుప వలయము. ౨. బంగారు.
పొమ్ము. దే.క్రి నిశ్చయమునుదెలుపునది.
పొయి. } దే. వి. చూ. ప్రొయ్యి.
పొయ్యి. }
పొర. దే. వి. ౧. పొముకుబుసము. ౨. ప్రమాదము. 3. మతి. ౪. కపటము.
పొరటు. దే. క్రి. కూరాకునేస్పుఇగురు పట్లు పొరలిచి వండు.
పొరక. దే. వి. ౧. చీఁపురుకట్ట. ౨ ఈఁనపుల్ల. 3. (గడ్డి) పోచ.
పొరట. దే. వి. పుస్తకముమొక్కయు ఆకు మొక్కయు ఒకవైపు.
పొరపడు. దే. క్రి. ప్రమాదపడు.
పొరబాటు. దే. వి. ప్రమాదపడుట.
పొరపు. దే. వి. భేదము.
పొరయు. దే. క్రి. ౧. పొందు. ౨. కలుగు. 3. చెందు.
పొరలఁబడు. దే. వి. పొరలు.
పొరలాడు. దే. క్రి. ౧. పొరలు. వి. ౨. పొరలాట.
పొరలు. దే. క్రి. ౧. పొర్లు. ౨. ప్రవర్తిల్లు. వి. పొరలిక.

పొరలుదండము. దే. వి. పొరలుచు పెట్టెడు దండము.
పొరలువెట్టు. దే. క్రి. పొరలు.
పొరి. దే. వి. చూ. ౧. పొలి. విణ. మిక్కిలి. ౨. క్రమముగా. ౩. మాటిమాటికి. (ఆమేక్షితముగ పొరిపొరి)
పొరిగొను. దే. క్రి. ౧. చంపు. ౨. నాశముచేయు.
పొరిచూపు. దే. వి. ౧. ఉగ్రదృష్టి. ౨. క్రేదదృష్టి.
పొరిపుచ్చు. దే. క్రి. చంపు.
పొరిపోవు. దే. క్రి. చచ్చు.
పొరిగూల్చు. దే. క్రి. చంపు.
పొరిమాలు. దే. క్రి. చచ్చు.
పొరిమాల్చు. దే. క్రి. చంపు.
పొరివుచ్చు. దే. క్రి. పొరివోవఁజేయు.
పొరివోవు. దే. క్రి. చచ్చు.
పొరుగు. దే. వి. ౧. ప్రక్క. ౨. ఇరుగునకు ప్రక్క. ౩. సమీపము. రూ. పొరువు. (ఇరుగుపొరుగులు)
పొఱడు. దే. వి. గూడు.
పొఱడుపోవు. దే. క్రి. గూడుపడు.
పొఱయు. దే. క్రి. పొందు.
పొటివుచ్చు. దే. క్రి. కలఁచు.
పొటిపోవు. దే. క్రి. కలయు.
పొల. వై. వి. ౧. మాంసము. ౨. మాంసపుదుర్గంధము. విణ. అల్ల.
పొలఁతి. ⎫ దే. వి. ఆఁడుది. రూ.
పొలఁతుక. ⎭ పొలి. పొలుక.
పొలదువ. దే. వి. జాడ.
పొలపము. దే. వి. ౧. వ్యాపనము. ౨. వాసన. ౩. పరికారము. ౪. విణ. వ్యాప్తము.
పొలపరి. దే. విణ. జాడదెలిసినవాఁడు.
పొలపొల. దే. వి. పొక్కుటయందగు ధ్వనికనుకరణము (పొలపొలఁబొక్కు)
పొలము. దే. విణ. పొలముకాఁపు.
పొలమూను. దే. క్రి. ప్రమాదపడు.
పొలమూర్చు. దే. క్రి. పొలమూరఁజేయు.
పొలము. దే. వి. ౧. పైరువెట్టు నేల. ౨. పసులు మేయు కంచె.
పొలయలుక. దే. వి. ప్రణయకలహము.
పొలయు. దే. క్రి. ౧. సంచరించు. ౨. వ్యాపించు.
పొలసాడు. దే. క్రి. సంచరించు.
పొలసు. దే. విణ. ౧. మాంసము. ౨. మాంసపు దుర్గంధము.
పొలి. దే. వి. ౧. లాభము. పొలిగలుగ వలెను. (పొలివోవు.) ౨. వృద్ధి. రూ. పొరి.
పొలికలను. దే. వి. యుద్ధభూమి.
పొలిమేర. దే. వి. రెండు గ్రామములకు నడుమ నుండు నెల్ల.
పొలియుక. దే. వి. ౧. చావు. ౨. నాశము.
పొలియు దే. వి. ౧. చచ్చు. ౨. నశించు.
పొలివుచ్చు. దే. క్రి. పొలివోవఁజేయు.

పొలివెట్టు. దే. క్రి. గుడికేర్పఱచిన యేర్పాటు.

పొలివోవు. దే. క్రి. ౧. చచ్చు. ౨. చెడు. ౩. వ్యర్థమగు. ౪. భంగపడు.

పొలుచు. దే. క్రి. ౧. ప్రత్యక్షమగు. ౨. కనఁబడు.

పొలుపారు. దే. క్రి. ఒప్పారు. రూ. పొల్పారు.

పొలుపు. దే. వి. ౧. ఒప్పు. ౨. విధము. విణ. ౩. స్థిరము.

పొలువ. దే. విణ. దుర్జనుఁడు.

పొలువడు. దే. క్రి. తఱుఁగు.

పొల్ల. దే. వి. ౧. గింజపట్టనిధాన్యము. విణ. ౨. వ్యర్థము. ౩. తోఁప్రుడైనది.

పొల్లవడు. దే. క్రి. వ్యర్థమగు.

పొల్లవుచ్చు. దే. క్రి. పొల్లవోవఁజేయు.

పొల్లవోవు. దే. క్రి. పొల్లవడు.

పొల్లు. దే. వి. ౧. గింజపట్టనిధాన్యము. ౨. నిరర్థక శబ్దము. విణ. వ్యర్థము.

పొల్లువడు. దే. క్రి. క్షయించు.

పొవ. దే. వి. పొగ.

పొవడ. దే. వి. పొగడ.

పొవడు. దే. వి. పొగడు.

పొవరు. దే. వి. పొగరు.

పొవులు. దే. క్రి. పొగులు.

పొసఁగు. దే. క్రి. ౧. అనుకూలించు. ౨. లభించు. ౩. చక్కఁబడు.

పొసఁగుడు. దే. వి. ౧. అనుకూల్యము ౨. ప్రాప్తి.

## పో

పో. దే. క్రి. చూ. పొమ్ము.

పోఁక. దే. వి. క్రముకఫలము.

పోఁకముడి. దే. వి. నీవి.

పోఁకు. దే. వి. మంచుగవిసినగడ్డి.

పోఁకొత్తు. దే. వి. అడకొత్తు.

పోఁగు. దే. వి. ౧. దారము. ౨. పురుషకర్ణాభరణము.

పోఁగువాఱు. దే. క్రి. ఆవరించు.

పోఁగొట్టు. దే. క్రి. పోకడపెట్టు.

పోఁచ. దే. వి. గడ్డిలోనగువాని పరక.

పోఁచి. / పోఁచీ. దే. వి. ౧. మనికట్టుమీఁది చోటు. బ. ౨. ఆఁడువారి హస్తాభరణము.

పోఁడి. దే. వి. ౧. ఒప్పు. విణ. ౨. ఒప్పిదము.

పోఁడిమి. దే. వి. ౧. సంపద. ౨. సౌఖ్యము. ౩. ఒప్పు.

పోఁత. దే. వి. పోయుట.

పోఁపు. దే. వి. గడ్డి.

పోక. దే. వి. ౧. గమనము. ౨. బ. నడత. ౩. కుత్సితపు నడవడి.

పోకడ. దే. వి. ౧. నాశము. ౨. నడత. ౩. గతి.

పోకడపెట్టు. దే. క్రి. ౧. పోఁగొట్టు. ౨. విక్రయించు.

పోకలాఁడి. దే. విశే. కపటప్రవర్తనము గలది.
పోకలాఁడు. దే. విశే. కపటప్రవర్తనము గలవాఁడు.
పోకాడు. దే.వి. ౧.పోవు. ౨. నశించు.
పోకారుచు. దే. క్రి. ౧. పోఁగొట్టు. ౨. పోఁగొట్టుకొను రూ. పోకార్చు.
పోకాలు. దే. క్రి. పోవు.
పోకిరి. దే. విశే. దుర్మార్గ ప్రవర్తన కలవాఁడు.
పోకిళ్లు. దే. వి. దుర్మార్గ ప్రవర్తనము.
పోకు. దే. వి. ౧. నడవడి. ౨. నష్టి.
పోగు. దే. వి. చూ. ప్రోగు.
పోటు. దే. విశే. పెద్ద. (పోటుకత్తి.)
పోటునబంతి. దే. వి. పుట్టిచెండు.
పోటరి. దే. వి. శూరుఁడు.
పోటి. దే. వి. ౧. పోటాపోఁగంబము. ౨. స్పర్థ. విశే. పోటిగాఁడు.
పోటు. దే. వి. ౧. పొడుపు. ౨. యుద్ధము. 3. దెబ్బ.
పోటుకాఁడు. పోటుబంటు. పోటుమగఁడు. పోటుమానిసి. } దే. విశే. శూరుఁడు.
పోటులాఁడు. దే. క్రి. యుద్ధముచేయు.
పోటొగ్గు. దే. క్రి. యుద్ధప్రయత్నము చేయు.
పోటొడ్డు. దే. వి. ,,
పోట్లాట. దే. వి. ౧. యుద్ధము. ౨. జగడము.
పోట్లాడు. దే. క్రి. ౧. యుద్ధము చేయు. ౨. జగడమాడు.
పోడు. దే. వి. చిరువేరు పైరగు నేల. (పోళ్లుబీళ్లు.)
పోణి. దే. విశే. 'పోఁడి' యొక్క రూపాంతరము.
పోణిమి. దే. వి. చూ. పోఁడిమి.
పోతము. త్స. వి. ౧. ఓడ. ౨. పిల్ల.
పోతరము. దే.వి.౧.మదము.౨. క్రొవ్వు.
పోతరించు. దే. క్రి. ౧. మదించు. ౨. క్రొవ్వు.
పోతు. దే. వి. ౧. పశుపక్ష్యాదిలో పురుషజాతి. ౨. దున్నపోతు. (వ్యతి - పెంటి.)
పోతురాజు. దే. వి. ఒకానొక క్షుద్ర దేవత.
పోత్రి. త్స. వి. వరాహము.
పోనాడు. దే. క్రి. ౧. నిందించు. ౨. పోనొట్టు.
పోని. దే. విశే. పోలిన.
పోబడి. దే. వి. జాడ. రూ. పోవడి.
పోయు. దే. క్రి. ౧. పుట్టు. (చీము పోయు.) ౨. జలము సేయి. మున్నగువానిని విడుచు. 3. బాణము సంధించు (అరిఁబోయు.)
పోరచి. దే. వి. ౧. కానుక. విశే. ౨. వ్యర్థము 3. నిస్సారము.

పోరాట. / పోరాటము. } దే. వి. ౧. కలహము. ౨. యుద్ధము. 3. మల్లాడుట.

పోరాడు. దే. క్రి. ౧. కలహించు. ౨. యుద్ధముచేయు. 3. మల్లాడు.

పోరాని. దే. విణ. ఆప్తమైన. (పోరానిచుట్టము = ఆప్తబంధువు.)

పోరామి. దే. వి. ౧. ఆప్తత. ౨. చెలిమి. 3. సంకటము.

పోరితమాడు. దే. క్రి. కలహముచేయు.

పోరితము. దే. వి. ౧. కలహము. ౨. యుద్ధము. 3. స్పర్ధ.

పోరు. దే. వి. ౧. యుద్ధము. ౨. కలహము. క్రి. 3. యుద్ధముచేయు. ౪. కలహించు.

పోరుదిండి. దే. వి. నారదుఁడు.

పోరుపెట్టు. దే. క్రి. బిడ్డ ఊడుగక గట్టిగా ఏడ్చు.

పోఱఁడు. దే. వి. బాలుఁడు.

పోఱి. దే.వి. ౧.బాలిక ౨. పడుచుది.

పోఱిగాఁడు. దే. వి. బాలుఁడు.

పోలిక. / పోలికి. } దే. వి. సామ్యము. రూ. పోల్కి.

పోలు. దే. క్రి. ౧. ఒప్పు. ౨. యుక్తమగు. 3. శక్యమగు. ౪. సరిపోలు. ౫. వి. ఒప్పు.

పోలుపొందు. దే. వి. వృత్తాంతము.

పోలె. దే. అవ్య. వలె.

పోలేఱు. దే. వి. పోలేఱమ్మ.

పోవు. దే. క్రి. ౧. చచ్చు. ౨. కడచు. 3. చెడు. ౪. అగు. ౫. దగ్గఱ నుండి దూరమునకు అరుగు.

పోవుదెంచు. దే. క్రి. ౧. పోవు. ౨. కడచు.

పోషకుఁడు. త్స. వి. పోషించువాఁడు.

పోషణము. త్స. వి. పోషించుట.

పోషించు. త్స. క్రి. రక్షించు.

పోసనములు. దే. వి. ౧ పాలు. ౨. పైఁపూత. (భాసపోసనములు)

పోసరము. దే. వి. పోతరము.

పోసరించు. దే. క్రి. పోతరించు.

పోహణ. దే.వి. ౧. నేర్పు. ౨. కూర్పు.

పోహణించు. దే. క్రి. కూర్చు.

పోళీ. దే. వి. బొబ్బట్లు.

## పౌ

పౌఁజు. దే. వి. ౧. దండు. ౨. బారు.

పౌఁజులుచేయు. దే. క్రి. బారుతీరు.

పౌఁజులుతీరు. దే. క్రి. బారుతీరు.

పౌత్త్రి. త్స. వి. మనుమరాలు.

పౌత్త్రుఁడు. త్స. వి. మనుమఁడు.

పౌరము. త్స. విణ. పురమునందుఁ బుట్టినది.

పౌరస్త్యము. త్స. విణ. మొదటిది.

పౌరాణికుఁడు. త్స. వి. పురాణము తెలిసినవాఁడు.

పౌరుషము. త్స. విణ. ౧. పురుషభావము. ౨. పురుషప్రయత్నము. 3. పరాక్రమము.

పౌరుషేయము. త్స. విశే. పురుష ప్రాప్తము.
పౌరోహిత్యము. త్స. వి. పురోహితుని కర్మము.
పౌర్ణమాసి. త్స. వి. పున్నమ.
పౌర్ణిమ. త్స. వి. పున్నమ.
పౌలస్త్యుడు. త్స. వి. ౧. కుబేరుడు. ౨. రావణుడు.
పౌలోమి. త్స. వి. ౧. ఇంద్రునిభార్య. ౨. శచి.
పౌషము. త్స. వి. పుష్యమాసము.

ప్ర

ప్రంగ. దే. వి. ఎడముగా చాగినశాఖ.
ప్రకంపనుడు. త్స. వి. మిక్కిలి బలముగల గాలి.
ప్రకటనము. త్స. వి. ప్రకటించుట.
ప్రకటము. త్స. విశే. ప్రసిద్ధము.
ప్రకటించు. త్స. క్రి. ప్రకాశపఱచు.
ప్రకరణము. త్స. వి. ౧. గ్రంథభాగము. ౨. నాటకభేదము. 3. ప్రస్తావము.
ప్రకరము. త్స. వి. ౧. సమూహము. ౨. అగరు.
ప్రకాండము. త్స. విశే. ౧. ప్రశస్తవాచకము. వి. ౨. చెట్టుబోదె.
ప్రకామము. త్స. విశే. ఇచ్చవచ్చినట్లు.
ప్రకారము. త్స. వి. ౧. పోలిక. ౨. భేదము.
ప్రకాశము. త్స. వి. ౧. కాంతి. ౨. ఎండ. విశే. ౧. మిక్కిలి ప్రసిద్ధము. ౨. బయలుపడినది.
ప్రకాశించు. త్స. క్రి. మెఱయు.
ప్రకీర్ణకము. త్స. వి. విసివి.
ప్రకృతము. త్స. విశే. చక్కగా జేయబడినది.
ప్రకృతి. త్స. వి. ౧. స్వభావము. ౨. "స్వామి. అమాత్యుడు. సుహృత్తు. కోశము. రాష్ట్రము. దుర్గము. బలము"—ఇవి యేడు ప్రకృతులు. 3. ప్రత్యయమురాక మునుపున్న శబ్దస్వరూపము.
ప్రకృష్టము. త్స. విశే. ప్రకర్షముగలది.
ప్రకోపము. త్స. వి. ముమ్మరము.
ప్రకోపించు. త్స. క్రి. ముమ్మరించు.
ప్రకోష్ఠము. త్స. వి. ౧. తొట్టికట్టు. ౨. ముంజేయి.
ప్రక్క. దే.వి. ౧. వైపు. ౨. పక్షము.
ప్రక్రమము. త్స. వి. ప్రారంభము.
ప్రక్రాంతము. త్స.విశే. ౧. ఆరంభింపబడినది. ౨. కడవబడినది.
ప్రక్రియ. త్స. వి. అధికారము.
ప్రక్వణము. త్స. వి. వీణాధ్వని.
ప్రక్వాణము. త్స. వి. ,,
ప్రక్షాళనము. త్స. వి. చక్కగా కడుగుట.
ప్రక్షాళించు. త్స. క్రి. చక్కగా కడుగు.

ప్రక్షాళితము. త్స. విణ. కడుగఁబడినది.
ప్రక్షిప్తము. త్స. విణ. చక్కఁగా విసరివేయఁబడినది.
ప్రక్షీణము. త్స. విణ. మిక్కిలి క్షయించినది.
ప్రక్షేపము. త్స. విణ. చక్కఁగా విసరి వేయుట.
ప్రక్షోభించు. త్స. క్రి. మిక్కిలి కలఁత పడు.
ప్రఖ్యాతము. త్స. విణ. మిక్కిలి ప్రసిద్ధి కెక్కినది.
ప్రఖ్యాతి. త్స. వి. మిక్కిలి ప్రసిద్ధి.
ప్రగల్భుఁడు. త్స. విణ. ప్రతిభకల వాఁడు.
ప్రగాఢము. త్స. విణ. ౧. అధికము. ౨. దృఢము.
ప్రగ్రహము. త్స. వి. ౧. పగ్గము. ౨. చెఱ.
ప్రఘణము. } త్స. వి. తలవాకిటి
ప్రఘాణము. } నున్నగది.
ప్రచండము. త్స. విణ. వాఁడిమిగలది.
ప్రచయము. త్స. వి. సమూహము.
ప్రచారము. త్స. వి. ౧. సంచారము. ౨. అనుభవము. 3. వ్యవహారము.
ప్రచురము. త్స. విణ. అధికము.
ప్రచేతసుఁడు. త్స. వి. వరుణుఁడు.
ప్రచోదనము. త్స. వి. ప్రేరేపించుట.
ప్రచ్ఛదము. త్స. వి. ౧. కప్పడు. ౨. ఆచ్ఛాదనము.
ప్రచ్ఛన్నము. త్స. విణ. కప్పఁబడినది.
ప్రచ్ఛాదించు. త్స. క్రి. కప్పు.
ప్రజ. త్స. వి. ౧. జనము. ౨. సంతతి.
ప్రజాపతి. త్స. వి. బ్రహ్మ.
ప్రజావతి. త్స. వి. తోఁడఁబుట్టినవాని భార్య.
ప్రజ్ఞ. త్స. వి. బుద్ధి.
ప్రజ్ఞానము. త్స. వి. ౧. బుద్ధి. ౨. గుఱుతు.
ప్రజ్ఞుఁడు. త్స. విణ. పండితుఁడు.
ప్రజ్ఞువు. త్స. విణ. దొడ్డకాళ్ళవాఁడు.
ప్రజ్వలనము. త్స. వి. మండుట.
ప్రజ్వలించు. త్స. క్రి. ౧. మండు. ౨. ప్రకాశించు.
ప్రడీనము. త్స. వి. మొదటి యెగుడు.
ప్రణతి. త్స. వి. నమస్కారము.
ప్రణతుఁడు. త్స. విణ. మిక్కిలి వంగిన వాఁడు.
ప్రణమిల్లు. త్స. క్రి. నమస్కరించు.
ప్రణయకోపము. త్స. వి. వలపుటలుక.
ప్రణయము. త్స. వి. ౧. ప్రార్థనము. ౨. ప్రేమము.
ప్రణయిని. త్స. వి. ప్రియురాలు.
ప్రణవము. త్స. వి. ఓంకారము.
ప్రణాదము. త్స. వి. గట్టిమ్రోఁత.
ప్రణామము. త్స. వి. నమస్కారము.
ప్రణాళి. త్స. వి. జలదారి. రూ. (ప్రణాళము, ప్రణాళి, ప్రణాళిక,
ప్రణిధి. త్స. వి. వేగులవాఁడు.

ప్రణిపత్తి. ⎫ త్స. వి. నమస్కా
ప్రణిపాతము. ⎭ రము.
ప్రణిహితము. త్స. విశ. ఉంచఁబడినది.
ప్రణుతము. త్స. విశ. మిక్కిలి పొగడఁ బడినది.
ప్రణుతి. త్స. వి. మిక్కిలి పొగడిక.
ప్రణుతించు. త్స. క్రి. మిక్కిలి పొగడు.
ప్రతాపము. త్స. వి. ౧. వేఁడిమి. ౨. కోశబలములవలనఁ గలిగిన తేజము.
ప్రతాపించు. త్స. వి. ప్రతాపము చూపు.
ప్రతారకుఁడు. త్స. విశ. మోసపుచ్చు వాఁడు.
ప్రతారణము. త్స. వి. మోసము.
ప్రతారించు. త్స. క్రి. మోసపుచ్చు.
ప్రతారితుఁడు. త్స. విశ. మోసపుచ్చఁ బడినవాఁడు.
ప్రతి. త్స. అవ్య. ౧. సమానము. ౨. మాఱు.
ప్రతికాయము. త్స. వి. మాఱుచేతి.
ప్రతికూలము. త్స. విశ. అనుకూలము కానిది.
ప్రతికృతి. త్స. వి. ౧. ప్రతిమ ౨. ప్రతీకారము.
ప్రతిక్రియ. త్స. వి. ౧. ప్రతికారము. ౨. మందు.
ప్రతిగ్రహము. త్స. వి. దానము గ్రహించుట.

ప్రతిఘటనము. త్స. వి. మాఱొడ్డుట.
ప్రతిఘటించు. త్స. క్రి. మాఱొడ్డు.
ప్రతిఘము. త్స. వి. మాఱుదెబ్బ.
ప్రతిఘాతము. త్స. వి. మాఱుదెబ్బ.
ప్రతిఘాతనము. త్స. వి. చంపుట.
ప్రతిఘాతి. త్స. విశ. పగదీర్చుకొను వాఁడు.
ప్రతిచ్ఛాయ. త్స. వి. ప్రతిమ.
ప్రతిజ్ఞ. త్స. వి. ౧. అంగీకారము. ౨. ఏదేని నొకకార్యము చేసెదనని దృఢముగా చెప్పుట.
ప్రతిజ్ఞాతము. త్స. విశ. అంగీకరింపఁ బడినది.
ప్రతిజ్ఞానము. త్స. వి. అంగీకారము.
ప్రతిదానము త్స. వి. వినిమయము.
ప్రతిదినము. త్స. వి. దినదినము.
ప్రతిన. వై. వి. పంతము.
ప్రతినిధి. త్స. వి. ౧. మాఱు. ౨. ప్రతిమ.
ప్రతినివిష్టుఁడు. త్స. వి. పట్టుపట్టిన వాఁడు.
ప్రతినివేశము. త్స. వి. అక్కఱపట్టు.
ప్రతిపక్షుఁడు. త్స. వి. శత్రువు.
ప్రతిపత్తి. త్స. వి. గౌరవము.
ప్రతిపత్తు. త్స. వి. పాడ్యమి.
ప్రతిపన్నము. త్స. వి. అంగీకరింపఁ బడినది.
ప్రతిపాదనము. త్స. వి. ౧. ఇచ్చుట. ౨. కలిగించుట.

ప్రతిపాదించు. త్స. క్రి. ౧. కల్గించు. ౨. తెలుపు.

ప్రతిపాదితము. త్స. విణ. ప్రతిపాదింపఁబడినది.

ప్రతిపాలకుఁడు. త్స. విణ. రక్షకుఁడు.

ప్రతిపాలనము. త్స. వి. రక్షణము.

ప్రతిపాలించు. త్స. క్రి. రక్షించు

ప్రతిఫలనము. త్స. విణ. మాఱురూపము తోఁచుట.

ప్రతిఫలించు. త్స. క్రి. మాఱురూపము తోఁచు.

ప్రతిబంధము. త్స. వి. అడ్డగింత.

ప్రతిబంధించు. త్స. క్రి. అడ్డగించు.

ప్రతిబింబము. త్స. వి. ప్రతిరూపము.

ప్రతిభ. త్స. వి. అప్పటి కప్పటికి స్ఫురించుబుద్ధి.

ప్రతిమ. త్స. వి. ౧. బొమ్మ. ౨. పోలిక.

ప్రతిముక్తము. త్స. విణ. ౧. కట్టఁబడినది. ౨. తొడుగఁబడినది.

ప్రతియోగి. త్స. విణ. విరోధి.

ప్రతిరోధము. త్స. వి. ఎదిరించుట.

ప్రతిరోధి. త్స. విణ. ఎదిరించువాఁడు.

ప్రతిలోమము. త్స. విణ. అవరోహణ క్రమము గలది.

ప్రతివసథము. త్స. వి. ఇల్లు.

ప్రతివాక్యము. త్స. వి. మఱుమాట.

ప్రతివాది. త్స. వి. వాదికి ప్రతిపక్షమువాఁడు.

ప్రతివాదించు. త్స. క్రి. వాదికి ప్రతిపక్షముగా మాటలాడు.

ప్రతివిధానము. త్స. వి. మాఱుచేఁత.

ప్రతివేశము. త్స. వి. ఇరుగు పొరుగు ఇల్లు.

ప్రతిశీర్షకము. త్స. వి. ౧. కుదువ. ౨. ఆది.

ప్రతిశ్యాయము. త్స. వి. పడిసెము.

ప్రతిషిద్ధము. త్స. విణ. నిషిద్ధము.

ప్రతిషేధము. త్స. వి. నిషేధము.

ప్రతిష్టంభము. త్స. వి. అడ్డగింత.

ప్రతిష్టబ్ధము. త్స. విణ. అడ్డగింపఁబడినది.

ప్రతిష్ఠ. త్స. వి. ౧. గౌరవము. ౨. శాశ్వతముగ నిలుపుట.

ప్రతిష్ఠించు. త్స. క్రి. శాశ్వతముగ నిలుపు.

ప్రతిసరము. త్స. వి. ౧. చేత కట్టుకొనుదారము. ౨. పూలదండ. 3. సేనవెనుకటిదిక్కు.

ప్రతిసీర. త్స. వి. ౧. తెర. ౨. యవనిక.

ప్రతిస్పర్ధ. త్స. వి. పోటి.

ప్రతిస్పర్ధించు. త్స. క్రి. పోటీచేయు.

ప్రతిహతి. త్స. వి. విఘాతము.

ప్రతిహతుఁడు. త్స. విణ. అడ్డగింపఁబడినవాఁడు.

ప్రతిహారి. / ప్రతిహారుడు. త్స. వి. వాకిటి కావలివాఁడు.

ప్రతీకము. త్స. వి. అవయవము.

ప్రతీకారము. త్స. వి. ప్రత్యపకారము.

ప్రతీక్షణము. త్స. వి. ౧. (ప్రత్యాశతో) ఎదురుచూచుట. క్రి. ౨. ప్రతీక్షించు.
ప్రతీచి. త్స. వి. పడమటిదిక్కు.
ప్రతీచీనము. త్స. విశ. పశ్చిమదిక్కునందుఁ బుట్టినది.
ప్రతీతము. త్స. విశ. ప్రసిద్ధికెక్కినది.
ప్రతీతి. త్స. వి. ౧. ప్రసిద్ధి. ౨. ఎఱుక.
ప్రతీపము. త్స. విశ. ప్రతికూలము.
ప్రతీపుఁడు. త్స. విశ. పగవాఁడు.
ప్రతీరము. త్స. వి. గట్టు.
ప్రతీహారము. త్స. వి. ద్వారము.
ప్రతీహారి. } త్స. వి. ద్వారపాలకుఁడు.
ప్రతీహారుఁడు. }
ప్రత్తి. దే. వి. విత్తులతో నుండు దూది.
ప్రత్నము. త్స. విశ. పురాతనము.
ప్రత్యక్షము. త్స. విశ. కంటికిఁ గనఁబడినది.
ప్రత్యగ్రము. త్స. వి. నూతనము.
ప్రత్యర్థి. త్స. శత్రువు.
ప్రత్యనీకుఁడు. త్స. వి. శత్రువు.
ప్రత్యయము. త్స. వి. ౧. విశ్వాసము. ౨. శపథము.
ప్రత్యవాయము. త్స. వి విఘ్నము.
ప్రత్యహము. త్స. వి. ప్రతిదినము.
ప్రత్యాఖ్యానము. త్స. వి. కూడదని నిరాకరించుట.
ప్రత్యాదేశము. త్స. వి. ,,
ప్రత్యాబ్దికము. త్స. వి. ఏఁటేఁటఁ జేసెడి శ్రాద్ధము.
ప్రత్యాశ. త్స. వి. ఆడియాస.
ప్రత్యుత్తరము. త్స. వి. మాఱుత్తరము.
ప్రత్యుత్థానము. త్స. వి. అభ్యుత్థానము. (ఎదురుకోలు.)
ప్రత్యుద్గతుఁడు. త్స. వి. ఎదురుకొని తేచినవాఁడు.
ప్రత్యుద్గమము. త్స. వి. ఎదురుకోలు.
ప్రత్యూషము. } త్స. వి. ప్రభాతము.
ప్రత్యూషము. }
ప్రత్యూహము. త్స. వి. విఘ్నము.
ప్రత్యేకము. త్స. వి. వేఱువేఱు.
ప్రత్యేకించు. త్స. క్రి. వేఱు చేయు.
ప్రథ. త్స. వి. ప్రఖ్యాతి.
ప్రథమము. త్స. వి. ౧. మొదటిది. ౨. ముఖ్యము.
ప్రథితుఁడు. త్స. విశ. ప్రసిద్ధుఁడు.
ప్రథిమము. త్స. వి. విరివి.
ప్రదక్షిణము. త్స. వి. ప్రదక్షిణించుట.
ప్రదక్షిణించు. త్స. క్రి. ౧. దేవతాదులనుద్దేశించి గుడికి తిరిగివచ్చు. ౨. గౌరవించు.
ప్రదరము. త్స. వి. బాణము.
ప్రదర్శకుఁడు. త్స. విశ. చూపించువాఁడు.
ప్రదీపము. త్స. వి. దీపము.
ప్రదేశము. త్స. వి. కానుక.

పరిదేశము. త్స. వి. ౧. చోటు. ౨. దేశము.

పరిదేవనము. త్స. వి. మునిమాపు

పరిద్యుమ్నుఁడు. త్స. వి. మన్మథుఁడు. వ్యు. పరికృష్టమైన బలము కలవాఁడు.

పరిద్యోతనుఁడు. త్స. వి. సూర్యుఁడు.

పరిధనము. త్స. వి. యుద్ధము.

పరిధానము. త్స. వి. ౧. ప్రకృతి. ౨. పరమాత్మ. 3. వి. ముఖ్యము.

పరిధారణము. త్స. వి. ఫలమపేక్షించి యిచ్చుట.

పరిధావించు. త్స. క్రి. పరుగెత్తు.

పరిధ్వంసము. త్స. వి. నాశము.

పరిన్న. దే. విణ. మనోజ్ఞము.

పరిన్నన. దే. వి. మనోజ్ఞత.

పరిప. త్స. వి. చలిపందిరి.

పరిపంచము. త్స. వి. ౧. భూలోకము. ౨. సంసారము.

పరిపంచించు. త్స. క్రి. విస్తరించు.

పరిపంచితము. త్స. విణ. విస్తరింపఁబడినది.

పరిపత్తి. త్స. వి. భక్తిపరులు చేయు శరణాగతి.

పరిపదము. త్స. వి. ముంగాలు.

పరిపన్నుఁడు. త్స. విణ. పరిపత్తిగలవాఁడు.

పరిపాతము. త్స. వి. కొండచఱియ.

పరిఫుల్లము. త్స. విణ. వికసించినది.

పరిబంధము. త్స. వి. ౧ కల్పనాకథ. ౨. కావ్యము.

పరిబలము. త్స విణ. మిక్కిలి బలము గలది.

పరిబలు. దే. వి. ౧. అతిశయిల్లు. ౨. వర్ధిల్లు.

పరిబుద్ధుఁడు. త్స. విణ. మేలుకొన్నవాఁడు.

పరిబోధము. త్స. వి. మేలుకొనుట.

పరిబోధించు. త్స. క్రి. ఎక్కుఁగాఁదెలుపు.

పరిబ్బు. దే. క్రి ౧. వ్యాపించు. ౨. వర్ధిల్లు 3. అతిశయించు. ౪. వర్ధిల్లు.

పరిభ. త్స. వి. ౧ కాంతి. ౨. దుర్గ.

పరిభంజనుఁడు. త్స. వి. వాయువు.

పరిభవ. త్స. వి. ౧. ఒకానొక సంవత్సరము. ౨. పుట్టుక.

పరిభవించు. త్స. క్రి. ౧. పుట్టు. ౨. కలుగు.

పరిభాకరుఁడు. త్స. వి. సూర్యుఁడు.

పరిభాతము. త్స. వి. వేకువ

పరిభావము. త్స. వి. ౧. శక్తి. ౨. కోశబలము వలనఁ గలిగిన తేజస్సు.

పరిభువు. త్స. వి. ౧. విష్ణువు. విణ. ౨. అధిపుఁడు.

పరిభృతి. త్స. వి. మొదలు.

పరిమ. త్స వి. యథార్థజ్ఞానము (వ్యతి- భ్రమ.)

పరిమత్తుఁడు. త్స. విణ. పరిమాదపడినవాఁడు.

ప్రమథనము. త్స. వి. చంపుట
ప్రమథుఁడు. త్స. వి. శివభటుఁడు.
ప్రమద. త్స వి. ఆఁడుది.
ప్రమదావనము త్స వి. ఆఁడువారు తిరిగెడి యుద్యానవనము. రూ. ప్రమదవనము.
ప్రమాణము. త్స. వి. ౧. సత్యము. ౨. మేర. 3. అంగుళీయకము.
ప్రమాదము. త్స. వి. ఏమఱుపాటు.
ప్రమాణి. / ప్రమాదిచ. త్స. వి. ఒకానొక సంవత్సరము.
ప్రమిద. దే. వి. దీపము వెలిఁగించు పాత్రము. రూ. ప్రమ్మిద.
ప్రముదితుఁడు. త్స. విశ. సంతోషించినవాఁడు.
ప్రమేయము. త్స. విశ. తెలియఁదగినది.
ప్రమోదము. త్స. వి. సంతోషము.
ప్రమోదించు. త్స. క్రి. సంతోషించు.
ప్రమోదూతి. త్స. వి. ఒకానొక సంవత్సరము.
ప్రమ్మిద. దే. వి. ప్రమిదకు రూపాంతరము.
ప్రయతుఁడు. త్స. విశ. పరిశుద్ధుఁడు.
ప్రయత్నము. త్స. వి. మిక్కిలి యత్నము.
ప్రయత్నించు. త్స. క్రి. మిక్కిలి యత్నించు.
ప్రయాగము. త్స. వి. తీర్థవిశేషము.
ప్రయాణము. త్స. వి. బయలుదేఱుట.
ప్రయాణించు. త్స. వి. ప్రయాణమగు.
ప్రయాతము. త్స. విశ. ప్రయాణమై పోయినది.
ప్రయాసపడు. త్స. క్రి. పాటుపడు.
ప్రయాసము. త్స. వి. పాటు.
ప్రయోగము. త్స. వి. ౧. నడపుట. ౨. ప్రయత్నము. 3. కర్తకర్మక్రియల కూడిక.
ప్రయోగించు. త్స. క్రి. ౧. నడపు. ౨. గ్రంథమునందు వాక్యము నుపయోగించు.
ప్రయోజకుఁడు. త్స. విశ. ౧. కార్యము నెఱవేర్చువాఁడు. ౨. ప్రయోగించువాఁడు.
ప్రయోజనము. త్స. వి. ౧. హేతువు. ౨. కార్యము.
ప్రరోహము. త్స. వి. మొలక.
ప్రలంబఘ్నుఁడు. త్స. వి. బలరాముఁడు.
ప్రలంభము. త్స. వి. వంచనము.
ప్రలాపము. త్స. వి. ౧. అర్థములేని మాట ౨. పలవరము.
ప్రలాపించు. త్స. క్రి. పలవరించు.
ప్రలోభనము. త్స. వి. మృగములను పట్టుటకు పెట్టు మచ్చు.
ప్రలోభించు. త్స. క్రి. ఆసఁగొలుపు.
ప్రల్లఁదనము. దే. వి. ప్రల్లదము.
ప్రల్లదము. దే. వి. ౧. పారుష్యము. ౨. దుర్భాషణము. విశ. 3. ప్రల్లదకాఁడు

ప్రల్లదీఁడు. దే. విశే. దుష్టుఁడు.
ప్రల్లదుఁడు. దే. విశే. దుష్టుఁడు.
ప్రల్లదురాలు. దే. విశే. దుష్టురాలు.
ప్రవక్త. త్స. విశే. చక్కఁగా మాటలాడువాఁడు.
ప్రవచనము. త్స. వి. గొప్పమాట.
ప్రవణుఁడు. త్స. విశే. ఆసక్తుఁడు.
ప్రవరము. త్స. వి. ౧. కులము. ౨. పేరు.
ప్రవరుఁడు. త్స. విశే. శ్రేష్ఠుఁడు.
ప్రవర్తనము. త్స. వి. నడవడి.
ప్రవర్తించు. త్స. క్రి. నడచు.
ప్రవర్ధిల్లు. త్స. క్రి. మిక్కిలి వృద్ధిఁబొందు.
ప్రవహనము. త్స. వి. ౧. ఓడ. ౨. తెప్ప.
ప్రవహించు. త్స. క్రి. ఏఱుపాఱు.
ప్రవాహము. త్స. వి. ౧. వెల్లువ. ౨. పరంపర.
ప్రవాళము. త్స. వి. ౧. పగడము. ౨. చిగురు.
ప్రవిష్టుఁడు. త్స. విశే. ప్రవేశించినవాఁడు.
ప్రవీణుఁడు. త్స. వి. ౧. తీర్పరి. ౨. నేర్పరి.
ప్రవృత్తుఁడు. త్స. విశే. ప్రవర్తించినవాఁడు.
ప్రవృత్తి. త్స. వి. ౧. వృత్తాంతము. ౨. నడక. 3. బ్రదుకుతెరువు.
ప్రవృద్ధము. త్స. విశే. పెరిగినది.
ప్రవేశము. త్స. వి. ౧. చొరవ. క్రి. ౨. ప్రవేశించు.
ప్రవ్రజితుఁడు. త్స. వి. సన్న్యాసి.
ప్రవ్రజ్య. త్స. వి. ౧. సన్న్యాసాశ్రమము. ౨. పర్యటనము.
ప్రశంస. త్స. వి. ౧. స్తోత్రము. క్రి. ౨. ప్రశంసించు.
ప్రశస్తము. త్స. విశే. ప్రసిద్ధికెక్కినది.
ప్రశస్తి. త్స. వి. ప్రసిద్ధి.
ప్రశస్యము. త్స. విశే. ప్రసిద్ధికెక్కఁదగినది.
ప్రశ్నము. త్స. వి. అడుగుట. రూ. ప్రశ్న.
ప్రశాంతి. త్స. వి. మిక్కిలి శాంతి.
ప్రశాంతుఁడు. త్స. విశే. మిక్కిలి శాంతినొందినవాఁడు.
ప్రశ్రయము. త్స. వి. వినయము.
ప్రశ్రితుఁడు. త్స. విశే. వినీతుఁడు.
ప్రష్ఠుఁడు. త్స. విశే. అగ్రేసరుఁడు.
ప్రసంగము. త్స. వి. ౧. ప్రస్తావము. ౨. విషయవిస్తరము.
ప్రసంగించు. త్స. క్రి. ౧. ప్రస్తావించు. ౨. ఏదేనియొక సంగతిని విస్తరించు.
ప్రసక్తి. త్స. వి. ప్రస్తావము. క్రి. ప్రసక్తించు.
ప్రసన్నము. త్స. విశే. ౧. సంతుష్టము. ౨. నిర్మలము.
ప్రసభము. త్స. వి. బలాత్కారము.
ప్రసరము. త్స. వి. ౧. వేగము. ౨. వ్యాపనము.

ప్రసరించు. త్స. వి. ౧.వ్యాపించు. దే. క్రి. ౨.వ్యాపించు. రూ. ప్రసరిల్లు.
ప్రసర్పణము. త్స. వి. వ్యాపనము.
ప్రసవము. త్స. వి. ౧. పువ్వు. ౨. కానుపు.
ప్రసవించు. త్స. క్రి. (బిడ్డ) కను.
ప్రసాదము. త్స. వి. ౧. అనుగ్రహము. ౨ స్వాస్థ్యము.
ప్రసాదించు. త్స. క్రి. అనుగ్రహించి యిచ్చు.
ప్రసాధనము. త్స. వి. వస్త్రాద్యలంకారము.
ప్రసాధని. త్స. వి. దువ్వెన.
ప్రసాధితుఁడు. త్స. విశ. అలంకరింపఁబడినవాఁడు.
ప్రసారణము. త్స. వి. చాఁచుట.
ప్రసితుఁడు. త్స. విశ. తత్పరుఁడు.
ప్రసిద్ధము. త్స. విశ. ప్రసిద్ధికెక్కినది.
ప్రసిద్ధి. త్స. వి. ఖ్యాతి.
ప్రసూనము. త్స. వి. పుష్పము.
ప్రసువు. త్స. వి. తల్లి.
ప్రసూత. త్స. వి. బాలెంతరాలు.
ప్రసూతి. త్స. వి. కానుపు.
ప్రస్తరము. త్స. వి. ౧. రాయి. ౨. చిగుళ్ళసెజ్జ.
ప్రస్తరించు. త్స. క్రి. విస్తరించు.
ప్రస్తవము. త్స. వి. విషయము.
ప్రస్తావము. త్స. వి. ౧. అవసరము. ౨. చెప్పుట.
ప్రస్తావించు. త్స. క్రి. ప్రస్తావమునకు తెచ్చు.
ప్రస్తుతము. త్స. విశ. స్తుతింపఁబడినది.
ప్రస్తుతి. త్స. వి. మిక్కిలి స్తోత్రము.
ప్రస్తుతించు. త్స. క్రి. మిక్కిలిపొగడు.
ప్రస్థము. త్స. వి. ౧. నాలుగు మానికల కొలఁది. ౨. కొండచఱియ.
ప్రస్థానము. త్స. వి. ప్రయాణము.
ప్రస్థాపించు. త్స. క్రి. చక్కఁగా స్థాపించు.
ప్రస్థితము. త్స. విశ. ప్రయాణమై పోయినది.
ప్రస్రవణము. త్స. వి. సెలయూట.
ప్రహతము. త్స. విశ. ౧. కొట్టఁబడినది. ౨. వాడిచేయఁబడినది.
ప్రహరణము. త్స. వి. ఆయుధము.
ప్రహరము. త్స. వి. ౧. దెబ్బ. ౨. జాము.
ప్రహరి. దే. వి. ప్రాకారము.
ప్రహరించు. దే. క్రి. దెబ్బకొట్టు.
ప్రహరిచరించు. } దే. క్రి. ౧. ప్రదక్షిణించు. ౨. చుట్టుదిరుగు.
ప్రహరిచుట్టు. }
ప్రహరిదిరుగు. }
ప్రహసనము. త్స. వి. ౧. పెద్దనవ్వు. ౨. నాటకభేదము.
ప్రహస్తము. త్స. వి. ౧.చప్పట. ౨. చపేటము.
ప్రహారము. త్స. వి. దెబ్బ.
ప్రహి. త్స. వి. నూయి.

ప్రహితుఁడు. త్స. విణ. పంపఁబడిన వాఁడు.
ప్రహ్లాదము. త్స. వి. సంతోషము.
ప్రహ్వము. త్స. విణ. ౧. నమ్రము. ౨. ఆసక్తము.
ప్రళయము. త్స. వి. ౧. అపాయము. ౨. కల్పాంతము. 3. మృత్యువు.

ప్రా

ప్రాంగణము. త్స. వి. ముంగిలి.
ప్రాంతము. త్స. వి. ౧. సమీపము. ౨. తీరము.
ప్రాంశువు. త్స. విణ. మిక్కిలి పొడవైనది.
ప్రాఁకు. దే. క్రి. ౧. బోర్లగిలి జరుగు. ౨. ఎక్కు. వి. ౧. పాఁచి. ౨. తీఁగె అల్లుటకు సమీపమున పెట్టిన కొయ్యలోనగునది.
ప్రాఁకుడు. దే. వి. ౧. పాఁచి. ౨. ప్రాఁకుట.
ప్రాఁకుడెంచు. దే. క్రి. ప్రాఁకు.
ప్రాఁకులాడు. దే. క్రి. ప్రాఁకియెక్కు.
ప్రాఁకొను. దే. క్రి. పాఁచిపట్టు.
ప్రాఁచి. దే. వి. పాఁచి.
ప్రాఁగబ్బము. దే. వి. వేదము.
ప్రాఁజెదువులు. దే. వి. బ. వేదము.
ప్రాఁత. దే. వి. ౧. వస్త్రము. ౨. భృత్యుఁడు. 3. జీర్ణవస్త్రము. విణ. ౧. పూర్వము. ౨. జీర్ణము. 3. పురాతనము.
ప్రాఁతగిల్లు. దే. క్రి. ప్రాఁతపడు. రూ. ప్రాఁతగిలు.
ప్రాఁతపడు. దే. క్రి. ప్రాఁతదియగు.
ప్రాఁబడు. దే. క్రి. ప్రాతదియగు.
ప్రాఁబలుకులు. దే. వి. వేదము.
ప్రాకటము. త్స. విణ. ప్రసిద్ధము.
ప్రాకారము. త్స. వి. ప్రహరి.
ప్రాకృతము. త్స. వి. ఒకానొకభాష.
ప్రాకృతుఁడు. త్స. వి. పామరుఁడు.
ప్రాకెన. } దే. వి. వివాహములోని
ప్రాకెన్న. } మూఁడవనాటితంతు.
ప్రాక్తనము. త్స. విణ. పురాతనము.
ప్రాగల్భ్యము. త్స. వి. ప్రగల్భత.
ప్రాగ్భారము. త్స. వి. అతిశయము.
ప్రాగ్రసరుఁడు. త్స. విణ. ముందు నడచువాఁడు.
ప్రాగ్ర్యము. త్స. విణ. ముందునడచు వాఁడు.
ప్రాచి. త్స. వి. తూర్పుదిక్కు.
ప్రాచిత్తము. త్స. వి. ప్రాయశ్చిత్తము.
ప్రాచీనము. త్స. విణ. ౧. పూర్వ కాలమునఁ గలిగినది. ౨. తూర్పు దిక్కునఁ గలిగినది. వి. 3. కంపకోట.
ప్రాచీరము. త్స. వి. కంపకోట.
ప్రాచుర్యము. త్స. వి. ప్రచురత్వము.
ప్రాచేతసుఁడు. త్స. వి. వాల్మీకి.
ప్రాచ్యము. త్స. విణ. తూర్పుదిక్కునందలిది.

ప్రాజాపత్యము. త్స. వి. ౧. వీరు ఇరువురును కూడి ధర్మము చేయుండని వరునితో చెప్పి కన్యను ఇచ్చి చేయు పెండ్లి. ౨. అధికారము.

ప్రాజ్ఞి. త్స. వి. ౧. లోకవ్యవహారము చక్కగా నెఱింగిన తెలివి కల యాఁడుది. ౨. పండితుని భార్య.

ప్రాజ్ఞుఁడు. త్స. వి. ౧. సమర్థుఁడు. ౨. పండితుఁడు.

ప్రాజ్యము. త్స. విశ. అధికము.

ప్రాడ్వివాకుఁడు. త్స. వి. తగవరి.

ప్రాణఘ్నము. త్స. విశ. ప్రాణహింసకము.

ప్రాణనాథుఁడు. త్స. వి. ౧. యముఁడు. ౨. ప్రియుఁడు.

ప్రాణము. త్స. వి. ౧. ఉసురు. ౨. కావ్యజీవము. 3. హృదయమందలి గాలి.

ప్రాణాచారము. త్స. వి. ప్రాయోపవేశము.

ప్రాణాచారముపడు. త్స. వి. ప్రాయోపవేశము చేయు.

ప్రాణాయామము. త్స. వి. నాసికా ముఖములందు సంచరించు వాయువును మంత్రపూర్వకముగా నిరోధించుట.

ప్రాణి. త్స. వి. ౧. మనుష్యాది జంతువు. విశ. ౨. ప్రాణముగలది.

ప్రాణిద్యూతము. త్స. వి. కోడి పందెము లోనగునది.

ప్రాతికూల్యము. త్స. వి. ప్రతికూలత్వము.

ప్రాతిపదికము. త్స. వి. ధాతుభిన్నంబును, ప్రత్యయభిన్నంబును, ప్రత్యయాంత భిన్నంబును, అగు స్వార్థవచ్ఛబ్ద రూపము.

ప్రాతివేశిని. త్స. వి. దూతికా విశేషము.

ప్రాథమికుఁడు. త్స. వి. ప్రథముఁడు.

ప్రాథమ్యము. త్స. వి. ప్రథమత్వము.

ప్రాథేయపడు. త్స. క్రి. వేడుకొను.

ప్రాదుర్భవించు. త్స. క్రి. ౧. ఆవిర్భవించు ౨. పుట్టు.

ప్రాదుర్భావము. త్స. వి. పుట్టుక.

ప్రాదుర్భూతము. త్స. విశ. పుట్టినది.

ప్రాదేశము. త్స. వి. జుత్తెడు.

ప్రాధాన్యము. త్స. వి. ప్రధానత్వము.

ప్రాపకుఁడు. త్స. విశ. ప్రాపించు వాఁడు.

ప్రాపణము. త్స. వి. ప్రాప్తి.

ప్రాపించు. త్స. క్రి. పొందు.

ప్రాపు. త్స. వి. ఆశ్రయము.

ప్రాప్తము. త్స. విశ. ౧. కూడుకొనునది. ౨. పొందఁబడినది.

ప్రాప్తరూపుఁడు. త్స. విశ. చక్కని వాఁడు.

ప్రాప్తి. త్స. వి. ౧. శుభోదయము. ౨. పొందు.

ప్రాప్తించు. త్స. క్రి. ౧. కలుగు. ౨. చిక్కు.

ప్రాబల్యము. త్స. విణ. బలిష్ఠత.
ప్రాభవము. త్స. వి. దొరతనము.
ప్రాభృతము. త్స. వి. కానుక.
ప్రామాణికుఁడు. త్స. విణ. ౧. శాస్త్రము నెఱింగినవాఁడు. ౨. మేర మీఱనివాఁడు. 3. సత్యము తప్పనివాఁడు.
ప్రామాణ్యము. త్స.వి. ౧. సాక్ష్యము. ౨. దృష్టాంతము.
ప్రామిడి. దే. విణ. క్రూరము.
ప్రామినుకులు. దే. వి. వేదము.
ప్రాము. దే. క్రి. ౧. రాచు. ౨. పులుము. 3. ఖండించు.
ప్రాముడు. దే. వి. పులుముడు.
ప్రాయము. త్స. వి. ౧. వయస్సు. ౨. బాహుళ్యము.
ప్రాయశ్చిత్తము. త్స. వి. పాపపరిహారము చేసెడి కర్మము.
ప్రాయి. దే. వి. పౌరుషము.
ప్రాయిఁడి. దే. విణ. ౧. పౌరుషహీనుఁడు. ౨. భాగ్యహీనుఁడు.
ప్రాయికము. త్స. విణ. సామాన్యము.
ప్రాయేలు. దే. వి. సముద్రము.
ప్రారంభము. త్స. వి. యత్నము.
ప్రారంభించు. త్స. క్రి. యత్నించు.
ప్రారబ్ధము.త్స.వి.౧. శరీరము నెత్తించు కర్మవిశేషము. విణ. ౨. ప్రారంభింపఁబడినది.
ప్రార్థకుఁడు. త్స. విణ. ౧. వేఁడువాఁడు. ౨. అడుగువాఁడు.
ప్రార్థన. త్స. వి. ౧. వేఁడుట. ౨. అడుగుట.
ప్రార్థించు. త్స. క్రి. ౧. వేఁడు. ౨. అడుగు.
ప్రార్థితము. త్స. విణ. అడుగఁబడినది.
ప్రాలు. దే. వి. బ. ౧. తలఁబ్రాలు. ౨. బియ్యము.
ప్రాలుమాలిక. దే. వి. సోమరితనము.
ప్రాలుమాలు. దే. క్రి. సోమరితనము పొందు.
ప్రాలేయము. త్స. వి. మంచు.
ప్రాల్మాలిక. దే. వి. బద్ధకము.
ప్రాల్మాలు. దే. క్రి. 'ప్రాలుమాలు' నకురూపాంతరము.
ప్రావ. దే. వి. ౧. పద్ధతి. విణ. ౨. అనుకూలము. 3. యుక్తము.
ప్రావగొట్టు. దే. క్రి. దోపముగొట్టు.
ప్రావారము. త్స. వి. ఉత్తరీయము.
ప్రావీణ్యము. దే. వి. నేర్పు.
ప్రావృట్టు. త్స. వి. వర్షర్తువు.
ప్రావృతము. త్స. విణ. కప్పుకోఁబడినది.
(ప్రావృ)షేణ్యము. త్స. విణ. వర్షాకాలమునఁబుట్టినది.
ప్రాఁనేలుపు. దే.వి. ౧. పూర్వదేవుఁడు. ౨. రాక్షసుఁడు.
ప్రాశనము. త్స. వి. భోజనము.

ప్రాశస్త్యము. త్స. వి. ప్రశస్తత్వము.
ప్రాశించు. త్స. క్రి. భుజించు.
ప్రాశ్నికుఁడు. త్స. విశే. ప్రశ్నచేయు వాఁడు.
ప్రాసము. త్స. వి. ౧. ఈఁటె. ౨. పద్యపాదమున రెండవ యక్షరము.
ప్రాసాదము. త్స. వి. ౧. నగరు. ౨. దేవళము.
ప్రాహ్ణము. త్స. వి. ఉదయము మొదలు పదిగడియలవఱకుఁ గల కాలము.

ప్రి

ప్రిదులు. దే. క్రి. ౧. తొలఁగు. ౨. జాఱు. ౩. ఊడు.
ప్రియంవదుఁడు. త్స. విశే. ప్రియములు పలుకువాఁడు.
ప్రియపడు. త్స. క్రి. ఇష్టపడు.
ప్రియము. త్స. వి. ౧. స్నేహము. ౨. సంతోషము. విశే. ౧. హెచ్చు వెలగలది. ౨. ఇష్టము.
ప్రియవాది. త్స. విశే. ఇచ్చకము లాడువాఁడు.
ప్రియుఁడు. త్స. వి. ప్రాణనాథుఁడు.

ప్రీ

ప్రీణనము. త్స. వి. తృప్తిపఱచుట.
ప్రీతి. త్స. వి. ౧. సంతోషము. ౨. ప్రేమ.
ప్రీతుఁడు. త్స. విశే. సంతోషము పొందినవాఁడు.

ప్రు

ప్రుచ్చు. దే. క్రి. ౧. ప్రుచ్చిపట్టు, ౨. చెరు.
ప్రుప్పి. దే. వి. పుప్పి.

ప్రె

ప్రెగడ. ప్రెగ్గడ. } దే. వి. ౧. యువరాజు. ౨. మంత్రి. ౩. ప్రధాన పురుషుఁడు. రూ. ప్రెవడ.

ప్రే

ప్రేంఖ. త్స. వి. డోల.
ప్రేంఖణము. త్స. వి. నృత్యవిశేషము.
ప్రేక్షణము. త్స. వి. నేత్రము.
ప్రేగు. దే. వి. కడుపులోని ప్రేగు. రూ. ప్రేవు.
ప్రేతము. త్స. విశే. పీనుఁగు.
ప్రేతవనము. త్స. వి. శ్మశానము.
ప్రేమ. త్స. వి. ౧. స్నేహము. ౨. సంతోషము.
ప్రేము. దే. వి. ౧. వేత్రము. ౨. బెత్తము.
ప్రేముడి. దే. వి. ౧. స్నేహము. ౨. కూర్మి.
ప్రేముడించు. దే. క్రి. ౧. శోకించు. ౨. ప్రియపడు.
ప్రేయసి. త్స. వి. ప్రియురాలు.
ప్రేయసుఁడు. త్స. వి. ప్రియుఁడు.

ప్రేరకుఁడు. త్స. విశ. ప్రేరేపణ చేయువాఁడు.
ప్రేరణము. త్స. వి. ప్రేరేపణ.
ప్రేరించు. త్స. క్రి. ప్రేరేచు.
ప్రేరితము. త్స. విశ. ప్రేరేపింపఁబడినది.
ప్రేరేపణ. త్స. వి. ప్రేరేపించుట.
ప్రేరేపించు. దే. క్రి. ప్రేరించు.
ప్రేరేపు. దే. క్రి. ప్రేరించు.
ప్రేలడము. దే. వి. ప్రేలుట.
ప్రేలరి. దే. విశ. వదరుఁబోతు.
ప్రేలిక. దే. వి. చూ. పేలిక.
ప్రేలు. దే. క్రి. ౧. వదరు. ౨. వేఁగు.
ప్రేలుచు. దే. క్రి. వేఁచు. రూ. ప్రేల్చు.
ప్రేలుడు. దే. వి. ప్రేలుట.
ప్రేవు. దే వి. ప్రేగు.
ప్రేషకుఁడు. త్స. విశ. పంపువాఁడు.
ప్రేషితుఁడు. త్స. విశ. పంపఁబడినవాఁడు.
ప్రేష్ఠము. త్స. విశ. మిక్కిలి ప్రియమైనది.
ప్రేష్యుఁడు. త్స. విశ. భృత్యుఁడు.

ప్రొ

ప్రొద్దు. దే. వి. ౧. ఉషఃకాలము. ౨. పూఁట. 3. దినము. ౪. సూర్యుఁడు. ౫. బ. ప్రసవదినములు.

ప్రొయి. } దే. వి. వంటకు నిప్పును
ప్రొయ్యి. } రగులుచు యంత్ర విశేషము.

ప్రో

ప్రోఁగు. దే. వి. చూ. పోఁగు.
ప్రోక. దే. వి. రాశి.
ప్రోక్షణము. త్స. వి. (నీళ్లు) చిలుకరించుట.
ప్రోక్షించు. త్స. క్రి. చిలుకరించు.
ప్రోక్షితము. త్స. విశ. చిలుకరింపఁబడినది.
ప్రోగు. దే. వి. రాశి. రూ. ప్రోవు.
ప్రోచికోలు. దే. వి. ౧. (బలము లేని యొంపు లోనగు వానిని) కాపాడి యనుభవించుకొనుట. ౨. విశ. వ్యర్థము.
ప్రోచు. దే. క్రి. కాపాడు.
ప్రోడ. } దే. విశ. ౧. నిపుణుఁడు. ౨. ప్రగల్భుఁడు. 3. వివేకి.
ప్రోడఁడు. }
ప్రోతము. త్స. విశ. కట్టఁబడినది.
ప్రోది. దే. వి. ౧. పోషణము. ౨. వైభవము.
ప్రోదిగొను. } దే. క్రి. పోషించు.
ప్రోదిసేయు. }
ప్రోపు. దే. వి. పోషణము.
ప్రోయాలు. దే. వి. ఇల్లాలు.
ప్రోలు. దే. వి. పట్టణము.
ప్రోవు. దే. వి. చూ. ప్రోగు.

ప్రోషితభర్తృక. త్స. వి. ప్రియుఁడు దేశాంతరగతుఁడైయుండ ఖేదము నొందియుండు నాయిక

ప్రోషితుఁడు. త్స. విశే. దేశాంతరగతుఁడు.

ప్రౌ

ప్రౌఢ. త్స. వి. పదునెనిమిదేండ్లకు పైబడిన వయస్సుకలిగి సంపూర్ణ యౌవనము కలది.

ప్రౌఢి. } త్స. వి. నేర్పు. రూ. ప్రౌఢిమ. } ప్రౌఢిమము.

ప్రౌఢుఁడు. త్స. విశే. నేర్పరి.

ప్ల

ప్లవ. త్స. వి. ఒకానొక యేఁడు.

ప్లవంగమము త్స. వి. ౧. ఒకానొక యేఁడు. ౨. కోఁతి. 3 కప్ప.

ప్లవగము. త్స వి. కోఁతి.

ప్లీ

ప్లీహము. త్స. వి. హృదయమున ఎడమ వైపుఁగల మాంసగోళము.

ప్లు

ప్లుతము. త్స. వి. మూఁడు మాత్రల కాలము.

ప్లుష్టము. త్స. విశే. కాల్పఁబడినది.

# ఫ

ఫక్కి. త్స. వి. ౧. విధము. ౨. రీతి.

ఫణ. } త్స. వి. పాముపడగ. ఫణము. }

ఫణి. త్స. వి. పాము.

ఫణితము. త్స. వి. వాక్కు.

ఫలకము. త్స. వి. ౧. పలక. ౨. కేడెము.

ఫలము. త్స. వి. ౧. పంట. ౨. పండు. 3. లాభము.

ఫలవంతము. త్స. విశే. పండ్లుకలది.

ఫలసాయము. త్స. వి. పంట.

ఫలాశా. త్స. విశే. అట్టి.

ఫలించు. త్స. క్రి. ౧. నెఱవేఱు. ౨. పండు.

ఫలితము. త్స. విశే. ఫలించినది.

ఫలేగ్రహి. త్స. విశే. ఫలించునది.

ఫల్గునుఁడు. త్స. వి. అర్జునుఁడు.

ఫా

ఫాలము. త్స. వి. నొసలు.

ఫాల్గుణము. త్స. వి. ఒక మాసము. వ్యు. ఉత్తర ఫల్గునీ నక్షత్రముతోఁ గూడిన పున్నమ దీనియందు కలదు.

ఫు

ఫుల్లము. త్స. విశే. వికసించినది.

ఫే

ఫేనము. త్స. వి. నురుగు.

ఫేనిలము. త్స. విశే. నురుగు గలది.

ఫేరవము. త్స. వి. నక్క. వ్యు. "ఫే" అను ధ్వనికలది.

# బ

బంక. దే. వి. చెట్లయందుఁ గలుగు జిగటు కల పదార్థము.
బంకమన్ను. దే. వి. జిగటుకలమన్ను.
బంకముచ్చు. దే. విణ. పిసినారి.
బంకు. దే. విణ. కూరునివలె నటించు వాఁడు.
బంకెత. దే. వి. లుబ్ధురాలు.
బంకోలు. దే. వి. జన్మఖయిదు వేయఁబడినవారిని పంపు ద్వీపాంతరము.
బంగనబయలు. దే. వి. బట్టబయలు.
బంగరు.
బంగరువు. } దే. వి. ౧. స్వర్ణము.
బంగారము. } ౨. వైఁడి.
బంగారు.
బంగారుతీఁగలు. దే. వి. బ. ఒకవిధమగువస్త్రము.
బంగి. దే. వి. గంజాయి.
బంటి. దే. వి. కొలదిని తెలుపు ప్రత్యయము. (మోఁకాలిబంటి = మోఁకాలు లోఁతైన.)
బంటు. దే. వి. ౧. భర్తృఁడు. ౨. సేవకుఁడు. 3. శిష్యుఁడు.
బండ. దే. వి. ౧. పొట్టిరోఁకలి. ౨. వెడల్పుఱాయి. విణ. 3. ఆకతాయి.
బండఁడు. దే. విణ. ఆకతాయి.
బెండగుఁడు. దే. విణ. ,,
బండవలము. దే. వి. ౧. సామర్థ్యము. ౨. సంచిమొదలు. రూ. బండాలము. బండోలిగము.
బండాటము. దే. వి. ఆకతాయితనము.
బండారము. దే. వి. బొక్కసము.
బండారి. దే. వి. బొక్కసమునకధికారి.
బండారు. దే. వి. రాతిమీఁద రాచి పూసికొను పసుపు.
బండాలము. దే. వి. సామర్థ్యము.
బండి. దే. వి. ౧. శకటము. ౨. రథము.
బండు. దే. వి. ౧. ఆకతాయితనము. ౨. ఆకతాయిమాట. (బండు బూతులు.)
బంతి. దే.వి. ౧. చెండు. ౨. పఙ్క్తి. 3. పది.
బంతికుడుపు. దే. వి. అనేకులు చేరభుజించుట.
బందన. దే. వి. ౧. బంక. ౨. జిగటు.
బందనగొను. దే. క్రి. జిగటుపుగు.
బందము. } దే. వి. ౧. చెట్టెక్కువాఁడు కాలికి తగిలించుకొనెడి త్రాఁడు. ౨. దూలము మీఁద గుజ్జులకు బిగువు నిమిత్తము లంకెగా అమర్చిన పట్టె.
బందాము. }

బద్దా. దే. విణ. చెఱపడ్డవాఁడు.
బంగి. త్స. వి. చెఱ.
బందికాఁడు. దే. వి. బందిపోటు కొంగ.
బందిగము. దే. వి. చెఱసాల.
బందిపోటు. దే. వి. నిర్బంధపఱచి కొట్టి కోఁచుట.
బాదుకట్టు. దే. వి. జాతి కట్టుపాటు.
బందుగుఁడు. / బందువుఁడు. } వై. వి. చుట్టము.
బందె. దే. వి. ౧. పశువులచెఱ. ౨. పశువులదండుగ. ౩. నిర్బంధము.
బందెకత్తె. దే. వి. చెఱలో వేయునది.
బందెకాఁడు. దే. వి. చెఱలో వేయు వాఁడు.
బందెగొను. దే. క్రి. చెఱఁబెట్టు.
బందెలపోతు. దే. వి. చెఱవేయు స్వభావముగలవాఁడు.
బంధకము. త్స. వి. చెఱసాల.
బంధకి. త్స. వి. ఱంకుటాలు.
బంధనము. త్స. వి. ౧. కుదువ. ౨. కట్టు.
బంధము. త్స. వి. వి. ౧. కట్టు. ౨. చెఱ. ౩. కుదువ.
బంధించు. త్స. క్రి. కట్టు.
బంధుత. త్స. వి. బంధుసమూహము.
బంధురము. త్స. విణ. ఒప్పిదమైనది.
బంధులుఁడు. త్స. విణ. ఱంకుటాలి కొడుకు.
బంధువు. త్స. వి. ౧. చుట్టము. ౨. జ్ఞాతి. ౩. మిత్త్రుఁడు.
బంబోతు. త్స. విణ. మిక్కిలి బలిసిన వాఁడు.
బంభరము. త్స. వి. తుమ్మెద.
బంహిష్ఠము. త్స. విణ. మిక్కిలి బహువు.
బకము. త్స. వి. వక్కుకొంగ.
బకవైరి. త్స వి. ౧. భీముఁడు. ౨. కృష్ణుఁడు.
బకోటము. త్స. వి. బకము.
బక్క. దే.విణ. ౧. బక్కటిల్లినవాఁడు. ౨. బక్కటిల్లినది.
బక్కటిల్లు. దే. క్రి. కృశించు.
బగబగ. దే. వి. మండునపుడయ్యెడి ధ్వన్యనుకరణము.
బగిసె. వై. వి. బవిసె.
బగీలు. దే. వి. సంతాపమునందయ్యెడి ధ్వన్యనుకరణము.
బగ్గముపాడు. దే. విణ. మిక్కిలి పాడు.
బగ్గు. దే. వి. మండునపు డయ్యెడి ధ్వన్యనుకరణము.
బచ్చెన. దే. వి. ౧. వర్ణము. ౨. పూఁత.
బచ్చు. దే. వి. ౧. వెండి. బంగారముల వాణెము చూచువాఁడు. ౨. కోమటివాఁడు.
బజెంత్రి. దే. .వి మేళగాఁడు.

బజీతు. దే. విశే. భంగము నొందినది.

బజ్జి. దే. వి. వ్యంజన విశేషము.

బజారీము. దే. వి. వ్యభిచారము.

బజారి. దే. వి. వ్యభిచారిణి.

బజారించు. దే. క్రి. వ్యభిచరించు.

బజారు. దే. వి. అంగడి వీధి.

బజారుమాట. దే. వి. అంగడివీధిలో పడుగు రాడెడిమాట.

బటాకబయలు / బటాబయలు. } దే. వి. బట్టబయలు.

బటాని. దే. వి. ఒక దినుసుకాయ ధాన్యము.

బటాబయలు. దే. వి.చూ. బట్టబయలు.

బటాబూరము. దే. వి. పెద్దతీకము.

బటారము. దే. విశే. గొప్ప.

బటువు. దే. వి. ౧. గుండ్రని యుంగరము. ౨. గుండ్రన. విశే. ౧. గుండ్రనిది. ౨. దృఢము.

బట్ట. దే. వి. ౧. వస్త్రము. ౨. పసుల దేహముమీఁది తెలుపు లోనగు చాఱ. 3.విశే. వెండ్రుకలూడినది. (తల.)

బట్టగుత్తు. దే. విశే. సిగ్గుమాలినవాఁడు.

బట్టతల. దే. వి. వెండ్రుక లూడినతల.

బట్టతలవాఁడు. దే. వి. బట్టతల కల వాఁడు.

బట్టబయలు. దే. వి. మిక్కిలి బయలు.

బట్టి. దే. వి. ౧. ఆవము. ౨. వాగ్ధోరణి.

బట్టు. దే. వి. ౧. బట్టువాఁడు. ౨. వంశ.

బడ. దే. విశే. పెద్ద. (బడగొండ.)

బడబడ. దే.వి. పాఱుటయం దయ్యెడు ధ్వన్యనుకరణము.

బడబానలము. త్స. వి. బడబాగ్ని.

బడలిక. దే. వి. శ్రమము.

బడలు. దే. క్రి. ౧. శ్రమపడు. వి. ౨.శ్రమము.

బడలుపడు. దే. క్రి. శ్రమపడు.

బడవా. దే. వి. ౧. తార్చునది. ౨. తార్చువాఁడు. (వాడుకలో 'భడవా' అందురు.)

బడవాతనము. దే. వి.తార్చుట.

బడి. దే.వి. ౧.పాఠశాల. ౨. దిట్టము. 3. క్రమము. అవ్య. ౪. వెంబడి.

బడిత. దే. వి. ఇనుపకట్లగుదియ.

బడిపెద్ద. దే. వి. ఉపాధ్యాయులకు సాయముచేయఁగల ముఖ్యవిద్యార్థి.

బడియ. దే. వి. చిన్నదుడ్డుఁగఱ్ఱ. రూ. బడె.

బడియు. దే. క్రి. దిగదుడుపువేయు.

బడవారడి. దే. వి. ప్రతిమనుష్యునకు విధించుపన్ను.

బడిశము. త్స. వి. గాలము.

బడిసివాటు. దే. వి. దిగదుడుచి వేయుట.

బడుగు. దే. వి. ౧.శవము. విశే. ౨. కృశము. 3. అశక్తుఁడు.

బడువ. దే. విణ. బాడువ.
బడ్డు. దే. వి. పరుషచిహ్నము.
బతిము. వై. వి. వ్రీతము.
బతిమాలిక. దే. వి. బతిమాలుట.
బతిమాలు. దే. క్రి. దైన్యముతో వేఁడుకొను.
బత్తి. వై. వి. భక్తి.
బత్తుఁడు. వై. వి. ౧. భక్తుఁడు. ౨. కమసాలెవారి పట్టపుఁబేరు.
బత్తెము. దే. వి. భోజనమునకై ఇచ్చు ధనము.
బదనిక. దే. వి. చెట్టుమీఁద మొలుచు ఓషధీ విశేషము.
బదరు. దే. వి. పగులు.
బదరి. త్స. వి. రేఁగు.
బదులు. దే. వి. ౧. మాఱు. ౨. అప్పు. ౩. క్రయ.
బద్ద. దే. వి. ౧. కాయయొక్క తునుక. ౨. వెదురు, వక్క లోనగువాని పేడు. ౩. చీలిక. విణ. ౪. పలుచనిది.
బద్దకము. దే. వి. పాలుమాలిక. క్రి. బద్దకించు.
బద్దించు. దే. క్రి. సరిగా ఉన్నదా? లేదా? అని కొలిచినది మరలఁ గొలుచుట.
బద్దు. / బద్దుర. దే. వి. బొంకు.
బద్దె. దే. వి. ౧. వస్త్రము మొదలు. ౨. అపరకర్మము చేయునప్పుడు జందెమునకు బదులు ధరించు వస్త్రఖండము.
బద్రిము. వై. విణ. పదిలము.
బధిరుఁడు. త్స. విణ. చెవిటివాఁడు.
బద్ధము. త్స. విణ. కట్టఁబడినది.
బధ్యము. త్స. వి. నీళ్ళుగారకుండఁ గట్టినకట్ట.
బన్నపడు. వై. క్రి. అవమానపడు.
బన్నము. వై. వి. ౧. అవమానము. ౨. ఆపద.
బన్నసరము. దే. వి. ౧. నానావిధ మణులు గ్రుచ్చిన హారము. ౨. హారము.
బమ్మ. వై. వి. ౧. నలువ. ౨. బ్రహ్మ.
బమ్మరించు. వై. క్రి. భ్రమించు. రూ. బమ్మరిల్లు. బమ్మరిలు.
బమ్మెర. వై. వి. భ్రమ.
బమ్మెరపోవు. వై. క్రి. భ్రమపడు.
బయకాఁడు. దే. వి. గాయకుఁడు.
బయకారము. దే. వి. యౌవనమునందు బయలుపడు శృంగారచేష్ట.
బయకారి. దే. విణ. విలాసము.
బయలు. దే. వి. ౧. బహిఃప్రదేశము. ౨. చెట్టు చేమ లేనిచోటు. ౩. ఆకాశము. విణ. ౪. శూన్యము.
బయలుదేఱు. దే. క్రి. బయలువెడలు.
బయలుపడు. దే. క్రి. బహిరంగమగు.

బయలువెడలు. దే. క్రి. బయలుదేఱు.

బయలుపోవు. దే. క్రి. బహిరంగమగు.

బరక. దే. విణ. కఱుకైనది.

బరడు. వై. వి. గఱుకైన పట్టు లోనగునది.

బరణి. వై. వి. కాటుక మొదలగునవి పెట్టుకొను పాత్రము.

బరవసము. దే. వి. ధైర్యము.

బరాబరి. / బరాబరిక. దే. వి. ౧. హెచ్చరిక. ౨. విణ. సరియైన.

బరి. దే. వి. ౧. పార్శ్వము. ౨. గీటు. ౩. శత్రువు.

బరికాఁడు. దే. వి. మావటివాఁడు.

బరికె. దే. వి. గఱుకులు గల యెండిన తాటిమట్ట.

బరిగోల. దే. వి. బాణము.

బరిచి. / బరిచీ. దే. వి. ఈఁటె.

బరిడెపురుగు. / బరిణెపురుగు. దే. వి. బొద్దింక.

బరిస. దే. వి. ఇనుపకట్లగుదియ.

బరుకు. దే. క్రి. ౧. తోలులేచునట్లు గీఱు. ౨. గోఁకు.

బరువడి. దే. అవ్య. మరల.

బరువు. వై. వి. ౧. భారము. ౨. సరకులు నింపినకంట్లము లోనగునది.

బరుసు. వై. విణ. ౧. గఱుకు. ౨. కఱుకైనది.

బర్బరము. త్స. వి. ౧. బార్బరదేశము. ౨. విణ. గఱుకులుగలది.

బర్హము. త్స. వి. ౧. నెమిలిపురి. ౨. ఆకు.

బర్హి. త్స. వి. నెమిలి. వ్యు. పింఛము కలది.

బర్హిణము. త్స. వి. నెమిలి.

బర్హిర్ముఖుఁడు. త్స. వి. వేలుపు.

బర్హిస్సు. త్స. వి. ౧. అగ్ని. ౨. దర్భ.

బఱకు. దే. క్రి. ౧. గోఁకు. ౨. సైఁగగాఁగోఁకు.

బఱబఱ. దే. వి. ఈడ్చుటయందయ్యెడి ధ్వన్యనుకరణము.

బఱ్ఱె. దే. వి. ౧. గేదె. ౨. ఎనుము.

బలఁగము. వై. వి. పరిజనము. రూ. బల్గము.

బలకరము. దే. వి. కావలి.

బలకరించు. దే. క్రి. వ్యాపించు.

బలకాయించు. దే. క్రి. అతిశయించు.

బలకొట్టు. దే. క్రి. "ఆ" అని శ్రుతిపట్టు.

బలకొను. దే. క్రి. అతిశయించు.

బలదేవుఁడు. త్స. వి. బలరాముఁడు.

బలపడు. దే. క్రి. అధికమగు.

బలపము. దే. వి. పలక వ్రాసెడు సాధనము.

బలభద్రుఁడు. త్స. వి. బలరాముఁడు.

బలము. దే. విశ. ౧. అధికము. త్స. వి. ౨. సైన్యము. ౩. రసము. ౪. సత్తువ.
బలయు. దే. క్రి. చుట్టు.
బలవంతము. వై. వి. బలాత్కారము.
బలవంతుడు. దే. విశ. బలముకలవాడు.
బలా. దే. అవ్య. చూ. బళా.
బలాక. త్స వి. పెద్దకొక్కెర.
బలాత్కరించు. త్స. క్రి. బలాత్కారము చేయు.
బలాత్కారము. త్స. వి. బలవంతము.
బలారా. దే. అవ్య. భళీ.
బలి. త్స. విశ. ౧. బలము కలవాడు. వి. ౨. కానుక. 3. కల్పము.
బలిజె. దే. వి. శూద్రులలో నొక తెగ.
బలితము. దే. విశ. బలిష్ఠము.
బలిపుష్టము. త్స. వి. కాకి.
బలిపెట్టు. దే. క్రి. పంపు.
బలిమి. దే. వి. ౧. బలాత్కారము. ౨ దేహబలము.
బలియు. వై. క్రి. ౧. అధికమగు. ౨. స్థూలమగు.
బలీయుడు. వై. విశ. బలవంతుడు.
బలిష్ఠము. / బలీయము. ) త్స. విశ. మిక్కిలి బలము కలది.
బలీవర్దము. త్స. వి. ఎద్దు.
బలుడు. త్స. వి. బలరాముడు.
బలుపు. వై. వి. ౧. బలము. ౨. పుష్టి. రూ. బల్పు.
బలువిడి. దే. వి. విధము.
బలువు. వై. వి. బలము. (సులువు బలువులు.)
బలువుడు. వై. విశ. బలిష్ఠుడు.
బలె. దే. అవ్య. వలె.
బలే. దే. అవ్య. బళా.
బల్ల. దే. వి. ౧. కూర్చుండుటకై కాళ్లమర్చిన యెత్తుపలక. ౨. కడుపులోని మాంసపు బిల్ల.
బల్లకట్టు. దే. వి. వెడల్పైన యడుగుగల పడవ.
బల్లి. వై. వి. గౌళి.
బల్లిదము. వై. విశ. మిక్కిలి బలము కలది.
బల్లిదుడు. వై. విశ. మిక్కిలి బలము గలవాడు.
బల్లు. దే. వి. తెల్లవారుటలో నయ్యెడి ధ్వన్యనుకరణము.
బల్లెకోల. దే. వి. బల్లెము.
బల్లెము. దే. వి. పొడుచునట్టి యొకానొక యాయుధము.
బవంతము. దే. వి. మోసము.
బవంతి. దే. వి. నాలుగువైపుల ఇల్లును నడిమిలో వట్టిప్రదేశము గలగృహము.
బవరము. వై. వి. యుద్ధము.
బవిరి. దే. విశ. గుండ్రము. రూ. బవ్రి.
బవిసి. వై. వి. ౧. గౌరవము. ౨. భాగ్యము.

బహ్కుయిణి. త్స. వి. తఱపిమూవు.

బస. వై. వి. ౧. ఉనికిపట్టు. ౨. విడిది.

బసవఁడు.
బసవన.
బసవన్న. } వై. వి. వృషభము.

బసివి దే. వి. అంకుటాలు.

బహిరంగము. త్స. వి. ౧. వెలుపటియవయవము. విశే. ౨. బయలుపడినది.

బహిర్ద్వారము. త్స. వి. తలవాకిలి.

బహిష్కరించు. త్స. క్రి. వెలివేయఁబడు.

బహిష్కరించు.
బహిష్కరించు. } త్స. క్రి. బలివెట్టు.

బహిష్కారము. త్స. వి. వెలివేయుట.

బహుధా. త్స. అవ్య. అనేక ప్రకారములచేత.

బహుమతి. త్స. వి. బహుమానము.

బహుమానము. త్స. వి. సమ్మానము.

బహువిధము. త్స. విశే. పెక్కు తెఱఁగులు గలది.

బహుళము. త్స. వి. అధికము.

బహూకరించు. త్స. క్రి. గౌరవించు.

బహూకృతి. త్స. వి. గౌరవము.

బళి. దే. అవ్య. మెచ్చును దెలుపును.

బళికరము. దే. విశే. 'బలకరము' యొక్క రూపాంతరము.

బళారె. బళి. బళీ.
బళిర. బళిరా.
బళిరె. బళిరే. } దే. అవ్య. మెచ్చును దెలుపు అవ్యయము.

## బా

బాంధవము. త్స. వి. చుట్టఱికము.

బాంధవుఁడు. త్స. వి. ౧. జ్ఞాతి. ౨. మిత్త్రుఁడు. 3. చుట్టము.

బాఁకు. దే. వి. కటారి.

బాఁతి. దే. వి. బాంతియొక్క రూపాంతరము.

బాఁదు. వై. క్రి. కొట్టు.

బాఁదుకొను. దే. క్రి. కొట్టు.

బాఁపఁడు. వై. వి. బ్రాహ్మణుఁడు.

బాఁపఁశి. వై. వి. బ్రాహ్మణస్త్రీ.

బాఁపన. వై. వి. బ్రాహ్మణకులము.

బాఁపనక్క. దే. వి. బ్రాహ్మణస్త్రీ.

బాఁపనచీమ. దే. వి. వృక్షములయందుండు గోరోజనపు వర్ణముగలయొక పెద్దచీమ.

బాఁపనయ్య.
బాఁపనుఁడు. } వై. వి. బ్రాహ్మణుఁడు.

బాఁపఱికము. దే. వి. బ్రాహ్మణత్వము.

బాకి. దే. వి. ౧. అప్పు. విశే. ౨. విరివియైనది.

బాగములు. దే. వి. బ. వక్కపొడి. రూ. బాగలు. బాగాలు.

బాగరి. దే. విశే. అందగాఁడు.

బాగు. వై. వి. ౧. అందము. ౨. క్షేమము.

బాగుచేయు. వై. క్రి. చక్కపఱచు.

బాగులాఁడి. దే. విణ. అందకత్తె.

బాగెము. దే. వి. భాగ్యము.

బాజాబు. వై. వి. చూ. బజాబు.

బాజుబందు. వై. వి. సందిటఁగట్టుకొనెడుసొమ్ము.

బాట. వై. వి. రాజమార్గము.

బాటసారి. వై. విణ. దారినడచువాఁడు.

బాడబుఁడు. త్స. వి. బ్రాహ్మణుఁడు.

బాడిగ. వై. వి. అద్దె.

బాడిత. / బాడిస. దే. వి. వడ్లవాఁడు కొయ్యను చెక్కెడి పనిముట్టు.

బాడుగోలు. దే. విణ. మానహీనుఁడు.

బాడువ. దే. వి. పల్లపు నేల.

బాడె. దే. వి. బురద.

బాఢము. త్స. విణ. ౧ అధికము. ౨. పెల్లు. ౩. వి. ప్రతిజ్ఞ.

బాణము. త్స. వి. ౧. ఆవుపొదుగు. ౨. అమ్ము.

బాణలి. దే. వి. వేఁచుట లోనగు వానికి ఉపయుక్తమగు లోహపాత్రము.

బాణవిద్య. త్స. వి. బాణసంచులను గుఱించు తెలుపువిద్య.

బాణసంచు. దే. వి. తారాచువ్వలు మొదలగు మందుసామగ్రి.

బాణా. దే. వి. దండాయుధము.

బాణాసనము. త్స. వి. ధనుస్సు.

బాతు. / బాతువు. దే. వి. నీటిమీఁద తిరుగు పక్షి.

బాద. దే. వి. బాధ. (ఆదబాదలు)

బాదము. / బాదాము. దే. వి. బాదముకాయ.

బాదరాయణుఁడు. త్స. వి. వ్యాసుఁడు. స్త్రీ. బాదరాయణి.

బాధ. త్స. వి. ౧. నొప్పి. ౨. దుఃఖము.

బాధకము. త్స. విణ. బాధించునది.

బాధించు. త్స. క్రి. బాధపెట్టు.

బాధిర్యము. త్స. వి. చెవుడు.

బాధ్యత. త్స. వి. హక్కు.

బాన. వై. వి. ౧. పీతపుకడవ. ౨. కడవ.

బానసము. వై. వి. ౧. వంటసాల. ౨. వంట.

బానసీఁడు. దే. విణ. వంటవాఁడు.

బానిస. దే. వి. దాసి.

బానిసము. దే. వి. దాస్యము.

బానిసీఁడు. దే. వి. దాసుఁడు.

బాపు. / బాపురె. / బాపురే. దే. అవ్య. బళీ.

బాబా. వై. వి. గుఱ్ఱము.

బాబు. వై. వి. ౧. తండ్రి. ౨. పూజ్యుఁడు.

బాము. వై. వి. ౧. దుఃఖము. ౨. జన్మము.

బార. దే. వి. అడ్డముగా చాఁపఁబడిన రెండు చేతులతో బొమ్మ కొలఁత. రూ. బారా.

బారకము. వై. వి. బరువు.

బారకించు. వై. క్రి. భారమగు.

బారపోయు. దే. క్రి. చేయి చాఁగు నంతకొలఁది నూలువడుకు.

బారసాల. వై. వి నామకరణము.

బారసి. దే. వి. ద్వాదశి.

బారా. వై. వి. చూ. బార.

బారాది. దే. విణ. అధికము.

బారి. } వై. వి. ౧. హింస. ౨.
బారీ. } నిర్బంధము.

బారిసమరు. దే. క్రి. హింసించు.

బారు. వై. వి. ౧. వరుస. ౨. సమూహము.

బారుచేయు. దే. క్రి. తుపాకిలో మందు గుండు వైచి కూరు.

బారుదూలము. వై. వి. నిడుపాటి దూలము.

బారువ. వై. వి. ఇరువది మణుగుల కొలఁది.

బాల. త్స. వి. ౧ ఆఁడుది. విణ. ౨ మూర్ఖురాలు. 3. పదునాఱేండ్లకు లోఁబడినపిల్ల.

బాలకుఁడు. త్స. వి. పదునాఱేండ్లకు లోఁబడిన పిల్లకాయ.

బాలతృణము. త్స. వి. లేఁతకసవు.

బాలాజి. వై. వి. తిరుపతివేంకటేశ్వరు లకు బైరాగులు వాడుపేరు.

బాలిక. త్స. వి. ౧. ఆఁడుది. ౨. పదునాఱేండ్లకు లోఁబడినకన్యక.

బాలిశము. త్స. వి. తలగడ.

బాలిశుఁడు. త్స. విణ. ౧. బాలుఁడు. ౨. మూర్ఖుఁడు.

బాలీసు. దే. వి. ఒఱగుదిండు.

బాలెంత. దే. వి. బాలెంతిరాలు.

బాలేయము. త్స. వి. గాడిద.

బాల్యము. త్స. వి. చిన్నతనము.

బావ. వై. వి. ౧. మగనియన్న. ౨. తనకంటె పెద్దవాఁడైన మేనత్త మేనమామల కొడుకు. 3. అక్క మగఁడు.

బావి. వై.వి.౧. లోతుగుంట ౨.పల్లము.

బావిలీ. దే. వి. ఆఁడుది కొనచెవిని ధరించు నొకవిధమగు సొమ్ము.

బావుకొను. దే. క్రి. ౧. అనుభవించు. ౨. అన్నము లోనగునది చేయినిండ ఎత్తి నోర నిడుకొను.

బావుటా. దే. వి. ౧ధ్వజము. ౨జెండా.

బావురుఁబిల్లి. దే. వి. గండుఁబిల్లి.

బావురుమను. దే. క్రి. (జనములేని చోట) బావురుమని మాఱుమ్రోఁత కలదియగు.

బాష్పము. త్స. వి. ౧. ఆవిరి. ౨. కన్నీరు.

బాస. వై. పి. ౧. ప్రతిజ్ఞ. ౨. ప్రతిము. 3 సంకేతము. ౪ అఱవము, తెలుఁగు మున్నగుభాష.

బాసట. దే. వి. ౧. సాహాయ్యము. ౨. సహాయుఁడు.

బాసనము. దే. వి. వంటపాత్రి.

బాసాడు. దే. క్రి. ౧ భాషించు. ౨. పలుకు.

బాసికదండ. దే. వి. తలముందు ప్రక్కనుంచఁబడిన పుష్పహారము.

బాసికపట్టు. దే. వి. పద్మాసనము.

బాసికము. దే. వి. పెండ్లిండ్లలో పెండ్లికుమారునకును, పెండ్లికుమార్తెకును, నొసటఁ గట్టెడు మూఁడు ప్రక్కలు చేర్పడి ముక్కోణాకారమైన హారము.

బాహాటము. వై. విణ. బహిరంగము.

బాహిరపోవు. దే. వి. బయలుపోవు.

బాహిరము. దే. విణ. ౧. బయలుపడినది. ౨. వెల్లడియైనది.

బాహుజుఁడు. త్స. పుం. క్షత్రియుఁడు.

బాహుపురి. త్స. వి. ౧. సందికడియము. ౨. కేయూరము.

బాహుమూలము. త్స. వి. చంక.

బాహుళ్యము. త్స. వి. బాహుళీభావము.

బాహువు. త్స. వి. భుజము. రూ. బాహు.

బాహ్యము. త్స. విణ. ౧. వెలుపలి. ౨. వెలియైనది.

బాళి. దే. వి. ౧. కాంక్ష. ౨. కోరిక.

బి

బింకము. దే. వి. ౧. గర్వము. ౨. నిక్క. 3. బిగువు.

బిందియ. దే. వి. బిందె.

బిందువు. త్స. వి. ౧. నీటిబొట్టు. ౨. చుక్క. 3. సున్న.

బిందె. దే. వి. నొంతుసన్నము గా నుండెడి లోహపాత్రము.

బింబము. త్స. వి. ౧. ప్రతిమ. ౨. చంద్ర సూర్య మండలము. 3. ప్రతిబింబము. ౪. దొండపండు.

బింబిక. త్స. వి. ,,

బింబితము. త్స. వి. ప్రతిబింబించినది.

బికారి. వై. విణ. ౧. అప్రయోజకుఁడు. ౨. బిచ్చకాఁడు. రూ. బికాసి.

బికిరము. వై. వి. భిక్షము.

బిక్క. దే. విణ. నిలువెడ. (బిక్కలు.)

బిక్కుడించు. దే. క్రి. బిక్కించు.

బిగ. దే. అవ్య. బిగియ. (బిగఁగొట్టు) రూ. బిగ్గ.

బిగి. దే. వి. బిగువు.

బిగించు. / బిగియించు. దే. క్రి. బిగియఁజేయు.

బిగిసము. దే. విణ. దృఢము.

బిగియు. దే. క్రి. ౧. బిగువగు. ౨. బిగువుచేయు.

బిగుచు. దే. క్రి. బిగించు.

బిగుతు. దే. విణ. వదలుకానిది.

బిగువు. దే. వి. ౧. బింకము. ౨. బిగుబడ్డ.

బిగువుకొను. దే. క్రి. బిగువగు.

బిగ్గర. దే. విణ. ౧. గట్టిగా. ౨. దృఢముగా.

బిచ్చగాఁడు. వై. విణ. భిక్షకుఁడు.

బిచ్చము. వై. వి. తిరిపము.

బిటారము. దే. వి. విలాసవిశేషము.

బిటారి. దే. విణ. బిటారముగలది.

బిట్టబిఱ్ఱు. దే. వి. మిక్కిలి బిగువు.

బిట్టు. దే. అవ్య. ౧. శీఘ్రముగా. ౨. శీఘ్రము.

బిట్టుబిళ్ళు. దే. అవ్య. తటాలున.

బిడారము. దే. వి. ౧. వాసస్థానము. ౨. విడిది.

బిడారు. దే. వి. ౧. లంబాడితండ. ౨. వాసస్థానము.

బిడాలము. త్స. వి. పిల్లి.

బిడియము. } దే. వి. సిగ్గు.
బిడెము. }

బిడౌజుఁడు. త్స. వి. ఇంద్రుఁడు.

బిడ్డ. దే. వి. ౧. కొడుకు. ౨. కూఁతురు. 3. శిశువు. రూ. బిడ్డె.

బిడ్డఁడు. దే. వి. ౧. కొడుకు. ౨. మగశిశువు.

బిడ్డతల్లి. దే. వి. బాలెంతరాలు.

బిత్తరపోవు. దే. క్రి. చలించు.

బిత్తరము. దే. వి. ౧. ప్రకాశము. ౨. శృంగారచేష్ట. విణ. ౧. నవరసము. ౨. చంచలము.

బిత్తరి. దే. వి. ఆఁడుది.

బిత్తరించు. దే. క్రి. ౧. సరసమాడు. ౨. ప్రకాశించు. 3. ఊఁగాడు.

బిత్తల. దే. వి. ౧. దిసమొల. ౨. దిసమొలవాఁడు 3. దిసమొల గలది.

బిద్దె. దే. వి. నరకము.

బిబ్బరించు. దే. క్రి. (పులి) కూయు.

బిబ్బరింత. దే. వి. (పులి) కూఁత.

బిబ్బి. దే. వి. ౧. తురుష్కులయంతఃపురస్త్రీ. ౨. తోరణము.

బిబ్బోకము. త్స. వి. శృంగారచేష్టావిశేషము.

బియ్యము. దే. వి. తండులము.

బిరడ. దే. వి. ౧. తంబుర లోనగు వానికి తంతె చుట్టెడి తతిమైన కొయ్య. ౨. టెంకాయి బుఱ్ఱ లోనగువాని మూఁతికి కొట్టెడు తతిమైన కొయ్యతునక.

బిరబిర. దే. అవ్య. అతిత్వరితముగా.

బిరుదము. త్స. వి. సామర్థ్య చిహ్నము.

బిరుదు. దే. వి. ౧. ప్రతిజ్ఞ. ౨. సామర్థ్యచిహ్నము. 3. శౌర్యచిహ్నము. విణ. ౧. సమర్థుఁడు. ౨. శూరుఁడు.

బిరుదులాఁడు. దే. విణ. బిరుదులు గలవాఁడు.

బిరుసు. దే. వి.౧. కాఠిన్యము. విశే. ౨. కఠినము.

బిఱబిఱ. దే. అవ్య. మా. బిరబిర.

బిఱాన.
బిఱీన.
బిఱీలున. } దే. అవ్య. త్వరితముగా.

బిఱుసు. దే. వి. మా. బిరుసు.

బిట్టు. దే. వి. బిగువు.

బిట్టుబిగియు. దే. క్రి. మిక్కిలి బిగిసికొను.

బిజ్జు. దే.క్రి. ౧.బిఱుసగు.౨.వి. తడికబిగువుగా నిలుచుటకై దారముగట్టి అనించుకొయ్య.

బిలము. త్స. వి. ౧. రంధ్రము. ౨. గుహ.

బిలేశయము. త్స. వి. పాము.

బిల్ల. దే. వి. ౧. గుండ్రపుతలగడ. ౨. పలుచని గుండ్రని వస్తువు. ౩. మెడ లోనగుచోట్ల పొటమరించు గుండ్రమైన నెత్తురుగడ్డ.

బిల్లిక. దే. వి.(సూర్యచంద్రుల)బింబము.

బిల్వము. త్స.విశే.౧. మారేడుపత్రి. ౨. మారేడుపండు.

బిస. దే. వి. ౧. యంత్రము. ౨. యంత్రపుకీలు.

బిసబి . దే. వి. వేగము.

బిసము. త్స. వి. తామరతూడు.

బిసప్రసూనము. త్స. వి. తామరపువ్వు.

బిసిబిసి. దే. విశే. లగువు బిగువుకలది.

బిసివోవు. దే. క్రి. పట్టువదలు.

బిస్స. దే. వి. సరకము.

బిస్సు. దే. వి. వేగమునందయ్యెడి ధ్వన్యనుకరణము.

## బీ

బీటు. దే. వి. పగులు. రూ. బీటిక.

బీటుగిల్లు.
బీటలుపోవు.
బీటలువాఱు } దే. వి. పగులువాఱు.

బీగము. దే. వి. తాళపుఁజెవి.

బీజము. త్స. వి. ౧. బలము. ౨. రేతస్సు. 3. విత్తు. ౪. స్నాపణము.

బీడు. దే. వి. దున్ననిపొలము.

బీతు. దే. వి. భయము.

బీతుకొను. దే. క్రి. భయపడు.

బీద. వై. విశే. ౧. దరిద్రుఁడు. ౨. భయమునొందినది.

బీభత్సము. త్స. విశే. నవరసములలో నొకటి.

బీభత్సుఁడు. త్స. వి. ౧. అర్జునుఁడు. విశే. ౨. వికారముకలవాఁడు. 3. క్రూరుఁడు.

బీరము. వై. విశే. పరాక్రమము.

బీరాఁజో. దే. క్రి. తుడిచి తుప్పచేయు.

బీరువ. దే. వి. అంతస్థు అంతస్థులుగా అడ్డపలకలు అమర్చిన పెట్టియ.

బీఱు. దే. విశే. వ్యర్థము.

బీఱువడు. } దే. క్రి. వ్యగ్రమగు.
బీఱువాఱు. }
బీఱువోవు. }

బు

బుంగ. దే. వి. చిన్న మూఁతకలకుండ.
బుక్క. దే. వి. వస్త్రములకు వాసన గట్టెడి గంధపొడి. రూ. బుక్కా.
బుక్కనము. త్స. వి. కుక్క మొఱుం గుడు.
బుక్కాము. దే. వి. ౧. గంధపొడి. ౨. బుక్కా.
బుగడ. దే. వి. ఆఁడువారు ముక్కునఁ బెట్టుకొనెడినగ.
బుగబుగ. దే. వి. బుగులుకొనుటయం దయ్యెడి ధ్వన్యనుకరణము.
బుగులు. దే. వి. గుబులునకు మాఱు రూపము.
బుగులుకొను. దే. క్రి. ౧. చిప్పిలు. ౨. విజృంభించు. 3. గుబులుకొను.
బుగులుబుగులు. దే. వి. క్రిక్కిఱుటయం దయ్యెడి ధ్వన్యనుకరణము.
బుగ్గ. దే. వి.౧. చెక్కిలి.౨. నీటిబుడ్డ.
బుగ్గి. దే. వి. బూడిద.
బుచ్చి. దే. విణ. చిన్న.
బుచ్చివాఱు. దే. క్రి. చిన్నవోవు.
బుజము. వై. వి. భుజము.
బుజ్జగము. దే. వి. ఉపలాలనము. రూ. బుజ్జవము.
బుజ్జగించు. దే. క్రి. ౧. ఊఱడించేయు వి. ౨. బుజ్జగింత.
బుటా. దే. వి. వస్త్రముమీఁదవేయు పువ్వు
బుటుకు. దే. వి. మునుఁగుటయం దగు ధ్వన్యనుకరణము.
బుట్ట. దే. వి. పుష్పములు మున్నగు వానినుంచు కరండము.
బుట్టి. } దే. వి. బుట్ట.
బుట్టిక. }
బుడగ. దే. వి. బుగ్గ.
బుడబుడ. దే. వి. నీళ్లనుండ వెడలు టలో నగువానియం దగు ధ్వన్యనుకరణము.
బుడిగ. దే. వి. పిడత.
బుడిగి. దే. వి. చూ. బుడుగు.
బుడిజ. దే. వి. ౧. నూనిని ఉండలి ముడి. ౨. పోటుచేత దేహమునం దుబ్బెడి బొప్పి.
బుడబుడి. దే. విణ. ౧. అల్పము. ని. ౨. తొట్రుపాటు.
బుడికడు. దే. క్రి. తొట్రుపడు.
బుడుక. దే. వి. ౧.మునక. ౨.స్నానము.
బుడుగు. దే. విణ. పొట్టి.
బుడుత. దే. వి. ౧. బాలుఁడు. ౨. బిడ్డ. విణ. 3. పొట్టి. రూ. బుడు తఁడు.
బుడుబుడుక్కలవాఁడు. దే. వి. డుబు డుక్కవాఁడు.

బుడుమ. దే. వి. సస్యవిశేషము.

బుడ్డ. దే. వి. ౧. నీరుబుగ్గ. ౨. అండవృద్ధి.

బుడ్డగించు. దే. క్రి. పంది ముట్టెతోఁ గోరాడు.

బుడ్డి. } దే. వి. చిన్నమూఁతి గల నిడుపాటి కాచపాత్ర విశేషము.
బుడ్డగ. }

బుత్తి. దే. వి. ౧. భుక్తి. ౨. భోగము.

బుద్ది. వై. వి. మతి.

బుద్బుదము. త్స. వి. ౧. గర్భమునందలి యవయవ విశేషము. ౨. నీరుబుగ్గ.

బుధుఁడు. త్స. వి. ౧. పండితుఁడు. ౨. వేలుపు. ౩. ఒక గ్రహము.

బుద్ధి. త్స. వి. మతి.

బుద్ధిమంతుఁడు. త్స. విశే. బుద్ధిగలవాఁడు.

బుద్ధుఁడు. త్స. వి. ౧. విద్వాంసుఁడు. ౨. బుద్ధదేవుఁడు.

బుభుక్ష. త్స. వి. ఆఁకలి.

బుభుక్షితుఁడు. త్స. విశే. ఆఁకలి గొన్నవాఁడు.

బుయ్యా. దే. వి భగము.

బుఱ్ఱ...ము. దే. వి. కాదా... హము.

బురకా. దే. వి. గవిసెన.

బురద దే. వి. అడుసు.

బురుసా. దే. వి. ౧. పట్టు. ౨. ఎఱ్ఱపట్టు.

బుఱుటకొమ్ము. దే. వి. బుఱ్ఱటకొమ్ము.

బుఱ్ఱ. దే. వి. ౧. ఎండిన సొరకాయ. ౨. కొబ్బెరకాయ మున్నగువాని గుల్ల.

బుఱ్ఱటకొమ్ము. దే. వి. చిమ్మఁగ్రోవి.

బుఱ్ఱముక్కు. దే. వి. పెద్దరంధ్రములు కల ముక్కు.

బుర్ఱి. దే. వి. తలెపియావు.

బులియు. దే. క్రి. సుఖించు.

బులుపు. దే. వి. సుఖము.

బుల్ల. దే. వి. మగగుఱి.

బువ్వ. దే. వి. అన్నము.

బువ్వకుడుపు. దే. వి. అన్నప్రాశము.

బువ్వము. దే. వి. పెండ్లిండ్లయందు బంధువులయిన మగవారును ఆఁడువారును కూర్చుండి వేడుకగా భుజించుట.

బువ్వముబంతి. దే. వి. హారిబువ్వము.

బుస. దే. వి. ౧. పాముయొక్క పూత్కారము. ౨. నిట్టూర్పు.

బుసకొట్టు. దే. క్రి. ౧. నిట్టూర్పు విడుచు. ౨. బుసవిడుచు

బుసబుస. దే. వి. నీళ్లు పొంగుటలో నయ్యెడి ధ్వన్యనుకరణము.

బుసబుసలాడు. దే. క్రి. బుసపెట్టు.

బుసము. త్స. వి. పొల్లు.

బుసివోవు. దే. క్రి. చెడు.

బుస్సు. దే. వి. పాము బుసకొట్టుటయందగు ధ్వన్యనుకరణము.

## బూ

బూఁజు. దే. వి. ఎండసోఁకమిచే తడి వస్తువుల మీఁదఁ గలుగు కొంచెము మాసిన తెలుపు.

బూఁజుపట్టు. దే. క్రి. బూఁజు కలది యగు.

బూఁదు. దే. వి. చూ. బూఁజు.

బూఁదుపారు. దే. క్రి. బూఁజుపట్టు.

బూచి. వై. వి. భూతము.

బూచిగాఁడు. దే. వి. కుక్కపేరు.

బూచివాఁడు. దే. వి. ౧. బూచి. ౨. భూతము.

బూటకము. దే. వి. ౧. మాయ. ౨ మోసము.

బూటకీఁడు. } దే. విణ. ౧. వంచకుఁడు. ౨. మాయావి.
బూటకుఁడు.

బూడిద. వై. వి. భస్మము. రూ. బూద్ద.

బూడిదపండు. దే. వి. విభూతిపండు.

బూతపిల్లి. దే. వి. ఒకవిధమైనపిల్లి.

బూతము. వై. వి. ౧. పిశాచము. ౨. ప్రాణి.

బూతి. వై. వి. ౧. తిండి. ౨. బూది.

బూతు. దే. వి. ౧. కుత్సితప్రఁదిట్టు. ౨. బట్టువాఁడు.

బూద. దే. వి. పాలకుండ.

బూది. వై. వి. బూడిద.

బూమియ. } వై. వి. ౧. వంచన. ౨. మాఱు వేషము. 3. మాయ.
బూమె.

బూమెకత్తియ. దే. విణ. బూమెలు గలది.

బూమెకాఁడు. దే. విణ. బూమెలు గలవాఁడు.

బూమెలాఁడి. దే. విణ. బూమెలు గలది.

బూమెలాఁడు. దే. విణ. బూమె కాఁడు.

బూర. వై. వి. ౧. వాద్యవిశేషము. విణ. ౨. స్థూలము.

బూరఁడు. దే. విణ. విజృంభించిన వాఁడు.

బూరకాలివాఁడు. దే. విణ. ఏనుఁగు కాలివాఁడు.

బూరకాలు. దే. వి. ఏనుఁగు కాలు.

బూరగ. వై. వి. ౧. నాగసరమునకు శ్రుతిఇచ్చు వాద్యవిశేషము. ౨. తార.

బూరగడ్డి. దే. వి. తృణ విశేషము.

బూరగొమ్ము. దే. వి. వంకరగా నుండెడి వాద్య విశేషము.

బూరటించు. దే. క్రి. బూరటిల్లఁజేయు.

బూరటిల్లు. వై. క్రి. ౧. ఉబ్బు. ౨. నిండు. రూ. బూరటిలు. వి. 3. బూరటు.

బూరియ. వై. వి. బూరె.

బూరుగు. దే. వి. శాల్మలీవృక్షము. రూ. బూరువు.
బూరె. వై. వి. భక్ష్య విశేషము.
బూర్నిసు. దే. వి. మెత్తని కంబళి.

బృ

బృంద. త్స. వి. సమూహము.
బృందారకుఁడు. త్స. వి. ౧. వేలుపు. విశ. ౨.మనోజ్ఞుఁడు. 3.శ్రేష్ఠుఁడు.
బృంహితము. త్స. వి. ఏనుఁగుయొక్క ఘీంకారము.
బృహత్తు. త్స. విశ. గొప్పది.
బృహన్నల. త్స. వి. అర్జునునికి వేషాంతరమునందలి పేరు.
బృహస్పతి. త్స. వి. దేవతలగురువు. వ్యు. దేవతలకును, వేదములకును, బృహత్తు లనఁబడును. వారలకైనను, వానికైనను ప్రభువు.

బె

బెంగ. దే. వి. విరహవ్యథ.
బెండగిల్లు. దే. క్రి. వెల్లగిల్లు.
బెండు. దే. వి. ౧. జీలుగు. విశ. ౨. నిస్సారము.
బెండుపడు. దే. క్రి. బలహీనతనొందు.
బెకబెకలాడు. దే. క్రి. (కప్ప) కూయు.
బెకొట్టు. దే. క్రి. బెంగకొట్టు.
బెగడు. దే. క్రి. ౧. భయపడు. వి. ౨. భయము.
బెగడుపడు. దే. క్రి. భయపడు.
బెగ్గడిల్లు. దే. క్రి. భయపడు.
బెగ్గలము. వై. వి. ౧. భయము. ౨. విహ్వలము.
బెగ్గలించు. వై. క్రి. ౧. భయపడు. ౨. విహ్వలించు.
బెగ్గలికము. దే. వి. భయము.
బెగ్గిల్లు. దే. క్రి. ౧. భయపడు. ౨. చింతించు. 3. చలించు.
బెగ్గురు. వై. వి. సారసపక్షి.
బెజ్జము. దే. వి. తూఁటు.
బెట్ట. దే. విశ. వేండ్రము.
బెట్టిదము. దే. వి. ౧. కాఠిన్యము. ౨ ఉద్ధతి. విశ. 3. కఠినము. ౪. క్రూరము.
బెట్టిదుఁడు. దే. విశ. ౧. క్రూరుడు. ౨. కఠినుఁడు. 3. ఉద్ధతుఁడు.
బెట్టిదురాలు. దే. విశ. బెట్టిదముగలది.
బెట్టు. దే. వి. ౧. గౌరవము. ౨. అతిశయము. క్రి. విశ. 3 గట్టిగా. ౪. దృఢముగా.
బెడఁగు. దే. క్రి. ౧. చలించు. ౨. తొలఁగు.
బెడఁగారు. దే. క్రి. అందగించు.
బెడఁగు. దే. వి. ౧. అందము. ౨. విలాసము. క్రి. 3. అందగించు. విశ. ౪. అధికము. ౫. మనోజ్ఞము.
బెడద. దే. వి. ౧. ఆపద. ౨. బాధ.
బెడిదము. దే. వి. ౧. కఠినత్వము. ౨. భయంకరత్వము. విశ. 3. భయంకరము.

బెడిదుఁడు. వై. విశే. ౧. కఠినుఁడు. ౨. భయంకరుఁడు.

బెడిదురాలు. దే. విశే. బెడిదముగలది.

బెడియు. దే. క్రి. ౧. వికలమగు. ౨. తప్పు.

బెణఁకు. దే. క్రి. తొలఁగు. రూ బెడఁకు.

బెత్తము. దే. వి. పేము.

బెత్తిక. దే. వి. ఎండి లేచిన మట్టిపెల్ల.

బెత్తిలి. వై. వి. తర్జని మొదలైన నాలుగు వ్రేళ్ళ యడ్డకొలఁత.

బెత్తు. దే. వి. బెత్తిక.

బెదరింపు. దే. వి. బెదరించుట.

బెదరు. దే. వి. ౧. భయము. క్రి. ౨. భయపడు.

బెదరుపడు. దే. క్రి. భయంపడు.

బెదరుపోతు. దే. విశే. ౧. భయశీలుఁడు. ౨. భయశీలురాలు.

బెబ్బులి. దే. వి. పెద్దపులి.

బెరయు. దే. క్రి. ౧. పొందు. ౨. చేరు. ౩. కలుగు.

బెరసు. దే. విశే. క్రూరము.

బెరికి. దే. వి. ౧. కొఱఁత. ౨. న్యూనత.

బెరుకు. దే. వి. ౧. భేదము. ౨. ప్రయోజనము.

బెలము. వై. వి. బొక్క.

బెల్లము. దే. వి. చెఱకుపాలు కాఁచగా నైనముద్ద.

బెల్లి. దే. విశే. వంచకము.

బెల్లించు. దే. క్రి. వంచించు.

బెల్లింపు. దే. వి. వంచనము.

బెసుకు. దే. క్రి. బెడియు.

బెస్త. దే. వి. బోయీ.

బెహారము. వై. వి. చూ. బేహారము.

బెహారి. వై. వి. చూ. బేహారి.

బెళకు. దే. క్రి. ౧. బెదరు. ౨. చలించు. వి. ౩. చలనము.

బెళుకు. దే. క్రి. ౧. తళతళలాడు వి. ౨. తళతళ మను ప్రకాశము.

## బే

బేటు. దే. వి. ఎండినమట్టి మొదలగు వాని పెల్ల. రూ. పేటు.

బేడ. దే. వి. ౧. పరకరూపాయి. ౨. ౩. కాయధాన్యముల పప్పు.

బేడిగ. దే. వి. పన్ను.

బేడిదము. వై. విశే. బెడిదము.

బేడిస. దే. వి. మత్స్యము.

బేతాళము. వై. వి. ౧. పిశాచము. ౨. భూతావిష్టమృతశరీరము.

బేది. దే. వి. విరేచనము.

బేరకత్తియ. } వై. విశే. బేరమాడునది.
బేరకత్తె. }

బేరకాఁడు. దే. విశే. బేరమాడువాఁడు.

బేరజము. దే. వి. ౧. కుత్సితపునడక. విశే. ౨. పరుషవచనము.

బేరము. వై. వి వ్యాపారము.

బేరి. వై. వి. ౧. వైశ్యుఁడు. ౨. వాద్య విశేషము.

బేల. వై. విణ. మూఢుఁడు.

బేలరి. వై. విణ. మోసకాఁడు.

బేగ. దే. వి. మోసము.

బేలుపడు. / బేలుపోవు. ) దే. క్రి. మోసముపోవు. రూ. బేల్పడు; బేల్పోవు.

బేసర. దే. వి. ఒకదెనుసు ముక్కెర.

బేసి. దే. విణ. సమముకానిది.

బేసికంటి. దే. వి. శివుఁడు.

బేహరము. వై. వి. చూ. బేహారము.

బేహరి. వై. వి. చూ. బేహారి.

బేహారము. వై. వి. వాణిజ్యము.

బేహారి. వై. వి. వణిజుఁడు. రూ. బేహారి. బెహారి.

## బై

బైరాగి. వై. వి. విరక్తుఁడైన తీర్థవాసి.

బైలగు. దే. క్రి. బయలుపడు.

బైలు. దే. వి. బయలు.

బైసి. వై. వి. ౧. గౌరవము. ౨. భాగ్యము.

## బొ

బొంకణము. దే. విణ. బొక్కణము.

బొంకరి. దే. విణ. అసత్యవాది.

బొంకించు. దే. క్రి. మోసపుచ్చు.

బొంకు. దే. క్రి. ౧. అసత్యమాడు వి. ౨. అసత్యవచనము. విణ. 3. అసత్యము.

బొంకులాఁడి. దే. విణ. అసత్యములాడునది.

బొంకులాఁడు. దే. విణ. అసత్యములాడువాఁడు.

బొంగరము. దే. వి. బాలురాడుకొను బొమ్మరము.

బొంగు. దే. వి. ఎండిన లావు బోలువెదురు.

బొంగువెదురు. దే. వి. బోలువెదురు.

బొండ. దే. వి. తప్పు చేసినవారి కాలు సేతులకుఁ దగిల్చెడు దారుయంత్ర విశేషము.

బొండము. దే. వి. బొండలము.

బొండు. దే. విణ. గుండ్రమైనది.

బొండుమల్లె. దే. వి. గుండుమల్లె.

బొండ్లము. దే. వి. టెంకాయమీఁది బొనిక. రూ. బొండ్లాము. బొండలము.

బొంత. దే. విణ. ౧. పెద్ద. వై. వి. ౨. గంత.

బొంతకాకి. దే. వి. మాలకాకి.

బొంతటాయి. దే. వి. తురకటాయి.

బొంద. దే. వి. ౧. తాడు లోనగు చిన్నచెట్టు. ౨. రంధ్రము.

బొందడము. దే. వి. బొందళము.

బొందళము. దే. వి. కవచము.
బొంది. దే. వి. శరీరము.
బొందు. దే. వి. ౧. వెన్ను దీయుటకుఁ దగనట్టి వరి లోనగునది. ౨. పుష్ప రసము. 3. దారము.
బొందుపోవు. దే. క్రి. వరి లోనగునది వెన్నుతీయు యోగ్యము గాకపోవు.
బొందె. దే. వి అరఁటియూఁచె.
బొక్క. దే. వి. నోరు నిండిన పాడి యగు తినుబండము. వై. ౧. బిలము. ౨. రంధ్రము.
బొక్కణము. దే. వి. విభూతిసంచి.
బొక్కలాఁడు. దే. వి. ౧. పాము. ౨. కన్నగాఁడు.
బొక్కసము. దే. వి. ౧. ధనముండు చోటు. ౨. కోశము.
బొక్కి. దే. విశ. ౧. మాంసములేనిది. ౨. పండ్లులేనిది.
బొక్కినియ. దే. వి. గుఱ్ఱమునకు ఉలవలు పెట్టెడు బొక్కెన.
బొక్కిసా. దే. వి. చిన్నమూట.
బొక్కు. దే. క్రి. ఏదేని నోరునిండ వైచుకొనితిను.
బొక్కులాఁడు. దే. క్రి. బొక్కు.
బొక్కెన. దే. వి. ౧. నీళ్ళు చేఁదెడి యినుప పాత్రము. ౨. గుఱ్ఱమునకు ఉలవలు పెట్టెడి తోలుసంచి. 3. నీళ్లెత్తి పోసెడి తోలుసంచి.
బొగడ. దే. వి. ౧. చనుమొన. ౨. బుగడ. 3. చెఱువుకట్ట లోనగు వానియందు నీళ్ళువచ్చు బొంద.
బొగ్గు. దే. వి. మండి చల్లారిన కట్టె తునుక.
బొచ్చె. దే. వి. ౧. తలపుఱ్ఱె. ౨. కుండ లోనగువాని పెంకు.
బొచ్చు. దే. వి. వెంట్రుక.
బొజుఁగు. వై. వి. విటుఁడు.
బొజ్జ. దే. వి. కడుపు.
బొటనవ్రేలు. దే. వి. పెద్దవ్రేలు. రూ. బొటమనవ్రేలు. బొట్టవ్రేలు.
బొటిమ. దే. వి. మొటిమ.
బొట్ట. దే. వి. వెదురు బద్దలు లోనగు వానిచే నల్లినగాదె.
బొట్టనవ్రేలు. దే. వి. బొటనవ్రేలు.
బొట్టవ్రేలు. దే వి. బొటవ్రేలు.
బొట్టియ. దే. వి. ౧. కూఁతురు. ౨. కొడుకు. రూ. బొట్టె.
బొట్టు. దే. వి. ౧. అనుస్వారము. ౨. తిలకము. 3. జలాది బిందువు. ౪. మంగళ సూత్రమునందుఁ దూర్చు బంగారు.
బొట్టె. దే.వి ౧.కొడుకు.౨.కూఁతురు.
బొట్టెఁడు. దే. వి. బాలుఁడు.
బొడబొడ. దే. వి. కాలుటయందయ్యెడి ధ్వన్యనుకరణము.
బొడ్డనబావి. దే. వి. నడుమపిల్లనాయి కల కోనేఱు.

బొడ్డు. దే. వి. ౧. నాభి. ౨. బావి చుట్టు ఎత్తుగా వెట్టినగోడ.
బొత్త. దే వి. చిల్లిపడ్డపాత్ర.
బొత్తిగ. దే. అవ్య. మొదలంట.
బొద. దే. వి. తృణవిశేషము.
బొది. దే. వి. ఓడలు చేసెడిచోటు.
బొద్దింక. దే. వి. బరిణ పురుగు.
బొద్దు. దే. వి. గోడలు మున్నగు వాని యందుంలయందు ఏర్పఱచు త దవయవ విశేషము.
బొప్పఁడు. దే. విణ. మూర్ఖుఁడు.
బొప్పి. దే. వి. ౧. బుడిపె. విణ. ౨. తెలియనిది.
బొబ్బ. దే. వి. ౧. సింహనాదము. ౨. పొక్కు.
బొబ్బమెకము. దే. వి. సింహము.
బొబ్బర. వై. వి. ౧. సస్య విశేషము. ౨. చెట్టుమీఁది బరడు.
బొబ్బరించు. దే. క్రి. ౧. బొబ్బవేయు. వి. ౨. బొబ్బరింత.
బొబ్బాటము. దే. వి. బొబ్బరింత.
బొమ. దే. వి. చూ. బొమ్మ.
బొమముడి. దే. వి. కోపముచేత కలిగెడి కనుబొమలముడి. రూ. బొమ్మముడి.
బొమముడిపాటు. దే. వి. బొమముడి పడుట. రూ. బొమ్మముడిపాటు.
బొమిక. దే. వి. ఎముక.
బొమిడిక. దే. వి. కిరీటము. రూ. బొమిడికము. బొమిడీకము.

బొమ్మ. దే. వి. ౧. ప్రతిమ. ౨. కను బొమ. విణ. 3. అల్పము.
బొమ్మంచు. దే. వి. ౧. బొమ్మలుకల కమ్మిచీర. ౨. ఎఱుపు. విణ. 3. ఎఱ్ఱనిది.
బొమ్మఁడు. వై. వి. బ్రాహ్మణుఁడు.
బొమ్మచారి. వై. వి. బ్రహ్మచారి.
బొమ్మముడి. దే. వి. చూ. బొమ ముడి.
బొమ్మరము. వై. వి. బొంగరము.
బొమ్మరపోవు. దే. క్రి. భ్రమించు.
బొమ్మరిల్లు. దే. వి. బాలికలు బొమ్మల నుంచి ఆడుకొను చిన్నయిల్లు.
బొమ్మికము. దే. వి. బొమ్మిడికము.
బొమ్మిడికము. దే. వి. బొమిడికము.
బొరుగులు. } దే. వి. పేలగింజ.
బొరువులు. }
బొఱియ. దే. వి. ౧. గొయ్యి. ౨. బిలము. రూ. బొఱ్ఱె.
బొఱ్ఱ. దే. వి. ౧. బొజ్జ. ౨. కడుపు.
బొల్లఁడు. దే. వి. బొల్లిగుఱ్ఱము.
బొల్లి. దే. విణ. ౧. తెల్లనిది. ౨. తెల్లని వాఁడు.
బొల్లు. దే. క్రి. ౧. అసత్యమాడు. వి. ౨. అసత్యము.
బొసిక. దే. వి. టెంకాయ మొదలగు వాని పైతోలు.
బొళుకుబొళుకు. దే. వి. కప్పకుట్టలో నయ్యెడి ధ్వన్యనుకరణము.

బో

బోఁకి. దే. వి. చెడిపోయినపాత్ర.
బోఁకె. దే. వి. ఎముక.
బోఁటి. దే. విశ. ౧. వంటి. ౨. వంటివాఁడు.
బోగమాట. దే. వి. బోగముదాని నృత్యము.
బోగము. దే. వి. ౧. వెల. ౨. లంజె. వెల.
బోగముది. దే. వి. వెలయాలు.
బోగి. దే. వి. ౧. సంక్రాంతి పండుగ దినమునకు తొలిదినము. విశ. ౨. భోగము కలవాఁడు. 3. భోగము కలది.
బోగుబడి. దే. విశ. ౧. దూఁబఱి దిండి. ౨.వి. ఱంకులాఁడి.
బోటి. దే. వి. ౧. చెలికత్తె. ౨. ఆఁడుది.
బోటికత్తియ. } దే. వి. చెలికత్తె.
బోటికత్తె. }
బోటు. దే. విశ. ౧. శ్రోత్రియుఁడు. ౨. ధూర్తుఁడు.
బోడ. దే. వి. ౧. మోడు. ౨. సన్న్యాసి. విశ. 3. బోడిది. ౪. బోడివాఁడు.
బోడఁడు. దే. విశ. బోడివాఁడు.
బోడి. దే. విశ. ౧. బోడిది. ౨. బోడివాఁడు.
బోడించు. దే. క్రి. బోడిచేయు.
బోడిక. దే. వి. ౧. సేవకుఁడు. ౨. బాలకుఁడు.
బోడు. దే. విశ. బోడియైనది.
బోణి. దే. వి. మొట్టమొదట సరకు అమ్మగా వచ్చిన సొమ్ము.
బోద. దే. వి. పక్షి లోనగువాని పిల్ల. (అంచబోద; చిలుకబోద)
బోదన. దే. వి. దుర్బోధన.
బోదియ. } దే. వి. ౧. స్తంభమువిూఁది యవయవ విశేషము. ౨. అడుగు మొదలు
బోదె. } కొమ్మల మొదళ్లవఱకుఁ గల భాగము.
బోధకుఁడు. త్స.వి.ఉపాధ్యాయుఁడు.
బోధచేయు. త్స. క్రి. బోధించు.
బోధనము. త్స. వి. నేర్పుట.
బోధపడు. త్స. క్రి. ఆకళింతకువచ్చు.
బోధించు. త్స. క్రి. కఱపు.
బోనకత్తియ. } దే. వి. అన్నము వండి
బోనకత్తె. } పెట్టునది.
బోనకాఁడు. దే. వి. అన్నము వండి పెట్టువాఁడు.
బోనము. వై. వి. ౧. అన్నము. ౨. భోజనము.
బోనముకత్తె. దే. వి. బోనకత్తె.
బోనముపెట్టె. దే. వి. తోలుకప్పిన గుండ్రనిపెట్టె.
బోను. దే. వి. మృగము లోనగు వానిఁ బట్టియుంచు కపటయంత్రము.

బోయ. దే. వి. కిరాతుఁడు.
బోయఁడు. దే. వి. బోయవాఁడు.
బోయత. దే. వి. బోయకత. రూ. బోయెత.
బోయి. / బోయీ. దే. వి. ౧. పల్లకిమోచువాఁడు. ౨. జెస్త.
బోర. దే. వి. బోమ్మ.
బోరగిల్లు. దే. క్రి. ౧. బోమ్మభూమినాను. ౨. బోమ్మభూమినానఁబరుండు. రూ. బోరగిలు.
బోరన. దే. అవ్య. శీఘ్రముగా.
బోరు. దే. వి. ౧. వానకురియుటయందయ్యేడి ధ్వన్యనుకరణము. విణ. ౨. పెద్ద. (బోరుతలుపులు.)
బోరుకలఁగు. దే. క్రి. ధ్వనించు.
బోరుకొను. దే. క్రి. మ్రోఁగు.
బోరుతలుపులు. దే. వి. బ. నగరులోనగు వాని వాకిటి పెద్దరెక్కతలుపులు. రూ. బోర్తలుపులు.
బోరెంపోతు. దే. వి. తిండిపోతు.
బోలు. దే. విణ. లోపలనేమియులేనిది.
బోలె. దే. వి. ౧. కుండబొచ్చె. ౨. ఓటికుండ.
బోసి. దే. వి. ౧. పండ్లులేనిది. ౨. బొక్క. (బోసినోరు)
బోసిపడు. / బోసిపోవు. దే. క్రి. బోసియగు.
బోసేయు. దే. క్రి. భుజించు.
బోళా. వై. విణ. కపటములేని.

బ్రి

బ్రతుకు. / బ్రదుకు. దే. క్రి. ౧. జీవించు వి. ౨. జీవనము. ౩. స్థితి.
బ్రదిమి. దే. వి. బ్రదుకుదెరువు.
బ్రద్ద. దే. వి. ౧. చీలిక. ౨. తునుక.
బ్రద్దలవారు. దే. వి. వేత్రధరులు.
బ్రధ్నుఁడు. త్స. వి. సూర్యుఁడు.
బ్రమయు. వై. క్రి. భ్రమించు.
బ్రమరిగొను. / బ్రమరివాఱు. దే. వి. చుట్టివచ్చు.
బ్రహ్మ. త్స. వి. ౧. నలువ. ౨. విష్ణువు.
బ్రహ్మచర్యము. త్స. వి. ౧. ఆశ్రమవిశేషము. ౨. నాలుగాశ్రమములలో మొదటిది.
బ్రహ్మచారి. త్స. వి. వడుగు.
బ్రహ్మబంధువు. త్స. విణ. నింద్యబ్రాహ్మణుఁడు.
బ్రహ్మభూయము. త్స. వి. బ్రహ్మత్వము.
బ్రహ్మము. త్స. వి. ౧. వేదము. ౨. పరమాత్మ.
బ్రహ్మయజ్ఞము. త్స. వి. వేదపాఠము.
బ్రహ్మరంధ్రము. త్స. వి. మాడపట్టు.
బ్రహ్మరథము. త్స. వి. మృతిపొందిన సన్న్యాసులను తీసికొని పోయెడి వాహనము.
బ్రహ్మవాది. త్స. వి. వేదాంతి.

బ్రహ్మసూత్రము. త్స. వి. యజ్ఞోపవీతము.

బ్రహ్మారణ్యము. త్స. వి. వేదపాఠభూమి.

బ్రహ్మావర్తము. త్స. వి. ఢిల్లీకి వాయవ్య దిశనుండు నొకదేశము.

బ్రా

బ్రాఁతి. దే. వి. ౧. ప్రేమ. విణ. ౨. అధికదుర్లభము.

బ్రాహ్మణబ్రువుఁడు. త్స. విణ. జాతిమాత్ర బ్రాహ్మణుఁడు.

బ్రాహ్మణము. త్స. వి. ఒకవేద భాగము.

బ్రాహ్మణార్థము. త్స. వి. పితృకార్యములందు భోజనమునకుఁ బోవుట.

బ్రాహ్మణి. త్స. వి. బ్రాహ్మణుని భార్య.

బ్రాహ్మణుఁడు. త్స. వి. పాఱుఁడు. వ్యు. పరబ్రహ్మయందు నిష్ఠ కలవాఁడు.

బ్రాహ్మణ్యము. త్స. వి. బ్రాహ్మణ సమూహము.

బ్రాహ్మము. త్స. వి. విద్యయును, ఆచారమును గల వరుని తానే పిలిచి వధూసహితముగ వస్త్రాభరణములచే నలంకరించి పూజించి కన్యనిచ్చి చేయువివాహము.

బ్రాహ్మి. త్స. వి. ౧. సరస్వతి. ౨. ఒక మాతృక.

బ్రి

బ్రింగు. దే. క్రి. ౧. పూఁడు. ౨. మునుఁగు.

బ్రింగుడు. దే. విణ. ౧. మునిఁగినది. ౨. మఱఁగినది.

బ్రింగుడుపడు. దే. క్రి. మఱుఁగుపడు.

బ్రింగుడువాటు. దే. వి. బ్రింగుడు పడుట.

బ్రిసి. త్స. వి. వ్రతుల ఆసనము.

# భ

భంగపడు. త్స. క్రి. ౧ అవమానపడు. వి. ౨. భంగపాటు.

భంగపెట్టు. త్స. క్రి. భంగపఱచు.

భంగము. త్స. వి. ౧. అల. ౨. అవమానము. 3. చెఱుపు.

భంగి. త్స. వి. ౧. విధము. ౨. గంజాయి.

భంగించు. త్స. క్రి. భంగపఱచు.

భంగురము. త్స. విణ. నశించునది.

భంజకము. త్స. విణ. విఱుచునది.

భంజనము. త్స. వి. ౧. విఱుపు. క్రి. ౨. భంజించు.

భంజించు. త్స. క్రి. విఱుచు.

భండనము. త్స. వి. ౧. యుద్ధము. ౨. కవచము.

భండాగము. త్స. వి. కోశము.

భండుఁడు. త్స. విణ. ౧. దుశ్చేష్టుఁడు. ౨. ఆకతాయి.

భంబు. త్స. వి. నక్షత్రము.

భక్తము. త్స. వి. ౧. అన్నము. విణ. ౨. భాగింపఁబడినది.

భక్తి. త్స. వి. ౧. సేవ. ౨. భయముతోఁ గూడిన స్నేహము.

భక్తుఁడు. త్స. వి. భక్తికలవాఁడు.

భక్షకుఁడు. త్స. వి. తిండిపోతు.

భక్షణము. త్స. వి. ౧. తిండి. ౨. తినుబండారము.

భక్షించు. త్స. క్రి. ౧. తిను. ౨. మెసవు.

భక్ష్యము. త్స. వి. ౧. తినుబండారము. విణ. ౨. తినఁదగినది.

భగము. త్స. వి. ౧. కీర్తి. ౨. యోని. ౩. ఇచ్ఛ.

భగవంతుఁడు. త్స. వి. ౧. విష్ణువు. ౨. శివుఁడు. రూ. భగవానుఁడు.

భగవతి. త్స. వి. ౧. సరస్వతి. ౨. గంగ. ౩. పార్వతి.

భగిని. త్స. వి. తోఁబుట్టినది.

భగ్నము. త్స. విణ భంగమునొందినది.

భజనము. త్స. వి. ౧. భాగించుట. ౨. సేవించుట.

భజించు. త్స. వి. ౧. భాగించు. ౨. సేవించు.

భటుఁడు. త్స. వి. ౧. పనివాఁడు. ౨. కాలిబంటు.

భట్టారకుఁడు. త్స. విణ. పూజ్యుఁడు. (నన్నయభట్టారకుఁడు)

భట్టుఁడు. త్స. వి. ౧. బట్టువాఁడు. ౨. విద్వాంసుఁడు.

భద్రము. త్స. వి. ౧. శుభము ౨. బంగారు. విణ. ౧. శుభకరము. ౨. శ్రేష్ఠము.

భద్రాకరణము. త్స. వి. క్షౌరము.

భద్రాసనము. త్స.వి. రాజు కూర్చుండు పీఠము.

భయంకరము. త్స. విణ. భయమును చేయునది.

భయము. త్స. వి. ౧. వెఱపు. విణ. ౨. వెఱపు పుట్టించునది.

భయానకము. త్స. వి. ౧. నవరసములలో నొకటి. విణ. ౨ భయము గలిగించునది.

భరణము. త్స. వి. ౧. జీతము. ౨. భరించుట.

భరణి. త్స. వి. ౧. ఒకానొక నక్షత్రము. ౨. భూమి.

భరద్వాజము. త్స. వి. ఏట్రింత. వ్యు. భరద్వాజులచేత సృష్టింపఁబడినది.

భరద్వాజుఁడు. త్స. వి. ౧. సప్తఋషులలో నొకఁడు. ౨. ద్రోణుఁడు.

భరము. త్స. వి. ౧. బరువు. ౨. అతిశయము.

భరించు. త్స. వి. ౧. పోషించు. ౨. మోచు.

భర్గుఁడు. త్స. వి. శివుఁడు.
భర్జనము. త్స. వి. వేఁచుట.
భర్జించు. త్స. క్రి. వేఁచు.
భర్త. త్స. వి. మగఁడు. వ్యు. భరించువాఁడు.
భర్తృదారకుఁడు. త్స. వి. యువరాజు.
భర్తృదారిక. త్స. వి. రాజుకూఁతురు.
భర్త్సనము. త్స. వి. బెదరింపు.
భర్మము. త్స. వి. బంగారు.
భల్లము. త్స. వి. బల్లెము.
భల్లుకము. / భల్లూకము. త్స. వి. ఎలుఁగుబంటు.
భవదీయము. త్స. విశ. నీది.
భవనము. త్స. వి. ౧. ఇల్లు. ౨. అగుట.
భవము. త్స. వి. ౧. శుభము. ౨. పుట్టుక. 3. సంసారము.
భవాదృశుఁడు. త్స. విశ. మీవంటివాఁడు.
భవాని. త్స. వి. ౧. కావేరియుపనది. ౨. పార్వతి.
భవిష్ణువు. త్స. విశ. కాఁగల స్వభావము గలవాఁడు.
భవిష్యత్తు. త్స. విశ. కాఁగలది.
భవిష్యము. త్స. వి. ౧. భాగ్యము. విశ. ౨. కాఁగలది.
భవుఁడు. త్స. వి. శివుఁడు.
భవ్యము. త్స. వి. ౧. శుభము. విశ. ౨. యోగ్యమైనది. 3. శుభమైనది.
భషకము. త్స. వి. కుక్క.
భషణము. త్స. వి. మొఱుఁగు.
భస్త్ర. త్స. వి. తిత్తి.
భస్త్రి. త్స. వి. ,,
భస్మము. త్స. వి. ఏదయినను కాలి తెల్లగా నైన చూర్ణము.
భస్మీకరించు. త్స. క్రి. భస్మముచేయు.

భా

భాండాగారము. త్స. వి. బొక్కసము.
భాగధేయము. త్స. వి. భాగ్యము.
భాగము. త్స. వి. ౧. భాగ్యము. ౨. పాలు.
భాగించు. త్స. వి. పంచు.
భాగినేయుఁడు. త్స. విశ. మేనల్లుఁడు.
భాగీరథి. త్స. వి. గంగానది.
భాగ్యము. త్స. వి. ౧. అదృష్టము. ౨. సుకృతము.
భాజనము. త్స. వి. పాత్రము.
భాణము. త్స. వి. నాటకభేదము.
భాతి. త్స. వి. ౧. కాంతి. ౨. విధము.
భాద్రపదము. త్స. వి. భాద్రపదమాసము.
భానువు. త్స. వి. ౧. కిరణము. ౨. సూర్యుఁడు.
భామ. త్స. వి. ౧. ఆఁడుది. ౨. సత్యభామ.
భామిని. త్స. వి. ఆఁడుది.
భారవహుఁడు. త్స. వి. బరువుమోసెడి కూలివాఁడు.

భారతము. త్స. వి. ౧. వ్యాసుఁడు రచించిన భరతవంశజుల చరిత్రము. ౨. హిమవత్పర్వతమునకును దక్షిణ సముద్రమునకును నడుమనైనవర్షము
భారతి. త్స. వి. సరస్వతి.
భారద్వాజము. త్స. వి. చూ. భరద్వాజము.
భారము. త్స.వి.౧. బరువు. ౨.బరువు.
భారయష్టి. త్స. వి. కావడిబద్ద.
భారవాహుఁడు. త్స. విణ. కావడి మోయువాఁడు.
భార్గవి. త్స. వి. లక్ష్మి
భార్గవుఁడు. త్స. వి. ౧. పరశురాముఁడు. ౨. శుక్రుఁడు.
భార్య. త్స. వి. అగ్నిసాక్షిగాఁ బెండ్లియాడిన పెండ్లాము.
భావ. త్స. వి. ఒకానొక సంవత్సరము.
భావజుఁడు. త్స. వి. మన్మథుఁడు.
భావన. త్స. వి. తలంపు.
భావము. త్స. వి. ౧. స్వభావము. ౨. పుట్టుక. 3. అభిప్రాయము.
భావించు త్స. క్రి. ౧. ఎంచు. ౨. తలఁచు.
భావుకము. త్స. వి. శుభము.
భావ్యము. త్స. విణ. అవశ్యము కాఁదగినది.
భాష. త్స. వి. ౧. తెనుఁగు, అఱవము మొదలగు భాష. ౨. మాట. 3. ప్రతిజ్ఞ.
భాషణము. త్స. వి. మాటాడుట.
భాషించు. త్స. క్రి. మాటలాడు.
భాష్యము. త్స. వి. సూత్రవ్యాఖ్యానగ్రంథము.
భాసమానము. త్స. వి. ప్రకాశించునది.
భాసిల్లు. త్స. క్రి. ప్రకాశించు
భాసురము. త్స. విణ. ప్రకాశించునది.
భాస్కరుఁడు. త్స. వి. ౧. అగ్ని. ౨. సూర్యుఁడు. వ్యు. కాంతిని జేయువాఁడు.
భాస్వంతుఁడు. త్స.వి. ౧. సూర్యుఁడు. విణ. ౨. ప్రకాశించువాఁడు.
భాస్వరుఁడు. త్స. విణ. ,,

భి

భిక్ష. త్స. వి. ౧. బిచ్చము. ౨. కూలి. 3. సేవ.
భిక్షించు. త్స. క్రి. భిక్షమెత్తు.
భిక్షుకుఁడు. త్స. వి. భిక్షమెత్తుకొని జీవించువాఁడు.
భిక్షువు త్స. వి. ౧. సన్న్యాసి. ౨ బ్రహ్మచారి.
భిత్తము. త్స. వి. తునుక.
భిత్తి. త్స. వి. గోడ.
భిత్తిక. త్స. వి. గోడ.
భిద. త్స. వి. భేదము.
భిదురము. త్స. వి. వజ్రాయుధము.
భిన్నము. త్స. విణ. ౧. పగిలినది. ౨. వేఱుపడినది. 3. విరిసినది.

భిల్లుఁడు. త్స. వి. బోయవాఁడు.
భిషక్కు. త్స. వి. వైద్యుఁడు.
భిస్స. త్స. వి. అన్న.

భీ

భీకరము. త్స. వి. భయంకరము.
భీతము. త్స. వి. ,,
భీతి. త్స. వి. ౧. భయము. ౨. వడఁకు.
భీతిల్లు. త్స. క్రి. భయపడు.
భీమము. త్స. విణ. భయంకరము.
భీముఁడు. త్స. విణ. ౧. భయంకరుఁడు. ౨. ధర్మరాజు తమ్ముఁడు. 3. శివుఁడు.
భీరుకుఁడు. త్స. విణ. పిఱికి.
భీరువు. త్స. వి. ౧. ఆఁడుది. ౨. భయముగల గోఁడుది. 3. భయముగల పురుషుఁడు.
భీషణము. త్స. విణ. భయంకరము.
భీష్మము. త్స. విణ ,,
భీష్ముఁడు. త్స. వి. ౧. శివుఁడు. ౨. శాంతనవుఁడు.

భు

భుక్తము. త్స. విణ. భుజింపఁబడినది.
భుక్తి. త్స. వి. ౧. అనుభవము. ౨. భోజనము.
భుగ్నము. త్స. విణ. ౧. వంగినది. ౨. విఱిగినది.
భుజము. త్స. వి. చేయి.
భుజంగమము. } త్స. వి. పాము.
భుజంగము.
భుజగము.
భుజకీర్తి. త్స. వి. బాహుపురి.
భుజించు. త్స. క్రి. ౧. అనుభవించు. ౨. తిను.
భుజిష్య. త్స. వి. ౧. పరిచారిక. ౨. వేశ్య.
భువనము. త్స. వి. ౧. ఆకాశము. ౨. జగము. 3. ఉదకము.
భువనేశ్వరము. త్స. వి. చుట్టుబవంతి.
భువి. త్స. వి. ౧. స్థానము. ౨. భువి.

భూ

భూజము. త్స. వి. వృక్షము.
భూతము. త్స. వి. ౧. పిశాచాది. ౨. ప్రాణి. 3. పృథివ్యాది. విణ. ౧. వెలసినది. ౨. కడచినది.
భూతి. త్స. వి. ౧. ఐశ్వర్యము. ౨. భస్మము.
భూతేశుఁడు. త్స. వి. శివుఁడు.
భూదారము. త్స. వి. వరాహము.
భూదేవుఁడు. త్స. వి. బ్రాహ్మణుఁడు.
భూధరము. త్స. వి. పర్వతము.
భూపతి. త్స. వి. రాజు.
భూమి. త్స. వి. ౧. నేల. ౨. చోటు. వ్యా. సర్వము దీనియందుఁగలుగును.
భూమిక త్స. వి. ౧. మాఱువేషము. ౨. రచన.

భూయిష్ఠము. త్స. విశే. అధికము.
భూరి. త్స. విశే. ౧. అధికము. ౨. వి. బంగారు.
భూరుహము. త్స. వి. వృక్షము.
భూష. త్స. వి. సొమ్ము.
భూషణము. త్స. వి. ౧. తొడవు. ౨. అలంకరణము.
భూషించు. త్స. క్రి. స్తుతించు.
భూసురుఁడు. త్స. వి. బ్రాహ్మణుఁడు.

భృ

భృంగము. త్స. వి. తుమ్మెద.
భృంగారము. త్స. వి. బంగారుగిండి.
భృగువు. త్స. వి. కొండచఱి గ.
భృతకుఁడు. త్స. వి. కూలివాఁడు.
భృతము. త్స. వి. భరింపఁబడినది.
భృతి. త్స. వి. కూలి.
భృత్యుఁడు. త్స. వి. పనివాఁడు.
భృశము త్స. విశే. అధికము.

భే

భేకము. త్స. వి. కప్ప.
భేదము. త్స. వి. ౧. వేఱిమి. ౨. భేదనము.
భేదించు. త్స. ప్రే. భేదిల్లఁజేయు.
భేదిలు. / భేదిల్లు. } త్స. క్రి. ౧. చీలు. ౨. వేఱగు.
భేరి. త్స. వి. దుందుభి.
భేషజము. త్స. వి. ఔషధము.

భై

భైక్షము. త్స. వి. భిక్షాసమూహము.
భైరవము. త్స. వి. భయానకరసము.
భైరవుఁడు. త్స. వి. ౧. భయానకరసము గలవాఁడు. వి. ౨. శివుఁడు.
భైషజ్యము. త్స. వి. మందు.

భో

భోక్త. త్స. విశే. ౧. అనుభవించువాఁడు. ౨. భుజించువాఁడు.
భోక్తవ్యము. త్స. విశే. భుజింపఁదగినది.
భోగగృహము. త్స. వి. పడకిల్లు.
భోగము. త్స. వి. ౧. సుఖము. ౨. భోజనము. 3. ధనము. (భోగములు ఎనిమిది. ౧. ఇల్లు. ౨. పడక. 3. వస్త్రము. ౪. ఆభరణము. ౫. స్త్రీ. ౬. పుష్పము. ౭. గంధము. ౮. తాంబూలము.)
భోగవతి త్స. వి. పాతాళము.
భోగి. త్స. విశే. ౧. సుఖవాసి. వి. ౨. రాజు. 3. పాము.
భోగించు. త్స. క్రి సుఖించు.
భోగిని. త్స. విశే. భోగముది.
భోగ్యము. త్స. విశే. ౧. భోగింపఁదగినది. ౨. వి. ధనము.
భోజనము. త్స. వి. ఆహారము.
భోజ్యము. త్స. విశే. భుజింపఁదగినది.
భోషాణము. దే. వి. పెద్దపెట్టె.

భౌ

భౌతికశాస్త్రము. త్స. వి. భూత సంబంధమైన శాస్త్రము.

భ్ర

భ్రంశము. త్స. ౧. జాఱుట. ౨. వలించుట.

భ్రమణము. త్స. వి. ౧. తిరుగుడు. ౨. తుమ్మెద.

భ్రమము. త్స. వి. ౧. భ్రాంతి. ౨. తిరుగుడు.

భ్రమరము. త్స. వి. తుమ్మెద.

భ్రమరించు. } త్స. క్రి. ౧. తిరుగు.
భ్రమించు. } ౨. భ్రాంతిపడు.

భ్రష్టుఁడు. త్స. విశ. వెలివేయఁబడినవాఁడు.

భ్రా

భ్రాంతి. త్స. వి. ౧. తిరుగుడు. ౨. భ్రమ.

భ్రాజిష్ణువు. త్స. విశ. ప్రకాశించువాఁడు.

భ్రాత. త్స. వి. తోడఁబుట్టినవాఁడు.

భ్రాతృవ్యుఁడు. త్స. విశ. తోఁబుట్టినవాఁడు.

భ్రు

భ్రుకుటి. త్స. వి. బొమముడి. రూ. భృకుటి. భ్రూకుటి. భ్రకుటి.

భ్రూ

భ్రూవు. త్స. వి. కనుబొమ్మ.

# మ

మంకు. దే. విశ. ౧. మూర్ఖుఁడు. ౨. మొండి.

మంకెన. దే. వి. బంధూకము.

మంగల. దే. వి. క్షౌరముచేయుజాతి.

మంగలకత్తి. దే. వి. మంగలివాని కత్తి.

మంగలము. దే. వి. వేపుడు చట్టి.

మంగలి. దే. వి. మంగలవాఁడు.

మంగలిపని. దే. వి. క్షౌరము.

మంగళము. త్స. వి. ౧. క్షేమము. ౨. శుభము.

మంగళవారము. త్స. వి. ఒకానొకవారము.

మంగళసూత్రము. త్స. వి. ౧. బొట్టు. ౨. దారము. 3. తాళి.

మంగళహారతి. త్స. వి. మంగళకరమైన యారతి.

మంగళారతి. వై. వి. ,,

మంగళాశాసనము. త్స. వి. ఆశీర్వాదము.

మంగళ్యము. త్స. విశ. మంగళకరము.

మంచము. త్స. వి. ౧. మంచె. ౨. మంచేము.

మంచి. దే. వి. ౧. మేలు. (మంచి సెబ్బము) విశే. ౨. యోగ్యము.

మంచిగంధము. దే. వి. శ్రీచందనము.

మంచినీళ్లు. దే. వి. బ. త్రాగుటకుఁ దగిన జలము.

మంచినూనె. దే. వి. నువ్వులనూనె.

మంచిపాము. దే. వి. నాగుఁబాము.

మంచిబెల్లము. దే. వి. చెఱుకురసముతోఁ జేసిన బెల్లము.

మంచిముత్తెము. దే. వి. మేలైన ముత్యము.

మంచియ.
మంచె. } దే. వి. జొన్నచేను మొదలగు తావులఁ గూర్చుండుటకై ఎత్తుగాఁ గట్టిన చప్పరమువంటి పందిరి.

మంచేము. దే. వి. ౧. మంచము. ౨. పర్యంకము.

మంచు. దే. వి. ౧. హిమము. క్రి. చూ. ౨. మనుచు.

మంచుఁగొండ. దే. వి. హిమవత్పర్వతము.

మంచుతఱి. దే. వి. హేమంతఋతువు.

మంజరి. త్స. వి. ౧. చిగిరించిన లేఁతకొమ్మ. ౨. పెద్దముత్యము.

మంజిడి. దే. వి. ౧. చిత్రవర్ణవస్త్రము. ౨. నీలవస్త్రము.

మంజిమ.
మంజిమము. } త్స. వి. మనోజ్ఞత.

మంజిష్ఠ. త్స. వి. మిక్కిలి ప్రకాశించు ఎఱుపు.

మంజీరము. త్స. వి. అందె.

మంజులము. త్స. విశే. ఒప్పిదమైనది.

మంజువు. త్స. విశే. మనోజ్ఞము.

మంజూష. త్స. వి. పెట్టె.

మంజేస. వై. వి. పెట్టె.

మంట. దే. వి. ౧. కోపము. ౨. జ్వాల.

మంటమారి. దే. విశే. ౧. కోపశీలుఁడు. ౨. జ్వాలనశీలుఁడు.

మండ. దే. వి. ౧. ఉపశాఖ. ౨. కొమ్మ.

మండనము. త్స వి. ౧. అలంకరించుట. ౨. భూషణము.

మండపము. త్స. వి. ౧. చావడి. ౨. చుట్టును నడుమను మఱుఁగులేక స్తంభములు నిలిపి కట్టిన కట్టడము

మండపి. త్స. వి. చిన్నమండపము.

మండము. త్స. వి. మీఁగడ.

మండలము. త్స. వి. ౧. పరివేషము. ౨. దేశము. 3. సమూహము.

మండలాగ్రము. త్స. వి. కత్తి.

మండలి. త్స. వి. సమూహము.

మండలేశ్వరుఁడు. త్స. వి. అధీశ్వర సార్వభౌములకంటె ఇతరుఁడైన రాజు.

మండాటము. దే. వి. దైన్యముతో యాచించుట.

మండాడు. దే. క్రి. దైన్యముతో యాచించు.
మండి. } దే. వి. ఒకకాలు నేలమోఁక
మండీ. } రించుట.
మండిగము. దే వి. ౧. వాకిటిక్రింద నడ్డుగా నమర్చిన కొయ్యశీల.
మాఁడు. దే. క్రి. ౧. చుఱుకుమని నొచ్చు. ౨.జ్వలించు. 3.కోపపడు.
మండునెల. దే. వి. వసంతబుతువు.
మండువా. దే. వి. ౧. ఒకతట్టు గోడ లేని గుజ్జాల పాక. ౨. పాక. 3. ఇంటిపైకప్పులో మధ్యవిడిచిపెట్టఁబడు ఖాళీస్థలము.
మండూకము. త్స. వి. కప్ప.
మండూరము. త్స. వి. ౧. ఇనుపచిట్టెము. ౨. ఇనుపచిట్టెముతోఁ జేసినమందు.
మండెము. వై. వి. చూ. మాఁడెము.
మండ్రగబ్బ. దే. వి. నల్లని పెద్ద తేలు.
మండ్రాటము. దే. వి. సంతాపము.
మండ్రాడు. దే. క్రి. సంతాపించు.
మంతనము. త్స. వి. ౧. ఏకాంతము. ౨. ఆలోచన. 3. రహస్యము.
మంతరము. వై. వి. ౧. జాలవిద్య. ౨. ప్రసవోపాయము.
మంతరసాని. వై. వి. మంత్రిసాని.
మంతిరి. వై. వి. మంత్రి.
మంతిరించు. వై. క్రి. మంత్రించు.
మంతు. దే. వి. ౧. ప్రసిద్ధి. ౨.మంత్రి.
మంతువు. త్స. వి. అపరాధము.
మంత్రకాఁడు. త్స. వి. ఇంద్రజాలవిద్య నెఱింగినవాఁడు.
మంత్రణము. త్స. వి. రహస్యాలోచన.
మంత్రము. త్స. వి. ౧. రహస్యము. ౨. గాయత్రి లోనగునది. వై. వి. ౧. జాలవిద్య. ౨ ప్రసవోపాయము.
మంత్రవాది. త్స. వి. మాంత్రికుడు.
మంత్రసాని. వై. వి. సుఖముగా ప్రసవింప నుపాయము చేసెడి చికిత్సకురాలు.
మంత్రాంగము. త్స. వి. తంత్రము.
మంత్రి. త్స. వి. బుద్ధిసహాయుఁడు.
మంత్రించు. త్స. క్రి. మంతిరించు.
మంథదండము. త్స. వి. కవ్వము.
మంథనము. త్స. వి. త్రచ్చుట.
మంథము త్స. వి. కవ్వము.
మంథరము. త్స. వి. కవ్వము.
మంథాద్రి. త్స. వి. కవ్వపుకొండ.
మంథానము. త్స. వి. కవ్వము.
మంద. దే. వి. ౧. పశుసమూహము. ౨. గొల్లపల్లియ. 3. గోష్ఠము.
మందగించు. వై. క్రి. మందమగు.
మందట. దే. వి. ౧. అఁడవ. ౨. దగ్గిఱ.
మందటిల్లు. దే. క్రి. అడఁగు.
మందడి. దే. వి. గుజ్జుపుసాల.
మందడీఁడు దే. విణ. గుజ్జువాఁడు.

మందము. దే. విణ. ౧ స్థూలము. ౨. దట్టము. త్స. విణ. 3. చొరవ లేనిది. ౪. మెల్లనిది.

మందరము. త్స. వి. ౧. కవ్వపుఁగొండ. ౨. మందారమను కల్పవృక్షము.

మందల. దే. వి. ౧. మేర. ౨. మన్మదల. 3. బ్రిదుకు.

మందలించు. దే. క్రి. ౧. ఆజ్ఞాపించు. ౨. హెచ్చరించు. 3. చెప్పు. ౪. మనవిచేయు.

మందలింపు. దే. వి. వ్యవహారము.

మందసము. వై. వి. పెట్టె. రూ. మందస.

మందహాసము. త్స. వి. చిఱునవ్వు.

మందాకిని. త్స. వి. ఆకాశగంగ.

మందాకు. దే. వి. మందున కుపయోగపడెడియాకు.

మందాక్షము. త్స. వి సిగ్గు.

మందారము. దే. వి. ౧. మబ్బుక్రిమ్మటు. త్స. వి ౨. ఒక కల్పవృక్షము.

మంది. దే. వి. ౧. పరిజనము. ౨. సమూహము.

మందిరము. త్స. వి ఇల్లు.

మందీభవించు. త్స. క్రి. అడఁగు.

మందు. దే. వి. ౧. ప్రతిక్రియ. ౨. ఔషధము.

మందుఁడు. త్స. వి ౧. శని. విణ. ౨. చొరవలేనివాఁడు. 3. అల్పుఁడు. ౪. నిర్భాగ్యుఁడు.

మందుమల. దే. వి. ౧. మందుచెట్లు కలకొండ. ౨. ద్రోణపర్వతము.

మందులమారి. దే. విణ. ౧. మర్లుమందు. ౨. మర్లుమందుఁ బెట్టువాఁడు. 3. మర్లుమందు పెట్టునది.

మందెమేలము. దే. వి. ౧. స్నేహము. ౨. చనవు. 3. ఉపేక్ష.

మందోష్ణము. త్స. వి. ౧. ఇంచుక వేఁడి. విణ. ౨. ఇంచుక వేఁడియైనది.

మంద్రము. త్స. విణ. గంభీరమైనది. (గంభీరస్వరము.)

మంపిల్లు. దే. క్రి. మత్తిల్లు.

మంపు. దే. వి. మత్తు.

మంపుగొను. దే. క్రి. మత్తిల్లు.

మకరందము. త్స. వి. పూఁదేనె. వ్యు. దీనిచేత పుష్పములంకరింపఁ బడును.

మకరకుండలము. త్స. వి. మొసలిముఖము గల పురుష కర్ణభూషావిశేషము.

మకరతము. త్స. వి. మరకతము.

మకరతోరణము. త్స. వి. మొసలి రూప మేర్పడ చేసిన తోరణము.

మకరధ్వజుఁడు. త్స. వి. మన్మథుఁడు.

మకరము. త్స. వి. మొసలి.

మకరిక. } మకరికాపత్రము. } త్స. వి. స్త్రీలకు చెక్కిళ్లు లోనగు తావుల యందు లత్తుకతో వ్రాసెడి మకర రూపమగు రేఖ.

మకిల. దే. వి. మఱికి.
మకుటము. త్స. వి. కిరీటము.
మకురము. త్స. వి. ౧. మల్లెపువ్వు. ౨. అద్దము.
మకురుతనము. దే. వి. మొండితనము.
మక్కళించు. దే. క్రి. ౧. సరిపఱచు. ౨. సరిపోల్చు. 3. ఉబ్బించు. ౪. తిరుగుకొను.
మక్కా. వై. వి. యవనదేశమునందలి ముఖ్యపట్టణము.
మక్కి. దే. విణ. నిస్సారము.
మక్కు. దే. క్రి. ౧. గీఱు. ౨. చచ్చు. 3. నవయు.
మక్కువ. దే. వి. ౧. కూరిమి ౨. ప్రేమ.
మక్షిక. త్స. వి. నల్లటియీఁగ. వ్యు. దీనికొఱకు కోపింతురు.
మఖము. త్స. వి. యజ్ఞము.
మగ. దే. వి. పుంస్త్వము. (మగవాఁడు.)
మగఁటిమి. దే. వి. ౧. శౌర్యము. ౨. మగతనము.
మగఁడు. దే. వి. ౧. శూరుఁడు. ౨. రాజు. 3. భర్త.
మగచెయువులు. దే. వి. గ్రామ్య ధర్మము.
మగధుఁడు. త్స. వి. వంశావళి చదువు వాఁడు.
మగనాలు. దే. వి. మగఁడు కల యాఁడుది.
మగపాడి. దే. వి. ౧. ఉపరతి. ౨. శౌర్యము.
మగపోఁడుములు. దే. వి. గ్రామ్య ధర్మములు.
మగమానికము. దే. వి. వజ్రము.
మగతాయి. దే. వి. ,,
మగలాగు. దే. వి. ఉపరతి.
మగలాడు. దే. వి. ఉపరతి.
మగవాఁడు. దే. వి. ౧. శూరుఁడు. ౨. పురుషుఁడు.
మగుడు. దే. క్రి. మరలు. రూ. మగుడఁ బడు.
మగుడుచు. దే. క్రి. మగుడఁజేయు.
మగులు. దే. వి. ౧. గోడమీఁది కప్పు. ౨. మడురు.
మగువ. దే. వి. ఆఁడుది.
మగ్గము. దే. వి. సాలెవాఁడు నేసెడి యంత్రము.
మగ్గరి. దే. వి. సాలెవాఁడు.
మగ్గు. దే. క్రి. ఉక్కచేఁజెమ్మగిల్లిచెడు.
మగ్గుడు. దే. వి. మగ్గుట.
మగ్గుడుపాఱు. దే. క్రి. మగ్గు.
మగ్నము. త్స. విణ. మునిఁగినది.
మఘ. త్స. వి. ఒక నక్షత్రము.
మఘము. త్స. వి. యజ్ఞము.
మఘవంతుఁడు. త్స. వి. ఇంద్రుఁడు.
మఘవుఁడు. త్స. వి. ,,
మచ్చిక. దే. వి. ౧. ఆసక్తి. ౨. మోహము. రూ. మచ్చిగ.

మచ్చికపడు. దే. క్రి. ౧. మరగు. ౨. మరులుకొను.

మచ్చెకంటి. దే. వి. ఆఁడుది. వ్యు. చేపలవంటి కన్నులుగల యాఁడుది.

మచ్చెము. వై. వి. చేఁప.

మచ్చ. దే. వి. ౧. పుట్టినప్పుడే దేహమునందుఁగలిగిన నల్లని యెఱ్ఱనిచుక్క. ౨. గాయము, పుండు లోనగునవి మానినపిమ్మట శరీరచర్మము మీఁద గానిపించు గుఱుతు.

మచ్చుమాయు. దే. క్రి. నశించు.

మచ్చుము. దే. వి. గుఱుతు.

మచ్చరము. వై. వి. ౧. విరోధము. ౨. చలము.

మచ్చరి. వై. విణ. ౧. విరోధి. ౨. చలపాది.

మచ్చరించు. వై. క్రి. ౧. ద్వేషించు. ౨. చలపట్టు.

మచ్చరికము. వై. వి. ౧. విరోధము. ౨. పోటి.

మచ్చరికించు. వై. క్రి. ౧. విరోధించు. ౨. చలపట్టు.

మచ్చరీఁడు. దే. విణ. మచ్చరముగలవాఁడు

మచ్చు. దే. వి. ౧. చొక్కుపొడి. ౨. మృగాదులు వలలోఁ దగులుకొనుటకై వలకు దగ్గిఱనుంచెడి యాహారము. ౩. వన్నె సరిగానున్నదని చూచుకొనుటకై అగసాలెవాఁడిచ్చు కమ్మి.

మచ్చుకత్తి. దే. వి. కొమ్మలు నఱకెడు మోటుకత్తి.

మజ్జనము. త్స. వి. స్నానము.

మజ్జము. త్స. వి. ఎముకలయందలి నేయి.

మజ్జిగ. దే. వి. చల్ల.

మజె, మజా.
మజ్జె, మజ్జా.
మజ్జరె, మజ్జరే.
మజ్జారె, మజ్జారే.
దే. అవ్య. ప్రశంసను దెలుపును.

మటుమటు. దే. వి. చూ. మలమల.

మటుమటులాడు. దే. క్రి. మండు.

మటుమాయ.
మటుమాయము.
దే. విణ. మిక్కిలి మాయము.

మటుమాయలాఁడు. దే. విణ. మిక్కిలి మాయగలవాఁడు.

మట్ట. దే. వి. ౧. తాటిచెట్టు లోనగువానికొమ్మ. ౨. ఆవులు లోనగువానితోఁక.

మట్టగించు. వై. క్రి. తగ్గించు.

మట్టమధ్యాహ్నము. త్స. వి. పట్టపగలు.

మట్టము. దే. వి. ౧. కొలఁది. విణ. ౨. తక్కువ. ౩. పొట్టి.

మట్టసము. దే. విణ. ౧. కుఱుచైనది. ౨. పరిమితము.

మట్లాడు. దే. క్రి. ౧. నడచు. ౨. వ్యాపించు.

మట్టి. దే. వి. మన్ను.

మట్టితైలము. వై. వి. మట్టివలనఁ దీసెడి తైలము.
మట్టు. దే. క్రి. త్రొక్కు. వి. ౧. త్రొక్కుడు. ౨. కుదురు. వై. వి. ౧. మితి. ౨. పర్యంతము. విణ. ౧. తక్కువ. ౨. హితము.
మట్టుకొను. దే. క్రి. కుదురుకొను.
మట్టుచేయు. దే. క్రి. తగ్గించు.
మట్టుపడు. దే. క్రి. ౧. కుదురుపడు. ౨. అడఁగు.
మట్టుపెట్టు. దే. క్రి. చంపు.
మట్టుమిగులు. } దే. క్రి. అతిక్రమించు.
మట్టుమీఱు. }
మట్టె. దే.వి ౧. మగవాని కాలి రెండవ వ్రేలిమించు. బ. ౨. ఆఁడుదానికాలి రెండవవ్రేలు మెట్టెలు. విణ. 3. బట్టి చాఱలు కలది. (మట్టెయావు.)
మఠము. త్స. వి. సన్న్యాసులు లోనగువా రుండుచోటు.
మడ. దే. వి. ప్రవాహమార్గము.
మడఁక. దే. వి. ౧. అరక. ౨. మడుపు.
మడఁగు. దే. క్రి. ౧. మఱలు. ౨. వంగు.
మడఁతి. } దే. వి. ఆఁడుది.
మడఁతుక. }
మడత. దే. వి. ౧. (కడుపుమీఁది) మడుపు. ౨. (వస్త్రపు) మడుపు. 3. భక్ష్యవిశేషము.
మడత్రొక్కు. దే. క్రి. తాటాకులు చాలుగా పేర్చిఱచి అడుగి అణఁగఁ ద్రొక్కు.
మడమ. దే. వి. గుదికాలు.
మడవ. దే. వి. మళ్ళకు పాదులకు నీళ్ళు పాఱెడు కాలువముఖము.
మడి. దే. వి. ౧. మడుఁగు వస్త్రము. ౨.వరిపొలము.విణ. 3.పరిశుద్ధమైన.
మడికాసు. దే. వి. వెండి.
మడిమంచె. } దే. విణ. బలహీనము.
మడిమంచెము. }
మడియఁడు. దే. విణ. మూఢుఁడు.
మడియు. దే. క్రి. చచ్చు.
మడిసంచి. దే. వి. మడుఁగు వస్త్రము లుంచుకొనెడి సంచి.
మడుఁగు. దే. క్రి. ౧. అడఁగు ౨. వంగు. వి. ౧. గుణము. ౨. కొలను. 3. పరిశుద్ధి. ౪. ఎనిమిది వీసెలు కొలఁది. విణ. ౫. పరిశుద్ధము.
మడుఁచు. దే. క్రి. మడఁగఁజేయు.
మడుపు. దే. వి. ౧. మడత. ౨. మడుఁగు వస్త్రము.
మడువు. దే. వి. చూ. మడుఁగు.
మడ్డి. దే. విణ. ౧. మూఢుఁడు. వి. ౨. నూనెలోనగు వానియడుగున నిలిచెడు ముఱికి.
మడ్డు. దే. వి. ఇనుపగుండు.
మడ్డుకత్తి. దే. వి. మచ్చుకత్తి.
మడ్డువు. త్స. వి. తుడుము.

మణి. త్స. వి. పచ్చరాయి మొ.
మణికము. త్స. వి. కాఁగు.
మణిగము. దే. వి. అధికారము. రూ. మణివము.
మణిగాసనము. దే.వి.సన్నసున్న పుప్పాత
మణితము. త్స. వి. ౧. కోకిలధ్వని. ౨. రతికాలమునందలి గళరవము.
మణిప్రవాళము. త్స. వి. రెండు భాషలు కలిసిన కవిత్వము.
మణిబంధము. త్స. వి. చేతిమణికట్టు.
మణివకాఁడు. దే. విణ. అధికారి.
మణివము. దే. వి. అధికారము.
మణిసిల. వై. వి. కొండమీఁది యొక దినుసు ఎఱ్ఱమన్ను.
మణుఁగు. } దే. వి. చూ. మడుఁగు.
మణుఁపు. }
మతంగజము. త్స. వి. ఏనుఁగు.
మతకము. దే. వి. మాయ.
మతకరి. దే. వి. మాయావి.
మతము. త్స. వి. ౧. శాస్త్రము. ౨. అభిప్రాయము. 3. సమ్మతి. విణ. ౧. పూజింపఁబడినది. ౨. సమ్మతము. 3. తెలియఁబడినది. (మతములు మూఁడు:—౧. అద్వైతము. ౨. వైష్ణవము. 3. మాధ్వము. షణ్మతములు:—౧. వైష్ణవము. ౨. శైవము. 3. శాక్తము. ౪. గాణపతము. ౫. సౌరము. ౬. కాపాలికము.)
మతాబు. త్స. వి. చూ. మత్తాబు.
మతి. త్స. వి. ౧. తలఁపు. ౨. శాస్త్రచింతనాదులచేఁ గలుగు నర్థనిర్ణయజ్ఞానము. 3. ఇచ్ఛ.
మత్కుణము. త్స. వి. నల్లి.
మత్తకాశిని. త్స. వి. మందముచేఁ బ్రకాశించు ఆఁడుది.
మత్తము. త్స. వి. విణ. ౧. మదించినది. ౨. వి. మదించిన యేనుఁగు.
మత్తాబు. దే. వి. పగలువత్తి. రూ. మతాబు.
మత్తి. దే. వి. కామము.
మత్తికాఁడు. దే. విణ. కాముకుఁడు.
మత్తిల్లు. వై. క్రి. మదించు. రూ. మత్తిలు.
మత్తు. దే. వి. ౧. మంపు. ౨. మదము.
మత్తుఁడు. త్స. విణ. మదించినవాఁడు.
మత్సరము. త్స. వి. ౧. క్రోధము. ౨. ఈర్ష్య. విణ. ౧. క్రోధము గలది. ౨. ఈర్ష్యకలది.
మత్స్యము. త్స. వి. ౧. చేఁప. ౨. ఒకానొక దేశము.
మథనము. త్స. వి. త్రిచ్చుట.
మథించు. త్స. క్రి. త్రిచ్చు.
మథితము. త్స. విణ. త్రిచ్చఁబడినది.
మదనుఁడు. త్స. వి. మన్మథుఁడు. వ్యు. మదింపఁ జేయువాఁడు.
మదమడచు. దే. క్రి. చంపు.

మదము. త్స. వి. ౧. క్రొవ్వు. ౨. గర్వము. ౩. సంతోషము.

మదహస్తి. దే. వి. మదపుటేనుఁగు.

మదావళము. త్స. వి. ఏనుఁగు.

మది. వై. వి. ౧. మనస్సు. ౨. బుద్ధి.

మదించు. వై. క్రి. ౧. అంచనవేయు. ౨. తలఁచు. ౩. క్రొవ్వెక్కు.

మదింపు. వై. వి. అంచన.

మదిమది. దే. వి. నెమ్మది.

మదిర. త్స. వి. మద్యము.

మదీయము. త్స. విణ. నాది.

మదురు. దే. క్రి. ౧. కమియు. వి. ౨. గోడమీఁదికప్పు.

మదురుగోడ. దే. వి. మదురు పెట్టిన గోడ.

మదోత్కటము. త్స. వి. మదపుటేనుఁగు.

మద్ది. దే. వి. మద్దిచెట్టు.

మద్దెల. వై. వి. మృదంగము.

మద్యము. త్స. వి. కల్లు.

మధుకరము. త్స. వి. ౧. తుమ్మెద. ౨. భిక్షాన్నము.

మధుపర్కము. త్స. వి. ౧. పెండ్లిలో పెండ్లి కొడుకునకును, పెండ్లి కుమార్తెకును, చదువపెట్టెడి క్రొత్త వస్త్రములు. ౨. పెరుగుతోఁ గలిసిన తేనె.

మధుమేహము. త్స. వి. బహుమూత్రవ్యాధి.

మధుర. త్స. వి. ఒకానొక పట్టణము.

మధురము. త్స. విణ. ౧. ఇంపైనది. ౨. తియ్యనిది.

మధురిమ. } త్స. వి. తియ్యన.
మధురిమము. }

మధువు. త్స. వి. ౧. తేనె. ౨. పాలు. ౩. కల్లు. ౪. పూఁదేనె. ౫. చైత్రమాసము.

మధువ్రతము. త్స. వి. తుమ్మెద.

మధుసూదనుఁడు. త్స. వి. విష్ణువు.

మధూకము. త్స. వి. ఇప్ప.

మధూళి. త్స. వి. పుప్పొడి

మధూళిక. త్స. వి. పుప్పొడి.

మధ్య. త్స. వి. స్వీయాంతర్భేద విశిష్ట నాయికా విశేషము.

మధ్యమ. త్స. వి. ౧. నడిమివ్రేలు. ౨. దుద్దు.

మధ్యమము. త్స. వి. ౧. నడుము. విణ. ౨. నడిమిది.

మధ్యము. త్స. వి. ౧. అవకాశము. ౨. నడుము. విణ. ౧. నడిమిది. ౨. నడితరముది.

మధ్యరాత్రము. త్స. వి. నడురేయి.

మధ్యలోకము. త్స. వి. భూలోకము.

మధ్యస్థుఁడు. త్స. విణ. నడుమనుండి పక్షపాతములేక యిరుతెగలవారికి సరిగా న్యాయము చెప్పువాఁడు.

మధ్యాహ్నము. త్స. వి. పట్టపగలు.

మననము. త్స. వి. చింతన.

మనము. దే. స. ౧. నీవును నేనును. త్స. వి. ౨. మనస్సు. ౩. బుద్ధి.
మనవి. దే. వి. విజ్ఞాపనము.
మనసిజుఁడు. త్స. వి. మన్మథుఁడు.
మనసు. త్స. వి. ౧. హృదయము. విశ. ౨. ఇష్టము.
మనస్కరించు. త్స. క్రి. ఇష్టముంచు.
మనస్వి. త్స. విశ. మంచిమనస్సు కలవాఁడు.
మనికట్టు. దే. వి. మణిబంధము.
మనికి. దే. వి. ౧. జీవనము. ౨. వాసస్థానము.
మనికితపడు. దే. క్రి. దుఃఖపడు.
మనికితము. దే. వి. దుఃఖము.
మనీష. త్స. వి. బుద్ధి.
మనీషి. త్స. వి. పండితుఁడు. వ్యు. బుద్ధికలవాఁడు.
మను. దే. క్రి. ౧. వర్తించు. ౨. జీవించు. వి. ౧. మట్టి. ౨. నేల.
మనుగడ. దే. వి. ౧. జీవనోపాయము. ౨. జీవనము.
మనుగుడుపు. దే. వి. అల్లెము. లంకనములలో మనుగుడుపు — దుఃఖముగూడఁ గొంత సంతోష మనుభవించుట.
మనుచు. దే. ప్రే. మనఁజేయు. రూ. మనుపు.
మనుజుఁడు. త్స. వి. మనుష్యుఁడు. వ్యు. మనువువలనఁ బుట్టినవాఁడు.
మనుజేంద్రుఁడు. త్స. వి. రాజు.
మనుపరి. దే. విశ. ౧. కాపరి. ౨. రక్షకుఁడు.
మనుపీనుఁగు. దే. వి. జీవచ్ఛవము.
మనుమఁడు. దే. వి. ౧. కొడుకుకొడుకు. ౨. కుమార్తె కొడుకు.
మనుమరాలు. దే. వి. ౧. కొడుకు కూఁతురు. ౨. కుమార్తె కూఁతురు.
మనువర్తి. దే. వి. జీవనమునకై యిచ్చు సొమ్ము.
మనువు. దే. వి. ౧. మగఁడు. ౨. మగని వరించుట. ౩. వర్తనము. ౪. జీవనము. ౫. త్స. వి. వైవస్వతాది మనువు.
మనుష్యధర్ముఁడు. త్స. వి. కుబేరుఁడు.
మనుష్యయజ్ఞము. త్స. వి. అతిథిపూజ.
మనుష్యుఁడు. త్స. వి. మనుజుఁడు. వ్యు. మనువు కొడుకు.
మనోజుఁడు. త్స. వి. మన్మథుఁడు.
మనోజ్ఞము. త్స. వి. అందము.
మనోభవుఁడు. త్స. వి. మన్మథుఁడు.
మనోరథము. త్స. వి. ౧. ఇచ్ఛ ౨. కోరిక.
మనోరమము. త్స. వి. మనోజ్ఞము.
మనోహారము. త్స. వి. ౧. బంగరు. ౨. భక్ష్యవిశేషము. విశ. ౩. ఇంపైనది.
మన్న. దే. వి. అడ్డగింపు.
మన్నన. దే. వి. సన్మానము.
మన్ని. దే. వి. జీవనము.

మన్నించు. వై. క్రి. ౧. గౌరవించు. ౨. సన్మానించు. ౩. క్షమించు.
మన్నింపు. వై. వి. మన్నించుట.
మన్నిక. వై. వి. మన్నన.
మన్నియ. }
మన్నియఁడు. } వై. వి. ప్రభువు.
మన్నీఁడు. }
మన్ను. వై. వి. ౧. మట్టి. ౨. నేల. రూ. మను.
మన్నెకాఁడు. దే. వి. పృథువు.
మన్నెము. వై. వి. సన్మానించి యిచ్చిన కొంతభాగము.
మన్నెముల్లు. దే. వి. మేఁకలకాలి గిట్టల లోని ముల్లు తీసెడి పెద్దసూది.
మన్మథ. త్స. వి. ఒక సంవత్సరము.
మన్మథుఁడు. త్స. వి. మరుఁడు.
మన్మనము. త్స. వి. ఆలుమగల యాలోచనము.
మన్వంతరము. త్స. వి. ౧. డెబ్బది యొక్క దివ్య యుగములు. ౨. మను కాలమధ్య చరిత్రము.
మన్యువు. త్స. వి. ౧. క్రోధము. ౨. దైన్యము. ౩. శోకము. ౪. యజ్ఞము.
మప్పు. దే. క్రి. చూ. మాపు.
మబ్బు. దే. వి. ౧. చీఁకటి. ౨. మేఘము. ౩. అజ్ఞానము.
మబ్బుమేపరి. దే. వి. ౧ వాయువు ౨ ప్రభువు
మబ్బురవుతు. దే. వి. ౧ ఇంద్రుఁడు. వాథ. మేఘవాహనుఁడు.
మమత. త్స. వి. అభిమానము.
మమ్మాయి. దే. వి. లేహ్యవిశేషము.
మయిమఱపు. దే. వి. దేహము మఱచుట. రూ. మెయిమఱపు.
మయుఁడు. త్స. వి. అసురశిల్పి.
మయూఖము. త్స. వి. ౧. కిరణము. ౨. కాంతి.
మయూరము. త్స. వి. నెమిలి.
మర. దే. వి. ౧. తిరుగుడు చీల. ౨. కీలు.
మరందము. త్స. వి. పూఁదేనె.
మరకతము. త్స. వి. పచ్చతాయి.
మరకాఁడు. దే. వి. నావికుఁడు.
మరగాలు. దే. వి. కృత్రిమపాదము.
మరగు. దే. వి. ౧. ఆశించు. ౨. పరిచితమగు.
మరచెట్టు. దే. వి. తిరుగుడు.
మరణము. త్స. వి. చావు.
మరణించు. త్స. క్రి. చచ్చు.
మరతికము. త్స. వి. మరకతము.
మరపు. దే. ప్రే. మరగఁజేయు.
మరమేకు. దే. వి. తిరుగుడు చీల.
మరలఁబడు. దే. క్రి. ౧ మరలు. వి. ౨ మరలఁబాటు.
మరలు. దే. క్రి. ౧. తిరుగు. ౨. వెనుకకు తిరుగు.
మరాటి. వై. వి. మహారాష్ట్ర దేశస్థుఁడు.
మరాళము. త్స. వి. హంస.

మర. దే వి. ఏ. ౧ తడవ. అవ్య. ౨ మఱియు.

మరంచు. త్స. వి. మరణించు.

మరిచము. త్స. వి. మిరియము.

మరిడి. దే. వి. ఒకదేవత.

మరిడీవ్యాధి. దే. వి. ౧. వాంతిభేది ౨. రోగవిశేషము.

మరియాద. త్స. వి. మేర. రూ. మర్యాద.

మరీచము. త్స. వి. మిరియము.

మరీచిక. త్స. వి. ఎండమావులు.

మరు. దే. వి. మారుశబ్దమునకు వృత్తియందాళము. (వేమన)

మరుఁడు. వై. వి. మన్మథుఁడు.

మరుత్తు. త్స. వి. వాయువు.

మరునిల్లు. దే. వి. యోని.

మరుపని. దే. వి. గ్రామ్యధర్మము.

మరుపనివాఁడు. దే. వి. విటుఁడు.

మరులు. దే. వి. ౧. పిశాచము. ౨. మోహము.

మరులుకొను. దే. క్రి. మోహించు.

మరులుకాఁడు. దే. వి. భేతాళుఁడు.

మరువకము. త్స. వి. ౧ సుగంధపులత. ౨ వట్టివేరు.

మరువము. వై. వి. ౧. వాసనగలయొకానొక చిన్నచెట్టు. ౨. వట్టివేరు.

మరువు. త్స. వి. ౧. నిర్జలప్రదేశము. ౨. పర్వతము.

మర్కటము. త్స. వి. కోఁతి.

మర్కాటి. దే. వి. పడవ నడిపించువాఁడు.

మర్త్యుఁడు. త్స. వి. మనుష్యుఁడు. వ్యు. మృతిపొందువాఁడు.

మర్దనము. త్స. వి. ౧. నూఱుట. ౨. పిసుకుట.

మర్దలము. త్స. వి. మద్దెల.

మర్దించు. త్స. క్రి. ౧. నూఱు. ౨. కొట్టు.

మర్నాఁడు. దే. వి. మఱునాఁడు.

మర్మము. త్స. వి. ౧. కిటుకు. ౨. జీవస్థానము.

మర్మరము. త్స. వి. పెళపెళమనుధ్వని.

మర్యాద. త్స. వి. ౧. తీరము. ౨. సమ్మానము. ౩. పొలిమేర. ౪. కట్టుపాటు.

మఱఁదలు. దే. వి. ౧. భార్యచెల్లెలు. ౨. తమ్ముని భార్య.

మఱఁది. దే. వి. ౧. చెల్లెలి మగఁడు. ౨. భార్య తోఁబుట్టువు. ౩. మేనమామకొడుకు. ౪. మగని తమ్ముఁడు.

మఱక. దే. వి. ౧. కఱ. ౨. మేఁకపిల్ల.

మఱకువ. దే. వి. అజ్ఞానము.

మఱచు. దే. క్రి. మఱపుఁజెందు.

మఱపు. దే. వి. ౧. అజ్ఞానము. ౨. విస్మృతి.

మఱలు. దే. క్రి. మళ్ళు.

మఱి. దే. అవ్య. ౧. వెండియు. ౨. ఇంకను.

మఱిగ. దే. వి. బలపపు రాతితోఁ జేయఁబడిన పాత్రము.

మఱిమఱి. దే. అవ్య. ౧. మిక్కిలి. ౨. మఱియు.

మఱుఁగు. దే. క్రి. ౧ సంతాపించు. ౨. చాటగు. వి. 3 చాటు. రూ. మఱువు.

మఱుఁగుదొడ్డి. దే. వి. మఱుఁగు పెరడు.

మఱుఁగుపడు. దే. క్రి. మఱుఁగు.

మఱుఁగుపెరడు. దే. వి. పాయిఖానా.

మఱుతవ. దే. వి. సంతాపము.

మఱుగుజ్జు. దే. విశ. ౧ గూనివాఁడు. ౨. గూనిది.

మఱునాఁడు. దే. వి. మఱుసటిదినము.

మఱుమాట. దే. వి. బదులుపలుకు.

మఱుమోఁత. దే. వి. ప్రతిధ్వని.

మఱువు. దే. వి. ౧. కవచము. ౨. చోటు.

మఱుసంజె. దే. వి. సాయంసంధ్య.

మఱ్ఱి. దే. వి. వటవృక్షము.

మల. దే. వి. కొండ.

మలఁక. దే. వి. ౧. మెలిక. ౨. చిక్కు. 3. చుట్టు. విశ. ౪ వంకర.

మలఁగు. దే. క్రి. ౧. మఱలు. ౨. తిరుగు.

మలఁపుకొను. దే. క్రి. గర్జించు.

మలక. దే. వి. ౧. మూకుఁడు. ౨. తురక.

మలప. దే. వి. దూడ చచ్చి పాలిచ్చు గోవు, బర్రె మున్నగు.

మలపు. దే. క్రి. త్రిప్పు.

మలమల. దే. వి. మాడుటలో నయ్యెడి ధ్వన్యనుకరణము.

మలమాసము. త్స. వి. అధికమాసము.

మలము. త్స. వి. ౧. దోషము. ౨. మూత్రము, పంటిపాచి మొదలగు.

మలయజము. త్స. వి. ౧. చందనము. ౨. చందన వృక్షము. వ్యు. మలయ పర్వతమునందు పుట్టినది.

మలయము. త్స. వి. ౧. ఒకదేశము. ౨. ఒకకొండ. 3. ఆరామము.

మలయిక. దే. వి. విహారము.

మలయు. దే. క్రి. ౧. తపించు. ౨. పెనఁగు. 3. తిరుగు.

మలాము. దే. వి. చూ. మొలాము.

మలారము. దే. వి. మట్టిగాజులగుది.

మలితము. దే. వి. సందేహము.

మలినము. త్స. విశ. ౧. దూషితమైనది. ౨. మాసినది. 3. నల్లనిది.

మలీమసము. త్స. విశ. మలినము.

మలుకారు. దే. వి. ౧. ముక్కారు పంటలో రెండవపంట. ౨. శీతకాలము.

మలుగు. దే. క్రి. ౧. నశించు. ౨. ఆఱు. వి. 3 తుంటె.

మలుచు. దే. క్రి. ౧. తఱిమెనఁబెట్టు. ౨. బియ్యము లోనగు నవి తాళ్లు పోవచెరుగు. రూ. మల్చు.

మల్లుసంజె. దే. వి. సాయంసంధ్య.
మల్లకము. త్స. వి. దీపపుప్రమిదె.
మల్లగుల్లము. దే. వి. వాదులాట.
మల్లచఱచు. దే. క్రి. భుజాస్ఫాలనము చేయు.
మల్లచఱపు. దే. వి. భుజాస్ఫాలన మొనర్చుట.
మల్లట. దే. వి. చూ. మల్లాట.
మల్లడి. దే. వి. ౧. వెనఁకువ. ౨. పరితాపము.
మల్లడిఁగొను. దే. క్రి. ౧. పరితపించు. ౨. వెనఁగొను.
మల్లరము. దే. విణ. మదించినది.
మల్లసాల. దే. వి. భోజనశాల. రూ. మల్లెసాల.
మల్లాట. దే. వి. మల్లాడుట.
మల్లాడు. దే. క్రి. పెనఁగాడు.
మల్లామడి. దే. విణ. ౧. పీడితము. ౨. పీడితుఁడు.
మల్లారము. దే. వి. చూ. మలారము.
మల్లిక. త్స. వి. మల్లెతీఁగ.
మల్లికాక్షము. త్స వి. మాసినముక్కు కాళ్లును గల తెల్లహంస.
మల్లియ. వై. వి. మాసినముక్కుగల తెల్ల హంస. రూ. మల్లె.
మల్లు. వై వి. ౧. జెట్టిపెనఁకువ ౨. కోఁతి.
మల్లుఁడు. త్స. వి. ౧. జెట్టి. ౨. విణ. శ్రేష్ఠుఁడు.
మల్లుకట్టు. దే. క్రి. అడ్డగించు.
మల్లుపెనఁగు. దే. క్రి. జెట్టిపెనకువగాఁ బెనఁగు.
మల్లె. దే. వి. మల్లియ.
మవ్వము. దే. వి. ౧. కోమలత. విణ. ౨. కోమలము.
మశకము. త్స. వి. దోమ.
మషి. త్స. వి. మసి.
మషిమణి. త్స. వి. సిరాబుడ్డి.
మస. దే. వి. విలాసము.
మసఁగు. దే. క్రి. రేఁగు.
మసక. } వై. వి. ౧. మునిచీఁకటి.
మసకవ. } ౨. ఇందుక నలుపు.
మసకము. దే. వి. ౧. సంభోగము. ౨. సంభోగేచ్ఛ.
మసగొను. దే. క్రి. సంభోగేచ్ఛగొను.
మసటు. } దే. వి. ముఱికి. రూ. మష్టు.
మసడు. }
మసనము. దే. వి. శ్మశానము.
మసరు. దే. వి. ఆవేశము.
మసలిక. దే. వి. ౧. మాంద్యము. విణ. ౨. మందము.
మసలు. } దే. క్రి. ౧. వెనుకకు తిరుగు. ౨ విహరించు. 3. (నీళ్ళు) మలమల కాఁగు. ౪. తడయు.
మసలుకొను. }
మసారము. త్స. వి. ఇంద్రనీలము.

మసి. వై. వి. ౧. బొగ్గు. ౨. మయిల. 3. నలుపు.
మసిబుడ్డి. దే. వి. మసిపోసెడు బుడ్డి.
మసీదు. దే. వి. తురకలగుడి.
మసృణము. త్స. విణ. ౧. చక్కనిది. ౨. చిక్కనిది. 3. నున్ననిది.
మస్కరి. త్స. వి. సన్న్యాసి.
మస్టు. దే. వి. చూ. మసటు.
మస్తము. త్స. వి. తల. రూ. మస్తకము.
మస్తరించు. దే. వి. లోబఱచు.
మస్తిష్కము. త్స. వి. తలనుండు మాంసము.
మస్తీ. దే వి. మదించిన ఏనుఁగు.
మస్తు. దే. వి. సమృద్ధి.
మహంతు. దే. వి. దేవస్థానములకు ధర్మకర్తృత్వము జరిగించు సన్న్యాసి.
మహతి. త్స. వి. ౧. తెనుఁగు వ్యాకరణమున తిర్యగితర స్త్రీవాచక శబ్దములకు సంజ్ఞ. విణ. ౨. గొప్పది.
మహత్తు. త్స. వి ౧. తెనుఁగు వ్యాకరణమున పురుషవాచక శబ్దములకు సంజ్ఞ. ౨. దొరతనము. విణ. 3. గొప్పది.
మహనీయుఁడు త్స. విణ. గొప్పవాఁడు.
మహము. త్స. వి. ఉత్సవము.
మహస్సు. త్స. వి. తేజము.
మహాకాలుఁడు. త్స. వి. శివుఁడు.
మహాదేవుఁడు. త్స. వి. శివుఁడు. వ్యు. శ్రేష్ఠుఁడైన దేవుఁడు.
మహానటుఁడు. త్స. వి. శివుఁడు.
మహానసము. త్స. వి. వంటయిల్లు.
మహాప్రళయము త్స. వి. లోకనాశము.
మహారణ్యము. త్స. వి. పెద్దయడవి.
మహారథుఁడు. త్స. వి. ౧. ౧౧౦౦౦ మంది విలుకాండ్రతో పోరెడి యోధుఁడు. విణ. ౨. గొప్పరథము కలవాఁడు.
మహారాత్రము. త్స. వి. అర్ధరాత్రము.
మహాసేనుఁడు. త్స. వి. కుమారస్వామి.
మహి. త్స. వి. ౧. భూమి. ౨. ఆవు.
మహితము. త్స. విణ. గొప్పది.
మహిమ. } త్స. వి. ౧. గొప్పతనము. ౨. ఒక యైశ్వర్యము.
మహిమము. }
మహిషము. త్స. వి. దున్నపోతు.
మహిషి. త్స. వి. ౧. ఎనుము. ౨. పట్టపుదేవి.
మహిళ. త్స. వి. ఆఁడుది.
మహీధ్రము. త్స. వి. కొండ.
మహీరుహము. త్స. వి. వృక్షము.
మహేంద్రుఁడు. త్స. వి. ఇంద్రుఁడు.
మహేశ్వరుఁడు. త్స. వి. ౧. శివుఁడు. ౨. గొప్పప్రభువు.
మహోక్షము. త్స. వి. ఆంబోతు.
మహోత్పలము. త్స. వి. ౧. పద్మము. ౨. కమలము.

మహోదయము. త్స. వి. ౧. ఆధిపత్యము. ౨. అభివృద్ధి. ౩. మోక్షము.

మళయాళము. త్స. వి. మలయ పర్వతము చుట్టు దేశము.

మళిగ. వై. వి. ౧ దుకాణము. ౨. అంగడి.

మళ్ళు. దే. క్రి. మరలు.

## మా

మాంగల్యము. త్స. వి. తాళిబొట్టు.

మాంజిష్ఠము. త్స. వి. ఎఱుపుమించిన పసుపువన్నెగల చీర.

మాంత్రికుఁడు. త్స. వి. మంత్రవిద్య తెలిసినవాఁడు.

మాంద్యము. త్స. వి. ౧. జాడ్యము. ౨. ఆలస్యము.

మాంసము. త్స. వి. నంజుడు.

మాంసలుఁడు. త్స. విణ. బలిసినవాఁడు.

మాఁకు. దే. వి. చెట్టు.

మాఁగాయ. దే. వి. ౧. మామిడికాయ. ౨. ఒకదినుసు ఊరగాయ.

మాఁగు. దే. క్రి. ౧. కమియఁబండు. వి. ౨. మాలిన్యము.

మాఁగుడు. దే. వి. నలఁపు.

మాఁగుడువాఱు. మాఁగువడు. మాఁగువాఱు. } దే. వి. ౧. మాయు. ౨. మలినమగు.

మాఁటిచంగ. దే. వి. కాముకి.

మాఁటు. దే. క్రి. ౧. తగులముకొను. వి. ౨. మాఱు. ౩. తగులము.

మాఁటుపడు. దే. క్రి. తగులుపడు.

మాఁటుసాఁగు. దే. క్రి. జెంజాటుముడిఁగి నిశ్శబ్దమగు.

మాఁడు. దే. క్రి. ౧. దగ్ధమగు. వి. ౨. అడుగంటిమాఁడిన యన్నము లోనగునది. ౩. ఇంటియొక్క భాగము కప్పు.

మాఁడించు. దే. ప్రే. మాఁడఁజేయు. రూ. మాడ్చు.

మాఁడెము. దే. వి. మండలాధిపతుల భూమండలము.

మాకందము. త్స. వి. మామిడి.

మాకరి. దే. వి. మాలకరి.

మాకొను. దే. క్రి. కఱచు.

మాగధుఁడు. త్స. వి. రాజవంశ వీర్యాదులు పొగడి జీవించువాఁడు. రూ. మగధుఁడు.

మాగాణి. దే. వి. వరిపంట పెట్టెడి నేల.

మాగాని. దే. వి. దేశము.

మాగిలి. దే. వి. మాగాణి.

మాఘము. త్స. వి. ఒకమాసము. వ్యు. దీనియందు పాపము లేదు గనుక మాఘము.

మాచకమ్మ. దే. వి. అఱొమ్ములేనిదై మీసములు కలిగిన స్త్రీ.

మాట. దే. వి. ౧. పదము. ౨. నింద. ౩. వృత్తాంతము.

మాటకాఁడు. దే. విణ. సభయందు భయములేక మాటలాడువాఁడు.

మాటకారి. దే. వి. యుక్తియుక్తముగాఁ బలుకువాఁడు.
మాటలమారి. దే. విశ. మిక్కిలి మాటలాడువాఁడు.
మాటాడు. దే. క్రి. పలుకు.
మాటికి. దే. అవ్య. అడుగడుగునకు.
మాటు. దే. వి. ౧. మఱుఁగు. ౨. తడవ. క్రి. ౩. మఱుఁగుపఱచు.
మాటుపడు. దే. క్రి. మఱుఁగుపడు.
మాడ. దే. వి. రెండురూపాయలు.
మాడపట్టు. దే. వి. బ్రహ్మరంధ్రము.
మాడికి. దే. అవ్య. విధము. రూ. మాడ్కి.
మాడుగు.)
మాడువు.) వై. వి. మిద్దె.
మాణవకుఁడు. త్స. వి. బాలుఁడు.
మాణిక్యము. త్స. వి. కెంపు.
మాత. త్స. వి. ౧. తల్లి. ౨ లక్ష్మి. ౩. పార్వతి (మాతలైదుగురు: ౧. రాజుభార్య. ౨. అన్నభార్య. ౩. చదువు చెప్పినవాని భార్య. ౪. భార్యయొక్కతల్లి. ౫. తనతల్లి.)
మాతంగము. త్స. వి. ఏనుఁగు.
మాతంగుఁడు. త్స. వి. మాదిగవాఁడు.
మాతరపితలు. త్స. వి. తల్లిదండ్రులు.
మాతరిశ్వుఁడు. త్స. వి. గాలి.
మాతలి. త్స. వి. ఇంద్రుని సారథి.
మాతాపితలు. త్స. వి. బ. తల్లిదండ్రులు.
మాతాబి. దే. వి. జలబారు. తల్లిదండ్రులు.
మాతామహుఁడు. త్స. వి. తల్లితండ్రి.
మాతుల. త్స. వి. మేనమామ పెండ్లాము.
మాతులాని. త్స. వి. మేనమామభార్య.
మాతులి. ,,
మాతులుఁడు. త్స. వి. మేనమామ.
మాతులేయుఁడు. త్స. వి. మేనమామ కొడుకు.
మాతృక. త్స. వి. ౧. తల్లి. ౨. దాది.
మాతృష్వసేయి. త్స. వి. తల్లిసోదరి కూఁతురు.
మాతృష్వసేయుఁడు. త్స. వి. తల్లితోఁబుట్టినదాని కొడుకు.
మాతృష్వస్రీయ. త్స. వి. తల్లితోఁబుట్టినదాని కూఁతురు.
మాతృష్వస్రీయుఁడు. త్స. వి. తల్లితోఁబుట్టినదానికొడుకు.
మాత్ర. దే. వి. ౧. చిన్నమందుండ. ౨. అసిమిసంచి. త్స. వి. ౧. కొలఁది. ౨. తృటి.
మాత్సర్యము. త్స. వి. మచ్చరము.
మాదళము. దే. వి. కపిలవర్ణముగలచీర.
మాదిగ. వై. వి. మాదిగవాఁడు.
మాదిఫలము. దే. వి. మాతులుంగము.
మాదిరి.)
మాద్రి.) దే. వి. సామ్యము.
మాదృశుఁడు. త్స. విశ. మావంటివాఁడు.
మాధవి. త్స. వి. పువ్వులగురివెంద.
మాధవుఁడు. త్స. వి. విష్ణువు.

మాధుకరము. త్స. వి. మధుకరవృత్తి.
మాధురి. త్స. వి. ౧. తీపు. ౨. కల్లు.
మాధుర్యము. త్స. వి. ౧. తీపు. ౨. కావ్యగుణములలో ఒకటి.
మాధ్యస్థ్యము. త్స. వి. మధ్యస్థుఁడు చేయుతీర్పు.
మాధ్వి. త్స. వి. మద్యము.
మాధ్వీకము. త్స. వి. ఇప్పకల్లు.
మానన. త్స. వి. మన్నన.
మాననీయము. త్స. వి. మన్నింపఁదగినది.
మానము. త్స. వి. ౧. త్రాసు. మూరతూము మున్నగునవి. ౨. కొలఁది. 3. గర్వము. ౪. చిత్తౌన్నత్యము.
మానవతి. త్స. వి. మానముకల యాఁడుది.
మానవుఁడు. త్స. వి. మనుష్యుఁడు.
మానసము. త్స. వి. ౧. ఒక సరస్సు. ౨. మనస్సు.
మానసించు. త్స. క్రి. తలఁచు.
మానసౌకము. త్స. వి. హంస.
మాని. త్స. విణ. మానము కల మనుష్యుఁడు.
మానిక. దే. వి. ఒక కొలపాత్రి.
మానికగారి. దే. వి. బోగముది.
మానికము. వై. వి ౧. రత్నము. ౨. కెంపు.
మానితము. త్స. వి. మన్నింపఁబడినది.
మానిని. త్స.వి. మానముకల యాఁడుది.
మానిసి. వై. వి. ౧. మనుష్యుఁడు. ౨. మనుష్యస్త్రీ.
మాను. దే. క్రి. ౧. విడుచు. వి. ౨. మ్రాను. 3. మనోజ్ఞత. విణ. ౪. మనోజ్ఞము.
మానుచు. / మానుపు. } దే. ప్రే. మానఁజేయు.
మానోజ్ఞకము. త్స. వి. మనోజ్ఞత.
మాన్యము. త్స. వి. పన్ను కట్టక అనుభవించునట్లు సమ్మానించి ఇచ్చిన భూమి.
మాపు. దే. క్రి. ౧. మాయఁజేయు. వి. ౨. రాత్రి. 3. సాయంకాలము. ౪. మయిల.
మాపుడు. దే. వి. మయిల.
మామ. దే. వి. ౧. పెండ్లాము తండ్రి. ౨. మగని తండ్రి. 3. అత్తమగఁడు. ౪. తల్లియన్న. ౫. తల్లితమ్ముఁడు.
మామకీనము. త్స. విణ. నాది.
మామకుఁడు. త్స. విణ. నావాఁడు.
మామజియ్య. దే. విణ. పూజ్యుఁడగు మామగారు.
మామమామ. దే. వి. విష్ణువు.
మామా. దే. అవ్య. మానుము మానుము.
మామిడి. దే. వి. మావిచెట్టు.
మాయ. త్స. వి. ౧. అవిద్య. ౨. ఇంద్రజాలము.

మాయకాఁడు. } దే. వి. మాయావి.
మాయదారి.
మాయపోతు. దే. వి. మాయలమారి.
మాయము. దే. వి. ౧. మాయ. విశ. ౨. అదృశ్యము.
మాయలమారి. దే. విశ. మాయలాఁడు.
మాయలాడి. దే. విశ. మాయశీలురాలు.
మాయలాఁడు. దే. వి. మాయలమారి.
మాయాదేవిసుతుఁడు. త్స. వి. బుద్ధుఁడు.
మాయావి. త్స. విశ. మాయకాఁడు.
మాయి. దే. వి. ౧. కలుపు. ౨. మఱుఁగు.
మాయికుఁడు. త్స. వి. మాయావి.
మాయు. దే. క్రి. ౧. నశించు. ౨. మలినమగు.
మాయురె. దే. అవ్య. బళిరె.
మారణము. త్స. వి. చంపుట.
మారాటము. దే. వి. చూ. మాఱాటము.
మారాము. వై. వి. ౧. కీలు. ౨. మర్మము.
మారి. త్స. వి. ౧.మసూరికా రోగము. ౨. జనక్షయము.
మారు. దే. వి. ప్రతి.
మారుఁడు. త్స. వి. మన్మథుఁడు. వ్యు. విరహిజనులను చంపువాఁడు.
మారుతము. త్స. వి. గాలి.
మారుతి. త్స. వి. ౧. భీముఁడు. ౨. హనుమంతుఁడు.
మారెడు. } వై. వి. బిల్వవృక్షము.
మారేడు.
మార్కొను. దే. క్రి. చూ. మాఱుకొను.
మార్గణము. త్స. వి. ౧. వెదకుట. ౨. బాణము.
మార్గము. త్స. వి. ౧. త్రోవ. ౨. వెదకుట.
మార్గశీర్షము. త్స. వి. ఒకమాసము. వ్యు. మృగశీర్ష నక్షత్రముతోఁ గూడిన పున్నమ మార్గశీర్షి. అది దీనియందు కలదు.
మార్గితము. త్స. విశ. వెదకఁబడినది.
మార్చు. దే. క్రి. ౧. వర్జించు. ౨. నాశముఁజేయు.
మార్జనము. త్స. వి. ౧. తుడుపు. ౨. తోముట.
మార్జని. త్స. వి. చీపురుకట్టు.
మార్జాలము. త్స.వి. పిల్లి. వ్యు.మూషక గ్రహణముచేత గృహమును శుద్ధి చేయునది.
మార్జించు. త్స. క్రి. తుడుచు.
మార్తాండుఁడు. త్స. వి. సూర్యుఁడు.
మార్తుఁడు. దే. వి. శత్రువు. రూ. మాఱుతుఁడు.
మార్దంగికుఁడు. త్స. వి. మృదంగము వాయించువాఁడు.
మార్దవము. త్స. వి. మృదుత్వము.
మార్ద్వీకము. త్స. విశ. ద్రాక్షకల్లు.

మార్పడు. దే. క్రి. ౧. మాఱుపడు నను రూపాంతరము.
మాఱకము. దే. వి. చూ. మాఱుపు.
మాఱట. దే. వి. ప్రతిరూపము.
మాఱాకు. దే. వి. పారికుడుకొయ్య.
మాఱాట. దే. వి. కలహము.
మాఱాటము. రూ. మారాటము.
మాఱాడు. దే. క్రి. ౧. మాఱుపలుకు. ౨. ఎదిరించు.
మాఱు. దే. క్రి. ౧. మాఱుపడు. ౨. నశించు. 3. వేఱురూపము గు. వి. ౧. ఎదురు. ౨. తడవ. 3. రెండవ తూరి పెట్టెడియన్నము. విణ. ౧. ప్రతి. ౨. అన్యము.
మాఱుఁదల్లి. దే. వి. సవతితల్లి.
మాఱుకొను. దే. క్రి. ఎదిరించు. రూ. మార్కొను.
మాఱుచే. దే. ప్రే. మాఱఁజేయు. రూ. మాస్చు.
మాఱుతుఁడు. దే. వి. శత్రువు. రూ. మార్తుఁడు.
మాఱువల. దే వి. మాఱుట.
మాఱునీళ్ళు. దే. వి. బ. ముట్టునీళ్ళకు మఱుసటినాఁటి స్నానము.
మాఱుపడు. దే.క్రి. భేదపడు. రూ. మార్పడు
మాఱుపాటు. దే. వి. మాఱుపడుట.
మాఱుపు. దే. వి. ఒకదానినిచ్చి వేఱొకదానిని గైకొనుట. రూ. మార్పు.
మాఱుమగఁడు. దే. వి. ఉపపతి.
మాఱుమనువు. దే.వి. ఆఁడుదాని రెండవ పెండ్లి.
మాఱుమాట. దే. వి. బదులుపలుకు.
మాఱుమూల. దే. వి. ఎదురుమూల.
మాఱుమొగము. దే. వి. వెడమొగము.
మాఱుమ్రోఁత. దే. వి. ప్రతిధ్వని.
మాఱొడ్డు. దే. వి. ప్రతిఘటించు.
మాల. / మాలఁడు. దే. వి. చండాలుఁడు.
మాలకరి. వై. వి. ౧. వనపాలకుఁడు. ౨. మాలాకారుఁడు.
మాలకాకి. వై. వి. ద్రోణకాకము.
మాలతి. త్స. వి. జాజి.
మాలాకారుఁడు. త్స. వి. పూవుదండలు కట్టి విక్రయించువాఁడు.
మాలి. త్స. వి. ౧. మాలాకారుఁడు. వై. వి. తోఁటకాచువాఁడు.
మాలిక. త్స. వి. ౧. పూవులదండ. ౨. మెడఁబెట్టుకొనెడి తీఁగ.
మాలిన్యము. త్స. వి. మలినత్వము.
మాలిమి. దే. వి. ౧. వాత్సల్యము. ౨. ఓడనడపు శాస్త్రము. 3. ఓడ నడపు శాస్త్ర మెఱిఁగనవాఁడు.
మాలిమికాఁడు. దే.వి. మాలిమి శాస్త్రము మెఱిఁగినవాఁడు.
మాలు. దే. క్రి. ౧. చెడు. ౨. [illegible]ంచు.
మాలుగుఁబోతు. దే. విణ. సోమరి.
మాలూరము. త్స. వి. మారేఁడు.
మాలె. దే. వి. పుష్పమాలిక.

మాలెత. దే. విణ. మాలది.
మాల్యము. త్స. వి. పుష్పమాలిక.
మాల్యవంతము. త్స. వి. ఒకానొక పర్వతము.
మావంతుఁడు. / మావటి. / మావటీఁడు. } వై. వి. ఏనుఁగును నడపువాఁడు.
మావి. దే. ౧. మామిడిచెట్టు. ౨. మనుష్యాది గర్భస్థ పిండమునకు రక్షకముగా మీఁదఁ గ్రమ్ముకొనిన తోలుసంచి.
మావిడి. దే. వి. మామిడిచెట్టు.
మావు. దే. వి. అశ్వము.
మాషము. త్స. వి. మినుములు.
మాసటి. / మాసటీఁడు. } దే. విణ. ౧. శూరుఁడు. ౨. మల్లుఁడు.
మాసము. త్స. వి. ౧. నెల. దే. వి. రెండున్నరచిన్నమెత్తు.
మాసి. వై. వి. ౧. మైల. ౨. నిసి.
మాసిక. దే. వి. అదుకు.
మాసికము. త్స. వి. అబ్దికము వఱకు నెలనెలకు చేసెడి శ్రాద్ధము.
మాహాత్మ్యము. త్స. వి. గొప్పతనము.
మాళిగ. వై. వి. మాడుగు.

మి

మించు. దే. క్రి. ౧. అతిశయించు. ౨. అతిక్రమించు. వి. ౧. మెఱపు. ౨. కాంతి. 3. ఆధిక్యము.
మించుదల. దే. వి. ౧. ఆధిక్యము. ౨. అతిక్రమణము.
మించుబోఁడి. దే. వి. ౧. ఆఁడుది. ౨. మెఱపువలెనుండు నందకత్తె.
మింతుఁడు. త్స. వి. విటుఁడు.
మిండఁడు. / మిండఁగాఁడు. / మిండగీఁడు. } వై. వి. విటపురుషుఁడు.
మిండత. దే. వి. జారిణి.
మిండతపసి = విటతపస్వి.
మిండతుమ్మెద = మగతుమ్మెద.
మిండమేఘము = పెద్దమేఘము.
మిండవడ్డి = అధికమగువడ్డి.
మిండతికము. దే. వి. జారత్వము.
మిండలకోరి. దే. వి. జారిణి.
మిక్కటము. దే. విణ. మిక్కిలి యధికము. రూ. మిక్కుటము.
మిక్కిలి. దే. విణ. ౧. అధికము. ౨. శ్రేష్ఠము.
మిక్కిలివాఁడు. దే. విణ. అధికుఁడు.
మిక్కుటము. దే. విణ. అధికము.
మిగత. దే. వి. శేషము.
మిగులు. దే. క్రి. ౧. శేషించు. ౨. మఱుమీఱు.
మిగులుచు. దే. ప్రే. మిగులఁజేయు. రూ. మిగుల్చు.
మిటమిట. దే. వి. ఎండకాయుటయందుగాని, మండుటయందుగాని అయ్యెడి ధ్వన్యనుకరణము.

మిటాయి. దే. వి. తియ్యని పిండివంట.
మిటారము. దే. వి. ౧. అతిశయము. ౨. నిక్కు.
మిటారి. దే. వి. ౧. క్రొవ్విన పడుచు. ౨. ఆఁడుది.
మిటారించు. దే. క్రి. ౧. అతిశయించు. ౨. నిక్కు. 3. విజృంభించు.
మిట్ట. దే. విశే. ౧. ఉన్నతము. ౨. తీక్ష్ణము. వి. 3. ఉన్నతభూమి.
మిట్టమిఱ్ఱు. దే. వి. అత్యున్నతభూమి.
మిట్టాడు. దే. క్రి. సంచరించు.
మిట్టించు. దే. క్రి. ఎగురు.
మిట్టిపడు. దే. క్రి. ౧. ఎగిరిపడు. వి. ౨. మిట్టిపాటు.
మిడి. దే. వి. ౧. గర్వము. విశే. ౨. ఉన్నతము. 3. తీక్ష్ణము. (మిడి మధ్యాహ్నము.)
మిడిగుడ్లు. దే. వి. బ. ముందటికి ఉబికిన కనుగుడ్లు.
మిడిపండ్లు. దే. వి. మిట్టపండ్లు.
మిడిమేలము. దే. వి. మిడిసిపాటు.
మిడియు. దే. క్రి. ఎగురు.
మిడిసిపడు. దే. క్రి. ౧. మిట్టిపడు. ౨. గర్వపడు.
మిడిసిపాటు. దే. వి. ౧. మిట్టిపాటు. ౨. గర్వము.
మిణుఁగురు. దే. వి. ౧. అగ్నికణము. ౨. మిణుఁగురుఁబురుగు. రూ. మిణుఁగురు.
మిడుకు. దే. క్రి. ౧. త్రుళ్లు ౨. కదలు. 3. సంచరించు. ౪. ఎండు. ౫. వి. జీవము.
మిడుకుమిడుకను = పరితపించు.
మిడుత. దే. వి. శలభము.
మిణుకరము. దే. వి. ఏమియుఁ దోఁచక భ్రమించుట.
మిణుకరించు. దే. క్రి. ఏమియుఁ దోఁచక భ్రమించు.
మిణుఁగురు. దే. వి. చూ. మిణుఁగురు.
మితంపచుఁడు. త్స. విశే. లోభి.
మితము. త్స. విశే. కొలఁది యిడఁబడినది.
మితి. త్స. వి. ౧. గడువు. ౨. కొలఁది.
మిత్తి. వై. వి. ౧. చావు. ౨. మృత్యుదేవత.
మిత్తిక. వై. వి. మన్ను.
మిత్తిగొంగ. దే. వి. శివుఁడు.
మిత్త్రము. త్స. వి. స్నేహితుఁడు.
మిత్త్రుఁడు. త్స. వి. ౧. స్నేహితుఁడు. ౨. సూర్యుఁడు.
మిథునము. త్స. వి. ౧. పండ్రెండు రాసులలో నొకటి. ౨. ఆలుమగలు. 3. జత.
మిథ్య. త్స. అవ్య. అసత్యము.
మిద్దియ. మిద్దె. దే. వి. ౧. మాడువు మీఁద చదునుగా పలకలుకప్పి గచ్చుపూసిన కప్పు. ౨. తామరపూవు లోనగువాని లోపలి దిమ్మె.

మినమిన. దే. వి. తళతళ అను కాంతి విశేషము.

మినమినలాడు. దే. క్రి. తళతళలాడు.

మినుకు. దే. క్రి. ౧. మినుకు మినుక్కుమను. వి. ౨. మినుమినుక్కుమను ౩. కాంతి. ౪. కిరణము.

మినుకుమినుకువను. దే. క్రి. మినుమినుక్కుమని మెఱయు.

మినుకులు. దే. వి. బ. వేదము.

మినుక్కురను. దే. క్రి. మినుక్కుమని మెఱయు.

మినుమినుకను. దే. క్రి. మినుమినుకు వను.

మినుములు. దే. వి. బ. ఉద్దులు.

మిన్న. దే. వి. ౧. రత్నము. విశే. ౨. శ్రేష్ఠము.

మిన్ను. దే. వి. ఆకసము. రూ. మిను.

మిన్నువన్ను. దే. వి. ఆకాశమును భూమియును.

మిన్నువాఁక. } దే. వి. ఆకాశగంగ.
మిన్నేఱు. } రూ. మిన్వాఁక.

మిరియము. వై. వి. ఒకదినుసు సంబారువు.

మిరెపకాయలు. దే. వి. బ. మిరెప చెట్లఁ గాయు కాయలు.

మిఱుమిట్లు. దే. వి. మిక్కిలి మిట్టుటలు.

మిఱుమిట్లుగొను. దే. క్రి. మిక్కిలి చెదరు.

మిట్టు. దే. వి. ఉన్నతభూమి.

మిలమిల. దే. వి. ౧. మినమిన. ౨. మెఱుఁగుటలో నయ్యెడి ధ్వన్యనుకరణము.

మిలమిలలాడు. దే. క్రి. మినమినలాడు.

మివులు. దే. వి. చూ. మిగులు.

మిశ్రము. } త్స. విశే. కలిసినది.
మిశ్రితము. }

మిశ్రీకరించు. త్స. క్రి. కలుపు.

మిష. త్స. వి. ౧. సెపము. ౨. కపటము.

మిస. దే. వి. కాంతి.

మిసమంతుఁడు. త్స. విశే. అఁటసిన వాఁడు.

మిసమిసవను. దే. క్రి. "మిసమిస"అని ప్రకాశించు.

మిసిమి. దే. వి. ౧. నవనీతము. ౨. నూతనకాంతి.

మిసిమింతురాలు. త్స. విశే. అలసిన కాంత.

మిహి. దే. విశే. శ్రేష్ఠము.

మిహిక. త్స. వి. మంచు.

మిహిరుఁడు. త్స. వి. సూర్యుఁడు.

మిళిందము. త్స. వి. తుమ్మెద.

మిళితము. త్స. వి. కలసినది.

మిల్లి. దే. వి. మిక్కిలి చిన్నగరిటె.

మీ

మీఁగడ. దే. వి. పెరుగుమీఁదితెట్టె.

మీఁగాలు. దే. వి. పాదముయొక్క పైభాగము.

మీఁజేయి. దే. వి. చేతిమీఁది భాగము.

మీఁదు. దే. వి. ౧. ఉపరిభాగము. ౨. భవిష్యత్కాలము.

మీఁదుమిక్కిలి. దే. విణ. కడు మిక్కిలి.

మీట. దే. వి. ఏతప్రమాణికిఁ గ్రింది యర భాగము.

మీటు. దే. క్రి. ౧. ఎగఁజిమ్ము. ౨ పొడుచు.

మీనము. త్స. వి. ౧. మత్స్యము. ౨. రాశి.

మీను. వై. వి. ,,

మీమాంస. త్స. వి. కర్మబ్రహ్మ ప్రతిపాదక శాస్త్రము.

మీమాంసకుఁడు. త్స. విణ. మీమాంసా శాస్త్రమును జదివినవాఁడు.

మీఱు. దే. క్రి. ౧. కడచు. ౨ అతిక్రమించు.

మీలనము. త్స. వి. కనుమూయుట.

మీలితము. త్స. విణ. మూయఁబడినది.

మీవడ. దే. వి. చూ. విఁగడ.

మీసకట్టు. దే. వి. మీసముయొక్క యేర్పాటు.

మీసము. దే. వి. మగవాని పైపెదవి మీఁద వెండ్రుకల వరుస.

మీసరము. దే. విణ. శ్రేష్ఠము.

## ము

ముంగడ. దే. వి. ౧. ముందు. ౨. ముందుచోటు.

ముంగర. దే. వి. ముక్కర.

ముంగల. దే. వి. చూ. ముంగడ.

ముంగలి. దే. విణ. ౧. ముందునడచునది. ౨. మీఁదటిది.

ముంగాము. దే. వి. పొట్లనుగా మడిచిన తాటాకుచుట్ట.

ముంగాలు. దే. వి. పాదాగ్రము.

ముంగి. దే. వి. ముంగిస.

ముంగిలి. దే. వి. ౧. అంకణము. ౨. మధ్యప్రదేశము.

ముంగిస. దే. వి. ముంగి.

ముంగురులు. దే. వి. బ. నొసటిపై గునిసి యాడెడి ఉంగరపు వెండ్రుకలు.

ముంగేలు. దే. వి. ముంజేయి.

ముంగొంగు. దే. వి. చెఱఁగుకొన.

ముంగొన. దే. వి. ముందటికొన.

ముంగోపము. దే. వి. ఓర్పులేక తటుకున వచ్చెడు కోపము.

ముంగోపి. దే. విణ. ఓర్పులేక తటాలున కోపము చేసికొనువాఁడు.

ముంగోలు. దే. వి. మొదటిది.

ముంచు. దే. క్రి. చూ. మునుచు.

ముంచుకొను. దే. క్రి. ఆక్రమించుకొను.

ముంజము. త్స. వి. ముంజిగడ్డి.
ముంజి. త్స. వి. బ్రహ్మచారి కట్టుకొనెడి ముంజదర్భ.
ముంజె. దే. వి. లేత తాటికాయలోని గుజ్జు.
ముంజెరము. దే. వి. నాసాపుటము.
ముంజేయి. దే. వి. మనికట్టు వఱకుఁగల మోచేతి క్రిందిచేయి.
ముండ. దే. వి. విధవ.
ముండనము. త్స. వి. క్షౌరము.
ముండమోపి. దే. వి. ౧. ముండ మోసినది. ౨. విధవ.
ముండమోయు. దే. క్రి. ౧. వ్యర్థమగు. ౨. వైధవ్యమునొందు.
ముండలకోరు. ⎱ దే. విణ. వేశ్యాసంగము
ముండలమారి. ⎰ శీలుఁడు.
ముండి. త్స. వి. ముండనము సేయించుకొన్నవాఁడు.
ముండితుడు. త్స. విణ. తల బోడియైనవాఁడు
ముండుఁడు. త్స. విణ. బోడితలవాఁడు.
ముండ్లకంచె. దే వి. ముండ్లకంప వెలుగు.
ముండ్లపంది. దే. వి. ఏఁదుపంది.
ముంత. దే. వి. ౧. మానిక. ౨. చిన్న మట్టిపాత్రము.
ముంతపొగ. దే. వి. మూతకి కట్టుటకు కాల్చి ముంతలో వైచిన మిరెపకాయలపొగ.

ముందర. ⎱ దే. వి. ౧. మునుపు. ౨.
ముందఱ. ⎰ మొదలు. ౩. ఎదురు.
ముందల. దే. వి. శిరోగ్రభాగము.
ముందు. దే. వి. ౧. పూర్వకాలము. ౨. ఎదురు.
ముందుపడు. దే. క్రి. ౧. మునుకొను. ౨. ముందగు.
ముంపు. దే. వి. ముంచుట.
ముంపుగొను. దే. క్రి. గుంపుకూడు.
ముకుందము. త్స. వి. ఎఱ్ఱదామర.
ముకుందుఁడు. త్స. వి. విష్ణువు.
ముకుఁద్రాడు. దే.వి. ఎడ్లను ముక్కున గ్రుచ్చు దారము.
ముకుటము. దే. వి. మా. ౧. ముక్కుటము. ౨. నారమడి.
ముకుదూలము. దే. వి. ౧. ముక్కుదూలము. ౨. ముక్కు నడిమియెముక.
ముకురము. త్స. వి ౧. అద్దము. ౨. మల్లెపువ్వు.
ముకుళము. త్స. వి. సగము పూచిన మొగ్గ.
ముకుళించు. త్స. క్రి. మొగుడు.
ముకుళితము. త్స. విణ. ముకుళించినది.
ముకుళీభవించు. త్స. క్రి. ముకుళించు.
ముక్క. దే. వి. తునుక.
ముక్కంటి. దే. వి. శివుఁడు.
ముక్కద్దము. దే వి సులోచనము.
ముక్కఱ. దే. వి. నాసికాభరణము.

ముక్కాని. దే. వి. మూఁడుకానులు.
ముక్కారు. దే. వి. మూఁడుకారులు
ముక్కాలిపీట. దే. వి. మూఁడుకాళ్లుగల్గిన యెత్తుబల్ల. రూ. ముక్కాలుపీట.
ముక్కాలు. దే. వి. మూఁడుకాళ్ళు.
ముక్కిడి. దే. విశే. ముక్కుపోయినవాఁడు.
ముక్కు. దే. వి. ౧. పక్షిముక్కు. ౨. నాసికము. క్రి. ౧. ఊపిరిబిగబట్టు. ౨. చెడు. రూ. ముకు.
ముక్కుటము. దే. వి. ౧. ముకుటము. ౨. క్షేమము.
ముక్కుతోఁగు. దే. వి. ముక్కుఁగమ్మి.
ముక్కుస. దే. వి. మూఁడుకుంచములు.
ముక్హారు. దే. క్రి. అజ్ఞానమునుబొందు.
ముక్కొను. దే. క్రి. ముందుకొను.
ముక్కోణము. దే. వి. త్రికోణము.
ముక్కోపము. దే. వి. ముంగోపము.
ముక్త. త్స. విశే. ౧. విడువఁబడినది. ౨. ముక్తినొందినది. 3. వి. ముత్యము.
ముక్తాయింపు. దే. వి. ముగింపు.
ముక్తావళి. త్స. వి. ముత్యాలహారము.
ముక్తి. త్స. వి. ౧. విడుపు. ౨. మోక్షము.
ముఖము. త్స. ౧. నోరు. ౨. మొగము. 3. మాట.
ముఖరము. త్స. విశే. మ్రోగునది.
ముఖశాల. త్స. వి. మొగసాల.
ముఖ్యము. త్స. విశే. ప్రధానము.
ముగింపు. దే. వి. సమాప్తి.
ముగితి. దే. వి. మోక్షము.
ముగియుక. దే. వి. ముగింపు.
ముగియు. దే. క్రి. సమాప్తమగు.
ముగుద. వై. వి. ౧. ముగ్ధ. ౨. ఆఁడుది.
ముగురు దే. స. చూ. ముగ్గురు.
ముగ్గు. దే. వి. చూ. మ్రుగ్గు.
ముగ్గురు. దే. స. ౧. ముగురు మనుష్యులు. ౨. ముగ్గురు స్త్రీలు.
ముగ్ధ. త్స. వి. స్వీయాంతర్భేద విశిష్ట నాయికా విశేషము.
ముచ్చి. దే. వి. ముచ్చివాఁడు.
ముచ్చిచ్చు. దే. వి. త్రేతాగ్ని.
ముచ్చిరి. దే. విశే. శోకము నొందినవాఁడు.
ముచ్చిరు. దే. క్రి. శోకించు.
ముచ్చిలి. దే.వి. పెడతలయందలిగుంట. (రూ. ముచ్చిలిగుంట.)
ముచ్చిలించు. దే. క్రి. దొంగిలించు.
ముచ్చిలిక. దే. వి. ౧. సేద్యము చేయు కాఁపులు నేలకలవారికి వ్రాసి ఇచ్చెడి యొడంబడిక. ౨. వాది ప్రతివాదులు మధ్యస్థులకు "మీరు తీర్పుచేసిన ప్రకారము ఒప్పుకొనియెదము" అని వ్రాసి ఇచ్చు ఖరారునామా.

ముచ్చిలు. దే. క్రి. దొంగిలించు.

ముచ్చె. వై. వి. మీఁగాలు గుదికాలు సయితము కప్పుకొని యుండెడి పాపోసు.

ముచ్చెవాఁడు. దే. వి. మాదిగవాఁడు.

ముచ్చు. దే. వి. ముడ్డియందలిశ్వాస.

ముచ్చట. దే. వి. ౧. కోరిక. ౨. సల్లాపము. 3. సమాచారము.

ముచ్చటపడు. దే. క్రి. కోరు.

ముచ్చటించు. దే. క్రి. ముచ్చటలాడు.

ముచ్చట్లు. దే వి. మూఁడు ప్రదేశములు.

ముచ్చముడుఁగు. దే. క్రి. మిక్కిలి ముడుఁగు.

ముచ్చె. దే. వి. ముచ్చె.

ముట్టడము. దే. వి. ౧. నిర్బంధము. ౨. ముట్టడించుట. రూ. ముట్టణము.

ముట్టడి. దే. వి. ౧. ముట్టడించుట. ౨. నిర్బంధము.

ముట్టడించు. దే. క్రి. కోట లోనగు దానిని చుట్టి నిర్బంధించు.

ముట్టించు. దే. క్రి. ౧. రగుల్చు. ౨. కాల్చు.

ముట్టియ. దే. వి. ముట్టె.

ముట్టు. దే. క్రి. ౧. తాఁకు. ౨. ముట్టడించు. 3. మర్మము తాఁకు. వి. ౧. తాఁకుడు. ౨. పనిముట్టు. 3. ఆఁడుదాని రజస్సు. విణ. ౪. రజస్వల.

ముట్టుకొను. దే. క్రి. ౧. ఆక్రమించు. ౨. ముట్టడించు. 3. తాఁకు. (వి. ముట్టుకోలు.)

ముట్టుత. దే. వి. ముట్టుది.

ముట్టునీళ్లు. దే. వి. బ. బయటచేరిన యాఁడుది నాల్గవదినమున చేయు స్నానము.

ముట్టుపడు. దే. క్రి. ౧. సంకటమగు. ౨. వి. ముట్టుపాటు.

ముట్టె. దే. వి. ౧. పందిముక్కు. ౨. మామిడి విత్తు మొదలగువాని మీఁదనుండు పెంకు, 3. చిప్ప.

ముట్టెమెకము. దే. వి. పంది.

ముట్టెమోపు. దే. వి. కార్యనిర్వాహక సమయము.

ముఠా. విణ. వి. ౧. కొన్ని గ్రామముల సమూహము. ౨. సమూహము.

ముడి. దే. వి. ౧. దారము లోనగువాని ముడి. ౨. చెట్టు లోనగువాని బుడిపి. 3. ఎద్దుమూఁపురము. ౪. వెండ్రుకలముడి. విణ. ౧. వికసింపనిది. ౨. ఖండముకానిది. (ముడిబియ్యము)

ముడికాఁడు. దే. విణ. సంధానము చేయువాఁడు.

ముడిగబ్బి. దే. వి. ఆఁబోతు.

ముడిగొను. దే. క్రి. ముడుచు.

ముడిబట్ట. దే. వి. అంచు కమ్ములు లేని వస్త్రము.

ముడియ. దే.వి. ౧. పందెము. ౨. మాట.

ముడియవిడుపు. దే. వి. దొంగ. రూ. ముడియవిడ్పు.
ముడివడు. దే. క్రి. ౧. కలుగు. ౨. అతిశయించు. ౩. పెనగొను. వి. శ. ముడివాటు.
ముడివెట్టు. దే. క్రి. ముడివేయు.
ముడుఁగు. దే. క్రి. ౧. సంకోచించు. ౨. తగ్గు. ౩. ముకుళించు.
ముడుఁచు. దే. ప్రే. ముడుఁగఁజేయు. రూ. ముడ్చు.
ముడుచు. దే. క్రి. ముడివేయు.
ముడుత. దే. వి. ౧. వస్త్రపునెరి. ౨. కడుపుమీఁది వళి.
ముడుపు. దే. వి. ౧. ధనము. ౨. ధనము ముడిచినమూట.
ముడుసు. దే. వి. ముడ్డిపూస.
ముడ్డి. దే. వి. చూ. మూడి.
ముడ్డిపూస. దే. వి. వెన్నెముకక్రింది చివరపూస.
ముతరాచ. దే. వి. 'ముత్తరాచ.' రూపాంతరము.
ముతుక. దే. విణ. చూ. ముదుక.
ముత్త. దే. విణ. వృద్ధుఁడు.
ముత్తరాచ. దే. వి. ఒకశూద్రజాతి.
ముత్తవ్వ. దే. వి. ౧. తండ్రియవ్వ. ౨. తల్లియవ్వ.
ముత్తాత. దే. వి. ౧. తండ్రితాత. ౨. తల్లి తాత.
ముత్తి. వై. వి. మోక్షము.
ముత్తిగ. దే. వి. తొమ్మిది.
ముత్తియము. వై. వి. ముత్యము. రూ. ముత్తెము.
ముత్తుము. దే. వి. మూఁడుతూములు.
ముత్తెము. వై. వి. చూ. ముత్తియము.
ముత్తెసరి. దే. వి. ముక్తాహారము.
ముత్తో. దే. వి. ముత్తయిదువ.
ముత్యము. వై. వి. ముత్తియము.
ముదము. త్స. వి. సంతోషము.
ముదముద. దే. వి. ౧. కొతుకు. ౨. సంకోచము.
ముదల. దే.వి. ౧. లక్ష్యము. ౨.ఆజ్ఞ.
ముదలకించు. దే. క్రి. మార్కొను.
ముదలపెట్టు. దే. క్రి. ఆజ్ఞాపించు.
ముదలించు. దే. క్రి. ౧. అడుగు. ౨. మార్కొను.
ముది. దే. వి. ౧. ముసలితనము. విణ. ౨. ముసలిది. ౩. ముసలివాఁడు.
ముదిగారము. దే. వి. మౌర్ఖ్యము.
ముదిత. దే. వి. ౧. ఆఁడుఃది. విణ. ౨. సంతోషము నొందినది.
ముదిమి. దే. వి. ముసలితనము.
ముదియు. దే. క్రి. ముదిమిపొందు.
ముదుక. దే. విణ. ౧. వృద్ధవృద్ధుఁడు. ౨. ముదుగు.
ముదుకఁడు. దే. విణ. వృద్ధుఁడు.
ముదుగు. దే. వి. లావు.
ముదుటుంగరము. దే. వి. ముద్దుటుంగరము.

ముదురు. దే. క్రి. ౧. వర్ధిల్లు. ౨. ఘనమగు. విణ. 3. వృద్ధము.

ముదుసలి. దే. విణ. ౧. వృద్ధ. ౨. వృద్ధుఁడు.

ముద్గరము. త్స. వి. ఇనుపగుదియ.

ముద్ద. దే. వి. ౧. పిండము. ౨. కబళము.

ముద్దరాలు. దే. వి. ముగ్ధస్త్రీ.

ముద్దాడు. దే. క్రి. ౧. ఆదరించు. ౨. చుంబనాదులచే లాలించు.

ముద్దిడు. దే. క్రి. చుంబనముచేయు.

ముద్దియ. దే. వి. ఆఁడుది. రూ. ముదియ.

ముద్దు. దే. వి. ౧. చుంబనము. ౨. ముద్ర. 3. మనోజ్ఞత. విణ. ౪. మనోజ్ఞము.

ముద్దుఁడు. దే. విణ. ఏమియుఁ దెలియనివాఁడు.

ముద్దుగుమ్మ. దే. వి. ౧. ఆఁడుది. ౨. మనోజ్ఞురాలగు నాఁడుది. రూ. ముద్దులగుమ్మ.

ముద్దుటుంగరము. దే. వి. అక్షరములు చెక్కిన యుంగరము. రూ. ముద్దుటుంగరము.

ముద్దుపెట్టుకొను. దే. క్రి. చుంబనము చేయు.

ముద్దురాలు. దే. వి. మనోజ్ఞురాలగు ఆఁడుది.

ముద్దులాఁడి. దే. విణ. ,,

ముద్దులాఁడు. దే. విణ. మనోజ్ఞుఁడు.

ముద్ర. త్స. వి. సంజ్ఞాక్షరములు చెక్కిన యుంగరము లోనగునది.

ముద్రణము. త్స. వి. ముద్రించుట.

ముద్రపలక. దే. వి. ముద్రవేసెడుపలక.

ముద్రించు. త్స. క్రి. ముద్రాంకితము చేయు.

ముద్రిక. త్స. వి. ముద్దుటుంగరము.

ముని. త్స. వి. ౧. వసిష్ఠాది. ౨. బుద్ధదేవుఁడు.

మునికోల. దే. వి. ముల్లుకఱ్ఱ.

మునిచీఁకటి. దే. వి. పొద్దుగ్రుంకిన వెంటనే క్రమ్మెడు పలుచని చీఁకటి.

మునిమనుమఁడు. దే. వి. ప్రపౌత్రుఁడు.

మునిమనుమరాలు. దే. వి. ప్రపౌత్రి.

మునిమాపు. దే. వి. ప్రదోషము.

మునిముంగల. దే. వి. మొట్టమొదట.

మునిముచ్చు. దే. వి. పశ్యతోహరుఁడు.

మునియేఁడు. దే. వి. నిరుటికిఁ దొలి సంవత్సరము.

మును. దే. వి. మున్ను.

మునుఁగు. దే. క్రి. ౧. నశించు. ౨. మునుకవేయు.

మునుక. దే. వి. ౧. మునుకవేయుట. ౨. మునుఁగుట.

మునుకు. దే. క్రి. ౧. సంతాపించు. ౨. మాఱుపలుకు.

మునుకొను. దే. క్రి. ముందుపడు. రూ. మునుకొను.

మునుగట్టు. దే. వి. పూర్వపర్వతము.
మునుచు. దే. క్రి. మునుకొను.
మునుపడు. దే. క్రి. మునుకొను.
మునుపు. దే. వి. ౧. ముందు. (రూ. మున్ను.)
మునుము. దే. వి. ముందు. రూ. మున్ను. వి. వరుస.
మునుముకొను. దే. క్రి. వరుసపెట్టు.
మున్నడి. దే. అవ్య. ముందుగా. రూ. మున్నాడి.
మున్నరక. దే. వి. ధైర్యము.
మున్నీరు. దే. వి. సముద్రము.
మున్ను. దే. వి. ౧. వెనుకటి. ౨. ముందు. రూ. మును.
మున్నూఱు. దే. స. మూఁడునూఱులు.
ముప్పది. దే. స. మూఁడుపదులు.
ముప్పాతిక. దే. వి. మూఁడు పాతికలు.
ముప్పావు. దే. వి. మూఁడు పావులు.
ముప్పిడి. దే. వి. బాఁకు.
ముప్పిరి. దే. వి. ౧. మూఁడు పిరులు. విణ. ౨. మూఁడు పిరులు గలది.
ముప్పిరిగొను దే. క్రి. ౧. పెనఁగొను. ౨. మూఁడుపిరులుగా పెనఁగొను.
ముప్పు. దే. వి. ౧. విపత్తు. ౨. వార్ధకము.
ముప్పూఁట. దే.వి. మూఁడుపూఁటలు.
ముప్పొంగు. దే. క్రి. ౧. మూఁడు పొంగులు పొంగు, ౨. ఉప్పొంగు.
ముప్పొత్తులు. దే. వి. అశిద్ధ.
ముబ్బడి. దే. విణ. చూ. ముమ్మడి.
ముబ్బడించు. దే. క్రి. చూ. ముమ్మడించు.
ముముక్షువు. త్స. విణ. విడుదల నిచ్ఛకలవాఁడు.
ముమూర్ష. త్స. వి. చావనిచ్ఛ.
ముమూర్షువు. త్స. విణ. చావనిచ్ఛ గలవాఁడు.
ముమ్మడి. దే. విణ. చూ. ముమ్మడుఁగు.
ముమ్మడించు. దే. క్రి. ముమ్మడియగు. రూ. ముబ్బడించు.
ముమ్మడుఁగు. దే. విణ. మూఁడు మడుఁగులు గలది.
ముమ్మనుమఁడు. దే. వి. చూ. మునిమనుమఁడు.
ముమ్మనుమరాలు. దే. వి. చూ. మునిమనుమరాలు.
ముమ్మరము. దే. విణ. అధికము.
ముమ్మరించు. దే. క్రి. అతిశయించు.
ముమ్మూఁడు. దే. వి. ౧. మూఁడు మూళ్లు. ౨. తొమ్మిది.
ముమ్మొనవాలు. దే. వి. త్రిశూలము.
ముమ్మొగము. దే. విణ. మూఁడుతెఱఁగుల.
ముయ్యంచు. దే. వి. మూఁడు మూలలు.
ముయ్యాఱు. దే. వి. మూఁడాఱులు.
ముయ్యేఁడు. దే. వి. ఇరువదియొకటి.
ముయ్యేఱు. దే. వి. గంగ.

మురజము త్స. వి. మృదంగము.
మురళి. త్స. వి. పిల్లనఁగ్రోవి.
మురళించు. దే. క్రి. ౧. తిరస్కరించు. వి. ౨. మురాళము.
మురాళించు. దే. క్రి. ఉగఁదుడుచు.
మురి. దే. వి. ౧. గర్వము. ౨. నడక యందలికులుకు.
మురికాఁడు. దే. విణ. గర్విష్ఠుఁడు.
మురికొను. దే. క్రి. ఖండించు.
మురిపము. } దే. వి. ౧. గర్వము. ౨.
మురిపెము. } నడకయందలికులుకు.
మురియ. దే. వి. ఖండము.
మురియు. దే. క్రి. ౧. నడుచునప్పుడు కులుకు. ౨. గర్వించు. ౩. తిరుగు.
మురుగు. దే. వి. ముంజేతి ధరించు బంగారు కడియముగాని వెండికడి యముగాని. రూ. మురువు.
మురువు. దే. వి. ౧. సౌందర్యము. ౨. గర్వము. విణ. ౩. సుందరము.
ముఱకటము. దే. వి. ముఱకటించుట.
ముఱకటించు. దే. క్రి. త్రిప్పు.
ముఱకము. దే. వి. ౧. నిక్కు. ౨. ఉద్ధతి.
ముఱముఱలాడు. దే. క్రి. కోప వికా రము చూపు.
ముఱి. దే. విణ. ౧. అల్పము. ౨. కుత్సితము. (ముఱిమొండెము.)
ముఱికి. దే. వి. మాలిన్యము.
ముఱిముఱి. దే. విణ. అల్పాల్పము.
ముఱియు. దే. క్రి. గర్వించు.
ముఱుగు. దే. క్రి. ౧. చదియు. ౨. కుళ్లు.
ముఱుగుడు. దే. విణ. కుళ్లినది.
ముఱ్ఱు. దే. వి. ముఱ్ఱుఁబాలు. రూ. ముఱు.
ముఱ్ఱుఁబాలు. దే. వి. ఆవులు లోనగునవి యీనిన తరువాత మూఁడుదినముల లోనిపాలు.
ములకనాడు. దే. వి. ఒకానొకదేశము.
ములికి. దే. వి. ౧. బాణపుటలుఁగు. ౨. బాణము.
ములు. దే. వి. ౧. త్రాసుముల్లు. ౨. ముల్లు.
ములుకోల. దే. వి. ముల్లుకఱ్ఱ.
ములుగు. దే. క్రి. ౧. మూలుగు. వి. ౨. మూలుగుట.
ములుచ. దే. విణ. మూర్ఖుఁడు.
ములుము. దే. వి. బావులనీళ్ళచేఁ బండెడిపొలము.
ముల్లంగి. దే. వి. ఒక దినుసుగడ్డ.
ముల్లు. దే. వి. ౧. కంటకము. ౨. త్రాసుముల్లు.
ముల్లె. దే. వి. ౧. ముడుపు. ౨. ధన ము ముడి.
మువ్వ. దే. వి. మొదలో మూఁడు సందులుగల పెద్దగజ్జె.
మువ్వకోడె. దే. వి. కాఁడికిని గంతకును క్రొత్తగా వాడుకపఱచెడి యెద్దు

ముప్పన్నెవిల్లు. దే. విణ. ఇంద్ర ధనుస్సు.
ముప్పీసము. దే. వి. మూఁడువీసములు.
ముప్పురు. దే. స. ముగ్గురు.
ముషితము. త్స. విణ. దొంగిలింపఁబడినది.
ముష్కము. త్స. వి. వృషణము.
ముష్కరుఁడు. త్స. విణ. కుటిలుఁడు.
ముష్టి. త్స.వి. ౧. పిడికిలి. ౨.కత్తిపిడి.
ముష్టింపచుఁడు. త్స. విణ. దరిద్రుఁడు.
ముసరు. దే. క్రి. క్రమ్ము.
ముసలము. త్స. వి. రోఁకలి.
ముసలి. దే. విణ. వృద్ధు
ముసించు. దే. క్రి. చెడు.
ముసిఁడి. వై. వి. ముష్టిచెట్టు.
ముసిముసినవ్వు. దే. వి. చిఱునగవు.
ముసుఁగు. దే. వి. ముసుఁగుడు. రూ. ముసువు.
ముసుఁగుడు. దే. వి. కప్పుడు.
ముసుఁగుడువడు. / ముసుఁగుపడు. / ముసుఁగుపాఱు. } దే. క్రి. కప్పుడువడు.
ముసురు. దే. వి. నిరంతరవర్షము.
ముసురుకొను. / ముసురువేయు. } దే. క్రి. ౧. కవియు. ౨. క్రమ్ము.
ముసువు. దే. వి. చూ. ముసుఁగు.
ముస్తాబు. / ముస్తీబు. } దే. విణ. తగిన విధమున అలంకరించుకొనుట.
ముస్తె. దే. వి. తుంగ.
ముహూర్తము. త్స. వి. ౧. పండ్రెండు క్షణముల కాలము. ౨. రెండు గడియలకాలము.
ముళ్ళియతి. మి. వి. నారదుఁడు.

మూ

మూఁక. దే. వి. ౧. సేన. ౨. సమూహము.
మూఁకవిప్పు. దే.విణ. చెదరఁగొట్టునది.
మూఁకుడు. దే. వి. ౧. మూఁత. ౨. కుండ మీఁద మూసెడి తట్టువంటి మట్టిపాత్రము.
మూఁగ. దే. విణ. ౧. మూఁగవాఁడు. వి. ౨. దోమ.
మూఁగంబాఱు. దే. క్రి. మూఁగు.
మూఁగతీఁటు. దే. వి. దట్టముగాఁ జేలిన తీఁటు.
మూఁగు. దే. క్రి. కదియు.
మూఁడు. దే. క్రి. ౧. ముగియు. ౨. కలుగు. స.౩. రెండును నొకటియును.
మూఁడుచు. దే. ప్రే. మూఁడఁజేయు.
మూఁత. దే. వి. మూయుట.
మూఁపు. దే. వి. భుజశిరము.
మూకుఁడు. త్స. విణ. మూఁగవాఁడు. రూ. మూకు.
మూఁగురు. దే. స. ముగ్గురు. రూ. మూవురు.
మూచూచు. దే. క్రి. మూర్కొను.

మూట. దే. వి. బట్టలు లోనగువాని ముడిచు.

మూడమంచె. దే. వి. దట్టమైన మంచె

మూడి. దే. వి. ముడ్డి.

మూఢుఁడు. త్స. విశే. ౧. బాలుఁడు. ౨. తెలివి లేని వాఁడు.

మూతి. దే.వి. ౧. ముఖము. ౨. నోటి పైభాగము.

మూత్రము. త్స. వి. ౧. నీరు. ౨. కాలుమడి.

మూత్రించు. త్స. క్రి. నీరువిడుచు.

మూదల. దే వి. తార్కాణము.

మూదలించు. దే. క్రి. ౧. తార్కాణించు. ౨. హెచ్చరించు. వి. మూదలిక.

మూయు. దే. క్రి. ౧. మూఁతపెట్టు. ౨. కప్పు.

మూర. దే. వి. ౧. రెండు జేనలకొలఁది హస్తము. ౨. విశే. నిడుపైనది.

మూరకోక. దే. వి. బారచాఁప.

మూరకోల. దే. వి. గజపుకోల.

మూరిఁబోవు. దే.క్రి. ౧. అతిశయించు. ౨. వర్ధిల్లు. 3. విజృంభించు.

మూరు. దే. క్రి. అతిశయించు.

మూరుకొను. దే. క్రి. ఆఘ్రాణించు. రూ. మూర్కొను.

మూరుతము. వై. వి. చూ. ముహూర్తము.

మూర్ఖుఁడు. త్స. విశే. తెలిసియుఁ దెలియనివాఁడు.

మూర్ఛ. త్స. వి. రోగాదులచే స్మృతి తప్పుట.

మూర్ఛాలుఁడు. త్స. విశే. మూర్ఛారోగము గలవాఁడు.

మూర్ఛితుఁడు. త్స. విశే. మూర్ఛిల్లిన వాఁడు.

మూర్ఛిల్లు. త్స. క్రి. మూర్ఛపోవు. రూ. మూర్ఛిలు.

మూర్తి. త్స. వి. ౧. ప్రతిమ. ౨. శరీరము.

మూర్ధము. త్స. వి. శిరము.

మూర్ధాభిషిక్తుఁడు. త్స. వి. రాజు.

మూల. దే. వి. ౧. దిక్కు. ౨. గొంది. త్స. వి. నక్షత్రము.

మూలకము. త్స. వి. ముల్లంగి.

మూలము. త్స. వి. ౧. వేరు. ౨. ఊఁడ. 3. మొదలు. ౪. సంచి మొదలు.

మూలముట్టు. దే. అవ్య. ఆమూలము.

మూలటాయి. దే. వి. వజ్రము.

మూలాధారము. త్స. వి. గుదస్థానమునం దుండెడి నాడుల కాధార మగు చక్రము.

మూలిక. త్స. వి. మందాకు.

మూలుగు. దే. క్రి. ౧. కూయు. ౨. నొప్పివలని బాధచే ఒకవిధముగా ధ్వనించు.

మూల్యము. త్స. వి. ౧. జీతము. ౨. వెల.

మూవ. దే. విశ. చూ. మూఁగ.

మూవుసు. దే. స. మూఁగుదు.

మూషికము. త్స. వి. ౧. ఎలుక. ౨. పందికొక్కు.

మూస. దే. వి. బంగారు లోనగువానిఁ గరఁగెడి కుడువు.

మృ

మృగతృష్ణ. త్స. వి. ఎండమావులు.

మృగనాభి. } త్స. వి. కస్తూరి.
మృగమదము. }

మృగము. త్స. వి. ౧. జింక. ౨. పశువు.

మృగయ. త్స. వి. ౧. వేఁట. ౨. వెదకుట.

మృగయుఁడు. త్స. వి. బోయవాఁడు.

మృగవ్యము. త్స. వి. వేఁట.

మృగశిర. త్స. వి. మృగశీర్షము.

మృగాంకుఁడు. త్స. వి. చంద్రుఁడు.

మృగితము. త్స. విశ. వెదకఁబడినది.

మృగేంద్రుఁడు. త్స. వి. సింహము.

మృగ్యము. త్స. విశ. వెదకఁదగినది.

మృడాని. త్స. వి. పార్వతి.

మృడుఁడు. త్స. వి. శివుఁడు.

మృణాళము. త్స. వి. ౧. వట్టివేరు. ౨. తామరతూఁడు.

మృతము. త్స. విశ. మృతినొందినది.

మృతి. త్స. వి. చావు.

మృత్తిక. త్స. వి. మన్ను.

మృత్తు. త్స. వి. మన్ను.

మృత్యుంజయుఁడు. త్స. వి. శివుఁడు.

మృత్యువు. త్స. వి. చావు.

మృదంగము. త్స. వి. మద్దెల.

మృదులము. త్స. విశ. మెత్తనిది.

మృదువు. త్స. విశ. ౧. సోమరి. ౨. మెత్తనిది.

మృష. త్స. వి. అసత్యము.

మృష్టము. త్స. విశ. నిర్మలమైనది.

మెం

మెండు. దే. వి. ౧. అతిశయము. ౨. ఆధిక్యము. విశ. 3. అధికము.

మెండుకొను. దే. క్రి. ౧. అతిశయించు. ౨. విజృంభించు.

మెండొడ్డు. దే. క్రి. ఎదిరించు.

మెంతులు. దే. వి. బ. సంబారుదినుసు.

మెకము. వై. వి. మృగము. రూ. మెగము.

మెక్కు. దే. క్రి. తిను.

మెగము. వై. వి. చూ. మెకము.

మెచ్చు. దే. క్రి. ౧. లక్ష్యపెట్టు. ౨. పొగడు. వి. ౧. శ్లాఘన. ౨. ప్రీతి.

మెచ్చులాఁడి. దే. విశ. మెచ్చుకొనఁదగిన ఆఁడుది.

మెచ్చులాఁడు. దే. విశ. మెచ్చుకొనఁదగినవాఁడు.

మెట్ట. దే. వి. నీరాసలేకపండెడు చేను.

మెట్టపంట. దే. వి. మెట్టచేనిపంట.

మెట్టినిల్లు. దే. వి. అత్తవారియిల్లు.

మెట్టు. దే. క్రి. త్రొక్కు. వి. ౧. సోపానము. ౨. త్రొక్కుడు. 3. కొండ. బ. ౧. చెప్పులు. ౨. పావుకోళ్ళు.

మెట్టుఁబ్రాలు. దే. వి. తలఁబ్రాలు.

మెట్టుకు. దే: అవ్య. ౧. మొత్తమునకు. ౨. తుదకు.

మెట్టె. దే. వి. చూ. మట్టె.

మెడ. / మెడకాయ. } దే. వి. కంఠము.

మైడవాలు. దే. వి. ౧. చౌకలవాఁడు. ౨. చౌకలది.

మెతుక. వై. విణ. ౧. మందము. ౨. మృదువైనది.

మెతుకు. దే. వి. అన్నముయొక్క కణము.

మెత్తి. దే. వి. ౧. గుఱ్ఱపుపల్లము. ౨. పఱపు. విణ. 3. మృదువైనది.

మెత్తఁబడు. / మెత్తఁబాఱు } దే. క్రి. ౧. అణఁగు. ౨. మృదువగు. వి. 3. మెత్తఁబాటు.

మెత్తగిల్లు. దే. క్రి. మెత్తనగు. రూ. మెత్తగిలు.

మెత్తడము. దే. వి. మెత్తుట.

మెత్తన. దే. వి. ౧. మృదుత్వము. ౨. శాంతి. విణ. 3. మృదువు. అవ్య. ౪. తిన్నగా.

మెత్తు. దే. క్రి. ౧. మన్ను లోనగువాని దళముగా పూయు. వి. ౨. మన్ను లోనగువాని దళముగా పూసినపూఁత.

మెదడు. వై. వి. తలయందుండు క్రొవ్వు.

మెదలిక. దే. వి. మెదలుట.

మెదలు. దే. క్రి. ౧. సంచరించు. ౨. కొంచెము చలించు.

మెదుక. వై. విణ. ౧. మందము. ౨. మందుఁడు. వి. పిసక.

మెదుకుకొను. దే. క్రి. పిసకపట్టు.

మెదుకు. దే. వి. చూ. మెతుకు.

మెదుగు. దే. క్రి. ౧. ధాన్యముమీఁది పొట్టుపోవనలఁగు. ౨. నలఁగు.

మెదుగుడు. దే. వి. పాతవస్త్రము.

మెదుచు. దే. క్రి. మేదించు.

మెదుపు. దే. ప్రే. మెదగఁజేయు.

మెదువు. వై. విణ. ౧. మృదువు. ౨. మందము.

మెప్పు. దే. వి. ౧. వరము. ౨. శ్లాఘన. 3. ప్రతి.

మెయి. దే. వి. ౧. విధము. ౨. చాయ. 3. దేహము.

మెయికొను. దే. క్రి. ౧. కలుగు. ౨. అనుకూలించు. 3. సమ్మతించు. వి. ౪. మెయికోలు.

మెయితాలుపు. దే. వి. ప్రాణి.

మెయిమఱపు. దే. వి. చూ. మయిమఱపు.

మెరక. దే. వి. మిట్టనేల.
మెరమెర. దే. వి. ౧. సంశయము. ౨. మనోవ్యథ.
మెరమెరపడు. దే. క్రి. ౧. సంశయపడు. ౨. వి. మెరమెరపాటు.
మెరమెరలాడు. దే. క్రి. బాధపడు.
మెఱపు. దే. వి. ౧. కాంతి. ౨. విద్యుత్తు.
మెఱపుఁదీఁగ. దే. వి. తీఁగవంటిమెఱపు.
మెఱమెచ్చు. దే. వి. మిక్కిలి మెచ్చు.
మెఱయు. దే. క్రి. ౧. ప్రకాశించు. ౨. బయలుపడు.
మెఱవడి. దే. వి. ౧. అతిశయము. ౨. ఊరేగింపు. 3. నేర్పు.
మెఱికలు. దే. వి. బ. పొట్టు విడియు వీడనిబియ్యము.
మెఱియ. దే. విశ. గుండ్రాయి.
మెఱియఁడు. దే. విశ. చలింపనివాఁడు.
మెఱియత. దే. విశ. చలింపనిది.
మెఱుఁగు. దే. వి. ౧. మెఱపు. ౨. నెయ్యి మొదలగువాని జిడ్డు.
మెఱుఁగుఁబోఁడి. దే. వి. ఆఁడుది.
మెఱుఁగునల్లులు. దే. వి. బ. నల్లపూసల సరము.
మెఱుము. దే. క్రి. ౧. మెఱుచు. ౨. పొడుచు. వి. మెఱపు.
మెలఁకువ. దే. వి. ౧. మేలుకొనుట. ౨. సంచారము. 3. జాగరూకవర్తనము.
మెలఁగు. దే. క్రి. ౧. సంచరించు. ౨. జెరగు. 3. జాగరూకతతో వర్తించు.
మెలఁత. } మెలఁతుక. } దే. వి. ఆఁడుది. రూ. మెల్త. మెల్తుక.
మెలపు. దే. వి. ౧. జాగరూకత. ౨. చలింపమి. ప్రే. మెలయఁజేయు.
మెలయు. దే. క్రి. ౧. జాగ్రత్తతో వర్తించు. ౨. పెనఁగు. రూ. మెలియు.
మెలి. } మెలిక. } దే. వి. పెన.
మెలికొను. దే. క్రి. పెనఁగొను.
మెలియు. దే. క్రి. ,,
మెలివడు. దే. క్రి. మెలిగొను.
మెలివెట్టు. దే. క్రి. మెలివేయు.
మెలుచు. దే. ప్రే. మెలియఁజేయు.
మెల్ల. దే. విశ. ౧. మేలైనది. ౨. కడగంటి కొఱగినది. క్రి. విశ. 3. తిన్నగా.
మెల్లకంటి. దే. విశ. ౧. కేకరాక్షుడు. ౨. కేకరాక్షి.
మెల్లన. దే. వి. ౧. అల్లన. ౨. తిన్నన.
మెల్లె. దే. వి. ౧. చివక. ౨. చువ్వ.
మెసఁగు. } మెసవు. } దే. క్రి. తిను.

## మే

మే. దే. వి. ౧. శరీరము. ౨. విధము.
మేఁక. వై. వి. ౧. భాగి. ౨. భాగము.

మేఁకపోతు. దే. వి. ఛాగము.

మేఁడి. వై. వి. నాఁగటిదుంప వెనుక నిలిపినకొయ్య.

మేఁడికోరు. మేఁడిపాలు. } ౧. వై. వి. నేలను సేద్యము చేసిన వాఁడు. ౨ నేలయజమానునికిచ్చు ధాన్యభాగము.

మేఁత. దే. వి. ఆవులు లోనగునవి తిను నాహారము.

మేఁతరి. దే. విణ. ఆహారము.

మేఁతాడు. దే. క్రి. మేయు.

మేకు. దే. వి. గూటము.

మేకొను. దే. క్రి. ౧. పొందు. ౨. సమ్మతించు. 3. కలుగు. వి. ౪. మేకోలు.

మేఖల. త్స. వి. ౧. కొండనడుము. ౨. ఆఁడుదాని యెనిమిది పేటల మొలనూలు.

మేఘనాదము. త్స. వి. ఉఱుము.

మేఘము. త్స. వి. మబ్బు.

మేజోడు. దే.వి. పాదరక్షలకు లోపల కాలికివైచు జోడు.

మేటరి. దే. విణ. శ్రేష్ఠుఁడు.

మేటి. దే. విణ. ౧ శ్రేష్ఠము. వి. ౨. అధిపుఁడు.

మేటిలు. మేటిల్లు. } దే. క్రి. అతిశయించు.

మేడ. దే. వి. సౌధము.

మేఁడి. దే. వి. అత్తి.

మేతాలువు. దే. వి. చూ. నెయితాలువు.

మేదకుఁడు. త్స. విణ. కపటములేని వాఁడు.

మేదర. దే. వి. వెదురుచాపలు లోనగునవి అమ్మి జీవించు నొకానొక జాతి.

మేదస్సు. త్స. వి. మెదడు.

మేదించు. దే. క్రి. మర్దించు

మేదిని. త్స. వి. భూమి. వ్యు. మధుకైటభుల మెదడుచేఁ దడపఁబడినది.

మేదురము. త్స. విణ. ౧. చిక్కనైనది. ౨. నునుపైనది.

మేధ. త్స. వి. ధారణాశక్తిగల బుద్ధి.

మేధావి. త్స. విణ. మేధకలవాఁడు.

మేధ్యము. త్స. విణ. పవిత్రము.

మేన. దే. వి. తోడఁబుట్టిన దాని యొక్కయు, తండ్రితోడఁబుట్టిన దానియొక్కయు, తల్లితోడఁబుట్టిన వానియొక్కయు సంబంధము.

మేనరికము. దే. వి. తండ్రితోడఁబుట్టిన దానియొక్కయు, తల్లి తోడఁబుట్టిన వానియొక్కయు, తోడఁబుట్టిన దానియొక్కయు, దేహసంబంధ భావము.

మేని. దే. వి. కాంతి.

మేను. దే. వి. ౧. పార్శ్వము. ౨. శరీరము.

మేనుతాలుపు. దే. వి. ప్రాణి.

మేపరి. దే. విణ. తినువాఁడు.

మేపు. దే. ప్రే. ౧. మేయఁజేయు. వి. ౨. పశువులు లోనగువానికి పెట్టు నాహారము.

మేమఱువు. దే. వి. కవచము.

మేమెయి. దే. క్రి విణ. అనాయాసముగా.

మేయు. దే. క్రి. ఆవులు లోనగునవి మేఁతనుదిను.

మేర. వై. వి. ౧. మర్యాద. ౨. ఎల్ల. ౩. ఏర్పాటు.

మేరు. / మేరువు. దే. వి. ౧. హారమునడుమ వ్రేలెడు రత్నము. ౨. కట్టు. త్స. వి. ౩. బంగారు కొండ.

మేలమాడు. దే. క్రి. ౧. గేలిచేయు. వి. ౨. మేలము.

మేలిమి. దే. వి. ౧. అపరంజి. ౨. ఆధిక్యము.

మేలిల్లు. దే. వి. మేడ.

మేలు. దే. వి. ఏ. ౧. లాభము. ౨. ఉపకారము. ౩. శుభము. విణ. ౪. శ్రేష్ఠము. అవ్య. ౫. ఔరా.

మేలుకట్టు. దే. వి. వితానము (చాందినీ)

మేలుకను. దే. క్రి. మేలుకొను. రూ. మేల్కను.

మేలుకాంచు. దే. క్రి. మేలుకొను.

మేలుకొను. దే. క్రి. ౧. నిద్రఁదేఱు. ౨. మోహించు. వి. ౩. మేలుకోలు. ౪. మేలుకొలుపు. దే. ప్రే. ౫. మేలుకొనఁజేయు.

మేలుచేయు. దే. వి. ౧. హెచ్చు. విణ. ౨. హెచ్చైనది.

మేలుపడు. దే. క్రి. వలపుగొను.

మేలుబంతి. దే. విణ. ౧. శ్రేష్ఠము. వి. ౨. చూచి యేదేని ఒకపనిని నేర్చుకొనుటకుఁగాని చేయుటకుఁగాని మొదట నేర్పడినమాదిరి.

మేలుముచ్చు. దే. వి. చంద్రశాల.

మేలురాసి. దే.వి. తూర్పెత్తినవడ్లరాసి.

మేలువాఁడు. దే. విణ. వలపువాఁడు.

మేవడి. దే. వి. ౧. ఉపాయము. ౨. నమ్రత. విణ ౩. ఉచితము.

మేవడికాఁడు. దే. విణ. ఉపాయము కలవాఁడు.

మేషము. త్స. ౧. ఒకరాశి. ౨. మేఁక.

మేళగాఁడు. దే. విణ. మేళము వాయించెడివాఁడు.

మేళగించు. దే. క్రి. ౧. కలియు. ౨. జతగూడు. ప్రే ౧. జతగూర్చు. ౨. కలియు. రూ. మేళవించు.

మేళనము. దే. వి. కూడిక.

మేళము. దే. వి. నాగస్వరము లోనగు వాని వాద్యముల జత. త్స. వి. ౧. కూడిక. ౨. వేశ్యాదిజన సమూహము.

మేళవించు. దే. క్రి. చూ. మేళగించు.

## మై

మై. దే. వి. ౧. దేహము. ౨. విధము. 3. పార్శ్వము.

మైకము. దే. వి. మత్తు.

మైకొను. దే. క్రి. ౧. సమ్మతించు. వి. ౨. మైకోలు.

మైజారు. దే. వి. కొంత యెడయెడ ముగా అడ్డ కమ్ములు వాటించిన యాఁడుదాని చీరకొంగు.

మైతాలుపు. దే. వి. ప్రాణి. రూ. మయితాలుపు.

మైత్రి. త్స. వి. ౧. స్నేహము. ౨. మిత్రకర్మము.

మైథునము. త్స. వి. కూడిక.

మైద. దే. వి. మైకము.

మైదానము. దే. వి. బయలుభూమి.

మైదు. వై. వి. ౧. చొక్కు. ౨. మాయ. 3. చొక్కుపొడి.

మైనప్రవృత్తి. వై. వి. క్రౌర్యవృత్తి.

మైనము. వై. వి. తేనెతెట్టెలో తేనెను గైకొనిన పిమ్మట నుండుశేషము.

మైపూఁత. దే. వి. ౧. అంగరాగము. ౨. చందనాదుల పూఁత.

మైమఱపు. దే. వి పారవశ్యము.

మైమై. దే. విశే. అనాయాసముగా.

మైల. వై. వి. ౧. అంటు. ౨. మాలిన్యము. 3. మఱికిగుడ్డ. విశే. ౧. అశుచి. ౨. మలినము.

మైలపడు. వై. క్రి. ౧. అశుచియగు. ౨. మలినమగు.

మైలుతుత్తము. వై. వి. రాగియును, గంధకమును, చేరిన మిశ్రమము.

మైవడి. దే. వి. ౧. సమ్మతి. ౨. అనుకూల్యము. 3. సౌమ్యత. విశే. అనుకూలము.

## మొ

మొండరి. దే. విశే. మొండితనము గల వాఁడు.

మొండి. వై. విశే. ౧. మొక్కపోయినది. ౨. కొంతతెగినది. 3. మూర్ఖుఁడు.

మొండికట్టియ. } వై. విశే. ౧. మొండితనముకలవాఁడు. ౨. మొండితనము కలది.
మొండికట్టె. }

మొండెము. వై. వి. తల తెగినశరీరము.

మొకము. వై. వి. చూ. మొగము.

మొకరి. దే. విశే. మ్రొగునది.

మొక్క. వై. వి. ౧. చిగురుమొలక. ౨. మొలక. విశే. 3. వ్యర్థము.

మొక్కఁడు. దే. విశే. బలిసినవాఁడు.

మొక్కచెడు. దే. క్రి. అవమానపడు.

మొక్కట్టు. దే. వి. ముఖవైఖరి.

మొక్కపడు. దే. క్రి. భంగపడు.

మొక్కపోవు. దే. క్రి. భంగపడు. ప్రే. మొక్కపుచ్చు. రూ. మొక్కలుపోవు.

మొక్కరము. దే. వి. ౧. స్తంభము. ౨. గడెమ్రాను.

మొక్కలము. దే. వి. ౧. ముష్కరత్వము. ౨. శౌర్యము. 3. ధైర్యము. ౪. ఉత్సాహము.

మొక్కలి. దే. విణ. ముష్కరుఁడు.

మొక్కలించు. దే. క్రి. ముష్కరము సేయు.

మొక్కలికాఁడు. దే. విణ. ముష్కరుఁడు.

మొక్కలీఁడు. దే. విణ. ౧. ముష్కరుఁడు. ౨. శూరుఁడు.

మొక్కలుఁడు. వై. విణ. శూరుఁడు.

మొక్కు. దే. క్రి. ౧. ముడుఁగు. ౨. దండమిడు.

మొక్కుబడి. దే.వి. చూ. మ్రొక్కుబడి.

మొగ. దే. వి. ౧. మొదలు. (మొగయైన.) ౨. ద్వారము (మొగసాల.) (రూ. మొగ్గ.)

మొగకొను. దే. క్రి. అభిముఖమగు.

మొగడ. వై. వి. మొగ్గ.

మొగడించు. వై. క్రి. ముకుళించు.

మొగదల. దే. వి.౧. ముందటిభాగము. ౨. ఎదురు.

మొగపు. దే. వి. హారాదుల ముఖభాగము.

మొగమిచ్చు. దే. క్రి. సుముఖుఁడగు.

మొగము. వై. వి. ౧. ముఖము. ౨. ఎదురు. విణ. 3. ముఖ్యము.

మొగమోటము. దే. వి. ౧. సంకోచము. ౨. దాక్షిణ్యము.

మొగమోడు. దే. క్రి. ౧. సంకోచించు. ౨. దాక్షిణ్యపడు.

మొగరము. దే. వి. చూ. మొగ్గరము.

మొగలి. దే. వి. కేతకి.

మొగలివాకిలి. దే. వి. తలవాకిలి.

మొగసల. / మొగసాల. } వై. వి. ౧. తలవాకిటి పంచ. ౨. నగరి తలవాకిటి చావడి.

మొగి. వై. వి. ౧. విధము. ౨. మొత్తము. 3. పూనిక.

మొగియు. దే. క్రి. ౧. పూను. ౨. కదియు.

మొగుడు. వై. క్రి. ముకుళితమగు.

మొగుడుచు. వై. ప్రే. మొగుడఁజేయు.

మొగులు. దే. వి. మేఘము.

మొగ్గ. దే. వి. ౧. బోరగిలుపడి శిరము పాదములతోఁ జేర విల్లువలె వెలికిలవంగుట. ౨. ముకుళము. రూ. మొగ.

మొగ్గరము. దే. వి. వ్యూహము. రూ. మొగరము.

మొగ్గవాలు. దే. క్రి. బోరగిలుపడి శిరము పాదముతోఁ జేరవిల్లు వలె వంగు.

మొగ్గవిచ్చు. దే. క్రి. ౧. పూయు. ౨. యథాయథలగు.

మొటిమ. దే.వి. ౧. ప్రాయమున ముఖమునఁ బొడము చిన్నగుల్ల. విణ. ౨. పొట్టి.

మొట్టమొదలు. దే. వి. అన్నిటికి మొదలు.

మొట్టికాయ. దే. వి. తలమీఁద పిడికిటతో పొడిచెడిపోటు.

మొట్టు. దే. క్రి. పిడికిటతోఁ దలమీఁదఁ బొడుచు.

మొట్లమారి. దే. విణ. మొట్టికాయలు తినువాఁడు.

మొత్త. దే. విణ. వాకిటిలోపలి ప్రక్కగోడ.

మొత్తము. దే. వి. ౧. అంతకము. ౨. సమూహము.విణ.3. తఱచైనది.

మొత్తు. దే. క్రి. ౧. నఱకు. ౨. కొట్టు. వి. 3. దెబ్బ.

మొత్తులాడు. దే. క్రి. కొట్లాడు.

మొత్తువడు. దే. క్రి. కొల్లుపడు.

మొదలారి. దే. వి. అఱవశూద్రులలో నొక తెగ.

మొదలు. దే. వి. ౧. మూలధనము.౨. ఆది.

మొదలుకొను. దే. క్రి. ప్రారంభించు. వి. ప్రారంభము.

మొదలుపెట్టు. దే. క్రి. ప్రారంభించు.

మొదవు. దే. వి. పాఁడియావు.

మొద్దఁడు. వై. విణ. ౧. లావైనవాఁడు. ౨. మూఢుఁడు.

మొద్దు. వై. వి. కొమ్మలు నఱికిన మ్రాను. విణ. ౧. వాఁడిలేనిది. ౨. మూఢుఁడు. 3 మూ ఢురాలు.

మొద్దువోవు. దే. క్రి. వాఁడిలేనిదియగు.

మొన. దే. వి. ౧. వ్యూహము. ౨. సైన్యము. 3. ముందు. ౪.అగ్రము.

మొనకాఁడు. దే. వి. ౧. శూరుఁడు. ౨. ముఖ్యుఁడు.వి. 3. సేనాధిపతి.

మొనదప్పు. దే. క్రి. విముఖమగు.

మొనయు. దే. క్రి. ౧. కలుగు. ౨. పూను.

మొన్న. దే. వి. కడచిన దినమునకు ముందటిదినము.

మొప్పె. దే. వి. ౧. కఱకు. ౨. మూర్ఖుఁడు.

మొర. దే. వి. చూ. మోర.

మొరకు. దే. వి. మ్రోడు.

మొరపము. } దే. వి. మ్రోఁత.
మొరయిక. }

మొరయు. దే. క్రి. మ్రోయు.

మొరిఁటె. దే. వి. బాలికలాడుకొను చిన్నచేట.

మొఱ. దే. వి. ఆర్తధ్వని. రూ. మొఱ్ఱ.

మొఱఁగు. దే. క్రి. ౧. వంచించు. ౨. పొంచు. వి. 3. వంచన. విణ. ౪. వంచకుఁడు.

మొఱకు. దే. వి.౧. న్యూనత. విణ. ౨. న్యూనము.

మొఱకిడము. దే. వి. దౌష్ట్యము.
మొఱకు. దే. విశే. ౧. పరుషము. ౨. మూర్ఖుఁడు.
మొఱకుఁడు. వై. విశే. మూర్ఖుఁడు.
మొఱికి. దే. వి. మొఱ్ఱి.
మొఱుఁగు. దే. క్రి. ౧. కుక్క కూయు. ౨. కూయు. రూ. మొఱువు.
మొఱుఁగుడు. దే. వి. ౧. కుక్కకూఁత. ౨. కూఁత.
మొఱువు. దే. క్రి. చూ. మొఱుఁగు.
మొఱ్ఱ. దే. వి. చూ. మొఱ.
మొఱ్ఱి. దే. వి. ౧. అంగన్యూనత. విశే. ౨. అంగన్యూనము.
మొఱ్ఱిపోవు. దే. క్రి. అంగన్యూనమగు.
మొల. దే. వి. ౧. చీల. ౨. త్రాసు ముల్లు. 3. కటిప్రదేశము.
మొలక. దే. విశే. లేఁత. వి. ౧. వ్రణమునందలి దుర్మాంస విశేషము. ౨. ఆసనమునందలి దుర్మాంస విశేషము. 3. అంకురము.
మొలకకట్టు. దే. క్రి. రొంపియందు చల్లుటకుగాను విత్తనము మొలక లెత్తి తడిపి మూడియకట్టు.
మొలకట్టు. దే. వి. ౧. కట్టుకోక. ౨. మొలనూలు.
మొలకత్తి. దే. వి. బాఁకు.
మొలకబంగారు. వై. వి. పుట్టలలో పురుగులవలన కలిగెడి బంగారు.
మొలకెత్తు. దే. క్రి. మొలచు.
మొలచు. దే. క్రి. అంకురించు. రూ. మొలుచు.
మొలత్రాడు. దే వి. ౧. పురుషుని మొలనుండు త్రాడు. ౨ మొలనూలు. దే. వి. 3. స్త్రీలు మొలతొల్చునూత్రము.
మొలవ. దే. వి. ౧. అంకురము. ౨. మొలక.
మొలవేయు. దే. క్రి. నాటు.
మొలాము. దే. వి. ౧. బంగారు లోవగు దానిపూఁత. ౨. పుంటికి పూసెడుమందు. రూ. మలాము.
మొల్ల. దే. వి. కుందము.
మొల్లమి. దే. వి. ౧. సాంద్రత. ౨. వి. ణ. సాంద్రము.
మొల్లము. దే. విశే. ౧. తఱచైన. ౨. అధికమైన. వి. 3. ధనము.
మొల్లాము. దే. వి. చూ. మొలాము.
మొసలి. దే. వి. జలజంతు విశేషము.
మొహాదా. దే. వి. అడ్డకత్తి.
మొహారీ. దే. వి. ముప్పది చిన్నముల యెత్తు బంగారు నాణెము.

మో

మోఁకటించు. దే. క్రి. మోకాళ్లునేల కాన ముందఱికొఱగు.
మోఁకటిల్లు. దే. క్రి. మోకరించు.
మోఁకాలు. దే. వి. జానువు.
మోఁచేయి. దే. వి. కూర్పరము. రూ. మోచేయి.
మోఁత. దే. వి. బరువు.

మోఁదు. దే. క్రి. కొట్టు. వి. ౧. దెబ్బ. ౨. వానజల్లు.
మోక. దే. వి. చూ. మొలక.
మోకు. దే. వి. లావు త్రాడు.
మోక్షము. త్స. వి. ౧. విడుపు. ౨. కైవల్యము.
మోఘము. త్స. విణ. వ్యర్థమైనది.
మోచ. త్స. వి. అరఁటి.
మోచనము. త్స. వి మోక్షము.
మోచు. దే. క్రి. ౧. కొనదకొను. ౨. వహించు.
మోట. దే. వి.౧. కపిలె. విణ. ౨. పెద్ద.
మోటకత్తి. వై. వి. మచ్చుకత్తి.
మోటనము. త్స. వి. ౧. అవమానము. ౨. ఆక్షేపము.
మోటించు. దే. క్రి. ౧. పోటీగా నిలుపు. ౨. పూను.
మోటు. వై. వి. ౧. మోఁదు. ౨. తట్టువగుట్టము. విణ. 3. మూర్ఖుఁడు.
మోడము. దే. వి. మేఘావరణము.
మోడి. దే. వి. ౧. వ్రాఁత వైఖరి. ౨. బింకము.
మోడు. దే. వి. చూ. మోడు.
మోడుచు. దే. ప్రే. చూ. మొగుడుచు.
మోడుపడు. దే.క్రి. ౧. మొక్కయగు. ౨. ఖండితమగు.
మోడుపు. దే. వి. మొగుడుట. రూ. మోడ్పు.
మోద. దే. వి. తమలపాకులకట్ట.
మోదకము. త్స. వి. ౧. కుడుము. ౨. లడ్డు.
మోదము. త్స. వి.౧. సంతోషము. క్రి. ౨. మోదించు.
మోదిల్లు.
మోదిలు. } త్స. క్రి. సంతోషించు.
మోదించు.
మోదుగు.
మోదువు. } దే. వి. కింశుక వృక్షము.
మోపరి. దే. వి మోపుమోయువాఁడు.
మోపాటి. దే. వి. అపాయము.
మోపి. దే. వి. విధవ.
మోపిడు. దే. క్రి. విల్లు ఎక్కిడు.
మోపు. దే. ప్రే. ౧. మోయించు. ౨. ఆనించు. వి. ౧. గడ్డికట్ట. ౨. భారము. విణ. 3. అనేకము.
మోపుకాఁడు. దే. విణ. మోచువాఁడు.
మోపుదల. దే. వి. ౧. భారము. ౨. ఆరోపణము.
మోపెట్టు. దే. క్రి. ఎక్కిడు.
మోము. వై. వి. ముఖము.
మోమోటు.
మోమోటము. } దే. వి. మొగమోటము.
మోమోడు. దే. క్రి. సంకోచించు.
మోయు. దే. క్రి. (భారము) వహించు.
మోర. దే. వి. ౧. ఆవు మున్నగువాని పొడవగు మోము. ౨. (నింద యందు) మనుష్య ముఖము.
మోరటిల్లు. దే. క్రి. మోముమీఁదికెత్తు.

మోటుకత్తె. దే. విణ. మూర్ఖురాలు.
మోటుకేము. దే. వి. మూర్ఖత్వము.
మోటుడు / మోటుకుడు. వై. విణ. మూర్ఖుడు.
మోలము. దే. వి. చూ. మొలాము.
మోవి దే. వి. పెదవి.
మోవు. దే. వి. తాటిచెట్టులోనగు వానియందు పెట్టెడి ముడుత పీడని లేకయాకు మొలక.
మోస. వై. వి. ౧. ప్రమాదము. ౨. దొంగతనము.
మోసగాడు. దే. వి. వంచకుడు.
మోసపుచ్చు. దే. ప్రే. మోసముచేయు.
మోసపోవు. దే. క్రి. వంచింపబడు.
మోసము. వై. వి. ౧. ప్రమాదము. ౨. వంచన.
మోసల / మోసాల. వై. వి. మొగసాల.
మోసు. దే. వి. మొలక.
మోహన. త్స. వి. రాగవిశేషము.
మోహము. త్స. వి. ౧. వలపు. ౨. అజ్ఞానము.
మోహరము. దే. వి. మొగ్గరము.
మోహరి. దే. వి. మొహరి.
మోహరించు. దే. క్రి. వ్యూహముపన్ను.
మోహించు. త్స. క్రి. ౧. వలచు. ౨. అజ్ఞానము పొందు.
మోహిని. త్స. వి. ౧. స్త్రీదేవతా విశేషము. ౨. పిశాచస్త్రీవిశేషము.

## మౌ

మౌంజి. త్స. వి. ౧. ముంజి. ౨. ముంజదర్భ మొలత్రాడు.
మౌక్తికము. త్స. వి. ముత్యము.
మౌఢ్యము. త్స. వి. మూఢత్వము.
మౌనము. త్స. వి. మాటలాడకుండుట.
మౌని. త్స. వి. ముని.
మౌర్ఖ్యము. త్స. వి. మూర్ఖత్వము.
మౌర్వి. త్స. వి. అల్లెత్రాడు.
మౌల్యము. త్స. వి. మూలధనము.
మౌళి. త్స. వి. ౧. కిరీటము. ౨. సిగ. 3. కొప్పు.

## మ్రి

మ్రింగు. దే. క్రి. ద్రావు.
మ్రిందు. దే. క్రి. ౧. చచ్చు. ౨. చదియు.
మ్రిగ్గు. దే. క్రి. ౧. విహ్వాలించు. ౨. నష్టమగు.
మ్రిదిమము. త్స. వి. మృదుత్వము.

## మ్రా

మ్రాకు. దే. వి. మ్రాను.
మ్రాగన్ను. దే. వి. సోలినకన్ను.
మ్రాగన్నువడు. దే. క్రి. మ్రాగన్నగు.
మ్రాను. దే. వి. ౧. చెట్టు. ౨. వృక్షము.
మ్రానుదేఱు / మ్రానుపడు. దే. క్రి. స్తంభించు. రూ. మ్రానుపడు. వి. మ్రానుపాటు.

మిఱి

మిఱింగు. దే. క్రి. కబళించు.
మిఱింగుడు. దే. వి. కబళము.
మిఱింగుడుపడు. దే. క్రి. కబళితమగు.

ముఱి

ముఱిక్కు. దే. విణ. చెడిపోయినది.
ముఱిక్కుడి. దే. విణ. అల్పము.
ముఱిగ్గు. దే. వి. ఇల్లు అలికిన పిమ్మట బియ్యపుఁ బిండితో నేలకుచేయు నలంకరణము. రూ. ముగ్గు.
ముఱిచ్చిమి. దే. వి. దొంగతనము.
ముఱిచ్చిలి. దే. వి. ”
ముఱిచ్చిలించు. దే. క్రి. దొంగిలించు.
ముఱిచ్చిలు. దే. క్రి. ౧. దొంగిలించు. ౨. వంచించు.
ముఱిచ్చు. దే. వి. దొంగ.
ముఱిచ్చుగోర. దే. వి. పెద్దదొంగ.
ముఱిచ్చుప్రొద్దు. దే. వి. అర్ధరాత్రము.

మొఱి

మొఱిక్కు. దే. క్రి. నమస్కరించు. వి. నమస్కారము. రూ. మొక్కు. వి. మ్రొక్కుడు.
మొఱిక్కుబడి. దే. వి. దేవతాప్రార్థన. రూ. మొక్కుఁబడి.
మొఱిగ్గఁబడు. దే. క్రి. మొఱిగ్గు.
మొఱిగ్గరిల్లఁబడు. దే. క్రి. మోఁకటిల్లు.
మొఱిగ్గరిల్లు. దే. క్రి. మోఁకటిల్లు.

మోఱి

మోఱిఁగు. దే. క్రి. శబ్దించు. వి. మోఱిఁగుడు. రూ. మోఱివు.
మోఱిఁత. దే. వి. ధ్వని.
మోఱిడు దే. వి. ౧. మొండి. ౨. మొక్కు. ౩. స్థాణువు.
మోఱిడుపడు. దే. క్రి. మొక్కపోవు.
మోఱియు. దే. క్రి. ధ్వనించు.
మోఱిల. దే. వి. ఎదురు.

మ్లా

మ్లానము. త్స. విణ. వాడినది.
మ్లాని. త్స. వి. వాడుట.

మ్లే

మ్లేచ్ఛుఁడు. త్స. వి. ౧. పాపరతుఁడు. ౨. గోమాంస భక్షకుఁడై సమస్తాచారముల వదలి అవ్యక్తముగా మాటలాడుచు వర్తించువాఁడు.

# య

యంత. త్స. వి. తేరు నడపువాఁడు.
యంత్రణము. త్స. వి. బంధనము.
యంత్రము. త్స. వి. ౧. తిరుగలి. ౨. జంతికలుచేసెడి సాధనవిశేషము. 3. బీజాక్షర చక్రము. ౪. ఇనుముతోఁ జేయఁబడిన సాధన విశేషము.
యంత్రించు. త్స. క్రి. యంత్రణము చేయు.

యక్షకర్దమము. త్స. వి. కర్పూరము, అగురు, చందనము, కస్తూరి, తక్కోలము, కుంకుమపువ్వు, వీనితోఁ జేయఁబడిన కలపము.

యక్షిణి. త్స. వి. గతించిన సమాచారమును తెలిపెడు నొకవిద్య.

యక్షుఁడు. త్స. వి. కుబేరుఁడు.

యజనము. త్స. వి. యజ్ఞము చేయుట.

యజమానుఁడు. త్స. వి. గృహస్థుఁడు.

యజించు. త్స. క్రి. ౧. అర్చించు. ౨. యజ్ఞము చేయు.

యజుర్వేదము. త్స. వి. నాలుగు వేదములలో నొకటి.

యజ్ఞము. త్స. వి. యాగము.

యజ్ఞసూత్రము. త్స. వి. యజ్ఞోపవీతము.

యజ్ఞీయము. త్స. విశే. యజ్ఞమునకుఁ దగినది.

యజ్ఞోపవీతము. త్స. వి. జందెము.

యజ్వ. త్స. వి. విధ్యుక్తముగా యజ్ఞము చేసినవాఁడు.

యతనము. త్స. వి. ప్రయత్నము.

యతి. త్స. వి. ౧. పద్యవిశ్రమస్థానము. ౨. సన్న్యాసి. వ్యు. ఇంద్రియనియమము కలవాఁడు.

యత్నము. త్స. వి. ఉద్యోగము. క్రి. యత్నించు.

యథాక్రమము. త్స. అవ్య. క్రమమును అతిక్రమింపక.

యథాయథలు. త్స. అవ్య. చెల్లాచెదరు.

యథార్థము. త్స. విశే. సత్యము.

యథేచ్ఛము. త్స. అవ్య. ఇచ్చవచ్చినట్లు.

యద్భవిష్యుఁడు. త్స. విశే. స్వప్రయత్నము లేక అగునది అవు నని ఉండెడివాఁడు.

యమకము. త్స. వి. సమవర్ణములు గాధికముగా నమర్చి చెప్పిన యొక శబ్దాలంకారము.

యమము. త్స. వి. ౧. శరీరమునే సాధనముగాఁ గొనిన యొకయోగాంగము. ౨. హింసాదుల వలన ఉడుగుట.

యమళము. త్స. వి. జంట.

యమి. త్స. వి. ముని.

యమించు. త్స. క్రి. అణఁచు.

యముఁడు. త్స. వి. జముఁడు. వ్యు. దండించువాఁడు.

యమున త్స. వి. ౧. యమునానది. ౨. పార్వతి.

యవనము. త్స. వి. ఒక దేశము.

యవనిక. త్స. వి. ౧. తెరచీర. ౨. తెర.

యవసము. త్స. వి. తృణము.

యవాగువు. త్స. వి. జావ.

యవీయసి. త్స. వి. చెల్లెలు.

యశస్కరము. త్స. విశే. కీర్తిని కలుగఁజేయునది.

యశస్వి. త్స. విశే. కీర్తికలవాఁడు.
యశస్సు. త్స. వి. కీర్తి.

### యా

యాగము. త్స. వి. యజ్ఞము.
యాచకుఁడు. త్స. వి. బిచ్చకాఁడు.
యాచన. త్స. వి. భిక్ష.
యాచించు. త్స. క్రి. అడుగు.
యానితకము. త్స. వి. ఎరవు.
యాజకుఁడు. త్స. వి. యజ్ఞమును చేయించువాఁడు.
యాజనము. త్స. వి. యజ్ఞమును చేయించుట.
యాజ్ఞికుఁడు. త్స. ౧. యజ్ఞమునడపు వాఁడు. ౨. పురోహితుఁడు.
యాత. త్స. వి. తోడికోడలు.
యాతన. త్స. వి. తీవ్రవేదన.
యాతువు. త్స. వి. రాక్షసుఁడు.
యాతుధానుఁడు. త్స. వి. ౧. రాక్షసుఁడు. ౨. నిరృతి.
యాత్ర. త్స. వి. ౧. పుణ్యక్షేత్రములకుఁ బోవుట. ౨. కాలముకడపుట.
యాదఃపతి. త్స. వి. సముద్రుఁడు.
యాదసాంపతి. త్స. వి. ,,
యాదృచ్ఛికము. త్స. విశే. యదృచ్ఛగాఁ గలిగినది.
యాదోనాథుఁడు. త్స. వి. సముద్రుఁడు.
యానపాత్రము. త్స. వి. జను లెక్కి పోయెడియోడ.
యానము. త్స. వి. దండెత్తిపోవుట. వ్యు. స్వశక్త్యాధిక్యము కలప్పుడు గాని, పరునికి వ్యసనము గలప్పుడు గాని, పరునిగెలుఁవవలెనను నిచ్ఛచేత కదలిపోవుట.
యామము. త్స. వి. ౧. శరీరమునే సాధనముగా గలిగినయొక యోగాంగము. ౨. జాము. వ్యు. స్థాయిగాక పోవునది.
యామికుఁడు. త్స. వి. తలారి.
యామిని. త్స. వి. రాత్రి. వ్యు. యామములు కలిగినది.
యాయావరము. త్స. వి. ఆయవారము.
యావము. త్స. వి. లత్తుక.

### యు

యుక్తము. త్స. విశే. ౧. తగినది. ౨. కూడుకొనినది.
యుక్తి. త్స. వి. ౧. ఉపాయము. ౨. న్యాయము.
యుక్తుఁడు. త్స. విశే. తగినవాఁడు.
యుగంధరము. త్స. వి. బండి లోనగువాని మొగ.
యుగము. త్స. వి. ౧. కృతయుగాది. ౨. జత.
యుగళము. } త్స. వి. జత.
యుగళి. }
యుగాంతము. త్స. వి. ౧. ప్రళయము. ౨. మహాప్రళయము.
యుగ్మము. త్స. వి. జత.

యుగ్యము. త్స. వి. కాడిమోసెడిఎద్దు.
యుతము. త్స. విశే. కూడుకొనినది.
యుద్ధము త్స. వి. కయ్యము.
యువ. త్స. వి. ఒక సంవత్సరము. విశే. ప్రాయపువాఁడు.
యువతి. త్స. వి. ప్రాయముగలయాఁడుది.
యువరాజు. త్స. వి. ౧. చిన్నరాజు. ౨. కర్ణుఁడు.

## యూ

యూథము. త్స. వి. సమూహము.
యూథిక. త్స. వి. అడవిమొల్ల.
యూపము. త్స. వి. యజ్ఞములో పశువును కట్టివేయుటకు నాటిన పైపట్టలేని పాలకొయ్య.

## యొ

యొక్క. దే. అవ. షష్ఠియందు వచ్చు ప్రత్యయము.

## యో

యోక్త్ర. త్స. వి. యోగకర్త.
యోగపట్టము. యోగపట్టె. త్స. వి. యోగులు జందెమువలె వేసికొనెడిపట్టు లోనగు వానితోఁజేసినపట్టె.
యోగము. త్స. వి. ౧. ధ్యానము. ౨. కూడిక. ౩. కూర్పు.
యోగి. త్స. వి. యోగాభ్యాసముచేసెడి పురుషుఁడు.
యోగిని. త్స. వి. యోగాభ్యాసము చేయునాఁడుది.
యోగ్యము. త్స. విశే. ౧. నేర్పుగలది. ౨. శక్తిగలది.
యోజనము త్స. వి. ౧. ఆమడ. ౨. కూర్పు.
యోజన. త్స. వి. ,,
యోజించు. త్స. క్రి. కూర్చు.
యోధ. యోద్ధ. త్స. వి. ౧. బంటు. ౨. యుద్ధము చేయువాఁడు. చూ. యోధుఁడు.
యోని. త్స. వి. ౧. ఆఁడుగుఱి. ౨. కారణము. ౩. గని.
యోష. త్స. వి. ఆఁడుది.

## యౌ

యౌవతము. త్స. వి. యువతీ సమూహము.
యౌవనము. త్స. వి. మంచిప్రాయము.
యౌవరాజ్యము. త్స. వి. యువరాజు ప్రభుత్వము.

# ర

రంగఁడు. త్స. వి. శ్రీరంగనాథుఁడు.
రంగము. దే. వి. సోదె. త్స. వి. ౧. యుద్ధభూమి. ౨. నాట్యస్థానము.

రంగరి. దే. వి. రంగువేయువాఁడు.

రంగరించు. / రంగలించు. దే. క్రి. ద్రవము లేని వస్తువుతో ద్రవవస్తువును చేర్చి చూపుడు వ్రేలికొనతో మర్దించు.

రంగవల్లి. త్స. వి. ముగ్గు.

రంగాజీవుఁడు. త్స. విశ. చిత్తరువు వ్రాయువాఁడు.

రంగు. వై. వి. ౧. కాంతి. ౨. వర్ణము.

రంగుగా. వై. అవ్య. సొంపుగా.

రంజకుఁడు. త్స. విశ. ౧. రంగువేయువాఁడు. ౨. రంజించువాఁడు.

రంజనము. త్స. వి. రంజించుట.

రంజించు. త్స. ప్రే. రంజిలఁజేయు.

రంజిలు. / రంజిల్లు. త్స. క్రి. ౧. అనురాగము పొందు. ౨. ఎఱ్ఱనగు.

రంజకము. దే. వి. ౧. తుపాకిచెవిని కాల్చుటకు పెట్టెడిమందు. ౨. కోపము.

రండ. త్స. వి. విధవ.

రంత. త్స. విశ. రమించువాఁడు.

రంతు. దే. వి. ౧. రతి. ౨. క్రీడ.

రంతుకాఁడు. దే. విశ. క్రీడాపరుఁడు.

రంధ్రము. త్స. వి. ౧. నింద. ౨. బెజ్జము. 3. సందు.

రంపెలాఁడి. దే. విశ. రాక్షసకృత్యము గల ఆఁడుది.

రంభ. త్స. వి. ౧. అరఁటి. ౨. నలకూబరునిభార్య.

రకము. దే. వి. దినుసు. విశ. సుంకరము.

రక్కసి. వై. వి. ౧. రాక్షసి. ౨. రాక్షసుఁడు.

రక్కసీఁడు. / రక్కసుఁడు. వై. వి. రాక్షసుఁడు.

రక్కెస. వై. వి. ౧. రాక్షస స్త్రీ. విశ. అయుక్తము.

రక్కొను. దే. క్రి. ౧. కలుగు. ౨. లేఁకొను.

రక్తము. త్స. వి. ౧. నెత్తురు. ౨. కుంకుము. విశ. ౧. ఎఱ్ఱనిది. ౨. అనురాగము కలది.

రక్తసంధ్యకము. త్స. వి. కలువ.

రక్తాక్షి. త్స. వి. ఒకసంవత్సరము.

రక్తి. త్స. వి. అనురాగము.

రక్తిమ. / రక్తిమము. త్స. వి. రక్తవర్ణము.

రక్ష. త్స. వి. ౧. రక్షణమునకై బిడ్డల మొలను కట్టెడిమూలిక లోనగునది. ౨. రక్షణము.

రక్షకుఁడు. త్స. విశ. రక్షించువాఁడు.

రక్షణము. త్స. వి. కాపు. క్రి. రక్షించు.

రక్షస్సు. త్స. వి. రాక్షసుఁడు.

రక్షి. త్స. విశ. రక్షించువాఁడు.

రగులు. దే. క్రి. మంటయెత్తు.

రగులుచు. దే. ప్రే. మంటఁ గలుగఁ జేయు.

రచన. } తత్స. వి. నిర్మాణము.
రచనము.

రచించు తత్స. క్రి. నిర్మించు. రూ. రచియించు.

రచ్చ. దే. వి. ౧. మండపము. ౨. గోష్ఠి. ౩. రాజవీధి. ౪. సందడి. ౫. కలహము. ౬. సభ.

రచ్చకొట్టము. వై. వి. రచ్చచేయు నావిడి.

రచ్చేపట్టు. దే వి. "

రచ్చబండ. దే. వి. రచ్చచేయుకాలిమడు పదుగురు కూర్చుండెడిబల్ల.

రజకుడు. తత్స. వి. చాకలవాడు.

రజతము. తత్స. వి. ౧. వెండి. విశ. ౨. తెల్లని.

రజని. తత్స. వి. రాత్రి.

రజనీముఖము. తత్స. వి. ప్రదోషము.

రజస్వల. తత్స. వి. ముట్టుది.

రజ్జువు తత్స. వి. త్రాడు.

రజ్జ. దే. కి. ప్రేలు. వి. వ్యర్థభాషణము.

రజ్జులాడి. దే. వి. వ్యర్థభాషణురాలు.

రజ్జులాడు. దే. విశ. వ్యర్థభాషణుడు.

రటనము. తత్స. వి. మ్రోయడు.

రట్టడి. దే. విశ. నింద్యము.

రట్టు. దే. వి. నింద. వై. వి. ఉపద్రవము.

రడ్డి. దే. వి. రెడ్డి.

రణము. తత్స. వి. ౧. యుద్ధము. ౨. మ్రోత.

రతనము. వై. వి. మణి.

రతము. తత్స. విశ. ఆసక్తము.

రతి. తత్స. వి. ౧. అనురాగము. ౨. మన్మథునిభార్య. దే. వి. ౧. పచ్చలతూనిక యందొక యెత్తు. ౨. మణుగునందు ఇరువదైదవ భాగము.

రతిపతి. తత్స. వి. మన్మథుడు.

రత్నగర్భ. తత్స. వి. భూమి.

రత్నము. తత్స. ౧. వి. మణి. ౨. శ్రేష్ఠమైనది.

రత్నసానువు. తత్స. వి. మేరువు.

రత్నాకరము. తత్స. వి. సముద్రము.

రథకారుడు. తత్స. వి. రథము చేయువాడు.

రథము. తత్స. వి. ౧. తేరు. ౨. శరీరము.

రథాంగము. తత్స. వి. ౧. చక్రవాకము. ౨. రథచక్రము.

రథి. తత్స. వి. రథమునెక్కి రణము సలుపువాడు.

రథికుడు. తత్స. వి. రథమునెక్కి యుద్ధము చేయువాడు.

రథ్య. తత్స. వి. ౧. మార్గము. ౨. రాజవీధి.

రదచ్ఛదము. తత్స. వి. పెదవి.

రదనము. } తత్స. వి. పల్లు.
రదము.

రద్ది. దే. వి. ౧. గొప్పధ్వని. ౨. అల్లరి.

రద్దు. దే. వి. ౧. అల్లరి. ౨. కొట్టివేత.

రప్పించు. దే. ప్రే. రాజేయు.

రభసము. త్స. వి. ౧. సంతోషము. ౨. వడి.
రమ. త్స. వి. లక్ష్మి.
రమణ. వై. వి. ౧. ప్రీతి. ౨. ఒప్పిదము. ౩. విధము.
రమణము. త్స. విణ. మనోజ్ఞము.
రమణి. త్స. వి. ౧. ఆఁడుది. ౨. క్రీడించునట్టి యాఁడుది.
రమణించు. త్స. క్రి. ఒప్పిదమగు.
రమణీయము. త్స. వి. ఒప్పిదమైనది.
రమణుఁడు. త్స. వి. మగఁడు. విణ. మనోజ్ఞుఁడు.
రమరమి. / రమారమి. } దే. అవ్య. ఇంచుమించు.
రమించు. త్స. క్రి. క్రీడించు.
రమ్యము. త్స. విణ. ఒప్పిదమైనది.
రయము. త్స. వి. ౧. వేగము. ౨. ప్రవాహము.
రవ. వై. వి. ౧. తునక. ౨. అణువు. ౩. వజ్రము. విణ. ౪. సన్నము.
రవణము. దే. వి. భూషణము.
రవణించు. దే. క్రి. రమణించు.
రవము. త్స. వి. ౧. కంఠధ్వని. ౨. ధ్వని.
రవరవ. దే. వి. ౧. కాంతి విశేషము. ౨. స్పర్థ. ౩. ఒకానొకరకము.
రవళి. వై. వి. ధ్వని. రూ. రవలి. రవాళి.
రవళించు. వై. క్రి. ౧. ధ్వనించు. ౨. చాటించు. రూ. రవాళించు.
రవి. త్స. వి. సూర్యుఁడు.
రశన. త్స. వి. మొలనూలు.
రశ్మి. త్స. వి. ౧. ఱెప్ప. ౨. కాంతి.
రస. త్స. వి. ౧. నాలుక. ౨. భూమి.
రసకర్పూరము త్స. వి. కర్పూరరసము.
రసజ్ఞ. త్స. వి. నాలుక.
రసజ్ఞుఁడు. త్స. విణ. ౧. రసికుఁడు. వి. ౨. పండితుఁడు.
రసము. త్స. వి. ౧. జలము. ౨. పాదరసము. ౩. శృంగారాది. (ఇవి తొమ్మిది:-- ౧. శృంగారము. ౨. హాస్యము. ౩. కరుణము. ౪. వీరము. ౫. రౌద్రము. ౬. భయానకము. ౭. బీభత్సము. ౮. అద్భుతము. ౯. శాంతము. ౪ కషాయాదిఁ యివియాఱు. ౧. కషాయము. ౨. మధురము. ౩. లవణము. ౪. కటువు. ౫. తిక్తము. ౬. పులుసు.)
రసవాదము. త్స. వి. పాదరసమును కట్టి బంగారు చేసెడి విద్య.
రసాయనము. త్స. వి. ౧. ముసలితనమును, రోగములను, పోఁగొట్టెడి యౌషధవిశేషము. ౨. మజ్జిగ.
రసాలము. త్స. వి. మామిడి.
రసి. దే. వి. పుంటిచీము.
రసిక. త్స. విణ. రసికురాలు. దే. వి. పుంటిచీము.
రసికుఁడు. త్స. వి. రసము నెఱిఁగినవాఁడు.

రసితము. త్స. వి. మేఘగర్జనము.
రస్తు. దే. వి. వస్తుసంభారము.
రహాటము. త్స. వి. రాట్నము.
రహదారి. దే. వి. సామాన్యముగా నెల్లరును బోదగిన త్రోవ.
రహస్యము. త్స. వి. ఏకాంతము. విణ. దాచదగినది.
రహి. దే. వి. ౧ ఆసక్తి. ౨. సంతోషము.
రహించు. దే. క్రి. ౧. వర్ధిల్లు. ౨. ఒప్పు.

రా

రాజు. దే. క్రి. నిప్పంటుకొను.
రాబట్టు. దే. క్రి. ౧. ఇచ్చినదానిని తిరిగి తీయు. ౨. కూర్చు.
రాక. దే. వి. ఆగమనము. త్స. వి. పున్నమ.
రాకడ. దే. వి. రాక.
రాకాసి. వై. వి. రాక్షసి.
రాకొట్టు. దే. క్రి. ౧. రారా పోరా యని ఏకవచనాంతముగా నుచ్చరించు. ౨. తిరస్కరించు.
రాక్షస. త్స. వి. ఒకానొక సంవత్సరము.
రాక్షసి. త్స. వి. రక్కసి.
రాక్షసుడు. త్స. వి. ౧. రక్కసుడు. ౨. నైరృతుడు.
రాగము. త్స. వి. ౧. అనురాగము. ౨. రంగు.
రాగి. దే. వి. ౧. తవిదపైరు. వై. వి. తామ్రము. త్స. విణ. అనురాగము గలవాడు.
రాగించు. త్స. క్రి. రాగిల్లు.
రాగిలు. } త్స. క్రి. రంజిల్లు.
రాగిల్లు. }
రాచ. వై. విణ. రాజసంబంధి.
రాచపుండు. దే. వి. మహావ్రణము.
రాచవాడు. వై. వి. క్షత్త్రియుడు.
రాచు. దే. క్రి. ౧. ఒరయు. ౨. చెఱచు. 3. రుద్దు.
రాజధాని. త్స. వి. రాజ్యమునకు ముఖ్యపట్టణము.
రాజమార్గము. త్స. వి. రథములు మున్నగునవి పోదగిన పెద్దత్రోవ.
రాజరాజు. త్స. వి. ౧. చక్రవర్తి. ౨. కుబేరుడు.
రాజసము. త్స. విణ. రజోగుణమువలన కలిగినది.
రాజసూయము. త్స. వి. ఒకరాజు తక్కినరాజులను జయించి చేసెడి యజ్ఞము.
రాజహంస. త్స. వి. ౧. ఎఱ్ఱనిముక్కు కాళ్లు గల హంస. ౨. ధూమ్రవర్ణము గలముక్కు కాళ్లు గల హంస. 3. రాజశ్రేష్ఠుడు.
రాజి. త్స. వి. ౧. రేఖ. ౨. పఙ్క్తి.
రాజితము. త్స. విణ. ప్రకాశితము.
రాజిల్లు. త్స. క్రి. ప్రకాశించు.

రాజీవము. త్స. వి. కమలము.

రాజ్ఞి. త్స. వి. రాజుభార్య.

రాజ్యము. త్స. వి. దొరతనమునకు లోఁబడిన దేశము.

రాజు. త్స. వి. ౧. చంద్రుఁడు. ౨. ఇంద్రుఁడు.

రాటనము. దే. వి. రాట్నము.

రాటు. వై. వి. ౧. ఉపద్రవము. ౨. జనసమ్మర్దము.

రాటుపడు. వై. క్రి. ఉపద్రవపడు.

రాట్టు. త్స. వి. రాజు.

రాట్నము. వై. వి. నూలువడికెడి యంత్రము.

రాణ. వై. వి. ఒప్పిదము.

రాణి. వై. వి. ౧. భార్య. ౨. రాజుభార్య.

రాణించు. వై. క్రి. ఒప్పు.

రాణివాసము. వై. వి. ౧. అంతఃపురము. ౨. అంతఃపురస్త్రీ.

రాణువ. దే.వి. ౧. పరివారము. ౨. సేన.

రాతిరి. వై. వి. రాత్రి.

రాత్రించరుఁడు. త్స. విణ. రాక్షసుఁడు.

రాధ. త్స. వి. ౧. ఒకగొల్లది. ౨. కర్ణుని పెంపుడు తల్లి.

రాద్ధాంతము. త్స. వి. సిద్ధాంతము.

రాపడు. దే. క్రి. ౧. రాయియగు. ౨. స్తంభించు.

రాపాడు. దే. వి. ౧. సంకటపఱచు. ౨. రాయు.

రాపిడి. దే. వి. ౧. సంకటము. ౨. ఒరయిక.

రాపు. దే. వి. ౧. రాయిడి. ౨. సంకటము.

రాపుడు. దే. వి. రాచుట.

రాపొడి. దే. వి. ఆకుతాయితో రాచిన పొడి.

రాబందు. దే. వి. రాప్రలుఁగు.

రాబడి. దే. వి. ౧. ఆయము. ౨. వచ్చుబడి.

రామ. త్స. వి. ౧. రమించునట్టి యాఁడుది. ౨. ఆఁడుది.

రామఠము. త్స. వి. ఇంగువ.

రామబాణము. త్స. వి. తాటాకుపుస్తకములను తొలుచు పురుగు.

రాముఁడు. త్స. వి. రమింపఁజేయువాఁడు.

రామునివాఁడి. దే. వి. అసంఖ్యము.

రాయంచ. వై. వి. రాజహంస.

రాయఁడు. వై. వి. రాజు.

రాయబారము. త్స. వి. దౌత్యము.

రాయబారి. త్స. వి. రాయబారము చేయువాఁడు.

రాయసము. దే. వి. కార్యదర్శిపని.

రాయి. దే. వి. శిల.

రాయిడి. దే. వి. ౧. ఒరయిక. ౨. ఉపద్రవము.

రాయిడించు. దే. క్రి. అల్లరిచేయు.

రాయిడికత్తె. దే. విణ. ఉపద్రవము చేయునది.

రాయిడికాఁడు. దే. విశే. ఉపద్రవము చేయువాఁడు.

రాయు. దే. క్రి. ౧. (గొంతు) కఱచు. ౨. ఒరయు.

రారాజు. వై. వి. చూ. రాజరాజు.

రాలఁగొట్టు. దే. ప్రే. రాలుచు.

రాలు. దే. క్రి. పడు. వి. రాలుపు.

రాలుగాయ. } దే. విశే. ౧. తుంట.
రాలుడుగాయ. } ౨. గురుజన శిక్ష లేక ఱఁగినవాఁడు.

రాలుచు. దే. ప్రే. రాలఁజేయు. రూ. రాల్చు.

రాలుపడు. దే. క్రి. (ఎలుఁగు) కంపించు.

రాలుపాటు. దే. వి. రాలుపడుట.

రాలుపు. దే. వి. రాలుట.

రావడు. దే. క్రి. ౧. రాయిడగు. ౨. జడుఁడగు.

రావము. త్స. వి. ధ్వని.

రావి. దే. వి. అశ్వత్థము.

రావించు. దే. క్రి. రప్పించు.

రావిరేక. దే. వి. బిడ్డలకుకొండెయొద్దఁ గట్టెడు రావియాకువంటి పతకము.

రావు. వై. వి. రాజు.

రావుతు. } వై. వి. ౧. రౌతు. ౨.
రావుత్తు. } గుఱ్ఱము నెక్కువాఁడు.

రాశి. త్స. వి. ౧. మేషాది. ౨. ప్రోవు.

రాష్ట్రము. త్స. వి. దేశము.

రాష్ట్రియుఁడు. త్స. విశే. రాష్ట్రమునఁ బుట్టినవాఁడు.

రాష్ట్రియుఁడు. త్స. విశే. రాష్ట్రమునఁ బుట్టువాఁడు.

రాసభము. త్స. వి. గాడిద.

రాసము. త్స. వి. రాసక్రీడ.

రాహిత్యము. త్స. వి. లేమి.

రాహుతు. } వై. వి. గుఱ్ఱపురౌతు.
రాహుత్తుఁడు. }

రాహువు. త్స. వి. ఒక గ్రహము.

## రి

రింగు. దే. వి. ౧. ఱెక్కలగాలి వచ్చుడు. ౨. బ. వస్త్రపుఁగుచ్చె.

రింఛోళి. త్స. వి. సమూహము.

రింబ. దే. వి. చూ. రిమ్మ.

రిక్క. వై. వి. నక్షత్రము.

రిక్తము. త్స. విశే. ౧. వట్టి. వి. ౨. అడవి.

రిత్త. వై. విశే. ౧. కల్ల. ౨. వట్టి. 3. ఊరక.

రిత్తపోవు. వై. క్రి. వ్యర్థమగు. ప్రే. రిత్తపుచ్చు.

రిమ్మ. దే. వి. పిచ్చి. రూ. రింబ.

రిరంస. త్స. వి. రమింపనిచ్ఛ.

రివటు. } దే. వి. రెమ్మ.
రివ్వ. }

రిష్టము. త్స. వి. ౧. అశుభము. ౨ అభావము.

## రీ

రీణము. త్స. విశే. కాఱినది.

రీతి. త్స. వి. ౧. హద్దు. ౨. విధము.

రు

రుండము. త్స. వి. తెగినతల.
రుంద్రము. త్స. విణ. విరివియైనది.
రుక్కు. త్స. వి. సూర్యకిరణము.
రుక్మము. త్స. వి. ౧. లోహము. ౨. బంగారు.
రుగ్ణము. త్స. విణ. రోగము గలది.
రుచి. త్స. వి. ౧. కాంతి. ౨. సూర్యకిరణము. ౩. చవి.
రుచించు. త్స. క్రి. ఇష్టమగు.
రుచిరము. } త్స. విణ. మనోజ్ఞము.
రుచ్యము. }
రుజ. త్స. వి. రోగము.
రుజువు. దే. వి. సాక్ష్యము.
రుటము. దే. విణ. ౧. రూఢము. ౨. దృఢము.
రుట్టు. త్స. వి. కోపము.
రుతము. త్స. వి. ధ్వని.
రుతి. త్స. వి. ధ్వని.
రుదితము. త్స. వి. రోదనము.
రుదురక్క. } దే. వి. రుద్రాక్ష.
రుదురాక. }
రుద్దు. దే. క్రి. తోము. వి. రుద్దుడు.
రుద్రభూమి. త్స. వి. శ్మశానము.
రుద్రాణి. త్స. వి. పార్వతి.
రుద్రాక్షము. త్స. వి. రుద్రాక్షపూస.
రుద్రుడు. త్స. వి. శివుడు.
రుధిరము. త్స. వి. ౧. చెందిరము. ౨. నెత్తురు.
రుధిరోద్గారి. త్స. వి. ఒకానొక సంవత్సరము.
రుద్ధము. త్స. విణ. అడ్డగింపబడినది.
రుబ్బు. దే. క్రి. ౧. నానవైచిన బియ్యము లోనగువానిని అటులోబోసి రుబ్బుగుండుతో మెదుపు. ౨. (తిలను) రుద్దు.
రుబ్బుగుండు. దే. వి. రుబ్బుడు పాత్రము.
రుమ. త్స. వి. సుగ్రీవుని భార్య.
రుమాలు. } దే. వి. చేతిగుడ్డ.
రుమాలువు. }
రురువు. త్స. వి. నల్లచారలదుప్పి.
రువాణము. దే. వి. కాంతి.
రువారము. దే. వి. విలాస విశేషము.
రువ్వ. దే. వి. దమ్మిడి.
రువ్వు. దే. క్రి. ౧. విసరివైచు. వి. ౨. వల్లె.
రుషు. త్స. వి. కోపము.
రుసి. వై. వి. ఋషి.

రూ

రూక. దే. వి. ౧. చిన్నమెత్తు వెండి బంగారుల నాణెము. ౨. ధనము.
రూక్షము. త్స. వి. కఠినమైనది.
రూఢి. వై. వి. రూఢి.
రూఢము. త్స. వి. ౧. ప్రసిద్ధికెక్కినది. ౨. నిశ్చయింపబడినది.
రూఢి. త్స. వి. ౧. ప్రసిద్ధి. ౨. నిశ్చయము.

రూపకము. త్స. వి. ౧. రూపము. ౨. ఒక యర్థాలంకారము 3. నాటకము.

రూపగు. దే. క్రి. వర్ధిల్లు.

రూపడఁగు దే. క్రి. చచ్చు. ప్రే. రూపడఁచు.

రూపము. త్స. వి. ౧. సౌందర్యము. ౨. స్వభావము.

రూపరి. దే. విశ. సౌందర్యవంతుఁడు.

రూపఱు. దే. క్రి. ౧. చచ్చు. ౨. అంగహీనమగు.

రూపసి. దే. విశ. రూపరి.

రూపాజీవ. దే. వి. వేశ్య.

రూపాయి. వై. వి. ఒక వెండి నాణెము.

రూపించు. త్స. వి. నిరూపించు.

రూపు. వై. వి. ౧. చక్కఁదనము. ౨. రీతి. 3. పూజించు ఆభరణము.

రూపుమాపు. దే. ప్రే. రూపుమాయఁజేయు.

రూపుమాయు. } దే. క్రి. నశించు.
రూపుసెడు. }

రూపురూపున. దే. అవ్య సమ్ముఖమున.

రూప్యము. త్స. వి. ౧. రూపాయి. ౨. వెండి. విశ. 3. సుందరము.

రె

రెండు. దే. వి. ౧. భేదము. స. ౨. ద్వయము

రెంబ. దే వి. చూ. రెమ్మ.

రెక్కొను. దే. క్రి. ౧. తేఱుకొను ౨. వర్ధిల్లు.

రెక్కొలు. దే. వి. రెక్కొనుట.

రెట్ట. దే. వి. ౧. పక్షిమలము. ౨. భుజము.

రెట్టి. దే. వి. ౧. మణుఁగు. ౨. ద్విగుణము.

రెట్టించు. దే. క్రి. ద్విగుణించు.

రెడి. దే. వి. రెడ్డి.

రెడ్డి. దే. వి. ఒక కాపుకులమువాఁడు.

రెడ్డిగము. దే. వి. ఒక విధమైన కూర్చుండుట. (ముడుచుకొన్న ఒక కాలిని తొడమీఁద మోఁకాలు మీఁదుగా ముడుచుకొన్న మరియొక కాలిపాదముతోడి ఆ కాలిని వీఁపును అంగవస్త్రముతో ఈడ్చి కట్టుకొని కూర్చుండుట.)

రెపరెప. దే. వి. ౧. గాలి వీచునప్పుడయ్యెడి ధ్వన్యనుకరణము. ౨. నిష్ఫలమంటమోఁత.

రెపరెపమను. దే. క్రి. అఁకలెత్తు.

రెప్ప. దే. వి. చూ. ఱెప్ప.

రెబ్బ. } దే. వి. ఉపశాఖ. రూ. రెంబ.
రెమ్మ. }

రెమ్ము. దే. క్రి. ఒడిచిత్తిగుచు.

రెయి. వై. వి. రేయి.

రెల్ల. దే. వి. మెతుకు.

రే

రేఁగు. దే. క్రి. ౧. విజృంభించు. ౨. ఉద్రేకించు. 3. ఎగయు. ౪. వి. బదరి.
రేఁచు. } దే. ప్రే. రేఁగఁజేయు.
రేఁపు. }
రేక. దే. వి. ౧. గీఱ. ౨. తాటాకు మట్టతోఁ గట్టినదొప్ప. 3. జాబు. ౪. పజ్క్తి.
రేకు. దే. వి. చూ. ఱేకు.
రేకుమడఁచు. దే. క్రి. అణఁగఁద్రొక్కు.
రేకెత్తు దే. క్రి. వర్ధిల్లు.
రేఖ. త్స. వి. ౧. గీఱ. ౨. కాలు సేతులలోని గీఱ.
రేగడ. } దే. వి. బంకమన్ను.
రేగడి. }
రేచకము. త్స. వి. ఊపిరివిడుచుట.
రేచీఁకటి. దే. వి. రాత్రికన్నులు తెలియమి.
రేణము. దే. వి. దూడపేఁడ.
రేణుక. త్స. వి. జమదగ్ని పెండ్లాము.
రేణువు. త్స. వి. దుమ్ము.
రేతస్సు. త్స. వి. ౧. పాదరసము. ౨. ఇంద్రియము.
రేదొర. దే. వి. చంద్రుఁడు.
రేదిమ్మరి. దే. వి. రాక్షసుఁడు.
రేదిమ్మరీఁడు. దే. వి. ,,
రేను దే. వి. రేఁగు.
రేపకడ. దే. వి. ప్రాతఃకాలము.
రేపాడి. దే. వి. ,,
రేపు. దే. వి. ౧. వెనుకటిదినము. ౨. ప్రాతఃకాలము.
రేఫము. త్స. వి. "ర" అను నక్షరము.
రేయి. వై. వి. రాత్రి. రూ. రే, రేయి.
రేయెండ. దే. వి. వెన్నెల.
రేవఁడు. దే. వి. చాకలవాఁడు.
రేవంతుఁడు. త్స. వి. అశ్వశిక్షకుఁడు.
రేవగలు. దే. వి. బ. రాత్రింబవసములు.
రేవతి. త్స. వి. ఒకానొక నక్షత్రము.
రేవు. దే. వి. ౧. సముద్ర తీరమునందు ఓడలు నిలుచుతావు. ౨. కాలువ, నది మొదలగు తావులలో మనుష్యులు రాకపోకలు చేయుటకు ఏర్పడినదారి. 3. క్షౌరము చేసిన భాగము. (రేవులుపెట్టి గొఱుగును)
రేవెలుఁగు. దే. వి. చంద్రుఁడు.

రై

రైతు. దే. వి. సేద్యము చేయుకాఁపు.

రొ

రొండి. దే. వి. నడుముయొక్కపార్శ్వభాగము.
రొంప. దే. వి. ౧. పడిసెము. ౨. పీనసరోగము.
రొంపి. దే. వి. అడుసు.
రొంపిదుక్కి. దే. వి. నీళ్ళుగట్టి అడుసులో దున్నుట.

రొంపిమాను. దే. వి. రొంపిలోదున్నిన పిమ్మట మిట్టపల్లములు సరిపఱచుట కుపయోగపడెడి మ్రాను.

రొక్కము. వై. వి. ౧. చేతవెల. ౨. ధనము.

రొక్కారొక్కములు. దే. విశే. బహువిధములు గలవి.

రొట్టియ. } దే. వి. భక్ష్యవిశేషము.
రొట్టె. }

రొద. దే. వి. ౧. ధ్వని. ౨. పెద్ద సందడి.

రొప్పు. దే. క్రి. ౧. గాండ్రించు. ౨. కూయు.

రొమ్ము. దే. వి. చూ. ఱొమ్ము.

రొయ్య. దే. వి. ఒకవిధ మగుచేప.

రొల్లు. దే. క్రి. ప్రలాపించు.

రొల్లుడు. దే. వి. ప్రలాపము.

రో

రోఁకటిబండ. దే. వి. ౧. ఒక పురుగు. ౨. పొన్నులేని చిన్నరోకలి.

రోఁకలి. దే. వి. ముసలము.

రోఁజు. దే. క్రి. ౧. నిట్టూర్పువిడుచు. వి. ౨. రోఁజుడు.

రోఁత. దే. వి. ౧. ఏవము. ౨. బ. తిట్లు.

రోఁతగించు. దే. క్రి. రోఁతపడు.

రోకు. దే. వి. వికాసము.

రోగము. త్స. వి. వ్యాధి.

రోగి. త్స. విశే. వ్యాధికలవాఁడు.

రోచిష్ణువు. త్స. విశే. ప్రకాశించువాఁడు.

రోచిస్సు. త్స. వి. కిరణము.

రోటు. దే. వి. ఈఁద.

రోటుపోవు. దే. క్రి. ఈఁదఁబోవు.

రోదనము. త్స. వి. ౧. ఏడ్పు. ౨. కన్నీరు.

రోదసి. త్స. వి. ౧. మన్ను. ౨. మిన్ను. ౩. మన్నుమిన్ను.

రోదస్సు. త్స. వి. ,,

రోదించు. త్స. క్రి. ఏడ్చు.

రోధస్సు. త్స. వి. తీరము.

రోధించు. త్స. క్రి. అడ్డగించు.

రోపణము. త్స. వి. మోపుట.

రోపము. త్స. వి. బాణము.

రోమంథము. త్స. వి. నెమరు.

రోమము. త్స. వి. ముఖము శిరము తక్కఁ దక్కిన దేహమునందుఁగల వెండ్రుక.

రోమాంచము. త్స. వి. గగుర్పాటు.

రోమావళి. త్స. వి. నూఁగారు.

రోయి. వై. ౧. పందెము. ౨. కుదువ.

రోయు. దే. క్రి. ౧ రోఁతపడు. ౨. వెదకు. ౩. నిందించు.

రోలంబము. త్స. వి. తుమ్మెద.

రోవెలఁది. త్స. వి. వేశ్య.

రోషము. త్స. వి. ౧ కోపము. క్రి. ౨ రోషించు. వై. వి. ౩. రోషము. క్రి. ౪. లోసించు.

రోసము. దే. వి. కోపము.
రోసించు. దే. క్రి. కోపించు.
రోహణము. త్స. వి. ఎక్కుట.
రోహిణి. త్స.వి. ఒకానొక నక్షత్రము.
రోహితము. త్స. విణ. ఎఱ్ఱనిది.

## రౌ

రౌతు. వై.వి. గుఱ్ఱము నెక్కువాఁడు.
రౌద్రము. త్స. వి. ౧. ఎండ. ౨. నవరసములలో నొకటి. విణ. 3. భయంకరము.
రౌద్రి. త్స. వి. ఒకానొక సంవత్సరము.
రౌప్యము. త్స. వి. రూపాయి.
రౌరవము. త్స. వి. నరకవిశేషము.
రౌలు. దే. క్రి. రగులు. ప్రే. రౌలుచు. రౌల్చు.
రౌహిణేయుఁడు. త్స. వి. ౧. బుధుఁడు. వ్యు. రోహిణీదేవి కొడుకు. ౨. బలరాముఁడు. వ్యు. రోహిణి కొడుకు.

## ఱ

ఱంకాట. దే. వి. జారత్వముచేయుట.
ఱంకాడు. దే. క్రి. జారత్వముసేయు.
ఱంకు. వై. వి. జారత్వము.
ఱంకుఁబోతు. దే వి. ౧. జారుఁడు. ౨. జారిణి.
ఱంకుటాలు. దే. వి. జారిణి.
ఱంకుమగఁడు. దే. వి. జారుఁడు.
ఱంకులరాట్నము. దే. వి. తిరునాళ్ళలో బాలకులు ఎక్కి త్రిప్పించునట్టి తొట్లవంటి వలయాకారపు యంత్రవిశేషము.
ఱంకులాఁడి. దే. వి. జారిణి.
ఱంకువోవు దే. క్రి. జారత్వముచేయు.
ఱంకె. దే. వి. ౧. ధ్వని. ౨. కేక. 3. వృషభధ్వని.
ఱంకెత. దే. విణ. జారిణి.
ఱంతిల్లు. దే. క్రి. కలకల ధ్వనిసేయు.
ఱంతు. దే. వి. కలకలధ్వని.
ఱంపకాఁడు. దే. వి. ఱంపముతోఁ బలకలు మున్నగువానిఁ గోయువాఁడు.
ఱంపము. దే. వి. పలకలు లోనగు వానిఁగోసెడి సాధనము.
ఱంపిల్లు. దే. క్రి. ౧. వ్యాపించు. ౨. వర్ధిల్లు. 3. విజృంభించు. ౪. అతిశయించు.
ఱంపు. దే. వి. ౧. కలకలము. ౨. ఱచ్చ.
ఱక్కు. దే. క్రి. ౧ గీఱు. వి. ౨ గీఱ.
ఱట్టు. దే. వి. నింద.
ఱప్ప. దే. వి. చిన్నఱాయి.
ఱవఱవ. దే. వి కోపవికారము.
ఱవిక. దే. వి. కంచెల..

ఱవ్వ. దే.వి. ౧.నింద. క్రి. ౨.ఱవ్వాడు.
ఱవ్వాడు. దే. క్రి. నిందించు.

ఱా

ఱాఁగ. దే. వి. ౧. జారిణి. విశే. ఉద్ధతుఁడు.
ఱాచు. దే. క్రి. ౧. రుద్దు. ౨.రాపాడు చేయు.
ఱాతికుండె. దే. వి. గట్టిమనస్సు.
ఱాతివాలు. దే. వి. వజ్రాయుధము.
ఱాపు. దే. వి. రాయిడి.
ఱాయి. దే. వి. శిల.

ఱి

ఱింగు. దే. వి. ఱెక్కలచప్పుడు.
ఱిక్కించు. దే. క్రి. నిక్కించు.
ఱిచ్చ. దే. వి. నిశ్చేష్టత.
ఱిచ్చపడు. దే. క్రి. చేష్టలుదక్కు.
ఱిచ్చపాటు. దే. వి. ఱిచ్చపడుట.

ఱు

ఱుప్పు. ఱువ్వు. } దే. క్రి. విసరివైచు. వి. ఱెక్కలగాలి చప్పుడు.

ఱె

ఱెక్క. దే. వి. పక్షము.
ఱెప్ప. దే. వి. కనుఱెప్ప.
ఱెప్పపాటు. దే. వి. నిమిషము.
ఱెల్లు. దే.వి. ౧తృణవిశేషము. ౨దర్భ.

ఱే

ఱేఁడు. దే.వి. ౧. దొర. ౨.మగఁడు.
ఱేకు. దే. వి. ౧. తగడు. ౨ పుష్పదళము.
ఱేకుమసఁచు. దే. క్రి. అణఁగఁద్రొక్కు.
ఱేపు. దే. వి. ౧. వెనుకటి దినము. ౨. ప్రాతఃకాలము. రూ. రేపు.

ఱై

ఱైక. దే. వి. రవిక.

ఱొ

ఱొచ్చు. దే. వి. ౧. బురద. ౨. సందడి. 3. తిరస్కారము.
ఱొడ్డ. దే. విశే. ఎడమ. (ఱొడ్డచేయి)
ఱొడ్డు. దే. విశే. అధికము. (ఱొడ్డు పులుసు.)
ఱొమ్ము. దే. వి. వక్షము.

ఱో

ఱోలు. దే. వి. దంచుటకును రుబ్బుటకును ఉపయోగించు సాధనము. క్రి. విలపించు.

# ల

లంక. దే.వి. ౧. తలవాకిటి ప్రక్కగది. ౨. దీవి.
లంకణము. వై. వి. జ్వరాదులచే నుండెడి యుపవాసము.

లంకించు. వై. క్రి. ౧. పెనవేయు. ౨. అవమానించు.

లంకియ. ) వై. వి. ౧. పెన. ౨.
లంకె. ⎱ సంగము. ౩. స్నేహము.

లంకెపెట్టు. దే. క్రి. ౧. పెనవేయు. ౨. తగులుపఱచు.

లంకెపలుపు. దే. వి. లంకెవేసిడిపలుపు.

లంగ. దే. వి. లాఘవము.

లంగగొను. దే. క్రి. లంఘించు.

లంగరు. వై. వి. ఓడనిలుచుటకై అడుగున దిగవైచు నాగేలు వంటి యినుపసాధనము.

లంఘ. త్స. వి. దాటు.

లంఘనము. త్స. వి. ౧. దాటు. ౨. దూకుడు.

లంఘించు. త్స. క్రి. ౧. దాటు. ౨. దూకు.

లంచము. దే. వి. లంచేము.

లంచేగొండి. దే. విణ. లంచము గ్రహించు శీలము గలవాడు.

లంజ. త్స. వి. వేశ్య.

లంజిక. త్స. వి. ,,

లంజియ. దే. వి. లంజె.

లంజె. దే. వి. ,,

లంజెకాడు. వై. వి. విటుడు.

లంజెత. దే. వి. వేశ్య.

లంజెటికము. దే. వి. వేశ్యాసంభోగము.

లండి. దే విణ. ౧. కుత్సితురాలు. ౨. కుత్సితుడు.

లండు. దే. వి. కుత్సితుడు.

లండుపోతు. దే. వి. ,,

లంద. దే. విణ. పొట్టివాడు.

లంపట. ⎫ దే. వి. ౧. ఆపద. ౨.
లంపటము. ⎭ శ్రమము.

లంపటపడు. దే. క్రి. శ్రమపడు.

లంపటుడు త్స. వి. అత్యాసక్తిగల వాడు.

లంపతావాడు. దే. వి. దాసీపుత్త్రుడు.

లంపు. దే. వి. దొంగమోత.

లంపులమారి. దే. విణ. దొంగచేలో మేయునది.

లంబనము. త్స. వి. వ్రేలాడుట.

లంబము. త్స. వి. ౧ వ్రేలుడు. విణ. ౨ దీర్ఘము.

లంబిక. త్స. వి. కొండనాలుక.

లంబు. దే. వి. స్థౌల్యము.

లంబోదరుడు. త్స. వి. వినాయకుడు.

లంభనము. త్స. వి. తిట్టుట.

లంభించు. త్స. క్రి. తిట్టు.

లకుచము. త్స. వి. గజనిమ్మ.

లకుముకి. దే. వి. ఆకసమునందుండి ఱెక్కలాడ్చుచు పొంచి నీటిలోపల నుండు చేపలను పట్టి తినెడుపక్షి విశేషము.

లకోరి. దే. వి. క్రూరబాణము. చూ. లకోరీ.

లక్కాకు. దే. వి. ఆడువారు చుట్టికమ్మ చెవినుంచుకొనెడు లక్కపూసిన తాటాకు.

లక్కిమి. దే. వి. లక్ష్మి.
లక్ష. త్స. వి. ౧. గుఱి. ౨. నెపము.
లక్షణము. త్స. వి. ౧. గుఱుతు. ౨. వ్యాకరణాది శాస్త్రము.
లక్షించు. త్స. క్రి. ౧. చూచు. ౨. గురిచేయు.
లక్ష్మణము. త్స. వి. గుఱుతు.
లక్ష్మణుఁడు. త్స. వి. ౧. రాముని తమ్ముఁడు. ౨. శ్రీమంతుఁడు.
లక్ష్మము. త్స. వి. గుఱుతు.
లక్ష్మి. త్స. వి. ౧. శ్రీ. ౨. ఐశ్వర్యము.
లక్ష్మీపతి. త్స. వి. ౧. విష్ణువు. ౨. ప్రభువు.
లక్ష్మీవంతుఁడు. త్స. విశే. ౧. ఒప్పిదముకలవాఁడు. ౨. సంపదకలవాఁడు.
లక్ష్యము. త్స. వి. ౧ లక్షణచేఁ దెలియఁదగినయర్థము. ౨. గుఱి.
లగనము. వై. వి. లగ్నము.
లగుడము. త్స. వి. దండ .
లగువు. వై. వి. ౧ చులుకన. విశే. ౨. చులుక.
లగ్గ. వై. వి. (ముట్టడించి) కోటను బ్రాఁకుట.
లగ్గపట్టు. దే. క్రి. కోటనెక్కు.
లగ్గు. దే. వి. ౧. మేలు. ౨. ఉత్తరక్రియ.
లగ్నకుఁడు. త్స. వి. పూటకాఁపు.
లగ్నము. త్స. వి. ౧ రాశ్యుదయము. విశే. ౨ తగులుకొన్నది.
లఘిమ. } త్స. వి. లఘుత్వము.
లఘిమము. }
లఘిష్ఠము. త్స. విశే. మిక్కిలి చులకనైనది.
లఘువు. త్స. విశే. ౧. చేవలేనిది. ౨. చులుకనిది.
లచ్చి. దే. వి. ౧. లక్ష్మి. ౨. సంపద.
లచ్చివారము. దే. వి. గురువారము.
లచ్చనము దే. వి. గుఱుతు.
లజ్జ. త్స. వి. ౧. సిగ్గు. క్రి. ౨. లజ్జించు.
లజ్జాళువు. త్స. విశే. సిగ్గరి.
లజ్జించు. త్స. క్రి. సిగ్గించు.
లజ్జితము. త్స. విశే. సిగ్గుపడినది.
లటుక్కు. దే. వి. మ్రింగునపుడయ్యెడి చప్పుడు.
లట్వము. త్స. వి. లడ్డు.
లడ్డు. దే. వి. భక్ష్యవిశేషము.
లడ్డుకము. త్స. వి. లడ్డు.
లడ్డువము, లడ్వము. దే. వి. లడ్డు.
లత. త్స. వి. ౧. తీఁగ. ౨. ఎఱ్ఱముఁదీఁగ.
లతిక. త్స. వి. తీఁగ.
లతాంతము. త్స. వి. పుష్పము.
లత్తి. దే. వి. ౧. ఆపద. ౨. దెబ్బ.
లత్తుక. వై. వి. లాక్షారసము.
లత్తుక. దే. వి. "
లపక. దే. వి. ధనము.
లపనము. త్స. వి. ౧. ముఖము. ౨. మాట.

లద్ది. దే. వి. అశ్వమలము.
లప్ప. దే. వి. రాశి.
లబ్ధము. త్స. వి. ౧. భాగాహారము చేయగా ఏర్పడిన సంఖ్య. విణ. ౨. పొందఁబడినది.
లబ్ధవర్ణుఁడు. త్స. వి. పండితుఁడు.
లబ్ధి. త్స. వి. ప్రాప్తి.
లభించు. త్స. క్రి. కలుగు.
లభ్యము. త్స. వి. లభింపఁదగినది.
లయు. దే. వి. మోసము.
లయకారి. దే. విణ. మోసకాఁడు.
లయించు. త్స. క్రి. ౧. సక్తమగు. ౨. నశించు.
లలంతిక. త్స. వి. మెడలో వ్రేలాడు హారము లోనగునది.
లలన. త్స. వి. ఆఁడుది. వ్యు. విలాసయుక్తమైనది.
లలాటము. త్స. వి. నొసలు.
లలామకము. త్స. వి. బాసికము.
లలామము. త్స. వి. ౧. సొమ్ము. ౨. నొసట నుంచుకొనెడిబొట్టు. 3. (ఉత్తర పదమైనచో) శ్రేష్ఠము.
లలి. దే. వి. ౧. ప్రేమ. ౨. వికాసము. 3. క్రమము.
లలితము. త్స. విణ. అందమైనది.
లవణము. త్స. వి. ఉప్పు.
లవణాకరము. త్స. వి. ఉప్పు సముద్రము.
లవణి. దే. వి. బిగువు.
లవణోదము. త్స. వి. సముద్రము.
లవనము. త్స. వి. పైరు మొదలగువాని కోఁత.
లవము. త్స. వి. ౧. చేటు. ౨. లేశము. 3. కోఁత.
లవించు. త్స. క్రి. కోయు.
లవిత్రము. త్స. వి. కొడవలి.
లశునము. త్స. వి. వెల్లుల్లి.
లసుకు. దే. క్రి. నాశముచేయు.
లస్తకము. త్స. వి. ధనుర్మధ్యము.
లహరి. త్స. వి. పెద్దయల.

లా

లాంగలము. త్స. వి. నాఁగలి.
లాంగూలము. త్స. వి. తోఁక.
లాంఛనము. త్స. వి. గుఱుతు
లాంపట్యము. త్స. వి. లంపటభావము.
లాఁగ. దే. వి. ౧. బిలము. ౨. రంధ్రము.
లాఁగించు. దే. క్రి. లంఘించు.
లాఁగు. వై. వి. ౧. లంఘనము. ౨. చల్లడము.
లాఁచు. దే. క్రి. ౧. కవియు. ౨. పొంచు.
లాఁతి. దే. స. అన్యము.
లాక్ష. త్స వి. లక్క.
లాక్షణికుఁడు. త్స. విణ లక్షణము నెఱిఁగినవాఁడు.
లాగము. దే. వి. లాఘవము.
లాగు. దే. క్రి. ఈడ్చు. వి. ౧. ఆకర్షణము. ౨. విధము.

లాగులాడు. దే. క్రి. పెనఁగులాడు.
లాఘవము. త్స. వి. ౧. ఆరోగ్యము. ౨. లఘుత్వము.
లాటీ. దే. దుడ్డుకఱ్ఱ.
లాడము. దే. వి. గుఱ్ఱపుగొరిజలకుఁ గొట్టునట్టి యినుపతగటిబిల్ల.
లాడి. దే. వి. ౧. బలి. ౨. పెద్ద ప్రండు.
లాతము. దే. వి. సన్న్యాసులచేతి దండము.
లాతాము. దే. వి. ,,
లాభము. త్స. వి. ౧. ప్రాప్తి. ౨. క్రియవిక్రయములవలన వచ్చిన ధన విశేషము.
లాయము. దే. వి. అశ్వశాల
లాయు. దే. క్రి. ౧. ఉద్రేకించు. ౨. విజృంభించు.
లాల. త్స. వి. చొంగ.
లాలనము. త్స. వి. ఓదార్పు.
లాలస. త్స. వి. అధికేచ్ఛ.
లాలాటికుఁడు. త్స. విణ. కార్యము లందు నేర్పుచాలనివాఁడు.
లాలి. దే. వి. ఉయ్యాల.
లాలించు. త్స. క్రి. బుజ్జగించు.
లాలిత్యము. త్స. వి. లలితభావము.
లావణి. దే. వి. పసులు మేసెడుచోటికి ముందుగా నిచ్చు ధనము.
లావణ్యము. దే. వి. సుఖకాంతి విశేషము.
లావరి. దే. విణ. బలవంతుఁడు.
లావు. దే. వి. ౧. బలము. ౨. నేర్పు. విణ. 3. స్థూలము.
లాసకము. త్స. వి. ౧. నెమిలి.
లాసకుఁడు. త్స. విణ. లాస్యముచేయు వాఁడు.
లాసము. త్స.వి. ౧ ఆట. ౨.నృత్యము.
లాసిక. త్స. వి. ఆటకత్తె.
లాస్యము. త్స. వి. నృత్యము.
లాహిరి. దే. వి. మైకము. రూ. లాహిరీ.

## లి

లింగఁడు. దే. వి. జంగమయ్య.
లింగము. త్స. వి. ౧. శివలింగము ౨. గురుతు. 3. మగగుఱి.
లింగి. త్స. వి. బ్రహ్మచారి.
లికుచము. త్స. వి. గజనిమ్మ.
లిక్కి. దే.వి. గడ్డి లోనగువానిఁగోసెడి కొడవలి.
లిఖించు. త్స. క్రి. వ్రాయు.
లిపి. త్స. వి. వ్రాలు.
లిపికరుఁడు. / లిపికారుఁడు. త్స. వి. వ్రాయసకాఁడు.
లిప్తము. త్స. విణ. పూయఁబడినది.
లిప్స. త్స. వి. కోరిక.
లిబ్బి. దే. వి. ౧. నిధి. ౨. ధనము. 3. గాలి.
లియ్యము. త్స. విణ. లయించినది.
లివ. గ.వి. ౧. వెలము. ౨. లాఘవము.

## లీ

లీఢము. త్స. విణ. నాకఁబడినది.
లీనము. త్స. విణ. ౧. కరఁగినది. ౨. లయించినది.
లీల. త్స. వి. ౧. విధము. ౨. క్రియ. 3. క్రీడ.

## లు

లుంగ. దే. వి. వస్త్రభారము.
లుంగి. దే. వి. ఒకవిధమైన చొక్కాయ.
లుంటాకుఁడు. త్స. వి. దొంగ.
లుంఠనము. త్స. వి. పొర్లుట.
లుకలుక. దే. వి. పురుగులు తొలుచుటయందగునొడి ధ్వన్యనుకరణము.
లుకలుకలాడు.) దే. క్రి. తడబడు.
లుగచెడు. దే. క్రి. బాగుతప్పు
లుఠనము. త్స. వి. పొర్లుట.
లుఠితము. త్స. విణ. పొరలాడినది.
లుప్తము. త్స. విణ. ౧. లోపించినది. వి. ౨. దొంగసొమ్ము.
లుబ్ధకుఁడు. త్స. వి. పిసినివాఁడు.
లుబ్ధుఁడు. త్స. విణ. ౧. పిసినివాఁడు. ౨. బోయవాఁడు.
లులాయము. త్స. వి. కారెనుబోతు.
లులి. దే. వి. తక్కువ.
లులితము. త్స. విణ. చలించినది.
లులివడు. దే. క్రి. హీనమగు.
లుల్లిగాఁడు. దే. విణ. అధముఁడు.

## లూ

లూటి. } దే. వి. ౧. వస్త్రరంధ్రము.
లూటీ. } ౨. ఉపద్రవము.
లూత. త్స. వి. సాలెపురుగు.
లూనము. త్స. విణ. కోయఁబడినది.
లూలామాలము. దే. వి. మోసము.

## లె

లెంక. దే. వి. సేవకుఁడు.
లెంప. దే. వి. ౧. ప్రక్క. ౨ చెంప.
లెంపకాయ. దే. వి. చెంపకాయ.
లెక్క. వై. వి. ౧. సంఖ్య. ౨. లక్ష్యము. 3. సొమ్ము.
లెక్కగొను. } వై. క్రి. లక్ష్యముచేయు.
లెక్కపెట్టు. }
లెక్కసేయు. }
లెక్కించు.
లెస్స. దే. వి. ౧. క్షేమము. విణ. ౨. బాగు.

## లే

లేఁక. దే. వి. లెంక.
లేఁగ. దే. వి. క్రొత్తగాఁ గలిగిన దూడ.
లేఁగసవు. దే. వి. బాలత్వము.
లేఁత. దే. విణ. ౧ తరుణము. ౨. చులుకన. 3. సుకుమారము.
లేఁబగలు. దే. వి. ప్రాహ్ణము.
లేఁబోక. దే. వి. మందగమనము.
లేఁబొద్దు. దే. వి. అపరాహ్ణము.

లేకి. వై. వి. ౧. సమూహము. ౨. జాలు.
లేకరి. వై. వి. లేఖకుఁడు.
లేకి. దే. విశ. అప్రియోజకుఁడు.
లేఖ. త్స. వి. ౧. లిపి. ౨. ఎడ లేక మిక్కిలి సమీపమున నుండు చెట్ల వరుస.
లేఖకుఁడు. త్స వి. లేకరి.
లేఖనము. త్స. వి. వ్రాఁత
లేఖని త్స. వి. వ్రాసెడికలము.
లేఖర్షభుఁడు త్స. వి. ఇంద్రుఁడు.
లేఖ్యము. త్స. వి. వ్రాఁత.
లేచు. దే. క్రి. ౧. మేల్కొను. ౨. పొటమరించు.
లేటు. దే. వి. కొమ్మ.
లేటుమొగమువడు. దే. క్రి. విముఖమగు.
లేటి. } దే. వి. ౧. ఆఁడుజింక. ౨. జింక. ౩. మగజింక.
లేడి. }
లేపనము. త్స. వి. ౧. పూఁత. ౨. భోజనము.
లేపము. త్స. వి. పూఁత.
లేమ. వై. వి. ౧. ఆఁడుది. ౨. ఇంతి.
లేమి. దే. వి. ౧. దారిద్ర్యము. ౨. కలుగమి.
లేమిడి. } దే. వి. దారిద్ర్యము.
లేవడి. }
లేలిహానము. త్స. వి. పాము.
లేశము. త్స. వి. కొంచెము.
లేసు. వై. విశ. ౧. సులభము. ౨. చులుకన.
లేహనము. త్స. వి. నాకుట.
లేహము. త్స. వి. భోజనము.
లేహ్యము. త్స. వి. నాకిభుజింపఁదగిన మందు.

లొ

లొంగు. దే. క్రి. ౧. వెనుదీయు. ౨. లోఁబడు.
లొగ్గడి. దే. వి. క్షోభము.
లొచ్చు. దే. వి. తక్కువ. రూ. లొజ్జు.
లొటలొటమను. దే. వి. లొటలొట యని ధ్వనించు.
లొటారము. దే. వి. బలము.
లొటిపిట. దే. వి. ఒంటె.
లొట్ట. దే. విశ. అణఁగినది. వి. ౧. పల్లము. ౨. మగగుఱి.
లొట్టపోవు. దే. వి. అణఁగు.
లొట్టవేయు. దే. క్రి. రుచిగల పదార్థములను తినునపుడు నాలుకను అంగిటఁజేర్చి ధ్వనిపుట్టించు.
లొట్టి. దే. వి. కల్లుపోసెడిముంత.
లొట్టిపిట. }
లొట్టిపిట్ట. } దే. వి. ఒంటె
లొట్టియ. }
లొట్టెమఁగు. }
లొడలొడ. దే. అవ్య. కాఱుటయందగు ధ్వనికనుకరణము.
లొడిత. దే. వి. పాళిదేశము.

లాడితిలి. దే. వి. ప్రాదేశము.
లొత్త. దే. వి. పల్లము.
లొద్ద. దే. వి. రాశి.
లొద్దుగు. దే. వి. లోధ్రవృక్షము.
లొల్లి. దే. విణ. తెలుచు.

లో

లోఁబడు. దే. విణ. అధీనము.
లోఁగడ. దే. వి. ౧. గతకాలము. ౨. అంతరాళము.
లోఁగలి. / లోఁగిలి. దే. వి. ౧. గృహము. ౨. గృహాంతర్భాగము.
లోఁగు. దే. క్రి. ౧. లోఁబడుగు. ౨. అడఁగు.
లోఁగొను. దే. క్రి. లోపలనడచుకొను.
లోఁతిడి. దే. విణ. లోఁతులేనిది.
లోఁతు. దే. వి. ౧. మిక్కిలి పల్లము. విణ. ౨. మిక్కిలి పల్లమైనది.
లోఁబడు. దే. క్రి. అధీనమగు.
లోకనము. త్స. వి. ఆలోకనము.
లోకబాంధవుఁడు. త్స. వి. సూర్యుఁడు.
లోకమాత. త్స. వి. లక్ష్మి.
లోకము. త్స. వి. ౧. జనము. ౨. జగము.
లోకాయతికుఁడు. త్స. విణ. నాస్తికమతస్థుఁడు.
లోకాలోకము. త్స. వి. చక్రవాళగిరి.
లోచనము. త్స. వి. కన్ను.
లోచెయి. / లోచెయ్యి. దే. వి. ౧. మర్మము. ౨. అఱచెయి.
లోచూపు. దే. వి. జ్ఞానదృష్టి.
లోటు. దే. వి. ౧. లోపము. ౨. నష్టి.
లోటుపోవు. దే. క్రి. ౧. లోపమగు. ౨. నష్టియగు.
లోడి. / లోడీ. వై. వి. మల్లులు త్రిప్పెడి సాధన విశేషము.
లోతక్కువ. దే. విణ. కేనము.
లోధ్రము. త్స. వి. లొద్దుగు.
లోపము. త్స. వి. ౧. మఱుఁగుపాటు. ౨. తక్కువ.
లోపించు. త్స. క్రి. ౧. మఱుఁగువడు. ౨. తక్కువపడు. వి. ౩. లోపము.
లోపాయికారి. దే. విణ. రహస్యముగా నొకరిపక్షమున నున్నవాఁడు.
లోభము. త్స. వి. పిసినితనము.
లోభి. త్స. వి. లుబ్ధుఁడు.
లోమము. త్స. వి. రోమము.
లోయ. దే. వి. కొండపగులు.
లోల. త్స. విణ. ౧. మిక్కిలి యిచ్ఛ గలది. ౨. కదలునది.
లోలాయపడు. దే. క్రి. శ్రమపడు.
లోలితము. త్స. విణ. ఊఁచఁబడినది.
లోలుపుఁడు. త్స. విణ. మిక్కిలియిచ్ఛ గలవాఁడు.
లోలుభుఁడు. త్స. విణ. ,,
లోవ. దే. వి. ౧ చూపు. ౨. లోయ.
లోవైనము. దే. విణ. శిథిలమైనది.
లోష్టము. త్స. వి. మంటిగడ్డ.
లోహకారకుఁడు. త్స. వి. కమ్మరి.

లోహము. త్స. వి. ఇనుము బంగారము మొదలగు లోహము.

లోహాలుఁడు. త్స. విశే. స్ఫుటము గాని మాటలుగలవాఁడు.

లోహితము. త్స. విశే. ఎఱ్ఱనిది.

## లౌ

లౌకికము. త్స. విశే. లోకవ్యవహారసిద్ధమైనది.

లౌల్యము. త్స. వి. లోలత్వము.

# వ

వంక. దే. వి. ౧. పక్షము. ౨. వంపు. ౩. వాఁగు.

వంక^ వై. వి. ౧. వక్రత్వము. విశే. ౨. వక్రము.

వంకరటింకర. దే. విశే. నానావిధ వక్రము.

వంకరపోవు. దే. క్రి. వంకరయగు.

వంకాయ. దే. వి. శాకవిశేషము.

వంకి. దే. వి. బాఁకు.

వంకిణి. దే. వి. ,,

వంగ. దే. వి. వంగచెట్టు.

వంగఁదీయు. దే. క్రి. వంచు.

వంగడము. వై. వి. చూ. వంగసము.

వంగము. త్స. వి. ౧. వంగ. ౨. సత్తు.

వంగసము. వై. వి. కులము.

వంగు. వై. క్రి. ముందటికి వ్రాలు.

వంగుళ్లు. దే. వి. నట్టోట్లు.

వంచకము. త్స. విశే. ౧. మోసముచేయునది. వి. ౨. నక్క.

వంచన. త్స. వి. మోసము. క్రి. వంచించు.

వంచించు. త్స. క్రి. మోసగించు.

వంచితుఁడు. త్స. విశే. మోసగింపఁబడినవాఁడు.

వంచె. దే. విశే. ముఖ్యము.

వంచు. వై. క్రి. వంగఁదీయు.

వంజులము. త్స. వి. అశోకము.

వందెఱఁగు. దే. వి. స్త్రీపార్శ్వ చేలాంచలము.

వంజే. వై. వి. ౧. గొడ్రాలు. ౨. గొడ్డుటావు.

వంట. దే. వి. ౧. పాకము. ౨. బ. పేలుపిడకలు.

వంటకట్టెలు. దే. వి. బ. వంటచెఱకు.

వంటకత్తె. దే. వి. వంటచేయునది.

వంటకము. దే. వి. అన్నము.

వంటచెఱకు. దే. వి. వంటకట్టెలు.

వంటపెనురు. దే. వి. పిండివంటలు వండఁగా మిగిలిన నూనె.

వంటయిల్లు. దే. వి. వంటచేయునట్టి యిల్లు.

వంటరి. దే. వి. ౧. వంటవాఁడు. ౨. వంటకత్తె.

వంటలక్క. దే. వి. వంటకత్తె.
వంటసరకు. దే. వి. వంటకట్టెలు.
వంటసాల. దే. వి. వంటయిల్లు.
వంటి. దే. విణ. బోంటి.
వండ. దే. వి. ౧. చెరువు లోనగువాని యడుగున ఎండినబురద. ౨. ఆపద.
వండలి. దే. వి. చెఱువు లోనగువాని యడుగున ఎండిన బురద.
వండు. దే. క్రి. ౧. వంటఁజేయు. వి. ౨. బురద.
వంత. దే. వి. ౧. ఏఱు. ౨. ఏడ్పు. 3. బాధ.
వంతు. దే. వి. ౧. పాలు. ౨. క్రమము.
వంతెన. దే. వి. అట్టెడ.
వంద. దే. వి. నూఱు.
వందనము. త్స. వి. ౧. స్తుతి. ౨. నమస్కారము.
వందఱ. దే. వి. ఖండము.
వందఱలాడు. దే. క్రి. ఖండించు.
వందారువు. త్స. విణ. మ్రొక్కువాఁడు.
వంది. త్స. వి. స్తుతిచేసి జీవనము చేయువాఁడు.
వందించు. త్స. క్రి. స్తుతించు.
వందితుఁడు. త్స. వి. నమస్కరింపఁదగినవాఁడు.
వందు. దే. క్రి. సంతోషించు.
వందురు. దే. క్రి. క్లేశపడు.
వంద్యుఁడు. త్స. విణ. స్తుతింపఁదగినవాఁడు.

వంధ్య. త్స. వి. ౧. గొడ్రాలు. విణ. ౨. ఫలింపనిది.
వంపు. వై. వి. ౧. వంకర. ౨. వంగుట. విణ. 3. వంకరైనది. ౪. వంగినది.
వంశము. త్స. వి. ౧. కులము. ౨. వెదురు.
వంశి. త్స. వి. పిల్లనగ్రోవి.
వకవకలు. / వకావకలు. దే. వి. ౧. బద్దలు. ౨. చెదరుటలు.
వకుళము. త్స. వి. పొగడ.
వక్క. దే. వి. పోఁకచెక్క.
వక్కణ. వై. వి. ౧. జాబువ్రాయు పద్ధతి. ౨. వ్యాఖ్యానము.
వక్కణించు. వై. క్రి. వచించు.
వక్కాకు. దే. వి. తాంబూలము.
వక్కాణము. దే. వి. సమాచారము.
వక్కాణించు. వై. క్రి. ౧. వచించు. ౨. వ్యాఖ్యానముచేయు.
వక్కి. దే. విణ. బక్క.
వక్కికట్టె. దే. విణ. బక్కచిక్కినవాఁడు.
వక్కు. దే. క్రి. కృశించు.
వక్త. త్స. విణ. ౧. పండితుఁడు. ౨. మాటలాడువాఁడు.
వక్త్రము. త్స. వి. ౧. ముఖము. ౨. నోరు.
వక్రము. త్స. వి. ఏటివంకర. విణ. వంకరైనది.

వక్రించు. త్స. క్రి. మరలు.
వక్రిమము. త్స. వి. వంకర.
వక్షము. త్స. వి. ఱొమ్ము.
వగ. దే. వి. ౧. దుఃఖము. ౨. పశ్చాత్తాపము. ౩. సంతాపము.
వగకత్తె. దే. విశే. విలాసవతి.
వగకాఁడు. దే. విశే. విలాసవంతుఁడు.
వగచు. దే. క్రి. శోకించు.
వగదెగు. దే. క్రి. పరిష్కృతిమగు.
వగపు. దే. వి. శోకము.
వగరుచు. దే. క్రి. నిట్టూర్చు.
వగరుపు. దే. వి. శ్వాసరోగము.
వగలాఁడి. దే. విశే. విలాసవతి.
వగలాఁడు. దే. విశే. వగకాఁడు.
వగ్గు. దే. విశే. చూ. ౧. వక్క. ౨. ముసలి.
వచనము. త్స. వి. మాట. క్రి. వచించు.
వచ్చ. దే. వి. చెట్టునఁబట్టి బొత్తిగా నాశముచేసెడి యొక దనుసు చీడ.
వచ్చు. దే. క్రి. ౧. కూడు. ౨. దూరమునుండి దగ్గఱకు నడచు.
వచ్చుబడి. దే. వి. ఆయము.
వచ్చురాకలు. దే. వి. రాకయు రామియు.
వజీరుఁడు. దే. వి. శూరుఁడు. రూ. వజ్జీరుఁడు.
వజ్రము. త్స. వి. ౧. వజ్రాయుధము. ౨. రవ.
వజ్రి. త్స. వి. ఇంద్రుఁడు.
వటము.త్స.వి.౧. దండ. ౨.మఱ్ఱిచెట్టు.
వటించు. దే. క్రి. పస్తుపడు.
వటివేరు. దే. వి. చూ. వట్టివేరు.
వటుకుఁడు. త్స. వి. బ్రహ్మచారి.
వటువు త్స. వి. బ్రహ్మచారి.
వట్టి. దే. వి. ౧. చెఱకు గానుగకు వైచునట్టి యడ్డ మ్రాను. ౨. బ. వృషణము.
వట్టిము. దే. వి. తరుగు. (కళింగ.)
వట్టి. దే. విశే. ఏమియులేనిది.
వట్టిమాట. దే. వి. అపవాదము.
వట్టివేరు. దే. వి. అవురుగంటువేరు.
వట్టు. దే. క్రి. ౧. కృశించు. ౨. ఇంకు. వి. ౧. ఎండినపక్క. ౨. వరుగు.
వట్రి. దే. విశే. గుండ్రము.
వట్రివ. దే. వి. గుండ్రన.
వట్రించు. దే. క్రి. ౧. తిరుగు. ౨. పరాఙ్ముఖమగు.
వట్రిల్లు. దే. క్రి. ప్రవర్తిల్లు.
వట్రువ. వై. వి. గుండ్రము.
వట్రివసుడి. దే. వి. ఋకారము యొక్క రూపాంతరము.
వఠర. దే. విశే. సమర్థుఁడు.
వడ. దే. వి. ౧. గారె. ౨. సెగ.
వడఁకాడు. } దే. క్రి. కంపించు.
వడఁకు. }
వడఁబోయు. దే. క్రి. వడఁగట్టు.
వడగల్లు. దే. వి. వానకురియునపుడు పడుతాయి.

వడగాలి. దే. వి. వేసంగికాలమందలి నిప్పుగాలి.

వడగొను. దే. క్రి. తాపముపొందు.

వడపప్పు. దే. వి. నానవేసిన పెసరపప్పు.

వడపిందెలు. దే. వి. బ. ఊరవైచిన మామిడిపిందెలు.

వడముడి. దే. వి. భీమసేనుఁడు.

వడలు. దే. క్రి. వాడు.

వడారము. దే. అవ్య. బొత్తిగా.

వడి. దే. వి. ౧. శౌర్యము. ౨. వేగము.

వడిఁగట్టు. దే. క్రి. పాత్రము నోటికి గుడ్డకట్టి నీళ్లు లోనగువానిని వడియఁబోయు.

వడికాఁడు. దే. విశ. ౧. వేగవంతుఁడు. ౨. శౌర్యవంతుఁడు.

వడిగొను. దే. క్రి. ౧ మెలిపడు. ౨. వేగముగలుగు.

వడిపెట్టు. దే. క్రి. ౧. నులుము. ౨. మెలిపెట్టు.

వడియఁగట్టు. దే. క్రి. చూ. వడిఁగట్టు.

వడియఁబోఁత. దే. వి. వడియఁబోయుట.

వడియఁబోయు. దే. క్రి. బియ్యము లోనగువానిని కడిగినీళ్లువడియనుంచు.

వడియు. దే. క్రి. ౧. ఇంకు. ౨. కాఱు. ప్రే. 3. వడుచు. వి. ౪. వడుపు.

వడివేయు. దే. క్రి. వడిపెట్టు.

వడుకు. దే. క్రి. కదురు లోనగువానిని త్రిప్పి దూదిని నూలుగానీడ్చు. వి. వడుకుడు.

వడుగు. / వడువు. దే. వి. విధము. వై. వి. ౧. బ్రహ్మచారి. ౨. ఉపనయనము.

వడుచు. దే. క్రి. కార్చు.

వడుపు. దే. వి. వడియుట.

వడ్డన. దే. వి. భోజనవస్తువులు వడ్డించుట.

వడ్డి. దే. వి. తీసికొన్న అప్పునకు నూటికింతయని చెల్లింపఁదలఁచిన హెచ్చు సొమ్ము.

వడ్డించు. దే. క్రి. వడ్డనచేయు.

వడ్డెన. దే. వి. వడ్డన.

వడ్రంగము. వై. వి. వడ్లవానిపని.

వడ్రంగి. వై. వి. వడ్లవాఁడు.

వడ్లంగి. వై. వి. చూ. వడ్రంగి.

వడ్లత. దే. వి. వడ్లది.

వణఁకు. దే. క్రి. చూ. వడఁకు.

వణిక్కు. త్స. వి. ౧. వర్తకము. ౨. వర్తకుఁడు.

వతంసము. త్స. వి. ౧. పూఁగమ్మ. ౨. సిగబంతి.

వత్తి. దే. వి. వఱుగు.

వత్తి. దే. వి. దీపవర్తి.

వత్సము. త్స. వి. ౧. ఏఁడాదిలోని దూడ. ౨. బాలుఁడు.

వత్సరము. త్స. వి. సంవత్సరము.

వత్సలుఁడు. త్స. విశే. వాత్సల్యము గలవాఁడు.

వదనము. త్స. వి. ౧. మొగము. ౨. నోరు.

వదర. వై. విశే. వదరుఁబోతు.

వదరు. వై. క్రి. ౧. అడఁగు. ౨. ఉపయోగము లేక ఊరకమాటాడు.

వదరుఁబోతు. దే. వి. ఊరకవదరువాఁడు.

వదలు. దే. క్రి. ౧. విడుచు. ౨. వీడు. వి. 3. విడుపు.

వదాన్యుఁడు. త్స. విశే. మిక్కిలియిచ్చువాఁడు.

వదావదుఁడు. త్స. విశే. మాటలాడువాఁడు.

వదావళి. దే. విశే. వదరుఁబోతుదనము.

వది. దే. వి. ఏనుఁగు లోనగువానినిఁ బట్టుటకై త్రవ్వఁబడి ముండ్లులోనగువానిచేఁ గప్పఁబడిన పల్లము.

వదినె. దే. వి. ౧. అన్న భార్య. ౨. భార్యకు అక్క. 3. తనకన్న పెద్దదియగు మేనత్త మేనమామల కూఁతురు.

వదులు. దే. వి. సళ్ళు. విశే. బిగుతు కానిది.

వద్దు. దే. వి. ఒద్దు.

వధము. త్స. వి. చంపుట. క్రి. వధించుట.

వధించు. త్స. వి. చంపు.

వధువు. త్స. వి. ౧. కోడలు. ౨. పెండ్లాము. 3. ఆఁడుది.

వధూటి. త్స. వి. ౧. ఆఁడుది. ౨. కోడలు.

వధూనిక. త్స. వి. వదినె.

వధ్యుఁడు. త్స. విశే. చంపఁదగినవాఁడు.

వనచరము. త్స. వి. వానరము.

వనజము. త్స. వి. తామర.

వనట. దే. వి. ౧. వగపు. ౨. దుఃఖము.

వనధి త్స. వి. సముద్రము.

వనప్రియము. త్స. వి. కోయిల.

వనమాల. త్స. వి. తోటమాలె.

వనమాలి. త్స. వి. విష్ణువు.

వనము. త్స. వి. ౧. అడవి. ౨. జలము. 3. తోఁపు.

వనరు. దే. క్రి. ౧. దుఃఖించు. ౨. ఏడ్చు.

వనస్పతి. త్స. వి. పూవక కాచుచెట్టు.

వనాటము. త్స. వి. వనములోఁబుట్టి పెరిఁగి యచ్చటనే తిరుగాడు జంతువు.

వనిత. త్స. వి. మిక్కిలి యనురాగము గలయాఁడుది.

వనీపకుఁడు. త్స. విశే. యాచకుఁడు.

వన్నియ. / వన్నె. వై. వి. ౧. విధము. ౨. ప్రసిద్ధి. 3. కాంతి. ౪. రంగు.

వన్నెకత్తియ. } వై. విణ. ౧. విలాసవతి. ౨. అందకత్తె.
వన్నెకత్తె. }

వన్నెకాఁడు. వై. విణ. అందకాఁడు.

వన్నెచీర. దే. వి. చిత్రవర్ణవస్త్రము.

వన్నెలాఁడి. దే. విణ. విలాసవతి.

వన్నెలాఁడు. దే. విణ. విలాసి.

వన్యము. త్స. విణ. అడవిలోఁబుట్టినది.

వప. త్స. వి. ౧. బెజ్జము. ౨. కడుపులో బొడ్డుక్రింద నుండెడి యుల్లిపొరవంటి క్రొవ్వు.

వపువు. త్స. వి. శరీరము.

వప్రక్రీడ. త్స. వి. ఏనుఁగులు మూఁద లగునవి దంతములతోఁ గోరాడుట.

వప్రము. త్స. వి. ౧. కొండనెత్తము. ౨. కోట.

వమనము. త్స. వి. ౧. బాధ. ౨. వాంతి.

వమ్ము. వై. వి. ౧. నాశము. విణ. ౨. వ్యర్థము.

వమ్ముపోవు. దే. వి. ౧. నష్టమగు. ౨. వ్యర్థమగు.

వమ్రి. త్స. వి. చెదపురుగు.

వయసు. త్స. వి. చూ. వయస్సు.

వయస్య. త్స. వి. చెలికత్తియ.

వయస్యుఁడు. త్స. విణ. సఖుఁడు.

వయస్సు. త్స. వి. ౧. జవ్వనము. ౨. ప్రాయము. రూ. వయసు.

వయాళి. దే. వి. విహారము. రూ. వయ్యాళి.

వరకము. దే. వి. కఠినశిక్ష.

వరటు. త్స. వి. ఆఁడుహంస.

వరటము. త్స. వి. హంసము.

వరదుఁడు. త్స. విణ. వరమునిచ్చువాఁడు.

వరబడి. దే. వి. కఱవు.

వరము. త్స. వి. వేల్పు మున్నగువారిచ్చిన కోరిక.

వరవ. దే. వి. నీళ్ళు పాఱుదలకిల కాలువ.

వరవర్ణిని. త్స. వి. ౧. పసుపు. ౨. కాంత.

వరవుడము. వై. వి. దాస్యము.

వరవుడు. వై. వి. దాసి. రూ. వరవు.

వరహా. దే. వి. వరాహముద్రగల యొక నాణెము.

వరా. వై. వి. చూ. వరహా.

వరాంగము. త్స. వి. ఆఁడుగుఱి.

వరాటకము. త్స. వి. గవ్వ.

వరారోహ. త్స. వి. గొప్పపిఱుఁదులు కలయాఁడుది.

వరాహము. త్స. వి. ౧. పంది. ౨. కొండ. ౩. వరహా.

వరాహుఁడు. త్స. వి. విష్ణువు.

వరి. దే. వి. సస్యవిశేషము.

వరించు. త్స. క్రి. కోరు.

వరిబీజము. త్స. వి. వృషణవ్యాధి.

వరివస్య. త్స. వి. సేవ.

వరిష్ఠము. త్స. విణ. మిక్కిలి శ్రేష్ఠమైనది.

వరుఁడు. త్స. వి. ౧. మగఁడు. ౨. పెండ్లికొడుకు. విణ. 3. శ్రేష్ఠుఁడు.

వరుగు. దే. వి. ఎండవైచిన కాయ దినుసు.

వరుణుఁడు. త్స. వి. నీళ్ళకు పతి.

వరుస. దే. వి. ౧. రీతి. ౨. పోలిక. 3. వంతు.

వరుసమొగ్గరము. దే. వి. దండవ్యూహము.

వరూథము. త్స. వి. కవచము.

వరూథిని. త్స. వి. సేన.

వరేణ్యుఁడు. త్స. విణ. ముఖ్యుఁడు.

వర్గము. త్స. వి. ౧. తెగ. ౨. అధ్యాయము.

వర్గించు. త్స. క్రి. వర్గుచేయు.

వర్గు. త్స. వి. పేరువరుసగా వ్రాసిన లెక్క. రూ. వర్గువు.

వర్చస్కము. త్స. వి. మలము.

వర్చస్సు. త్స. వి. ౧. రూపము. ౨. కాంతి.

వర్జనము. త్స. వి. ౧. ఈవి. ౨. విడుపు. 3. వధ.

వర్జించు. త్స. క్రి. విడుచు.

వర్జ్యము. త్స. విణ. విడువఁదగినది. (కాలము.)

వర్ణకము. త్స. వి. ౧. రంగు. ౨. చందనము. 3. (తెనుఁగు వ్యాకరణమున) ప్రత్యయము.

వర్ణనము. త్స. వి. స్తుతి.

వర్ణము. త్స. వి. ౧. జాతి. ౨. కీర్తి. 3. గుణము. ౪. స్తోత్రము. ౫. అక్షరము.

వర్ణి. త్స. వి. బ్రహ్మచారి.

వర్ణించు. త్స. క్రి. పొగడు.

వర్ణితము. త్స. విణ. వర్ణింపఁబడినది.

వర్తకము. త్స. వి. వాణిజ్యము.

వర్తకుఁడు. త్స. వి. బేహారి.

వర్తనము. త్స. వి. ౧. జీవము. ౨. నడవడి.

వర్తమానము. త్స. వి. ౧. వృత్తాంతము. విణ. ౨ జరుగుచున్నది.

వర్తి. త్స. వి. దీపపువత్తి.

వర్తించు. త్స. క్రి. ఉండు. రూ. వర్తిల్లు. వర్తిలు.

వర్తిధూపము. త్స. వి. ఊదువత్తి.

వర్తిష్ణువు. త్స. వి. వర్తించువాఁడు.

వర్తులము. త్స. విణ. గుండ్రమైనది.

వర్త్మము. త్స. వి. త్రోవ.

వర్ధనము. త్స. వి. పెరుగుట.

వర్ధమానకము. త్స. వి. మూఁకుఁడు.

వర్ధిలు. } త్స. క్రి. పెరుఁగు. రూ. వర్ధిల్లు
వర్ధిల్లు. } ప్రే. వర్ధించు.

వర్ధిష్ణువు. త్స. వి. వృద్ధినొందు స్వభావము గలవాఁడు.

వర్మము. త్స. వి. కవచము.

వర్ష. త్స. వి. బ. వానకాలము.

వర్షము. త్స. వి. ౧. సంవత్సరము. ౨. వాన.

వర్షవరుఁడు. త్స. వి. అంతఃపురపుఁ గావలివాఁడు.

వర్షాభ్వి. త్స. వి. ఆఁడుకప్ప.

వర్షాశనము. త్స. వి. రాజులు లోనగు వారు పండితులు మున్నగు వారి కిచ్చు సంవత్సరగ్రాసము.

వర్షించు. త్స. క్రి. వానకురియు.

వర్షీయుఁడు. త్స. విణ. మిక్కిలి యేండ్లు చెల్లినవాఁడు.

వర్షోపలము. త్స. వి. వడగండ్లు.

వర్ష్మము. త్స. వి. శరీరము.

వఱ. దే. వి. మేర.

వఱగొడ్డము. దే. వి. వంకరమాట.

వఱడు. దే. వి. ౧. పెద్దజాతినక్క. ౨. ముదినక్క.

వఱద. దే. వి. వెల్లువ.

వఱదగుడి. దే. వి. ౧ సూర్యచంద్రుల చుట్టునుకల వర్తులము. ౨. పరిధి.

వఱదవాఱు. దే. క్రి. ప్రవహించు.

వఱపు. దే. వి. వానలేమి.

వఱలు. దే. క్రి. ౧. ప్రవర్తిల్లు. ౨. ప్రకాశించు.

వఱువట్లు. దే. వి. మిక్కిలి వట్టులు.

వఱువట్లుగొను. దే. క్రి. మిక్కిలి యెండు.

వఱువాతి. దే. అవ్య. ప్రాతఃకాలమున.

వఱ్ఱు. దే. వి. వెల్లువ.

వఱ్ఱొడ్డు. దే. క్రి. ప్రవహించు.

వల. వై. వి ౧. జాలము. ౨. కామము.

వలఁకు. దే. వి. చూ. వలను.

వలఁకువ. దే. వి. దిక్కు.

వలఁది. దే. వి. ౧. ఆఁడుది. విణ. ౨. నేర్పరి.

వలకట్టు. దే. విణ. అధీనము.

వలకడ. దే. వి. దక్షిణదిక్కు.

వలకాఁక. దే. వి. మన్మథతాపము.

వలకాఁడు. దే. విణ. కాముకుఁడు.

వలకార. దే. విణ. ,,

వలగొను. దే. క్రి. ప్రదక్షిణముచేయు.

వలగ్నము. త్స. వి. నడుము.

వలచు. దే. క్రి. ౧. వాసనగొట్టు. వై. క్రి. ౨. కోరు.

వలచుట్టు. దే. క్రి. చూ. వలగొను.

వలది. దే. వి. స్థానము.

వలదు. దే. విణ. అధికము.

వలనము. త్స. వి. తిరుగుడు.

వలను. దే. వి ౧. వైపు. ౨. దిక్కు. 3. నేర్పు. ౪. రీతి. విణ. ౫. కుడి.

వలపల. దే. వి. దక్షిణభాగము.

వలపలగిలుక. దే. వి. రేఫముయొక్క వేఱొకపేరు.

వలపలించు. దే. క్రి. వలగొను.

వలపు. దే. వి. ౧. కామము. ౨. కోరిక. 3. వాసన.

వలపుకత్తె. దే. విణ. కామము గలది.

వలపుకాఁడు. దే. విణ. కామము గల వాఁడు.

వలపుకీలు. దే. వి. పోకముడి.
వలపుకాయఁడు. దే. వి. మన్మథుఁడు.
వలభి. త్స. వి. చంద్రశాల.
వలమురి. దే. వి. శంఖము.
వలయము. త్స. వి. ౧. కంఠమాల. ౨. కడియము.
వలయితము. త్స. విశే. చుట్టఁబడినది.
వలయు. దే. క్రి. ౧. ఆవశ్యకమగు. ౨. యుక్తమగు. ౩. ఇష్టమగు.
వలరాజు. వై. వి. మన్మథుఁడు.
వలవంత. దే. వి. మన్మథవ్యథ
వలస. వై. వి. రాజోపద్రవాదులచే దేశమువిడిచిపరదేశమునకుఁబోవుట.
వలసతీయు. వలసపోవు. దే. క్రి. రాజోపద్రవాదులచే దేశమును విడిచి పరదేశము లకుఁబోవు.
వలాహకము. త్స. వి. మేఘము.
వలి. దే. వి. ౧. వణఁకు. ౨. శైత్యము.
వలిగొను. దే. క్రి. ౧. వణఁకు. ౨. చలిగొను.
వలితము. త్స. విశే. చుట్టఁబడినది.
వలినుఁడు. త్స. విశే. వళులుగలవాఁడు.
వలిపము. దే. వి. ౧. మడుఁగు వస్త్రము. ౨. సన్నని తెల్లవస్త్రము. విశే. ౩. పరిశుద్ధమైనది.
వలిపరిగొట్టు. దే. విశే. వణఁకువాఁడు.
వలిమల. దే. వి. మంచుఁగొండ.
వలివెలుఁగు. దే. వి. చంద్రుఁడు.
వలీకము. త్స. వి. ఇంటిచూరు.
వలుఁద. దే. విశే. స్థూలము.
వలువ. దే. వి. ౧. వస్త్రము. ౨. సన్నని గుడ్డ. రూ. వల్వ.
వలె. దే. అవ్య. ఉపమావాచకము.
వలెవాటు. దే. వి. చూ. వల్లెవాటు.
వల్కము. త్స. వి. నారబట్ట.
వల్కలము. త్స. వి. నారచీర.
వల్గ. త్స. వి. వాగె.
వల్గనము. త్స. వి. వల్గితము.
వల్మీకము. త్స. వి. పుట్ట.
వల్ల. దే. విశే. అనుకూలము.
వల్లకాఁడు. దే. వి. శ్మశానము.
వల్లకి. త్స. వి. వీణ.
వల్లడి. దే. వి. ౧. కొల్ల. ౨. అకారణమైన యాపద.
వల్లడికాఁడు. దే. వి. అకారణమైన ఆపదచేయువాఁడు.
వల్లభుఁడు. త్స. వి. ౧. అధిపతి. ౨. ప్రియుఁడు.
వల్లము. దే. వి. వరహాలజాలె.
వల్లరి. త్స. వి. ౧. చిగిరించిన కొమ్మ. ౨. తీఁగ.
వల్లవుఁడు. త్స. వి. ౧. వంటవాఁడు. ౨. గొల్లవాఁడు.
వల్లి. త్స. వి. తీఁగ.
వల్లించు. త్స. క్రి. వల్లెవేయు. ప్రే. వల్లెవేయించు.

వల్లియ. దే. వి. వల్లెత్రాడు.

వల్లెవాటు. దే. వి. వల్లెవాటుగా మెలి చుట్టి పైవైచుకొనినయంగవస్త్రము. రూ. వలెవాటు.

వశ. త్స. వి. పెండ్లాము.

వశంవదుఁడు. త్స. విశ. లోఁబడుయగు నట్లు మాటలాడువాఁడు.

వశము. త్స. వి. ౧. లోఁబడుట ౨. ఇచ్ఛ. త్స. విశ. ౩ లోఁబడినది.

వశవర్తి. త్స. విశ. విధేయుఁడు.

వశీకరణము. త్స. వి. లోఁబడునట్లుగాఁ జేసికొనుట.

వశీకరించు. త్స. వి. మందుమాఁకులచే లోఁబఱుచుకొను

వశ్యము. త్స. వి. మందుమాఁకులచే నధీనమైనది.

వసంతము. త్స. వి. ౧. షడ్రుతువులలో మొదటిది. దే. వి. ౨. పసుపును సున్నము ను కలిపిన యెఱ్ఱని నీరు.

వసతి. దే. వి. ౧. సౌఖ్యము. త్స. వి. ౨. ఇల్లు.

వసనము. త్స. వి. ౧. వస్త్రము. ౨. ఉనికి.

వసనాభి. వై. వి. విషవిశేషము.

వసపడు. దే. క్రి. వశమగు.

వసపోవు. దే. క్రి. శక్యమగు.

వసము. దే. వి. స్వాధీనత.

వసి. దే. వి. మిక్కిలి (వసివాడు చెం.)

వసార. దే. వి. పంచాది. రూ. వసారా.

వసించు. దే. క్రి. ౧. ఉండు ౨. వాసము చేయు.

వసివాళ్లు. దే. వి. బ. మిక్కిలివాడుటలు.

వసుంధర. త్స. వి. భూమి. వ్యు. ధనము ను ధరించునది.

వసుధ. / వసుమతి. } త్స. వి. భూమి. వ్యు. ౧. ధనము ను ధరించునది. ౨. ధనముదీనియందుఁగలదు.

వసువు. త్స. వి. ౧. బంగారు. ౨. ధనము.

వస్తి. త్స. వి. పొత్తికడుపు.

వస్తువు. త్స. వి. పదార్థము.

వస్త్రము. త్స. వి. వలువ.

వహి. దే. వి. ౧. పుస్తకము. ౨. విధము.

వహించు. త్స. క్రి. తాల్చు.

వహ్ని. త్స. వి. అగ్ని.

వళక్షము. త్స. విశ. తెల్లనిది.

వళావళి. దే. వి. ౧. విజృంభణము. ౨. కుతూహలము.

వళి. త్స. వి. ౧. కడుపుమీఁదిముడుత. ౨. ముడుత. ౩. యత్యక్షరము.

వళిరుఁడు. త్స. విశ. మెల్లకంటివాఁడు.

## వా

వా. దే. వి. నోరు.

వాంఛ. త్స. వి. ౧. కోరిక. క్రి. ౨. వాంఛించు.

వాంఛితము. త్స. విణ. కోరఁబడినది.

వాంతి. త్స. వి. వమనము.

వాంశికుఁడు. త్స. విణ. పిల్లనగ్రోవి నూఁదువాఁడు.

వాఁక. దే. వి. ౧. చాయ. ౨. ఏఱు. విణ ౩. వంకర.

వాఁగరత. వై. వి. సముద్రతీరము. రూ. వాగర.

వాఁగు. దే. క్రి. ౧. వదరు. ౨. మ్రోఁగు. వి. ౧. సైన్యము. ౨. సెలయేఱు.

వాఁగుడు. దే వి. ధ్వని.

వాఁచు దే. క్రి. ౧. ఊఁదు. ౨. ఏకఱు.

వాఁడి. దే. వి. ౧. శౌర్యము. ౨. పదను విణ. ౧. వేఁడిమము. ౨. పదనైనది.

వాఁడిమగఁడు. దే. విణ. శూరుఁడు.

వాఁడిమి. దే. వి. ౧. తేజము. ౨. శౌర్యము.

వాఁత. వై. వి. తెవులుగొట్టుచు తగిలిన పశ్వాదులకు వేసెడుచూఁడు.

వాఁపు. వై. వి. ౧. శోఫ. ౨. పోటు.

వాకట్టు. దే. వి. మాటలాడనీక నోటిని కట్టివేయుట.

వాకాటు. దే. వి. వాగ్వాదము.

వాకిలి. దే. వి. గృహద్వారము.

వాచ. త్స. వి. చూ. వాక్కు.

వాకొను. దే. క్రి. ౧. అను, ౨. పలుకు.

వాక్కు. త్స. వి. ౧. సరస్వతి. ౨. మాట.

వాక్పతి. త్స. వి. ౧. బృహస్పతి. ౨. కవీశ్వరుఁడు.

వాక్యము. త్స. వి. ౧. మాట. ౨. పదములయొక్కయు, పదార్థములయొక్కయు సంబంధము చెడక యేకార్థత్వము గలిగి క్రియతోడఁగాని మఱిదేనితోడనైనఁగాని ముగిసెడి పద సమూహము.

వాక్రుచ్చు. దే. క్రి. ౧. చెప్పు. ౨. వేఁడుచెప్పు.

వాగ. త్స. వి. వాగె.

వాగఱ. దే. వి. ముచ్చవాఁడు చిత్తరువును వ్రాసెడితూలిక.

వాగీశుఁడు. త్స. వి చూ. వాక్పతి.

వాగుర. త్స. వి. ౧ వల ౨. ఉరి.

వాగురికుఁడు. త్స. వి. వాగురతో పశుపక్షులను జంపువాఁడు.

వాగె. వై. వి. గుఱ్ఱమునోటికళ్లెమునకుఁ దగిలించు పగ్గము.

వాగ్మి. త్స. వి. ౧. బృహస్పతి. విణ. ౨. యుక్తియుక్తముగా మాటలాడువాఁడు.

వాచంయముఁడు. త్స. వి. మౌని.

వాచకము. త్స. వి. వాచ్యార్థమును దెల్పెడి శబ్దము.

వాచస్పతి. త్స. వి. బృహస్పతి.

వాచాటుఁడు. / త్స. విణ. వదరు
వాచాలుఁడు. { బోతు.

వాచించు. త్స. వి. చెప్పు.

వాచికము. త్స. వి. సమాచారము.

వాచ్యము. త్స. వి. అర్థముచే దెలియఁ దగినది

వాచఱచు. దే. క్రి. మొఱపెట్టు.

వాజి. త్స. వి. ౧. బాణము. ౨. గుఱ్ఱము.

వాజె. దే.వి. ౧. రోఁత. విణ. ౨.రోఁత గలది.

వాటుపడు. దే. క్రి. ౧. అనుకూలమగు. విణ. ౨. వాటము.

వాటము. త్స. వి. ఇండ్లవరుస.

వాటిక. త్స. వి. ౧. ఇండ్లవరుస. ౨. తోఁట.

వాటు. దే. వి. ౧. దెబ్బ. ౨. వైచుట.

వాటులాడు. దే. క్రి. కొట్లాడు.

వాట్లీఁడు. దే. విణ. కొట్లాడువాఁడు.

వాడ. దే. వి. ౧. ఇండ్లవరుస. ౨ వీధి.

వాడఁబాఱు. దే. క్రి. వాడు.

వాడకట్టు. దే. వి. వాడ.

వాడగాలి. దే. వి. మలయమారుతము.

వాడవనిత. దే. వి.౧. వేశ్య. ౨. కులట.

వాడు. దే. క్రి. ౧. కాంతిహీనమగు. ౨.ఉపయోగపఱచు. వి.౩ వాడుట.

వాడుకపడు. దే. క్రి. పనుపడు.

వాడుదల. దే. వి. వాడుక.

వాడుదెంచు. దే. క్రి. వాడుపాఱు.

వాణి. త్స. వి. ౧. సరస్వతి. ౨. పలుకు.

వాణిజుఁడు. త్స. వి. వర్తకుఁడు.

వాణిజ్యము. త్స. వి. వణిగ్వ్యాపారము.

వాతము. త్స. వి. గాలి.

వాతరట్టు. దే. విణ. వదరుపోతు.

వాతవాఁడి. దే.విణ. అప్రియుంవదుఁడు.

వాతాయనము. త్స. వి. కిటికీ.

వాతావరణము. త్స. వి. వాయుమండలము.

వాతికాసు. వై. వి. లంచము.

వాతివియ్యము. దే. వి. దహనము చేయునపుడు బంధువులు పీఁగు నోటవైచు బియ్యము.

వాతూలము. త్స. వి. ౧. గాలి. ౨. సుడిగాలి.

వాతెఱ. దే. వి. పెదవి.

వాత్య. త్స. వి. సుడిగాలి.

వాత్సల్యము. త్స. వి. పుత్త్రాదులందుఁ గల ప్రేమ.

వాదడఁచు. దే వి. వారించు.

వాదము. త్స. వి. ౧. తగవు. ౨. వాగ్వివాదము.

వాదర. దే. వి. ఖడ్గధార.

వాదాడు. దే. క్రి. వాదించు.

వాది. త్స. వి. ౧. తగవునకుఁ బోయిన వాఁడు. విణ ౨. వాదించువాఁడు.

వాదించు. త్స. క్రి. ౧. వాదాడు. ౨. తగవాడు.

వాదు. వై.వి ౧. వాదము. క్రి.౨. వాదులాడు.

వాదులాఁడు. దే. విణ. వాదులాడు వాఁడు.
వానోడు. దే. విణ. మాటకు సాహసి య్యము.
వాద్యము. త్స. వి. వీణ మున్నగునది.
వానకాళ్లు. దే. వి. వర్షధారలు.
వానకోయిల. దే. వి. చాతకపక్షి.
వానతతి. దే. వి. వర్షాకాలము.
వానప్రస్థము.త్స.వి. ఒక యాశ్రమము.
వానము. త్స. వి. కుట్టుపని.
వానరము. త్స. వి. కోఁతి.
వానరాయి. దే. వి. వడగల్లు.
వానస్పత్యము. త్స. వి. ౧ పూచి కాచు చెట్టు. ౨ పూవక కాచుచెట్టు. (వనస్పతి.)
వాపి. త్స. వి. నడబావి.
వాపు. త్స. వి. చూ. వాయువు.
వాపుచ్చు. దే. క్రి. ౧. నోరు తెఱచు. ౨. చెప్పు.
వాపోక. దే. వి. ౧. ఏడ్పుట. ౨. అఱచుట.
వాపోవు. దే. క్రి. ౧. ఏడ్చు. ౨. అఱచు.
వామ. త్స. వి. ఉత్తమస్త్రీ.
వామదేవుఁడు. త్స. వి. శివుఁడు.
వామనుఁడు. త్స. వి.౧. విష్ణువు. విణ. ౨. పొట్టివాఁడు.
వామలోచన. త్స. వి. చక్కని కన్నులు గల యాఁడుది.
వామి. దే. వి. ప్రోగు.
వాము. దే. క్రి. జవురు.
వాయ. వై. వి. కొండ సందిచ్చిన నేల.
వాయనము త్స. వి. వ్రతాంతము నందు బ్రాహ్మణులకు నిచ్చునట్టియుపాయనము.
వాయము. దే. విణ. వ్యర్థము.
వాయవ్యము. త్స. వి. వాయువు సంబంధమైనది.
వాయసము. త్స. వి. కాకి.
వాయి. దే. వి. ౧. ముఖము. ౨. ఖడ్గధార.
వాయించు. దే. క్రి. వాదనము సేయు.
వాయిదము. వై. వి. వాద్యము.
వాయువు. త్స. వి. గాలి.
వాయోడు. దే. క్రి. మాటపెట్టికి యగు.
వార. దే. వి. ౧. హెచ్చుతక్కువలు. ౨ ఎనిమిదిపుంజెముల నూలు.
వారఁబట్టు. దే. క్రి. ఆపోశించు.
వారడి. దే. వి.౧. నష్టి, ౨. లోపము.
వారణము. త్స. వి. ఏనుఁగు.
వారధి. దే. వి. వంతెన.
వారము. దే.వి.౧. వారువము.త్స. వి ౨. సమూహము. ౩. సూర్యాది వాసరము.
వారస్త్రీ. త్స. వి. భోగముది.
వారాన్నిధి. త్స. వి. సముద్రుఁడు.
వారాశి. త్స. వి. సముద్రము.
వారి. త్స. వి. జలము.
వారించు. త్స. క్రి. అడ్డగించు.

వారిజము. త్స. వి. తామర.
వారిదము. త్స. వి. మేఘము.
వారిధి. త్స. వి. సముద్రము.
వారిరాశి. త్స. వి. సముద్రము.
వారు. దే. క్రి. ౧. ఉడుగు. ౨. వడియు.
వారుచు. దే. క్రి. ౧. ఆచమించు. ౨. ప్రతీక్షించు. ప్రే. 3. వారఁజేయు.
వారుణి. త్స. వి. సారాయి.
వారుపు దే. వి. ౧. ఆచమనము. వై. ౨. గంజి.
వారువము. త్స. వి. గుఱ్ఱము.
వార్త. త్స. వి. ౧. వృత్తాంతము. ౨. అర్థానర్థవివేచనవిద్య.
వార్తాకము. త్స. వి. వంగ.
వార్తావహుఁడు. త్స. వి. వృత్తాంతమును తెలిసికొని పోయి చెప్పువాఁడు.
వార్తికుఁడు. త్స. వి. దూత.
వార్ధకము. త్స. వి. ౧. ముసలితనము. ౨. ముసలివారిగుంపు.
వార్ధక్యము. త్స. వి. ముసలితనము.
వార్ధి. త్స. వి. సముద్రము.
వాఱు. దే. వి. సన్నగాఁగోసినతోలు.
వాఱెన. దే. వి. ౧. నొగతోఁ గాఁడిని చేర్చి కట్టెడు వాఱు లోనగునది. ౨. ఏఁడికోలతోఁ గాఁడినిచేర్చి కట్టెడు వాఱు లోనగునది.
వాలకము. దే. వి. ౧. వేషము. ౨. మోసము.

వాలధి. త్స. వి. తోఁక.
వాలము. వై. వి. ౧. బెబ్బులి. త్స. వి. ౨. తోఁక. 3. కత్తి.
వాలయించు. దే. క్రి. చూ. వాలాయించు.
వాలాయము. దే. విశ. ౧. అనివార్యము. ౨. నిరంతరము. 3. అవశ్యము. వి.౪. నిర్బంధము.
వాలాయించు. దే. క్రి ౧. నిర్బంధపడు. ౨. ప్రే. నిర్బంధపఱచు.
వాలారు. దే. విశ. వాఁడియైనది.
వాలిఁడి. దే. విశ. తోఁకలేనిది.
వాలిక. దే. విశ. దీర్ఘమైనది.
వాలు. దే. క్రి. ౧. వంగు. ౨. ఒఱగు. 3. క్రిందికిదిగు. వై. వి. ౧. కత్తి. ౨. పొడవు. విశ. ౧. దీర్ఘమైనది. ౨. వాఁడి.
వాలుక. త్స. వి. ఇసుక.
వాలుగంటి. దే. వి. దీర్ఘములైన కన్నులుకల యాఁడుది.
వాలుచేక్క. దే. వి. ఊరుప్రేఁడు.
వాలుప. దే. వి. వాల్చుట.
వాలూరు. దే. క్రి. ఆలస్యముగు.
వాల్మీకి. త్స. వి. ఒక ఋషి.
వాల్లభ్యము. త్స. వి. అధిపత్యము.
వావదూకుఁడు. త్స. వి. వాగ్మి.
వావాదు. దే. వి. ఉపన్యాసము.

వావిరి. దే. వి. ౧. క్రిమము. ౨. ఉత్కర్షము. విణ. ౧. అనుగతము. ౨. ఉత్కృష్టము.
వాసంతము. త్స. విణ. ౧. వసంతఋతు సంబంధమైనది. వి. ౨. కోయిల.
వాసంతి. త్స. వి. ౧. అడవిమొల్ల. ౨. పువ్వుల గురివెంద.
వాసకసజ్జిక. త్స. వి. ప్రియుండు వచ్చువేళకు తన్నును, పడకగదిని అలంకరించుకొని ఎదురుచూచు స్త్రీ.
వాసగృహము. త్స. వి. పడకిల్లు.
వాసన. త్స. వి. ౧. గంధము. ౨. ప్రత్యాశ.
వాసపోవు. దే. క్రి. వాసాలుపోవు.
వాసము. దే. వి. ఇంటిమీఁదఁ బఱచునట్టి పట్టె.
వాసయోగము. దే వి. గందవొడి.
వాసరము. త్స. వి. దినము.
వాసవుఁడు. త్స. వి. ఇంద్రుఁడు. వ్యు. రత్నములు కలవాఁడు.
వాసి. దే. వి. ౧. భేదము. ౨. లాభము. ౩. ప్రసిద్ధి. విణ. ౪. ఉత్కృష్టము.
వాసించు. త్స. క్రి. వసించు.
వాసుకి. త్స. వి. ఒక సర్పరాజు.
వాసుదేవుఁడు. త్స. వి. కృష్ణుఁడు. వ్యు. అన్ని జగములు తనయందుఁ గలదేవుఁడు.
వాసెగొర్రు. దే. వి. పల్లవగొర్రు.
వాసెకట్టు. దే. క్రి. వాసెనగుడ్డకట్టు.
వాసెనగుడుము. దే. వి. ఇడ్డెన యను భక్ష్యము.
వాస్తవము. త్స. వి. యథార్థము.
వాస్తవికము. త్స. విణ. యథార్థమైనది.
వాస్తవ్యము. త్స. విణ. వసింపఁదగినది.
వాస్తవ్యుఁడు. త్స. వి. గృహస్థుఁడు.
వాస్తువు. త్స. వి. ౧. ఇల్లు. ౨. ఇండ్లు మొదలగునవి ఏర్పఱుపఁ దగిన భూమి.
వాస్తుశాస్త్రము. త్స. వి. ఇండ్లు, వంతెనలు, మున్నగునవి కట్టుటకు నుపాయములు తెల్పుశాస్త్రము.
వాస్తోష్పతి. త్స. వి. ఇంద్రుఁడు. వ్యు. గృహక్షేత్రాదులకు నధిదేవత.
వాహనము. త్స. వి. ఎక్కఁదగిన ఏనుఁగు లోనగునది.
వాహము. త్స. వి. గుఱ్ఱము.
వాహిని. నై. వి. ౧. సేన. ౨. సేనావిశేషము. 3. నది.
వాహినీపతి. త్స. వి. ౧ సముద్రుఁడు. ౨. సేనానాయకుఁడు.
వాహ్యాళి. త్స. వి. స్వారి.
వాళి. దే. వి. ౧. పాదుక. ౨. పశువులు పోవుదారి.

వి

వింగడము. దే. వి. ౧. విపరీతము. ౨. సుందరము. 3. విస్తారము.

వింజామర. త్స. వి. తెల్లని చామరము.
వింజేము. వై. వి. వింధ్యపర్వతము.
వింటిపట్టు. దే. వి. అమ్మువేటునేల.
వింటివాఁడు. దే. విశ. విల్లుకాఁడు.
వింత. దే. వి. ౧. ఆశ్చర్యము. విశ. ౨. అపూర్వము.
వింతరాలు. దే. విశ. అన్యురాలు.
వింతవాఁడు. దే. వి. అన్యుఁడు.
విందు. దే. వి. ౧. చుట్టములకును, స్నేహితులకును, పెట్టెడు భోజనము. ౨. ఆతిథ్యము. ౩. చుట్టము.
వింధ్యము. త్స. వి. వింధ్యపర్వతము.
వికచము. త్స. విశ. ౧. వెంట్రుకలులేనిది. ౨. వికసించినది.
వికటకవి. త్స. విశ. నికటముగా మాటలాడువాఁడు.
వికటము. త్స. విశ. స్వభావ విరుద్ధమైనది.
వికటించు. త్స. క్రి. ఎదురుతిరుగు.
వికత్థనము. త్స. వి. స్తోత్రము.
వికర్తనుఁడు. త్స. వి. సూర్యుఁడు.
వికలము. త్స. విశ. విచ్ఛేదము నొందినది.
వికల్పము. త్స. వి. ౧. మాఱుదల. ౨. భ్రాంతి.
వికవిక. దే. అవ్య. నవ్వుటయందగు ధ్వనికనుకరణము.
వికసనము. త్స. వి. తెలివి.
వికసించు. త్స. క్రి. విరియు.
వికస్వరము. త్స. వి. తెలివి.

వికారము. త్స. వి. మనసుయొక్క కాని రూపముయొక్క కాని మాఱుపాటు.
వికారి. త్స. వి. ఒక సంవత్సరము.
వికాసము. త్స. వి. తెలివి
వికావిక. దే. అవ్య. నవ్వుటయందగు ధ్వనికనుకరణము.
వికృతము. త్స. విశ. వికారము నొందినది.
వికృతి. త్స. వి. ౧. వికారము. ౨. ఒక సంవత్సరము.
విక్కవిరియు. దే. క్రి. మిక్కిలి విరియు.
విక్కు. దే. క్రి. విజృంభించు.
విక్రమ. త్స. వి. ఒక సంవత్సరము.
విక్రమము. త్స. వి. ౧. అధికబలము. ౨. శౌర్యము.
విక్రమించు. త్స. క్రి. శౌర్యము చూపు.
విక్రముఁడు. త్స. వి. ౧. విక్రమార్కమహారాజు. ౨. విష్ణువు.
విక్రయము. త్స. వి. ౧. అమ్మకము. కిరి. ౨. విక్రయించు.
విక్రయిఁకుఁడు. త్స. వి. అమ్మెడివాఁడు.
విక్రాంతి. త్స. వి. విక్రమము.
విక్రియ. త్స. వి. వికారము.
విక్రీడితము. త్స. విశ. మిక్కిలి ఆడఁబడినది.
విక్రీతము. త్స. విశ. విక్రయింపఁబడినది.
విక్రేత. త్స. విశ. విక్రయించువాఁడు.
విక్లముఁడు. త్స. విశ. కాళ్లుచేతులు విలవిలఁబోవువాఁడు.

విక్షిప్తము. త్స. విణ. ఎగురవేయఁ బడినది.
విక్షేపము. త్స. వి. ఎగురఁగొట్టుట.
విఖ్యాతము. త్స. విణ. మిక్కిలి ప్రసిద్ధిఁజెందినది.
విఖ్యాతి. త్స. వి. మిక్కిలి ప్రసిద్ధి.
విగడియ. వై. వి. గడియలో అఱువదవపాలు.
విగతము. త్స. విణ. బొత్తిగాఁ బోయినది.
విగళనము. త్స. వి. లెస్సగా జాఱుట.
విగళితము. త్స. విణ. లెస్సగా జాఱినది.
విఘుర్ణించు. దే. క్రి. చక్కగా విఱుచు.
విగ్రహము. త్స. వి. ౧. యుద్ధము. ౨. చూ. షడ్గుణములు.
విగ్రహించు. త్స. క్రి. కలహించు.
విఘాతము. త్స. వి. ౧. చెఱుపు. ౨. అడ్డంకి.
విఘాతించు. త్స. క్రి. ౧. చంపు. ౨. చెఱుచు.
విఘ్నపడు. త్స. క్రి. ౧. అడ్డపడు. వి. ౨. విఘ్నము.
విఘ్నము. త్స. వి. అడ్డంకి.
విఘ్నరాజు. త్స. వి. వినాయకుఁడు.
విచక్షణుఁడు. త్స. విణ. ౧. నేర్పరి. వి. ౨. చదువరి.
విచారణ. త్స. వి. ప్రమాణములచే విషయమును పరిశీలించుట.
విచారణీయము. త్స. విణ. విచారణ చేయఁదగినది.
విచారపడు. త్స. క్రి. దుఃఖపడు.
విచారము. త్స. వి. ౧. దుఃఖము. ౨. ఆలోచనము.
విచారించు. త్స. క్రి. ౧. దుఃఖించు. ౨. ఆలోచించు.
విచార్యము. త్స. విణ. విచారింపఁదగినది.
విచికిత్స. త్స. వి. సంశయము.
విచిత్రము. త్స. వి. ౧. ఆశ్చర్యము. విణ. ౨. ఆశ్చర్యకరమైనది.
విచికిలము. త్స. వి. దవనము.
విచేష్టించు. త్స. క్రి. మిక్కిలి చేష్టించు.
విచ్చేయు. దే. క్రి. ౧. పోవు. ౨. వచ్చు.
విచ్చలవిడి. దే. వి. ౧. స్వాతంత్ర్యము. విణ. ౨. స్వతంత్రము. క్రి. విణ. 3 యథేచ్ఛముగా.
విచ్చవిచ్చలు. దే. అవ్య. యథాయథలు.
విచ్చు. దే. క్రి. ౧. చీలు. ౨. విరియు.
విచ్చుకత్తి. దే. వి. ఒఱదూసిన కత్తి.
విచ్చుమొగ్గ. దే. వి. ౧. చెల్లాచెదరగుట. ౨. విరియుమొగ్గ. విణ. 3. చెల్లాచెదరైనది.
విచ్ఛిత్తి. త్స. వి. ౧. వ్రూఁతి. ౨. ఎడఁబాటు.
విచ్ఛిన్నము త్స. విణ. ౧. వ్రూయఁబడినది. ౨. ఎడఁబడినది.

విజనము. త్స. విణ. జనులు లేనిది.
విజయము. త్స. వి. ౧. ఒక సంవత్సరము. ౨. పార్వతి.
విజయముచేయు. త్స. క్రి. ౧. వచ్చు. ౨. పోవు. (రూ) విజయంచేయు.
విజయి. త్స. విణ. విజయముగలవాఁడు.
విజయుఁడు. త్స. వి. అర్జునుఁడు.
విజాతి. త్స. వి. విభిన్నజాతి.
విజాతీయము. త్స. విణ. విజాతికి సంబంధించినది.
విజిగీష. త్స. వి. జయింపనిచ్ఛ.
విజిగీషువు. త్స. విణ. జయింపనిచ్ఛగలవాఁడు.
విజితుఁడు. త్స. విణ. జయింపఁబడినవాఁడు.
విజృంభణము. త్స. వి. మిక్కిలి విజృంభించుట.
విజృంభించు. త్స. క్రి. ౧. చెలరేఁగు. ౨. వికసించు.
విజ్ఞప్తి. త్స. వి. విన్నపము.
విజ్ఞానము. త్స. వి. ౧. కార్యము. ౨. విశేషజ్ఞానము.
విజ్ఞాతుఁడు. త్స. విణ. ప్రసిద్ధుఁడు.
విజ్ఞాపనము. త్స. వి. విన్నపము. క్రి. విజ్ఞాపించు.
విజ్ఞుఁడు. త్స. విణ. ౧. నిపుణుఁడు. ౨. నేర్పరి.
విజ్జోడు. దే. విణ. జతకానిది.
విజ్జోడుపడు. దే. క్రి. భేదపడు.
విటంకము. త్స. వి. గొడుగయందలి గువ్వకూఁడు.
విటకత్తె. దే. వి. లంజె.
విటకాఁడు. దే. వి. విటుఁడు.
విటతటము.
విటతాటకము. } దే. వి. తాఱుమాఱు.
విటతాటనము.
విటపము. త్స. వి. చిగురుకొమ్మ.
విటపి. త్స. వి. చెట్టు.
విటరాయఁడు. త్స. విణ. విటశ్రేష్ఠుఁడు.
విటి. త్స. వి. విటకత్తె.
విటుఁడు. త్స. వి. విటకాఁడు.
విడంబనము. త్స. వి. అనుకరించుట.
విడంబించు. త్స. క్రి. ౧. అనుకరించు. ౨. మోసపుచ్చు.
విడఁద్రొక్కు. } దే. క్రి. విడుచు.
విడనాడు.
విడి. దే. వి. ౧. ప్రతాపము. ౨. అరుణకాంతి. విణ. ౧. విడువఁదగినది. ౨. ప్రత్యేకమైనది.
విడిదల. దే. వి. విడిసినచోటు.
విడిది. దే. వి. ౧. విడిసినచోటు. ౨. విడిసికొనుట.
విడిపట్టు. దే. వి. విడిదిచోటు.
విడిముడి. దే. వి. ధనము.
విడియము. దే. వి. తాంబూలము.
విడియు. దే. క్రి. ౧. బాటసారులు ఒకచోట విశ్రమించు. ౨. జాఱు.

విడఁబడు. దే. క్రి. ౧. జాఱు. ౨. వదలు.

విడివోవు. దే. క్రి. వదలు.

విడు. దే. క్రి. విడు. ప్రే. విడుచు. విడ్చు.

విడుఁగడ. దే. వి. ౧. విడుపు. ౨.

విడుగర. విడుదల.

విడుత. దే. వి. తడవ.

విడుదల. దే. వి. విడుపు.

విడుపు. దే. వి. ౧. విడుదల ౨. దానము.

విడుముడ. దే. వి. విమోచనము.

విడువడు. దే. క్రి. విడివడు.

విడెము. దే. వి. చూ. విడియము.

విడ్డూరము. దే. వి. మహాశ్చర్యము.

విడ్యము. దే. వి. విడియము.

విత.

వితా. దే. వి. వృథా.

వితండవాదము. త్స. వి. అక్రమ వాదము.

వితంతువు. త్స. వి. ముండమోపి.

వితతము. త్స. విణ. విరివియైనది.

వితతి. త్స. వి. సమూహము.

వితము. వై. వి. విధము.

వితరణము. త్స. వి. ౧. దానము. ౨. ఈవి.

వితరణి. త్స. వి. దాత.

వితర్కము. త్స. వి. ౧. ఊహ. ౨. సంశయము.

వితర్కించు. త్స. క్రి. ౧. ఊహించు. ౨. సంశయించు.

వితాకు. దే. వి. ౧. పారవశ్యము. ౨. నిశ్చేష్టత.

వితాకుఁడు. దే. విణ. నిశ్చేష్టితుఁడు.

వితాకుపడు. దే. క్రి. నిశ్చేష్టితుఁడగు.

వితానము. త్స. వి. మేలుకట్టు.

వితావిత. దే. విణ. మిక్కిలివ్యగ్రము.

వితీర్ణము. త్స. వి. ౧. దాటఁబడినది. ౨. ఇయ్యఁబడినది.

వితీర్ణి. త్స. వి. ఈవి.

విత్తనము. దే. వి. విత్తు.

విత్తము. త్స. వి. ౧. ధనము. విణ. ౨. పొందఁబడినది.

విత్తు. దే. క్రి. ౧. (విత్తనములు) చల్లు. వి. ౨. విత్తనము.

విదగ్ధుఁడు. త్స. విణ. నేర్పరి.

విదళనము. త్స. వి. మిక్కిలి భేదించుట. క్రి. విదళించు.

విదళితము. త్స. విణ. మిక్కిలి భేదింపఁబడినది.

విదారణము. త్స. వి. ౧. చీల్చుట. ౨. యుద్ధము.

విదారించు. త్స. క్రి. చీల్చు.

విదిక్కు. త్స. వి. రెండు దిక్కుల నడుమదిక్కు.

విదితము. త్స. విణ. తెలియఁబడినది.

విదీర్ణము. త్స. వి. చీల్పఁబడినది.

విదుచు. దే. క్రి. రాలు. రూ. విదులు.

విదురుచు. దే. ప్రే. విదిలించు. రూ. విదుర్చు.
విదురుపు. దే. వి. విదురుచుట.
విదులు. దే. క్రి. 1. రాలు. ప్రే. 2. విదులుచు.
విదులుపు. దే. వి.1.విదులుచుట. రూ. 2. విదుల్పు.
విదుషి. త్స. వి. విద్వాంసురాలు.
విదూషకుఁడు. త్స. వి. శృంగార నాయక సచివులలో నొకఁడు.
విదేశము. త్స. వి. అన్యదేశము.
విదేశీయుఁడు. త్స. విణ. అన్యదేశస్థుఁడు.
విదేహము. త్స. విణ. దేహము లేనిది.
విద్దె. వై. వి. విద్య.
విద్య. త్స. వి. 1. చదువు. 2. జ్ఞానము.
విద్యమానము. త్స. విణ. వర్తమానము.
విద్యార్థి. త్స. వి. చదువుకోరువాఁడు.
విద్యావంతుఁడు. త్స. వి. చదువరి.
విద్యుత్తు. త్స. వి. 1. సంధ్య. 2. మెఱపు.
విద్రుమము. త్స. వి. 1. చిగురు. 2. పగడము.
విద్వాంసుఁడు. త్స. వి. పండితుఁడు.
విద్వేషణము. } విద్వేషము. } త్స. వి. విరోధము.
విద్వేషి. త్స. వి. పగవాఁడు.
విద్వేషించు. త్స. క్రి. పగగొను.
విధము. త్స. వి. ప్రకారము.
విధవ. త్స. వి. వితంతువు.
విధాత్రుఁడు. త్స. వి.1. మన్మథుఁడు. 2. బ్రహ్మ.
విధానము. త్స. వి.1. ఆజ్ఞ. 2.పూజ. 3. యుక్తి.
విధాయకము. త్స. వి. 1. ఆజ్ఞ. 2. మార్గము.
విధాయకుఁడు. } విధాయి. } త్స. వి. విధించువాఁడు.
విధి. త్స. వి. 1. బ్రహ్మ. 2. ఏర్పాటు.
విధించు. త్స. క్రి. ఏర్పాటుచేయు.
విధుంతుదుఁడు. త్స. విణ. రాహుగ్రహము.
విధుతము. త్స. వి. కదలింపఁబడినది.
విధురము. త్స. విణ. వియోగము నొందినది.
విధూతము. త్స. విణ. కదలింపఁబడినది.
విధూననము. త్స. వి. కదలించుట.
విధేయుఁడు. త్స. విణ. వినయము కలవాఁడు.
విద్ధము. త్స. విణ. తొలువఁబడినది.
విధ్వంసము. త్స. వి. మిక్కిలి విధ్వంసము.
వినతము. త్స. విణ. 1. వంగినది. 2. వంకరైనది.
వినతి. త్స. వి. వినయము.

వినమితము. త్స. విణ. మిక్కిలి వంగినది.
వినమ్రము. త్స. విణ. మిక్కిలి వంగినది.
వినయము. త్స. వి. ౧. నమ్రత. ౨. గురుశిక్ష.
వినాయకుఁడు. త్స. వి. విఘ్నేశ్వరుఁడు.
వినాశము. త్స. వి. మిక్కిలినాశము.
వినికి. } దే. వి. వినుకలి.
వినికిడి. }
వినిమయము. త్స. వి. వస్తువులమార్పు.
వినియోగము. త్స. వి. ౧ ఉపయోగము. క్రి. ౨. వినియోగించు. విణ. ౩. వినియుక్తము.
వినీతుఁడు. త్స. విణ. ౧. వినయముగలవాఁడు. ౨. గురువుచేత శిక్షింపఁబడినవాఁడు.
విను. దే. క్రి. ౧. ఆలకించు వి. ౨. ఆకాశము.
వినుకలి. దే. వి. వినికి. రూ. విన్కలి.
వినుచూలి. దే. వి. వాయువు. రూ. విన్చూలి.
వినువాఁక. దే. వి. గంగానది.
వినోదము. త్స. వి. ౧. చోద్యము. ౨. క్రీడ.
వినోదించు. త్స. క్రి. ౧. క్రీడించు. ౨. ఆటలచేఁ బ్రొద్దుపుచ్చు.
విన్న. వై. విణ. వివర్ణమైనది.
విన్నఁబడు. వై. క్రి. ౧. వివర్ణమగు. వి. ౨. విన్నఁబాటు.
విన్నఁబోవు. దే. క్రి. వివర్ణమగు.
విన్నన. వై. వి. ౧. న్యూనత. ౨. వైవర్ణ్యము.
విన్ననువు. దే. వి. నేర్పు.
విన్నపత్త్రిక. మి. వి. విజ్ఞానపత్త్రిక.
విన్నపము. దే.వి. విజ్ఞాపనము.
విన్నవించు. దే. క్రి. మనవిచేయు.
విన్నాణము. వై. వి. ౧. నేర్పు. ౨. అందము.
విన్నాణి. దే. విణ. నేర్పరి. వి. సన్న్యాసి.
విన్ను. దే. వి. ఆకాశము.
విన్యసించు. త్స. క్రి. ఉంచు.
విన్యస్తము. త్స. విణ. ఉంచఁబడినది.
విన్యాసము. త్స. వి. ౧ ఉనుచుట. ౨. రచన.
విపంచి. త్స. వి. ౧. వీణ. ౨. క్రీడ.
విపక్షుఁడు. త్స. వి. శత్రువు.
విపణి. త్స. వి. అంగడి.
విపత్తి. త్స. వి. ఆపద.
విపత్తు. త్స. వి. ఆపద.
విపథము త్స. వి. చెడుత్రోవ.
విపన్నము. త్స. విణ. విపత్తునొందినది.
విపరీతము. త్స. విణ. వ్యత్యస్తము.
విపర్యస్తము. త్స. వి. వ్యత్యస్తము.
విపర్యాసము. త్స. విణ. వ్యత్యాసము.
విపశ్చితుఁడు. త్స. వి. పండితుఁడు.

విపినము. త్స. వి. అడవి. వ్యు. భయము చేత దీనియందు వణఁకుదురు.
విపుల. త్స. విణ. విశాలమైనది.
విప్పు. దే. స్రే. ౧ విడుచు. వి. ౨ విరియుట.
విప్రకృతుఁడు. త్స. విణ. తిరస్కరింపఁబడినవాఁడు.
విప్రతిపత్తి. త్స. వి. విరోధము.
విప్రతీపము. త్స. విణ. మిక్కిలిప్రతికూలము.
విప్రయోగము. } త్స. వి. స్త్రీపురుషుల
విప్రలంభము. } యెడఁబాటు.
విప్రలబ్ధ. త్స. వి. సంకేతస్థలములందు ప్రియుఁనిఁగానక మోసపోయి వ్యాకులతఁ బొందునట్టి నాయిక.
విప్రలాపము. త్స. వి. పరస్పరవిరుద్ధమైనమాట.
విప్రశ్నిక. త్స. వి. సోదెచెప్పునది.
విప్రుఁడు. త్స. వి. బ్రాహ్మణుఁడు. వ్యు. తన్నును, పరునిని విశేషముగా పాపములనుండి రక్షించువాఁడు.
విప్లవము. త్స. వి. కొల్ల మొదలగు దేశోపద్రవము.
విబుధుఁడు. త్స. వి. ౧. చదువరి. ౨. వేలుపు.
విబూది. దే. వి. విభూతి.
విభక్తము. త్స. విణ. విభజింపఁబడినది.
విభజనము. త్స. వి. విభజించుట. క్రి. విభజించు.
విభవ. త్స. వి. ఒక సంవత్సరము.
విభవము. త్స. వి. ౧. సంపద. ౨. ధనము.
విభాకరుఁడు. త్స. వి. సూర్యుఁడు.
విభాగము. త్స. వి. పంపకము.
విభాగించు. త్స. క్రి. పంచు.
విభాజకము. త్స. విణ. (భాగహారమునందు) విభజించుసంఖ్య.
విభాజితము. త్స. విణ. (భాగహారమునందు) భాగింపగా ఏర్పడిన సంఖ్య.
విభాజ్యము. త్స. విణ. విభజింపఁదగినది.
విభాతము. త్స. వి. వేకువ.
విభావము. త్స. వి. పరిచయము.
విభావరి. త్స. వి. రాత్రి.
విభాకనుఁడు. త్స. వి. సూర్యుఁడు.
విభీషణము. త్స. విణ. భయంకరమైనది.
విభుఁడు. త్స. వి. ౧. శివుఁడు. ౨. ప్రభువు.
విభూతి. త్స. వి. ౧. ఐశ్వర్యము. ౨. బూది.
విభూషణము. త్స. వి. తొడవు.
విభ్రమము. త్స. వి. భ్రమ.
విమర్శనము. త్స. వి. ౧. పరామర్శము. క్రి. ౨. విమర్శించు.
విమల. త్స. విణ. ౧. ఒప్పిదమైనది. ౨. నిర్మలమైనది.
విమాత. త్స. వి. సవతితల్లి.

విమానము. త్స. వి. ౧. అంతరిక్షమునఁ బోయెడి రథము. ౨. గుజ్జము.

విముక్తము. త్స. విణ. విడువఁబడినది.

విమోచనము. త్స. వి. మిక్కిలివిడుదల.

విమోహము. త్స. వి. మిక్కిలి మోహము. క్రి. వి. మోహించు.

వియంతుఁడు. త్స. విణ. దిట్టతనము గలవాఁడు.

వియచ్చరుఁడు. త్స. వి. ఖేచరుఁడు.

వియత్తు. త్స. వి. ఆకాశము.

వియద్గంగ. త్స. వి. ఆకాశగంగ.

వియోగము. త్స. వి. ఎడఁబాటు.

వియ్యంకుఁడు. దే. వి. వియ్యమందినవాఁడు.

వియ్యంకురాలు. దే. వి. వియ్యమందినది.

వియ్యపురాలు.
వియ్యపుసాని. } దే. వి. వియ్యమందినది.

వియ్యమందు. దే. క్రి. సంబంధముచేయు.

వియ్యము. దే. వి. ౧. వైవాహిక సంబంధము. ౨. స్నేహము.

విరక్తి. త్స. వి. రాగములేమి.

విరక్తుఁడు. త్స. విణ. అనురాగములేనివాఁడు.

విరచించు. త్స. క్రి. విశేషముగా రచియించు.

విరచితము. త్స. విణ. విశేషముగా రచియింపఁబడినది.

విరజాజి.
విరజాది. } దే. వి. జాజివగ. రూ. విరవాజి.

విరతి. త్స. వి. విశ్రాంతి.

విరమించు. త్స. క్రి. ఉడుగు.

విరవిర. దే. వి. చూ. విలవిల.

విరవిరపోవు. దే. క్రి. చూ. విలవిలపోవు.

విరసము. త్స. విణ. ౧. విరుద్ధరసము గలది. ౨. పసలేనిది.

విరసించు. త్స. క్రి. ౧. విరోధించు. ౨. విరసత్వమొందు.

విరహము. త్స. వి. వియోగము.

విరహి. త్స. వి. విరహముకలవాఁడు.

విరహిణి. త్స. వి. విరహముకలది.

విరహోత్కంఠిత. త్స. వి. వేళకు నాయకుఁడు రాక తడయఁగా విరహముచేత తహతహపడు నాయిక.

విరళము. త్స. విణ. ఎడమైనది.

విరాగుఁడు. త్స. విణ. విషయములందిచ్ఛ లేనివాఁడు.

విరాట్టు. త్స. వి. ఆదిదేవుఁడు.

విరామము. త్స. వి. విశ్రాంతి.

విరావము. త్స. వి. ధ్వని.

విరాళము. త్స. విణ. వలపును బుట్టించునది. దే. వి. వలపు.

విరాళి. వై. వి. ౧. భక్తి. ౨. మోహము.

విరి. దే. వి. ౧. పూవు. విణ. ౨. వికసించినది.

విరించనుఁడు. త్స. వి. బ్రహ్మ.

విరించి. త్స. వి. ,,

విరించుఁడు. త్స. వి. బ్రహ్మ

విరిఁబోఁడి. దే. వి. పువ్వువలె మనోజ్ఞురాలు.

విరియఁబడు. దే. క్రి. ౧. వీడు. ౨. వదలు.

విరియఁబాఱు. దే. క్రి. ౧. వీడు. ౨. వ్యాపించు.

విరియఁబోయు. దే. క్రి. (తలవెండ్రుకల ముడివిప్పి) వ్రేలాడవిడుచు.

విరియు. దే. క్రి. ౧. ఉప్పొంగు. ౨. వికసించు.

విరివాయు. దే. క్రి. ౧. గాయవడు ౨. చీలు.

విరివి. దే. వి. ౧. విస్తృతి. విణ. ౨. విస్తృతము.

విరివిడి. దే. వి. విస్తృతి.

విరివిలుకాఁడు. దే. వి. మన్మథుఁడు.

విరుద్ధము. త్స. విణ. విరోధముకలది.

విరూపము. త్స. విణ. ౧. బేసి. ౨. వంకరైనది.

విరోధము. త్స. వి. ౧. పగ. క్రి. ౨. విరోధించు.

విరోధికృత్తు. త్స. వి. ఒక సంవత్సరము.

విఱిచికట్టు. దే. క్రి. (చేతులను) వెనుకకు మఱలించి కట్టు.

విఱివి. దే. వి. వైశాల్యము.

విఱుగఁబడు. దే. క్రి. ౧. గర్వించు. వి. ౨. విఱుఁగబాటు.

విఱుగడ. దే. వి. విరామము.

విఱుగు. దే. క్రి. ౧. తునియు. ౨. పాకముచెడు.

విఱుగుడు. దే. వి. ౧. విఱిగినవస్తువు. విణ. ౨. విఱుపైనది.

విఱుచు. దే. ప్రే. విఱుఁగఁజేయు.

విఱుపు. దే. వి. ౧. విఱుచుట. విణ. ౨. విఱుగుడు.

విఱ్ఱవీఁగు. దే. క్రి. మిక్కిలి నిక్కు.

విలంబము. త్స. వి. జాగు.

విలక్షణము. త్స. విణ. విశేషమైన లక్షణముకలది.

విలక్షుఁడు. త్స. విణ. సిగ్గుపడ్డవాఁడు.

విలపించు. త్స. వి. దుఃఖముతో వదరు.

విలయము. త్స. వి. ప్రళయము.

విలవిల. దే. వి. తన్నుకొనుటయందగు ధ్వన్యనుకరణము.

విలవిలపోవు. దే. క్రి. విహ్వలతఁజెందు.

విలసిల్లు. త్స. క్రి. ౧. ప్రకాశించు. వి. ౨. విలసనము.

విలాతి. దే. వి. దేశము.

విలాపము. త్స. వి. దుఃఖముతోఁడి మాట.

విలాపించు. త్స. క్రి. విలపించు.

విలాసము. దే. వి. జాబుమీఁద వ్రాసెడి పేరును, ఊరును, తపాలును మున్నగు వ్రాఁత. త్స. వి. ౧. క్రీడ. ౨. స్త్రీశృంగార చేష్టావిశేషము.

విలాసి. త్స. వి. మన్మథుఁడు.

విలాసిని. త్స. వి. విలాసవతి.

విలియవేయు. దే. క్రి. సరిచూచు.

విలీనము. త్స. విణ. కరగినది.

విలు. దే. వి. 'విల్లు' యొక్క రూపాంతరము.

విలుకాఁడు. దే. వి. విల్లుపూనినవాఁడు.

విలుచు. దే. క్రి. వెలను ఇచ్చి కొను. రూ. విల్చు.

విలువ. దే. వి. వెల.

విలేపనము. త్స. వి. పూఁత.

విలోకించు. త్స. క్రి. ౧. చూచు. వి. ౨. విలోకనము.

విలోమము. త్స. విణ. అవరోహణ క్రమము కలది.

విల్లు. దే. వి. ధనుస్సు. రూ. విలు.

వివక్ష. త్స. వి. చెప్పనిచ్చ.

వివక్షించు. త్స. క్రి. చెప్ప నిచ్ఛించు.

వివధము. త్స. వి. కావడి.

వివరణము. త్స. వి. వ్యాఖ్యానము.

వివరము. వై. వి. వివరణము.

వివరించు. వై. క్రి. ౧. విచారించు. ౨. చెప్పు.

వివర్ణుఁడు. త్స. విణ. ౧. మూర్ఖుఁడు. ౨. తెల్లఁబాఱిన ముఖము కలవాఁడు.

వివశుఁడు. త్స. వి. స్వవశముకాని బుద్ధికలవాఁడు.

వివస్వంతుఁడు. త్స. వి. సూర్యుఁడు.

వివాదము. త్స. వి. తగవు.

వివాహము. త్స. వి. పెండ్లి. (ఇది ఎనిమిది విధములు :—౧. బ్రాహ్మము. ౨. దైవము. ౩. ఆర్షము. ౪. ప్రాజాపత్యము. ౫. ఆసురము. ౬. గాంధర్వము. ౭. రాక్షసము. ౮. పైశాచము.)

వివిక్తము. త్స. విణ. ఏకాంతము.

వివిధము. త్స. విణ. అనేకవిధములుగలది.

వివృతము. త్స. విణ. తెఱవఁబడినది.

వివేకము. త్స. వి. ౧. తెలివి. ౨. విచారము.

వివేకించు. త్స. క్రి. విచారించు.

వివ్వచ్చుఁడు. వై. వి. అర్జునుఁడు.

విశంకటము. త్స. విణ. విరివి గలది.

విశదము. త్స. విణ. స్పష్టమైనది.

విశదీకరించు. త్స. క్రి. స్పష్టపఱచు.

విశయము. త్స. వి. సందేహము.

విశల్యకరణి. త్స. వి. ఓషధివిశేషము.

విశసనము. త్స. వి. చంపుట.

విశాఖ. త్స. వి. ఒక నక్షత్రము.

విశాఖుఁడు. త్స. వి. కుమారస్వామి.

విశారదుఁడు. త్స. వి. ౧. విద్వాంసుఁడు. ౨. నేర్పరి.

విశాలము. విణ. విరివియైనది.

విశిఖ. త్స. వి. రాజమార్గము.

విశిఖము. త్స. వి. బాణము.

విశిష్టము. త్స. విణ. కూడుకొన్నది.

విశీర్ణము. త్స. విణ. ౧. పడలినది. ౨. కుష్కించినది.

విశృంఖలము. త్స. విణ. అడ్డులేనిది.
విశేషణము. త్స. వి. గుణవాచకశబ్దము.
విశేషము. త్స. వి. ౧. భేదము. ౨. వింతరూపము.
విశేషించు. త్స. క్రి. అతిశయించు.
విశేష్యము. త్స. వి. వస్తువాచకశబ్దము.
విశ్రమించు. త్స. క్రి. ఊరడిల్లు.
విశ్రాంతము. త్స. విణ. ఊఱడిల్లినది.
విశ్రాంతి. త్స. వి. ఊరట.
విశ్రాణనము.త్స.వి.౧.ఈవి.౨.త్యాగము
విశ్రామము. త్స. వి. విశ్రమముయొక్క రూపాంతరము.
విశ్రుతము. త్స. విణ. మిక్కిలి ప్రసిద్ధికెక్కినది.
విశ్రుతి. త్స. వి. మిక్కిలి ప్రసిద్ధి.
విశ్రుతుఁడు. త్స. వి. ప్రసిద్ధిఁజెందినవాఁడు.
విశ్లేషము. త్స. వి. ఎడఁబాటు,
విశ్వంభర. త్స. వి. భూమి. వ్యు. విశ్వమును ధరించునది.
విశ్వంభరుఁడు. త్స. వి. విష్ణువు.
విశ్వకర్మ. త్స. వి. దేవశిల్పి. రూ. విశ్వకర్ముఁడు.
విశ్వజనీనము. త్స. విణ. సర్వజనులకును హితమైనది.
విశ్వతోముఖము. త్స. విణ. అంతటను వ్యాపించినది.
విశ్వనాథుఁడు. త్స. వి. శివుఁడు.
విశ్వము. త్స. వి. ౧. లోకము. విణ. ౨. సమస్తము.
విశ్వసనీయము. త్స. విణ. నమ్మఁదగినది.
విశ్వసించు. త్స. క్రి. నమ్ము.
విశ్వసితము. త్స. విణ. నమ్మఁబడినది.
విశ్వస్త. త్స. వి. విధవ. వ్యు. మృతప్రాయమైనది గనుక ప్రాణము లేనిదానివలె నుండునది.
విశ్వామిత్రుఁడు. త్స. వి. ఒక ముని.
విశ్వాసము. త్స. వి. నమ్మకము.
విశ్వాసి. త్స. విణ. విశ్వాసము గలవాఁడు.
విషణ్ణుఁడు. త్స. విణ. విషాదము నొందినవాఁడు.
విషధరము. త్స. వి. పాము.
విషధరుఁడు. త్స. వి. శివుఁడు.
విషమము. త్స. విణ. సమముకానిది.
విషమించు. త్స. క్రి. విరోధించు.
విషయము. త్స. వి. ౧. దేశము. ౨. పాయకట్టు. 3. సంగతి.
విషయి. త్స. వి. ఇంద్రియము.
విషయీకరించు. త్స. క్రి. ఉద్దేశించు.
విషవైద్యుఁడు. త్స. వి. పాముల వాఁడు.
విషాణము. త్స. వి. కొమ్ము.
విషాదము. త్స. వి. ఖేదము.
విషాదించు. త్స. వి. ఖేదపడు.
విషు. త్స. వి. ఒక సంవత్సరము.

విషూచిక. త్స. వి. వాంతిభేది జాడ్యము. రూ. విషూచి. (కలరా)
విష్కంభము. త్స. వి. ౧. విరివి. ౨. నాటకాంగము 3. ఒకయోగము.
విష్కరము. త్స. వి. పక్షి.
విష్టపము. త్స. వి. లోకము.
విష్టరము. త్స. వి. ఆసనము.
విష్టరశ్రవుఁడు. త్స. వి. విష్ణువు.
విష్టి. త్స. వి. కూలి.
విష్ఠ. త్స. వి. మలము.
విష్ఠించు. త్స. క్రి. ౧. ఏరుగు. ౨. మలమును విడుచు.
విష్ణుపదము. త్స. వి. ౧. ఆకాశము. ౨. పాలసముద్రము.
విష్ణుపది. త్స. వి. ౧. గంగ. ౨. ద్వారక.
విష్ణువు. త్స. వి. వెన్నుఁడు. వ్యు. విశ్వమును వ్యాపించి యుండువాఁడు.
విష్వక్సేనుఁడు. త్స. వి. విష్ణువు.
విసంవాదము. త్స. వి. ముందు ఒప్పుకొని లేదని వాదించుట.
విసదారి. దే. వి. పాము.
విసనకఱ్ఱ. దే. వి. వీవన.
విసము. వై. వి. ౧. జలము. ౨. విషము.
విసరణము. త్స. వి. ప్రసరణము.
విసరము. త్స. వి. సమూహము.
విసరియాడు. దే. క్రి. విసరు.
విసరు. వై. క్రి. ౧. వీచు. ౨. వేయు. 3. వి. వీచుట.
విసర్గము. త్స. వి. ౧. త్యాగము. ౨. మలవిసర్జనము.
విసర్జనము. త్స. వి. ౧. విడుపు. ౨. ఈవి. క్రి. 3. విసర్జించు.
విసవిస. దే. వి. త్రిప్పాటయందగు ధ్వని కనుకరణము.
విసిమాలు. దే. క్రి. మిక్కిలి విసుగు.
విసుగు. దే. క్రి. నిర్వేదించు.
విసుమానము. దే. వి. ఆశ్చర్యము.
విసువాసము. వై. వి. విశ్వాసము.
విసువాసి. దే. వి. నమ్మకముకలవాఁడు.
విసువు. దే. వి. విసుగు.
విస్పృత్వరుఁడు. త్స. విణ. ప్రసరించునట్టి స్వభావము గలవాఁడు.
విస్పృమరుఁడు. త్స. విణ. ,,
విస్పృష్టము. త్స. విణ. ౧. విసరివేయఁబడినది. ౨. విడువఁబడినది.
విస్తర. } దే. వి. విస్తరాకు.
విస్తరి. }
విస్తరము. త్స. వి. ౧. స్నేహము. ౨. విరివి.
విస్తరించు. త్స. ప్రే. విస్తరిల్లఁజేయు.
విస్తరిలు. త్స. క్రి. విరివియగు. రూ. విస్తరిల్లు.
విస్తారము. త్స. వి. విరివి.
విస్తీర్ణము. త్స. వి. విశాలము.
విస్తృతము. త్స. విణ. విరవియైనది.
విస్ఫారము. త్స. విణ. మిక్కిలి అధికమైనది.

విస్మయము. త్స. వి. ౧. గర్వము. ౨. ఆశ్చర్యము. విణ. 3. ఆశ్చర్యకరమైనది.

విస్మితుఁడు. త్స. విణ. ఆశ్చర్యమొందినవాఁడు.

విస్మృతము. త్స. విణ. విస్మృతినొందినది.

విస్మృతి. త్స. వి. మఱపు.

విస్రంభము. త్స. వి. నమ్మకము.

విస్రబ్ధము. త్స. విణ. నమ్మఁబడినది.

విహంగమము. / విహంగము. / విహగము. } త్స. వి. పక్షి. వ్యు. ఆకాశమునఁబోవునది.

విహరణము. త్స. వి. విహారము.

విహర్త. త్స. విణ. విహరించువాఁడు.

విహసితము. త్స. వి. మృదుధ్వనిగల నవ్వు.

విహస్తుఁడు. త్స. విణ. నెమ్మదిలేని మనస్సు గలవాఁడు.

విహాయసము. త్స. వి. ఆకాశము.

విహారము. త్స. వి. ౧. బౌద్ధాలయము. ౨. త్రిప్పట.

విహితము. త్స. వి. విధింపఁబడినది.

విహృతము. త్స. వి. స్త్రీలశృంగార చేష్టా విశేషము.

విహ్వలించు. త్స. క్రి. భయాదులచే అవయవముల యధీనత తప్పినవాఁడగు.

విహ్వలుఁడు. త్స. వి. భయాదులచే అవయవముల యధీనత తప్పినవాఁడు.

విళంబి. త్స. వి. ఒక సంవత్సరము.

వీ

వీఁక. దే. వి. ౧. ఉత్సాహము. ౨. రీతి. 3. గర్వము.

వీఁగు. దే. క్రి. ౧. ఉత్సహించు. ౨. నిక్కు. 3. చలించు.

వీఁపు. దే. వి. వెనుకమేను.

వీకు. దే. వి. ౧. ఉద్ధతి. ౨. ఉన్నతి.

వీక్షణము. త్స. వి. ౧. చూపు. క్రి. ౨. వీక్షించు.

వీచి. త్స. వి. ౧. కొంచెము. ౨. అల.

వీచు. దే. క్రి. ౧. విసరు. ౨. (గాలి) విసరు.

వీచోపులు. దే. వి. వింజామరలు.

వీజనము. త్స. వి. విసనకఱ్ఱ.

వీటతెటము. / వీటతాటనము. / వీటతాటము. / విటతెలము. / విటతాటము. } దే. వి. తాఱుమాఱు.

వీటి. త్స. వి. తాంబూలము.

వీటిఁబోవు. దే. క్రి. ౧. వ్యర్థమగు. ప్రే. ౨. వీటిఁబుచ్చు.

వీటిక. త్స. వి. తాంబూలము.

వీడియము. వై. వి. తాంబూలము. రూ. వీడెము.

వీడు. దే. వి. ౧. పట్టణము. ౨. కట్టనము. ౩. దండు. క్రి. ౧. కొనసాగు. ౨. వదలు.
వీడుకొను. దే. క్రి. ౧. వదలు. ౨. పోయి వచ్చెదనని చెప్పుకొని వదలు.
వీడుకోలు. దే. వి. ౧. చావు. ౨. పోవననుమతి.
వీడుచే. దే. ప్రే. వీడఁజేయు.
వీడుజోడాడు. దే. క్రి. మాఱుపాటు నొందు.
వీడుజోడు. దే. విణ. విజోడు.
వీడుపట్టు. దే. వి. ౧. వాసస్థానము. ౨. దండు విడియుచోటు.
వీడుపడు. దే. క్రి. ౧. తడఁబడు. ౨. మాఱుపడు.
వీడుపాటు. దే. వి. మాఱుపాటు.
వీడెము. దే. వి. 'వీడియము' యొక్క రూపాంతరము.
వీడ్యము. దే. వి. ,,
వీడ్వడు. దే. క్రి. 'వీడుపడు' నకు రూపాంతరము.
వీణ. త్స. వి. తంత్రికార్య విశేషము.
వీణము. దే. వి. సన్నవస్త్రము.
వీణాము. దే. వి. ,,
వీణియ. దే. వి. ౧. కస్తూరి మృగము యొక్క కస్తూరియుండు బొడ్డుకాయ. ౨. వీణ.
వీణె. దే. వి. ,,
వీతము. త్స. విణ. పోయినది.
వీతిహోత్రుఁడు. త్స. వి. అగ్ని.
వీతెంచు. దే. క్రి. వీచు.
వీది. దే. వి. ఇండ్లవరుసల నడిత్రోవ.
వీధి. త్స. వి. ,,
వీను. దే. వి. ౧. ప్రసిద్ధి. ౨. చెవి.
వీనులవిందు = చెవికింపైనది.
వీనుమిగులు. దే. క్రి. ప్రసిద్ధికెక్కు.
వీయము. దే. వి. వియ్యము.
వీరకత్తియ. దే. వి. వియ్యంకురాలు.
వీరకాఁడు. దే. వి. వియ్యంకుఁడు.
వీరణము. త్స. వి. చర్మవాద్య విశేషము.
వీరతాయెతు. త్స. వి. వీరులు పేరుగాఁ గట్టుకొను తాయెతు.
వీరపత్ని. త్స. వి. వీరునిఁ బెండ్లాడిన భార్య.
వీరపాణము. త్స. వి. యుద్ధము కడపటఁగాని మధ్యగాని వీరులుచేయు గోష్ఠిపానము.
వీరము. వై. వి. బీరము.
వీరాయితము. త్స. వి. పురుషాయితము.
వీరాసనము. త్స. వి. దేనిమీఁదను ఆనక కూర్చుండుట.
వీర్యము. త్స. వి. ౧. తేజము. ౨. పరాక్రమము.
వీఱేఁడి. దే. విణ. చూ. వేఱేఁడి.
వీలు. దే. విణ. ౧. అనుకూలము. క్రి. ౨. ఉపయోగించు.
వీలుపడు. దే. క్రి. అనుకూలపడు.

వీవన. దే. వి. విసనకఱ్ఱ.
వీవలి దే. వి. గాలి.
వీసము. దే. వి. ౧. ఒకటు పదునాఱవ పాలు. ౨. రూకలో పదునాఱవపాలు.
వీసర. దే. వి. కొఱఁత.
వీసరపడు. } దే. క్రి. వెలితిపడు.
వీసరపోవు. }

వృ

వృంతము. త్స. వి. ౧. చన్నుమొన. ౨. తొడిమ.
వృకము. త్స. వి. తోడేలు.
వృకోదరుఁడు. త్స. వి. భీముఁడు.
వృక్షము. త్స. వి. చెట్టు.
వృజినము. త్స. వి. పాపము.
వృతి. త్స. వి. వెలుగు.
వృతుఁడు. త్స. విణ. వరింపఁబడినవాఁడు.
వృత్తము. త్స. వి. ౧. జీవనము. ౨. పద్యభేదము. విణ. 3. చుట్టఁబడినది.
వృత్తాంతము. త్స. వి. ౧. కథ. ౨. సమాచారము.
వృత్తి. త్స. వి. ౧. జీవనోపాయము. (ఇది నాల్గువిధములు. — కృషి. ౨. పాశుపాల్యము. 3. వాణిజ్యము. ౪. సేవ.) ౨. నడవడిక. 3. అభిధాది. (ఇవిమూఁడు—౧. అభిధ. ౨. లక్షణ. 3. వ్యంజన.) ౪. కైశికాది. (ఇవి నాల్గు—౧. కైశికి. ౨. ఆరభటి. 3. సాత్వతి. ౪. భారతి.)
వృత్రహుఁడు. త్స. వి. ఇంద్రుఁడు.
వృత్రుఁడు. త్స. వి. ౧. ఒకానొక రాక్షసుఁడు. ౨. పగవాఁడు.
వృథ. } త్స. అవ్య. వ్యర్థముగా.
వృథా. }
వృద్ధ. త్స. విణ. ముసలిది.
వృద్ధము. త్స. విణ. వృద్ధిఁబొందినది.
వృద్ధశ్రవుఁడు. త్స. విణ. ఇంద్రుఁడు.
వృద్ధి. త్స. వి. ౧. సమృద్ధి. ౨. అభివృద్ధి. 3. వడ్డి. ౪. గుణకారము.
వృద్ధుఁడు. త్స. విణ. ముసలివాఁడు.
వృశ్చికము. త్స. వి. ౧. తేలు. ౨. ఒకరాశి
వృషణము. త్స. వి. ముష్కము.
వృషధ్వజుఁడు. త్స. వి. శివుఁడు.
వృషభము. త్స. వి. ౧. ఒకరాశి. ౨. ఎద్దు.
వృషలి. త్స. వి. శూద్రస్త్రీ.
వృషలుఁడు. త్స. వి. ౧. శూద్రుఁడు. ౨. చంద్రగుప్తుఁడు.
వృషాకపాయి. త్స. వి. ౧. లక్ష్మి. ౨. పార్వతి.
వృషాకపి. త్స. వి. ౧. విష్ణువు. ౨. శివుఁడు.
వృష్టి. త్స. వి. వాన.

వె

వెంగలి. వై. విణ. అవివేకి. రూ. వెంగళి.
వెంగలివిత్తు. దే. విణ. మూఢాగ్రేసరుఁడు.

వెంట. దే. వి. ౧. కార్యము. ౨. విధము. అవ్య. ౩. వెంబడి.
వెంటి. దే. వి. కసవు పిరి.
వెండి. దే. అవ్య. ౧. పిమ్మట. ౨. మఱి. వి. ౩. రజతము.
వెండ్రుక. దే. వి. కేశము.
వెంపరలాడు. దే. క్రి. పీడించు.
వెంబడి. దే. అవ్య. వెంట.
వెంబడించు. దే. క్రి. వెనుకొను.
వెంబర. దే. విశ. ౧. అవివేకి. ౨. దుష్టుఁడు.
వెంబరవిత్తు. దే. వి. ౧. మూఢాగ్రేసరుఁడు. ౨. దుష్టాగ్రేసరుఁడు.
వెకలి. వై. విశ. మూఢుఁడు. రూ. వెక్కలి.
వెక్కసపడు. దే. క్రి. ౧. దుస్సహత్వము నొందు. వి. ౨. వెక్కసపాటు.
వెక్కసము. దే. వి. ౧. దుస్సహత్వము. ౨. బ. దుస్సహవచనములు. ౩. దుర్లభము.
వెక్కసి. దే. విశ. ౧. దుస్సహుఁడు. ౨. దుస్సహురాలు.
వెక్కసించు. దే. క్రి. దుస్సహమగు.
వెక్కిరించు. దే. క్రి. ౧. గేలిచేయు. వి. ౨. వెక్కిరింత.
వెక్కిరింతలాడు. దే. క్రి. వికారచేష్టలు సేయు.
వెక్కిలి. వై. వి. దప్పి మొదలగు వాని చేఁ గలిగెడిరోగము. (బ) వెక్కిళ్లు.
వెక్కు. వై. క్రి. ౧. వెక్కిలివిడుచు. ౨. ఏడ్చు.
వెక్కురు. వై. విశ. వికారము పట్టిన వాఁడు.
వెగటు. వై. వి. ౧. రుచిలేమి. విశ. ౨. విరసము.
వెగడు. దే. వి. ౧. తడఁబాటు. క్రి. ౨. వెగడుపడు.
వెగ్గలము. దే. విశ. అధికము.
వెగ్గలీఁడు. దే. విశ. అధికుఁడు.
వెచ్చించు. దే. క్రి. వెచ్చము చేయు.
వెచ్చ. దే. విశ. ౧. వేఁడిమి. ౨. కాక. (వేఁడివెచ్చలు.)
వెచ్చకాఁడు. దే. వి. విటుఁడు.
వెచ్చన. దే. వి. వేఁడిమి.
వెచ్చపడు. దే. క్రి. ఖర్చగు.
వెచ్చపెట్టు. దే. క్రి. ఖర్చుపెట్టు.
వెచ్చము. దే. వి. వ్యయము.
వెజ్జు. వై. వి. వైద్యుఁడు.
వెజ్జురాలు. వై. వి. వైద్యురాలు.
వెట్ట. దే. వి. ౧. వేఁడిమి. ౨. వెట్టకారు.
వెట్టకారు. దే. వి. గ్రీష్మర్తువు.
వెట్టము. దే. వి. శత్రువు (చుట్టము. (వ్యతి) వెట్టము.)
వెట్టి. వై. వి. కూలి లేక చేసెడి పని.
వెట్టిగొను. దే. క్రి. వెట్టిచేయించు.
వెట్టివాఁడు. దే. వి. బత్తెము లేక ఊరక పనిచేయువాఁడు.

వెడ. దే. విశే. ౧. తుచ్ఛము. (వెడమాట) ౨. అల్పము. (వెడపని) క్రి. విశే. ౩. ఇంచుక.

వెడఁగు. దే. వి. ౧. అవివేకము. విశే. ౨. అవివేకి.

వెడఁగుపడు. దే. క్రి. ౧. అవివేకము నొందు. వి. ౨. వెడఁగుపాటు.

వెడఁద. దే. విశే. విశాలము. రూ. వెణఁద.

వెడలు. దే. క్రి. ౧. బయలుదేఱు. ప్రే. ౨. వెడలుచు.

వెడవెడ. దే. విశే. సూక్ష్మము.

వెడ్డరి. దే. వి. కపటి.

వెడ్డు. దే. వి. ౧. కపటము. ౨. వంచన.

వెడ్డువెట్టు. దే. క్రి. వంచించు.

వెత. వై. వి. దుఃఖము.

వెతకు. దే. క్రి. వెదకు.

వెద. దే. వి. ౧. పక్షిగర్భాధానము. ౨. కొప్పు.

వెదకు. దే. క్రి. ౧. వెతకు. వి. ౨. వెదకుడు.

వెదచల్లు. దే. క్రి. ౧. వ్యాపింపఁజేయు. ౨. పాఱఁజల్లు.

వెదపెట్టు. దే. క్రి. విత్తు.

వెదావు. దే. వి. ఆఁబోతుచే వెనుకొనఁబడు ఆవు.

వెదురు. దే. వి. వేణువు.

వెదురుప్పు. దే. వి. వెదురుపాలు.

వెనకయ్య. దే. వి. వినాయకుఁడు.

వెనకు. దే. క్రి. ౧. వెదకు. వి. ౨. వెనకుడు.

వెనుఁబడు. దే. క్రి. ౧. దుఃఖించు. వి. ౨. వెనుఁబాటు.

వెనుక. దే. వి. పశ్చాద్భాగము.

వెనుకద్రొక్కు. దే. క్రి. వెనుదీయు.

వెనుకొను.
వెనుచఱచు.
వెనుతవులు.
వెనుఁదన్ను.
} దే. క్రి. వెంబడించు.

వెనుదీయు. దే. క్రి. వెనుకకు మరలు.

వెనువెంట. దే. అవ్య. మిక్కిలి వెంబడి.

వెన్న. దే. వి. నవనీతము.

వెన్నంటు. దే. క్రి. వెంబడించు.

వెన్నడి. దే. వి. వెంబడి.

వెన్నడించు. దే. క్రి. వెంబడించు.

వెన్నడికొను. దే. క్రి. ,,

వెన్నప్పము. దే. వి. మధురభక్ష్యవిశేషము.

వెన్నాడు. దే. క్రి. వెంబడించు.

వెన్నిచ్చు. దే. క్రి. వెనుదీయు.

వెన్ను. దే. వి. ౧. ఇంటినడికొప్పు. ౨. వీపు.

వెన్నుఁడు. దే. వి. విష్ణువు.

వెన్నుగాఁడి. దే. వి. ఇంటినడికొప్పుమ్రాను.

వెన్నుదన్ను. దే. క్రి. చూ. వెనుఁదన్ను.

వెన్నుబూస.
వెన్నెముక.
} దే. వి. వీఁపునడిమియెముక.

వెన్నెల. దే. వి. చంద్రిక.
వెన్నెలకారు. దే. వి. శరదృతువు.
వెన్నెలకుప్పలు. దే. వి. బాలక్రీడా విశేషము.
వెన్నెలపులుఁగు. దే. వి. చకోరము.
వెన్నెలబొమ్మ = సౌందర్యవతి.
వెన్నెలఱేఁడు. దే. వి. చంద్రుఁడు.
వెయి. దే.వి. 'వేయికి' రూపాంతరము.
వెరఁగు. దే. వి. ౧. నిశ్చేష్టత. ౨. ఆశ్చర్యము.
వెరవరి. దే. విణ. ఉపాయశాలి.
వెరవు. దే. వి. ౧. యుక్తి. ౨. రీతి. విణ. 3. యుక్తము.
వెరవేఁకి. దే. వి. విరహతాపము.
వెరసి.దే.వి.౧. లెక్కమొత్తము.విణ.౨. కడపటిది. (వెరసిమాట = తుదిమాట)
వెరువు దే. వి. చూ. వెరపు.
వెఱ. దే వి. భయము.
వెఱఁగు. దే. వి. ౧. ఆశ్చర్యము. ౨. నిశ్చేష్టత.
వెఱఁగుపడు. దే. క్రి. నిశ్చేష్టతనొందు. వి. వెఱఁగుపాటు.
వెఱఁగొందు. దే. క్రి. ఆశ్చర్యపడు.
వెఱచెఱచు. దే. క్రి. భయపడు.
వెఱచు. దే. క్రి. భయపడు.
వెఱపరి. దే. విణ. భయముకలవాఁడు.
వెఱపిఁడి. దే. విణ. భయములేనివాఁడు.
వెఱపు. దే. వి. భయము.
వెఱబొమ్మ. దే. వి. కొయ్యబొమ్మ.
వెఱవెఱపాటు. దే. వి. నిశ్చేష్టత.
వెర్రి. దే. వి. పిచ్చి.
వెర్రినీళ్లు. దే. వి. కల్లు.
వెర్రిబాగులు. దే. వి. అవివేకి.
వెల. దే. వి. మూల్యము.
వెలఁగ. దే. వి. కపిత్థము.
వెలఁది. దే. వి. ౧. ఆఁడుది. విణ. ౨. నిర్మలము.
వెలఁదుక. దే. వి. వెలఁది.
వెలచు. దే. క్రి. శుద్ధిసేయు.
వెలనాడు. దే. వి. ౧. దేశవిశేషము. ౨. ఒకబ్రాహ్మణజాతి విశేషము.
వెలమ. దే. వి. శూద్రజాతి విశేషము.
వెలయాలు. దే. వి. భోగముది.
వెలయు. దే. క్రి. ప్రకాశించు.
వెలరారు. దే. క్రి. తెల్లనగు.
వెలలు. దే. క్రి. వెళ్ళు.
వెలవెలఁబాఱు. } దే. క్రి. వివర్ణమగు.
వెలవెలఁబోవు. }
వెలవెలపాటు. వై. వి. వైవర్ణ్యము.
వెలార్చు. } దే. క్రి. ౧. బయలుపఱచు. ౨. వెలిగించు.
వెలారుచు. }
వెలి. దే.వి.౧. బహిష్కారము. ౨.బయలు
వెలికిలు. దే. క్రి. వీఁపుక్రిందుగాఁ బరుండు.
వెలిగడ. దే. వి. మెట్టనేల.
వెలిగారము. దే. వి. బంగారమునకుఁ గాంతి కలుగఁజేయు నొక విధమైన ఉప్పు.

వెలిగిడ్డి. దే. వి. కామధేనువు.
వెలిగారు. దే. వి. ఐరావతము.
వెలిచవి. దే. వి. జారత్వము.
వెలితి. దే. వి. ౧. కొఱఁత. విణ. ౨. తక్కువైనది.
వెలిపుచ్చు. దే. క్రి. బయలుపఱచు.
వెలిపెట్టు. దే. క్రి. వెలివేయు.
వెలిమిడి. దే. వి. భస్మము.
వెలిమ్రాను. దే. వి. కల్పవృక్షము.
వెలియు. దే. క్రి. వానకురిసి నిలుచు.
వెలివాఁడు. దే. వి. చండాలుఁడు.
వెలివాడ. దే. వి. చండాల వాటిక.
వెలివిరియు. దే. క్రి. చూ. వెల్లివిరియు.
వెలివేయు. దే. క్రి. బహిష్కరించు.
వెలుఁగు. దే. క్రి. ౧. ప్రకాశించు. వి. ౨. ప్రకాశము.
వెలుఁగొందు. దే. క్రి. ప్రకాశించు.
వెలుగు. దే. వి. కంచె. రూ. వెల్గు.
వెలుచు. దే. క్రి. 'వెలఁచు'నకు రూపాంతరము.
వెలుపల దే. వి. బహిఃప్రదేశము.
వెలుపలించు. దే. క్రి. వెలిపఱచు.
వెలువడు. దే. క్రి. బయలుపడు.
వెలువరించు, వెలువఱచు. దే క్రి వెలువడఁజేయు.
వెల్ల. వై. విణ. తెల్లనిది.
వెల్లఁకి. దే. వి. గడ్డ. (వేరు వెల్లఁకులు)
వెల్లఁబాటు. వై. వి. వెల్లనగుట.
వెల్లఁబాఱు. దే. క్రి. వెల్లనగు.
వెల్లడి. దే. వి. ౧. బయలు. ౨. ప్రసిద్ధి.
వెల్లన. దే. వి. తెల్లన.
వెల్లనగు. దే. క్రి. వెల్లఁబాఱు.
వెల్లాటకత్తె. దే. వి. జారిణి.
వెల్లాటకము. దే. వి. ప్రసిద్ధి.
వెల్లి. దే. వి. ప్రవాహము. రూ వెల్లిక.
వెల్లిగొను. దే. క్రి. ప్రవహించు.
వెల్లివిరి. దే. విణ. ప్రకటితము.
వెల్లివిరియు. దే. క్రి. ౧. చెదరు. ౨. ఉబుకు. 3. ప్రవహించు.
వెల్లివొడుచు. దే. క్రి. ప్రవహించు.
వెల్లుల్లి. దే. వి. తెల్లగడ్డ.
వెల్లువ. దే. వి. ౧. ప్రవాహము. ౨. సేన.
వెస. వై. వి. ౧. వేగము. క్రి. విణ. ౨. వేగముగా.
వెసనము. వై. వి. వ్యసనము.
వెసల. దే. వి. వంటకుండ.
వెళ్ళు. దే. క్రి. పోవు.

## వే

వే. దే. వి. ౧. వేయి. ౨. శేషము. (ఆమ్రేడితమున వేవే)
వేంచేయు. దే. క్రి. ౧. పోవు. ౨. వచ్చు.
వేండ్రము. దే. వి. తాపము.
వేఁకటి. దే. వి. గర్భము.
వేఁకి. దే. వి. జ్వరము.
వేఁగి. దే. వి. పులి.

వేఁగినాడు. ౧. దే. వి. వేంగిదేశము. ౨. ఒకబ్రాహ్మజాతి విశేషము.
వేఁగి. దే. వి. ,,
వేఁగు. దే. క్రి. తపించు.
వేఁచు. దే. ప్రే. ౧. వేఁగఁజేయు. ౨. వేయించు.
వేఁట. దే. వి. ౧. మృగయ. ౨. పొట్టేలు. ౩. మేకపోతు.
వేఁటకాఁడు. దే. వి. బోయవాఁడు.
వేఁటపల్లె. దే. వి. బోయపల్లె.
వేఁటరి. దే. విణ. వేఁటకాఁడు.
వేఁటాడు. దే. క్రి. అడవిలోని మృగపక్ష్యాదులను జంపు.
వేఁడి. దే. వి. ౧. వేఁడిమి. ౨. తేజము. విణ. ౩. ఉష్ణము.
వేఁడిమి. దే. వి. వెచ్చన.
వేఁడివెలుఁగు. దే. వి. సూర్యుఁడు.
వేఁడివేలుపు. దే. వి. ,,
వేఁడు. దే. క్రి. ౧. ప్రార్థించు. వి. ౨. వేఁడుకోలు.
వేఁడుకొను. దే. క్రి. ప్రార్థించు.
వేఁడుకోలు. దే. వి. వేఁడుకొనుట.
వేఁదుఱు. దే. వి. ౧. పిచ్చి. విణ. ౨. పిచ్చివాఁడు.
వేఁపి. దే. వి. కుక్క.
వేఁపు దే. వి. వేఁడుట.
వేఁపుడు. దే. వి. ౧ వేఁపుడుచట్టి. ౨ వేఁచుట
వేఁబోక. దే. వి. వేగుఁబోక.
వేకువ. దే. వి. వేగుజాము.
వేగ. వై. వి. ౧. త్వర. ౨. వడి. క్రి. విణ. ౩. వడిగా.
వేగంటి. దే. వి. ఇంద్రుఁడు.
వేగపడు. దే. క్రి. ౧. త్వరపడు. వి. ౨. వేగపాటు.
వేగము. త్స. వి. త్వర.
వేగరి. దే వి. చారుఁడు.
వేగించు. దే. క్రి. జాగారము చేయు.
వేగిరకత్తె. దే. వి. వేగముగలది.
వేగిరకాఁడు. దే. వి. త్వరపడువాఁడు.
వేగిరపడు. వై. క్రి. ౧. త్వరపడు. వి. ౨. వేగిరపాటు.
వేగిరపెట్టు. దే. క్రి. త్వరపఱుచు.
వేగిరము. దే. వి. ౧. త్వర. ౨. వేగము.
వేగిరించు. దే. వి. త్వరపడు.
వేగు. దే. క్రి. ౧. ఉదయమగు. వి. ౨. రాజ్య సమాచారము. ౩. చారుఁడు.
వేగుఁజుక్క. దే. వి. శుక్రాచార్యుఁడు.
వేగుఁబోక. దే. వి. వేకువ.
వేగుజాము. దే. వి. తెల్లవాఱువేళ.
వేగురు. దే. వి. వేయిమంది.
వేగురుఁజుక్క. దే. వి. శుక్రుఁడు.
వేగువాఁడు. దే. వి. చారుఁడు.
వేచు. దే. క్రి. ప్రతీక్షించు.
వేటు. దే. వి. దెబ్బ. రూ. వ్రేటు.
వేడబము దే. వి. ౧. వంచన. ౨. వేషము. ౩. మాయ.

వేడుక. దే. వి. ౧. కుతూహలము. ౨. వినోదము.
వేడుకకత్తె. దే. వి. జారిణి.
వేడుకకాఁడు. దే. విశే. ౧. వినోదకరుఁడు. వి. ౨. విటుఁడు.
వేణి. త్స. వి. ౧. కాలువ. ౨. సర్పాకారముగా అల్లినజడ.
వేణిక. త్స. వి. జడ.
వేణువు. త్స. వి. పిల్లంగ్రోవి.
వేతనము. త్స. వి. ౧. కూలి. ౨. జీతము.
వేత్త. త్స. వి. తెలిసినవాఁడు.
వేత్రము. త్స. వి. బెత్తము.
వేదండము. త్స. వి. ఏనుఁగు.
వేదన. త్స. వి. ౧. తెలివి. ౨. నొప్పి.
వేదము. త్స. వి. తొలిచదువులు. (వేదములు నాలుగు:—౧. ఋక్కు. ౨. యజుస్సు. ౩. సామము. ౪. అథర్వము.)
వేదాంతము. త్స. వి. ఉపనిషత్తు.
వేదాంతి. త్స. వి. వేదాంతము తెలిసినవాఁడు.
వేది. త్స. వి. ౧. తిన్నె. ౨. విద్వాంసుఁడు. విశే. ౩. తెలిసినవాఁడు.
వేదిక. త్స. వి. తిన్నె.
వేద్యము. త్స. విశే. తెలియఁదగినది.
వేధ. త్స. వి. ౧. విద్వాంసుఁడు. ౨. బ్రహ్మ.
వేధము. త్స. వి. తొలిపుచ్చుట.

వేధించు. త్స. క్రి. ౧. బాధించు. ౨. తొలిపుచ్చు.
వేసవి. వై. వి. ౧. కొప్పు. ౨. వెండ్రుక. ౩. జడ.
వేనవేలు. దే. విశే. పెక్కువేలు.
వేపనము. త్స. వి. కంపనము.
వేమము. త్స. వి. నేతపలక.
వేమరు. } దే. అవ్య. మాటిమాటికి.
వేమఱు. } రూ. వేమారు. వేమాఱు.
వేము. దే. వి. వేపచెట్టు.
వేయి. దే. వి. సహస్రము.
వేయు. దే. క్రి. ౧. దిగవిడుచు. ౨. ఉంచు.
వేరమి. } వై. వి. విరోధము.
వేరము. }
వేరు. దే. వి. చెట్టుయొక్కమూలము.
వేరువిత్తు. దే. విశే. నాశకుఁడు.
వేఱడము. దే. వి. భేదము.
వేఱిఁడి. దే. విశే. అవివేకి. రూ. వేఱుఁడి.
వేఱిడించు. దే. ప్రే. అవివేకమొందఁజేయు.
వేఱిమి. దే. వి. భేదము.
వేఱు. దే. వి. భేదము.
వేఱుపడు. దే. క్రి. ౧. భేదపడు. వి. ౨. వేఱుపాటు.
వేఱుపోవు. దే. క్రి. వేఱుపడు.
వేఱుబందము. దే. వి. భేదము.
వేల. త్స. వి. చెలియలికట్ట. (సముద్రపు నీటికిని నేలకును సరిహద్దుప్రదేశము.)

వేలిమి. దే. వి. హోమము. రూ. వేల్మి.
వేలుచు. దే. క్రి. హోమాగ్నియందు నేయి మున్నగువానిని సమర్పించు.
వేలుపు. దే. వి. ౧. దేవత. ౨. దేవతాస్త్రీ.
వేలుపుబోనము. దే. వి అమృతము.
వేలుపుసాని. దే. వి. సోదెచెప్పునది.
వేల్లనము. త్స. వి. వేష్టనము.
వేల్లితము. త్స. విణ. చుట్టఁబడినది.
వేవిళ్లు. దే. వి. బ. గర్భము నిలిచిన స్త్రీకి భక్షణవస్తువులను దినవలయు నని పుట్టుకోరిక.
వేవెలుఁగు. దే. వి. సూర్యుఁడు.
వేశంతము. త్స. వి. నీళ్ళుగల పల్లము.
వేశము. త్స. వి. వేశ్యలవాడ.
వేశ్మము. త్స. వి. ఇల్లు.
వేశ్య. త్స. వి. బోగముది. వ్యు. అలంకారము చేత ప్రకాశించునది.
వేషము. త్స. వి. వస్త్రభూషాద్యలంకారము.
వేష్టనము. త్స. వి. చుట్టుకొనుట.
వేష్టించు. త్స. క్రి. చుట్టుకొను.
వేసఁగి. దే. వి. గ్రీష్మఋతువు.
వేసట. దే. వి. అలసట.
వేసడము. వై. వి. కంచరగాడిద.
వేసము. దే. వి. వేషము.
వేసరము. దే. వి. ౧. శ్రమము. త్స. వి. ౨. వేసడము.
వేసరించు. దే. క్రి. శ్రమపఱచు.
వేసరు. దే. క్రి. ౧. శ్రమపడు. ౨ నొచ్చు.
వేసవి. దే. వి. వేసఁగి.
వేసారు. దే. క్రి. చూ. వేసరు.
వేళ. త్స. వి. సమయము.
వేళము. దే. విణ. త్వరగా.
వేళాకోళము. దే. వి. ౧. చిక్కు. ౨. గేలి. విణ. 3. చిక్కయినది.

వై

వైకల్పికము. త్స. విణ. ౧. వికల్పముచేత కలిగినది. ౨. వచ్చుట రాకపోవుట.
వైకల్యము. త్స. వి. వికలత్వము.
వైకుంఠము. త్స. వి. విష్ణువుండెడి స్థానము.
వైకుంఠుఁడు. త్స. వి. విష్ణువు.
వైకృతము. త్స. విణ. వికృతి నొందినది.
వైఖరి. త్స. వి. ౧ వాక్యలుప్తమైన వాక్కు. ౨. రీతి.
వైఖానసుఁడు. త్స. వి. వానప్రస్థుఁడు.
వైచక్షణ్యము. త్స. వి. విచక్షణత్వము.
వైచిత్రి. } త్స. వి. విచిత్రత.
వైచిత్ర్యము. }
వైచు. దే. క్రి. విసరివేయు.
వైజయంతము. త్స. వి. ఇంద్రునినగరు.
వైజయంతి. త్స. వి. ౧. టెక్కెము. ౨. విష్ణుమాలిక.
వైజాత్యము. త్స. వి. విజాతిత్వము.
వైజ్ఞానికుఁడు. త్స. విణ. నేర్పరి.

వైడము. దే. క్రి. విణ. చూ. వైళము.
వైదూర్యము. త్స. వి. విదూర దేశ మునఁ బుట్టిన రత్నము.
వైణవికుఁడు. త్స. వి. పిల్లంగ్రోవి నూఁదువాఁడు.
వైణికుఁడు. త్స. వి. వీణవాయించు వాఁడు.
వైతరణి. త్స. వి. నరకములందుండెడి నిప్పులయేఱు.
వైతాళికుఁడు. త్స. వి. వేకువను రాజు లను మేలుకొలుపువాఁడు.
వైదగ్ధి. త్స. వి. నేర్పు.
వైదగ్ధ్యము. త్స. వి. ,,
వైదర్భి. త్స. వి. ౧. రీతివిశేషము. ౨. దమయంతి.
వైదికము. త్స. వి. వేదమునందుఁ జెప్పఁబడినది.
వైదికుఁడు. త్స. విణ. వేదము దెలిసిన వాఁడు.
వైదుషి. త్స. వి. పాండిత్యము.
వైదుష్యము. త్స. వి. ,,
వైదేహి. త్స. వి. సీత.
వైద్యము. త్స. వి. రోగచికిత్సా శాస్త్రము.
వైద్యుఁడు. త్స. వి. చికిత్సకుఁడు.
వైధవ్యము. త్స. వి. ముండమోపితనము.
వైధేయుఁడు. త్స. విణ. మూర్ఖుఁడు.
వైనతేయుఁడు. త్స. వి. ౧. గరుత్మం తుఁడు. ౨. అనూరుఁడు.
వైనము. దే. వి. వివరణము.
వైపరీత్యము. త్స. వి. తడఁబాటు.
వైపు. దే. వి. ౧. ప్రక్క. ౨. ఒడుపు. 3. ఉపాయము.
వైపుకాఁడు. దే. విణ. ఉపాయశాలి.
వైభవము. త్స. వి. సంపద.
వైమాత్రేయుఁడు. త్స. విణ. సవతితల్లి కొడుకు.
వైముఖ్యము. త్స. వి. విముఖత్వము.
వైయాకరణుఁడు. త్స. విణ. వ్యాకర ణము దెలిసినవాఁడు.
వైరము. త్స. వి. విరోధము.
వైరాగి. త్స. వి. బైరాగి.
వైరాగ్యము. త్స. వి. విరాగత్వము.
వైరి. త్స. వి. ౧ పగవాఁడు. క్రి. ౨. వైరించు.
వైలక్షణ్యము. త్స. వి. విలక్షణత్వము.
వైలక్ష్యము. త్స. వి. విలక్షత్వము.
వైవర్ణ్యము. త్స. వి. వివర్ణత.
వైవశ్యము. త్స. వి. వివశత.
వైవస్వతుఁడు. త్స. వి. యముఁడు.
వైవాహికము. త్స. విణ. వివాహ సంబంధమైనది.
వైశసము. త్స. వి. హాని.
వైశాఖము. త్స. వి. ఒకనెల. వ్యు. విశాఖా నక్షత్రముతోఁ గూడిన పున్నమ దీనియందుఁగలదు.
వైశాల్యము. త్స. వి. వెడలుపు.

వైశికము. త్స. వి. ౧. కపటము. ౨. దూష్యము. ౩. భోగసుఖము.

వైశికుఁడు. త్స. వి. బహువేశ్యోపభోగరసికుఁడు.

వైశ్యుఁడు. త్స. వి. కోమటివాఁడు. వ్యు. అంగళ్ళు మొదలైన వానిని ప్రవేశించువాఁడు.

వైశ్వానరుఁడు. త్స. వి. అగ్ని.

వైషమ్యము. త్స. వి. విషమత్వము.

వైష్ణవుఁడు. త్స. వి. విష్ణుభక్తుఁడు.

వైళము. దే. క్రి. విణ. శీఘ్రముగ.

## వ్య

వ్యంగ్యము. త్స. వి. వ్యంజనముచేతఁ దెలియఁదగిన యర్థము.

వ్యంజన. త్స. వి. ఒకశబ్దవృత్తి.

వ్యంజనము. త్స. వి. ౧. గుఱుతు. ౨. కూర.

వ్యంసకుఁడు. త్స. వి. మోసకాఁడు.

వ్యక్తము. త్స. విణ. తెల్లమైనది.

వ్యక్తి. త్స. వి. జాతికి వేఱై జాతికి ఆశ్రయమైన రూపము.

వ్యగ్రుఁడు. త్స. విణ. ౧. వేగిరపడువాఁడు. ౨. ఒకదానియందుఁ దగిలిన మనస్సుగలవాఁడు.

వ్యజనము. త్స. వి. విసనకఱ్ఱ.

వ్యతికరము. త్స. వి. సంబంధము.

వ్యతిక్రమము. త్స. వి. అక్రమము.

వ్యతిరిక్తము. త్స. విణ. ౧. మాఱుపడినది. ౨. వేఱుపడినది.

వ్యతిరేకము. త్స. వి. ౧. మాఱు. ౨. వేఱు.

వ్యత్యయము. త్స. వి. వ్యత్యాసము.

వ్యతిస్తము. త్స. విణ. తడఁబడినది.

వ్యత్యాసము. త్స. వి. భేదము.

వ్యథ. త్స. వి. బాధ.

వ్యథితము. త్స. విణ. ౧. బాధింపఁబడినది. ౨. తొలిపుచ్చఁబడినది.

వ్యపదేశము. త్స. వి. మిక్కిలికపటము.

వ్యభిచరించు. త్స. క్రి. ౧. అంకుఁబోవు. వి. ౨. వ్యభిచారము.

వ్యభిచారిణి. త్స. వి. అంకుటాలు.

వ్యయ. త్స. వి. ఒకసంవత్సరము.

వ్యయము. త్స. వి. ౧. వెచ్చము. క్రి. ౨. వ్యయించు.

వ్యవధానము. త్స. వి. ౧. అవకాశము. ౨. కప్పు.

వ్యవధి. త్స. వి. ,,

వ్యవసాయము. త్స. వి. ౧. కృషి. ౨. ప్రయత్నము.

వ్యవసితము. త్స. వి. నిశ్చయము.

వ్యవస్థ. త్స. వి. శాస్త్రనిరూపిత నియమము.

వ్యవహరించు. త్స. క్రి. వాడుకచేయు.

వ్యవహర్త. త్స. వి. వ్యవహరించువాఁడు.

వ్యవహారము. త్స. వి. ౧. వాడుక. ౨. న్యాయము.

వ్యవహితము. త్స. విశ. వ్యవధానము గలది.
వ్యవాయము త్స. వి. గ్రామ్యధర్మము.
వ్యష్టి త్స. వి. ఒంటరితనము.
వ్యసనము. త్స. వి. ఆపద.
వ్యస్తము. త్స. విశ. వేఱుపడినది.
వ్యళీకము. త్స. వి. ౧. అపరాధము. ౨. అసత్యము.

వ్యా

వ్యాకీర్ణము. త్స. విశ. చెదరినది.
వ్యాకులము. త్స. విశ. కలతనొందినది.
వ్యాకోచము. త్స. విశ. వికసించినది.
వ్యాఖ్య. త్స. వి. అర్థవివరణము.
వ్యాఖ్యాత. త్స. వి. వ్యాఖ్యానము చేసినవాఁడు.
వ్యాఖ్యానము. త్స. వి. అర్థవివరణము చేయుట.
వ్యాఘాతము. త్స. వి. ౧. విఘ్నము.
వ్యాఘ్రము. త్స. వి. ౧. బెబ్బులి. ౨. ఉత్తరపదమైనచో శ్రేష్ఠము.
వ్యాజము. త్స. వి. ౧. కపటము. ౨. కారణము.
వ్యాజ్యెము. దే. వి. ౧. వివాదము. క్రి. ౨. వ్యాజ్యెమాడు.
వ్యాధి. త్స. వి. రోగము.
వ్యాధితుఁడు. త్స. విశ. తెవులు గొంటు.
వ్యాధుఁడు. త్స. విశ. బోయవాఁడు.
వ్యాపకుఁడు. త్స. విశ. వ్యాపించువాఁడు.
వ్యాపనము. త్స. వి. ౧. వ్యాపించుట. ౨. క్రి. వ్యాపించు.
వ్యాపాదనము. త్స. వి. చంపుట.
వ్యాపారము. త్స. వి. ౧. పని. ౨. వర్తకము.
వ్యాపించు. త్స. క్రి. అంతటను ప్రసరించు.
వ్యాపృతుఁడు. త్స. విశ. పనివడినవాఁడు.
వ్యాప్తము. త్స. విశ. వ్యాపించినది.
వ్యాప్తి. త్స. వి. వ్యాపించుట.
వ్యామము. త్స. వి. బార.
వ్యామోహము. త్స. వి. అత్యంత మోహము.
వ్యాయతము. త్స. విశ. ౧. దృఢమైనది. ౨. దీర్ఘమైనది.
వ్యాయామము. త్స. వి. ౧. సాము. ౨. శ్రమము.
వ్యాసంగము. త్స. వి. మిక్కిలి యాసంగము.
వ్యాసక్తుఁడు. త్స. వి. మిక్కిలి యాసక్తిగొన్నవాఁడు.
వ్యాసము. త్స. వి. ౧. ఏదేని యొక విషయమును విరివిగ వ్రాయుట. ౨. విరివి.
వ్యాసుఁడు. త్స. వి. పరాశర పుత్త్రుఁడు.

వ్యాహతము. త్స. విశ. కొట్టఁబడినది.
వ్యాహారము. త్స. వి. వచనము.
వ్యాహృతము. త్స. విశ. వచియింపఁబడినది.
వ్యాళగ్రాహి. త్స. వి. పాములవాఁడు.
వ్యాళము. త్స. వి. ౧. పాము. ౨. పులి.

వ్యు

వ్యుత్క్రమము. త్స. వి. వ్యతిక్రమము.
వ్యుత్థానము. త్స. వి. ౧. అడ్డపాటు. ౨. సమాధినుండి మరలుట.
వ్యుత్పత్తి. త్స. వి. శబ్దముయొక్క పుట్టుకరీతి.
వ్యుత్పన్నుఁడు. త్స. వి. శాస్త్రాది జ్ఞానముగలవాఁడు.
వ్యుషితము. త్స. వి. చలిది.
వ్యుష్టము. త్స. వి. వేకువ.

వ్యూ

వ్యూఢము. త్స. విశ. ౧. ఉంచఁబడినది. ౨. దట్టమైనది. 3. విశాలమైనది.
వ్యూహము. త్స. వి. ౧. మొగ్గరము. ౨. సమూహము.

వ్యో

వ్యోమము. త్స. వి. ఆకాశము.
వ్యోమయానము. త్స. వి. ఆకాశయానము.

వ్రి

వ్రింత. దే. వి. వాఁగు.
వ్రిక్క. వై. వి. తునుక.
వ్రిక్కలించు. వై. క్రి. భేదించు.
వ్రిచ్చు. వై. క్రి. చీల్చు.
వ్రిజము. త్స. వి. ౧. సమూహము. ౨. పసులమంద.
వ్రిజ్య. త్స. వి. భిక్ష లోనగువానికై తిరుగుట.
వ్రిణము. త్స. వి. ౧. గాయము. ౨ కురుపు.
వ్రితతి. త్స. వి. తీఁగ.
వ్రితము. త్స. వి. నోము.
వ్రితి. త్స. వి. వ్రితము సేయువాఁడు.
వ్రియ్య. వై. వి. తునుక.
వ్రియ్యు. వై. క్రి. ౧. చీలు. ౨. బ్రద్దలగు.

వ్రా

వ్రాఁతకాఁడు. దే. వి. లేకరి.
వ్రాఁతచావడి. దే. వి. ౧. వ్రాసెడు చోటు. ౨. కచ్చేరి.
వ్రాతము. త్స. వి. సమూహము.
వ్రాత్యుఁడు. త్స. వి. ౧. ఉపనయనాది సంస్కారములు లేని బ్రాహ్మణుఁడు.
వ్రాయసకాఁడు. త్స. వి. లేకరి.
వ్రాయసము. దే. వి. ౧. వ్రాఁత. ౨. జాబు.

వ్రాయి. త్స. వి. ౧. అక్షరము ౨. రేఖ.
వ్రాయు. దే. క్రి. లిఖించు.
వ్రాలు. దే. క్రి. ౧. తగ్గు. ౨. మీఱు. 3. ఒఱగు. వి. బ. ౧. సంతకము. ౨. అక్షరములు.

### వ్రీ

వ్రీడ. త్స. వి. సిగ్గు.
వ్రీలు. దే. క్రి. చీలు.

### వ్రే

వ్రేఁకటి. దే. వి. గర్భము.
వ్రేఁకన. దే. వి. భారము.
వ్రేఁకము. దే. వి. ,,
వ్రేఁగు. దే. వి. ౧. భారము. క్రి. ౨. వేఁగు.
వ్రేఁటు. దే. వి. ౧. దెబ్బ. ౨. వ్రేయుట.
వ్రేఁడు. దే. వి. గొల్లవాఁడు.
వ్రేఁత. దే. వి. దెబ్బ.
వ్రేఁపు. దే. వి. వ్రేఁపుడు.
వ్రేత. దే. వి. గొల్లది.
వ్రేపల్లె. దే. వి. గొల్లపల్లియ.
వ్రేయు. దే. క్రి. ౧. నఱకు. ౨. కొట్టు.
వ్రేలఁబడు. దే. క్రి. వ్రేలాడు.
వ్రేలాడు. దే. క్రి. వ్రేలు.
వ్రేలు. దే. క్రి. వ్రేలాడు. వి. అంగుళి. పే. వ్రేల్చు.
వ్రేలుడు. దే. విశే. వ్రేలాడినది.
వ్రేలుమిడి. దే. వి. చిటిక. రూ. వ్రేల్మిడి.

### శ

శంక. త్స. వి. ౧. విచారము. ౨. సందేహము.
శంకరుఁడు. త్స. వి. శివుఁడు.
శంకించు. త్స. క్రి. సందేహించు. రూ. శంకిల్లు.
శంకితుఁడు. త్స. విశే. సందేహమును బొందినవాఁడు.
శంకువు. త్స. వి. మేకు.
శంఖము. త్స. వి. ౧. నిధివిశేషము. ౨. సంకు.
శంఖిని. త్స. వి. స్త్రీజాతిలో మూఁడవది.
శంప. త్స. వి. మెఱుపు.
శంబరారి. త్స. వి. మన్మథుఁడు.
శంబలము. త్స. వి. దారిబత్తెము.
శంబూకము. త్స. వి. నత్త.
శంభళి. త్స. వి. కుంటెనకత్తె.
శంభువు. త్స. వి. ౧. విష్ణువు. ౨. శివుఁడు.
శంసనము. త్స. వి. చెప్పుట.

శకటము. త్స. వి. ౧. బండి. ౨. రెండువేల పలముల పరిమాణము.

శకము. త్స. వి. ౧. ఒకనిపాలనతోఁ జేరిన యేఁడు.

శకలము. త్స. వి. ౧. తునుక. ౨. చెట్టుమీఁదిపట్ట.

శకుంతము. శకుంతి. } త్స. వి. పక్షి. వ్యు. పోవుటకొఱకు సమర్థమైనది.

శకునము. త్స. వి. ౧. పక్షి. ౨. శుభసూచక నిమిత్తము.

శక్తి. త్స. వి. ౧. సామర్థ్యము. ౨. బలిమి. 3. ఉత్సాహాది. (ఇవి మూఁడు.—౧. ఉత్సాహము. ౨. ప్రభుత్వము. 3. మంత్రము.) ౪. సత్వాది. (ఇవి మూఁడు.— ౧. సత్వము. ౨. రజస్సు. 3. తమము.)

శక్తుఁడు. త్స. విశ. శక్తిగలవాఁడు.

శక్యము. త్స. విశ. ౧. సాధ్యము. ౨. అలవి.

శక్రుఁడు. త్స. వి. ఇంద్రుఁడు.

శచి. త్స. వి. ఇంద్రునిభార్య.

శఠుఁడు. త్స. వి. నాలుగు విధములైన శృంగార నాయకులలో నొకఁడు.

శతకము. త్స. వి. నూఱుపద్యములు గల గ్రంథము.

శతకోటి. త్స. వి. ఇంద్రాయుధము.

శతఘ్ని. త్స. వి. ఫిరంగి.

శతధృతి. త్స. వి. ౧. ఇంద్రుఁడు. ౨. బ్రహ్మ.

శతపత్త్రము. త్స. వి. నూఱు రేకులు కల తామర.

శతభిషము. త్స. వి. ఒక నక్షత్రము.

శతమానము. త్స. వి. ౧. నూటికొలఁది. ౨. తిట్టు.

శతము. త్స. వి. నూఱు.

శతానందుఁడు. త్స. వి. ౧. విష్ణువు. ౨. బ్రహ్మ.

శతారము. త్స. వి. వజ్రాయుధము.

శత్రువు. త్స. వి. పగవాఁడు.

శని. త్స. వి. శనైశ్చరుఁడు.

శనైశ్చరుఁడు. త్స. వి. శని. వ్యు. మెల్లగా సంచరించువాఁడు.

శపథము. త్స వి. ఒట్టు.

శబరాలయము. త్స. వి. బోయపల్లె.

శబరి. త్స. వి. బోయత.

శబరుఁడు. త్స. వి. ౧. బోయవాఁడు. ౨. శివుఁడు.

శబలము. త్స. వి. ౧. చిత్రవర్ణము. విశ. ౨. చిత్రవర్ణము గలది.

శబ్దము. త్స. వి. ౧. వ్యాకరణ శిక్షిత మగుమాట. ౨. ధ్వని.

శబ్దించు. త్స. క్రి. మ్రోయు.

శమంతకము. త్స. వి. విష్ణుహస్తమందలి మణి.

శమనము. శమము. } త్స. వి. శాంతి.

శమనుఁడు. త్స. వి. యముఁడు.

శమించు. త్స. క్రి. అడఁగు.

శమితము. త్స. విణ. శమించినది.
శయనము. త్స. వి. ౧. నిద్ర. ౨. పడక. క్రి. 3. శయనించు.
శయనీయము. త్స. విణ. శయనింపఁదగినది.
శయించు. త్స. క్రి. పండుకొను.
శయితుఁడు. త్స. విణ. పరున్నవాఁడు.
శయ్య. త్స. వి. ౧. పడక. ౨. రీతి.
శరణము. త్స. వి. ౧. రక్షకము. ౨. గృహము.
శరణీయుఁడు. త్స. విణ. శరణు చొరదగినవాఁడు.
శరణు. త్స. వి. ౧. నమస్కారము. ౨. రక్షకము.
శరణుచొచ్చు. త్స. క్రి. శరణాగతిని బొందు.
శరణ్యుఁడు. త్స. విణ. శరణు చొరఁదగినవాఁడు.
శరత్తు. త్స. వి. ఋతువిశేషము.
శరధి. త్స. వి. ౧. సముద్రము. ౨. అమ్ములపొది.
శరనిధి. త్స. వి. సముద్రము.
శరము. త్స. వి. ౧. బాణము. ౨. జెల్లు.
శరవ్యము. త్స. వి. గుఱి.
శరావము. త్స. వి. మూకుడు.
శరాసనము. త్స. వి. విల్లు.
శరీరము. త్స. వి. దేహము.
శరీరి. త్స. విణ. శరీరము కలవాఁడు.
శర్కర. త్స. విణ. ౧. చక్కెర. ౨. మొరపనేల.
శర్ధించు. త్స. వి. అపానవాయువు విడుచు.
శర్మము. త్స. వి. బ్రాహ్మణుల పట్టపుపేరు.
శర్వరి. త్స. వి. రాత్రి.
శర్వాణి. త్స. వి. పార్వతి.
శర్వుఁడు. త్స. వి. శివుఁడు.
శలభము. త్స. వి. మిడుత.
శలాక. త్స. వి. ౧. కమ్మి. ౨. బాణము.
శలాటువు. త్స. వి. కాయ.
శల్యము. త్స. వి. ౧. ఎముక. ౨. బాణము.
శవము. త్స. వి. ౧. పీనుఁగు. ౨. జలము.
శశకము. త్స. వి. చూ. శశము.
శశము. త్స. వి. కుందేలు.
శశాంకుఁడు. త్స. వి. చంద్రుఁడు.
శశి. త్స. వి. చంద్రుఁడు.
శష్కులి. త్స. వి. చక్కిలము.
శష్పము. త్స. వి. ౧. లేఁతకసవు. ౨. నల్లగఱిక.
శస్తము. త్స. వి. ౧. శుభము. విణ. శుభకరము.
శస్త్రము. త్స. వి. ౧. ఇనుము. ౨. ఆయుధము.
శస్త్రాజీవుఁడు. త్స. విణ. శస్త్రములచే జీవించువాఁడు.

శస్త్రి. త్స. విణ. ౧. శస్త్రమును ధరించువాఁడు. వి. ౨. చురకత్తి.

శా

శాంతము. త్స. వి. ౧. ఒకరసము. విణ. ౨. శాంతిఁబొందినది.

శాంతించు. త్స. క్రి. శాంతిబొందు.

శాంబరి. త్స. వి. మాయ.

శాంభవి. త్స. వి. పార్వతి.

శాకము. త్స. వి. కూర.

శాకిని. త్స. వి. పిశాచస్త్రీభేదము.

శాకునికుఁడు. త్స. వి. పక్షులవేఁటకాఁడు.

శాక్తీకుఁడు. త్స. వి. శక్త్యాయుధమును ధరించువాఁడు.

శాక్తుఁడు. త్స. వి. శక్తిమతప్రవర్తకుఁడు.

శాక్యముని. త్స. వి. బుద్ధదేవుఁడు.

శాక్యసింహుఁడు. త్స. వి. ,,

శాఖ. త్స. వి. ౧. చెట్టుకొమ్మ. ౨. వేదభాగము.

శాఖానగరము. త్స. వి. పేఁట.

శాఖామృగము. త్స. వి. కోఁతి.

శాఖి. త్స. వి. చెట్టు.

శాటి. త్స. వి. యతులు లోనగువారిబట్ట.

శాణము. త్స. వి. సానఱాయి.

శాణాతనము. గ్రా. వి. జాణతనము.

శాఠ్యము. త్స. వి. శఠత్వము.

శాతకుంభము. త్స. వి. బంగారు.

శాతము. త్స. విణ. వాఁడియైనది.

శాత్రవము. త్స. వి. ౧. పగవారిగుంపు. ౨. పగ.

శాత్రవుఁడు. త్స. వి. పగవాఁడు.

శాద్వలము. త్స. వి. లేఁగసవు గలదేశము (మైదానము.)

శాపము. త్స. వి. తిట్టు.

శాపించు. త్స. క్రి. తిట్టు.

శాబకము. త్స. వి. శిశువు.

శాబ్దికుఁడు. త్స. విణ. శబ్దశాస్త్రము దెలిసినవాఁడు.

శారద. త్స. వి. ౧. సరస్వతి. ౨. పార్వతి.

శారదగాఁడు. దే. వి. హాస్యగాఁడు.

శారదము. త్స. విణ. శరత్కాలమునందుఁ బుట్టినది.

శారిక. త్స. వి. ౧. నఖక్షతము. ౨. గోరువంక.

శారీరము. త్స. వి. ౧. కంఠస్వరము. విణ. ౨. శరీరసంబంధమైనది.

శార్ఙ్గము. త్స. వి. విష్ణువుయొక్కవిల్లు.

శార్ఙ్గి. త్స. వి. విష్ణువు.

శార్దూలము. త్స. వి. పులి.

శార్వరము. త్స. వి. కటికిచీఁకటి.

శార్వరి. త్స. వి. ౧. ఒకసంవత్సరము. ౨. రాత్రి.

శాల. త్స. వి. ౧. ఇల్లు. ౨. ఇంటియందు కొంతభాగము.
శాలి. త్స. విణ. ఒప్పువాఁడు.
దయాశాలి= దయతోనొప్పువాఁడు.
శాలీనుఁడు. త్స. విణ. సిగ్గరి.
శాలేయము. త్స. విణ. వరి పండునది. (పొలము)
శాల్మలి. త్స. వి. బూరుగు.
శాశ్వతము. త్స. విణ. నాశనము లేనిది.
శాసకుఁడు. త్స. విణ. శాసించువాఁడు.
శాసనము. త్స. వి. ౧. ఆజ్ఞ. ౨. చట్టము.
శాసించు. త్స. క్రి. ౧. శిక్షించు. ౨. ఆజ్ఞాపించు.
శాస్త. త్స. విణ. శాసించువాఁడు.
శాస్తి. త్స. వి. శిక్ష.
శాస్త్రము. త్స. వి. నియమగ్రంథము.
శాస్త్రి. త్స. వి. శాస్త్రము దెలిసినవాఁడు.
శాస్త్రీయము. త్స. విణ. శాస్త్రసంబంధమైనది.

శి

శింఘాణము. త్స. వి. చీమిడి.
శింజ. త్స. వి. ౧. నారిమ్రోఁత. ౨. అందెమ్రోఁత.
శింజితము. త్స. వి. భూషణముల మ్రోఁత.
శింజిని. త్స. వి. ౧. వింటినారి. ౨. కాలియందె.
శిక్యము. త్స. వి. కావడియుట్టి.
శిక్ష. త్స. వి. షడంగములలోనొకటి. వ్యా. అకారాది వర్ణములయొక్క స్థానవిధాన ప్రయత్నములబోధించునట్టిది.) దీనిచేత వర్ణాదులు శిక్షింపఁబడును.)
శిక్షించు. త్స. క్రి. శిక్షసేయు.
శిక్షితుఁడు. త్స. విణ. ౧. నేర్పరి. ౨. శిక్షింపఁబడినవాఁడు.
శిఖ. త్స. వి. ౧. కొన. ౨. సిగ. 3. సెగ.
శిఖండకము. త్స. వి. పిల్లజుట్టు.
శిఖండి. త్స. వి. నెమిలి.
శిఖరము. త్స. వి. ౧. కొన. ౨. కొండకొన.
శిఖరి. త్స. వి. కొండ.
శిఖావళము. త్స. వి. నెమిలి.
శిఖి. త్స. వి. ౧. అగ్ని. ౨. నెమిలి.
శితము. త్స. విణ. ౧. బక్కయైనది. ౨. వాఁడియైనది.
శితికంఠుఁడు. త్స. వి. శివుఁడు.
శిథిలము. త్స. వి. ౧. సంధులువదలినది. ౨. ఖిలమైనది.
శిఫ. త్స. వి. ఊడ.
శిబి. త్స. వి. ఒకచక్రవర్తి.
శిబిక. త్స. వి. పల్లకి.
శిబిరము. త్స. వి. దండువిడిసినచోటు.
శిరము. త్స. వి. ౧. సేవాగ్రము. ౨. తల.

శిరసావహించు. త్స. క్రి. తలయందు ధరించు.

శిరీషము. త్స. వి. దిరిసెనచెట్టు.

శిరోగృహము. త్స. వి. మిద్దె.

శిరోజము. త్స. వి. తలవెండ్రుక.

శిరోధి. త్స. వి. మెడ.

శిరోరుహము. త్స. వి. వెండ్రుక.

శిల. త్స. వి. రాయి.

శిలీంధ్రము త్స. వి. పుట్టగొడుగు.

శిలీముఖము. త్స. వి. బాణము.

శిలోచ్చయము. త్స. వి. కొండ.

శిల్పము. త్స. వి. చిత్తరువువ్రాయుట లోనగు శిల్పులపని.

శిల్పి. త్స. వి. వడ్రంగిలోనగువాఁడు.

శివ. త్స. వి. ౧. నక్క. ౨. పార్వతి. వ్యు. శివునిభార్య.

శివంకరుఁడు. త్స. విశ. శుభకరుఁడు.

శివతాతి. త్స. వి. శివంకరుఁడు.

శివము. త్స. వి. ౧. సుఖము. ౨. శుభము. విశ. 3. శుభకరము.

శివుఁడు. త్స. వి. ఈశ్వరుఁడు. వ్యు. శుభములనిచ్చువాఁడు.

శిశిరము. త్స. వి. ౧. ఒకఋతువు. ౨. చల్లన. విశ. 3. చల్లనిది.

శిశువు. త్స. వి. బిడ్డ.

శిష్టుఁడు. త్స. వి. ౧. విధేయుఁడు. ౨. సదాచార సంపన్నుఁడు.

శిష్యుఁడు. త్స. వి. ౧. ఛాత్రుఁడు. ౨. చట్టు.

శీకరము. త్స. వి. తుంపుర.

శీఘ్రము. త్స. విశ. త్వరితముగ.

శీత. త్స. వి. ౧. నాఁగటిచాలు. విశ. ౨. చల్లనిది. 3. అలసమైనది.

శీతకము. త్స. వి. చలికాలము.

శీతకరుఁడు. త్స. వి. చంద్రుఁడు.

శీతకుఁడు. త్స. విశ. సోమరి.

శీతలము. త్స. వి. ౧. చందనము. విశ. ౨. చల్లనిది.

శీధువు. త్స. వి. మద్యము.

శీర్ణము. త్స. విశ. ౧. సడలినది. ౨. సన్నగిల్లినది.

శీర్షకము. త్స. వి. శిరస్త్రాణము.

శీర్షణ్యము. త్స. వి. శిరస్త్రాణము.

శీర్షము. త్స. వి. తల.

శీలనము. త్స. వి. దివ్యకావ్యములను పరీక్షించుట.

శీలము. త్స. వి. ౧. మంచినడత, ౨. స్వభావము.

శీలించు. త్స. క్రి. ౧. పరిశీలించు. ౨. వాడుకపఱచు.

## శు

శుంఠి. త్స. వి. సొంటి.

శుంఠుఁడు. త్స. వి. మూఢుఁడు. రూ. శుంఠ.

శుండ. త్స. వి. తొండము.

శుండాలము. త్స. వి. ఏనుఁగు.

శుకము. త్స. వి. చిలుక.
శుక్కు. త్స. వి. శోకము.
శుక్తి. త్స. వి. ౧. శంఖము. ౨. ముత్యపుఁజిప్ప.
శుక్రము. త్స. వి. రేతస్సు.
శుక్రుఁడు. త్స. వి. రాక్షసుల గురువు.
శుక్ల. త్స. వి. ఒకసంవత్సరము.
శుక్లము. త్స. వి. ౧. తెలుపు. విణ. ౨. తెల్లనిది.
శుచి. త్స. వి. ౧. తెలుపు. విణ. ౨. పరిశుద్ధమైనది.
శుద్ధము. త్స. విణ. ౧. తెల్లనిది. ౨. దోషములేనిది.
శుద్ధాంతము. త్స. వి. అంతఃపురము.
శుద్ధి. త్స. వి. శోధనము.
శునకము. త్స. వి. కుక్క.
శుని. త్స. వి. ఆఁడుకుక్క.
శుభకృత్తు. త్స. వి. ఒక సంవత్సరము.
శుభంయువు. త్స. వి. శుభముతోఁగూడుకొన్నవాఁడు.
శుభము. త్స. వి. ౧. మంగళము. విణ. ౨. మంగళకరమైనది.
శుభ్రము. త్స. విణ. తెల్లనిది.
శుభ్రాంశువు. త్స. వి. చంద్రుఁడు.
శుల్కము. త్స. వి. ౧. ఉంకువ. ౨. వేశ్యకిచ్చునట్టిధనము.
శుశ్రూష. త్స. వి. సేవ.
శుశ్రూషకుఁడు. త్స. విణ. శుశ్రూష చేయువాఁడు.
శుష్కము. త్స. విణ. ౧. వట్టి. ౨. ఎండినది.
శుష్కించు. } త్స. క్రి. ౧. ఇంకు. ౨. ఎండు.
శుష్కీభవించు. }

శూ

శూకము. త్స. వి. ౧. వరిముల్లు. ౨. తేలుకొండి.
శూద్ర. త్స. వి. శూద్రస్త్రీ.
శూద్రి. త్స. వి. శూద్రునిభార్య.
శూద్రుఁడు. త్స. వి. నాలవజాతివాఁడు.
శూన్యము. త్స. విణ. పాడైనది.
శూరుఁడు. త్స. విణ. యుద్ధమునకు భయపడనివాఁడు.
శూర్పణఖ. త్స. వి. ఒక రాక్షసి.
శూర్పము. త్స. వి. చేట.
శూలపాణి. } త్స. వి. శివుఁడు.
శూలి. }
శూలము. త్స. వి. ముమ్మొనవాలు.

శృ

శృంఖలము. త్స. వి. ౧. సంకెల. ౨. మొలనూలు.
శృంగబేరము. త్స. వి. అల్లము.
శృంగము. త్స. వి. ౧. కొమ్ము. ౨. కొండకొన.
శృంగాటకము. త్స. వి. కూడలి.
శృంగారము. త్స. వి. ౧. అలంకారము. ౨. నవరసములలో నొకటి.

శృంగారవనము. త్స. వి. ఉద్యాన వనము.
శృంగారి. త్స. వి. విటుఁడు.
శృంగారించు. త్స. క్రి. అలంకరించు.
శృంగిణి. త్స. వి. గోవు.

శే

శేఖరము. త్స. వి. సిగదండ.
శేముషి. త్స. వి. బుద్ధి.
శేవధి. త్స. వి. నిధి.
శేష. త్స. వి. ౧. అక్షతలు. ౨. సేస.
శేషము. త్స. వి. ౧. మిగులు. క్రి. ౨. శేషించు.
శేషుఁడు. త్స. వి. సర్పరాజు.

శై

శైత్యము. త్స. వి. ౧. జలుబు. ౨. చలువ.
శైథిల్యము. త్స. వి. శిథిలత్వము.
శైలము. త్స. వి. కొండ.
శైలాలి. త్స. వి. నటుఁడు.
శైలూషి. త్స. వి. ఆటకత్తె.
శైలూషుఁడు. త్స. వి. ఆటకాఁడు.
శైవము. త్స. విశే. శివసంబంధమైనది.
శైవలము. / శైవాలము. } త్స. వి. నీటిపాఁచి.
శైవుఁడు. త్స. విశే. శివభక్తుఁడు.
శైశవము. త్స. వి. ౧. బాల్యము. ౨. శిశుత్వము.
శైష్యోపాధ్యాయిక. త్స. వి. శిష్యోపాధ్యాయులతనము.

శొ

శొంఠి. గ్రా. వి. శుంఠి.
శొంఠికాయ. గ్రా. వి. అల్లరివాఁడు.

శో

శోకము. త్స. వి. ౧. దుఃఖము. క్రి. ౨. శోకించు.
శోచిష్కేశుఁడు. త్స. వి. అగ్ని.
శోణము. త్స. విశే. ౧. ఎఱ్ఱనిది. వి. ౨. ఎఱుపు.
శోణరత్నము. త్స. వి. కెంపు.
శోణితము. త్స. వి. రక్తము.
శోధకుఁడు. త్స. వి. శోధించువాఁడు.
శోధనము. త్స. వి. ౧. వెదకుట. క్రి. ౨. శోధించు.
శోఫ. త్స. వి. వాఁపురోగము.
శోభ. త్స. వి. ౧. కాంతి. ౨. ఇచ్ఛ.
శోభకృత్తు. త్స. వి. ఒక సంవత్సరము.
శోభనము. త్స. వి. ౧. మేలు. విశే. ౨. సుందరము.
శోభించు. త్స. క్రి. ప్రకాశించు.
శోభితము. త్స. విశే. ప్రకాశమొందినది.
శోషణము. త్స. వి. శోషిల్లుట.
శోషించు. త్స. క్రి. ఎండు. రూ. శోషిల్లు.

శౌ

శౌండుఁడు. త్స. వి. కల్లుత్రాగి మత్తిల్లినవాఁడు.
శౌచము. త్స. వి. శుచిత్వము.
శౌద్ధోదని. త్స. వి. బుద్ధదేవుఁడు.
శౌరి. త్స. వి. విష్ణువు.
శౌర్యము. త్స. వి. ౧. శూరత్వము. ౨. ప్రౌఢిమము.

శ్మ

శ్మశానము. త్స. వి. ఒలికిమిట్ట.
శ్మశ్రువు. త్స. వి. ౧. గడ్డము. ౨. మీసము.

శ్యా

శ్యామ. త్స. వి. యౌవనమధ్యస్థురాలు.
శ్యామలము. త్స. వి. ౧. నలుపు. విశే. ౨. నల్లనిది.
శ్యామిక. త్స. వి. చీఁకటి.
శ్యేనము. త్స. వి. డేగ.

శ్ర

శ్రద్ధధానుఁడు. త్స. విశే. శ్రద్ధగలవాఁడు.
శ్రద్ధ. త్స. వి. ఆసక్తి.
శ్రద్ధాళువు. త్స. వి. ౧. వేవిళ్లుకలయాఁడుది. విశే. ౨. శ్రద్ధకలది.
శ్రమణుఁడు. త్స. వి. యతివిశేషుఁడు.
శ్రయణము. త్స. వి. ఆశ్రయించుట.
శ్రమము. త్స. వి. ౧. అలవాటు. ౨. అలసట.
శ్రవణము. త్స. వి. ౧. చెవి. ౨. వినుకలి.
శ్రవము. త్స. వి. చెవి.

శ్రా

శ్రాంతి. త్స. వి. ఊఱట.
శ్రాంతుఁడు. త్స. విశే. అలసినవాఁడు.
శ్రాద్ధదేవుఁడు. త్స. వి. యముఁడు.
శ్రాద్ధము. త్స. వి. ౧. పితృకర్మము. విశే. ౨. శ్రద్ధతోఁగూడినది.
శ్రావణము. త్స. వి. ఒకమాసము. వ్యు. శ్రవణనక్షత్రముతోఁ గూడిన పున్నమ దీనియందుఁ గలదు.
శ్రావణికము. త్స. వి. ,,
శ్రావ్యము. త్స. విశే. వినఁదగినది.

శ్రి

శ్రితుఁడు. త్స. విశే. ఆశ్రితుఁడు.

శ్రీ

శ్రీకంఠుఁడు. త్స. వి. శివుఁడు.
శ్రీఖండము. త్స. విశే. చందనము.
శ్రీచూర్ణము. త్స. వి. తిరుచూర్ణము.
శ్రీదుఁడు. త్స. వి. కుబేరుఁడు.
శ్రీధరుఁడు. త్స. వి. విష్ణువు.
శ్రీపతి. త్స. వి. ,,
శ్రీమంతుఁడు. త్స. విశే. సంపదకలవాఁడు.

శ్రీముఖ. త్స. వి. ఒక సంవత్సరము.
శ్రీముఖము. త్స. వి. గురువు మొదలగు పెద్దలు వ్రాసిపంపెడు పత్రిక.
శ్రీరంగము. త్స. వి. ఒక క్షేత్రము.
శ్రీరంగనీతులు = తాను ఆచరింపక పరులకు బోధించు నీతులు.
శ్రీలుఁడు. త్స. విశే. సంపన్నుఁడు.

## శ్రు

శ్రుతము. త్స. వి. ౧. వినికి. విశే. ౨. వినఁబడినది.
శ్రుతి. త్స. వి. ౧. వేదము. ౨. చెవి. 3. వినికి.

## శ్రే

శ్రేణి. త్స. వి. ౧. శిల్పసమూహము. ౨. వరుస.
శ్రేణిక. త్స. వి. వరుస.
శ్రేయము. త్స. వి. ౧. శుభము. విశే. ౨. శ్రేష్ఠమైనది. రూ. శ్రేయము.
శ్రేష్ఠి. త్స. విశే. ౧. కులశ్రేష్ఠుడైనశిల్పి. ౨. కులశ్రేష్ఠుఁడు.
శ్రేష్ఠుఁడు. త్స. విశే. మేలిమిఁబొందిన వాఁడు.

## శ్రో

శ్రోణి. త్స. వి. ౧. పిఱుఁదు. ౨. మొల.
శ్రోత. త్స. వి. వినువాఁడు.
శ్రోతవ్యము. త్స. విశే. వినఁదగినది.
శ్రోత్రము. త్స. వి. చెవి.
శ్రోత్రయము. త్స. వి. అల్పముగా పన్నిచ్చు పొలము.
శ్రోత్రియుఁడు. త్స. వి. వేదముఁ జదివిన బ్రాహ్మణుఁడు.

## శ్రౌ

శ్రౌతము. త్స. విశే. వేదమునందువిధింపఁబడినది.

## శ్ల

శ్లథము. త్స. విశే. శిథిలము.

## శ్లా

శ్లాఘ. త్స. వి. ౧. ప్రశంస. క్రి. ౨. శ్లాఘించు.
శ్లాఘ్యము. త్స. విశే. పొగడఁదగినది.

## శ్లి

శ్లిష్టము. త్స. విశే. శ్లేషతోఁగూడినది.

## శ్లీ

శ్లీలము. త్స. విశే. సంపదగలది.

## శ్లే

శ్లేష. త్స. వి. కావ్యగుణములలో నొకటి.
శ్లేష్మము. త్స. వి. తెమడ.
శ్లేష్మలుఁడు. త్స. వి. కఫరోగముగల వాఁడు.

## శ్లో

శ్లోకము. త్స. వి. ౧. కీర్తి. ౨. సంస్కృతపద్యము.

## శ్వ

శ్వపచుఁడు. త్స. వి. చండాలుఁడు.
శ్వభ్రము. త్స. వి. రంధ్రము.
శ్వవృత్తి. త్స. వి. సేవ.
శ్వశురుఁడు. త్స. వి. మామ.
శ్వశ్రువు. త్స. వి. అత్త.
శ్వశ్శ్రేయసము. త్స. వి. ౧. శుభము. ౨. మోక్షము.
శ్వసనము. త్స. వి. శ్వాసనము.
శ్వసితము. త్స. వి. ,,

## శ్వా

శ్వానము. త్స. వి. కుక్క.
శ్వాపదము. త్స. వి. పులి.
శ్వాసము. త్స. వి. ౧. వాయువు. ౨. ఊపిరి.

## శ్వి

శ్విత్రము. త్స. వి. తెల్లకుష్ఠు.

## శ్వే

శ్వేతము. త్స. వి. ౧. తెలుపు. విణ. ౨. తెల్లనిది.

# ష

షండము. త్స. వి. తామర లోనగువాని సమూహము.
షట్కము. త్స. వి. ఆఱు.
షట్పదము. త్స. వి. తుమ్మెద.
షడభిజ్ఞుఁడు. త్స. వి. బుద్ధదేవుఁడు.
షడాననుఁడు. త్స. వి. కుమారస్వామి.
షడ్జము. త్స. వి. ఒకస్వరము.
షడ్ఢకుఁడు. త్స. వి. తోడియల్లుఁడు.
షడ్భాగము. త్స. వి. ౧. కప్పము. ౨. మిడుఁగుఱు.
షష్టి. త్స. వి. అఱువది.
షష్ఠము. త్స. విణ. ఆఱవది.
షష్ఠి. త్స. విణ. ఆఱవది.

## షా

షాణ్మాతురుఁడు. త్స. వి. కుమారస్వామి.

## షో

షోడశము. త్స. వి. ౧. పదునాఱు. విణ. ౨. పదునాఱవది.

# స

సంకటపడు. త్స. క్రి. ౧. కష్టపడు. వి. ౨. సంకటపాటు.
సంకటము. త్స. వి. ౧. ఇఱుకు. విణ. ౨. ఇఱుకైనది.
సంకటి. దే. వి. వండిన రాగిపిండి లోనగునది.
సంకరము. త్స. వి. ౧. కసవుకుప్ప. ౨. సమూహము.

సంకర్షణుఁడు. త్స. వి. బలరాముఁడు.
సంకలనము. త్స. వి. కూర్చుట.
సంకలితము. త్స. విణ. కూర్పఁబడినది.
సంకల్పము. త్స. వి. ౧. తలఁపు. క్రి. ౨. సంకల్పించు.
సంకాశము. త్స. విణ. ౧. సమీపమైనది. ౨. సమానమైనది.
సంకీర్ణము. త్స. వి. ఒకటితో నొకటి కలిసినది.
సంకు. దే. వి. శంఖము.
సంకుచించు. త్స. క్రి. సంకోచమునొందు.
సంకుచితము. త్స. విణ. సంకోచము నొందినది.
సంకుమదము. త్స. వి. జవ్వాజి.
సంకులము. త్స. విణ. ఒకటితో నొకటి కలసినది.
సంకెల. దే. వి. శృంఖల.
సంకేతము. త్స. వి. ౧. ఒడఁబాటు. ౨. ఏర్పాటు.
సంకేతించు. త్స. క్రి. ౧. పేరుపెట్టు. ౨. ఏర్పాటుచేయు.
సంకోచము. త్స. వి. సంక్షేపము.
సంకోచించు. త్స. క్రి. సంకోచము నొందు.
సంక్రందనుఁడు. త్స. వి. ఇంద్రుఁడు.
సంక్రమణము. త్స. వి. సూర్యుఁడొకరాశినుండి వేఱొకరాశికి వచ్చుట.
సంక్రమించు. త్స. క్రి. ౧. చొచ్చు. వి. ౨. సంక్రమణము.
సంక్రాంతి. త్స. వి. సంక్రమణము.
సంక్షిప్తము. త్స. విణ. సంక్షేపింపఁబడినది.
సంక్షేపము. త్స. వి. ౧. సంగ్రహము. ౨. క్రి. సంక్షేపించు.
సంఖ్య. త్స. వి. ౧. విచారణము. ౨. లెక్క.
సంఖ్యాతము. త్స. విణ. లెక్కపెట్టఁబడినది.
సంఖ్యానము. త్స. వి. లెక్కపెట్టుట.
సంఖ్యావంతుఁడు. త్స. విణ. పండితుఁడు.
సంగడము. దే. వి. ౧. జెట్టిసాధనము చేయుట కుపయోగపడెడి యినుపగుండు. వై. వి. ౧. చేరిక. ౨. స్నేహము.
సంగడి. వై. వి. ౧. స్నేహము. ౨. జత. 3. వైపు.
సంగడికాఁడు. సంగడీఁడు. } దే. వి. స్నేహితుఁడు.
సంగతము. త్స. వి. ౧. స్నేహము. విణ. యుక్తియుక్తము.
సంగతి. త్స. వి. ౧. చేరిక. ౨. వృత్తాంతము.
సంగమము. సంగము. } త్స. వి. ౧. కూడిక. ౨. సంయోగము.
సంగరము. త్స. వి. ౧. ప్రతిజ్ఞ. ౨. యుద్ధము.
సంగాతకత్తె. వై. వి. స్నేహితురాలు.

సంగాతకాఁడు. వై. వి. స్నేహితుఁడు.

సంగాతము. వై. వి. స్నేహము.

సంగాతి. వై. వి. సంగాతకాఁడు.

సంగీతము. త్స. వి. గానము.

సంగోరు. త్స. వి. పండినపంటలో సగముకోరు.

సంగ్రహము. త్స. వి. ౧. సంక్షేపము. ౨. సంక్షిప్త గ్రంథము.

సంగ్రహించు. త్స. క్రి. ౧. సంక్షేపించు. ౨. చక్కఁగా గ్రహించు.

సంగ్రామము. త్స. వి. యుద్ధము.

సంఘము. త్స. వి. సమూహము.

సంఘర్షము. త్స. వి. ఒరయిక.

సంఘాతము. త్స. వి. ౧. గుంపు. ౨. గట్టిదెబ్బ.

సంఘీభవించు. త్స. క్రి. ౧. గుమికూడు. ౨. వి. సంఘము.

సంచయనము. త్స. వి. ౧. పోగుచేయుట. ౨. చచ్చిన రెండవదినమున నెముకలను పోగుచేయుట.

సంచయము. త్స. వి. ౧. కూడఁబెట్టుట. ౨. పోగు.

సంచారము. త్స. వి. ౧. తిరుగుట. క్రి. ౨. సంచరించు.

సంచారి. త్స. విశ. తిరుగువాఁడు.

సంచారిక. త్స. వి. కుంటెనకత్తె.

సంచి. త్స. వి. గుడ్డలు, నార మొదలగు వానితోఁ జేసినతిత్తి.

సంచిక. వై. వి. చేర్చి కుట్టి కట్టిన కొన్ని కాగితములుగాని తాటాకులుగాని.

సంచితము. త్స. విశ. కూడఁబెట్టఁబడినది.

సంచిమొదలు. దే. వి. మూలధనము.

సంచీ. దే. వి. సంచి.

సంచేకరము. }
సంచేకారము. } దే. వి. క్రయవిక్రయములు మున్నగువానికై ముందుగా ఇచ్చు సొమ్ము.

సంచేము. దే. వి. బంగారము.

సంచు. దే. వి. ౧. అందము. ౨. విధము. 3. జాడ.

సంజీవి. త్స. విశ. జీవమును గలుగఁజేయునది.

సంజ్ఞ. త్స. వి. ౧. సైగ. ౨. పేరు. 3. తెలివి.

సంజ్వరము. త్స. వి. కాక.

సంజె. వై. వి. ౧. సంధ్య. క్రి. ౨. సంజెపడు.

సండీనము. త్స. వి. చెట్టు మొదలగు వానిపైకెగురుట.

సంత. దే. వి. చెంత. వై. వి. ౧. వేదపాఠము. ౨. ఏర్పాటైన దినమున పెట్టెడి యంగడిపరుస.

సంతకము. దే. వి. ఒకని చేవ్రాలు.

సంతతము. త్స. విశ. ౧. ఎడతెగనిది. ౨. ఎల్లప్పుడు.

సంతతి. త్స. వి. ౧. కులము. ౨. సంతానము.
సంతన. దే. వి. చేరిక.
సంతనకట్టు. దే. క్రి. ౧. చేయు. ౨. ఆయిత్తపడు.
సంతనచేయు. దే. క్రి. పోగుచేయు.
సంతప్తము. త్స. విశే. (నిప్పులో) పుటము పెట్టఁబడిన.
సంతమసము. త్స. వి. అంతట నిండిన చీఁకటి.
సంతరించు. దే. క్రి. ౧. సరిచేయు. ౨. నేకరించు.
సంతర్పణము. త్స. వి. తృప్తిపఱచుట.
సంతసపడు. త్స. క్రి. సంతోషించు.
సంతసము. త్స. వి. ౧. సంతోషము. క్రి. ౨. సంతసించు.
సంతానము. త్స. వి. ౧. కులము. ౨. పుత్త్రపౌత్త్రపారంపర్యము. 3. సప్తసంతానములలో నొకటి. (అవి. ౧. తటాకము. ౨. నిధి. 3. అగ్రహారము. ౪. దేవాలయము. ౫. వనము. ౬. ప్రబంధము. ౭. పుత్త్రుఁడు.)
సంతాపము. త్స. వి. ౧. కాఁక. క్రి. ౨. సంతాపించు.
సంతు. వై. వి. ౧. సంతానము. ౨. కులము.
సంతోషము. త్స. వి. ౧. మోదము. క్రి. ౨. సంతోషించు.
సంతోసము. వై. వి. సంతోషము.
సంతోసిల్లు. వై. క్రి. సంతోషించు.
సందంశము. త్స. వి. పట్టుకారు.
సందడి. దే. వి. ౧. అతిశయము. ౨. జనులధ్వని.
సందడించు. దే. క్రి. ౧. అతిశయించు. ౨. సందడిచేయు.
సందడిగొను. ) దే. క్రి. సందడించు.
సందడిపడు. )
సందనము. దే. వి. సముద్రము.
సందర్భము. త్స. వి. ౧. సమయము. ౨. కావ్యముయొక్క కూర్పు.
సందర్భించు. త్స. క్రి. సమయమగు.
సందానము. త్స. వి. పలుపు.
సంది. వై. వి. సందు.
సందికడియము. దే. వి. సందిట వేసికొను కడియము.
సందిగ్ధము. త్స. విశే. ౧. సందేహాస్పదము. వి. ౨. శబ్దదోషములలో నొకటి.
సందిదండ. దే. వి. సందిటఁ గట్టుకొను భూషణము.
సందియపడు. వై. క్రి. సందేహించు.
సందియము. వై. వి. సందేహము.
సందిలి. దే. వి. దండచేయి.
సందు. వై. వి. ౧. ఎడమ. ౨. ఇఱుకు వీధి. 3. సందర్భము.
సందుకట్టు. దే. వి. మధ్యకాలము.
సందుకొను. ౧. కూడు. ౨. వ్యాపించు.
సందుగొట్టు. దే. క్రి. సందుదవులు.

సందుదోషము. దే. వి. మాససంధి యందు బిడ్డలకుఁగలుగు బాలగ్రహ దోషము.

సందె. వై. వి. సంధ్య.

సందెజాము. వై. వి. సంధ్యాకాలము.

సందేశము. త్స. వి. సమాచారము.

సందేశహారుఁడు. త్స. వి. దూత.

సందేహము. త్స. వి. ౧. సంశయము. క్రి. ౨. సందేహించు.

సందోహము. త్స. వి. సమూహము.

సంద్రము. వై. వి. సముద్రము.

సంద్రుఁడు. వై. వి. సముద్రుఁడు.

సంధ. త్స. వి. ౧. ప్రతిజ్ఞ. ౨. మేర.

సంధానము. త్స. వి. ౧. బాణమును వింటినారియందుఁ గూర్చుట. ౨. కూర్చుట.

సంధాయకుఁడు. త్స. వి. కూర్చువాఁడు.

సంధి. త్స. వి. ౧. సొరంగము. ౨. పగవారితోడి పొత్తు.

సంధించు. } త్స. క్రి. ౧. కూడు. ౨.
సంధిల్లు. } చేరు.

సంధ్య. త్స. వి. ౧. సంధి. ౨. ప్రొద్దు పొడుచుటకుముం దైదు గడియల కాలము. ౩. ప్రొద్దు గ్రుంకిన వెనుక మూఁడుగడియల కాలము.

సంపఁగి. } వై. వి. చంపకవృక్షము.
సంపఁగె. } రూ. సంపెఁగ.

సంపత్తి. త్స. వి. ౧. సమృద్ధి. ౨. సంపద.

సంపతిల్లు. దే. క్రి. సమృద్ధమగు.

సంపత్తు. త్స. వి. ఐశ్వర్యము. రూ. సంపద.

సంపన్నము. త్స. విశ. ౧. సమృద్ధమైనది. ౨. సంపదతోఁ గూడినది.

సంపర్కము. త్స. వి. ౧. చేరిక. ౨. కలయిక.

సంపాతము. త్స. వి. చక్కనిపాటు.

సంపాదకుఁడు. త్స. వి. ౧. సంపాదించువాఁడు. ౨. వార్తాపత్రికకు వృత్తాంతములఁ గూర్చువాఁడు. 3. ప్రాచీనగ్రంథరాశిని దిద్ది తప్పులు లేక ముద్రించువాఁడు.

సంపాదనము. త్స. వి. ౧. గడించుట. క్రి. ౨. సంపాదించు.

సంపాదితము. త్స. విశ. గడింపఁబడినది.

సంపాద్యము. త్స. వి. గడింపఁదగినది.

సంపుటము. త్స. వి. ౧. ముకుళించుట. ౨. బరణి.

సంపుటించు. త్స. క్రి. ౧. సంపుటముగాఁజేయు. ౨. ముకుళించు.

సంపెఁగ దే. వి. సంపఁగి.

సంపెట. వై. వి. ఇనుము సాఁగఁ గొట్టెడి సమ్మెట.

సంప్రతి. దే వి. లెక్కసరిచూచు పెద్దికరణము. (ఆడిటర్.)

సంప్రతించు. దే. క్రి. లెక్కను సరిచూచు.

సంప్రదానము. త్స. వి. చక్కని యీవి.

సంప్రదాయము. త్స. వి. ౧. గురు పారంపర్యము. ౨. వాడుక.

సంప్రహారము. త్స. వి. యుద్ధము.

సంప్రోక్షణము. త్స. వి. ౧. పరిశుద్ధి చేయుట. ౨. చిలుకరించుట. క్రి. 3. సంప్రోక్షించు.

సంబంధము. త్స. వి. ౧. కూడిక. ౨. చుట్టరికము.

సంబంధి. త్స. వి. ౧. సంబంధము చేసిన వాఁడు. విశే. ౨. సంబంధము కల వాఁడు.

సంబంధించు. త్స. క్రి. సంబంధ పడు.

సంబడము. వై. వి. ౧. జీతము. ౨. దారిబత్తెము.

సంబడించు. దే. క్రి. ౧. తెప్పిఱు. ౨. వల్లపడు.

సంబరము. వై. వి. ౧. సంతోషము. ౨. పండుగ. 3. వేగిరపాటు.

సంబళకాఁడు. దే. వి. జీతకాఁడు.

సంబళము. త్స. వి. ౧. బత్తెము. ౨. దారిబత్తెము.

సంబళి. దే. అవ్య. తొలఁగుము.

సంబళించు. త్స. క్రి. ౧. తెప్పిఱు. ౨. వల్లపడు.

సంబాధము. త్స. వి. ౧. ఇఱుకు. ౨. భగము.

సంబారము. } వై. వి. ఉప్పుచింత
సంబారు. } పండు లోనగువస్తువుల సమూహము.

సంబావు. దే. వి. సస్యవిశేషము.

సంబాళించు. దే. క్రి. ౧. నెఱవేర్చు. ౨. ఆదరించు.

సంబుద్ధి. త్స. వి. సంబోధనము.

సంబోధనము. త్స. వి. పిలుపు.

సంబ్రము. వై. వి. చూ. సంబరము.

సంభవము. త్స. వి. ౧. కూడిక. ౨. పుట్టుక.

సంభవించు. త్స. క్రి. పుట్టు. రూ. సంభవిల్లు.

సంభారము. త్స. వి. పదార్థసంచయము.

సంభావన. త్స. వి. ౧. ప్రసిద్ధి. ౨. సమ్మానము.

సంభావనీయము. త్స. వి సంభావింపఁ దగినది.

సంభావించు. త్స. క్రి. సమ్మానించు.

సంభావితము. త్స. వి. ౧. చక్కఁగాఁ దలఁపఁబడినది. ౨. సమ్మతింపఁ బడినది.

సంభావ్యము. త్స. విశే. సంభావింపఁ దగినది.

సంభాషణము. త్స. వి. చక్కఁగాఁ బలుకుట.

సంభాషించు. త్స. క్రి. చక్కఁగా మాటాడు.

సంభేదము. త్స. వి. కలయిక.
సంభోగము. త్స. వి. ౧. సురతము. ౨. మంచి సుఖము.
సంభోగించు. త్స. క్రి. చక్కఁగా సుఖించు.
సంభ్రమము. త్స. వి. ౧. ఆదరము. ౨. వేగిరపాటు.
సంభ్రమించు. త్స. క్రి. తొందరపడు.
సంమృష్టము. త్స. విశ. వస్త్రాదులచే శోధింపఁబడినది.
సంయతము. త్స. విశ. కట్టఁబడినది.
సంయమనము. త్స. వి. బంధనము.
సంయమము. త్స. వి. హింసాదులవలన విరమించుట.
సంయమి. త్స. వి. ముని.
సంయుక్తము. త్స. విశ. కూడుకొనినది.
సంయోగము. త్స. వి. కూడిక.
సంరంభము. త్స. వి. ఆటోపము.
సంరంభించు. త్స. క్రి. వేగిరపడు.
సంవత్సరము. త్స. వి. ఏఁడాది.
సంవర్తము. త్స. వి. ప్రళయము.
సంవాదము. త్స. వి. ౧. సమాచారము. ౨. మంచిచర్చ.
సంవాహకుఁడు. త్స. విశ. ఒళ్ళుపిసుకువాఁడు.
సంవాహనము. త్స. వి. ఒళ్ళుపిసుకుట.
సంవిత్తి. త్స. వి. తెలివి.
సంవిత్తు. త్స. వి. తెలివి.
సంవృతము. త్స. విశ. చుట్టుకొనఁబడినది.
సంవ్యానము. త్స. వి. ఉత్తరీయము.
సంశయము. త్స. వి. ౧. సందేహము. క్రి. ౨. సంశయించు.
సంశయాళువు. త్స. విశ. సంశయించు స్వభావము గలవాఁడు.
సంశయించు. త్స. క్రి. సందేహించు.
సంశ్లేషము. త్స. వి. ౧. ఆలింగనము. ౨. క్రి. సంశ్లేషించు.
సంసత్తి. త్స. వి. కొలువుకూటము.
సంసరణము. త్స. వి. సంసారము.
సంసరించు. త్స. క్రి. పుట్టు.
సంసర్గము. త్స. వి. ౧. చేరిక. ౨. సంబంధము.
సంసారము. త్స. వి. ౧. పుట్టుక. ౨. ఆలుబిడ్డలతో నుండుట.
సంసారి. త్స. వి. సంసారముకల గృహస్థుఁడు.
సంసృతి. త్స. వి. సంసారము.
సంసృష్టి. త్స. వి. సంసర్గము.
సంస్కరించు. త్స. క్రి. ౧. చక్కఁజేయు. ౨. (పీనుఁగును) నుండఁజేయు.
సంస్కారము. త్స. వి. ౧. చక్కఁజేయుట. ౨. (పీనుఁగును) దహింపఁజేయుట.

సంస్కృతము. త్స. వి. ౧. దేవభాష. విణ. ౨. అలంకరింపఁబడినది. 3. వ్యాకరణ శిక్షితమైనది.
సంస్క్రియ. త్స. వి. సంస్కారము.
సంస్తరము. త్స. వి. గుర్భు మొదలగు వానితో చేర్చబడిన పడక.
సంస్తవము. త్స. వి. మంచిస్తోత్రము.
సంస్థ. త్స. వి. ఉనికి.
సంస్థానము. త్స. వి. ౧. సన్నివేశము. ౨. ఒకచిన్న రాజ్యము.
సంహతి. త్స. వి. సమూహము.
సంహననము. త్స. వి. శరీరము.
సంహరణము. త్స. వి. ౧. చంపుట. క్రి. ౨. సంహరించు.
సంహర్త. ) త్స. విణ. సంహరించు
సంహారకుఁడు. ) వాఁడు.
సంహారము. త్స. వి. చంపుట.
సంహిత. త్స. వి. ౧. ఒకవేదభాగము. ౨. వర్ణసంయోగము.
సంహూతి. త్స. వి. పిలుపు.
సకలము. త్స. వి. సర్వము.
సకి. వై. వి. ౧. ఆఁడుది. ౨. చెలికత్తియ.
సకినము. వై. వి. మేలుగాని కీడుగాని సూచించు పలుకు.
సకినలమంచము. దే. వి. ౧. రవమంచము. ౨. కిఁచుకిఁచుమని మ్రోఁగుమంచము.
సకియ. వై. వి. ౧. చెలికత్తియ. ౨. స్త్రీ.
సకిలించు. దే. క్రి. గుఱ్ఱముకూయు. రూ. సగిలించు.
సకిలింత. దే. వి. గుఱ్ఱముకూఁత. రూ. సగిలింత.
సకుఁడు. వై. వి. చెలికాఁడు.
సక్తము. త్స. విణ. ఒకచోటఁదగిలినది.
సక్తువు. త్స. వి. పేలపిండి.
సఖి. త్స. వి. ౧. చెలికత్తియ. ౨. స్నేహితుఁడు.
సఖుఁడు. త్స. వి. స్నేహితుఁడు.
సఖ్యము. త్స. వి. స్నేహము.
సగము. దే. వి. అర్ధము.
సగర్భ్యుఁడు. త్స. విణ. ఒకతల్లి కడుపునఁ బుట్టినవాఁడు.
సగటు. దే. వి. సరాసరి.
సగోత్రుడు. త్స. వి. దాయాది.
సగ్గిసముగ్గిసలు. దే. వి. ఉద్ధురుడుపు.
సగ్గు. దే. క్రి. అడఁగు.
సచివుఁడు. త్స. వి. ౧. మంత్రి. ౨. స్నేహితుఁడు.
సజగ్ధి. త్స. వి. బంతికుడుపు.
సజ్జనుఁడు. త్స. వి. మంచికులమునందుఁ బుట్టినవాఁడు.
సజ్జ. దే. వి. ౧. బుట్ట. బ. ౨. ధాన్యవిశేషము.
సజ్జకము. దే. వి. మనోజ్ఞము.
సటి. త్స. వి. ౧. జూలు. ౨. సన్యాసులజడ. దే. వి. 3. కపటము.

సడలు. వై. క్రి. ౧. వదలు. ౨. జాఱు. 3. ఊడు. వి. ౧. వదులుట. ౨. జాఱుట. 3. ఊడుట.
సడలుచు. వై. క్రి. సడలఁజేయు.
సడలుపడు. వై. క్రి. సడలు.
సడి. దే. వి. ౧. జాడ. ౨. నింద. సడిసన్న=సడిఁబనిన, అనఁగా నింద దొలఁగిన=ప్రసిద్ధమైన,
సడించు. దే. క్రి. ౧. దంచు. ౨. తిట్టు.
సడుగులు. దే. వి. బ. ౧. మొలలోని కీళ్లు. ౨. వంకరమాటలు.
సడ్డ. వై. వి. ౧. లక్ష్యము. ౨. అక్కఱ.
సడ్డకుఁడు. దే. వి. తోడియల్లుఁడు.
సడ్డసేయు. వై. క్రి. లక్ష్యపెట్టు.
సణుగు. దే. వి. బాధ.
సత. దే. వి. సప్త.
సతతము. త్స. విశ. ౧. ఎడతెగనిది. క్రి. విశ. ౨. ఎల్లప్పుడు.
సతము. వై. వి. శాశ్వతము.
సతి. త్స. వి. ౧. పతివ్రత. ౨. పార్వతి.
సతీర్థ్యుఁడు. త్స విశ. సహపాఠి.
సత్కరించు. త్స. క్రి. సన్మానించు.
సత్కారము. } త్స. వి. సన్మానము.
సత్కృతి. }
సత్క్రియ. త్స. వి. సత్కారము.
సత్త. వై. వి. ౧. సత్తువ. త్స. వి. ౨. మంచితనము.
సత్తముఁడు. త్స. విశ. ౧. శ్రేష్ఠుఁడు. ౨. అందఱికంటెఁ బూజ్యుఁడు.
సత్తరువు. దే. వి. సత్రము.
సత్తి. దే. వి. శక్తి.
సత్తు. దే. వి. ౧. సీసము. వై. ౨. సత్యము.
సత్తువ. దే. వి. ౧. శరీరమునవలి బలము. ౨. సారము.
సత్పథము. త్స. వి. మంచిత్రోవ.
సత్యంకారము. త్స. వి. ౧. క్రయవిక్రయముల గట్టిమాట. ౨. సంచకారము.
సత్యము. త్స. వి. ౧. ఒట్టు. ౨. నిక్కము. విశ. 3. నిక్కమైనది.
సత్రము. త్స. వి. ౧. అన్నప్రదానాది గృహము. ౨. ఎడతెగనియాగి.
సత్త్వము. త్స. వి. ౧. ఒకగుణము. ౨. స్వభావము.
సత్త్వరము. త్స. వి ౧. త్వరితము. విశ. ౨. వడిగలది.
సదనము. త్స. వి. ౧. ఇల్లు. ౨. నీరు.
సదమదమగు. దే. క్రి. నలఁగు.
సదమదము. దే. విశ. నలఁగినది.
సదమదముసేయు. దే. క్రి. ౧. చంపు. ౨. నంచు.
సదము. } త్స. వి. ౧. సభ. ౨. రాజసభ.
సదసు. }
సదస్సు. }
సదస్యుఁడు. త్స వి. సభ్యుఁడు.

సదా. త్స. అవ్య. ఎల్లప్పుడు.
సదాతనుఁడు. త్స. విశ. శాశ్వతుఁడు.
సదావృత్తి. త్స. వి. బాటసారులకున్, సన్న్యాసులకును ఇచ్చుచుండెడి వంటసామగ్రి.
సదాశివుఁడు త్స. వి. శివుఁడు.
సదృక్షము. త్స. విశ. సమానము.
సదృశము. త్స. వి. ౧. సమానము. ౨. తగినది.
సద్దు. వై. వి. చప్పుడు.
సద్మము. త్స. వి. గృహము.
సద్యము. త్స. అవ్య. అప్పుడు.
సనాతనము. త్స. విశ. నాశములేక యుండునది.
సనాతనుఁడు. త్స. విశ. శాశ్వతుఁడు.
సనాథుఁడు. త్స. విశ. కూడుకొన్నవాఁడు. (లక్ష్మీసనాథుఁడు)
సనాభి. త్స. విశ. ౧. జ్ఞాతి. ౨ సమానుఁడు.
సను. దే. క్రి. చను.
సనెకలు. దే. వి. చూ. సన్నెకల్లు.
సన్న. వై. వి. సంజ్ఞ.
సన్నగాఁడు. దే. విశ. అల్పుఁడు.
సన్నగాలి. దే. వి. మందమారుతము.
సన్నగిల్లు. దే. క్రి. సన్నమగు.
సన్నద్ధుఁడు. త్స. విశ. ప్రయత్నపడిన వాఁడు.
సన్నన. దే. వి. సన్నదనము.
సన్నపువాఁడు. దే. విశ. అల్పుఁడు.
సన్నము. దే. విశ. సూక్ష్మము.
సన్నసన. దే. విశ. సులభము.
సన్నవాఱు. దే. క్రి. సన్నగిల్లు.
సన్నాయి. దే. వి. నాగస్వరము.
సన్నాహము. త్స. వి. ప్రయత్నము.
సన్నిధానము. త్స. వి. సమీపము.
సన్నిధి. త్స. వి. సమీపము.
సన్నిపాతము. త్స. వి. జన్ని.
సన్నిభము. త్స. విశ. సమానము.
సన్నిహితము. త్స. విశ. సమీపమున నున్నది.
సన్నుతి. త్స. వి. చక్కని స్తోత్రము.
సన్నుతించు. త్స. క్రి. చక్కఁగా స్తుతించు.
సన్నె.
సన్నెకలు. } దే. వి. నూఱుడురాయి.
సన్నెకల్లు.
సన్మానము. త్స. వి.౧. గౌరవము. క్రి. ౨. సన్మానించు.
సన్న్యసించు. త్స. క్రి. కామ్యకర్మములనుత్యజించు.
సన్న్యాసము. త్స. వి. నాలుగాశ్రమములలో నొకటి.
సపత్ని. త్స. వి. సవతి.
సపత్నుఁడు. త్స. విశ. పగవాఁడు.
సపర్య. త్స. వి. పూజ.
సపిండుఁడు. త్స. విశ. ఏడుతరముల లోనివాఁడు.
సప్తకము. త్స. విశ. ఏడవది.స. ఏడు.

సప్తజిహ్వుఁడు. త్స. వి. అగ్ని.
సప్తతంతువు. త్స. వి యజ్ఞము.
సప్తార్చి. త్స. వి. అగ్ని.
సప్తాశ్వుఁడు. త్స. వి. సూర్యుఁడు.
సప్పము. వై. వి. ౧. సర్పము. ౨. పాము.
సఫలము. త్స. విణ. ఫలముతోఁగూడినది.
సబాము. వై వి. స్వభావము.
సబ్బండు. దే. విణ. ౧. అనేక భేదములు కలది. వి. ౨. తిట్టు.
సబ్రహ్మచారి. త్స. వి. సహపాఠి.
సభ. దే. వి. ౧. గృహము. ౨. సమూహము.
సభాజనము. త్స. వి. చుట్టములు మొదలగువారిని ఆదరించి మాటలచే సంతోషపెట్టుట.
సభాసదుఁడు. } త్స. వి. సభయందుండువాఁడు.
సభాస్తారుఁడు. }
సభికుఁడు. త్స. వి. ౧. జూదరి. ౨. సభ్యుఁడు.
సభ్యుఁడు. త్స. వి. సభయందుండువాఁడు.
సమంజసము. త్స. వి. ౧. న్యాయ్యము. విణ. ౨. న్యాయముతోఁగూడినది.
సమకట్టు. దే. క్రి. ౧. చేయు. ౨. సిద్ధపఱచు.
సమకుఱు. } దే. క్రి. ౧. సిద్ధించు. ౨. లభించు.
సమకూడు. }
సమకూరు. }
సమకొను. దే. క్రి. ౧. సిద్ధించు. ౨. లభించు.
సమకోలు. దే. వి. ౧. సిద్ధించుట. ౨. లభించుట.
సమక్షము. త్స. విణ. కంటఁబడినది.
సమగ్రము. త్స. వి. సమస్తము.
సమజము. త్స. వి. పశుసమూహము.
సమత. త్స. వి. సమత్వము.
సమదర్శి. త్స. విణ. సర్వభూతములను సమముగాఁజూచువాఁడు.
సమధికము. త్స. విణ. మిక్కిలి యధికము.
సమము. త్స. విణ. ౧. సాధువు. ౨. సమానము.
సమయపడు. త్స. క్రి. సంకేతితమగు.
సమయము. త్స. వి. ౧. కాలము. ౨. శపథము.
సమయు. వై. క్రి. ౧. చచ్చు. ౨. నశించు.
సమరతి. దే. వి. సమర్త.
సమరథుఁడు. త్స. వి. ఒక విలుకానితో సమముగా నిలిచి పోరెడి రథికుఁడు.
సమరము. త్స. వి. యుద్ధము.
సమరసము. త్స. వి. అభేదము.
సమర్త. దే. వి. స్త్రీ ప్రథమఋతువు.
సమర్థము. త్స. విణ. హితమయినది.
సమర్థించు. త్స. క్రి. పట్టినది తగిన విధమున నెఱవేర్చు.

సమర్థుఁడు. త్స. వి. నేర్పరి.
సమవర్తి. త్స. వి. యముఁడు.
సమష్టి. త్స. వి. మొత్తము.
సమస్తము. త్స. విశే. అంతయు.
సమస్య. త్స. వి. కైపదము.
సమాఖ్య. త్స. వి. కీర్తి.
సమాగతము. త్స. విశే. చక్కఁగా వచ్చినది.
సమాగమము. త్స. వి. చక్కనిరాక.
సమాచారము. త్స. వి. వృత్తాంతము.
సమాజము. త్స. వి. మనుష్యాది సమూహము.
సమాధానపడు. మి. క్రి. ౧. సమ్మతిపడు. వి. ౨. సమాధానము.
సమాధి. త్స. వి. ౧. మనోలయము. ౨. నియమము.
సమానము. వై. వి. ౧. సమ్మతి. త్స. విశే. ౨. తుల్యము.
సమాపకము. త్స. విశే. ముగించునది.
సమాప్తము. త్స. విశే. ౧. ముగిసినది. ౨. చచ్చినది.
సమాప్తి. త్స. వి. ౧. ముగియిక. క్రి. ౨. సమాప్తించు.
సమావేశము. త్స. వి. ఒకచోటఁజేరుట.
సమాసకము. త్స. వి. శుద్ధాంధ్రపదముల సమాసము.
సమాసము. త్స. వి. ౧. సంక్షేపము. ౨. సమర్థములగు పదముల యేకీభావము.
సమాహారము. త్స. వి. సంక్షేపము.
సమాహితుఁడు. త్స. విశే. శాస్త్రవిహింపబడినవాఁడు.
సమితి. త్స. వి. ౧. సమూహము. ౨. సంగమము.
సమిధ. త్స. వి. ౧. వంటచెఱకు. ౨. చిగురు.
సమీకము. త్స. వి. యుద్ధము
సమీక్షణము. త్స. వి. చక్కఁగాఁ జూచుట.
సమీక్ష్యకారి. త్స. విశే. లెస్సగా యోజించి చేయువాఁడు.
సమీచీనము. త్స. విశే. ౧. పరిశుద్ధమైనది. ౨. తగినది.
సమీపము. త్స. వి. ౧. చేరువ. విశే. ౨. చేరువయైనది.
సమీపించు. త్స. క్రి. చేరువయగు.
సమీరణము. త్స. వి. గాలి.
సమీరము. త్స. వి. గాలి.
సమీరుఁడు. ,,
సముఖము. త్స. వి. ౧. ఎదురు. విశే. ౨. మాటలమారి.
సముచ్చయము త్స. వి. చెదరినవానిని ఒకటిగా ప్రోగుచేయుట.
సముచ్ఛ్రయము. త్స. వి. మిక్కిలి పొడవు.
సముజ్ఝితము. త్స. విశే. మిక్కిలి విడువఁబడినది.
సముత్థానము. త్స. వి. ప్రయత్నము.

సముదయము. త్స. వి. ౧. సమూహము. ౨. యుద్ధము. రూ. సముదాయము.

సముదాయించు. త్స. క్రి. ఓదార్చు.

సముద్గకము. త్స. వి. బరణి.

సముద్గతుఁడు. త్స. విశే. గురువుచే శిక్షింపఁబడనివాఁడు.

సముద్ధూళించు. త్స. క్రి. పూసికొను.

సముద్రము. త్స. వి. కడలి.

సముద్రీయము. త్స. విశే. సముద్రమునకు సంబంధించినది.

సమున్నద్ధుఁడు. త్స. విశే. గర్వించినవాఁడు.

సమూహము. త్స. వి. గుంపు.

సమృద్ధి. త్స. వి. మిక్కిలి సంపద

సమృద్ధుఁడు. త్స. విశే. మిక్కిలి సంపదగలవాఁడు.

సమేతము. త్స. విశే. కూడుకొనినది.

సమేలము. దే. వి. ఒద్దిక.

సమ్మతము. త్స. విశే. సమ్మతియైనది.

సమ్మతి. త్స. వి. ౧. ఇచ్ఛ. ౨. అనుజ్ఞ.

సమ్మతించు. త్స. క్రి. అంగీకరించు. రూ. సమ్మతిలు. సమ్మతిల్లు

సమ్మదము. త్స. వి. సంతోషము.

సమ్మర్దము. త్స. వి. ౧. యుద్ధము. ౨. రాయిడి.

సమ్మానము. త్స. వి. ౧. గౌరవము. క్రి. ౨. సమ్మానించు.

సమ్మానితము. త్స. విశే. గౌరవింపఁబడినది.

సమ్మార్జనము. త్స. వి. శోధనము.

సమ్మార్జని. త్స. వి. చీఁపురుకట్ట.

సమ్మితము. త్స. విశే. సమానము (ప్రభుసమ్మితము.)

సమ్మిరము.<br>సమ్మె. } వై. వి. కట్టుపాటు.

సమ్మోదము. త్స. వి. సంతోషము.

సమ్మృష్టము. త్స. విశే. శోధింపఁబడినది.

సమ్మెట. దే. వి. పెద్దసుత్తె.

సమ్రాట్టు. త్స. వి. తనయాజ్ఞచే రాజులను జయించి రాజసూయాధ్వరమును చేసిన మండలేశ్వరుఁడు.

సయ్యాట.<br>సయ్యాటము. } దే. వి. స్త్రీ పురుషుల పరిహాసము.

సయ్యాటించు. దే. క్రి. పరిహసించు.

సయ్యొద్ద. దే. వి. చేరిక.

సరంగు. దే. వి. నావికుఁడు.

సరకు. దే. వి. ౧. అమ్మఁదగిన వస్తువు. ౨. లక్ష్యము.

సరకుగొను. దే. క్రి. లక్ష్యపెట్టు.

సరకుసేయు. దే. క్రి. ,,

సరగ. వై. క్రి. విశే. శీఘ్రముగా.

సరగు. వై. వి. వేగము.

సరఘ. త్స. వి. ౧. మధుమక్షిక. ౨. తేనెటీఁగ.

సరటము. త్స. వి. తొండ.

సరణి. త్స. వి. ౧. వరుస. ౨. మార్గము.
సరదారు. వై. వి. ౧. శూరుఁడు. ౨. రౌతు.
సరదు. దే. క్రి. సమముగాఁబంచు.
సరము. త్స. వి. ౧. హారము. ౨. గమనము.
సరవడి. దే. వి. ఈడిగ.
సరవి. దే. వి. క్రమము.
సరస. దే.వి. ౧. సమీపము. విణ. ౨. రసముతోఁగూడినది.
సరసము. దే. వి. ౧. గేలి. క్రి. ౨. సరసమాడు.
సరసర. వై. క్రి. వి ణ. మిక్కిలి శీఘ్రముగ.
సరసి. త్స. వి. కొలను.
సరసిజము. } త్స. వి. కమలము.
సరసీరుహము. }
సరస్వతి. త్స. వి. వాణి. వ్యు. అంతట వ్యాపించుట కలిగినది.
సరస్సు. త్స. వి. ౧. కొలను. ౨. జలము.
సరళము. త్స. విణ. వంకరకానిది. రూ. సరాళము.
సరాగము. దే. వి. ఒద్దిక.
సరాసరి. దే. వి. రమారమి.
సరాళము. త్స. విణ. సరళము.
సరి. దే. విణ. ౧. సమము. ౨. యుక్తము. వి. 3. సరియ.
సరికట్టు. దే. క్రి. సరిదాఁటు.
సరికడచు. దే. క్రి. ౧. మీఱు. ౨. ముందునడచు.
సరిగ. వై. వి. ౧. హారము. ౨. జలతారు.
సరిగొను. దే. క్రి. చంపు.
సరిచేయు. దే. క్రి. నాశముచేయు.
సరితూఁగు. దే. క్రి. సమానమగు.
సరిత్తు. దే. వి. నది.
సరిత్పతి. త్స. వి. సముద్రుఁడు.
సరిదాఁటు. దే. క్రి. సరికట్టు.
సరిపడు. వై. క్రి. ౧. సమానమగు. ౨. యుక్తమగు. 3. అనుకూలమగు.
సరిపెట్టు. దే. క్రి. ౧. చంపు. ౨. సరిచేయు.
సరిపెణ. దే. వి. బంగారు లోనగు వాని గొలుసు.
సరిపోవు. దే. క్రి. సమాధానమగు.
సరిప్రొద్దు. దే. వి. సగము రాతిరి.
సరియగు. దే. క్రి. సహించు.
సరిహద్దు. దే. వి. పొలిమేర.
సరీసృపము. త్స. వి. పాము.
సరోజము. } త్స. వి. తామర.
సరోరుహము. }
సరోజిని. త్స. వి. తామరతూఁడు.
సర్గము. త్స. వి. ౧. నిశ్చయము. ౨. అధ్యాయము.
సర్పము. త్స. వి. పాము.
సర్వంసహ. త్స. వి. ౧. భూమి. ౨. అన్నిటిని సహించునది.

సర్వజనీనము. త్స. విశే. ౧. సమస్త జనులకు హితమైనది. ౨. సమస్త జనులకు సంబంధమైనది.
సర్వజిత్తు. త్స. వి. ఒక సంవత్సరము.
సర్వజ్ఞుఁడు. త్స. విశే. సమస్తము నెఱింగినవాఁడు.
సర్వతోముఖము. త్స. విశే. ౧. విశ్వతోముఖము. ౨. అంతటను సమము గానుండునది.
సర్వత్ర. త్స. అవ్య. అంతట.
సర్వదా. త్స. అవ్య. ఎల్లప్పుడు.
సర్వధారి. త్స. వి. ఒక సంవత్సరము.
సర్వధురీణము. త్స. విశే. అన్ని బరువులను మోసెడి ఎద్దు.
సర్వమంగళ. త్స. వి. పార్వతి.
సర్వము. త్స. వి. సమస్తము.
సర్వాంగీణము. త్స. విశే. ఎల్ల అవయవములయందును వ్యాపించినది.
సర్వార్థసిద్ధుఁడు. త్స. వి. బుద్ధదేవుఁడు.
సర్వేశ్వరుఁడు. త్స. వి. ఈశ్వరుఁడు.
సర్షపము. త్స. వి. ఆవాలు.
సలాక. దే. వి. కడ్డీ.
సలిలము. త్స. వి. జలము.
సలుగు. వై. వి. ఏదుపంది. రూ. సలువు.
సల్లాపము. త్స. వి. ౧. పరస్పర సంభాషణము. క్రి. ౨. సల్లాపించు.
సవడి. దే. వి. చూ. సవ్వడి.
సవతాలు. దే. వి. సవతి.
సవతి. వై. వి. తోడిపెండ్లాము.
సవతితల్లి. వై. వి. మాఱుతల్లి.
సవదరించు. దే. క్రి. తీర్చు.
సవనము. త్స. వి. ౧. స్నానము. ౨. యజ్ఞము.
సవము. వై. వి. ౧. సగము. త్స. ౨. యజ్ఞము.
సవయస్కుఁడు. త్స. వి. స్నేహితుఁడు.
సవర. దే. విశే. చక్కనైనది.
సవరచేయు. దే. క్రి. చక్కఁజేయు.
సవరణ. దే. వి. ౧. చక్కచేయుట. ౨. సేవ.
సవరణచేయు. } దే. క్రి. ౧. వాహనాదులనలంకరించు. ౨. చక్కచేయు.
సవరణించు. }
సవరన. దే. వి. ౧. చక్కన. ౨. చదును.
సవరము. వై. వి. చమర మృగము తోఁక.
సవరలు. దే. వి. చెంచువాండ్రు.
సవరించు. దే. క్రి. ౧. చక్కచేయు. వి. ౨. సవరింత.
సవరిల్లు. దే. వి. అందమగు.
సవి. దే. అవ్య. అని.
సవిత. త్స. వి. సూర్యుఁడు.
సవిధము. త్స. వి. ౧. సమీపము. విశే. ౨. సమీపమైనది.
సవ్యము. త్స. వి. ౧. కుడి. ౨. ఎడమ.

సవ్వడి. దే. వి. జాడ. రూ. సవడి.

సవి. దే. వి. ౧. ఆరోగ్యము. ౨. బాగు.

సస్యము. త్స. వి. పైరు.

సహకారము. త్స. వి. తియ్యమామిడి చెట్టు.

సహకారి. త్స. వి. సాహాయ్యము చేయువాఁడు.

సహగమనము. త్స. వి. భార్య భర్తతోఁగూడఁ జితిని జొచ్చుట.

సహచరి. త్స. వి. స్నేహితురాలు.

సహచరుఁడు. త్స. వి. స్నేహితుఁడు.

సహజము. త్స. వి. స్వభావము.

సహధర్మిణి. త్స. వి. అగ్నిసాక్షికముగాఁ బెండ్లాడిన పెండ్లాము.

సహనము. త్స. వి. ౧. ఓర్పు. విశే. ౨. ఓర్చునది.

సహపాఠి. త్స. వి. కూడఁజదువువాఁడు.

సహవాసము. త్స. వి. స్నేహము.

సహస్రపత్త్రము. త్స. వి. పద్మము.

సహస్రము. త్స. స. వేయి.

సహస్రాంశువు. త్స. వి. సూర్యుఁడు.

సహస్రాక్షుఁడు. త్స. వి. ఇంద్రుఁడు.

సహాధ్యాయుఁడు. త్స. వి. సహపాఠి.

సహాయుఁడు. త్స. విశే. తోడైనవాఁడు.

సహించు. త్స. క్రి. ఓర్చు.

సహితము. త్స. విశే. కూడుకొనినది.

సహిష్ణువు. త్స. విశే. ఓర్చువాఁడు.

సహృదయుఁడు. త్స. విశే. మంచి మనస్సుగలవాఁడు.

సహోదరుఁడు. త్స. విశే. తోఁబుట్టినవాఁడు.

సహ్యము. త్స. విశే. సహింపఁదగినది.

సళుపరించు. దే. క్రి. ౧. పుండులోనగునది పోటెత్తు. వి. ౨. సళుపరింత.

సళుపు. దే. క్రి. ౧. వ్రణము లోనగునది పోటెత్తు. వి. ౨. వ్రణము నగు దాని పోటు.

సళ్లు. దే. క్రి. సడలు.

---

సాంకేతికము. త్స. విశే. సంకేతము వలన నేర్పడినది.

సాంఖ్యము. త్స. వి. యోగవిశేషము.

సాంగత్యము. త్స. వి. కూడిక.

సాంత్వనము. త్స. వి. ఓదార్పుట.

సాంద్రము. త్స. విశే. దట్టమైనది.

సాంధ్యము. త్స. విశే. సంధ్యాసంబంధమైనది.

సాంప్రతము. త్స. అవ్య. యుక్తము.

సాంబ్రాణి. దే. వి. ధూపద్రవ్యవిశేషము.

సాంయాత్రికుఁడు. త్స. వి. ఓడనడపువాఁడు.

సాంవత్సరికము. త్స. వి. ౧. అబ్దికము. విశే. ౨. సంవత్సరాంతమున జరుగునది.

సాఁకు. దే. క్రి. ౧. పెంచు. ౨. కాపాడు.

సాఁగఁదీయు. దే. క్రి. వేఁడు.

సాఁగు. దే. క్రి. ౧. దీర్ఘమగు. ౨. దండాకారమగు.

సాకతము. దే. వి. ౧. అనుగ్రహము. ౨. ఊఱడింపు.

సాకిరి. వై. వి. సాక్షి.

సాకు. దే. వి. వ్యాజము.

సాక్షాత్కరించు. త్స. క్రి. ౧. ప్రత్యక్షమగు. వి. ౨. సాక్షాత్కారము.

సాక్షి. త్స. విణ. ఏదేనియొక పనిని కని కాని విని కాని తెలిసినవాఁడు.

సాక్ష్యము. త్స. వి. ౧. సాక్షి కని విని చెప్పినమాట.

సాగరము. త్స. వి. సముద్రము.

సాగవేయు. దే. క్రి. పంపు.

సాగు. దే. క్రి. ౧. పోవు. ౨. జరగు. వి. ౩. సాగుపాటు.

సాగుబడి. దే. వి. కృషి.

సాచివ్యము. త్స. వి. సచివత్వము.

సాజాత్యము. త్స. వి. సజాతత్వము.

సాజెము. వై. వి. సహజము.

సాటి. దే. విణ. సమానము.

సాతు. వై. వి. వర్తకజనసమూహము.

సాత్త్వికము. త్స. విణ. సత్త్వగుణము వలనఁగలిగినది.

సాదన. దే. వి. ౧. శరాభ్యాసము. ౨. అభ్యాసము.

సాదనము. త్స. వి. ఇల్లు.

సాదము. దే. వి. అన్నము.

సాదు. దే. వి. సాధులగు గోమహిష్యాదికము.

సాదృశ్యము. త్స. వి. పోలిక.

సాధకము. త్స. వి. సాధించునది.

సాధనము. త్స. వి. ౧. ఉపాయము. ౨. ఉపకరణము.

సాధారణ. త్స. వి. ఒకసంవత్సరము.

సాధారణము. త్స. విణ. సామాన్యము.

సాధారణ్యము. త్స. వి. సాధారణత్వము.

సాధించు. త్స. క్రి. నెఱవేర్చు.

సాధితుఁడు. త్స. వి. సాధింపఁబడినవాఁడు.

సాధిష్ఠము. త్స. వి. మిక్కిలి మంచిది.

సాధువు. త్స. విణ. మంచివాఁడు.

సాధ్యము. త్స. విణ. సాధింపఁదగినది.

సాధ్వసము. త్స. వి. భయము.

సాధ్వి. త్స వి. పతివ్రత.

సాన. దే. వి. కత్తులు మొదలగునవి నూఱురాయి.

సాని. వై. వి. ౧. వేశ్య. ౨. అధిపురాలు.

సానిక. దే. వి. మూకుడు.

సానువు. త్స. వి. ౧. కొన. ౨. కొండనెత్తము.

సాన్నిధ్యము. త్స. వి. సామీప్యము.

సాపడు. దే. క్రి. భుజించు.

సాపత్న్యము. త్స. వి. సపత్నీత్వము.
సాప్తపదీనము. త్స. వి. సఖ్యము.
సాఫల్యము. త్స. వి. సఫలత.
సామంజస్యము. త్స. వి. సమంజసత్వము.
సామంతుఁడు. త్స. వి. ఒక దేశము నకుఁ జేరిక యున్న రాజు.
సామగ్రి. త్స. వి. ౧. సమగ్రత. ౨. ఉపకరణము.
సామజము. త్స. వి. ఏనుఁగు.
సామము. త్స. వి. ౧. మంచిమాట. ౨. ఒక వేదము. 3. అనుకూల ప్రవర్తన రూపమైన యొక యుపాయము.
సామరస్యము. త్స. వి. సమరసత్వము.
సామర్థ్యము. త్స. వి. ౧. యోగ్యత. ౨. నేర్పు.
సామాజికుఁడు. త్స. వి. సభయందుండు వాఁడు.
సామాన్య. త్స. వి. ౧. సర్వసాధారణ నాయిక. (వేశ్య) ౨. సామ్యము.
సామాన్యము. విశ. సాధారణము.
సామి. వై. వి. ౧. రాజు. ౨. పెనిమిటి.
సామీప్యము. త్స. వి. సమీపత్వము.
సామీరి. త్స. వి. ౧. హనుమంతుఁడు. ౨. భీముఁడు. 3. వాయువుయొక్క సంతానము.
సాము. దే. వి. ౧. సగము. ౨. వ్యాయామము.
సాముద్రికము. త్స. వి. భాగ్యసూచక దేహలక్షణములను దెలుపు శాస్త్రము.
సామెత. దే. వి. లోకోక్తి.
సామ్యము. త్స. వి. పోలిక.
సామ్రాజ్యము. త్స. వి. సమ్రాట్టుతనము.
సామ్రాణి. త్స. వి. సాంబ్రాణి.
సాయంకాలము. త్స. వి. మునిమాపు.
సాయంతనము. త్స. విశ. సాయంకాల సంబంధమైనది.
సాయకము. త్స. వి. బాణము.
సాయము. వై. వి. ౧. సాహాయ్యము. త్స. వి. ౨. సాయంకాలము.
సాయుజ్యము. త్స. వి. సహయోగము.
సారంగము. త్స. వి. ౧. ఏనుఁగు ౨. తుమ్మెద. 3. వానకోయిల. ౪. ఇఱ్ఱి. విశ. ౫. చిత్రవర్ణము కలది.
సారణి. త్స. వి. కాలువ.
సారథి. త్స. వి. తేరుగడపువాఁడు.
సారము. త్స. వి. ౧. ధనము. ౨. చేవ. విశ. 3. శ్రేష్ఠము.
సారమేయము. త్స. వి. కుక్క.
సారసము. త్స. వి. ౧. బెగ్గురుపక్షి. ౨. తామర.
సారస్యము. త్స. వి. సరసత్వము.
సారస్వతము. త్స. విశ. వాఙ్మయము.
సారాయి. దే. వి. మద్యము.
సారి. దే. వి. తడవ.

సారించు. దే. క్రి. ౧. చాఁచు. ౨. తెఱచు.
సారూప్యము. త్స. వి. సమానరూపత్వము.
సారె. దే. వి. ౧. కుమ్మరవానిచక్రము. ౨. కూఁతురునిఅత్తగారింటికిఁ బంపునపుడు పంపెడివరుస. అవ్య. మాటిమాటికి. వై. వి. ౧. గోరువంక. ౨. పాచిక. ౩. పగడసాలకాయ.
సారెకు. దే. అవ్య. మాటిమాటికి.
సార్థకము. త్స. విణ. సఫలము.
సార్థము. త్స. వి. వర్తకజనసమూహము. విణ. అర్థముతోఁగూడినది.
సార్థవాహుఁడు. త్స. వి. ౧. వర్తకుఁడు. విణ. ౨. ముఖ్యుఁడు.
సార్వభౌముఁడు. త్స. వి. చక్రవర్తి.
సాల. వై. వి. ౧. చావడి. ౨. ఇల్లు.
సాలగ్రామము. త్స. వి. విష్ణుమూర్తిచిహ్నితశిలావిశేషము.
సాలభంజిక. త్స. వి. వస్త్ర దంతకాష్ఠాదులచేఁ జేయఁబడినబొమ్మ.
సాలము. త్స. వి. ౧. ప్రాకారము. ౨. మద్ది.
సాలీఁడు. దే. వి. ౧. సాలెపురుగు. ౨. సాలెవాఁడు.
సాలు. / సాలువు. } దే. వి. సన్నవస్త్రము.
సాలె. దే. వి. సాలెవానికులము.
సాలోక్యము. త్స. వి. సమానలోకత్వము.
సావాసము. వై. వి. పొత్తు.
సావాసి. దే. వి. సహవాసి.
సావి. దే. వి. కాలము. 'సవి' యొక్క రూపాంతరము.
సావు. దే. వి. చావు.
సాహసము. త్స. వి. ౧. దండోపాయము. ౨. తెంపు.
సాహసించు. త్స. క్రి. తెగించు.
సాహసికుఁడు. త్స. విణ. సాహసము కలవాఁడు.
సాహాయ్యము. త్స. వి. సహాయత్వము.
సాహిణము. త్స. వి. గుఱ్ఱపుశాల.
సాహిణి. త్స. వి. గుఱ్ఱపువాడు. రూ. సాహిణీ.
సాహితి. / సాహిత్యము. } త్స. వి. ౧. కూడిక. ౨. అర్థజ్ఞానము.
సాహో. దే. అవ్య. వేత్రహస్తులు చేయుహెచ్చరిక.
సాళువము. త్స. వి. డేఁగ. రూ. సాళ్వము.

## సి

సింగఁడు. దే. వి. ౧. నృసింహుఁడు. ౨. ఎఱుకువాఁడు.
సింగపుఁబీట. వై. వి. సింహాసనము.
సింగము. దే. వి. సింహము.
సింగాణి. వై. వి. విల్లు. రూ. సింగిణి.

సింగారము. వై. వి. ౧. అలంకారము. క్రి. ౨. సింగారించు.
సింగారి. దే. వి. శృంగారవతియగు ఆఁడుది.
సింగి. దే. వి. ఎఱుకుది.
సింగినాదము. వై. వి. శృంగభావనము.
సిందురము. వై. వి. ౧. సిందువార వృక్షము. ౨. సిందూరము.
సిందూరము. త్స. వి. చెందిరము.
సింధురము. త్స. వి. ఏనుఁగు.
సింధువు. త్స. వి. ౧. సముద్రము. ౨. ఏనుఁగు.
సింహద్వారము. త్స. వి. తలవాకిలి.
సింహనాదము. త్స. వి. బొబ్బ.
సింహము. త్స. వి. ౧. ఒకరాశి. ౨. సింగము. 3. (ఉత్తరపదమైనచో) శ్రేష్ఠము.
సింహావలోకనము. త్స. వి. శబ్దాలంకారవిశేషము.
సింహాసనము. త్స. వి. సింహముఖ మేర్పఱిచిన స్వర్ణమయమైన ఉన్నత పీఠము.
సిక. వై. వి. జుట్టు. రూ. సిగ.
సికత. త్స. వి. ౧. ఇసుక నేల. ౨. మొరపనేల.
సికతిలము. త్స. విశే. ఇసుకగలది.
సికా. వై. వి. ముద్ర.
సిగబంతి. దే. వి. శేఖరము.
సిగము. వై. వి. పివము.
సిగరము. వై. వి. శిఖరము.
సిగ్గరి. దే. విశే. ౧. లజ్జగలవాఁడు. ౨. లజ్జగలది.
సిగ్గరికత్తియ. దే. వి. లజ్జగలది. రూ. సిగ్గరికత్తె.
సిగ్గుఱు. దే. క్రి. సిగ్గుచెందు.
సిగ్గిఁడి. దే. విశే. ౧. సిగ్గులేనివాఁడు. ౨. సిగ్గులేనిది.
సిగ్గు. దే. వి. లజ్జ.
సిచయము. త్స. వి. వస్త్రము.
సిడము. దే. వి. ౧. ధ్వజస్తంభము. ౨. ధ్వజము.
సిత. త్స. వి. చక్కెర.
సితము. త్స. వి. ౧. తెలుపు. విశే. ౨. తెల్లనిది.
సిద్ధము. త్స. విశే. ఆయత్తమైనది.
సిద్ధాంతము. త్స. వి. స్థిరమైనపక్షము.
సిద్ధాంతి. త్స. వి. నవవిధజ్యోతిష గ్రంథములు తెలిసినవాఁడు.
సిద్ధాంతీకరించు. త్స. క్రి. సిద్ధాంతము చేయు.
సిద్ధార్థి. త్స. వి. ఒక సంవత్సరము.
సిద్ధార్థుఁడు. త్స. విశే. బుద్ధదేవుఁడు.
సిద్ధి. త్స. వి. ౧. ఈడేఱుట. క్రి. ౨. సిద్ధించు.
సిద్ధుఁడు. త్స. వి. ౧. యోగి. ౨. వ్యాసాది.
సిబ్బితి. దే. వి. ౧. సిగ్గు. విశే. ౨. సిబ్బితికాఁడు 3. సిబ్బితికత్తె.

సిరంగఁడు. వై. వి. శ్రీరంగఁడు.
సిరంగము. వై. వి. శ్రీరంగము.
సిరము. వై. వి. తల.
సిరి. వై. వి. ౧. సంపద. ౨. లక్ష్మి.
సిరిగందము. దే. వి. శ్రీగంధము.
సిరిమంతుఁడు. త్స. వి. శ్రీమంతుఁడు.
సిలుగు. దే. వి. ఉపద్రవము.
సిలువ. దే. వి. క్రీస్తునుబంధించి వధించినకొయ్య.
సివఁగి. }
సివ్వఁగి. } దే. వి. జంతువిశేషము.
సివము. దే. వి. దేవావేశము.
సిసువు. వై. వి. బిడ్డ.
సిస్తు. దే. వి. ౧. పన్ను. విశే. ౨. అందము.

సీ

సీకాయ. దే. వి. జిడ్డు వదలించు నొకకాయ.
సీత. త్స. వి. ౧. జానకి. ౨. నాఁగటిచాలు.
సీతాశోకచిలుక. దే. వి. ఒకానొక రంగుల పురుగు.
సీతు. వై. వి. ౧. చలి. ౨. చలికాలము. రూ. సీతువు.
సీదరము. }
సీద్రము. } దే. వి.౧. దారిద్ర్యము. వై. ౨ సర్పము. 3. సర్పకంచుకము.
సీమ. దే. వి.౧. రాజ్యము. త్స. వి. ౨. ఎల్ల.
సీమంతము. త్స. వి. పాపట.
సీమంతిని. త్స. వి. ఆఁడుది.
సీమాటి. దే. వి. భాగ్యశాలినియగు ఆఁడుది.
సీరపాణి. త్స. వి. బలరాముఁడు.
సీరము. త్స. వి. నాఁగలి.
సీవనము. త్స. వి. కుట్టుట
సీవిరి. దే. వి. వింజామరము.
సీసకము. దే. వి. కిరీటము.

సు

సుంకము. వై. వి. కొన్నియమ్ముడు సరకులకుఁగాను దొరతనము వారికి చెల్లించుచుండెడి పన్ను.
సుంకరి. }
సుంకరీఁడు. }
సుంకీఁడు. } దే. వి. సుంకముతీయు వాఁడు.
సుంత. దే. విశే. ఇంచుక.
సుందరి. త్స. వి. చక్కని ఆఁడుది.
సుందరుఁడు. త్స. విశే. చక్కనివాఁడు.
సుకము. వై. వి. సౌఖ్యము. రూ. సుగము.
సుకరము. త్స. విశే. సులభము.
సుకర్మము. త్స. వి. మంచిపని.
సుకవాసి. దే. విశే. కష్టపడక సుఖముగ నుండువాఁడు.
సుకుమారము. త్స. విశే. కోమలము.
సుకృతము. త్స. వి. ౧. శుభము. విశే. ౨. చక్కఁగాఁ జేయఁబడినది.

సుకృతి. త్స. విణ. భాగ్యవంతుఁడు.
సుక్కురుఁడు. వై. వి. శుక్రుఁడు.
సుఖము. త్స. వి. ౧. సౌఖ్యము. విణ. ౨. సౌఖ్యముకలది.
సుఖి. త్స. విణ. ౧. సుఖముకలవాఁడు. వి. ౧. యతి.
సుఖించు త్స. క్రి. సుఖపడు.
సుజనుఁడు. త్స. వి. ౧. మంచిమనుష్యుఁడు. ౨. ఇంద్రునిసారథి.
సుడి. దే. వి. ౧. అనిలావర్తము. ౨. జలావర్తము. 3. రోమావర్తము.
సుడిఁబడు. దే. క్రి. చూ. సుడిపడు.
సుడిగొట్టు. దే. వి. గాలి.
సుడికొను. దే. క్రి. చుట్టుకొను.
సుడియు. దే. క్రి. చుట్టిచుట్టికొట్టు.
సుడివడు. దే. క్రి. ౧. కలఁతపడు. ౨. చలించు.
సుడివాలు. దే. వి. చక్రాయుధము.
సుడివోవు. దే. క్రి. వ్యర్థమగు.
సుత. త్స. వి. ౧. కూఁతురు. దే. అవ్య. ౨. మొదలుకొని.
సుతరాము. త్స. అవ్య. బొత్తుగా.
సుతి. దే. వి. శ్రుతి.
సుతుఁడు. త్స. వి. ౧. రాజు. ౨. కొడుకు.
సుత్తె. దే. వి. సాధనవిశేషము.
సుత్రాముఁడు. త్స. వి. ఇంద్రుఁడు.
సుద. దే. వి. కొన.
సుదతి. త్స. వి. చక్కని పలువరుసగలయాఁడుది.
సుదర్శనము. త్స. వి. విష్ణుచక్రము.
సుద్దము. వై. విణ. నిర్దోషము.
సుద్ది. వై. వి. ౧. వృత్తాంతము. ౨. పరిశుద్ధి.
సుద్దిచేయు. వై. క్రి. పరిశుద్ధపఱుచు.
సుధ. త్స. వి. ౧. సున్నము. ౨. అమృతము.
సుధర్మ. త్స. వి. దేవసభ.
సుధాంశువు. త్స. వి. చంద్రుఁడు.
సుధీ. త్స. వి. పండితుఁడు.
సునాయాసము. త్స. వి. మిక్కిలి సులభము.
సునాసీరుఁడు. త్స. వి. ఇంద్రుఁడు.
సున్న. దే. వి. అనుస్వారము.
సున్నము. దే. వి. ఇండ్లకు వెల్లవేయు పదార్థము.
సున్నితము. దే. వి. కచ్చితము.
సుపథము. త్స. వి. మంచిత్రోవ.
సుపర్ణుఁడు. త్స. వి. గరుత్మంతుఁడు.
సుపర్వుఁడు. త్స. వి. ౧. దేవత. ౨. వేలుపు.
సుపాణి. దే. వి. (ముత్యమువందు) శుభ్రమైననీరు.
సుప్తి. త్స. వి. ౧. తిమ్మిరి. ౨. నిద్ర.
సుప్తుఁడు. త్స. విణ. నిద్రించినవాఁడు.
సుప్పాణి. దే. వి. సుపాణి.
సుప్రలాపము. త్స. వి. మంచిమాట.
సుబాణము. దే. వి. బ. ఒకదెనుసు ఫిరంగి.
సుబ్బు. దే. క్రి. బయలుపడు.

సుబ్రహ్మణ్యుఁడు. త్స. వి. కుమార స్వామి.
సుభగ. త్స. విశే. ౧ మనోహరురాలు. ౨. భాగ్యవంతురాలు.
సుభద్ర. త్స. వి. అర్జునుని భార్య.
సుభిక్షము. త్స. విశే. దుర్భిక్షములేనిది.
సుమంగళి. త్స. వి. ముత్తయిదువ.
సుమనస్సు. త్స. వి. ౧. పండితుఁడు. ౨. దేవత.
సుమము. త్స. వి. పుష్పము.
సుమాళము. దే. వి. సంతోషాదులవలనఁ గలిగెడుపారవశ్యము.
సుమాళి. దే. విశే. సుమాళము గలవాఁడు.
సుమాళించు. దే. క్రి. సుమాళము నొందు.
సుముఖుఁడు. త్స. విశే. అనుకూలుఁడు.
సుమేరువు. త్స. వి. మేరుపర్వతము.
సుర. దే. వి. ౧. గాలిసుడి. విశే. ౨. పెద్ద. త్స. వి. 3. కల్లు. ర. మద్యపానము చేసెడిగిన్నె.
సురంగ. } త్స. వి. సారంగము
సురంగము. }
సురఁటి. దే. వి. గుండ్రమైన విసనకఱ్ఱ. రూ. సురఁటీ.
సురగాలి. దే. వి. సుడిగాలి.
సురతము. త్స. వి. స్త్రీపురుషులకలయిక.
సురతాణి. దే. వి. ౧. ఇంద్రుఁడు. ౨. ఇంద్రాణి.
సురవీథిక. త్స. వి. ఆకాశగంగ.
సురపతి. త్స. వి. ఇంద్రుఁడు.
సురభి. త్స. వి. ౧. ఆవు. ౨. బంగారు. విశే. 3. మంచివాసనకలది.
సురభిళము. త్స. విశే. మంచివాసన కలది.
సురలోకము. త్స. వి. స్వర్గము.
సురాళించు. దే. క్రి. ౧. దిగఁదుడుచు. వి. ౨. సురాళము.
సురియ. వై. వి. చురకత్తి. రూ. సురె.
సురితాళు. దే. వి. మాలవాఁడు.
సురుఁగు. దే. క్రి. ౧. చలించు. ౨. పాఱు. 3. అదృశ్యమగు.
సురుము. దే. వి. పొడి.
సురూపుఁడు. త్స. విశే. ౧. విద్వాంసుఁడు. ౨. చక్కనివాఁడు.
సురేకారము. దే. వి. ఒకదినుసుఉప్పు.
సులభము. త్స. విశే. సుఖముగా లభించునది.
సులువు. దే. విశే. చులకన.
సులోచనము. త్స. వి. ముక్కద్దము.
సువర్ణము. త్స. వి. ౧. బంగారు. విశే. ౨. మంచివర్ణముకలది.
సువారము. దే. వి. వంట.
సువాసిని. త్స. వి. పేరంటాలు.
సుషమ. త్స. వి. మిక్కిలిశోభ.
సుషి. త్స. వి. బెజ్జము.
సుషిరము. త్స. వి. ,,

సుషుప్తి. త్స. వి. దేహము తెలియని నిద్ర.
సుహృదుడు. త్స. వి. చెలికాఁడు.
సుళువు. వై. విశ. సులభము. రూ. సులువు.

సూ

సూకరము. త్స. వి. పంది.
సూక్ష్మము. త్స. వి. ౧. కపటము. విశ. ౨. సన్నము.
సూచకుఁడు. త్స. విశ. కొండెగాఁడు.
సూచన. త్స. వి. ౧. చూపు. ౨. జాడ.
సూచి. త్స. వి. సూది.
సూచించు. త్స. క్రి. తెలియఁజేయు.
సూచిక. త్స. వి. సూది.
సూచితము. త్స. విశ. తెలుపఁబడినది.
సూచీముఖము. త్స. విశ. అభినయహస్త విశేషము.
సూటికాఁడు. దే. విశ. ౧. గుఱి కాఁడు. ౨. అందగాఁడు.
సూటిపడు. దే. వి. సరితాఁకు.
సూడిద. దే. వి. కానుక.
సూడు. దే. వి. ౧. పగవాఁడు. ౨. పగ. క్రి. ౨. సూడించు.
సూడుకొను. దే. క్రి. పగకొను.
సూడుపట్టు. దే. క్రి. విరోధించు.
సూతము. త్స. వి. ౧. జాతాశౌచము. ౨. మృతాశౌచము.
సూతిక. త్స. వి. బాలెంతరాలు.
సూతుఁడు. త్స. వి. ౧. వడ్రంగి. ౨. తేరునడుపువాఁడు.
సూత్రధారుఁడు. త్స. వి. ఆటను ఆడించువాఁడు.
సూత్రపడు. దే. క్రి. జేతపడు.
సూత్రము. త్స. వి. ౧. నూలిపోఁగు. క్రి. ౨. సూత్రించు.
సూదంటురాయి. దే. వి. అయస్కాంతము.
సూదనము. త్స. వి. చంపుట.
సూన. త్స. వి. వధస్థానము.
సూనము. త్స. వి. ౧. పుష్పము. ౨. కానుపు.
సూనరి. మి. గ్రా. విశ. ౧ చంపువాఁడు. ౨. పూలమ్మువాఁడు.
సూనుఁడు. త్స. వి. ౧. తమ్ముఁడు. ౨. కొడుకు.
సూనృతము. త్స. వి. ౧. శుభము. విశ. ౨. సత్యమైనమాట.
సూపకారుఁడు. త్స. వి. ౧. వంటవాఁడు.
సూపము. త్స. వి. వండినపప్పు.
సూయాణము. దే. వి. శత్రుభయంకరమైన దండయాత్ర.
సూరి. త్స. వి. ౧. సూర్యుఁడు. ౨. పండితుఁడు.
సూరెలు. దే. వి. బ. పార్శ్వము.
సూర్యపటము త్స. వి. మేలుకైన మెఱికి మల్లు.

సూర్యుఁడు. త్స. వి. వెలుఁగుఱేఁడు.
సూల. దే. వి. రోగవిశేషము.

సృ

సృగము. త్స. వి. భిండివాలము.
సృగాలము. త్స. వి. నక్క.
సృజన. త్స. వి. ౧. సృష్టి. క్రి. ౨ సృజించు.
సృణి. త్స. వి. అంకుశము.
సృతి. త్స. వి. త్రోవ.
సృష్టము. త్స. విశే. సృజింపఁబడినది.
సృష్టి. త్స. వి. ౧. స్వభావము. ౨. సృజించుట.

సె

సెక. దే. వి ౧. తాపము. ౨. జ్వాల
సెగ. దే. వి. ,,
సెజ్జ. వై. వి. శయ్య.
సెట్టి. దే. వి. శ్రేష్ఠి.
సెపియించు. వై. క్రి. శపించు.
సెబ్బర. దే. వి. ౧. చెనుగు. విశే. ౨. చెడ్డది.
సెమ్మె. దే. వి. దీపస్తంభము.
సెరగు. దే. వి. ఆపద.
సెల. వై. వి. ౧. బాణము. ౨. సెలయేఱు.
సెలకట్టె. వై. వి. బాణము.
సెలగ. దే. వి. ౧. దోసెడుగింజలు. ౨. చిన్నకొమ్మ.
సెలగు. దే. క్రి. ఖండించు. రూ. చెలవు, సెలవు.
సెలగొమ్మ. దే. వి. ఉపశాఖ.
సెలగోల. దే. వి. గొల్లవాఁడు పశుల మేపుకోల.
సెలరు. దే. క్రి. ౧. చిమ్ము. ౨. విజృంభించు.
సెలయూట. దే. వి. కొండయూట.
సెలయేఱు. దే. వి. నిర్ఝరము.
సెలవాఱు. దే. క్రి. సెలవేయు.
సెలవి. దే. వి. పెదవిమూల.
సెలవిచ్చు. దే. క్రి. ఆజ్ఞాపించు.
సెలవు. దే. వి. ౧. ఆజ్ఞ. ౨. వ్యయము.
సెలా. దే. వి. అంచు కమ్ములు లేని తెల్లని వస్త్రము.
సెల్లుఁడు. దే. వి. శల్యుఁడు.
సెవ. వై. వి. సెగ.

సే

సేకరము. వై. వి. ౧. సంగ్రహము. క్రి. ౨. సేకరించు.
సేగి. దే. వి ౧. నష్టము. ౨. ఆపద.
సేచనము. త్స. వి. చల్లుట.
సేతువు. త్స. వి. నీటికట్ట.
సేద. వై. వి. ౧. బడలిక. క్రి. ౨. సేదగొను.
సేద్యకాఁడు. దే. వి. కృషీవలుఁడు.
సేద్యము. దే. వి. కృషి.

సేన. దే. విణ. ౧. చాల. త్స. వి. ౨. సైన్యము.
సేనాంగము. త్స. వి. రథ గజ తురగ పదాతి చతుష్టయము.
సేనాని. త్స. వి. సేనాధిపతి.
సేనాముఖము. త్స. వి. ౧. మూఁడు రథములు, మూఁడేనుఁగులు, తొమ్మిది గుఱ్ఱములు, పదునేవురు కాల్బురును గలది. ౨. సేనముందటి భాగము.
సేపు. దే. వి. కాలము.
సేబాసు. దే. అవ్య. సెబాసు.
సేమంతిక. త్స. వి. చేమంతి.
సేమము. దే. వి. శుభము.
సేరు. దే. వి. ౧. ఇరువది నాలుగు తుల ములయెత్తు. ౨. అఱువది నాలుగు డబ్బులయెత్తు పట్టెడిమాన విశేషము. 3. ఇరువదిడబ్బుల యెత్తు.
సేల. దే. వి. వస్త్రము.
సేలు. దే. వి. సేలువ.
సేవ. త్స. వి. కొలువు.
సేవకుఁడు. త్స. వి. నౌకరు. కొలువుకాఁడు.
సేవనము. త్స. వి. ౧. కుట్టుట. ౨. కొలువు.
సేవించు. త్స. క్రి. ౧. కొలుచు. వి. ౨. సేవ.
సేవ్యము. త్స. విణ. ౧. సేవింపఁదగినది. దే. వి. ౨. దున్ని సిద్ధముచేసిన పొలము.
సేస. దే. వి. అక్షత.
సేసఁబ్రాలు. దే. వి. బ. తలఁబ్రాలు.

సై

సైంధవము. త్స. వి. గుఱ్ఱము.
సైంహికేయుఁడు. త్స. వి. రాహువు.
సైఁచు. వై. క్రి. ఓర్చుకొను. వి. సైఁపు. సైఁపుడు.
సైకతము. త్స. వి. ఇసుకదిబ్బ.
సైగ. వై. వి. హస్తాదులసంజ్ఞ.
సైతము. దే. అవ్య. కూడా.
సైదోడు. దే. వి. తోఁబుట్టువు.
సైనికుఁడు. త్స. వి. ౧. సేనాపతి. విణ. ౨. సేనతోఁ జేరినవాఁడు.
సైన్యము. త్స. వి. ౧. కృష్ణుని తేరి గుఱ్ఱములలో నొకటి. విణ. ౨. సేనతోఁ జేరినది.
సైరంధ్రి. త్స. వి. విచ్చలవిడియై యొకరి యింటనుండి శృంగారించుట లోనగుపనులు చేయునట్టియాఁడుది.
సైరణ. వై. వి. ౧. ఓర్పు. క్రి. ౨. సైరించు.
సైరికము. త్స. వి. దున్నెడిఎద్దు.
సైరిభము. త్స. వి. కాఁరెనుపోతు.

సొ

సొంటి. దే. వి. వాడఁబెట్టిన అల్లము.
సొంటు. దే. వి. ౧. తప్పు. ౨. దోషము.
సొంతము. దే. విణ. స్వకీయము.

సొంపిలు. దే. క్రి. సొంపగు. రూ. సొంపిల్లు.
సొంపు. దే. వి. ౧. సౌందర్యము. ౨. సుఖము.
సొగటాలు. దే. వి. బ. పగడసాలాట.
సొగపు. వై. వి. చొక్కు.
సొగయిక. వై. వి. ,,
సొగయు. వై. క్రి. ౧. చొక్కు. ౨. మూర్ఛిల్లు.
సొగసు. దే. వి. అందము.
సొగసుకత్తె. దే. వి. విటకత్తె.
సొగసుకాఁడు. దే. విశ. విటకాఁడు.
సొగియించు. దే. క్రి. సుఖించు.
సొగియు. దే. క్రి. ఇంపగు.
సొచ్చెము. వై. వి. ౧. పెచ్చు. ౨. అధికము.
సొటసొటపోవు. దే. క్రి. ౧. కృశించు. రూ. సొటసొటలుపోవు.
సొట్ట. దే. వి. బొట్టు.
సొడ్డు. దే. వి. పరిహాసకరమగుతిట్టు.
సొత్తు. దే. వి. సొమ్ము. (న్యూనత, కొఱఁత.)
సొద. వై. వి. ౧. మంట. ౨. పీనుఁగులను గాల్చుటకుఁ జేర్చిన కట్టెల పోవు.
సొన. దే. వి. ౧. ఊటకాలువ. ౨. గుడ్డులోనిజేవ.
సొన్నము. దే. వి. బంగారము.
సొన్నారి. దే. వి. అగసాలెవాఁడు.
సొబగు. వై. వి. సౌందర్యము.
సొబగుఁడు. వై. విశ. చక్కనివాఁడు.
సొమ్మ. దే. వి. మూర్ఛ.
సొమ్మగొను. దే. క్రి. సొమ్మసిల్లు.
సొమ్మసిలు. దే. క్రి. మూర్ఛిల్లు. రూ. సొమ్మసిల్లు.
సొమ్ము. దే. వి. ధనము.
సొరంగము. వై. వి. గుహావలెఁదొలిచిన రంధ్రము.
సొరిది. దే. వి. ౧. క్రమము. ౨. వరుస.
సొరుగు. దే. క్రి. మూర్ఛిల్లు.
సొఱ. దే. వి. తుంబి.
సొలపు. దే. వి. ౧. చొక్కు. ౨. వైముఖ్యము.
సొలయిక. దే. వి. వైముఖ్యము.
సొలయు. దే. క్రి. ౧. సొమ్మసిలు. వి. ౨. సొలయిక.
సొలిమిడి. దే. వి. మూర్ఛ.

## సో

సోఁకు. దే. క్రి. ౧. తగులు. వి. ౨. స్పర్శము.
సోఁకుడు. దే. వి. ౧. స్పర్శము. ౨. పిశాచము.
సోఁకుడయ్యము. దే. వి. వాయువు.
సోగ. దే. వి. ౧. పొడవు. విశ. ౨. దీర్ఘము.
సోడు. దే. వి. మాడపట్టు.
సోఢ. తస. విశ. ఓర్చువాఁడు.

సోదరి. త్స. వి. తోడఁబుట్టినది.

సోదరుఁడు. త్స. వి. తోడఁబుట్టినవాఁడు.

సోదించు. వై. క్రి. ౧. శోధించు. వి. ౨. సోదనచేయు.

సోదియ. వై. వి. రాఁగల మేలు కీళ్ళను గుణించి చేయు ప్రశ్నము. రూ. సోదె.

సోదెము. | వై. వి. ౧. చోద్యము. విణ.
సోద్దెము. | ౨. ఆశ్చర్యకరమైనది.

సోన. దే. వి. ౧. వాన. ౨. కొంచెము వాన.

సోపనము. త్స. వి. మెట్టు. రూ. సోపానము.

సోబనము. వై. వి. ౧. శోభనము. ౨. మంగళము.

సోమపీథి. | త్స. వి. సోమయాజి.
సోమపీతి. |

సోమరి. దే. వి. అలసుఁడు.

సోమయాజి. త్స. వి. యజ్ఞము చేసినవాఁడు.

సోమసూత్రము. త్స. వి. పానవట్టము నుండి నీళ్లుపోవుదారి.

సోమాసి. దే. వి. సోమయాజి.

సోషించు. దే. క్రి. పరిపోలు.

సోమిదమ్మ. వై. వి. సోమయాజి భార్య.

సోముఁడు. త్స. వి. ౧. శివుఁడు. ౨. చంద్రుఁడు.

సోయగము. దే. వి. అందము.

సోరణగండ్లు. దే. వి. బ. గవాక్షము.

సోరణము. దే. వి. ,, రూ. సోర్ణగండ్లు.

సోరు దే. వి. పెట్లుప్పు.

సోలు. దే. క్రి. ౧. మూర్ఛిల్లు. వి. ౨. సోలింత.

## సౌ

సౌందర్యము. త్స. వి. చక్కఁదనము.

సౌకర్యము. త్స. వి. అనాయాసము.

సౌకుమార్యము. త్స. వి. సుకుమారత్వము.

సౌఖ్యము. త్స. వి. సుఖము.

సౌగంధికము. త్స. వి. చెంగలువ.

సౌగంధ్యము. త్స. వి. వాసన.

సౌజన్యము త్స. వి. మంచితనము.

సౌదామని. త్స. వి. మెఱపు. రూ. సౌదామిని.

సౌధము. త్స. వి. నగరు.

సౌనికుఁడు. త్స. వి. సూనరి.

సౌప్తికము. త్స. వి. నిద్రించు కాల పగవారిపైఁబడి చంపుట.

సౌభాగ్యము. త్స. వి. సుభగత్వము.

సౌభ్రాత్రము. త్స. వి. మంచి తోఁబుట్టుదనము.

సౌమనస్యము. త్స. వి. సుమనోభావము.

సౌమ్య. త్స. వి. ఒక సంవత్సరము.

సౌమ్యుఁడు. త్స. విశ. తిన్ననివాఁడు.
సౌరభము. త్స. వి. ౧. వాసన. ౨. కుంకుమము.
సౌరు. దే. వి. ౧. అందము. విశ. ౨. అందమైనది.
సౌవిదల్లుఁడు. త్స. వి. అంతః పురమునఁ గావలివాఁడు.
సౌశీల్యము. త్స. వి. సుశీలత్వము.
సౌష్ఠవము. త్స. వి. సుష్ఠుభావము.
సౌహార్దము.
సౌహృదము. } త్స. వి. స్నేహము.
సౌహృద్యము.

స్క

స్కంధము. త్స. వి. ౧. చెట్టుబోదె. ౨. మూఁపు.
స్కంధావారము. త్స. వి. దండు విడిసినతావు.

స్ఖ

స్ఖలనము. త్స. వి. ౧. జాఱుట. క్రి. ౨. స్ఖలించు.
స్ఖలితము. త్స. విశ. జాఱినది.

స్థా

స్ఖాలిత్యము. త్స. వి. పొరబాటు.

స్త

స్తంబము. త్స. వి. దుబ్బు.
స్తంబేరమము. త్స. వి. ఏనుఁగు.
స్తంభనము. త్స. వి. మాన్పుడఁ జేయుట.
స్తంభము. త్స. వి. ౧. కూచము. ౨. మాన్నుపాటు.
స్తంభించు. త్స. క్రి. మాన్పడు.
స్తనంధయుఁడు. త్స. వి. పాలుద్రావు శిశువు.
స్తనము. త్స. వి. చన్ను.
స్తనితము. త్స. వి. ఉఱుము.
స్తన్యము. త్స. వి. చనుపాలు.
స్తబకము. త్స. వి. పూగుత్తి.
స్తబ్ధము. త్స. విశ. ౧. ముడిఁగినది. ౨. అడఁగినది.
స్తవము. త్స. వి. స్తోత్రము.

స్తి

స్తిమితము. త్స. విశ. ౧. కదలనిది. ౨. తడిసినది.

స్తు

స్తుతము. త్స. విశ. స్తోత్రము చేయఁబడినది.
స్తుతి. త్స. వి. ౧. స్తోత్రము. క్రి. ౨. స్తుతించు.
స్తుత్యము. త్స. విశ. స్తుతిచేయఁదగినది.

స్తూ

స్తూపము. త్స. వి. మట్టి మొదలగువాని దిబ్బ.

స్తో

స్తోకము. త్స. విశే. అల్పము.
స్తోత్రము. త్స. వి. స్తుతి.
స్తోమము. త్స. వి. ౧. సమూహము. ౨. స్తోత్రము.

స్త్రీ

స్త్రీ. త్స. వి. ఆడుది.

స్థ

స్థండిలము. త్స. వి. వ్రతమును బూనినవాఁడు పండుకొనుటకు దర్భాదులచే సంస్కరింపఁబడిన భూమి.
స్థగనము. త్స. వి. కప్పు.
స్థలము. త్స. వి. మెట్టనేల.
స్థవిరుఁడు. త్స. విశే. వృద్ధుఁడు.
స్థవిష్ఠము. త్స. విశే. మిక్కిలి స్థూలము.

స్థా

స్థాణువు. త్స. వి. ౧. శివుఁడు. విశే. ౨. స్థిరమైనది.
స్థానము. త్స. వి. ౧. విలుకాని యుద్ధమప్పటి నిలుపు. ౨. ఉనికి.
స్థానాపతి. త్స. వి. మధ్యవర్తి.
స్థానికుఁడు. త్స. వి. గుడి పారుపత్తెకాఁడు.
స్థాపనము. త్స. వి. ౧. సమాధి. ౨. స్థాపించుట.
స్థాపించు. త్స. క్రి. నిలుపు.
స్థాపితము. త్స. విశే. స్థాపింపఁబడినది.
స్థాయి. త్స. వి. ఉండునది.
స్థావరము. త్స. విశే. ౧. కదలనిది. వి. ౨. కొండ.

స్థి

స్థితము. త్స. విశే. ౧. నిలుచున్నది. ౨. ఉన్నది.
స్థిరము. త్స. విశే. నిలకడయైనది.

స్థూ

స్థూలము. త్స. విశే. ౧. బలిసినది. ౨. బుద్ధిలేనిది.

స్థై

స్థైర్యము. త్స. వి. స్థిరత్వము.

స్న

స్నపనము. త్స. వి. స్నానము.

స్నా

స్నాతకుఁడు. త్స. వి. స్నానశీలవ్రతుఁడు.
స్నాతుఁడు. త్స. విశే. స్నానముచేసినవాఁడు.
స్నానము. త్స. వి. మునుక.

స్ని

స్నిగ్ధము. త్స. విశే. నునుపుగలది.
స్నిగ్ధుఁడు. త్స. వి. స్నేహితుఁడు.

స్నే

స్నేహము. త్స. వి. ౧. చెలిమి. ౨. చమురు.

స్నేహించు. త్స. క్రి. చెలిమిసేయు.

స్నేహితుఁడు. త్స. వి. మిత్త్రుఁడు.

స్ప

స్పందము. త్స. వి. ఇంచుక కంపము.

స్పర్ధ. త్స. వి. ౧. పోలిక. ౨. పోటి.

స్పర్ధాళువు. త్స విణ. స్పర్ధగల వాఁడు.

స్పర్శనము. త్స. వి. ౧. ఈవి. ౨. వాయువు.

స్పర్శము. త్స. వి. ౧. తాఁకుడు. ౨. వ్యాధి.

స్పర్శవేధి. త్స. వి. పరుసవేది.

స్పష్టము. త్స. విణ. వెల్లడియైనది.

స్పృ

స్పృక్కు. త్స. వి. తాఁకుడు.

స్పృశించు. త్స. క్రి. తాఁకు.

స్పృహ. త్స. వి. కోరిక.

స్పృహణీయము. త్స. విణ. కోరఁదగినది.

స్ఫ

స్ఫటి. త్స. వి. పడగ.

స్ఫటికము. త్స. వి. పటికపుఱాయి.

స్ఫా

స్ఫారము. త్స. విణ. అధికమైనది.

స్ఫీ

స్ఫీతము. త్స. విణ. అధికమైనది.

స్ఫు

స్ఫుటము. త్స. విణ. ౧. వికసించినది. ౨. స్పష్టమయినది.

స్ఫురణము. త్స. వి. ౧. తోఁచుట. ౨. అదరుట.

స్ఫురించు. త్స. క్రి. ౧. తోఁచు. ౨. అదరు.

స్ఫులింగము. త్స. వి. అగ్నికణము.

స్ఫూ

స్ఫూర్తి. త్స. వి. ౧. అదరుట. ౨. తోఁచుట.

స్మ

స్మయము. త్స. వి. ౧. ఆశ్చర్యము. ౨. గర్వము.

స్మరణము. త్స. వి. ౧. తలఁపు. ౨. జ్ఞప్తి.

స్మరించు. త్స. క్రి. తలఁచు.

స్మరుఁడు. త్స. వి. మన్మథుఁడు.

స్మి

స్మితము. త్స. వి. పెదవిలోఁ గనఁబడు చిఱునవ్వు.

స్మృ

స్మృతి. త్స. వి. 1. తలఁపు. 2. బుద్ధి.

స్మే

స్మేరము. త్స. వి. 1. వికసించినది. 2. ఇంచుకనవ్వు.

స్య

స్యందనము. త్స. వి. 1. రథము. 2. కాఱుట.

స్యందము. త్స. వి. కాఱుట.

స్యదము. త్స. వి. వేగము.

స్యా

స్యాలుఁడు. త్స. వి. భార్యతోఁడఁబుట్టినవాఁడు. రూ. శ్యాలుఁడు.

స్యూ

స్యూతము. త్స. విశ. కట్టఁబడినది.

స్ర

స్రంసనము. త్స. వి. క్రిందఁబడుట.

స్రగ్గు. దే. క్రి. తగ్గు.

స్రగ్వి. త్స. విశ. పూలదండలుగలవాఁడు.

స్రజము. త్స. వి. పూలదండ.

స్రవంతి. త్స. వి. నది.

స్రవించు. త్స. క్రి. 1. కాఱు. వి. 2. స్రావము.

స్రస్తము. త్స. విశ. జాఱినది.

స్రు

స్రుక్కఁబడు. దే. క్రి. దుఃఖించు.

స్రుక్కు. దే. క్రి. 1. చుట్టుకొను. 2. వాడు. వి. 1. చిక్కు. 2. దుఃఖము.

స్రుతము. త్స. విశ. కాఱినది.

స్రుతి. త్స. వి. కాఱుట.

స్రో

స్రోతస్విని. త్స. వి. నది.

స్రోతస్సు. త్స. వి. 1. ప్రవాహము. 2. వచ్చుబడి.

స్వ

స్వకీయము. త్స. విశ. తనది.

స్వచ్ఛందము. త్స. విశ. స్వతంత్రము.

స్వచ్ఛము. త్స. వి. 1. తెలుపు. విశ. 2. తెల్లనిది.

స్వజనుఁడు. త్స. వి. దాయాది.

స్వతంత్రము. త్స. వి. 1. సొంతము. క్రి. 2. స్వతంత్రించు.

స్వనము. త్స. వి. ధ్వని.

స్వనితము. త్స. వి. ఉఱుము.

స్వప్నము. త్స. వి. కల.

స్వభాను. త్స. వి. ఒక సంవత్సరము.

స్వయంభువు. త్స. వి. 1. శివుఁడు. 2. బ్రహ్మ. 3. విష్ణువు.

స్వయంవర. త్స. వి. తనంతట మగని కోరు వాఁడుది.

స్వరము. త్స. వి. ౧. అకారాది. ౨. ఉదాత్తాది. ౩. ప్రాణము.
స్వరాట్టు. త్స. వి. బ్రహ్మము. రూ. స్వరాటు.
స్వర్గము. త్స. వి. దేవలోకము.
స్వర్ణకారుఁడు. త్స. వి. అగసాలెవాఁడు.
స్వర్ణది. త్స. వి. ఆకాశగంగ.
స్వర్భానువు. త్స. వి. రాహువు.
స్వల్పము. త్స. విణ. మిక్కిలి అల్పమైనది.
స్వస్తి. త్స. అవ్య. శుభము.
స్వస్థము. త్స. విణ. నెమ్మదిగానుండునది.

స్వా

స్వాంతము. త్స. వి. ౧. మనస్సు. ౨. గుహ.
స్వాగతము. త్స. వి. కుశలప్రశ్నము.
స్వాతంత్ర్యము. త్స. వి. స్వతంత్రభావము.
స్వాతి. త్స. వి. ఒకనక్షత్రము.
స్వాదము. త్స. వి. రుచి.
స్వాదువు. త్స. విణ. తియ్యనిది.
స్వాద్వీ. త్స. వి. ద్రాక్ష.
స్వాధీనపతిక. త్స. వి. స్వాధీనుఁడగు భర్త కల నాయిక.
స్వాధీనుఁడు. త్స. వి. తనకు లోకువైనవాఁడు.
స్వాధ్యాయము. త్స. వి. ౧. జపము. ౨. వేదము.
స్వానము. త్స. వి. ధ్వని.
స్వాపము. త్స. వి. నిద్ర.
స్వామి. త్స. వి. ౧. యజమానుఁడు. విణ. ౨. అధికారి.
స్వామిని. త్స. వి. ఒడయురాలు.
స్వారాజ్యము. త్స. వి. స్వర్గలోకప్రభుత్వము.
స్వారాట్టు. త్స. వి. ఇంద్రుఁడు.
స్వారి. దే. వి. ౧. వాహ్యాళి. ౨. విహారము.
స్వాస్థ్యము. త్స. వి. స్వస్థత.
స్వాహా. త్స. వి. అగ్నిభార్య.

స్వి

స్విన్నము. త్స. విణ. చెమరినది.

స్వీ

స్వీకరించు. త్స. క్రి. ౧. అంగీకరించు. వి. ౨. స్వీకారము.
స్వీకర్త. త్స. వి. స్వీకరించువాఁడు.
స్వీయ. త్స. వి. పతియందుమాత్రము అనురాగముకల నాయిక.

స్వే

స్వేదని. త్స. వి. ౧. పెనము. ౨. కందువు.
స్వేదము. త్స. వి. చెమట.

## స్వై

స్వైరి. త్స. వి. స్వతంత్రుఁడు.

స్వైరిణి. త్స. వి. ఱంకుటాలు.

స్వైరుఁడు. త్స. వి. స్వతంత్రుఁడు.

## హ

హంకారము. త్స. వి. ౧. అహంకారము. ౨. అభిమానము. క్రి. 3. హంకరించు.

హండ. త్స. వి. వెడల్పునోరుగల పెద్ద లోహపాత్రము. (గంగాళము వగైరాలు.) రూ. హండి.

హంత. త్స. విణ. హింసించువాఁడు.

హంవీరుఁడు. త్స. విణ. శూరుఁడు.

హంస. త్స. వి. ౧. పరమాత్మ. ౨. తెల్లగుఱ్ఱము. 3. అంచ. ౪. యోగివిశేషము. విణ. ౫. శ్రేష్ఠుఁడు.

హంసకము. త్స. వి. కాలియందె.

హంసవాహనుఁడు. త్స. వి. బ్రహ్మ.

హంసి. త్స. వి. ఆఁడుహంస. రూ. హంసిక.

హంసుఁడు. త్స. వి. ౧. సూర్యుఁడు. ౨. జీవుఁడు.

హజారము. దే. వి. ఆస్థానమందిరము.

హజూరు. దే. వి. ఆస్థానము.

హజ్జ. దే. వి. పాదము.

హట్టము. త్స. వి. అంగడివీధి.

హఠము. త్స. వి. ౧. బలాత్కారము. ౨. పట్టు.

హఠవాది. త్స. విణ. పట్టుసాధించువాఁడు

హడపము. దే. వి. అడపము.

హతి. త్స. వి. దెబ్బ.

హతుఁడు. త్స. విణ. మనస్సుచెడినవాఁడు. ౨. దెబ్బతినినవాఁడు.

హత్తు. దే. క్రి. కలుగు.

హత్య. త్స. వి. చంపుట.

హదను. దే. వి. ౧. సమయము. ౨. అదను.

హననము. త్స. వి. చంపుట.

హనుమ. దే. వి. హనుమంతుఁడు.

హనుమంతుఁడు. త్స. వి. ఆంజనేయుఁడు.

హనుమఁడు. దే. వి. ,,

హనుమానుఁడు. త్స. వి. ,,

హనువు. త్స. వి. చెక్కిలి మీఁది భాగము.

హయము. త్స. వి. గుఱ్ఱము.

హరణము. త్స. వి. ౧. హరించుట. ౨. భాగహారము.

హరి. త్స. వి. ౧. విష్ణువు. ౨. కప్ప. 3. కోతి. విణ. ౪. పచ్చనిది.

హరించు. త్స. క్రి. ౧. అడఁగు. ౨. నశించు.

హరిచందనము. త్స. వి. ౧. చెందిరము. ౨. ఒక కల్పవృక్షము.

హరిణము. త్స. వి. ౧. జింక. ౨. తెలుపు.

హారిణి. త్స. వి. ౧. ఆఁడుజింక. విణ. ౨. ఆకుపచ్చ వర్ణముకలది.
హారితము. త్స. వి. ౧. ఆకుపచ్చవర్ణము. విణ. ౨. ఆకుపచ్చనిది.
హారిత్తు. త్స. వి. ౧. దిక్కు. ౨. విణ. ఆకుపచ్చనిది.
హారిదళము. వై. వి. అరిదళము.
హారిదశ్వుఁడు. త్స. వి. సూర్యుఁడు.
హారిద్ర. త్స. వి. పసుపు.
హారిన్మణి. త్స. వి. మరకతము.
హారిప్రియ. త్స. వి. లక్ష్మి.
హారిబువ్వము. దే. వి. పెండ్లినాలవ నాటి బువ్వపుబంతి.
హారివాణము. దే. వి. ౧. తట్ట. ౨. సంధ్యవార్చుకొను పళ్లెము.
హారివాసరము. త్స. వి. ఏకాదశి.
హారిహయుఁడు. త్స. వి. ఇందుడ్రుఁడు.
హారుఁడు. త్స. వి. శివుఁడు.
హారువు. దే. వి. ౧. అందము. విణ. ౨. నాణెము.
హారుసము. వై. వి. ౧. హర్షము. క్రి. ౨. హారుసించు.
హార్త. త్స. విణ. హరించువాఁడు.
హార్మ్యము. త్స. వి. మిద్దెటిల్లు.
హార్యక్షము. త్స. వి. సింహము.
హార్షము. త్స. వి. ౧. సంతోషము. క్రి. ౨. హార్షించు.
హాలము. త్స. వి. నాఁగలి.
హాలహాలము. త్స. వి. హాలాహాలమను విషము.
హాలాహాలము. త్స. వి. హాలాహాలమను విషము.
హాలికుఁడు. త్స. వి. మద్యకదున్ను వాఁడు. రూ. హాలికుఁడు.
హాల్లకము. త్స. వి. చెంగలువ.
హాల్లకల్లోలము. దే. విణ. అల్లకల్లోలము.
హాల్లీసకము. త్స. వి. పెక్కండ్రుం స్త్రీలు మండలాకారముచేరి చేయు నృత్యము.
హావణించు. దే. క్రి. ౧. అలంకరించు. వి. ౨. హావణింపు.
హావణిల్లు. దే. క్రి. ౧. విజృంభించు. ౨. మెఱయు.
హావణు. దే. వి. ఒప్పిదము.
హావనము. త్స. వి. హోమము.
హావనీయము. త్స. వి. హోమముచేయఁ దగినది.
హావిష్యము. త్స. వి. హావిస్సు.
హావిస్సు. త్స. వి. హోమద్రవ్యము
హావ్యము. త్స. వి. దేవతల కీఁదగిన అన్నము.
హావ్యవహుఁడు. / హావ్యవాహనుఁడు. } త్స. వి. అగ్ని హోత్రుఁడు.
హాసంతి త్స. వి. కుంపటి.
హాసనము. త్స. వి. ౧. హాస్యము. క్రి. ౨. హాసించు.

హాసని. త్స. వి. కుంపటి.
హాసించు. త. క్రి. నవ్వు.
హాసితము. త్స. వి. నవ్వు.
హాస్త. త్స. వి. ఒక నక్షత్రము.
హాస్తము. త్స. వి. ౧. చేయి. ౨ తొండము. 3. మూర. ౪. అత్తము
హాస్తి. త్స. వి. ఏనుగు.
హాస్తిని. త్స. వి. ఆడేనుగు.
హాస్తిపకుఁడు. త్స. వి. మావటివాఁడు.
హాళహాళి. త్స. వి. త్వర.
హాళాహాళి. దే. వి. కలకలధ్వని.

హా

హాజారము. దే. వి. హాజారము.
హాటకగర్భుఁడు. త్స. వి. హిరణ్యగర్భుఁడు.
హాటకము. త్స. వి. బంగారు.
హాని. త్స. వి. కీడు.
హామిక. దే. వి. ఆమిక.
హాయనము. త్స. వి. సంవత్సరము.
హాయి. దే. వి. సుఖము.
హారతి. దే. వి. ఆరతి.
హారము. త్స వి. ౧. దండ. ౨. యుద్ధము.
హారి. త్స. విశ. మనోజ్ఞమైనది.
హారిద్రము. త్స. విశ. పసుపు వర్ణము గలది.
హార్దము. త్స. వి. స్నేహము.
హాల. త్స. వి. సారాయి.
హాలహాలము. త్స. వి. విషభేదము. రూ. హాలాహాలము.
హాలికుఁడు. త్స. వి. చూ. హాలికుఁడు.
హావడి. దే. వి. ఉపద్రవము. రూ. హావళి.
హావము. త్స. వి. భ్రూనేత్రాది వికారములచేతఁ దెలియఁదగిన మనోవికారము.
హావళి. దే. వి. హావడి.
హాసము. త్స. వి. ౧. హాస్యము. క్రి. ౨. హాసించు.
హాస్యము. త్స. వి. ౧. నవ్వు. ౨. ఒకరసము.
హాహాఁడు. త్స. వి. ఒకానొక దేవగాయకుఁడు.
హాళి. త్స. వి. ఆసక్తి.

హి

హింగువు. త. వి. ఇంగువ.
హింస. త్స. వి. ౧. బాధించుట. ౨. చంపుట.
హింసకుఁడు. త్స. విశ. హింసించువాఁడు.
హింసనము. త్స. వి. హింసించుట.
హింసించు. త్స. క్రి. ౧. బాధించు. ౨. చంపు.
హితము. త్స. విశ. వెనుకటికి మేలు చేయునది.
హితవరి. త్స. విశ. హితుఁడు.
హితవు. త్స. వి. ఇతవు.
హితుఁడు. త్స. విశ. హితవు చెప్పినవాఁడు.

హిమము. త్స. వి. ౧. మంచు. ౨. చందనము. విశ. 3. చల్లనిది.
హిమకరుఁడు. త్స. విశ. చంద్రుఁడు.
హిమవంతము. త్స. వి. మంచుకొండ.
హిమవాలుక. త్స. వి. కర్పూరము.
హిమాంబువు. త్స. వి. పన్నీరు.
హిమాంశువు. త్స. వి. చంద్రుఁడు.
హిమాచలము. త్స.వి. హిమవంతుఁడు.
హిమాని. త్స. వి. దిట్టమైనమంచు.
హిరణ్యగర్భుఁడు. త్స. వి. బ్రహ్మ.
హిరణ్యము. త్స. వి. ౧. బంగారు. ౨. ధనము.

## హీ

హీనము. త్స. విశ. ౧. దూఱఁదగినది. ౨. తక్కువైనది.
హీరము. త్స. వి. వజ్రమణి.

## హు

హుంకరించు. త్స. క్రి. ౧. హుమ్మని ధ్వనించు. వి. ౨. హుంకారము.
హుంకృతి. త్స. వి. హుంకారము.
హుటాహుటి. దే. వి. ౧. గమనవేగము. విశ. ౨. వేగము.
హుతవహుఁడు. త్స. వి. అగ్ని.
హుతాశనుఁడు. త్స. వి. అగ్ని.
హుమా. దే. వి. గుఱ్ఱము. రూ. హుమాయి.
హురుమంజి. దే. వి. దేశవిశేషము.
హుళికి. దే.వి.అభావము. రూ. హుళిక్కి.

## హూ

హూణము. త్స. వి. దేశవిశేషము.
హూతము. త్స. విశ. పిలువఁబడినది.
హూతి. త్స. వి. పిలుపు.
హూహువు. త్స. వి. ఒకానొక దేవగాయకుఁడు.

## హృ

హృతము. త్స. విశ. హరింపఁబడినది.
హృతి. త్స. వి. హరించుట.
హృదయంగమము. త్స. విశ. మనస్సునకింపైనది. (పలుకు.)
హృదయము. త్స. వి. మనస్సు.
హృదయాళువు. త్స. వి. మంచిమనస్సు గలవాఁడు.
హృది. త్స. వి. ౧. చిత్తము. ౨. ఱొమ్ము. 3. గుండెకాయ.
హృద్యము.త్స. విశ. మనస్సునకింపైనది.
హృషీకము. త్స. వి. ఇంద్రియము.
హృషీకేశుఁడు. త్స. వి. విష్ణువు.
హృష్టి. త్స. వి. సంతోషము.
హృష్టుఁడు. త్స. వి. సంతోషించినవాఁడు.

## హె

హెగ్గడి. వై. వి. ౧. అంతఃపుర కావలికత్తె. ౨. అంతఃపుర కావలికాఁడు.

హెగ్గడికత్తె. వై. వి. అంతఃపురకావలి కత్తె.
హెగ్గడికాఁడు. } వై. వి. అంతఃపురకావలికాఁడు.
హెగ్గడీఁడు.
హెచ్చరించు. దే. క్రి. ౧. సూచించు వి. ౨. హెచ్చరిక.
హెచ్చరికించు దే. క్రి. హెచ్చరించు.
హెచ్చిల్లు. దే. క్రి. వర్ధిల్లు. రూ. హెచ్చిల్లు.
హెచ్చు. దే. వి. ఎచ్చు.

## హే

హేజీబు. దే. వి. మంత్రి.
హేతి. త్స. వి. ౧. ఆయుధము. ౨. సూర్యకిరణము.
హేతువు. త్స. వి. కారణము.
హేమంతము. త్స. వి. మంచుకాలము.
హేమము. త్స. వి. బంగారు.
హేమాద్రి. త్స. వి. మేరుపర్వతము.
హేమాహేమీలు. దే. వి. అధికులు.
హేయము. త్స. విశే. విడువఁదగినది.
హేరంబుఁడు. త్స. వి. వినాయకుఁడు.
హేరాళము. త్స. వి. అధికము.
హేల. త్స. వి. ఒకానొక శృంగారచేష్ట.
హేవళంబి. త్స. వి. ఒక సంవత్సరము.
హేవాకము. త్స. వి. ప్రౌఢి.
హేష. త్స. వి. ౧. గుఱ్ఱపుసకిలింత. క్రి. ౨. హేషించు.
హేషితము. త్స. వి. సకిలింపు.
హేళనము. త్స. వి. ౧. పరిహాసము. ౨. తిరస్కారము.
హేళి. త్స. వి. ఆలింగనము.

## హై

హైన్యము. త్స. వి. హీనత.
హైమనము. త్స. విశే. ౧. మంచుచేఁ గలిగినది. ౨. బంగారముచేఁ గలిగినది.
హైమవతి. త్స. వి. పార్వతి.
హైయంగవీనము. త్స. వి. ఆవువెన్న కాఁచిన నేయి.

## హొ

హొంత. దే. వి. పరిశ్రమము.
హొంతకాఁడు. దే. వి. జెట్టివాఁడు.
హొంతకారి. దే. వి. ,,
హొన్ను. దే. వి. బంగారు.
హొయలు. దే. వి. విలాసము.
హొంగు. దే. వి. ,,

## హో

హోత. త్స. విశే. హోమముసేయు వాఁడు.
హోమము. త్స. వి. దేవయజ్ఞము.
హోర. త్స. వి. అహోరాత్రము.
హోరాటు. దే. వి. ఆటోపము.
హోరాహోరి. దే. క్రి. విశే. అవిరామము.
హోళి. దే. వి. కాముని పండుగ.

హా

హాదా. దే.వి. ఏనుఁగుమీఁది అంబారి.
హాలా. దే.వి.౧.అధీనము ౨. సొగసు.
హాసు. దే. వి. ౧. ఒయ్యారము. ౨. సొగసు. విశ. 3. సొగసుకాఁడు.
హాసుకాఁడు. దే. విశ. ౧. సొగసుకాఁడు. ౨. యోగ్యుఁడు.

హ్రా

హ్రదము. త్స. వి. లోతుగల నీటి మడుగు.
హ్రసిష్ఠము. త్స. విశ. మిక్కిలి పొడుగైనది.
హ్రస్వాంగము. త్స. వి. ఒక గంధద్రవ్యము.
హ్రస్వము. త్స. విశ. ౧. పొట్టి. ౨. కుఱుచ.

హ్రా

హ్రాదిని. త్స. వి. నది.

హ్రి

హ్రిణియము. త్స. వి. సిగ్గు. ౨. రోత. 3. అసహ్యము.

హ్రీ

హ్రీ. త్స. వి. సిగ్గు.
హ్రీణము. త్స. విశ. సిగ్గునొందినది.
హ్రీతము. త్స. విశ. ,,
హ్రీబేరము. త్స. విశ. కురువేరు.

హ్రే

హ్రేష. త్స. వి. హేష.

హ్లా

హ్లాదనము. త్స. వి. సంతోషము.
హ్లాదము. త్స. వి. సంతోషము.
హ్లాదుఁడు. త్స. వి. ౧. సంతోషము కలవాఁడు. ౨. ప్రహ్లాదుఁడు.





ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల, గాంధీనగరం, విజయవాడ—1950



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA125B131 |
| పుస్తకం పేరు | శబ్దకౌముది |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 583 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | B |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ruksana |
| పేజీలు విడదీసినది | Ruksana |
| స్కాన్ చేసినది | [illegible signature] |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | [illegible] |